శ్రీ

# ఆంధ్రవాచస్పత్యము

అను నీయకారాది

ఆంధ్ర ప్రతిపదార్థ పర్యాయపద నిఘంటువు

## శ్రీ శ్యామలకామశాస్త్రీయము.


ఆంధ్రవిద్యావాచస్పతి

కొట్ర శ్యామలకామశాస్త్రిచే

వ్రాయఁబడినది.


అకారాది ఔకారాంతమువఱకుఁగల

మొదటి సంపుటము.


కొట్ర శ్యామలకామశాస్త్రి అండ్ సన్స్,

వారిచే ప్రకటితము.

కరప, కాకినాడ.

శ్రీ లక్ష్మీ ముద్రాక్షరశాల, జగన్నాథపురం, కాకినాడ.

1938.



# మాతృపాదప్రసూనము.









సీ॥ ఆగమోత్తంసంబులైనను "మాతృదే
వోభవ" యనిదేని బోధసేయు
నన్ని జన్మంబుల నార్తియైనను దేనిఁ
గొనముట్టఁగా దీర్చుకొనఁగ లేము
పరిభవంబునకును గారణమయి పెంచి వి
రించి విష్ణుకలల మించునేది
కడలేని ప్రేముడి కడలి క్రొత్తరఁగలఁ
దేలించుచుండు యదీయ హృదయ

గీ॥ మట్టి మాతృస్వరూప పవిత్రత దైవ
పాద పీఠిక నిశ్చలత్వాది కలిత
హృదయమున నీనిఘంటు వర్పించి ధన్యుఁ
డగుదుఁ దగు దుర్లభానంద మధిగమించి.



ఇట్లు,
ముద్దుబిడ్డఁడు,
కొట్ర శ్యామల కామశాస్త్రి,
నిఘంటుకర్త.

శ్రీ ఆంధ్రవాచస్పత్యము.



కృతిభర్త్రి: కొట్ర సుబ్బమ్మగారు.
(భర్త: జగన్నాథశాస్త్రిగారు.)



కృతికర్త:
కొట్ర శ్యామలకామశాస్త్రి.



కృతికర్త పుత్రుఁడు:
కొట్ర మాణిక్యసుబ్రహ్మణ్య శాస్త్రి.

శ్రీ

# ఆంధ్ర వాచస్పత్యము

శ్రీ పితృభ్యోనమః



లక్ష్మీనారాయణీయమునకు కర్తలును
ఆంధ్రవాచస్పత్యకర్తకు తండ్రిగారును అగు
శ్రీ॥ శ్రీ॥ కొట్ర లక్ష్మీనారాయణ శాస్త్రిగారు.



లక్ష్మీనారాయణీయమునకు లేఖకులును,
ఆంధ్రవాచస్పత్యకర్తయును నగు
బ్ర॥ కొట్ర శ్యామలకామశాస్త్రి గారు.

☞ లక్ష్మీనారాయణీయము అచ్చు అగుచున్నతఱి 1906 సం॥రములో తీయఁబడిన ఛాయాపటము

శ్రీ

# ఆంధ్ర వాచస్పత్యము

## మహారాజపోషకులు.



శ్రీ మహారాజరాజశ్రీ శ్రీసాహిత్య సామ్రాట్ డాక్టర్ ఆఫ్ లెటర్సు
జయపురాధీశ్వరులు శ్రీ మహారాజా
శ్రీ శ్రీ శ్రీ విక్రమదేవవర్మ బహద్దరువారు జయపురము.

శ్రీ

# ఆంధ్ర వాచస్పత్యము.

## మహారాజపోషకులు



"వైద్యరాజ"
**ద్విభాష్యం వేంకటేశ్వర్లుగారు.**

కుమారులు
"వైద్యవిద్వాన్, ఆయుర్వేదభూషణ"
**ద్విభాష్యం వేంకట సూర్యనారాయణమూర్తిగారు.**

---

శ్రీ వేంకటేశ్వర ఆయుర్వేదనిలయము,

చింతలూరు, ఆలమూరుపోస్టు, తూ గో జిల్లా.

# FOREWORD.

There has been no comprehensive dictionary in the Telugu Language upto this time. The Government has not undertaken this responsibility, though it is getting a Tamil lexicon published; nor has any Literary Society shouldered the burden. The Surya Raya Andhra Nighantu has no doubt been under contemplation and preparation for over two decades, but so far even its first volume has not come out. It is therefore encouraging to find Sjt. Kotra Syamala Kamasastry garu publishing a much needed and long over-due exhaustive Telugu dictionary.

The author has already had previous experience in Telugu lexicography, having been the collaborator of his father's work, Lakshminarayaniyam. The present work is a much more comprehensive one with greater scope. It not only includes a much larger number of words than any purely Telugu or Sanskrit-Telugu dictionary now in existence, but also has got certain special features of its own. It is a dictionary of synonyms and antonyms. The author has also included technical and scientific words found in Telugu books for which there has so far been no provision made in any Telugu dictionary, though attempts at times have been made for the publication of a Telugu Scientific Glossary, as such. The present dictionary will be of great use also to all authors and writers in Telugu. Scientific phraseology in Telugu is still in a nebulous state and it is therefore necessary that there should be at least one such dictionary including all the scientific words so for used in Telugu Literature, which are none too many.

The author has given the various shades of meanings for each word both in Sanskrit and Telugu separately and has also quoted authorities from standard Telugu Literature wherever necessary. Further, the author has incorporated also several alien words which are in current use in Telugu [illegible] and journalism, though not as yet adopted in

orthodox literature. Most of such words, it will be found, are from Hindustani and are generally common to all Indo-Aryan languages. Hundreds and thousands of these words have long been current coin in Telugu also, and for historical reasons have come to stay, how-ever much certain orthodox scholars may try to avoid them. We cannot ignore the hard fact that about 80 lacs of our Telugu brothers are resident in the Nizam's dominions, and about 70% of their Telugu vocabulary is really Hindustani. The use of Hindustani words in the South Indian vernaculars is bound to increase owing to the gradual spread of Hindi as our National Language. The author has introduced several other innovations like illustrative diagrams for convenience of reference and thus tried to make the dictionary as exhaustive and as useful as it is possible for any individual to make.

It is also a matter of great satisfaction that he is trying to be within easy reach of the ordinary man's purse. Considering the quantity of the work, labour, skill and trouble involved in the compilation of such a huge work, the price fixed is certainly very moderate.

The author deserves our congratulations and every encouragement for his courage and pains in undertaking such a monumental work.

Cocanada,<br>20th Sept, 1934.

**Komanduri Satakopachary,**<br>M. A., B. L.,

శ్రీ

# ఆంధ్రవాచస్పత్యము.

## పండితాభిప్రాయములు.

మహారాజశ్రీ రావుసాహెబ్ గిడుగు వేంకటరామమూర్తి పంతులుగారు
పర్లాకిమిడి. ప్రస్తుతము రాజమహేంద్రవరము.

(ఆంధ్రవాచస్పత్యమునకు నెం 1 రు చందాదార్లు).

బ్ర. శ్రీ. ఆంధ్రవిద్యావాచస్పతి కొట్ర శ్యామల కామశాస్త్రిలవారి సన్నిధికి.

నే. గిడుగు వేంకట రామమూర్తి అనేక నమస్కారములు చేసి చేయుంగల విన్నపములు:—

మహాశయా, మీరు రచించి ప్రకటిస్తూఉన్న ఆంధ్రవాచస్పత్యమును గురించి నా అభిప్రాయము తెలియజేయవలసినదని నన్ను కోరినారు. అయితే, అక్కడక్కడ గ్రంథము కొంచెము పైపైనచూచి చెప్పేవారి అభిప్రాయమునకు ఏమి విలువ ఉంటుందని నేను గ్రంథమంతా చూడలేక, ఊరుకొన్నాను. గాని మీఆజ్ఞ దాట శక్యముకాకుండా ఉన్నందున, నేను చూచినవిషయములు ఆధారముగా నా ఆశయము మనవిచేయుటకు సాహసించినాను.

మీవాచస్పత్యములో పొరపాటులుకొన్ని ఉన్నా, ఇప్పుడున్న నిఘంటువులలో ఉత్తమమయినదని చెప్పడానికి జంకను. శబ్దరత్నాకరములో, తప్పులు లోపాలు వేలున్నవి. అట్లే శ్రీ సూర్యారాయాంధ్ర నిఘంటువులోనున్నా— మీ పుస్తకము అబాలగోపాలము అందరికీ ఉపచరిస్తుంది. సూర్య. నిఘంటువు సంస్కృతము చదువుకొనే వారికోసము రచించినదట; పండితుల సందేహాలు తీర్చగలదట. అయినా దానిలో లేనిమాటలు అనేకము వాచస్పత్యములో ఉన్నవి; తైపారువేసి, చూచి, మరీచెప్పుతున్నాను.

అదేమోకాని, సూర్యా. లో ఇంగ్లీషు మొదలయిన అన్యదేశభాషలలోని మాటలు—తెలుగువారి వాడుకలో ఉన్నవే—చేరలేదు "ఇంగ్లీషు" అనే మాటయినాలేదు. "ఆంగ్లము" అనేదీలేదు. శబ్దరత్నాకరములో "ఎకరము" "ఇన్ స్పెక్టరు" మొ॥వి వందలున్నవి. వాచస్పత్యములో అన్యదేశ్యాలు వేలున్నవి. ఆంధ్రసారస్వతములో "ఇంగ్లీషు" మాటలు చేరినవే; పాంపవింకతిలో ఉన్నవి. ఇంగ్లీషు నిఘంటువులో—సామాన్యమయిన వానిలో నే—"ఇండియా", "హిందూ" మొ॥వి ఉన్నవి ఈలోకములోనున్న ప్రఖ్యాతభాషలన్నిటనుండిన్ని ఇంగ్లీషులో చేరిన శబ్దాలున్నవట! వాడుకలో వేరుతన్ని ఉన్నమాటలు భాషయొక్క అంగములు కాక తప్పదు.

ఇతను, నేటివ్యవహారమందున్న మాటలు, గ్రంథాలలో లేనిపాపాన, గ్రామ్యాలుగా పరిగణించి త్యజించిన ఆంధ్రసాహిత్యపరిషత్తువారు ప్రకటించినట్టి సూర్యారాయాంధ్రనిఘంటువులో వాడుక మాటలుకొన్ని తప్పి దారిదూరినవి, ఏలాగుననో; మీరు "లక్ష్మీనారాయణీయము" లోనే "చాలా" మొ॥ శబ్దాలు చేర్చి ఉన్నారు వాచస్పత్యములో బుద్ధిపూర్వకముగానే "వాడుక మాటలు" అనేకముగా స్వీకరించి, "భాషాపరిణామము" "భాషాపరివర్తనము" మొదలయిన సిద్ధాంతములను అనుసరించిన వారయినారు

భాషా పాండిత్యము పరిపక్వమయి ఉన్న ఫ్రాన్సు, ఇంగ్లండు, జర్మనీ దేశములలో రచితమయిన నిఘంటువులు క్రమేణ చక్కబడుతున్నవి. ముప్పై ఏండ్లక్రితం అచ్చుపడ్డ ఆక్సఫర్డ్ ఇంగ్లీషు డిక్షనరీ మొదటి సంపుటంలోని లోపాలూ దోషాలూ తొలగించి మరి ఒకసంపుటము ఇప్పుడు ప్రకటించినారు ఆనిఘంటు రచయితలు మన తెలుగుభాషలో "పాండిత్యము" అనదగిన ఫలము లభింపజేసే కృషి ఎవరూ ఇంకా మొదలు పెట్టలేదు. విశ్వ విద్యాలయాలలో అట్టికృషికి అనుకూల్యముగా ఇంకా ఏర్పడలేదు అట్టికృషి ఇంగ్లీషుభాషా విషయమున ఇంగ్లండులో 1830 వ సం॥ మొదలుకొని జరుగుతున్నది. మన తెలుగు భారతమయినా నిర్దుష్టముగా పరిష్కరించగల పండితులు ఇంకా ఆవిర్భవించలేదు ఇంగ్లీషు నిఘంటువుమాదిరిని 1912 వసం॥ లో తమనిఘంటువు రచింపబూనుకొన్న సాహిత్య పరిషత్తువారి పాపము తజ్జ్ఞులకు హాస్యాస్పదముగా కనబడినది సూర్యారాయ నిఘంటువుకున్నూ ఆక్స్ఫర్డ్ ఇంగ్లీషు నిఘంటువుకున్నూ హస్తిమశకాంతరమున్నది

మీవాచస్పత్యము నిర్విఘ్నముగా సమాప్తిపొంది మీకున్ను ఆంధ్రలోకమునకున్ను కీర్తిని సంపాదించుగాక.

రాజమహేంద్రవరం.
2—3—1938.

ఇట్లు,
చే. గి॥ వేం॥ రామమూర్తి.

---

## మహోపాధ్యాయ, మధ్వ శ్రీకాశీ కృష్ణాచార్యులుగారు,

## అవధాని శిరోమణి, గుంటూరు. (12—1—38).

బ్రహ్మశ్రీ, కొట్ర శ్యామలకామశాస్త్రిగారు రచించిన "ఆంధ్రవాచస్పత్యము" అనెడు నిఘంటురత్నము, ఓంకారాది పదాంతమువఱకును నొకసంపుటముగా ముద్రితమయి నాకడకు వచ్చినది. దానిని నేను దాదాపు పూర్తిగాఁజూచితిని. ఏతద్గ్రంథకర్తలొనర్చిన శ్రమ సార్థకమగుచుటయేగాక, ఈనిఘంటువువలన వసన్యలక్ష్యమగు లాభము నొందవలసిన వారు ఆంధ్రభాషాభిమాను లందఱునైయున్నారు. ఇతర నిఘంటువులలో లేని విశేషములెన్నియో యీ నిఘంటువునందుంటచే, నిది సంస్కృతాభ్యాసముగల విద్వాంసులకుఁగూడ మహోపకారకమని నాదృఢాభిప్రాయము. ఈకాలమున నిట్టి నిఘంటువులే అత్యవసరములు.

---

## ఆశయము.

విద్వాన్ శ్యాడీ వేంకటశాస్త్రిగారు.
శ్రీ సారస్వత పరిషత్తు

మాదుగుల.
12-2-1938.

శ్రీయుత కొట్రి శ్యామల కామశాస్త్రి లిఖితాంధ్ర వాచస్పత్యనామక సంస్కృత నైఘంటిక కాంతర్గతాకారా ద్యకారాంత కకారాది ణకారాంత శబ్ద సర్వస్వసమన్విత ప్రథమ ద్వితీయ భాగస్థ విశేషవిషయముల నవలక్షించి యుత్తమమీఁది గీర్వాణవాచస్పత్య విషయా లోకన సంజనితా మందానందానంత సంతోషిత స్వాంతుండనయి యేతద్గ్రంథకర్తృపాండిత్య సామర్థ్యంబుల నపరిమితములుగఁ బరిగణింపఁగలిగితి.

అంతర్విషయ విశేషముల నాగ్రంథ రాజమే పృథక్పృథక్ ముఖంబుల నత్యంత మవబోధించుచుండుటంబట్టి మఱల నేనక్కాగ్రంథప్రశస్తి విస్తర హేతువుగ భావించితి.

శ్లో. సారస్వతాదివిజ్ఞానసర్వస్వయాన్థ్రిబ్రాహ్మణైః ।
వాచస్పత్యంథ వేద్వద్భిర్విద్వద్భిః పాఠ్యంసదాముదా ।
విజ్ఞానసమ్పదాంధూసపాత్రియామనుస్వాదుస్గుణాః ।
తస్మాన్నాన్యస్యమిదం తేషాం విద్యావజ్ఞానసాధనాత్ ॥

---

## ఆంధ్రవిద్యావాచస్పతి శ్యామల కామశాస్త్రిగారికి, అభినందనసభ.

(ది 7-1-38 తేది 4½ గం. నుండి 7గం. వఱకు.)

ది8-1-1938 ఆంధ్రదినపత్రిక
14వ పుటనుండి

మదరాసు,
జనవరి 8 —

“సర్వవిధముల నిరాధారముగనున్న ఆంధ్రభాషాభివృద్ధికై ఇరువది సంవత్సరముల దుర్భర పరిశ్రమతో శ్రీ ఆంధ్రవాచస్పత్యమను అకారాది ప్రతిపదార్థ పర్యాయ పద నిఘంటువును తయారుచేసిన ఆంధ్రవిద్యావాచస్పతి కొట్ర శ్యామలకామశాస్త్రిగారిని అభినందించుటకు నిన్న సాయంకాలము పచ్చయప్ప కళాశాల ఆంధ్రవిద్యార్థిసంఘమువారి యాజమాన్యమున బహిరంగసభ జరిగెను. సభకు కళాశాల ఉపాధ్యాయులు, విద్యార్థులు చాలామంది హాజరైరి.

## బ్రహ్మశ్రీ. విద్వాన్ టి. విశ్వనాథశాస్త్రిగారు సభకు అధ్యక్షత వహించిరి

ఆంధ్రభాషాభివృద్ధికి ప్రముఖులు చేసిన చేయుచున్న కృషిని సభాధ్యక్షులు వివరించిరి. విజ్ఞానసర్వస్వము గ్రంథరూపమున తయారుచేయుటకు శ్రీయుత కాశీనాథుని నా

శ్వరరావు పంతులుగారు చేయుచున్న కృషిని వీరు ప్రశంసించిరి. ఆంధ్రభాషాభివృద్ధికై శక్తివం చన లేకుండా పాటుపడుచున్న శ్రీయుత పంతులుగారికి చిరాయురారోగ్యములు ప్రసాదింప వలెనని వీరు దేవుని ప్రార్థించిరి. ఆంధ్రవాచస్పత్యము పండితులకు పరమానందమైనది. విద్యార్థులకు వియత్సురభి యైనది. పాఠశాలలకుఁ బారిజాతంబైనది. కళాశాలలకుఁ గల్పతరువైనది. పుస్తకభాండాగారంబులకు నిస్తుల నిదానంబైనది. కవులకు చింతామణి. నిఘంటువులకెల్ల నిరుపమానశిరోమణి. ఆంధ్రవాస్తంబుల కమూల్యాభరణము. ఇందు వాడుకపదములతో ప్రతిపదార్థములు, అర్థములు, పర్యాయపదములు, తద్విశేషార్థ నిఖిలపర్యాయపదములు, ప్రత్యర్థమునకు భాషాభాగాదులు, ప్రకృతివైకృతులు, రూపాంతరములు, వ్యాకరణాద్యంశములు, నాటకలక్షణములు, ఛందోలక్షణములు, కావ్యలక్షణములు, న్యాయములు, జాతీయములు, సంఖ్యావాచకపదములు, ప్రయోగాధారములగు లోకోక్తులును గలవని కామశాస్త్రిగారు తమ గ్రంథమునుండి నిదర్శనములను సభవారికి చూపించిరి. ఆంధ్రలోకము తమ గ్రంథమును స్వీకరింపవలెనని విన్నవించిరి."

☞ N. B.—విద్యార్థులును, ఉపాధ్యాయులును నిఘంటుకర్తగారు చేసిన పరిశ్రమకు శ్రీ భగవంతుఁడు వెంటనే తోడ్పడి నిఘంటుముద్రణము పూర్తిగావించుగాక యని ప్రార్థించుచు నిఘంటుకర్తగారిని కొనియాడిరి. వెంటనే ఉపాధ్యాయులును, విద్యార్థులును చందాదార్ల మగుచున్నామని హెచ్చరించిరి. సభ జయప్రదముగా జరుగుటకు తగు యేర్పాట్లుగావించిన శ్రీ పచ్చయ్యప్ప పాఠశాలాధ్యక్షులను శ్రీ శ్యామల కామశాస్త్రిగారు ప్రశంసించిరి. సభకరతాళధ్వనులతో ముగిసినది.

## ఆంధ్ర విద్యా వాచస్పతి కొట్ర శ్యామల కామశాస్త్రిగారికి.

## అభినందన సభ. (ది 16-2-1938).

## కనగాల, రేపల్లెతాలూకా (గుంటూరు).

సర్వవిధముల నిరాధారముగనున్న ఆంధ్రభాషాభివృద్ధికై ఇరువది వత్సరములు అహోరాత్రములు దుర్భరపరిశ్రమగావించి ఆంధ్రవాచస్పత్యమను అకారాది ప్రతిపదార్థ పర్యాయపదనిఘంటువును తయారుచేసిన ఆంధ్రవిద్యా వాచస్పత్యాది బిరుదాంకితులగు బ్ర. కొట్ర శ్యామల కామశాస్త్రిగారిని అభినందించుటకు కనగాల జాతీయ బాలభారతి గ్రంథాలయమువారి యాజమాన్యమున బహిరంగసభ జరుపఁబడినది. సభకు పండితులును పాఠశాలల ఉపాధ్యాయులును, గ్రామస్థులును, డాక్టర్లును, విద్యార్థులును మున్నగువారు పెక్కుమంది విచ్చేసిరి.

## ఉభయభాషాప్రవీణ శ్రీమాన్ వేదాల వేంకట తాతాచార్యులవారు సభకు అధ్యక్షత వహించిరి.

"ధనుర్విద్య కర్జునునివలె" సాహిత్యవిద్య కాం తాకూరులై నిర్వహించుచూనిన శ్రీ శ్యామల కామశాస్త్రిలవారి "ఆంధ్రవాచస్పత్యము" యొక్క కృషిని అధ్యక్షులు విశేషము ప్రశంసించిరి. మఱియు భాషాపోషకులు వదాన్యశేఖరులునగు మహారాజులు చేయింపవలసిన పనిని శ్రీశాస్త్రిగారొక్కరు నడుముకట్టిచేయుట వింతలలోని గొప్ప వింతయనియు, ఈ మహనీయకోశ మాంధ్రమండల మాబాలగోపాలము స్వీకరింపదగినదనియు, ఇట్టి మహాకార్యమునకుఁబూనుకొనిన శ్రీ శాస్త్రిగారికి భగవంతుఁడు చిరాయురారోగ్యములు ప్రసాదింప వలెననియు అధ్యక్షులు దేవుని ప్రార్థించిరి. దవపండితులు డా॥ కోటంరాజు కోటీశ్వరరావు పంతులుగారును, డాక్టరు ముక్కామల సోమసుందరరావు పంతులుగారును, అధ్యక్షుల ఉపన్యాసమును బలపఱచిరి. శ్రీ శ్యామల కామశాస్త్రిగారు పూర్వపు విద్యావిధానమునకును, ఇప్పటి విద్యావిధానమునకును హస్తిమశకాంతరము గలదు గాన యిప్పటి విద్యావిధానమునకు వెంటనే మార్పుగలిగించి పూర్వపురీతిని ఆంధ్రనామసంగ్రహము మున్నగు తెలుఁగునిఘంటువులను, అమరము మున్నగు సంస్కృత నిఘంటువులను ప్రారంభవిద్యగా నేర్పఱచిన యెడల భాషాభివృద్ధికి కారణమగునని విన్నవించుచు తమ "ఆంధ్రవాచస్పత్యము" లోని విషయములను సోదాహరణపూర్వకముగ నుపన్యసించి సభ్యులనానందాబ్ధినోలలాడించిరి. కస్తూరి కుటుంబరావు పంతులుగారియొక్కయు అధ్యక్షులయొక్కయు అంత్యోపన్యాసములతో సభ జయప్రదముగా కరతాళధ్వనులతో ముగిసినది.

---

## బ్రహ్మశ్రీ పండిత, సోమంచి సూర్యనారాయణశర్మగారు. కరప. (19-8-37.)

నిఘంటు సామాన్యమువలెఁగాక పీఠికాకారులవాక్ప్రకారమిందు గొప్పవిశేషముగలదు. సహృదయులకొక విజ్ఞానసర్వస్వముఁ బోల్కియునోఁచేటకది యొక్కహేతువు. పెక్కులేల ? తమ దాల్చిన ఆంధ్రవిద్యావాచస్పతిత్యాది మహద్బిరుదావళిచే నీబృహత్కోశమునకును ప్రకృతకోశోద్ధతిచే స్వకీయఘనబిరుదజాలమునకును సార్థకత సమకూర్చు సదుద్యమమియ్యది సర్వధా స్తవనీయము.

చాలినన్ని పరికరములులేకున్నను శ్రీమంతులయాశ్రయముఁబడయకున్నను ఏసమాజమో ఏజమీదారుఁడో పూనుకొనవలసిన—ఆంధ్రభోజునకైన నచిరాచరణ సాధ్యముకాజాలని—ఈమహోద్యమమున కేవలసామాన్య ప్రజాసాహాయ్యమునందుగల విశ్వాసముతో స్వధర్మరతులై వారధిదాఁటిన వీరపావనికైవడి భాషాసాగరముఁ దరింపనుఱికిన యసహాయశూరులీయన. కాఁగాక ! అనతి కాలమున వీరికృషి ఫలవంతమగు శుభసూచనా సౌరభ మితఃపూర్వమే మాఘ్రాణపర్వమాయె. "క్రియాసిద్ధిస్సత్త్వేభవతి" కదా.

ఏతత్సత్కృతి దేశభాషాభిమానుల యథాసత్కృతినందుఁగాక ! శ్రీశ్యామలకామశాస్త్రి గారికి సత్కీర్తిసంధాయక మగుఁగాక !!

## ఉభయభాషాప్రవీణ, బ్రహ్మశ్రీ మూలా సూర్యనారాయణశాస్త్రిగారు,

### వి జ య న గ ర ము.

ఆర్యా ! నమస్కారములు.

"భారతిరామ కథార్థముల్ విభా । సిలఁగనగంటి పండొలిచి చేతికి నిచ్చినరీతి" (కళాపూర్ణోదయము) "లక్ష్మీనారాయణీయము"ను శుద్ధాంధ్ర ప్రతిపదార్థపర్యాయపద నిఘంటువును బాల్యమున వ్రాసినవిూకు నేఁడు "ఆంధ్రవాచస్పత్యము"ను ప్రతిపదార్థ పర్యాయ పద నిఘంటువును ఉభయభాషలయందును సమకూర్చుటయనఁ "గొట్టిన పిండియయ్యె." ఎన్నివేలు ఖర్చుపెట్టినను-ఎన్నిలక్షలువ్యయము చేసినను-పర్యాయపదనిఘంటువులీవఱకాంధ్ర మండలమున వెలువడి యుండలేదు గదా !

ఇప్పట్టున మన మాతృభాషకును మనదేశభాషకును పర్యాయపద నిఘంటువులేని లోటు నుం దీర్చి "నిత్యకళ్యాణముఁ, బచ్చతోరణమునై జనులందఱునుల్లసిల్లఁగన్" (విజయవిలాసము) అనురీతిని భాషాచతురుల కెంటెనొసఁగి పున్నెము గట్టుకొనిన వారలుమీర లేగదా ! మీరు కృతకృత్యులును సుకృతులును నైరి నేఁడుగదా ఆంధ్రమాతగర్భము ఫలించినది. మీకృషి పున్నమ చంద్రుని పగిది చిరస్థాయి యగుఁగాక !!!

---

## మహారాజశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహము పంతులుగారు,

### రాజమహేంద్రవరము. (29_4_1938).

మహారాజశ్రీ కొట్ర శ్యామలకామశాస్త్రిగారు విరచించుచున్న "యాంధ్రవాచస్పత్యము" ను మహానిఘంటువును నేను చదివించుకొని వినుచున్నాను.

ఇది 'యాంధ్రవాచస్పత్యము'ను పేరేగాని 'సంస్కృత వాచస్పత్య' మనిగూడ చెప్పవచ్చును. ఆంధ్ర గీర్వాణ భాషలయందుఁగల శబ్దజాలము చాలమట్టుకీ నిఘంటువున నర్థములతోను ఉదాహరణములతోను పర్యాయపదములతోను మఱియెన్నియో విశేషాంశంబులతోను వివరింపఁబడియున్నది.

ఆంధ్రసారస్వతమునకీ గ్రంథము మహోపకారకమని చెప్పుట కే సందేహమును లేదు. వీరిప్రయత్నము మిక్కిలి శ్లాఘాపాత్రమైనది. చిరశ్రమైక సాధ్యమైన యీగ్రంథమునకు ఆంధ్రమహాజనులు తగు ప్రోత్సాహమిచ్చి యాదరింతురుగాక !

## మహారాజశ్రీ వాడ్రేవు శేషగిరిరాయకవిగారు, మేనేజరు హిందూ ఎయిడెడ్ గర్ల్సుస్కూలు, మడికి, చొప్పెల్ల. రామచంద్రపురం తా॥ (20-4-1988)

బ్రహ్మశ్రీ ఆంధ్రవిద్యావాచస్పతి కొట్ర శ్యామలకామశాస్త్రి మహాశయులకు సానమస్కారపూర్వకముగా సమర్పించిన యభినందనపద్యములు

శా. తూచాతప్పక యాంధ్ర సంస్కృతపదా • స్తోకంపు సద్వ్యర్థముల్
ప్రాచీనాధ్వని శాద్వలేశ కవితా • భావానుమానంబుగా
వాచస్పత్యము వ్రాసి యింటునొవరిం • పన్ జన్మసాఫల్యమై
యాచంద్రార్కము వంశ మొందిని యశం • బార్జించితో! చాలదే !!

క. కరకంగలదీకోశము
కఱకంగల దఖిలశాస్త్ర • గ్రంథార్థములన్
కరపంకజ సంశోధన
కరమై కవిలోకకల్ప • కమ్మునై చెలఁగున్.

ఉ. ఈమహనీయ కోశమటు • లేమహనీయుఁడు కూర్పఁగల్గె "మ
న్నీమహిరెండుబాసలకు • "నేనె సమర్థుఁడ !" నంచుఁగూర్చితో
శ్యామలకామశాస్త్రి ! నిను • సంభవ మొందిన యాంధ్రమాతయుం
బ్రేముడిఁగన్నమాతయును • బెంచిన మాతయు నెంతధన్యలో !!

---

## మహారాజశ్రీ, కవిశేఖర, భోగరాజు నారాయణమూర్తి పంతులుగారు. టీచరు. యమ్, ఆర్, కాలేజ్; సంస్థానకవులు. విజయనగరము.

విద్వదవతంసమా !

తమ యాంధ్రవాచస్పత్యము నన్నద్భుతానంద పరవశుం జేసినది. భాషాపోషకులు, వదాన్యశేఖరులునగు మహారాజులు వేలకొలఁది విచ్చించుచుండఁగొండఱు విద్వాంసులు సంవత్సరములకొలఁదిఁబనిసేయుచుఁగొనసాగింపవలసిన యీమహాకార్యమును, 'ధనుర్విద్యాకర్జునునిం'బోలు సాహిత్యవిద్య కసహాయశూరులై నిర్వహింపఁబూనిన మిమ్మాంధ్రదేశము వేనోళ్ళ శ్లాఘించుచున్నది. తమకోశము కేవలము కోశమాత్రమ్ముగాక, విజ్ఞానసర్వస్వము తెఱంగున వివిధవిషయ వివరణవిజ్ఞాన విపులంబై, భాషకుఁజిరకాలమునుండియుఁ దొలఁగనికొఱంత నచిరకాలమునన తొలఁగించినది. మీమహోద్యమము నిర్విఘ్నముగఁగొనసాగుఁగాక !

ఉ. ఈమహనీయకోశము న • హీనపరిశ్రమ కోర్చి కూర్చియా
సోమ దివాకరంబగు య • శోవిభవంబును గొంటివెన్నియో
నోములు నోచిగాంచిన త • నూజుఁడవై తివి తెన్గుమాతకో
శ్యామల కామశాస్త్రి బుధ • సత్తమ ! నీకుఁ జిరాయురున్నతుల్.

## శ్రీ వేదమూర్తులైన బ్రహ్మశ్రీ కొట్రి శ్యామల కామశాస్త్రిగారికి.

### నమస్కారములు.

ఆర్యవర్యా,

తమచే రచింపఁబడిన "ఆంధ్రవాచస్పత్యము" నేఁటివఱకు ప్రచురింపఁబడిన మూఁడుసంపుటములను చూచితిమి. చాల ఆనందము కలిగినది. ఇందనుక శబ్దరత్నాకర మొక్కటియే తెనుఁగు భాషకు ముఖ్యముగ శరణ్యమైయుండెను. సూర్యారాయ నిఘంటువొక్కటి బయలుదేరినదని వింటిమి కాని, నేఁటికిని కాంచుభాగ్యమబ్బదయ్యెను. విజ్ఞానసర్వస్వమును వ్రాయఁగంకణము కట్టుకొనెడి విపశ్చిద్వరేణ్యులకు - మీ ఆంధ్రవాచస్పత్యము కుడిభుజముకాఁగలదు. ప్రకృతులకు వికృతులు కూర్పఁబడినవి. పర్యాయపదములీయఁబడినవి. లోకోక్తులు - న్యాయములును చేర్పఁబడినవి. ఇవియవియననేల ? ఈ వఱకు నిఘంటువులలో లేనియాంశము లెన్నెన్నియో యిందున్నవి. పుణ్యక్షేత్రముల నామములనుగూర్చి వ్రాసినట్లే - చారిత్రకముగాఁబ్రసిద్ధికెక్కిన ముఖ్యనగరరాజముల పేళ్లనైనను చేర్చిన ఇంకను బాగుండెడిది. ఉదా:—కలకత్తా (కాళీఘట్టము). తరువాత అన్యదేశీయములైనను - మహమ్మదీయ స్త్రీయనెడి అర్థమిచ్చు - బీబీ - బాబు. ఇట్టి శబ్దములనుకూడ కూర్చుదురుగాక. ఇకార్యము అనుబంధమున జరిగినను జరుగవచ్చును. ఏమైనను ఆంధ్రవిద్యావాచస్పతీత్యాదిబిరుదాంకితులగుమీచే రచింపఁబడిన ఆంధ్రవాచస్పత్యము సాహిత్యమును సంపాదించుకొను విద్యార్థులపాలి కామధేనువై - కవీశ్వరులపాలి కల్పవృక్షమై ప్రకాశించుననుటలో నతిశయోక్తి లేశమయినను లేదు. ఇట్టి గ్రంథరాజముల రచింపను ప్రకటింపను పరమేశ్వరుండు మీకు చిరాయురారోగ్యైశ్వర్యములఁ బ్రసాదించుఁ గాక.—

ఇట్లు, బుధజనవిధేయులు.

1. N. Virabhadraswamy, బి. ఏ., యల్. టి. హెడ్మాష్టరు - మ్యునిసిపల్ హైస్కూలు, విజయనగరము. ది 16—8—38 సం॥

2. న్యాపావజ్ఝుల సత్యనారాయణమూర్తి.
మ్యునిసిపల్ హైస్కూలు తెనుఁగుపండితుఁడు అనకాపల్లి.



# ఆంధ్ర వాచస్పత్యము.

## పండితాభిప్రాయములు.



సరసచతుర్విధ కవితా సామ్రాజ్యధురంధరులు, బ్రహ్మశ్రీ నాదెళ్ళ
పురుషోత్తమ కవిగారు, బందరు.



చ॥ బిరుదము లెన్నియేనయును § పెద్దగు శ్యామల శాస్త్రి, సు
స్థిరతర దీక్షనూని యొక § శ్రేష్ఠ నిఘంటువొనర్చె సూర్య రా
ణ్ణరపతి వావిళాన్వయుల § నైపుణినీయది మించెఁగాదె ? యీ
శ్వర కరుణాసమృద్ధికిని § సామ్యమె దా ? నియతద్దియే కదా.

కం॥ కదుకడినిది వెలువడి యీ
పృథివిని వ్యాపింపఁగనుత § భూరియశంబీ
తఁడె యంతఁగాంచుఁ గావుత !
నడఁగవె భాషాభిమాను § లామోదంగన్.



కవిభూషణ గోరుగంతు అచ్యుతసూర్యనారాయణ శర్మగారు.
కొత్తపేట.

మ॥ అమరాధీశుని యంతవాఁడొక సహా § యత్వమ్ముసన్ వర్తిలన్
సుమనస్సంఘముతోడు గానమరకన్ § జొప్పారియున్ వ్రాయలేఁ
డమరాచార్యుఁడు దీనిఁబోలఁగల దీ § వ్యత్సోకమే నాఁటి కాం
ధ్రమునం గాదల యాద్యయందయినఁద § థ్యం బాంధ్రవాచస్పతీ !

మ॥ ఎవరొక్కండును సెట్టువాడిరో యటం § చేకాగ్ర చిత్తంబుతోఁ
గవిరాడ్గ్రంథములన్ విమర్శనముగా § గాలించి తత్సార భూ
తవరోరత్నములన్ని యేర్చి మన యాం § ధ్రంబందుఁ గోశంబు నిం
తవిశేషంబున వ్రాసినారె యెవరై § నన్ మున్ను విద్వన్మతీ !

మ॥ "ఆంధ్రపదాకరం" § బాదిగా గోశంబు లెందఱుఁ గోరిక దీర § నలరుచున్న
సుమధికోగాధమౌ § "శబ్దరత్నాకరం" బందునిచ్చెలు నోల § లాడుచున్న
సరసలోకొద్ధృత § "శబ్దార్థచంద్రిక" యందు సంతతమాట § లాడుచున్న
సూరిసన్నుత "లక్ష్మ § నారాయణీయంబు" నందు నేర్పునమాట § లాడుచున్న

తే॥ గీ॥ నాంధ్రభాషావధూటి య § య్యమరభాష
కీడుగాఁజాల దయ్యనీ § విపుడు కొత్త
కొత్తఁ బలుకులఁ బలికించి § కోశమిట్టు
మర్పకుండిన నాంధ్రవా § ఙ్మయధురీణ !

శా॥ కౌమ్మజ్ఞానములేని వాఁడెయయినన్ § గానీ తెనుంగందునన్
భవ్యంబైనఁ గవిత్వముం బలుకఁగా § వాంఛించుచేవిన్ భవత్
సృష్టంబైన నిఘంటురాజమును వా § చస్పత్యముం జూచుచో
దివ్యచ్ఛబ్దపరంపరల్ దెలిసి సం § ధించున్ లసత్కావ్యముల్.

కం॥ మిముబోటి పెద్దలిటు కో
శములాపాదించి తగవా § సంగినఁగాదే
తమిదీర నాంధ్రభాషా
కుమారులింపార వాడు § కొనుట సుధీంద్రా !

వైయాకరణ చిలుకూరి చల్లయ్యశాస్త్రిగారు. కంచుమట్టు.

కం॥ వాచస్పతి వీరగుటను
వాచస్పత్యముఁ దెనుఁగునఁ § బలికితి వాద్యన్
వాచస్పత్యము వ్రాసెను
వాచస్పతి యెంతు రెవరి § బాసను వారే.

గీ॥ ఏపదార్థములందు లో § టెంతలేక
సౌమనస్యంబు వాటిల్ల § సకలశబ్ద
ములను నేరిచి కూరిచి § పోల్కి లేని
యిట్టికోశంబు రచియింప § నేరికగును.

తే॥ గీ॥ గాలికిం బోవు మాటల § గట్టిపెట్టి
సంస్కరించి విరూఢిఁగో § శమునఁ జేర్చి
కవికుమారుల పలుకుల § కఱవు బాపి
యాంధ్రవాఙ్మయ జలధి పెం § పారినావు !

కం॥ శ్రీరమణుఁడక్షియుగిని గ్ర
హారస మొల్కఁగను నాంధ్ర § వాచస్పత్యం
బారూఢ విబుధ గౌరవ
మైరంజిలం గాఁత ! ధరణి § మైరిదయమునఁ గా.

## బ్ర॥ రావూరి చిట్టివేంకట సుబ్రహ్మణ్యముగారు. బి. యె. బి. యల్., రాజమండ్రి.

శా॥ ఆనందాబ్ధిని దోలలాడితిని బా § వా! మీదు పత్రికావిశే
షానూనంబగు సత్క్రియాఫలము "వా § చస్పత్యముం" గాంచి భా
షా సాహిత్య సముఖ్యభూషణము వి § జ్ఞానాధిసర్వస్వముల్
నానాసత్పదముల విస్తరణముల్ § మాన్యాతి సుశ్లాఘ్యముల్.

ఉ॥ ప్రాకటరీతి నాబుధుఁడు § ప్రాజ్ఞులు మెచ్చనుతింప శబ్దర
త్నాకరముల్ రచించి తిరిద § శబ్దములేగను నేఁడు నిత్యన
వ్యాకృతినున్న యాంధ్రమున § కయ్యదిచాలనిదయ్యె నింతలో
మీకృతి యిట్లుపుట్టుట స § మీకృత పుణ్యముగాదె భావనన్.

ఉ॥ మీరలు బంధులౌటకన § మిమ్ము నుతించుట కాదు రాజస
త్కారముసన్ ఫలింపఁదగు § కార్యముగాని మఱొండుఁగాదు మీ
కేరుపుచేతదీక్షమెయి § నిర్వహణంబొనరించి కావ్యతో
దారయశో విశేషమున § ధన్యతఁగాంచిరి యాంధ్రభూమిలోన్.

మ॥ అతులప్రాభవ వైభవోన్నతుఁడు సూ § ర్యారాయభూపాలుఁడా
యతనిర్మాణ విధానదక్షతనసం § ఖ్యార్థంబు వెచ్చించి కా
మితనానార్థనిఘంటురాజమును ని § ర్మింపంగ లేఁడాయె నే
కతమో నేఁటికిఁగూడ మీరలది చ § క్కంగ జేసినారొక్కరున్

గీ॥ ఎంతకాలమో గతియించె § నింతదనుక "సూర్యరాయాంధ్రకోశంబు" § కార్యనిలయ
ప్రాంగణము దాఁటలేదు § రాజవర్యుఁడెంత వెచ్చించినను § మరదృష్టమేమొ!

గీ॥ అట్టిదైనదనన్యసా § ధ్యమ్మునను పరిమిత ద్రవ్యసంపత్తి § బహుళకష్ట
సాధ్యమైన యీకార్యంబు § సకలవినయ పూర్ణముగ నిర్వహించిరి § పూన్కితోడ.

చ॥ ఆప్తులయిన మాధ్యకుల § కందఱకున్ సతతంబు గర్వ సం
ప్రాప్తికిఁ గారణంబయిన § యత్నమునన్ చరితార్థులైరి సం
తృప్తిమెయిన్ సరస్వతికి § తీరనిలోపము శీఘ్రమేదిశా
వ్యాప్తినిబొంది మీకృతి ము § దావహమయ్యెడు! నాంధ్రకోటికిన్.

తే॥ గీ॥ సతమితోధికమున సర § స్వతికి సేవ
సలుపుమీకౌ యారోగ్య § ములనొసంగ
సకలలోకైక నాథుని § చరణపద్మ
ములను సతత నమస్కార § ముల భజింతు.

---

## సంస్థానకవి, సత్యవోలు కామేశ్వరరావుగారు, కిర్లమపూడి.

చ॥ ప్రభువులయౌఁత కేమినిలు § వంబడఁజాలక తూలిభావుకల్
ప్రభఁజెడుచుండ నీదునన § పద్యనిఘంటువు వింతవైద్యుఁడై
యుభయ పదంబులంబలు బ § లోన్నతిఁగూరిచి నిల్పఁబెట్టి దా
నభయము నొసఁగుచుండె దశ § యద్దిర! శ్యామల కామధేనువై!

## మహారాజరాజశ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు.

C. R. REDDY.

Padma- Prabhasa.
Chittoor (N. A)
16—1—1935.

ఆర్యా !

తమచే విరచింపఁబడుచుండు "వాంధ్రవాచస్పత్యము" అమూల్యమైన నిఘంటువు. దీనిచే వీరలు మాతృభాషకుఁ జేయుచుండు కృషి వర్ణనాతీతము. ఇదియెంతయు సమగ్రమైన సంహిత. ఈ మహాగ్రంథము కారణముగ తమకు నమర్త్యకీర్తి సంఘటిల్లుననుటకు సందేహములేదు. కృతి నిర్విఘ్నముగ సమగ్రముగఁ బరిపూర్తిఁ జెందుఁగాక !

బ్రహ్మశ్రీ ఆంధ్రవ్యాసనిపుణ, బాలకవిసింహ, సాహిత్యసరస్వతి, పండితేత్యాది అవ్వారి సుబ్రహ్మణ్య శర్మగారు, వంగిపురము, ప్రత్తిపాడు P O. గుం॥ జి॥

బ్రహ్మశ్రీ 'ఆంధ్రవిద్యావాచస్పతి, కావ్యనిధి, జ్ఞానగుణాకర, సాహిత్యసరస్వతి, ఆంధ్రవాఙ్మయమహోదధి.' బిరుదాభిరాములగు కొట్రు శ్యామలకామశాస్త్రులవారి సముఖమునకు, మహాశయా ! నమస్కారములు.

తమరాదృతిమెయి పొమ్పఁబంపిన "యాంధ్రవాచస్పత్యము" 1, 2 సంచికలు 24-11-1934 వ తేదీని యందినవి. పరమానందించితిని ఆమూలాగ్రము తిరుగఁజేసికొని పఠించితిని. తమరిట్టి మహాకార్యమునకు జీవితము వినియోగించుటఁ గడులగ్గు. శబ్దరత్నాకరము, శబ్దార్థచంద్రిక గాఁగల నిఘంటువులీ వాచస్పత్యమువలెఁ బర్యాయపదముల బహుళములుగాఁ జూపలేదు. కవి కుమారుల కియ్యది గడుకలితముగా నున్నది. తమ నిఘంటురాజ మవ్విధమునసుందరశ బోధనా పద్ధతికలె నున్నది. ఎట్లన; పే 102 కీలో వ్రాసిన "అనుప్రాసము సం. వి. అ. పుం. శబ్దసామ్యముఁ గలిగి యుండునట్లు చెప్పిన యొక శబ్దాలంకారము: చూ, అలంకారము. 8" అనుదానికి 171 పేజీ యందు లిఖించిన నీక్రిందియలంకారము సంబంధముఁ గలిగి యున్నది.

"అలంకారము. సం వి, అ. పుం. 1. వైసేఁత: చూ, భూషణము. 2; 2. సరిగమాది వర్ణసందర్భము: చూ, స్వరము. 2; 3 అలంకారములు రెండు విధములు.—1. శబ్దాలంకారము, 2. అర్థాలంకారము; శబ్దాలంకారములు.—అర్థము విచారించక శబ్దమువినఁగనే చెవులకింపుగా వినఁబడునవి. ఇందులో ననేక భేదములుఁగలవు. 1. ఛేకానుప్రాసము, 2. వృత్త్యనుప్రాసము, 3. లాటానుప్రాసము, 4 యమకము—ఇందు పదయమకము—పాదయమకము—ముక్తపదగ్రస్తము—సింహావలోకనము, 5. అంత్యానియమము. 6. పునరుక్తవదాభాసము. మతియు, అనుప్రాసము మొదలగునవి. అర్థాలంకారములు;—అర్థము ప్రధానముగాఁ గలిగి కావ్యశోభాహేతువులైనవి. 1. అతద్గుణము. 2. అతిశయోక్తి. 3. అత్యుక్తి, 4. అధికము, 5. అనన్వయము, 6. అనుగుణము, 7. అనుజ్ఞ, 8. అనుమానము, 9. అన్యోన్యాలంకారము, 10. అపహ్నవము, 11 అప్రస్తుతప్రశంస... ........విధురము ఉపలాలకము, ఉల్లాసితము. 7=68; అం. 4. అష్టాదశపదార్థములలో నొకటి: చూ, అష్టాదశపదార్థములు." ఇవ్విధమున సంబంధముఁగలిగి పర్యాయపదములతో [illegible]

పారిభాషికపదములతోను, చిత్రపటములతోను రూపొందుచున్న తమ యాంధ్రవాచస్పత్యము తమ "యాంధ్రవాచస్పతి, సాహిత్యసరస్వతి" బిరుదములకుఁ దగియున్నది.—చిత్రపటములు ప్రయోజనకారిగా నేమో యను సందేహము. తీసివేయుఁడని చెప్పను —మీయిష్టము.

నేను "ఉపమానేయములు." అను శీర్షికముతో 'అంధకరదీపికాన్యాయము, అంధకూపన్యాయము, తిలతండులన్యాయము' గాఁగలవానితో లెనుండు న్యాయములను సేకరించి గ్రంథరూపముఁ జేయవలయునని సంకల్పించి తత్ప్రయత్నమునమంటిని. తమ యాంధ్రవాచస్పత్యమున యుపమానేయనోపన్యాయములు బహుళములుగానుంటంజేసి మత్ప్రయత్నమును విరమించితి.

వాచస్పత్యనిఘంటు స్వరూపమునకు. తమ నిఘంటువునకుఁ గొన్నివిషయములందు భేదాభిప్రాయములుఁ గన్పట్టుచున్నయవి. అయినను సతురాభ్యాసుఁడైన యాంధ్రవ్యక్తికి సులభముగా బోధపడునట్లు వాచస్పత్యమంత కడుసంతసము. "సమానానాముత్తమశ్లోకో అస్తు" అను సూక్తి తమపట్ల సార్థకము. తమపూనిక సర్వదా దిగ్విజయమగుఁగాక! ఆంధ్రరాష్ట్రమున్న ఆంధ్రుల ప్రతిగృహమునఁ దమ వాచస్పత్యము గృహలక్ష్మివలె కాఁపురముచేయుఁగాక! వినోదినిగా వినోదముఁ జేయించుఁగాక! చంద్రికవలెఁ బ్రకాశించుఁగాక! నమస్కారములు.

## బ్రహ్మశ్రీ జనమంచి సీతారామస్వామిగారు, ప్రధానాంధ్రపండితుఁడు, మ్యునిసిపల్ హైస్కూలు, అనకాపల్లి.

విపశ్చిద్వరేణ్య!

మీనిఘంటుపద్ధతి నన్నద్భుతానంద రసనిమగ్నుఁగావించినది. ఆయుత్తమగ్రంథము భవదాంధ్ర గీర్వాణ భాషావైశారద్యమునకు నిదర్శనమై, పండితులకుఁ బరమమిత్రమై, విద్యార్థులకుఁ గామధేనువై, కవీశ్వరులకుఁ బెన్నిధానమై, పాఠకులకుఁ జింతామణియై యాంధ్రహస్తముల కమూల్యభూషణమై, గ్రంథాలయములకుఁ గల్పతరువై, నిఘంటువులకు శిరోరత్నమై, విరాజిల్లునని నేను విశ్వసించుచున్నాను. గుణగ్రహణ పారీణులును, భాషాభిమానులును, మహాకార్యసాహాయ్యాచరణ తత్పరులునునగు నాంధ్రులెల్లరుఁ దప్పక మీకు సముచితప్రోత్సాహముఁ గలిగించి చరితార్థులగుదురు గాక! సర్వేశ్వరుఁడు మీసదుద్యమమును సఫలీకృతముఁ గావించుగాక!

---

## బ్రహ్మశ్రీ నాదెళ్ల సుధాదక్షిణామూర్తిశాస్త్రిగారు, బందరు.

మిత్రమా!

మున్ను తెన్నుమాలిన దేశ్యపదముల యడవిందడవి శుద్ధాంధ్ర పర్యాయపద జాలంబులం జేర్చి కూర్చియున్న కృతహస్తులగు మీకు బహుళవైఘంటికోద్యాధారసంయుతముగా "ఆంధ్రవాచస్పత్యము" ను నిర్వహించుటయన్న 'గొట్టినపిండి' కాదా!

ఇంక నిది యఖిలాంధ్ర శబ్దపర్యాయ పదోద్ధారకమును, మహాకవి ప్రయోగాధార స్ఫారకమునౌట రచయితలకుం బఠితలకుంగూడ మహోపకారమును లక్ష్మీనారాయణ యశస్స్మారకమునై యాంధ్రభాషాయోషావక్ష హీరాయమానంబుగా ధారుణీతలంబున నలరారనయ్యెడు.

శా. భూపాలుర్ యశమున్వణిక్కులు ధనం బుంగోరి యేకాంతతం
బూనంగానది యర్థసాధ్యమగుట న్బూజ్యంబుగా నేర్చునే!
యీవైఘంటిక మర్థసాధకముగా నింపొప్పుచుండు బ

## శ్రీ భారతీతీర్థ ప్రధాని
## శ్రీయుత బుఱ్ఱా శేషగిరిరావుగారు.

విజయనగరము.

బ్రహ్మశ్రీ కొట్ర శ్యామలకామశాస్త్రిగారు ప్రకటించుచున్న "ఆంధ్రవాచస్పత్యము"ను చదువుచున్నాను. శబ్దనిర్వచనములు చాలా జ్ఞానదాయకములుగా నున్నవి. ఇది కేవలము నిఘంటువుగానే కాక విజ్ఞానసర్వస్వముగా ఉపయోగపడఁగలదని చెప్పవచ్చును.

## విజయనగరము శ్రీ శ్రీ శ్రీ మహారాజావారి ఆంగ్లేయకళాశాల, ఆంధ్రగీర్వాణభాషాధ్యాపకులు శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులవారు, దాసన్నపేట, విజయనగరము.

తూర్పుగోదావరిజిల్లా కాకినాడపుర సమీపమందున్న కరప యను గ్రామమందు నివసించిన లేటు బ్రహ్మశ్రీ కొట్ర లక్ష్మీనారాయణశాస్త్రిగారు తమ యపారవైదుష్యపారావార పరీవాహముగా "లక్ష్మీనారాయణీయము" అను స్వనామాంకితమగు నొక అచ్చతెనుఁగు నిఘంటువు రచించి ఆంధ్రలోకమున శ్లాఘాపాత్రులైరని మనమందఱము సంతసిల్లుచుండఁగా వారి పుత్రులగు శ్యామలకామశాస్త్రిగారు "కుమ్భః పరిమితమమ్భః పిబతి కుమ్భసమ్భవోమ్భోధిం। అతిరిచ్యతే సుజన్మా కశ్చిల్లోకేస్వతేజసా జనకాత్." అని పండితరాజు నుడివినట్లు తొల్లి బంగాళాదేశమం దుద్భవించిన "తర్కవాచస్పతి" యను మహాపండితుఁడు సంస్కృతవాఙ్మయమునకు రచించిన "వాచస్పత్యము" అను మహానిఘంటువునుబోలినది సకలాంధ్రగీర్వాణశబ్దజాలముతోఁ గూడినది యగు "వాచస్పత్యము"ను నొక పెద్దనిఘంటువునుగూర్చి లోకమునఁ బ్రకాశింపఁజేసిరి. ఇది శీఘ్రకాలములోఁ బూర్ణముగా ముద్రితముగానున్నది. ఇదివరకు వాడుకలోనున్న ఆంధ్రనిఘంటువులన్నిటికంటె విపులతరమయి వ్యాపకమైయున్నది. ఇటుపైని నిఘంట్వంతరనిర్మాణమున కవసరముండదని నాయభిప్రాయము. కామశాస్త్రిగారికి సర్వేశ్వరుఁడు చిరాయురారోగ్యైశ్వర్యాదులొసంగి వీరిచే నిట్టి లోకోపకృతుల నింకఁ జేయించుచుండవలయునని నాయాశంస.

## ఘంటాశతగ్రంథకరణధురీణ శతావధానవిద్వత్తిలక పౌరుషనామాంకిత పండితభూషణాది వేమూరి శ్రీరామశాస్త్రిగారు, గురుకులాశ్రమము, బెజవాడ.

చ. కరపనిఘంటుపుస్తకము కొంతలెన్న పదార్థబోధలన్
కరపమె యానటంచు కవి కాంక్షితమై కలకాలముండియా
కరపకుఁగూడ మెప్పిడుచుఁ గర్తగనుండిన కామశాస్త్రినిన్
గురుకులవాసి చెవ్వనిలఁ గూడిక నుండునా కూర్మిమీఱుటన్.

క. ఉభయభాషల కుభయంబును
ఉభయభాషల వాచస్పత్యనిఘంటున్
దయచేయు కామశాస్త్రికి
నయమానావినయబోధ నామక్రియలన్.

క. నావిక్ల కరపకోశము
శైవను రావుపైకి యునకొకటిన్
రావుల - జయంతియనునే
[illegible]

## అష్టావధాని, వైద్యరాజు, శ్రీయుత పాలంకి సూర్యనారాయణ కవిగారు, ఉప్పాడ, పిఠాపురము.

శా. లేరే పండితులాంధ్రలోకముల నో ♦ లిన్ గూర్పఁగ నీవలెన్
స్ఫారప్రస్ఫుట శబ్దరత్నఘటిత ♦ ప్రాగల్భ్యసౌఘంటికం
కామాధిన్ రచియించి సర్వజన తా ♦ హ్లాదంబుఁ గల్గించిరే
భారంబెంచక నిర్వహించితివి న ♦ వ్యాంధ్రవాచస్పతీ !

కం. ఊహింపరానిపద సం
దోహంబెటు సంగ్రహింప ♦ దొరకునదిరో నీ
సాహిత్య సరస్వతి నీ
సాహితియటుగాక వేరు ♦ చందముగలదే.

చంపకమాలిక.

అనఘులు సత్ప్రభాంతరము ♦ లందు గడుంగడు సన్నుతింపఁగా
ననుపమకీర్తి సంస్కృత స ♦ మాంధ్రపదంబులు గ్రామ్యదేశసం
జనితములాంగ్లకృట్విక ♦ చక్కఁగఁ జొక్కడఁ గూర్చి శేముషీ
వనధివనంగ నొప్పితివి ♦ వాక్పతిపాటున పూర్వకర్తలీ
తనివి దొలంగఁ జాలిరె ప ♦ దంబులఁ గూర్చి నిన్ను బోలెఁగా
వ్యనిధి భవద్యశంబులకు ♦ ధంతములన్ దిగన్తమై ప్రదీప్తమై
దనరదె యాంధ్రవాఙ్మయ సు ♦ ధానిధి జ్ఞానగుణాకరా లస
ద్ఘన బిరుదాంక నీదగు ని ♦ ఘంటువు భూస్థలినద్వితీయమై
జనహితమై పరాత్పరుని ♦ సత్కృపసర్వము శీఘ్రగామియై
దినదినవృద్ధి పొల్పడుత ♦ ధీనుత శ్యామల కామశాస్త్రిచే
జనపమతైన వింతరథి ♦ పంబునఁ గూర్చి ముద్రణంబుతో
ననువుగ గల్గనీవు మహి ♦ మాతిశయంబది యొట్టిదోకదా
గ్వనితకుఁ గద్వదీశ బుధ ♦ వర్గముతోఁ దులఁదూగిరెల్లరున్.

## బ్రహ్మశ్రీ విద్వాన్ తూశా విశ్వనాథశాస్త్రిగారు: తెలుఁగు పండితులు పచ్చయప్ప కాలేజీ, మింటుస్ట్రీటు, మదరాసు.

విపశ్చిద్వరేణ్యా !

“యదిపంతిగుణా శ్లాఘ్యాః, వికసంత్యేవ తే స్వయమ్” న్న విధమునఁదను 'యాంధ్రవాచస్పత్యము'ను గుఱించి యితరులు అభిప్రాయముల నియ్యవలసిన ప్రసక్తియుండదని మదీయాశయము. వెండియు “నరత్నమన్విష్యతి మృగ్యతేహితత్” అనునట్లు మే 'మెల్లరము దానికై వెదకుచున్నవారలమే.

మహాశయా! ఇక్కాలమున భాషాసేవకులమని వాగాడంబరములఁ బ్రకటించుకొనువారి కంటెఁ దమయుద్యమమెన్నియో మడుంగులు విద్వజ్జనశ్లాఘాపాత్రమై వెలయుచున్నది. వేయేల! మీవాచస్పత్యము మీభాషాసేవను, పారమార్థికబుద్ధిని, తమ యశేషగ్రంథపరిచితిని వేనోళ్లఁ జాటుచున్నది. వేదములఁబోలెఁ దమ నిఘంటురాజము సయుతము పూజ్యమై యాంధ్రులపాలిటి కల్పతరువై తమ కఖండయశము సార్థించి యిచ్చుఁగాత! యని యాశించుచున్నాను. తమరు ధన్యులరు. చిత్తగింపఁ బ్రార్థితులు. ఇవియే పెక్కునతులు.

శ్రీ

బ్ర॥ కన్నేపల్లి మార్కండేయ శర్మగారు,
లఖందిడ్డి, కోటబొమ్మాళిపోష్టు, గంజాంజిల్లా.

ఆర్యా!

మీనిఘంటువు పూర్వము వెలువడిన నిఘంటువులకంటె పర్యాయపదములు, వ్యతిరేకపదములు, అన్యభాషాపదములు చూపుట చాల యుపయుక్తకరముగనున్నది.

మీరు ఆంధ్రవిజ్ఞాన సర్వస్వముపయోగించుచున్నట్లు కనఁబడదు. దానిలో కొన్ని యుపయుక్తములైన పదములు నాకు మీనిఘంటువునఁ గనఁబడలేదు. అట్టివి మీరు వీలైనన్ని వాడుకకు తెత్తురుగాకయని నాకోరిక. ఒకొక్కమాట ఏయేభాషలనుండి ఎట్లుమార్పుచెంది ప్రస్తుత రూపముదాల్చినదో చూపుట చాల యుపయోగకరము. అది చాల కష్టమేయగును. పూర్వులెవ్వరును నిట్టిది పూనుకొనకపోవుటచే మరింతభారము మీపైఁబడినది. మీరు విశేషప్రయాసకు లోనై నిఘంటువును ప్రచురించుట మిగుల ప్రశంసనీయము.

---

సోదరకవులు:—ఉభయభాషాప్రవీణ బూరుగుల సత్యనారాయణశాస్త్రిగారు,
బూరుగుల సూర్యనారాయణమూర్తిగారు.
అమృతలూరు, తెనాలితాలూకా.

తమరు దయతోఁ బంపిన "ఆంధ్రవాచస్పత్యము" భాగములనందుకొంటిమి. కడుంగడు సంతసించితిమి.

నానాటికి నూత్నశోభను గైసేసికొనుచున్న యాంధ్రభాషా యోషామధురాకృతిఁ గాంచ గలుగుటకున్న యసమానాదర్శంబు నిఘంటువేయనుట నిక్కువము. సూక్ష్మదర్శినీ యంత్రముభంగి నిఘంటువు భాషాసర్వస్వమును తద్రహస్యములను అంది పుచ్చుకొనునట్లు చేయఁగలయును.

విపులమై, పదార్థబోధనాసౌలభ్యసంపాదకమై యొప్పుచున్న మీ "యాంధ్రవాచస్పత్యము" తెలుఁగుల తపఃఫలమనవచ్చును. పారిభాషిక పదములచేతను, నానార్థపర్యాయపదములచేతను, అన్యదేశ్యములచేతను నూత్నపరిశోధనా విషయములచేతను సాంఘిక (Social) రాజకీయ (Political), ఆర్థిక (Economical), సైద్ధాంతిక (Philosophical) పదబాహుళ్యముచేతను, మీ "ఆంధ్రవాచస్పత్యము" తనకుఁదానై యొకవిధమున నవనవోన్మేషమును సంపాదించుకొని ప్రకాశించుచున్నదనుట నిశ్చయము. ఆంధ్రవిజ్ఞాన సర్వస్వమువలె నతిదీర్ఘము గాక, శబ్దరత్నాకరాదులకంటె మిన్నయై, పరిపుష్టిఁ గాంచి యియ్యది సర్వజనాదరణపాత్రమై యొప్పుచున్నది.

తమ యాంధ్రవాచస్పత్యము ప్రతియాంధ్రుని హస్తమును అలంకరించుచుఁగాత! ఇతోధికముగ మీయత్నములు పల్లవించి, కుసుమించి, ఫలించును గావుత!

## మ॥ మల్లెల శ్రీరామమూర్తిగారు, బెజవాడ.

మహాశయా, కృతానేక సాష్టాంగ నమస్కారములు.—

తమ విరచితంబైన "ఆంధ్రవాచస్పత్యము" ౬ భాగములు చేరినవి. ఆంధ్రభాషా విషయమైన తమ యీ కార్యదీక్ష అత్యంతశ్లాఘనీయముగ నున్నది. ఎంతయో ధనసహాయమున్నఁగాని చేయఁజాలని మహాత్కార్యమును తమరు చులకనగా, స్వతంత్రముగా, శ్రాంతితో చేయఁ గలుగుచున్నందులకు తమరినభినందించుట భాషాప్రియుల విధియని నాయభిప్రాయము. ఎన్నడో ప్రారంభించిన "శ్రీసూర్యరాయాంధ్ర నిఘంటువు" ఏ పరిస్థితులలోనున్నదో ఎప్పటికి ఆంధ్రుల హస్తముల నలంకరించుటనో యని చింతించుసమయమున తమనిఘంటువు బయలువడి ఆంధ్రులకు ముదముచేకూర్చినది తమ యాంధ్రవాచస్పత్యము అనేకపదములతో, నూతనవాక్యములతో నిండి ఆంధ్రభాషకు కల్పవృక్షమువలె నున్నది. ఈగ్రంథము శాశ్వతమై, తదితరనిఘంటువులకెల్ల నాయకమణియై, ఆంధ్రనిఘంటురాజమై పూజింపఁబడుననుటకు సందియములేదు. తెలుఁగుభాషలో సమగ్రమగు నిఘంటువులేని కొఱతను నూతనపద్ధతులతో తమరు తీర్చినందుకు ఆంధ్రలోకము తమకు ఋణపడియున్నది. ప్రఖ్యాతిఁగాంచిన అనేకమంది గీర్వాణాంధ్రాంగ్ల భాషావిశారదులు, పండితోత్తములు తమ ఉద్యోగమును తమపాండిత్య పరీక్షణాదులను గొప్పగ శ్లాఘించి, సంతోషించి, తమకు చేయూఁతనిచ్చుచుండుటను బట్టియే తమ నిఘంటుప్రాశస్త్యము వేనోళ్ళ చాటుచున్నది. ఇయ్యది మహాపవిత్రవంతమగు శాశ్వతమైనకార్యము. తమకు శాశ్వతకీర్తిని కలుఁగఁజేయనున్నది. తమ మాతృభాషాభిమానము వర్ణనాతీతము.

ఈగ్రంథము పరిసమాప్తమగువఱకు ఎట్టివిఘ్నములును రాకుండుటకై శ్రీకృష్ణభగవానుని ప్రార్థించుచున్నాను.

అచిరకాలమున ఈ గ్రంథరాజము పరిసమాప్తమై, ఆంధ్రదేశీయుల హస్తముల నలంకరించి తమనామము తెలుఁగుదేశమున ఆచంద్రార్కము యింటింట కీర్తింపఁబడవలెనని కోరుచున్నాను.

## ఉభయభాషాప్రవీణ. బ్ర॥శ్రీ ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రిగారు. N.H స్కూలు, తెలుఁగు పండితులు, రామచంద్రపురము.

మహాశయా! వందనములు.

నేను విజయనగరం మహారాజావారి సంస్కృతకాలేజీలోనున్న 'వాచస్పత్యము' అను నొక మహోదధివంటి నిఘంటువును తఱచుచూచుట తటస్థించెడిది అప్పుడు మన తెనుఁగుభాషకిట్టి మహోపకారముచేయు మహితానుభావు లాంధ్రావనిపై పుట్టరేదా! అనే దైన్యభావము కలిగెడి. నాఁటికి నేఁడు తమ మహాప్రయత్నము, మాతృభాషాదరముఁజూచి గాఢమగునిట్టూర్పు పుచ్చితిని. తెలుఁగు తల్లియదృష్టము పండినదని హృదయపూర్వకమగు మనవి.

---

## ఉభయభాషాప్రవీణ ఫైనల్, ఓరుగంటి వేంకటనరసింహముగారు, పెదనందిపల్లి అగ్రహారము.

ఆంధ్రవాచస్పత్యముపై నిటీవల "ప్రబుద్ధాంధ్ర" యను పత్రికయందు శ్రీ గన్నవరపు సుబ్బరామయ్యగారు, శ్రీ విద్వాన్ టి. అరుణ్గం పిళ్ళెగారు ప్రకటించిన విమర్శనము. "ప్రాథమికవిద్య" యను పత్రికయందు శ్రీ [illegible]

ప్రతి విమర్శనమును చదివితిని. మొదటివిమర్శన మెంతమాత్రమును సహేతుకముకలదిగాలేదు. నిందార్థాయుక్తమగు వాక్యములతో నిండియున్నది. వారిసాహసమట్టుండనిండు. ప్రతివిమర్శనమునుబట్టి యాంధ్రవాచస్పత్యము నందినుమంతయు దోషములేదని స్పష్టపడుచున్నది. మఱియు ప్రతి విమర్శకులుఁగూడ 'కుంతల' మను పదములో 'ల' అచ్చుతప్పని పొరపడిరి. అది అచ్చుతప్పుకాదు. [ఈఁటియ......కుంతలమను నాయుధము] (కుంతలము క్రొత్తఆయుధము కాఁబోలును!) అని మొదటి విమర్శకుల వ్రాఁత; ప్రతి విమర్శకులు 'ల' అచ్చుతప్పనిరి. ఇది ప్రతివిమర్శకుల పొరపాటు. దీని విషయమై శబ్దార్థకల్పతరువులో నిట్లున్నది. "కుంతలః అదంతః పుంసి...... ॥కేశే॥ తలవెండ్రుకలు॥ ...... ॥పుంసి॥ దేశభేదే ॥ కుంతలదేశము॥ పుంసి॥ జనే॥ వేగము॥ లాంగలే॥ నాఁగలి॥......॥పుంసి॥ సర్పః॥ పాము॥ ఆయుధభేదే॥ కుంతాయుధము" అని కలదు. మఱియు విమర్శకులు 'తప్పులసాఁతఱ' యని ప్రకటించిన సర్వశబ్దసంబోధిని యందు గల 'కుంతల' మనుపదమెట్లున్నదో కనుఁడు. "కుంతలః. ౧. పుం. కేశః, ౨. దేశవిశేషః, ౩. జనః, ౪ లాంగలమ్, ౫. సర్పః, ౬. ఆయుధవిశేషః" అని కలదు. దీనింబట్టి యిది అచ్చుతప్పుకాదని తేలుచున్నది. పలశబ్దమును పలలశబ్దమునుఁ గూడ నొకయర్థమునసే యున్నట్లు కుంతలశబ్దమును కుంతశబ్దమునుగూడ నొకయర్థమునసే అనఁగా నాయుధవిశేషమను నర్థమునసే కలవు.

శ్రీ కామశాస్త్రిగారు ప్రమాణములేకుండ నేదియును వ్రాయలేదు. శ్రీశాస్త్రిగారు కుత్సితబుద్ధిగల విమర్శకుల వ్రాఁతలంబాటింపక తమయుద్యమమును వేయి మడుంగులు పెంపొందించి కీర్తిముద్రితులుఁగావింతురుఁగాక! కుత్సితవిమర్శనములను లోకముపాటింపకుందురుఁగాక! శ్రీ శాస్త్రిగారికి పరమేశ్వరుఁడు! తోడ్పడుఁగాక!!!

---

Vidwan Ganti Venkatarao.

"Repalle"
38, Royapettah High Road
Mylapore, Madras.
8—8—1935

మహాశయా, కృతానేకసాష్టాంగ నమస్కారములు.

మీనిఘంటు పద్ధతిఁజూచి యమందానందకందళిత హృదయార విందుండనైతిని. విపులమై పారిభాషిక పదయుక్తమై, నానార్థపర్యాయపదభూయిష్ఠమై, అన్యదేశ్యపదాలంకృతమై,నూత్న పరిశోధనా విషయంబులచేతను, ఆర్థిక, రాజకీయ, సాంఘికీయాది పదబాహుళ్యముచేఁ బెన్నొప్పు మీ నిఘంటురాజ మమర్త్యకీర్తిఁబడయుట నిస్సంశయము.

ఇట్టి యుద్గ్రంథమునకుఁ గళంక మాపాదించుటకు కొందరల్పజ్ఞులు, కేయు వ్యాఖ్యానము లనుగూడఁ జూచు భాగ్యము నాకు కలిగినది. ఆవ్యాఖ్యానముఁజూచి నంతనేమహాత్ముఁడగు భర్తృహరివిడిన—

"శ్లో॥ అల్పమృఖయారాధ్యః సుఖతర మారాధ్యతే విశేషజ్ఞః
జ్ఞానలవ దుర్విదగ్ధం బ్రహ్మాపినరంనరంజయతి."

యను శ్లోకము జ్ఞప్తికి వచ్చెను.

తమ మాతృభాషాభిమానము వర్ణనాతీతము; శ్రీ పరమేశ్వరుని కృపవలన మీనిఘంటువు అచిరకాలమున పరిపూర్ణమై, ఆంధ్రుల హస్తముల నలంకరించి అచంద్రార్కము కీర్తియఁ

ఆంధ్రవిద్యా వాచస్పతీత్యాది బిరుదాంకితులగు బ్రహ్మశ్రీ
కొట్ర శ్యామలకామశాస్త్రులవారికి.

ఆర్యవటము శ్రీసదౌషధ ప్రదర్శనీ ఆయుర్వేద వైద్యశాలాధ్యక్షుఁడు
ఆయుర్వేద వైద్యనిపుణుఁడు మర్ల బుచ్చివేంకటశాస్త్రి మనవి—

ఆర్యా, తమరు ౨౫ వత్సరములు పాఠశాలోపాధ్యాయులుగనుండి శిష్య పరీక్షలయందారితేరి "లక్ష్మీనారాయణీయము"ను అచ్చతెనుఁగు నిఘంటువును ఆమూలాగ్రము సమగ్రముగ మీతండ్రిగారి యాజ్ఞానుసారము వ్రాసినవారై కీర్తిని ఆంధ్రమండలమంతటను వెదజల్లియుండిరి. కావుననే "ఆంధ్రవాచస్పత్యము" వ్రాయుటయనిన కొట్టిన పిండియయ్యె.

లోకహితార్థము సుప్రసిద్ధములగు అనేక నిఘంటురాజములను, ప్రబంధాదులను, ప్రకృతి శాస్త్రాదులను సంగ్రహించి పర్యాయపదజాలంబుల నంచిధారణాశక్తితో గ్రహించి అకారాదిగ గుంపుగుంపులుగ నేకముఖముచేసి సంస్కరణఁగావించి ముద్రింపించుచున్న "ఆంధ్రవాచస్పత్యము"ను నిరుపమాననిర్దోష నిఘంటురాజములోని అంశ, అపరాజితమున్నగు కొన్ని పదార్థములు వ్యర్థములనియును, కొన్నిపదములు దోషార్థములనియును గ్రంథసాక్ష్యములేక పాడిమాటలచే అల్పవిమర్శకజ్ఞానముతో "ప్రబుద్ధాంధ్ర" పత్రికలో నొక విమర్శనము పడినది. అది లోకసామాన్యమే.

ఏమన.— అధ్యాత్మములో రామహృదయమున "చలద్దృష్టికిఁ జూడ ననిశపట్లు భ్రాంతమైనట్లు" అనియున్నది. అనఁగా తననేత్రములు తిరుగఁగా ప్రపంచము తిరుగుచున్నట్లు, కనిపించుటస్వభావము. మఱియు పంచమవేదమగు భారతమునకొన్ని తప్పులున్నట్లు, తమ యవివేకబుద్ధికిఁ దోఁచి దిద్దనుద్యమింప దండిమొదలగుకవులకు పక్షిరూపమున వ్యాసమహర్షి సవ్యాకరణముగాలు చదివి దిద్దమని బుద్ధిచెప్పినట్లు విమర్శకుల అసహనదోషమని యుపేక్షింపక పిచ్చుకమీఁద చంద్రాయుధ ప్రయోగమువలెనో, చిన్నపాముపైన పెద్దకఱ్ఱతో చంపవలెననియో, విమర్శకులవ్రాఁత న్యాయముకాకున్నను నిఘంటుకర్తను నిరసించి, పండితులను తిరస్కరించి, ప్రమాణగ్రంథముల నప్రమాణగ్రంథములని సందేహింపక పట్టి దురాలాపములను యంత యవివేకులైన పలుకుటకు సిద్ధపడుదురాయను లోకసామాన్యుల సంశయచ్ఛేదమునకై అల్పవిమర్శకుల విమర్శనమునకు ప్రతివిమర్శనము సవిమర్శనముతో ఉదాహరణములతో బ్రహ్మశ్రీ నూకల సూర్యనారాయణ శాస్త్రులవారు వ్రాసిరి. దానిని 'ప్రాథమికవిద్య' అను పత్రికారాజమున సాంతముగఁ జదివితిని. అమూల్యమగు నిట్టి ప్రతివిమర్శనము అల్పవిమర్శక సంఘమువారికి నుపయోగింపకపోయినను, ముందెవ్వరికిని నిట్టి యసందర్భపు విమర్శనములను వ్రాయసాహసింపఁజేయకుండునని నూహించెద. ఈప్రతివిమర్శనము నిజముగా "చిక్కులగుఱ్ఱమునకు కక్కుల కళ్లెమే." తమరీ యల్పవిమర్శక సంఘమువారి యజ్ఞానజనితములగు విమర్శనములను సరకుఁగొనక మీధైర్యసాహసముల నిముడింపఁజేసి అచిరకాలములో "ఆంధ్రవాచస్పత్యము"ను పూర్తిఁజేయుదురుఁగాక. సర్వేశ్వరుఁడు సదా తోడ్పడుఁగాక. సరస్వతీదేవి మీకోర్కెలను సఫలముఁజేయుఁగాక. మీకు పరమేశ్వరుఁడాయురారోగ్య భోగభాగ్యాదులొసంగి రక్షించుఁగాక!

మంగళం మహత్.

## విజయనగరము మహారాజావారి సంస్కృతకాలేజీ పండితులు,
## శ్రీ ఆకెళ్ళ అరుణాచల శాస్త్రిగారు.

"శ్యామల కామశాస్త్రీయము—ఆంధ్రవాచస్పత్యము" అను నిఘంటురాజము ఆంధ్ర గీర్వాణభాషలం బరిజ్ఞానము సంపాదింపఁదలఁచిన వారలకెంతయు నుపయోగకరమైనదని విద్వత్కవి పాతబుద్ధులగు వారలకెల్లరకును సువిదితము. ఈనిఘంటువును ముద్రించునపుడు మొదటి రెండు కటకాండము సంధికలలో నచ్చటచ్చట నొకటిరెండు ప్రమాదములు పడినవి. అవి యేమియైన గావచ్చును. ఇంతటి మహత్తరకార్యమునకుఁ బూనుకొని అసహాయులై శ్రీ కామశాస్త్రిగారు కావించుచున్న మహోపకారము ప్రశంసనీయమగును. కాని, యెవ్వరియొ కొకములసేరి లోకమున కనుటనుంచి 'గోరంతలు కొండంతలు' చేసి చెప్పుట భాషాభిమానులగు వారి కెంతమాత్రమును దగనిపని. అట్టివారి కుత్సితవచనములను వినక శ్రీ కొట్ర శ్యామలకామశాస్త్రిగారత్యంతోత్సాహముతో తమ యుద్యమమును కొనసాగింతురుఁగాక! భగవానుఁడు రక్షించుఁగాక యని కోరుచున్నాఁడను.

---

## శ్రీ దువ్వూరి జగన్నాథశర్మగారు, గంధర్వమహల్, విజయనగరము.

ఆర్య! నమస్తే! తమచే రచింపఁబడు "వాచస్పత్యము"ను శ్రద్ధతో నవలోకించితి నమందానందమందితి.

వారికొరికావలె కుటుంబములోని భవజ్జనకులు ఆంధ్రలోకము కొఱకు తమలో ఇట్టి పనికి వలసిన పాండిత్యమును, ఓర్మిని పునాదిపఱచియుంచిరి. ఇట్టియెడ మీసోఁతసంద్ర మీఁదుకొని వచ్చినవాని కెంపువంటిదియై ఆశ్చర్యముగొల్పినది. పర్యాయపదములన్నిటిని నిఘంటువునందొక్క శీర్షికలో నవసరమునకందిచ్చు గుదికూర్పునకు మీతండ్రిగారును, పిమ్మట తామును ఆంధ్రారణ్యమున ఏనుఁగు నడకనడచి అడ్డంకులను పెకలించివిశాలమగు బాటనేర్పఱచిరిందులకువంద్యులుకారే!

భళీ! ఇదివఱకుఁ బ్రకటితములైన నిఘంటువులకేకాక శ్రీసూర్యరాయ—వావిళ్ళాది రాఁగల నిఘంటువులకుఁగూడ పర్యాయపదసూచీకరణమున్నదైతే తమ నిఘంటువు మాతృస్థానము కాఁగలదని నానమ్మకము. తొలుతఁ బుట్టిన నిఘంటువులకును ఉత్తరతః పుట్టిన నిఘంటువులకును మధ్య నుదయించిన మా "వాచస్పత్యము" మాతృస్థానమెట్లు కాఁగలదని సంశయింపనేల! బుద్ధివైభవమున కందరానిది కాని, క్రమభంగమునది కాని కలదా! అనన్యసామాన్యమైన మాతృస్థానము నిరూపించునేర్పు కలిగినప్పుడే-ఔ-వాచస్పత్య కామశాస్త్రియాదుల ప్రతిభ. నేను తమపనికి ఎంతయొ సంతసించినాను. ఈదిశలో ఇందులకు నావలనైన నెట్టిచేయూఁతకైన నేనున్నాను. తమకార్యము నిర్విఘ్నముగ జరుగఁగలదు.

---

## కళ్ళా అచ్యుతరామశర్మగారు, విజయనగరము, సంస్కృతకళాశాల.

ఆంధ్రభాషార్ణవాది నిఘంటువులనుగాలించి నిర్దుష్టముగను, నిష్కళంకముగను విరచింపఁబడిన "ఆంధ్రవాచస్పత్యము"న నెఱసులున్నవనియు నిఘంటురాజమునెల్ల తప్పులపాఁతఱలనియు ననిన విమర్శకుల విమర్శనముఁ జూడ గ్రంథముల తిన్నఁగఁ జూచుకొనక చేసిన కుటిలవిమర్శనమని తేటతెల్లమగుచున్నది. "శ్రేయాంసి బహువిఘ్నాని." అనునటుల శ్రేయోదాయకములగు పనులకు బహువిఘ్నములు కల్పించుచున్నను వానిని కన్నెత్తి చూడక నిర్లక్ష్యముగ నీనిఘంటురాజమును త్వరలో ముద్రించి యాంధ్రలోకమున కొసఁగి యాంధ్రభాషాయోషామణి యాశీస్సుల నందఁగోరుచున్నాఁడను.

# పదముల పట్టిక.

| అక్షరము | శబ్దరత్నాకరము 5873 | | ఆంధ్రవాచస్పత్యము 12309 | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | సంస్కృత పదములు | తెనుఁగు పదములు | సంస్కృత పదములు | తెనుఁగు పదములు | అంకములు | పారిభాషికములు | జాతీయములు | శాసనపదములు | ఆంగ్లపరిభాషాపదములు | వాడుక పదములు | లోకోక్తులు |
| అ | 1521 | 855 | 2800 | 1223 | 254 | 638 | 8 | — | 47 | 20 | 14 |
| ఆ | 626 | 260 | 1062 | 475 | 69 | 259 | 5 | 3 | 23 | 18 | 8 |
| ఇ | 61 | 261 | 182 | 432 | 14 | 48 | 2 | 19 | 27 | 3 | 9 |
| ఈ | 29 | 119 | 56 | 183 | 6 | 3 | 2 | 0 | 0 | 0 | 2 |
| ఉ | 619 | 273 | 933 | 400 | 74 | 137 | 8 | 24 | 1 | 8 | 2 |
| ఊ | 36 | 102 | 83 | 132 | 3 | 22 | — | — | — | 1 | — |
| ఋ | 29 | — | 65 | — | — | — | — | — | — | — | — |
| ౠ | — | — | 1 | — | — | — | — | — | — | — | — |
| ఌ | — | — | 1 | — | — | — | — | — | — | — | — |
| ౡ | — | — | 1 | — | — | — | — | — | — | — | — |
| ఎ | — | 353 | — | 645 | 3 | 32 | 6 | 5 | 112 | 7 | 6 |
| ఏ | 44 | 160 | 142 | 218 | 14 | 63 | 3 | 2 | 29 | 3 | 3 |
| ఐ | 20 | 20 | 41 | 27 | 9 | 5 | 1 | 3 | 7 | 0 | 0 |
| ఒ | — | 308 | — | 445 | 3 | 15 | 5 | 8 | 5 | 8 | 5 |
| ఓ | 15 | 110 | 49 | 150 | — | 11 | — | 3 | 20 | — | — |
| ఔ | 34 | 18 | 66 | 15 | 2 | 5 | — | — | 7 | 1 | — |
| | 3034 | 2839 | 5482 | 4445 | 451 | 1433 | 40 | 67 | 278 | 84 | 49 |

# పీఠిక.

## శ్రీమత్పరదేవతాయైనమః.

మానవాభివృద్ధికి సమకాలకోశకలితత్వ మెట్లు ముఖ్యమో యట్లే సారస్వతాభివృద్ధికి సమకాలకోశకలితత్వము ప్రధానము. కవికిఁ గోశమే కల్పతరువు. పండితునకుఁ గోశమే భర్మాగారము.

ఎక్కాలకుఁ దగినకోశములు లేకున్న సారస్వతాభివృద్ధియే యుండనేరదు. హెచ్చుగు సారస్వతాభివృద్ధిగల తావులందు కోశసమృద్ధి హెచ్చుగాఁగలదు. కాని మన యాంధ్రసారస్వతవిషయమున మాత్ర మట్టిది తగు సమృద్ధిలో లేదు. ఇటుఁ గోశమన నిఘంటువని నాతాత్పర్యము.

ఇప్పటికి మన కాధారభూతములుగనున్న నిఘంటువులు మూఁడువిధములుగ నున్నవి. మొదటివిధము:—పర్యాయపదములఁ దెలుపుపద్యరూపనిఘంటువులు—అమరము, ఆంధ్రభాషార్ణవము మున్నగునవి. ఇయ్యవి యొక్కొక్కశబ్దమునకెన్నెన్ని పర్యాయపదములు కలవో సులభముగఁ దెలుపఁగలవు. కాని శబ్దార్థముల నన్నిటిని నొసంగలేవు. అంతియగాక యిందున్న శబ్దజాలమును కోశబద్ధముగలిగియుండునుగాని పరిపూర్ణస్థితియం దుండఁజాలదు. ఏదేనిశబ్దముంగూర్చి తెలిసికొనఁదలఁచినవానికి నాశబ్ద మానిఘంటువుల లభించుట యది దుర్ఘటమే. కావున నీవిధమగు నిఘంటువుల వలని లాభము భాషాజ్ఞానము సంపాదించుకొను వారి కంతగా నుండనేరదు.

రెండవవిధము:— నానార్థనిఘంటువులు. ఇవి కేవల శ్లోకములని ఇయ్యవియును పైరీతి లోపములు కలవియే.

మూఁడవవిధము:— అకారాదిశబ్దములు కలిగియుండు పెద్దనిఘంటువులు— సర్వశబ్దసంబోధిని శబ్దరత్నాకరము లోనగునవి. ఇయ్యవి పదమును సులభముగఁ జూచుకొనుటకుఁదగు నవకాశమును గలిగియున్నవి. నానార్థములనుగూడ నిచ్చుచున్నవి. కాని పర్యాయపదముల నొసంగవు. కాఁబట్టి యీప్రయోజనమును గొంతవఱకు సంకుచితముచేయుచున్నది. ప్రస్తుతమున్న పైరీతి నిఘంటుజాల మెంతయున్నను కవులకును బండితులకును గలుగు వాంఛను బూర్తిఁ దీర్పలేకున్నవి.

ఆహేతువుచే నాలోపము దీర్ప నిఘంటువును విరచించి లోకోపకారమొనర్ప ఆంధ్రవిద్యావాచస్పతి, కావ్యనిధి, జ్ఞానగుణాకర, సాహిత్యసరస్వతి, ఆంధ్రవాఙ్మయపయోదధి బ్రహ్మశ్రీ కొట్ర శ్యామలకామశాస్త్రులవారాంధ్రులధన్యులఁ గావింప నీ 'యాంధ్రవాచస్పత్యము' ను నిఘంటు రాజమును బహుకాలము బహుప్రయాసపడి విరచించిరి. ఇందు నొక్కొక్కశబ్దముంగూర్చి యెన్నెన్ని విశేషములు తెలిసికొనవలసియుండునో వని యన్నియుఁ గరతలామలకముగ నొసంగఁబడియున్నవి. ఇది యాంధ్రసారస్వతమునకుఁ గలిగిన గొప్పలాభము. ఇందున్న విశేషము మితరనిఘంటువులు దేనియందునులేవు. ఇదివఱకట్టి నిఘంటువు పుట్టియుండలేదు. పుట్టుయును నుండలేదు. ఇందనంతములగు సంస్కృతశబ్దజాలమును నపారములగు నాంధ్రశబ్దజాలమును గూడఁ బూర్తిఁగలవు. అయ్యవి యకారాదిక నుండుటచేఁ జూచుకొనువారికిఁ జాల యనుకూలముగ నుండును. ఒక్కొక్కశబ్దమున

కొన్నిన్ని యర్థములుగలవో నవియన్నియు నిండియుఁ బడియున్నవి. అంతియెగాక యొక్కొక్కపదమునకు కొన్నిన్ని పర్యాయపదము లుభయభాషల యందును గలవో యవియన్నియునుగూడ నొసంగఁబడియున్నవి. ప్రతిపదమునకుఁ బర్యాయపదములఁబెట్టిన నంతను నిచ్చుచువచ్చిన నిఘంటువు కతివిపులమై పెరుగుటకైన నలవిగాకుండును. కావున నాలోపమును నివారించుటకై పర్యాయపదజాలము నేదో యొకప్రధానపదముకడ నిచ్చి తక్కిన పదములకడ దీని పర్యాయముల నాపదము కడఁ జూడు గొనవలసినదని తెలుపఁబడి యుండును. ఎట్లన:—"అంగము" అను పదము తీసికొనుఁడు. దానినిగూర్చి యీనిఘంటువులో నిట్లు వ్రాయఁబడియున్నది.

అంగము. సం. వి. అ. న. 1. అవయవము: చూ, విశేషము. 3; 2. అనువు: చూ, ఉపాయము; 3. ఒడలు: చూ, శరీరము; 4. అప్రాగ్ర్యము: చూ, అప్రధానము; 5. అంగదేశము: చూ, దేశము; న. 6. మత్పుంజ్ఞ: చూ, అఱు. 1; విణ. 7. అవయవములుగలది. అంగి, అవయవి; 8. సమీపించినది: చూ, సమీపము. 2; తద్వి.—అం 9. సేనాంగములు.—రథము, గజము, తురగము, పదాతి. (4); పంచాంగములు.—తిథి, వారము, నక్షత్రము, యోగము, కరణము (5); శరీరాంగములు.—కరములు రెండు, చరణములు రెండు, ఉరము, లలాటము, భుజములు రెండు. (5); కన్యాదానాంగములు.—వాగ్దానము, ఫలదానము, కన్యాసంవరణము, కన్యాదానము, నిరీక్షణము. (5); వేదాంగములు.—శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము. (6); వేదోపాంగములు.—మీమాంసము, న్యాయశాస్త్రము, పురాణము, ధర్మశాస్త్రము. (4); రాజ్యాంగములు.—స్వామి, అమాత్యులు, సుహృదులు, కోశము, రాష్ట్రము, దుర్గము, బలము. (7); సభాసప్తాంగములు.—విద్వాంసులు, కవీశ్వరులు, భట్రాజులు, గాయకులు, పరిహాసకులు, ఇతిహాసకులు పౌరాణికులు. (7); యోగాంగములు.—యమము నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధ్యానము, ధారణ, సమాధి. (8); యోగయమాంగములు.— సత్యము, దయ, క్షమ, ధృతి మితాహారము, ఆర్జవము, బ్రహ్మచర్యము, అస్తేయము, అహింస, శౌచము. (10); నాట్యోపయోగాంగములు.— శిరస్సు, దృష్టి, తారలు, పుటలు, భ్రువులు, నాసికము, గండములు, అధరము, చిబుకము, ముఖము, కంఠము, హస్తములు, వక్షము, జఠరము, పార్శ్వములు, కటి, ఊరులు, జంఘలు, చరణములు. (19); రాగాంగములు.—మధ్యమాది, మాళవశ్రీ, తోడి, బంగాళము, భైరవము, వరాటి, ఘూర్జరి, గౌడము, కోలాహలము, వసంతకము, ధన్యాసి, దేశి, దేశము. (13); రాగోపాంగములు —ద్రావిడి, ఘూర్జటి, వరాటి, మలహరి. (4), వరాట్యుపాంగములు.—కాంతీవరాటి, ద్రావిడవరాటి, సైంధవవరాటి, ఉపస్థానవరాటి, హతస్వరవరాటి, ప్రతాపవరాటి (6); తుండ్యుపాంగములు.—ఛాయాతుండి, కుసుమతుండి. (2); ఘూర్జర్యుపాంగములు.—మహారాష్ట్రఘూర్జరి, సౌరాష్ట్రి, దక్షిణ, ద్రావిడ. (4); వేళావళ్యుపాంగములు.—చుంబి, ఛాయ, కాంత ప్రతాపము. (4); క్రియాంగములు.—భావక్రియ, స్వభావక్రియ, శివక్రియ, మకరక్రియ, త్రినేత్రక్రియ, కుముదక్రియ, హాసక్రియ, టుమిక్రియ, ఇంద్రక్రియ, నాగకృతి, ధాన్యకృతి, విజయక్రియ. (12); దే. వి. (1) రీతి, చందము. "ఉ. అంగము సొంపుగా వసిఁడి యంగము క్రొన్నెలవంక నెన్నుదల్." దశ. 1, ఆ. 40: చూ, విధము. 1; (2) అందము, సొగసు: చూ, సౌందర్యము.

ఈపదము సంస్కృతమునను తెనుఁగునను

గూడఁ గలదు. కాన సంస్కృతమునందెన్ని యర్థములున్నవో యవియన్నియును 'సం' అను సంజ్ఞక్రిందను. విస్పష్టముఁ దెలుఁగునందెన్ని యర్థములున్నవో యవి యన్నియునుగూడ 'తె' అను సంజ్ఞక్రిందను సంపూర్ణముగ నొసంగఁబడినవి. మఱియును నానాపదముల పర్యాయములఁ దెలిసికొనుటకై యెక్కడఁ జూడవలెనో యవియునుగూడఁ దెలుపఁబడియున్నవి.

ఎట్లన:—అంగము. సం. వి. అ. పుం. 1 అవయవము: చూ, విశేషము. ౪; దీనింబట్టి "అంగము" అను శబ్దమునకు మొదటియర్థము అవయవమనియు, నీయవయవపర్యాయపదములు విశేషము అనుపదముక్రింద మూఁడవయర్థములో చూచుకొనవలెననియు తేలుచున్నది. తక్కినవన్నియు నిట్లే చూచుకొనవలెను

ఇతర నిఘంటువులందలి సంకేతాక్షరముల చూచుకొనుచున్నట్లే యుండును. సంకేతాక్షరముల పట్టికను చూచుకొనవలెను. కావున పదముయొక్క నానార్థములును బర్యాయపదములును సులభముగాఁ జూచుకొనుటకుఁ దగినయవకాశము చక్కఁగ నొసంగఁబడినది. కాన నీనిఘంటువుయొక్క లాభ మపారమని వేఱుగఁ జెప్పనక్కఱలేదు గదా! మఱియును బ్రతిశబ్దముయొక్కయు నానార్థములను బర్యాయపదములను నీయది సులభముగఁ దెలుపుచుండుటయే గాక నిర్దిష్టపద మొక గణములోఁ జేరినదగునెడల నాగణముకూడ పూర్తిగ నాపదముక్రింద నొసంగఁబడియుండును.

ఎట్లన:—"అంగము" అను శబ్దము బహువిధగణములలోఁ జేరినదై యున్నది. కాఁబట్టి యాగణవివరణమంతయుఁ బైపదముక్రింద నొసంగఁబడియున్నది. ఇంకను నిందుఁ బారిభాషికపదవివరణమును, జాతీయములును, న్యాయాదికమును గూడ నొసంగఁబడియున్నవి. పారిభాషికపదవివరణమునకు.—అండశబ్దముక్రింద నొసంగఁబడియున్న "అండపోషకయుతులం" "అనాసపండు—భ్రమ్వసమూహపరిణామ ఫలము" "జీడిమామిడిపండు—వృంతపరిణామ ఫలము" మున్నగునవి యుదాహరణములు; జాతీయములకు.— "అందెవేసిన చేయి" "అడుగున బడు మడుగులొత్తుట" మున్నగునవి యుదాహరణములు; న్యాయములకు.— "అంకోలబీజన్యాయము" మున్నగునవి యుదాహరణములు, రెండియు నానాపదములచే బోధింపఁబడు పదార్థముల రూపము లోకమునకుఁ దెలియుటకై రూపపటములుఁగూడ నిందొసంగఁబడినవి.



ఎట్లన —"అనాసపండు—పుష్పసమూహ పరిణామఫలము" అని వ్రాసి ఆపండుయొక్క రూపపటమిట్లిచ్చుట నొసంగఁబడియున్నది.

ఈవిధముగా రూపపటములనిచ్చుట యిదివఱకు నాంగ్లేయ నిఘంటువులందు అరుదుగఁ గలదు. ఆమార్గము నిందవలంబింపఁబడినది.

రెండియు నానాపదములక్రింద నేయే శాస్త్రీయలక్షణములు తెలుపవలసియున్నవో యవి గూడ నిందొసంగఁబడియున్నవి.

ఎట్లన.—"అతిశయోక్తి" అనినపుడు ఒక యలంకారమని మాత్రము సర్వశబ్దసంబోధినిలోఁ దెలుపఁబడియున్నది. ఇందన్నో ఆయలంకారముంగూర్చి తెలుపఁదగినదంతయుఁ దెలుపఁబడియున్నది.

ఎట్లన.—అతిశయోక్తి. సం. వి. ఇ. స్త్రీ. ఉపమేయముఁ గప్పివేసి ఉపమానము మాత్రము కవిప్రౌఢోక్తిమూలముగాఁ జెప్పఁబడినది. ఇది సప్తవిధములనున్నది. సంబంధ, అసంబంధ, అక్రమ, చపల, అపహ్నవ, అభేద, భేద కాదిభేదము. "మేడలఁ గ్రీడలాడుచేడెలు స్వర్ణదీపికలమాలఁ మఱించుచున్నారు.": చూ, అలంకారము. ౪.

మఱియును నిందు లోకము తెలిసికొనవలసిన ధర్మశాస్త్రలక్షణములుఁగూడ నొసంగఁబడినవి.

ఇందాంధ్రపదముల విషయములో శబ్దరత్నాకరాదులందుగలకంటె మహాకవుల ప్రయోగములుగూడఁ జూపఁబడియున్నవి.

ఇతర నిఘంటువులందుఁగల విశేషము లన్నియు నిందుఁగలవు. కాని యిందున్న విశేషము లన్నియు నితర నిఘంటువులలో లేవు. పెక్కేల? ఇందు సర్వస్వమును గలదు దీనిని నిఘంటు సామాన్యముగా నెంచఁదగినది కాదు. ఇంచుమించుగా శబ్దార్థసర్వస్వమనవచ్చును. ఈమహోన్నత నిఘంటువును లిఖించినవారు ఆంధ్రవిద్యా వాచస్పత్యాది బిరుదాంకితులగు బ్రహ్మశ్రీ కొట్ర శ్యామల కామశాస్త్రిగారని యీదిగువకే తెల్పియున్నాను. వీరు "లక్ష్మీనారాయణీయము" ను నపూర్వశుద్ధాంధ్ర నిఘంటువును రచించిన కొట్ర లక్ష్మీనారాయణశాస్త్రులవారి పుత్రులు. ఆనిఘంటు రచనలో వారికిఁ దోడు పడినవారు. వీరి సంస్కృతాంధ్ర పాండిత్య మపారము. వీరి బిరుదములే వీరి ప్రజ్ఞను దెల్పఁ జాలుచున్నవి. అట్టి యఖండపండితులు కావుననే యీయమూల్య నిఘంటువును తృప్తికరముగ విరచింపఁగలిగిరి. తారానాథతర్కవాచస్పతిచే విరచింపఁబడిన వాచస్పత్యమునకుఁ దీనిఁగను నీయది యుపయోగించునని చెప్పుటకు సందియ మింతయు నుండనేరదు. అంతకంటె నెక్కుఁ డగునని గూడఁ జెప్పవచ్చును. కావున దీనికీయఁబడిన "వాచస్పత్యము" ను పేరు సార్థకమగుటకు సంశయ మింతయులేదు. దీనిని శబ్దకల్పద్రుమ మనియుఁ జెప్పవచ్చును. ఇదియంతయు స్వభావోక్తియేగాని యతిశయోక్తి కాదు. లోక మీ నిఘంటు రాజముయొక్క లాభమును బాగుగఁ దెలిసికొని దీనిఁ దప్పక ప్రతియింట నుంచుకొని సదా వాడుకొని లాభము నొందఁదగినది.

ఈవిధముగా గ్రంథకర్తగారికిఁ బ్రోత్సాహము నొసఁగఁదగినది. అంతియేగాక విద్యాసంస్థలవారును దొరతనమువారును నీనిఘంటు తెల్లజమునకుఁ దగు వ్యాప్తిని సర్వవిధములఁ గలిగింపఁదగినది. పరమేశ్వరుఁ డీయుద్గ్రంథరాజము విరచించిన శ్రీ శాస్త్రిగారికిని నీనిఘంటు తెల్లజమునకును శాశ్వత యశస్సు కలుగునట్లను గ్రహించుఁగాక.

కాకినాడ,
10-8-1934.

ఇట్లు,
కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి.

## విజ్ఞప్తి.

"జయతి సకలవిద్యా జన్మభూమి ర్జగత్యాం
జనిత సరసచేత స్సంప్రమోదాద్య భాషా
తదను వదన లీలాదత్త విహారమసీమా
తరళయతిచ శిష్టం కావ దేవాంధ్రభాషా."

బ్రహ్మయ్యశాస్త్రులవారు విశేషపరిశ్రమకోర్చి దీనిఁ వ్రాయించి నన్నుం గృతార్థుంజేసినందుల కెంతయు సంతసించి వారికిఁ గృతజ్ఞతతో వందన సహస్రంబు లర్పించుచున్నాఁడను.

“ప్రమాదో ధీమతామపి” యను నుడువు ఎఱింగిన బుద్ధిశాలులు నా యీమహాకార్యమునఁ గలిగిన దోసఁగుల మన్నింపఁగలరని తలంచుచున్నాఁడను.

ఇట్లు, బుధజనవిధేయుఁడు,

కొట్ర శ్యామలకామశాస్త్రి,

నిఘంటుకర్త.

---

## గ్రంథకర్తృవంశానుక్రమణిక.

---

శా॥ శ్రీ మద్దివ్య తపో విభూతికల రాశీవాసముండే ద్విజ
శ్యామోదంబును జూపె వాని కొడుకౌహా! యెంతవాఁడంచు ని
ష్ప్రేమంబా భయభక్తి యుక్తి మునులున్ జేమోడ్పుఁ జేరక్కఁ గే
లోఁ జేయుండగు కౌశికుండలరు భవ్యాప్తుక్తులాధారమై.

క॥ అతని గోత్రమ్మున గో
త్రాతల సుపవిత్రమగుచుఁ దనరెను గొట్ర
ఖ్యాతాన్వయ మన్వయవి
ఖ్యాతంబయి సకలవిప్రగణ సన్నుతమై.

క॥ కొండంత ధైర్యమొప్పఁగఁ
గొండన్న యనంగ దానఁ గొండొక బుధవ
ర్యుండెన్నఁ దగిరి గుణమణి
మండల మండనుఁడు చంద్రమండల యశుఁడై.

చ॥ అయ నయశోభితుం డెలుఁగు నాతనికిన్ ద్విజరాజ మౌళికిన్
నయనములట్లు గల్గిరి జన స్తవనీయులు మల్లి సోమయా
జి యనఁగ వెంకనార్యుఁడన శ్రీఁ దగు తమ్మనవాఁగఁ బుత్రుల
[illegible]

సీ॥ బ్రహ్మణ్య గణ్య సుబ్రహ్మణ్య ధీమణి నందనుండగ్రపుత్రుండుగాఁగ
సోమ సోమనిభాఖ్య ధామయశుఁడు మల్లసోమయాజి ద్వితీయసుతుఁడుగాఁగ
గోవింద వందనా భావుండు గోవిందవరబుద్ధి, మూఁడవపట్టిగాఁగ
విద్యద్విధేయత వెలయునన్ శ్యామలాకామశాస్త్రిఁ గనిష్ఠుఁగాఁగఁ గాంచి

గీ॥ "లక్ష్మినారాయణీయ" సులక్ష్మిఁ దనరు । పేఁదులేని నిఘంటు మాతోడఁ బాటు
గాంచి భువినెల్ల దనపేరు మించి, మాఱు । ప్రోయ, వర్తించె మాతండ్రి, ధార్మికుఁడు.

క॥ అగణి పినతండ్రి యనన్
ఖ్యాతిం గొన్నట్టి వేంకనాథ్యుఁడు నరసాం
బాతిలకము గాంచిన స
త్పూరి జగన్నాథశాస్త్రి సొంపారఁగడున్.

క॥ అబ్బుధవరాలిఁ భాసిలె
సుబ్బమ్మ యనంగ భార్య సుగుణంబులకున్
నిబ్బరపుఁ బట్టుఁ గొమ్మ క
ళుబ్బాంధవ కీర్తి శీల గురువైభవయై.

క॥ అదంపతులకు లోపం
బేదియు లేదయినఁగాని యించుక పుత్రో
త్పాదము గొఱయయ్యెను బు
త్రీ దర్శిత సుఖముదః స్థిర సుస్థిరయై.

తే॥ గీ॥ పుణ్యలోకంబు లందింప భూరి వంశ
కీర్తి నిలుపంగ విష్ణుంబుఁ బూర్తిసేయ
కోరసుఁడెట్లొ దత్తుండు నట్లయనుచు
నసుఁ గుమారునిగాఁగఁ గైకొనిరి వారు.

క॥ పన్నిండవ యేఁటాడిగ
నన్నుం గొన్నట్టివార నావిభరు లటం
చెన్నుచు వారల యావతి
చెన్నెఁడు జీవనాఁటు కంటి చెల్లరు వాగదన్.

సీ॥ పితృభక్తి మూర్తిభవింప సేవించి వారల దీవనలకుఁ బాత్రమగాంచి
యాతివ వేంకటరమణమ్మ యర్ధాంగిగా గార్హస్థ్య [illegible] గడుపుచుంటు

పలుకుఁ దప్పకయ సుబ్రహ్మణ్యుఁ డస్మత్కుమారుండుఁ గొలువ సమ్మోదముఁగాంచు
భగవంతుఁ డిచ్చినపాటిసంపదలు సద్వినియోగ మొనరించి కొనుచు మనుచు

గీ॥ సేఁటికీట్లాంధ్ర భాషా వధూటి కర్థ। కోశమైనట్టి యసమాన కోశ మొకటి
వ్రాసి వాసియు వన్నెయువఱలవిబుధు। లందఱిబహూకృతికిఁ బాత్రుఁడైనవాఁడ.

ఇట్లు, బుధజనవిధేయుఁడు,

కరప, కాకినాడ తా॥
తూ॥ గోదావరిజిల్లా.

కొట్ర శ్యామల కామశాస్త్రి,
నిఘంటుకర్త.

---

# నియమ విధాన క్రమము.

1. ఈనిఘంటువునందలి పదములన్నియు అకారాదిక్షకారమువఱకు ప్రాసాక్షరాది నియమముతో వ్రాయఁబడును.
2. ప్రతి అర్థమునకును అకారాదిక్షకారమువఱకుగల పర్యాయపదములు తద్విశేషములతో ప్రాసాక్షరాది నియమముతో వ్రాయఁబడును. (చూ, సదనము, తృణము, ధాన్యము, ధేనువు, మత్స్యము, యుద్ధము, వాయువు, సర్పము, స్వరము సొ.)
3. కకారము తరువాత క్షకారమును, హకారము తరువాత ళకారమును వ్రాయఁబడును.
4. సంస్కృతపదములకు ప్రత్యయములుఁ జేర్చి వ్రాయఁబడును.
5. ఇందు నిర్దిష్టములగు సంస్కృతపదములు రమారమి 60,000 ను, తెనుఁగుపదములు 20,000 ను, పారిభాషికపదములు మున్నగునవి 20,000 ను కలసి ఒకలక్షవఱకుఁ గలవని అంచనా వేయఁబడెను.
6. ప్రతిపదమునకును, భాషాభాగమును, అర్థమును, గూఢపదములకు ప్రయోగములును, నానార్థములును, ప్రత్యర్థమునకు పర్యాయపదములును తద్విశేషములతో వ్రాయఁబడును. (చూ, అ- అంకము- అంగము- వాయువు- వీణె- స్వరము- సదనము, సొ.)
7. మఱియు తత్సమములకు తద్భవములును, తద్భవములకు తత్సమములును, రూపాంతరములును గనుపఱుపఁబడును. (చూ, అంచే పదము, అగసి-అతసి. సొ.)

8. పర్యాయపదములు కొన్ని ఏకపదములైనపుడు పైన వ్రాయఁబడిన వివరణాదులను వ్రాసి పర్యాయపదములగు నని, తద్విశేషములను కనఁగొనుటకై తద్గణాద్యపదతదర్థసంఖ్య చూ, అను గుఱుతుతో సూచింపఁబడును. (చూ. అ_అమ్_ అంకము_ అంగము మొ.)

9. వేఁట, యుద్ధము మొదలగు వివిధవృత్తులకును, ప్రకృతిశాస్త్రములు, గణితము, ధర్మశాస్త్రము, జ్యోతిషము, వైద్యము, భూగోళము, వ్యాకరణము, సంజ్ఞావివరణములు, వ్యాసములు, జాతీయములు. మున్నగు వివిధశాస్త్రములకును, సంబంధించిన పారిభాషిక పదములు, వ్యావహారిక పదములు అకారాదిగ సాహిత్యపదములతో నవసరమగు చిత్తరువులతో కలఁబోసి కూర్పఁబడును. (చూ యుద్ధము, అనాసపండు, అండపోషక యుతులు అక్షిపంజరము, అదూరదర్శకము, అప్రభ్రము, అంతర్దశ, అంతకసన్నిపాతము_ అక్షాంశరేఖలు_ అడ్డాదులు_ అరసున్న, అతి_ అతిరేకము_ అంగము_ అజవల్లక్షణ_ అంకోలబీజన్యాసము_ అంజవేసినచేయి_ అర్ధసవాలు మొ.)

10. చెట్టునకు *: గుఱుతు చూపఁబడినది. (చూ, అక్కలకర_ అక్రొర_ అగసి_ అతసి.)

11. ఇంకఁ గ్రియాపదములకు ధాతురూపములును, నామపదములకుఁ బ్రథమైక వచన రూపములును వ్రాయఁబడును.

12. సంస్కృతము, ప్రాకృతము, దేశ్యము, గ్రామ్యము, వాడుక. పారిభాషికము, జాతీయము, ఉపసర్గ లివి కాయా సంజ్ఞలిడఁబడును. విశిష్టముగు అన్యదేశ్యము దేశ్యముతోఁ జేర్పఁబడినదిగాన దానికిఁ బ్రత్యేకముగా సంజ్ఞ యిడఁబడదు.

13. ద్వ్యయమునకు అవయవములైన పదముల యొక్క సంజ్ఞలను ఆయాశబ్దములకడఁ జూచునది. అనగా "అందాక" అనుచో అంతశబ్దముయొక్క సంజ్ఞను అంతకడను, దాఁకశబ్దముయొక్క సంజ్ఞను దాఁక కడను జూడవలయునని యర్థము. ఇట్లు తక్కినచోట్లను దెలియవలయును. (వైకృతము & దేశ్యమును మిశ్రమమైన పదము.)

14. ఒక్కొకచో నించుక రూపభేదముగల శబ్దము దాని మొదటిరూపముకడనే రూపాంతరమని వ్రాయఁబడును. (చూ, అకటవికటము. మొ.)

15. ఒక్కొకయెడ "ము వర్ణాంత" రూపము ము వర్ణములేని శబ్దరూపముకడనే రూపాంతరమని వ్రాయఁబడును (చూ, అగ్గలిక మొ.)

16. కొన్నిచోట్ల తెనుఁగుపదమునకు ఇయాంతరూపము, ఏదంతరూపము రెండును వ్రాయఁబడును. కొన్నియెడల ఇయాంతరూపముకడ ఏదంతరూపమును, ఏదంత రూపముకడ ఇయాంతరూపమును వ్రాయఁబడును (చూ, అందకత్తియ_ అగిసియ మొ, మఱియు అటె_ అటో_ మొదలగువాని భేదములను గుర్తింపవలయును.)

17. ఉకారలోపముగల అల్గులోనగు వాడుకలోని పదములు ఒక్కొకయెడ ప్రత్యేకముగ వ్రాయఁబడవు. (చూ, అలుగు మొ.)

18. దేశ్యక్రియలయందు ఇంచుక వచ్చెడు సామాన్యప్రేరణరూపములు ప్రత్యేకముగా వ్రాయఁబడును. (అడఁగించు, ఇప్పించు మొ.)

19. తేటగాఁ దెలియఁదగుచోట్ల తఱచుగఁ దెనుఁగుపదములకు సంస్కృతపదముల

తోడను, సంస్కృతపదములకుఁ దెనుఁగు పదములతోడను అర్థముతో వ్రాయఁబడును.

20. ఒకపదము సంస్కృతముగాను తెనుఁగుగాను నున్నయెడల ముందు సంస్కృతార్థములును వెనుక తెనుఁగర్థములును క్రమముగా వ్రాయఁబడును. అట్టిచోటుల సంస్కృతార్థములకు బ్రాకెట్టులేని విడిఅంకెలును, తెనుఁగర్థములకు బ్రాకెట్టుగల అంకెలును గుఱుతిడఁబడును. (చూ, అ- అంకము- అంక- అంకము మొ.)

21. ఒకపదము విశేష్యము, విశేషణము, సర్వనామము, అవ్యయము, క్రియయగునెడల ముందు విశేష్యార్థములును వెనుక విశేషణార్థములును, నావెనుక క్రియార్థములును వ్రాయఁబడును. (చూ, అంటు, ఎత్తు, ఒడ్డు మొ.)

22. ఇందుఁ గొన్నిటికి గ్రంథవిస్తరభీతిచే ప్రయోగములు సంగ్రహముగా వ్రాయఁబడియుండుటవలన అర్థములు విశదములు కానియెడల ఆయుదాహరణములకు ముందువెనుకలను ఆగ్రంథములయందు విశదముగాఁ జూచుకొనవలయును.

23. ప్రయోగములు దొరకియు పాఠభేదములతోఁ గూడియుండుటవలన నట్టిచోట్ల ఆశ్వాసాదిపద్యసంఖ్యలు వ్రాయఁబడును.

24. చదివెడివారికిఁ జక్కగా దెలియుటకై యుండు అర్థములోనగునది తెలుచుగ సంధి లేక వ్రాయఁబడును. నియమబాహుళ్యముచే మిశ్రమము కొన్నియెడలఁ దప్పినను దప్పియుండును.

25. క్రొత్తగ నచ్చుటచ్చుటఁజేరిన నియమవిధానద్ధులను పాఠకు లాయాసందర్భాదులం బట్టి గ్రహించుకొనవలెను.

26. తెనుఁగున వాడుకలోనికివచ్చిన యన్యదేశీయాది శబ్దములు కొన్ని చేర్పఁబడినవి. ఇట్టి పదములకు గ్రంథదృష్టాంతాదులు దొరకుట దుస్సాధ్యము. అవి వాడుకయం దున్నట్టే గ్రహింపవలెను.

27. రూపాంతరములలో కొన్నిమాత్ర మచ్చటచ్చట శిష్టకాపదములుగనియక నాయా పదములకడనే చూపఁబడినవి.

28. గ్రంథసంకేతాదిపట్టికయందుఁ జేరనిగ్రంథములు పెక్కులుండును. అట్టిచోట్ల నాయాగ్రంథములపేర్లు వ్రాయఁబడును.

29. సంజ్ఞావివరణపట్టికయందుఁజేరని గుఱుతులు కొందుగనుండును. అట్టిచోట్ల వాడుకనుబట్టి తెలిసికొనవలెను.

30 బుద్ధిమంతులిందుల పొరపాట్లు దెలిపి దిద్దించి నన్నుఁ గృతార్థుఁజేయుదురని ప్రార్థించెద.

31. ప్రబంధాదులు పెక్కుముద్రణాలయము లందు ముద్రింపఁబడినకారణమున పాఠభేదములు వ్రాయవలసివచ్చినను గాన్పించుచున్నది ఆకారణమునఁ గొన్నిచోట్ల సుశబ్దాపశబ్దనిర్ణయమును, అర్థనిర్ణయమును దుస్సాధ్యముగనున్నది. అట్టిచోట్ల అట్టి పదములుగల పద్యము లుదాహరింపకయే నాబుద్ధికిఁ దగినరీతిని అర్థనిర్ణయాదులను వ్రాసితిని. అట్టిచోట్ల పాఠకులకు గ్రంథపరిశీలనమవసరముగు లేని చూచుకొనుట కనువుగ నట్టిప్రబంధాదులయొక్క ఆశ్వాసాదులను పద్యములయొక్క సంఖ్యను విశదించి పాఠకమహాశయుల కాపరిశ్రమ వదలిచేసితిని.

ఇట్లు,

వి ఘం టు క ర్త.

# సంజ్ఞావివరణపట్టిక.

| | |
|---|---|
| అ. | అకారాంతము. (ఇట్లు ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ఎ, ఓ, ఔ, చ్, జ్, ట్, డ్, థ్, న్, ప్, భ్, ర్, వ్, శ్, ష్, స్, హ్ అనువర్ణములుకలవో ఆయా అంతరములుగా చెప్పకొనవలెను.) |
| (అ.ఆ.అ.) | (పుంలింగవిశేషణమైనప్పుడు) అకారాంతము. (స్త్రీలింగవిశేషణమైనప్పుడు) ఆకారాంతము. (నపుంసకలింగవిశేషణమైనప్పుడు) అకారాంతము. |
| అం. | అంతము. (సంజ్ఞావివరణము.) |
| అం, ప్రే. | అంతర్భావిత ప్రేరణము. |
| అ, క్రి. | అకర్మక క్రియ. |
| అప్ర. | అప్రసిద్ధము. |
| అర. | అరవము. |
| అవ్య | అవ్యయము. |
| ఆం. | ఆంగ్లేయము. |
| ఆ. | ఆత్మనేపది. |
| ఉప. | ఉపపదము, ఉపసర్గ. |
| ఏ. | ఏకవచనాంతము. |
| కన్న. | కన్నడము. |
| క్రి. విశ. | క్రియావిశేషణము. |
| గ్రా. | గ్రామ్యము. |
| చూ. | చూడుము. (సంస్కృత, తెలుఁగు పర్యాయపదములకొఱకు) |
| జా. | జాతీయము. (దేశీయము.) |
| తద్వి. | తద్విశేషములు. |
| (తె. ప.) | తెలుఁగు పర్యాయపదములు. |
| దే. | దేశ్యము |
| ద్ర. | ద్రుతాంతావ్యయము. |
| ద్వ్య. | ద్వ్యయము. (వైకృతము దేశ్యమును మిశ్రమైన పదము.) |
| ధా. | ధాతువు. (క్రియాపదము.) |
| న. | నపుంసకలింగము. |
| ని. | నిపాతము. |
| ప. | పరస్మైపది. |
| పా. | పారిభాషికపదము. (టెక్నికల్ వర్డ్.) |
| పుం. | పుంలింగము. |
| పుం, న. | పుంనపుంసకలింగము. |
| పుం, స్త్రీ. | పుం స్త్రీలింగము. |
| పై. | పైయర్థము. |
| ప్రా. | ప్రాకృతము. |
| ప్రే. | ప్రేరణము. |
| బ. | బహువచనాంతము. |
| మి | మిశ్రము. (సంస్కృతాంధ్రములు కలిసిన శబ్దము.) |
| మొ. | మొదలైనవి. |
| రూ | రూపాంతరము. |
| వా. | వాడుక. |
| వి. | విశేష్యము |
| విశ. | విశేషణము |
| వై. | వైకృతము (తద్భవము) (ప్రాకృతసమమును సంస్కృతప్రాకృతభవమునైన పదము.) |
| శవ్. | శవ్వికరణము. |
| శా. | శాసనపదములు. |
| సం. | సంస్కృతసమము. (తత్సమము.) |
| (సం. ప.) | సంస్కృతపర్యాయపదములు. |
| స. | సర్వనామము. |
| స. క్రి. | సకర్మక క్రియ. |
| స్త్రీ | స్త్రీలింగము. |
| హిం | హిందూస్థానీ. |
| * | వృక్షలతాది వాచకమగుటను తెలియఁజేయును. |
| ... | ఈగుఱుతునడుమ కొన్ని యక్షరములుండును. |
| = | తత్సమ తద్భవ (ప్రకృతి వికృతి) రూపములచూపించు గుఱుతు |
| " " | పద్యమున కిరుకటులనుగుడుగుఱుతు. (మిగతగుఱుతులు ఆయాపదములకడ గ్రహించుకొనవలెను) |

# గ్రంథసంకేతాది వివేచనపట్టిక.

| సంకేతములు. | నామములు. | సంకేతములు | నామములు. |
|---|---|---|---|
| | సంస్కృత నిఘంటువులు | ఆం. భా. శా. | ఆంధ్రభాషావాగనుశాసనము |
| అభి. | అభిధానరత్నమాల | ఆము. | ఆముక్తమాల్యద |
| అమ. | అమరకోశము | ఉ, రా. | ఉత్తర రామాయణము |
| అ, పా. | అమరపదపారిజాతము | ఉ, హరి. | ఉత్తర హరివంశము |
| త్రి. | త్రికాండశేషము | ఉ, హరిశ్చం | ఉత్తర హరిశ్చంద్రోపాఖ్యానము |
| ధ. | ధన్వంతరి నిఘంటువు | ఉప | ఉపన్యాసదర్పణము |
| నా. | నానార్థరత్నమాల | కవి. | కవిజనరంజనము |
| మే. | మేదినీకోశము | కవిక. | కవికర్ణరసాయనము |
| విశ్వ. | విశ్వకోశము | కవిస. | కవిసర్పగారుడము |
| శ, క. | శబ్దార్థకల్పతరువు | కళా. | కళాపూర్ణోదయము |
| సం, ఆ. | సంస్కృతాంధ్ర నిఘంటువు | కళింగ. | కళింగదేశచరిత్ర |
| స, సం. | సర్వశబ్దసంబోధిని | కా. | కావ్యాలంకారసంగ్రహము |
| హా. | హారావళి | కాశీ. | కాశీఖండము |
| | మిశ్రాంధ్ర నిఘంటువులు. | కాళ. | కాళహస్తిమాహాత్మ్యము |
| ఆం | ఆంధ్రదీపిక | కుచే. | కుచేలోపాఖ్యానము |
| పు. | పురుషోత్తమకవీయము | కొలా. | కొలామృతము |
| శ, ర. | శబ్దరత్నాకరము | కృష్ణ. | కృష్ణరాయవిజయము |
| శ, చం. | శబ్దార్థచంద్రిక | కృష్ణా. | కృష్ణాభ్యుదయము |
| | అచ్చ తెనుఁగు నిఘంటువులు | చంద్ర. | చంద్రభానుచరిత్రము |
| బాల. | బాలచంద్రోదయము | చంద్రా. | చంద్రాంగదచరిత్రము |
| ల. | లక్ష్మీనారాయణీయము | చమ. | చమత్కారమంజరి |
| వై. | వైకృతదీపిక | చెన్న. | చెన్నబసవపురాణము |
| శు. పా. | శుద్ధాంధ్రపద పారిజాతము | జై. | జైమినిభారతము |
| | అచ్చ తెనుఁగు పద్యనిఘంటువులు. | ధర్మజ | ధర్మజరాజసూయము |
| ఆం భా. | ఆంధ్రభాషార్ణవము | దశా. | దశావతారచరిత్రము |
| ఆం, ప. | ఆంధ్రపదాకరము | ద్వా. | ద్వాత్రింశత్సాలభంజికాకథలు |
| ఆం, సం. | ఆంధ్రనామసంగ్రహము | నవ | నవనాథోపాఖ్యానము |
| ఆం, శే. | ఆంధ్రనామశేషము | నళ. | నళచరిత్రము |
| సాం. | సాంబనిఘంటువు | నిర్వ | నిర్వచనోత్తరరామాయణము |
| వెం. | వేంకటేశ్వర ఆంధ్రము | నీలా. | నీలాసుందరీపరిణయము |
| | లక్ష్య గ్రంథములు. | నై. | నైషధము |
| అచ్చ. | అచ్చతెనుఁగు రామాయణము | పం, నా | పంచతంత్రము (నారాయణకవి) |
| అధ్యా. | అధ్యాత్మ రామాయణము | పం, వెం. | పంచతంత్రము (వేంకటనాథకవి) |
| అని. | అనిరుద్ధచరిత్రము | పండి. | పండితారాధ్యచరిత్రము(ద్విపద) |
| అప్ప. | అప్పకవీయము | పద్మ. | పద్మపురాణము |

| ంకేతములు. | నామములు. | సంకేతములు. | నామములు. |
|---|---|---|---|
| ర. | పరమయోగివిలాసము | వసు. | వసుచరిత్రము |
| రా. | పరాశరస్మృతి | వా. | వాసిష్ఠరామాయణము |
| ా. | పారిజాతాపహరణము | వి. పు. | విష్ణుపురాణము |
| ాంచా. | పాంచాలీపరిణయము | విక్ర. | విక్రమార్కచరిత్రము |
| ాండు. | పాండురంగమాహాత్మ్యము | విజ. | విజయవిలాసము |
| ూ. చ. | పురూరవచరిత్రము | విజ్ఞా. | విజ్ఞానేశ్వరీయము |
| ్రభా. | ప్రభావతీప్రద్యుమ్నము | విష్ణు. | విష్ణుమాయావిలాసము |
| ్రభు. | ప్రభులింగలీల | వీర. | వీరభద్రవిజయము |
| ్రభు. | ప్రభులింగలీల (ద్విపద) | వేమ. | వేమనసూత్రరత్నాకరము |
| స. | బసవపురాణము | వైజ. | వైజయంతీవిలాసము |
| హు. | బహులాశ్వచరిత్రము | శం. | శంఖలిఖితస్మృతి |
| ్ర. | బ్రహ్మోత్తరఖండము | శశాం. | శశాంకవిజయము |
| | భర్తృహరి | శివ | శివయోగసారము |
| దా్రి. | భద్రాపరిణయము | శుక. | శుకసప్తతి |
| ల్లా. | భల్లాణచరిత్రము | శృం | శృంగారరసాలవాలము |
| ాగ. | భాగవతము | శేష. | శేషధర్మము |
| ాగ. | భాగవతము (ద్విపద) | షో. | షోడశకుమారచరిత్రము |
| ాను. | భానుమతీపరిణయము | సంజ్ఞా. | సంజ్ఞావివరణదర్పణము |
| ార. | భారతము (18 పర్వములు) | సకల | సకలకథాసారసంగ్రహము |
| ). | భీమేశ్వరపురాణము | సత్య | సత్యభామాసాంత్వనము |
| ో. | భోజరాజీయము | సమీ. | సమీరకుమారవిజయము |
| ార్క. | మార్కండేయపురాణము | సర్వా. | సర్వార్థసారసంగ్రహము |
| ై | మైరావణచరిత్రము | సా. | సారంగధర (శంభుకవి) |
| య | యయాతిచరిత్రము | సా | సారంగధర (చే. వేం.) |
| త్న. | రత్నపరీక్ష | సురా. | సురాభాండేశ్వరము |
| స. | రసమంజరి | వ్యా | వ్యాకరణము |
| సి. | రసికజనమనోభిరామము | స్వా. | స్వారోచిషమనుసంభవము |
| ా. | రామాయణము | హం. | హంసవింశతి |
| ా. | రామాయణము (రంగనాథుఁడు) | హర. | హరవిలాసము |
| ాజ. | రాజరాజనరేంద్రపట్టాభిషేక | హరి, న. | హరిశ్చంద్రనలోపాఖ్యానము |
| ా, వి. | రాజవాహనవిజయము [సంచిక | హరి. | హరివంశము |
| ాఘ. | రాఘవపాండవీయము | హరిశ్చ. | హరిశ్చంద్రోపాఖ్యానము (శంకర |
| ాజ. | రాజశేఖరవిలాసము | హరిశ్చ. | హరిశ్చంద్రోపాఖ్యానము (గౌరన |
| ామా. | రామాభ్యుదయము | శం. ని. | తెనుఁగునకు ఇంగ్లీషు (పి. శంకర |
| ుక్మాం. | రుక్మాంగదచరిత్రము | | నారాయణగారి) నిఘంటువు. |
| ుక్మి. | రుక్మిణీపరిణయము | | (మొదలగునవి.) |
| క్ష. | లక్షణసారసంగ్రహము | | |
| క్ష్మ. | లక్ష్మీనృసింహపురాణము | | |
| ర్ణ. | వర్ణరత్నాకరము (1-3) | | |

# శాస్త్రములు.

1. వేదము, శాస్త్రము
2. వ్యాకరణము
3. నిరుక్తము
4. జ్యోతిషము
5. కల్పము
6. ఛందస్సు
7. మీమాంస
8. న్యాయశాస్త్రము
9. పురాణములు
10. ధర్మశాస్త్రము
11. ఆయుర్వేదము
12. పాకశాస్త్రము
13. అర్థవేదము
14. కామశాస్త్రము
15. ధనుర్వేదము
16. మల్లశాస్త్రము
17. గజశాస్త్రము
18. వ్యూహశాస్త్రము
19. అశ్వశాస్త్రము
20. పురుషసాముద్రికము
21. స్త్రీ సాముద్రికము
22. గాంధర్వవేదము
23. భావాధ్యాయప్రమేయము
24. అలంకారములు
25. నాటకలక్షణము (శ్రృం. స.)
26. కావ్యలక్షణము (శృం. స.)
27. ఛందోలక్షణము (శృం. స.)
28. గాంధర్వవేదము (రాగాధ్యాయము)
29. గాంధర్వవేదము (తాళాధ్యాయము)
30. భరతశాస్త్రఫలము
31. చతుష్షష్టి విద్యావివరణములు
32. క్షేత్రగణితము (మొదలగునవి)

# ప్రకృతిశాస్త్రములు.

1. భౌతికశాస్త్రము (పై. న. గారు)
2. రసాయనశాస్త్రము (వే. వి. శర్మగారు)
3. మహమ్మదీయమహాయుగము కే.వి.ల.గారు
4. పదార్థవిజ్ఞానశాస్త్రము (మ. సా. గారు)
5. ఆంధ్రులచరిత్ర (చి. వీ. గారు)
6. వ్యవసాయశాస్త్రము (గో. జో. గారు)
7. పరిణామవాదము (చిం. దీ. గారు)
8. వృక్షశాస్త్రము (టి. పాలమన్ రాజుగారు)
9. శారీరశాస్త్రము, ఆరోగ్యబోధిని (విజ్ఞాన)
10. జంతుశాస్త్రము (అ. ల. గారు)
11. స్వీయచరిత్రము (కం. వీ. గారు)
12. హిందూమహాయుగము (కే. వి. ల. గారు)
13. జీవశాస్త్రము (అ. ల. గారు)
14. హిందూదేశకథాసంగ్రహము (కే. వి. ల. గారు)
15. ఢిల్లీదర్బారు
16. అర్థశాస్త్రము (సి. రా. రెడ్డిగారు)
17. చంద్రగుప్తచక్రవర్తి (ప.వి.స్వామిగారు)
18. రాణీసంయుక్త (దే. కు. గారు)
19. వ్యవహారకోశము (ది. వేం. శి. గారు)
20. శాస్త్రపరిభాష (ది. వేం. శి. గారు)

(మొదలగునవి.)

☞ గ్రంథసంకేతాదిపట్టికయందుఁ జేరనివానినామము లాయాపదములకడనే జూపఁబడును.

శ్రీ

# ఆంధ్రవాచస్పత్యము

అను

ఆంధ్ర ప్రతిపదార్థ పర్యాయపద నిఘంటువు.

## శ్రీ శ్యామల కామ శాస్త్రీయము.



"శ్లో. వాగర్థా వివ సంపృక్తౌ వాగర్థ ప్రతి పత్తయే।
జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ.॥"



అ

సం. వి. అ. పుం. 1. అచ్చులలోని మొదటి యక్షరము, అకారము: చూ, వర్ణము. 1; 2. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1; 3. నలువ: చూ, బ్రహ్మ. 1; 4. ముక్కంటి: చూ, శివుఁడు; 5. గాలి: చూ, వాయువు; 6. శిఖ, జుట్టు: చూ, సిగ. 3; 7. గాయత్రి లోనగునది (చూ, ఓమ్. చూ, గాయత్రి): చూ, మంత్రము. 1; 8. మిక్కిలి నిర్బంధించుట: చూ, బలవంతము; 9. గుఱ్ఱము: చూ, హయము; 10. బండిని లాగుకొనిపోవు గుండ్రని చట్రము: చూ, శకటము. 1; 11. కుక్కుట శిరస్సు: చూ, కోడితల; 12. చంద్రబింబము: చూ, బింబము. 6; 13. [illegible]: చూ, బృహస్పతి; 14. తాఁబేలు: చూ, వృత్తము. 4; న. 15. గౌరవము: చూ, సన్మానము; 16. కారణము: చూ, హేతువు. 1; 17. తొడవు: చూ, భూషణము. 4; 18. కాలుచాఁచిపెట్టిన అడుగు: చూ, పాదము. 1; 19. కూడుకొన్న శబ్దార్థములయొక్క భావ కర్మములు: చూ, సాహిత్యము. 1; స్త్రీ. 20. గట్టామాలి, గౌరి: చూ, పార్వతి. 1; అవ్య. 21. అభావార్థకము: చూ, శూన్యము. 1; 22. నఞర్థకము: చూ, లేదు. 2; 23. నిషేధార్థకము: చూ, వద్దు; 24. కించిదర్థకము: చూ, స్వల్పము; 25. అంగీకారార్థకము: చూ, సమ్మతము. 1; 26. ఉత్ప్రేక్షార్థకము: చూ, పుట్టుక; 27. యుద్ధార్థకము: చూ, యుద్ధము; 28. అంగణార్థకము: చూ, ముంగిలి. 2; 29. వాంఛార్థకము: చూ, వాంఛ; 30. అంతఃపురార్థకము: చూ, సదనము. 1; 31. అవధారణార్థకము: చూ, సత్యము; 32. ఊత్కృతము, ఊఁకొట్టుట: చూ, ఊ. 11; వై. అవ్య. (1) వంజేయుకదాని తేమిని తెలుపును. "చ. ఇది శతవృద్ధ మాజనని యిప్పుడు మృత్యువుఁ బొందెరిట్లు, నేయూపము కుల ప్రియుక్త

నుగుచున్న సనాతన ధర్మ మిత్తెఱంగ దనూన కర్మమెల్ల మదిగా నిదిగా మను నిశ్చయించి మా, మొదలిటి వారొనర్చు విధముం గొనియాడితి మేము నిర్వ్యాడన్." భార. విరా. 1, ఆ. 179; "గీ. ఎవ్వరికిఁ గాఁగ ధరణియు నెల్ల సుఖముఁ, గోరెదము వార లందఱు వీరవచ్చి, ప్రాణములు నర్థములు నొల్లఁబాటు సేసి, కయ్యమునఁ జావనఱు ముటఁ గంటిగాదె." భార. భీష్మ. 1, ఆ. 182: చూ, కాకేమి; (2) తనంతట అనునర్థమును తెలుపును. "ఉ. అమ్మ సరస్వతీ పరమహార్ణ్యము సన్నని యించి తీవు నా, కిమ్మగ సర్వ ధర్మములు నీవ యెఱుంగుదు వంశ మెల్లఁ బూ, తమ్మగు నీదుచర్యనని ధాత వడంతియె యానతిచ్చె." కళా. 4, ఆ. 128. ఎ, ఏ; (3) బొత్తిగా అను వర్థమును తెలుపును. "ఎ, గీ. కులము పాడినదపఁ దలఁపఁడ పతి సెడఁ, దలచెనేనిఁ గొడుకు పలచినట్టి, వాఁడుగాన యతని వశ్రితమాన్పలేఁ, డింత కంటెఁ గలదె యడరుమాకు." భార. ఉద్యో. 3, ఆ. 9; (తలఁపఁడ=తలఁపనే తలఁపఁడు) "చ. పెక్కుభంగులఁ బురికొల్ప నెవ్వరును గోత్తలు సేయగ రేమి సెప్పుదున్." భార. ద్రోణ. 3, ఆ. 59; (ఈయర్థమున క్రియల వ్యతిరేకార్థక రూపములతో యనుప్రయుక్తమగును.): చూ, ఏని; (4) ఆలస్యము లేమినిదెలుపును. "సీ. వడిఁబట్టి దిరిగి మ్రొగ్గడు మదావళములు దోన రూపతిన యాధోరణులును." వై. 5, ఆ. 192; (5) క్రియలకు ప్రార్థనార్థకమందు వికల్పముగ నను ప్రయుక్తమగును. "క. కనుఁగొండ యితని ధైర్యము, పెనుగొండను." పాండు. 1, ఆ. 58; (6) ఇది స్వరభేదము చేత చక్కించిన విషయమునొక్క వ్యతిరేక నిశ్చయమును తెలుపును. "ఉ. పుష్ప బాణ, బాణాసను పుష్పబాణ నివహమ్ములఁ దంగుతెర్చుతి నిట్టినా, యాసనిరాకరింపఁ దగవా మగవాఁడవు కావ యర్జునా." హర. 4, ఆ. 129: చూ, ప్రశ్నము. (7) సంశయమును దెలుపును. "ఉ. అంతటమూర్ఛ దేరి పులియా రొలఁగా రొనుపోత సింగమా, కాంతుమ." కళా. 4, ఆ. 106; చూ, సంశయము; (8) నిశ్చయమును తెలుపును. "సీ. కామించి యున్నఁ దత్కామ రాగంబున యతిరేక మునఁజేసి యాత్మణంబ. గీ. తనకుశుక్లపాతం బైన." భార. ఆది. 5, 131; "సీ. చేనఁబండిన విత్తు చేనిక ఫలకాంక్షఁ బేర్మి గ్రమ్మఱ వెద పెట్టునట్లు." కుమా, సం. 1, ఆ. 40: చూ, సత్యము; (9) ఒకానొకప్పుడు వాక్యాలంకారమును దెలుపును. "చ అది సభయే ప్రియంబెసఁగ నార్యులు నిల్వరయేని యార్యులే, మదిఁదలఁపంగి హాగిలు సముచిత ధర్మము పల్కలేని." భార. ఉద్యో. 2, ఆ. 70; వై. స. (10) సమాసపూర్వపదముగా నున్న తచ్ఛబ్దార్థకమును దెలుపును. 'అ' అనుదానికికొన్నిచోట్ల వచ్చెడి యాదేశము. "అ + కడ=అక్కడ; అ + కన్య=అక్కన్య" మొ.

అప్. సం. వి. అ. వ. 1. కారణము: చూ, హేతువు. 1; 2. తొడవు: చూ, భూషణము. 2; 3. కాలు చాఁచిపెట్టిన యడుగు: చూ, పాదము. 1; 4. ఔన్నత్యము: చూ, పొడవు. 2; 5. అంజలి: చూ, దోసిలి; 6. ఆజ్ఞ: చూ, సెలవు; 7. సప్తస్వరముల కాలపరిమాణము: (చూ, షడ్జము) చూ, స్వరము. 2; 8. ఉదాయి: చూ, యుద్ధము; 9. కత్తి, వలుచేదర ఘోటు: చూ, ముంగిలి. 2; 10. అంతఃపురము: చూ, సదనము. 1; 11. గౌరవము: చూ, సన్మానము.

అంక. దే. వి. 1. సైపు: చూ, పార్శ్వము. 2; 2. మెడమీఁదనున్న కాఁడి మొదలగువానిని మెడక్రిందికిఁ దెచ్చుకొనుట: రూ-అంకియ- అంకె, అణక.

అంకకాఁడు. దే. విశే. 1. (అంకము + కాఁడు.) మచ్చరీఁడు. "గీ. ఎలసియేప్రొద్దుఁగనువాఁడ నీకమరుఁడుకలహమున కంకకాఁడయి కాలు దిర్వ్వ." ఆము. 5, ఆ. 84: చూ, మాత్సర్య శీలుఁడు; 2 దేహమందలి పుట్టుమచ్చలలో నగువానిగుఱుతు గలవాఁడు. "చ. హిమకరుఁడంకకాఁడు మధువెప్పుడుజాతి విరోధి." కవిక. 3, ఆ. 98: చూ, గుఱుతుగలవాఁడు.

అంకగణితము. పా. అంకెలతోఁజేయు లెక్క. (చూ, గణితము.)

అంకణము. సై. వి.=అంగణమ్ (రూ.-అంగణము-అంగనము అనికొందఱు) కత్త్య, నలువేవరపు చోటు. "అది యొన్నియంకణముల యిల్లు.": చూ, ముంగిలి. 2.

అంకతి. సం. వి. ఇ. పుం. 1.అగ్ని. చూ, వహ్ని.1; 2. జ్వాల: చూ, మంట. 2; 3. తామర*: చూ, పద్మము. 1; 4. ఆఁడుగుఱ్ఱి: చూ, భగము. 12; 5. గాలి: చూ, వాయువు; 6. వలువ: చూ, బ్రహ్మ. 1.

అంకనము. సై. వి.=అంకమ్. చిహ్నము: చూ, లక్షణము. 1.

అంకపాలి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఆలింగనము: చూ, సంశ్లేషము; 2. ఉపమాత: చూ, దాది; 3. అరుఁగు: చూ, వేదిక; 4. ఏఱుమద్ది * చూ, మద్ది; 5. కొంగు: చూ, పైఁజాఱు; 6: చూ, తొడ.

అంకపాలిక. సం. వి. ఆ. స్త్రీ. 1. ఆలింగనము: చూ, సంశ్లేషము; 2. అరుఁగు: చూ, వేదిక; 3: చూ, తొడ; 4. ఏఱుమద్ది * : చూ, మద్ది.

అంకపేలి. సం. వి. ఈ. స్త్రీ. నాగుమాసిని*: చూ, మారిని పసుపు.

అంకపొంకములు. దే. వి. బ. (అంకము + పొంకములు.) (రూ- అంకపొంకాలు-అంకాపొంకములు-అంకాపొంకాలు.) 1. వేగిరము: చూ, వేగము. 3; 2. కోపము: చూ కోపము; 3. పగ: చూ, విరోధము. 1; 4. అధికము: చూ, హెచ్చు. 1; విశే. 5. ఉగ్రము, భయమును పుట్టించునది. చూ, భయంకరము.

అంకము. సం. వి. అ. పుం. 1. = అంకియ- అంకె. ఒకటి మొదలగు సంఖ్యలను దెలుపు నట్టి రేఖ: చూ, సంఖ్య. 1; 2. తొడపై భాగము: చూ, తొడ; 3. చిహ్నము, గుఱుతు: చూ, లక్షణము. 1; 4. చోటు: చూ, స్థానము. 1; 5. అపరాధము: చూ, నేరము; 6. వాక్యార్థము నభినయించుట; చూ, వ్యంజకము. 1; 7. పదార్థము నభినయించుట: చూ, నాటకము. 1; 8. పదివిధములయిన రూపకములలో నొకటి: చూ, రూపకము; 9. తొడవు. చూ, భూషణము. 2; 10. జగడము. చూ, యుద్ధము; 11. చేరువ: చూ, సమీపము; 12. గాయత్రి లోనగునది: (చూ, ఓమ్, గాయత్రి) : చూ, మంత్రము. 1; 13. బొమ్మ: చూ, పక్షము; 14. శాస్త్రదింతనాదులచేఁ గలుగు వస్తువిషయ జ్ఞానము: చూ, బుద్ధి; న.15. దుష్కృతము: చూ, పాపము; 16 కష్టము, కడగండ్లు: చూ, శోకము; 17. వేలపు: చూ, మాత్సర్యము; దే. వి. (1) దూఱు. "ఉ. పొంపుఁగావ్యలక్షణము పోకడెఱుంగక దిట్టమాటలై, కొంకక వంకరార్థములు గూర్చి సభాస్థలిఁబోధులట్లు నిశ్శంకఁ జరింపుమనీ సుకవి సంఘము పల్కులమెచ్చ కూరకే, యంకము సేయవచ్చు నలయయ్యలమున్న గఁబ్రస్తుతించెదన్." హరి. 1, ఆ. 13: చూ, నింద.1.

అంకమ్మ. ద్వ. వి. (అంకు + అమ్మ.) ఒకగ్రామదేవత: చూ, మహాలక్ష్మి. 3.

అంకవన్నియ. ద్వ. వి. (అంకము + వన్నియ.) గుఱ్ఱము నెక్కుటకు కలుపరిక్కల నమర్చిన మెట్టు, (రికాబు): చూ, పన్నె. 13.(రూ- అంకపన్నె.)

అంకవిద్య. సం. వి. అ. స్త్రీ. గణితము, లెక్క: చూ, సంఖ్య. 1. (చూ, గణితము)

అంకశయ్య. సం. వి. అ. స్త్రీ. 1. చావు:చూ, మరణము; 2. నేలపడక. చూ, మృతశయ్య; 3. వల్లకాడు: చూ, శ్మశానము; 4. పాడె: చూ, శవయానము.

అంకాపొంకములు. దే. వి. బ. (అంకము + పొంకములు.):చూ, రూ-అంకపొంకములు (రూ-అంకాపొంకాలు-కోపము.- "క. కింకరులచేత నంటన్, లంకకు వేగం దనందినన్ వివి యంకా, పొంకాలు దరి కొనంగ నిరం కుశ సాహససమర్థుఁడగు దశముఖుఁడున్." రామా. 7, ఆ. 49.)

అంకాలమ్మ. ద్వ. వి. రూ-అంకమ్మ: చూ, మహాలక్ష్మి. 3. (అంకాళమ్మ అనియు)

అంకారించె. వా. స. క్రి. 1. లంగరుయెత్తు, ఓడ చోఁప యెత్తి పోవు; 2. సిద్ధపఱుచు.

అంకించె. సం. స. క్రి. 1. పొగడు. "వ. అని మఱియు సముచిత సంభావనంబుల నంకించుచున్న కరమ వైష్ణవీ రత్నంబును." భాగ. 8, స్కం. 134: చూ, స్తుతించె; దే. అ. క్రి. (1) సంతోషించె. "వ. పంకజభవాండ మండపంబు సంకుచేసిన పొంకంబున నంకించె" వసు. 4, ఆ. 28: చూ, సంతోషించె, స. క్రి (2) అడించె "ఎ, గీ. ఖడ్గ ఘంకింప వైష్ణవికరముఁబట్టి, వాంఛితంబెద్ది వేఁడుము వరమువనిన." జై. 8, ఆ. 144: చూ, జిలిపించె (3) త్రిప్పియాడు. "నె మ్మొగ మద్దమంకించి." విర్వ. 8, ఆ. 38: చూ, త్రిప్పు; (4) దొంగిలించె. "క. సంకెలఁబడ్డవారే, యంకింతురు నీదు రాజ్యమగ్గము ననువుల్." కృష్ణా. 2, ఆ: చూ, మ్రిచ్చిలించె.

అంకితము. సం. విశ. (అ. ఆ. అ.) 1. ఎంచేఁబడినది:చూ,గణితము. 2; 2.గుఱుతిడఁబడినది; 3. కృతియిడఁబడినది; 4. పచ్చవేయఁబడినది; 5. బిరుదిడఁబడినది. మొ.

అంకితుఁడు. సం. వి. అ. పుం. 1 గుఱుతిడఁబడినవాఁడు; 2. కృతిపొందఁబడినవాఁడు, కృతిభర్త.

అంకినీను. దే వి. గుఱ్ఱపుజీనునకు వేయు నలంకారము: చూ, హయము.

అంకియ. వై. వి. 1.=అంకము. రూ-అంకె, ఒకటి మొదలగు సంఖ్యలను దెలుపునట్టిరేఖ: చూ, సంఖ్య. 1; 2. లోఁకువ. రూ- అంకె: చూ, పశము. 1.

అంకియము. దే. వి. ఎద్దు మొదలగు వానిపై నొక పార్శ్వపు భారము: రూ-అంకెము, అండియము- రూ-అండెము: చూ, పెటిక.

అంకిలము సం. వి. అ. పుం. అంకురము: చూ, మొక్క. 1.

అంకిలి. దే. వి. 1. తాలుమూలము: రూ-అంకు (సం,వ):— తాలుమూలము; 2. ఆపద. "క. ఇంకని జలములు గలిగిన, యింకొక్క యగాధసరసి విడినంజాలున్, సంకోచింపక మమునీ, యంకిలిఁబాపుటకు నీవయర్హుఁడ వనినన్." పంచ. నా. 1, ఆ. 222: చూ, విపత్తు; 3. కలఁత. "క. అని యారడిలఁగఁ బలికిన, వినియంకిలి లేని చిత్తవృత్తి గలుగు నం,గన యేడ్చుచిగన్." భార. ఉద్యో. 3, ఆ: చూ, సంతాపము; 4. అడ్డము. "ఎ, గీ. మహీధరము వేయుపంకిలివూనుటయును." [illegible] 3, ఆ. 11: చూ, వారణము. 1.

అంకిలిపడు. ద్వ. అ. క్రి. అశ్వాంతగమగు. "క. దైవికమై, యంకిలి పడియెడి పనులకు, సంకటపడుటదియు నొక విచారమె చెపుడా." భో. 6, ఆ. 376: చూ, నట్టువడు.

అంకిలిపెట్టు. దే. స. క్రి. అడ్డగించు "వాఁ, డాయతిశక్తి నన్ను నిటనంకిలి పెట్టినయప్డు" రా. సుం, కాం. 71 : చూ, వారించు.

అంకు. దే. వి. 1. రూ- అంకమ్మ: చూ, మహాలక్ష్మి. 3; 2. తాళిమాలము చూ, అంకిలి. 1.

అంకుటము. సం. వి. అ. పుం. గడియమాని నుఁదీసెడి వంకర యినుపకమ్మి, కుంచె కోల : చూ, బీగము.

అంకుఁడు. దే. వి. దేవుఁడు చూ, వేలుపు.

అంకురము. సం వి. అ. పుం. 1. రూ-అంకూరము మొలక: చూ, మొక్క. 1; 2 జలము: చూ, సలిలము; 3. నెత్తురు చూ, రక్తము. 1; 4. రోమము. చూ, వెండ్రుక. 1.

అంకురములు. పా. ఏకదళబీజము, ద్విదళబీజము అని ద్వివిధము.

అంకురాలి. సం. వి. ఈ. స్త్రీ. నాటుటకుఁగాను దట్టముగా విత్తులఁబోసి మొలపించిన మొలకలు, కోఁగు: చూ, నారు. 1.

అంకురించు. సం. అ. క్రి. కందళించు చూ, మొలకెత్తు.

అంకురితము. సం. విశే. (అ. ఆ. అ.) మొలకెత్తినది: చూ, సంభూతము. (రూ-అంకూరితము.)

అంకుశదుర్ధరము. సం. వి. అ. పుం. మదపుటేనుఁగు: చూ, హస్తి.

అంకుశన్యాయము. సం. వి. అ. పుం. గొప్పయేనుఁగు చిన్నదియగు నంకుశమునకు లోఁబడి నరీతి.

అంకుశము. సం. వి. అ. పుం. 1 = అంకుసము, ఏనుఁగు కుంభస్థలముమీఁద బొడిచెడియాయుధము. (చూ, సృణి.) : చూ, బాణము. 1.

అంకుశరేఖలు. ఆం. పాదరేఖలలోని విశేషము, రాజమాత్య లక్షణము: చూ, లక్షణము. 1. (పాదమందు అంకుశ, కుండల, మాలికాదిరేఖలున్న భాగ్యవంతులగు రాజులకు లగ్నయగునుట శాస్త్రము.)

అంకుసంబుమాద్రి. ద్వ. వి. మాల: చూ, నక్షత్రము. 1.

అంకుసము. వై. వి. = అంకుశము: చూ, అంకుశము.

అంకూరము. సం వి అ. పుం. రూ-అంకురము, మొలక: చూ, మొక్క. 1.

అంకూరితము. సం. విశే: చూ, రూ-అంకురితము.

అంకె. వై. వి. 1 = అంకము. అదను: చూ, సమయము. 1; 2. మెడమీఁదనున్న కాఁడి మెడక్రిందికిఁ దిమ్మెకొనుట. చూ, రూ-అంక. 2; స. 3. = అంక. ఒకటి మొదలగు సంఖ్యలను దెలుపునట్టి రేఖ. చూ, సంఖ్య. 1, 4. = అంక. లోఁకువ చూ, సరము. 1 (రూ-అంకియ)

అంకెగొను. ద్వ. స. క్రి. (అంకె + కొను) ఆచ్ఛాదించు. "గీ. మబ్బు, లందలి పూర్తిగ్రతి రవిమధ్య మంకెగొనఁగఁ, జిక్కువడక చరించు నంకోక్క కరటి." రా, వి. 3. ఆ. 49: చూ, మూయు. 1.

అంకెన. దే. వి. ఒకరకపు పండ్లచెట్టు: చూ, వృక్షము.

అంకెము. దే. వి 1. గుఱ్ఱము రెక్కట క్రిందుప్రక్కలమర్చిన ఇనుకమెట్టు, (రికాబు): చూ, అంకవన్నియ; 2. అండెము: చూ, రూ-అంకియము.

అంకెవన్నియ. ద్వ. వి. (అంకెము + వన్నె చు.) రికాబు. (అంకెకట్టబడిన క్రిందపాదస్థ మార్గము.) "సీ. గోకండికంబులఁ గొమరొందు కళ్లెంబు పలాని పొలంకెవన్నె చాలును." ఉ,

రా. 7, ఆ. 397. చూ, రూ-అంకవన్నియ (రూ. అంకవన్నె.)

అంకవన్నె. దే. వి. —పై—

అంకోడము. సం. వి. అ. పుం. రూ-అంకోలము. ఊడుగు.*: చూ, మహాయమళపత్రిక.

అంకోల. సం. వి. ఆ. స్త్రీ. అగ్నిమంథని *: చూ, తక్కోలకము.

అంకోలగిరి. సం. వి. ఇ. పుం. ప్రియంగువు *: చూ, ప్రేంకణము.

అంకోలబీజన్యాయము. సం. వి. అ. పుం. నేలకు రాలిన ఊడుగువిత్తనములు ఉఱుము వినఁబడఁగానే మరల మ్రానును అంటినరీతి.

అంకోలము. సం. వి. అ. పుం: చూ, రూ-అంకోడము *.

అంక్యము. సం. వి అ. పుం. 1. కరశాఖాయ వంటి మృదంగము; చూ, పీనె; విశే. 2. ఎంచేఁదగినది: చూ, సంఖ్యేయము.

అంగ. సం. అవ్య. 1. సంబోధనార్థకము: చూ, సంబోధనము; 2. సంతోషమును తెలుపుట: చూ, సంతోషము; 3. కైముతిక న్యాయము; అం. 4. కుఱ్ఱిపలు నాలుగింటిలో నొకటి: చూ, కుఱ్ఱిపలు; దే. వి. (1)=అంఘ్రి. కాలు చాఁచిపెట్టిన యడుగు: చూ, పాదము. 1.

అంగచ్ఛేదము. పా. శరీరమందలి యొక భాగమును ఛేదించుట: చూ, అంగవికర్తనము.

అంగజ. సం. వి. ఆ. స్త్రీ. కూఁతురు: చూ, పుత్రిక. 1.

అంగజము. సం. వి. అ. న. 1. నెత్తురు: చూ, రక్తము. 1; 2. మత్తు: చూ, మదము. 1; 3. రోమము: చూ, వెండ్రుక. 1; విశే. (అ. ఆ అ.) 4. దేహమునఁబుట్టినది.

అంగజుఁడు. సం. వి. అ. పుం. 1. కొడుకు: చూ, పుత్త్రుఁడు. 1; 2. మరుఁడు: చూ, మన్మథుఁడు.

అంగజాల. దే. వి. కొజ్జా. "వ. పాదసాదవాని సావిడల్లులు హస్త పల్లవంబులు పట్టితివిచివ నప్పంకజాక్షి కంకణ ఝుణ ఝుణత్కారంబు గాఁగెంగేలు గుదిలించి తివిచికొని వికటకుటి లభ్రుకుటి నట భీషణ ఫాల ఫలకస్సై కలకలం గటికినగవునగి కన్నులనిప్పలురుల హుంకారంబునేసిన...అంగజాలలు కాలు కాలుఁ జెనఁచుకొనిచోఁపక ట్టుపడంగూలిన." కాశీ. 6. ఆ. 227; సారం. 2, ఆ. 270: చూ, సావిడల్లుఁడు.

అంగజాలుఁడు. దే. వి.—పై.—

అంగడి. దే. వి. 1. పసారము, కలుసరకులుంచుకొని యమ్ముడుచోటు. "చ. కొనుఁడు పదార్థ రత్నములు గోరినవానిన యిత్తుమన్తెఱం, గునఁ బచరింతు రంగడులఁగోమటులప్పురి సిద్ధరత్నముల్." భార.ఆది.8, ఆ. 73: చూ, దుకాణము; 2. అగసాలెలోనగువారు పని చేయుచోటు. "మ. జతసాన్నాకిటెఱంగు నం దనరె వర్షావేళ మిన్నంగడిన్." చంద్రా. 4, ఆ. 17: చూ, దుకాణము; 3. రాజసభ, కొలువుకూటము, దివాణము "క. పవనజ గదయును నీగాం, డివమును నెటఁబోయె నంగడికిఁ బాంచాలిం, దివిచికొని వచ్చునెడ." భార. ఉద్యో 4, ఆ. 193: చూ, సభ. 2; 4. గ్రామస్థులు చేరి వ్యవహారము చేయుచోటు, "గ్రామకార్యంబు దీర్చ నంగడికివచ్చి." పాండు. 3, ఆ: చూ, సభ. 2; 5. న్యాయాధిపతి న్యాయము విచారించుచోటు. "ఉ. అంగడి మూఁడు మాడలకు వడ్డుగ దండుగ వానిపైఁ బడుగా." విజ్ఞా పాత్రి. కాం 42: చూ, సభ. 2

అంగణము. సం. వి. అ. న.1.=అంకణము. కక్ష్య, నల్లూచేవరకు చోటు: చూ, ముంగిలి. 2; 2. ఆకాశము: చూ, మిన్ను.

అంగద. సం. వి. ఆ. స్త్రీ. 1. దక్షిణ దిక్కు

వందలి యాఁడేనుఁగు: చూ, హస్తి; దే. వి. (1) కోపము. "చ. అ, య్యనిమిషనాథుఁ బట్టుకొని యంగదవృత్రుఁడు మ్రింగ" భార. ఉద్యో. 1, ఆ. 123: చూ, రోషము; (2) వగ. "చ. పాల కవణంపు టోని నిఁకఁ బూనఁగఁ జాలనటంచు నేలతో, య్యాలి కతి వేల్పు హజ్జఁబడి యంగదతోఁ దన చెందమం తయున్, బోలుపుగ విన్నవించుకొనఁ బోయెనో యన మబ్బు తోవకుం, బలువుగఁ గ్రిమ్ము దుమ్ముగని పాఱెవడిన్ సురగాడ్పు పెంపునన్." అచ్చ. కిష్కిం. కాం, రామా. 5, ఆ 224; అచ్చ. అయో, కాం. 55. చూ, శోకము; (3) ఆయతము. "ఉ. అంగ దఁదత్స్వయంవర మహామహనైగన శ్రేణి హారాతికిన్, గ్రింగన గంటపైఁ గొడుపు వ్రాలుట యొన్నఁడునాఁటనుండియున్, సంగతముం గరంబుగ మనంబున భావనసేయ నైరి యా, మంగళకార్య విష్టులయి మర్త్యమ లోకమునన్ మహీపతుల్." నై. 8. ఆ, 25, కుమా, సం. 12, ఆ. 806: చూ, యత్నము; (4) ఆపద, ఉపద్రవము. "ద్వి. అంగదు యౌవరాజ్యమునందునునిచి, యంగదలేని సౌఖ్యముఁబొందు మీవు." రా. కిష్కిం, కాం. "క. ఓరాయఁడ యీయంగద, కోరు వలేకిటకు వచ్చె నూళ్ళన్నియుం." నీలా. 2, ఆ. 58: చూ, విపత్తు; (5) ఆకలి. "చ. అటుగూడ యుక్కుగుండు కడునంగద మ్రింగిన." రా. ఆర, కాం. 2, ఆ. 121.; నై. 8, ఆ. 178: చూ, బుభుక్ష; దే. అవ్య. (6) సంతాపార్థకము : చూ, సంతాపము.

అంగదట్టము. దే. వి. (అంగము + దట్టము.) స్త్రీలు మొలఁగట్టుకొనెడు వస్త్రము, పావడ "సీ. తతవితంబా భోగధవ కాంచుకములోని యంగదట్టపు కావిరంగువలన, శశికాంతమణి పీఠి వాలోవాలఁగ." పార్వ. 3, ఆ. 27: చూ, వస్త్రము.

అంగదము. సం. వి. అ. న. కేయూరము, సందికడియము: చూ, భూషణము 2.

అంగదములు. అం. దశధ్రువలుగాక మిగిలిన శుభావర్తముల (సుడులు) కు నాగంతుకము లని నామములు. వానిలో నివి రెండు అంగదములు: చూ, ఆగంతుకములు. (అనుబంధములో చూడుము)

అంగదీర్ఘవంతము సం. వి. త్. పుం. ఒకానొక పిట్ట: చూ, పక్షి.

అంగదుఁడు. సం.వి. అ. పుం. 1. వాలి పుత్రుఁడు: చూ, వానరము; 2. భరత మహారాజు కొడుకు: చూ, పుత్రుఁడు. 1.

అంగదేశస్త్రీ. అం. ముఖ్యమగు దేశస్త్రీలలో నొకతె: (చూ, దేశస్త్రీలు.) : చూ, స్త్రీ.

అంగన. సం. వి. ఆ. స్త్రీ. 1. ఉత్తరదిక్కునందలి యాఁడేనుఁగు; చూ, హస్తి; 2 ఆఁడుది: చూ, స్త్రీ; 3. శరీర సౌష్ఠవముగల యాఁడుది. చూ, స్త్రీ, 4. కన్యారాశి: చూ, రాశి. 2; అం. 5. అష్టదిగ్గజముల భార్యలలో నొకతె: చూ, దిగ్గజ భార్యలు.

అంగనము. సం. వి. అ. న. 1. పయనము: చూ, ప్రయాణము; 2.—అంగళ. మొలనూలు; చూ, భూషణము. 2; 3.—అంగణము. నలువేదర పుచోటు: చూ, ముంగిలి. 2

అంగపంచకము. అం. ఉపాయము, సహాయము, దేశకాల విభజనము, ఆపదకుఁబ్రతిక్రియ, కార్యసిద్ధి. (5)

అంగపాలి. సం. వి. ఈ. స్త్రీ. ఆలింగనము: చూ, సంశ్లేషము. (రూ-అంగపాళి.)

అంగప్రాణములు. అం. విరామము, ద్రుతము, లఘువు, గురువు, ప్లుతము, కాకపాదము. (6)

అంగబిల్ల. దే. వి. (అంగము + బిల్ల) ఆఁడుబిడ్డల మొలను గట్టెడి వెండి బంగారముల బిల్ల: చూ, భూషణము. 2.

అంగభవుఁడు. సం. వి. అ. పుం. మరుఁడు: చూ, మన్మథుఁడు.

అంగమచ్చెము. దే. వి. (అంగము + మచ్చెము.) చిహ్నము, గుఱుతు. "శా. ఔనా పోరు దవా పనుంగలఁచి యేలా యింక నీతోడ సెం, తేసేమింపఁగ నాడఁజిక్కె నిదిగో నీయంగమచ్చెంబు నా, చేనీలోనను రాజు తావ లెఁగదా చెక్కిళ్ళను నీకీలు కీల్ గానీ యిందులకేమి తాఁగుమని కేలన్ బొమ్మ తాటించుచున్." సారం. 2, ఆ. 187; "క. దైత్యుని యీయంగమచ్చెములు గన్గొని." రామా. 5, ఆ. 288: చూ, లక్షణము. 1.

అంగమర్దనము. సం. వి. అ. న. ఒడలు పిసుకుట: చూ, సంవాహనము. 1.

అంగమర్దము. సం. వి. అ. పుం.—పై—

అంగమర్దకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ఒడలు పిసుకువాఁడు: చూ, సంవాహకుఁడు.

అంగమర్ది. సం. విణ. (న్. ఈ. న్.)—పై—

అంగమర్దుఁడు. సం. విణ (అ. ఆ. అ.)—పై—

అంగము. సం. వి. అ. న. 1. అవయవము: చూ, విశేషము. 3; 2. అనువు: చూ, వెరవు; 3. ఒడలు: చూ, శరీరము; 4. అప్రాగ్ర్యము: చూ, అప్రధానము; 5. అంగదేశము; చూ, దేశము; స. 6. షట్సంజ్ఞ: చూ, ఆఱు. 1; విణ. 7. అవయవములు గలది: అంగి, అవయవి; 8. సమీపించినది : చూ, సమీపము 2; తద్వి.- అం. 9. సేనాంగములు.-రథము, గజము, తురగము, పదాతి. (4); పంచాంగములు.-తిథి, వారము, నక్షత్రము, యోగము, కరణము. (5); శరీరాంగములు.-కరములు రెండు, చరణములు రెండు, ఉరము, లలాటము, భుజములు రెండు. (8); కన్యాదానాంగములు.-వాగ్దానము, ఫలదానము, కన్యాసంవరణము, కన్యాదానము, నిరీక్షణము. (5); వేదాంగములు.-శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము. (6); వేదోపాంగములు.- మీమాంసము, న్యాయశాస్త్రము, పురాణము, ధర్మశాస్త్రము. (4); రాజ్యాంగములు.- స్వామి, అమాత్యులు, సుహృదులు, కోశము, రాష్ట్రము, దుర్గము, బలము. (7); సభాసప్తాంగములు.- విద్వాంసులు, కవీశ్వరులు, భట్రాజులు, గాయకులు, పరిహాసకులు, ఇతిహాసకులు, పౌరాణికులు. (7); యోగాంగములు.- యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధ్యానము, ధారణ, సమాధి. (8); యోగయమాంగములు.- సత్యము, దయ, క్షమ, ధృతి, మితాహారము, ఆర్జవము, బ్రహ్మచర్యము, ఆస్తేయము, అహింస, శౌచము. (10); నాట్యోపయోగాంగములు.- శిరస్సు, దృష్టి, తారలు, పుటలు, భ్రువులు, నాసికము, గండములు, అధరము, చిబుకము, ముఖము, కంఠము, హస్తములు, వక్షము, జఠరము, పార్శ్వములు, కటి, ఊరులు, జంఘలు, చరణములు. (19); రాగాంగములు.- మధ్యమాది, మాళవశ్రీ, తోడి, బంగాళము, భైరవము, వరాటి, ఘూర్జరి, గౌడము, కోలాహలము, వసంతకము, ధన్యాసి, దేశి, దేశము. (13); రాగోపాంగములు.- ద్రావిడి, ఘూర్జరి, వరాటి(?), మలహరి. (4); వరాట్యుపాంగములు.— కౌతలీవరాటి, ద్రావిడ వరాటి, సైంధవ వరాటి, ఉపస్థాన వరాటి, హతస్వర వరాటి, ప్రతాప వరాటి. (6); తుండ్యుపాంగములు.- ఛాయాతుండి, తురుష్కతుండి. (2); ఘూర్జర్యుపాంగములు.- మహారాష్ట్రఘూర్జరి, సౌరాష్ట్రి, దక్షిణ, ద్రావిడ. (4); వేళావళ్యుపాంగములు.- చుంబి, ఛాయ, కాంత, ప్రతాపము. (4); క్రియాంగములు.- భావక్రియ, స్వభావక్రియ, శివక్రియ, మకరక్రియ, త్రినేత్రక్రియ, [illegible]

క్రియ, భామక్రియ, టంకక్రియ, ఇంద్రి క్రియ, నాగకృతి, ధాన్యకృతి, విజయ క్రియ. (12); 10 తాళప్రాణకళా భేదము: చూ, స్వరము. 2, (చూ, తాళము. 2) (ఇత్యాది); దే. వి. (1) రీతి, చందము "ఉ. అంగము సోకువా పసిఁడి 'యంగము' క్రొన్నెలవంక వెన్నె సన్." విజ. 1, ఆ. 40: చూ, విధము. 1; (2) అందము, సొగసు చూ, సౌందర్యము.

అంగమొల. మి. వి. (అంగము + మొల.) వస్త్రహీనమైన మొల. (ఇక్కడ అంగ శబ్దము వ్యతిరేకలక్షణము నిచ్చుచున్నది) (శ.ర) చూ, దిసమొల.

అంగమొలవాఁడు. ద్వ. వి. బట్టఁ గట్టనివాఁడు. చూ, దిగంబరుఁడు [శిశువు.

అంగమొలవేల్పు. ద్వ. వి. దిసమొలవేల్పు: చూ,

అంగరంగ వైభవములు జా. పెక్కు సంపదలు అంగరంగ వైభవములు. శరీర స్థల వైభవములు. "అంగరంగ వైభవముల సమగ్రంబు లయిన యారగింపుల" సారంగధర చరిత్ర (చూ, రంగరంగ వైభవములు)

అంగరక. దే. వి. పైనధరించే చొక్కాయ చూ, వస్త్రము.

అంగరకా. వా. వి. —పై.—

అంగరక్ష. సం. వి. ఆ. స్త్రీ. 1.=అంగరేకు. -పై.- 2. = అంగరేకు. శిశువుల శరీర రక్షణార్థము చేయు క్రియ: చూ, రక్ష. 2.

అంగరక్షకుఁడు. సం. విణ. రక్షణార్థముకూడఁ బోవుబంటు: చూ, భటుఁడు. 1.

అంగరపూవియలు. దే. వి. ఒకానొక వస్త్రము: చూ, భక్ష్యము.

అంగరాగము. సం. వి. అ. పుం. 1. చందనాదుల పూఁత: చూ, పూఁత. 2. తావి: చూ, పరిమళము. 1; 3. గంధము: చూ, వాసన. 1.

అంగరాజు. సం. వి. అ. పుం 1. రాజునకు తరువాత రాజు, యువరాజు: చూ, రాజు. 1; 2. అంగాధిపుఁడు, కర్ణుఁడు: చూ, రాధేయుఁడు.

అంగరుల్లె. దే. వి. చూ, రూ- అంగరొల్లె.

అంగరుహము. సం. వి. అ. న. రోమము: చూ, వెండ్రుక. 1.

అంగరేకు వై. వి.=అంగరక్షా. 1. పైనధరించే చొక్కాయి. "పాటవ పాత్ర్యంబు లంగ రేకుల వాసు." షట్. 3, ఆ. చూ, వస్త్రము. (రూ-అంగరేకు) ; 2 శిశువుల శరీర రక్షణార్థము చేయు క్రియ. చూ, రక్ష. 2. (రూ-అంగరేకు)

అంగరొల్లె. దే. వి. ఒకానొక భక్ష్యము. "వ. గారెలు బూరెలు మారుండలంగరొల్లెలు . గూల్పాపిడ లాదిగాఁగల భక్ష్యంబులు." హంస. 1, ఆ. 105. చూ, భక్ష్యము. (రూ- అంగరుల్లె )

అంగరేకు. వై. వి.=. చూ, రూ- అంగరేకు.

అంగలారుచు దే. అ క్రి. 1. వగచు: చూ, దుఃఖు 5; 2. భీతిచేనఱచు. చూ, విలపించు. (రూ-అంగలార్చు.- భీతిచే నఱచు "చ. అ, కలవునవాడువాల భుజగింగని గొంద్రని యంగలార్చుచున్." అను 3, ఆ. 19; "ఉ. వెన్నఁబెట్టుకొని పేరిట నేఁటికి నంగలార్చఁగన్."సారం. 2, ఆ.60; హంస. 4, ఆ. 229.)

అంగలారుపు. దే. వి. వగ. చూ, శోకము. (రూ- అంగలార్పు.- రంగారాయచరిత్ర. 3, ఆ. 286.)

అంగవస్త్రము. సం. వి. అ న. ఉత్తరీయము: చూ, వస్త్రము.

అంగవస్త్రాదము. సం. వి. అ. పుం. శ్వేత యవాకము, చీగపేను: చూ, యవాకము.

అంగవించు. దే. అ. క్రి. 1. ఉత్సహించు. నై. 7, ఆ. 49: చూ, యత్నించు; 2. చేరు. పద్మ. 3, ఆ. 123: చూ, సమీపించు; 3. తెగఁబడు. పాండు. 3, ఆ. 51: చూ, సాహసించు; స. క్రి. 4. అతిక్రమించు. నై. 5, ఆ. 145: చూ, దాఁటు 6.

అంగవికర్తనము. పా. చూ, అంగచ్ఛేదము.

అంగవికలుఁడు. సం. విశే. 1. అవయవములు పోయినవాఁడు: చూ, లేవఁజాలనివాఁడు; 2. మూర్ఛిల్లిన వాఁడు: చూ, మూర్ఛితుఁడు. 1.

అంగవికృతి. సం. వి. ఇ. స్త్రీ. మూర్ఛ: చూ, రోగము. 1.

అంగవిక్షేపము. సం. వి. అ. పుం 1 అవయవములకదలిక: చూ, విక్షేపము. 4; 2. వాక్యార్థము నభినయించుట: చూ, వ్యంజకము. 1. (చూ, అభినయము) (చూ, నృత్యము.)

అంగసంగము. సం. వి అ. పుం. శరీరముల కలయిక: చూ, సంయోగము.

అంగసంస్కారము. సం. వి. అ. పుం. నూనెచే దేహమునంటిని మలికిని పోఁగొట్టుట: చూ, తలయంటు. 1.

అంగహారము. సం. వి. అ. పుం. అవయవముల కదలిక: చూ, విక్షేపము. 4.

అంగహీనము. సం. విశే. అవయవలోపము: చూ, అపాంగము. 3

అంగహీనుఁడు సం. వి. అ. పుం. 1. వికలాంగుఁడు: చూ, లేవఁజాలని వాఁడు; 2. మరుఁడు: చూ, మన్మథుఁడు.

అంగళి. నై. వి. 1.=అంగణ. పలుచేదరపు చోటు. చూ, ముంగిలి. 2; 2.=అంగణ. మొలనూలు: చూ, భూషణము. 2.

అంగళ్ళవాడ దే. వి. 1. పలుసరకు లుంచుకొని యమ్మెడు చోటు, పసారము: చూ, దుకాణము; 2. అంగడివీధి: చూ, వీథి. 5.

అంగాంగిభావ సంకరము. సం. వి. అ. పుం. అలంకార విశేషము: చూ, అలంకారము. 3.

అంగాధిపుఁడు సం. వి. అ. పుం. అంగరాజు, కర్ణుఁడు: చూ, రాధేయుఁడు

అంగారకమణి. సం వి. ఇ. పుం. అంగారక గ్రహమునకు ప్రియమగుమణి, పగడము: చూ, రత్నము. 1.

అంగారకము. సం. వి. అ. పుం. 1. అగ్ని: చూ, వహ్ని. 1. 2 గుంట గలగర * . చూ, భృంగరాజము. 1; 3. పచ్చగోరంట* : చూ, మహాసహ.

అంగారకర్పరము. సం. వి. అ. పుం. సువర్ణాది లోహములు కరఁగెడు మూస: చూ, మూస.

అంగారకవారము. సం. వి. అ. పుం. మంగళవారము: చూ, వారము. 1.

అంగారకితము. సం. విశే. బొగ్గుగాఁ జేయఁబడినది: చూ, అంగారితము. 3.

అంగారకుఁడు. సం. వి. అ. పుం. కుజుఁడు: చూ, రాహువు. 2.

అంగారగంధ. సం. వి. ఈ. స్త్రీ. ఇంగువ: చూ, హింగువు.

అంగారగమన. అం. అరువదినాలుగు తంత్రములలో నొకటి: చూ, తంత్రములు.

అంగారిణి. సం. వి. ఈ. స్త్రీ. 1. కుంపటి: చూ, పొయ్యి. (రూ-అంగారిణి.); 2. సూర్యుఁడు విడిచినదిక్కు. (రూ-అంగారిణి.)

అంగారధాని. సం. వి. ఈ. స్త్రీ. కుంపటి: చూ, పొయ్యి. (రూ-అంగారధానిక.)

అంగారపాత్రి. సం. వి. ఈ. స్త్రీ.—పై.—

అంగారపాలి. సం. వి. ఇ. స్త్రీ. నిప్పులమీఁద కాల్చిన రొట్టె: చూ, భక్ష్యము.

అంగారపోణి. —పై.—

అంగారమంజరి. సం. వి. ఈ. స్త్రీ. నిప్పువన్నె గుత్తుల కానుగ * : చూ, కాదమ్నము.

అంగారమంజి. సం. వి. ఈ. స్త్రీ: చూ, అంగారమంజరి *.

అంగారము. సం. వి. అ పుం. 1. అగ్ని: చూ, వహ్ని. 1; 2. నిప్పులేని బొగ్గు: చూ, వహ్ని. 1; 3. ఇంగుది, గార. *: చూ, హింగుది.

అంగారములు. పా. దుర్మాంగారము, శల్యాంగారము, దీపాంగారము, శిలాంగారము. (4)

అంగారవల్లరి. సం. వి ఈ. స్త్రీ: చూ, అంగార మంజరి *.

అంగారవల్లి. సం. వి. ఈ. స్త్రీ. 1. చిఱుతేకు*: చూ, భారంగి; 2. కరంజకము *: చూ, శాడఘ్నము; 3. బండి గురి వెంద *: చూ, తులాబీజము; 4. గుంజ, గురిజ, గురి వెంద *: చూ, శ్వేతపాకి (రూ-అంగార వల్లిక.) [చూ, పొర్రియ్య

అంగారశకటి. సం. వి. ఈ. స్త్రీ. కుంపటి:

అంగారి. సం. వి. ఇ. స్త్రీ.—పై.—

అంగారిక. సం. వి. ఆ. స్త్రీ 1.—పై.—; 2: చూ, చెఱకుగడ; 3. మోదుగు మొగ్గ: చూ, మోదుగు.

అంగారిత. సం వి. ఆ. స్త్రీ. 1. కుంపటి: చూ, పొర్రియ్య; 2. మోదుగు మొగ్గ: చూ, మోదుగు.

అంగారితము. సం. వి. అ. న. 1. మోదుగు మొగ్గ తొడగడము: చూ, ఉత్కలిక; పుం. 2. మోదుగు మొగ్గ: చూ, మోదుగు; విశే. 3. బొగ్గుగా చేయఁబడినది: చూ, అంగారకితము.

అంగారుఁడు. సం. వి. అ. పుం. 1. రూ-అంగారకుఁడు: చూ, రాహువు 2; 2. మాంధాతతోఁ బోరినయొక రాజు: చూ, రాజు. 1.

అంగార్థపీడితము. సం. వి. అ. న. రతిబంధ భేదము: చూ, రతిబంధము. (ఇట్లు-అంగార్థ నిపీడితము.)

అంగార్య. సం. వి. ఆ. స్త్రీ. బొగ్గులరాశి: చూ, వహ్ని. 1.

అంగి. సం. విశే. (న. ఈ. న.) 1. అవయవములుగలది. చూ, అంగము. 7; 2. దేహము గలది: చూ, శరీరము; 3. ముఖ్యమైనది: చూ, శైరిష్ఠ్యము; పై. వి. (1)=అంగిక. మోఁగాళ్లదాఁక వ్రేలాడు చొక్కాయ; పైనధరించు చొక్కాయ; చూ, వస్త్రము. (రూ-అంగీ. అంగరక)

అంగిక. సం. వి. ఆ. స్త్రీ. 1. అవిక: చూ, వస్త్రము, 2. =అంగి. మోఁగాళ్లదాఁక వ్రేలాడు చొక్కాయ, పైనధరించు చొక్కాయ. సమీ. 1, ఆ. 74: చూ, వస్త్రము.

అంగికము. సం. వి. అ. న. కనుబొమలుఁ గదల్చుట మొదలగునవి, అభినయవిశేషము (చూ, అభినయము.) చూ, వ్యంజకము. 1.

అంగిటిగుంట ద్వ. వి కుత్తుక మొదటనుండు గుంట. రామా. 8, ఆ. 155. చూ, వాలిక.

అంగిటిముల్లు. దే. వి. 1. గళాంకురము, కుత్తుక లోపలఁగలిగెడురోగము. బస. 53, పారట. 24, పం: చూ, రోగము 1; 2 కుత్తుక మొదటనుండుగుంట. బస. 52, పారట. 23, పం: చూ, వాలిక.

అంగిరసుఁడు సం. వి. అ. పుం. 1. నవబ్రహ్మలలో నొకఁడు. చూ, బ్రహ్మ. 1; 2. సప్తఋషులలో నొకఁడు చూ, ముని. 1.

అంగిరస్సు. అం. మహీనతానము లేడింటిలో నొకటి: చూ, మహీనతానములు.

అంగిరుఁడు. సం. వి. అ. పుం చూ, అంగిరసుఁడు.

అంగిలి. దే. వి. అంతర్గళము, లోకుత్తుక, దశ. 1, ఆ. 196; చూ, మెడ.

అంగలిగుంట. ద్వ. వి. కుత్తుక మొదటనుండు గుంట. రూ-అంగిటిగుంట: చూ, వాలిక.

అంగీ. పై. వి.=అంగిక. మోఁగాళ్లదాఁక వ్రేలాడు చొక్కాయ, పైనధరించు చొక్కాయ: చూ, వస్త్రము.

**అంగీకరించుట.** సం. అ. క్రి, స. క్రి. అనుమతించుట. మార్క. 1, ఆ. 45; చూ, సమ్మతించుట.

**అంగీకారము.** సం. వి. అ. పుం. 1. అనుమతి: చూ, సమ్మతము. 1; పా. 2. వ్యాపారములో పొందికలు మున్నగు వానినిఒప్పుకొనుట.

**అంగీకృతము.** సం. విశే. అంగీకరింపఁ బడినది: చూ, స్వీకృతము. [రము.

**అంగీకృతి.** సం. వి. ఇ. స్త్రీ. చూ, అంగీకా

**అంగీయము.** సం. విశే. శరీరసంబంధ మయినది.

**అంగు.** దే. వి. 1. రీతి, చందము. చంద్రా. 6, ఆ. 9: చూ, విధము. 1; 2. సొగసు. య. 8, ఆ. 52: చూ, సౌందర్యము.

**అంగుటము.** వై. వి. 1.=అంగుష్ఠః. బొట్టనవేలు. భార. అర. 2, ఆ. 104; కకు. 1, ఆ. 162: చూ, వేలు.2; 2. వేళ్లు: చూ, వేలు. 1.

**అంగుడుదుడిపి.** దే. విశే. పోడిగొట్టు: చూ, మూఢకుడు. 1. (రూ. అంగుడుదుడుకు.)

**అంగురి.** సం. వి. ఇ. స్త్రీ. రూ. అంగులి: చూ, కొండముచివర.

**అంగురీయకము.** వై. వి. =అంగులీయకః. ఉంగరము: చూ, భూషణము. 2.

**అంగులి.** సం. వి. ఇ. స్త్రీ. 1: చూ, రూ-అంగురి; 2. వేళ్లు: చూ, వేలు. 1. (రూ-అంగుళి.)

**అంగులితోరణము.** సం. వి. అ. న. 1. మెడఁబట్టి గెంటుట; 2. అర్ధచంద్రాకారపుబొట్టు: చూ, బొట్టు. 1.

**అంగుష్ఠతర్జనీరేఖ.** సం. వి. ఆ. స్త్రీ. గండదోషములను దెలియఁజేయు గుఱుతు: చూ, లక్షణము. 1.

**అంగుష్ఠపార్శ్వరేఖ.** సం. వి. ఆ. స్త్రీ. పశుసంఖ్యా సూచనము: చూ, లక్షణము. 1.

**అంగుష్ఠము.** సం. వి. అ. పుం. 1.=అంగుటము. బొట్టనవేళ్లు: చూ, వేలు. 2; 2. వేళ్లు: చూ, వేలు. 1.

**అంగుష్ఠాదిరేఖ.** సం. వి. ఆ. స్త్రీ. భ్రాతృసంఖ్యా లక్షణము: చూ, లక్షణము. 1.

**అంగుళము.** సం. వి. అ. పుం. ఆఱు యవబీజముల పరిమాణము, వేళ్లు: చూ, వేలు. 1; 2. బొట్టనవేళ్లు: చూ, వేలు. 2; అం. 3. శ్రీమద్వాల్మీకి రామాయణ ప్రతిపాదిత శ్రీరామచంద్ర మహాపురుష సాముద్రిక లక్షణములు ముప్పది రెండింటిలో నిరువది రెండవదగు చతుర్హ్రస్వములలో మొదటిది: చూ, లక్షణము. 1.

**అంగుళిత్రము.** సం. వి. అ. న. ఉడుముతోలుతోఁ గుట్టి వేళ్లకుఁ దొడిగికొను కవచము: చూ, వారవాణము.

**అంగుళిత్రాణము.** సం. వి. అ. న.—పై.—

**అంగుళిపర్వములు.** అం. శ్రీమద్వాల్మీకి రామాయణ ప్రతిపాదిత శ్రీరామచంద్ర మహాపురుష సాముద్రిక లక్షణములు ముప్పది రెండింటిలో ఇరువదిమిదవదగు నవతనువులలో ఆఱవది: చూ, లక్షణము. 1.

**అంగుళిమానము.** సం. వి. అ. న. మూర, జేన మొదలైన కొలత; (రూ-అంగుళీమానము.)

**అంగుళిముద్ర.** సం. వి. ఆ. స్త్రీ. పేరుచెక్కిన యుంగరము: చూ, భూషణము 2. (రూ-అంగుళీముద్ర.)

**అంగుళిమోటనము.** సం. వి. అ. న. మెటికలు విఱుచుట: చూ, ప్రుచ్ఛటి.

**అంగుళిస్ఫోటనము.** సం. వి. అ. న.—పై.—

**అంగుళీటము.** సం. వి. అ. న. ఉంగరము: చూ, భూషణము. 2.

**అంగుళీత్రాణకీర్తనము.** అం. ధనుర్విద్యావిలాస మందుండు నలుబదాఱు ప్రమేయములలో నొకటి: చూ, ప్రమేయములు.

**అంగుళీబీజము.** సం. వి. అ. న. కుండలదుద్రుము*: చూ, వెమ్మము.

అఖర్వము. సం. విశే. మహత్తైనది, ఉత్కృష్ట మైనది.

అఖాతము. సం. వి. అ. పుం.=అగడిత. 1. మనుష్యులచే(ద)్రవ్వఁబడని కోనేఱుమొదలగు నీరుకుంటి:చూ, పరిఖ; 2. కోటచుట్టు త్రవ్వఁబడిన జలాధారము:చూ, పరిఖ.

అఖిలము. సం. విశే. 1 అంతయు:చూ, సర్వము; 2. దూఱు:చూ, నింద. 1.

అగం(ద్రపాకు. ద్వ. వి:చూ, అగ్గిపేం(ద్రపాకు.*.

అగచరము. సం. వి. అ. పుం. కోఁతి:చూ, వానరము.

అగచోట్లపోతు. దే. విశే. ఆపదలు పొందుటయే స్వభావముగాఁగలవాఁడు :చూ, కడగండ్లమారి. [ట్లమారి.

అగచోట్లమారి. దే. విశే.—పై.—(రూ-అగసా

అగచోట్లు. దే. వి. బ. (అగ్గము + చోటులు.) ఆపద:చూ, విపత్తు. [1

అగజాత. సం. వి. ఆ. స్త్రీ. గౌరి:చూ, పార్వతి.

అగడారు. దే. వి. దూఱు:చూ, నింద. 1.

అగడిత. పై. వి.=అఖాతమ్:చూ, అఖాతము. 1, 2. (రూ-అగడ్త.)

అగడు. దే. వి. 1: చూ, నీటిదయ్యము; 2. దూఱు:చూ, నింద. 1: విశే. 3. నింద్యము: చూ, నింద. 1.(రూ-అపడు-అవసడి-అవసరి, అపదూఱు-అగడారు.)

అగఁడుగాకి. దే. విశే:చూ, నిందితుఁడు. [10.

అగడుగాఁడు. దే. విశే.—పై.—హర. 5, ఆ.

అగడుపడు. ద్వ. అ. క్రి. 1. తిట్టుపడు:చూ, దూఱుపడు; 2. లోటుపడు. వసు. 6, ఆ. 62:చూ, పంభ్రమించే.

అగడుసేయు. దే. స. క్రి. 1. దూఱు:చూ, నిందించే; 2: చూ, తిరస్కరించే.

అగడ్త. పై. వి.=అఖాతమ్:చూ, రూ-అగడిత.

అగణితము. సం. విశే. లెక్కలేనిది:చూ, అసంఖ్యేయము. [ట్టన.

అగత్యము. వా. క్రి. విశే. ఆవశ్యము:చూ, క

అగదంకారుఁడు. సం. వి. అ. పుం. వైద్యు:చూ, వైద్యుఁడు. [మందు. 1.

అగదము. సం. వి. అ. పుం. ఔషధము:చూ,

అగప. వా. వి. 1. రూ-అపక, చేకూను(అనికొందఱు):చూ, పేలి. 2; 3. రూ-అపక-అఖక; కొయ్యకు టెంకాయచిప్పనుగ్రుచ్చి గరిఁటెపలెచేసినది:చూ, డోకి.

అగపడు. ద్వ. అ. క్రి. (అగ్గము + పడు.)రూ-అగ్గపడు. భీమ. 3, ఆ. 30:చూ, ప్రత్యక్షమగు; 2. అధీనమగు:చూ, లోఁబడు.

అగపాటు. ద్వ. వి. 1. అగపడుట; 2. అధీనమగుట. రూ-అగబాటు-అగ్గపాటు;(సం.ప.):- అధీన్యము.

అగబాటు. ద్వ. వి. 1. :చూ, రూ-అగపాటు. 2; 2. కష్టము:చూ, శోకము

అగమము. సం. వి. అ. పుం. 1. కొండ:చూ, పర్వతము; 2. పాము:చూ, సర్పము; 3. చెట్టు:చూ, వృక్షము.

అగము. సం. వి. అ. పుం —పై.—; 4. విషవిశేషము:చూ, వసనాభి; 5. సంచరించుటకు అశక్యమైన పర్వతశిఖరముయొక్క క్రిందిచోటు,తటము:చూ, చేఱియ.

అగరు. సం. వి. అ. న.=అగలు. 1. చందనవిశేషము:చూ, రాజార్హము; అం. 2 గంధములు ఎనిమిదింటిలో నొకటి: చూ, గంధములు; దే. వి. (1):చూ, తీండ్రము.

అగరుచెక్క. ద్వ. వి. చేందనపుచెక్క:చూ, అనామయము. 2. [దనము.

అగరుమ్రాకు. ద్వ. వి. గందము*: చూ, చం

అగరువు. సం. వి. ఉ. న.=అగలు. 1. చందనవిశేషము:చూ,రాజార్హము; పుం. 2. ఇరుగుడు*:చూ, శింశుప.

అగర్భము. అం. ప్రాణాయామములురెండింటి లోనొకటి:చూ, ప్రాణాయామములు.

అగలించే దే. స. క్రి. వెల్లగించే.చూ, భేదిల్లు 1

అగలు. వై. వి.=అగరువు. 1:చూ, అగరు 1-2 (రూ-అగలు,అగులు.); దే. అ. క్రి. 3. చీలు చూ, భేదిల్లు. 2; 4. పెల్లగిల్లు:చూ, భేదిల్లు 1. (రూ-అగలుచే-అగిల్చు.)

అగలుచేట. దే. వి. వెల్లగించేట:చూ, ఉత్పాటనము.

అగలుసత్తు. వై. వి. చంపనవిశేషము: చూ, రాజార్హము.

అగలుసొంటి. వై. వి. చిఱుబొద్ది: చూ, శీర్షకర్ణి

అగవాన్ను. దే. వి. బ. (అగ్గము + వాఱులు.) తేలికయైన ఓరట్టు చెప్పలు.చూ, పాదుక.

అగవు. దే. వి. కార్యము:చూ, పని. 2. (అగవు తగవులు=శుభ కార్య మందలి బహుమానములు.)

అగసాట్లమారి. దే. విశ: చూ, గూ-అగచాట్లమారి.

అగసాలె. ద్వ. వి. (అగ్గము + సాలె.) కంసాలి. నీలా. 3, ఆ. 3.చూ, స్వర్ణకారుడు- (రూ-అగసాలి-కంసాల-కంసాలి-కమసాల-కమసాలె.)

అగసి. వై. వి.=అవిసి, అగస్తి *:చూ, శుకనాసము. 1. (రూ-అగసియ-అగసె)

అగస్తి. సం. వి. ఇ. పుం. 1. అగస్త్యుడు:చూ, ముని. 1; 2.=అగసి-అగిసియ-అగిసె-అవిసె *:చూ, శుకనాసము. 1.

అగస్త్యకము } అగస్త్యము. } సం. వి. అ. పుం.=అగసి-అగిసియ-అగిసె-అవిసె* :చూ, శుకనాసము. 1.

అగస్త్యభ్రాత. పా. అగస్త్య మునితోడఁబుట్టిన వాఁడు. (నిష్ప్రయోజకుఁడని వాడుక.)

అగస్త్యమాత్రము. సం. వి. అ. న. సంద్రము: చూ, సముద్రము.

అగస్త్యవ్యాకరణము. అం. వ్యాకరణములు తొమ్మిదింటిలోనొకటి:చూ, వ్యాకరణములు.

అగస్త్యుఁడు. సం. వి. అ. పుం. ఒకానొక ముని:చూ, ముని. 1.

అగాదు. దే. వి. తుపాకి పిరంగి లోనగువాని ధ్వని; తుపాకి పిరంగిలోనగువాని మందు నప్పుడగిలించేట. రసి. 4, ఆ. 95. చూ, స్వరము. 2.

అగాధము సం. వి. అ. పుం. 1. బొక్క: చూ, రంధ్రము. 1; విశ. 2. మిక్కిలిలోఁతుగలది: చూ, లోఁతు. 2.

అగారము. సం. వి. అ. న. ఇల్లు: చూ, సదనము. 1.

అగావు దే వి. 1. తాకట్టు చూ, వారకము; 2. ఆగోపవతమైనవింద: చూ, నింద. 1.

అగిని. వై. వి.=అగ్ని:చూ, వహ్ని. 1.

అగిసియ. వై. వి.=అగస్తి: చూ, రూ-అగసి *.

అగు. దే. అ. క్రి. 1. రూ-అవు చూ, రచణించే, స. క్రి. 2. పొందు:చూ, ప్రాపించే; ద్రి. 3. అంగీకారమును దెలుపును:చూ, సమ్మతి. 1.

అగుఁగదే. దే. అవ్య. (అగును + కదే.) రూ-ఔఁగదే. ఆశ్చర్యార్థకము:చూ, వింత. 1.

అగుఁగాక. దే. అవ్య. (అగును + కాక.) అంగీకారార్థకము, అవును: చూ, సమ్మతి. 1.

అగుఁబొమ్ము. దే. అవ్య. (అగును + పొమ్ము.) 1.—పై.— 2. యథార్థకము:చూ, సత్యము. 1.

అగుట. దే. వి. ఒప్పిదమగుట: చూ, కావుట.

అగుదెంచే. దే. అ. క్రి. (అగు + తెంచు.) అగు, ఒప్పిదమగు:చూ, రచణించే.

అగుర. దే. అవ్య. (అగును + ర.) రూ-అగురా. ఆశ్చర్యార్థకము, అవుర. (ఆమ్రేడితమందు అగురగుర. రామా. 7, ఆ. 88.):చూ, వింత. 1;

అగురు. దే. వి. 1. రూ-అవురు. వీరణము, అవురుగడ్డి*: చూ, తృణము. 1; 2. =అగరువు. చందనవిశేషము: చూ, రాజార్హము.

అగరువు. సం. వి. ఉ. పుం, న.=అగలు. 1. నల్లనియగలు: చూ, రాజార్హము, న. 2 ఇరుగుడు. *. చూ, శింశుప; పుం. 3. ఇంగిలీకము చూ, హింగుళము; 4. లఘ్వ్యక్షరము: చూ, వర్ణము. 1; విశే. 5. చిన్నది.

అగులు. దే. అ. క్రి. 1. చీలు: చూ, భేదిల్లు. 2; 2. ఊడు. చూ, రాలు.

అగువు. సం. విశే. ఉ. చేర్చినది. [నించు

అగోచరము. దే. విశే. కానరానిది: చూ, కంచు

అగోచరుఁడు. సం. విశే. అంతర్హితుఁడు: చూ, కానరానివాఁడు.

అగోద. సం. వి. ఆ. స్త్రీ. గౌరీవివాహకాలమందు ఈశ్వరుని హస్తమువలనఁ బుట్టిన యేఱు, కరతోయ: చూ, నది.

అగౌకసము. సం. వి. స. పుం. 1. పిట్ట: చూ, పక్షి; 2. సింగము: చూ, సింహము. 1; 3 మీఁగండ్లమెకము: చూ, శరభము. 1.

అగౌరవము. సం. వి. అ. న. అపకీర్తి: చూ, బన్నము. 2.

అగ్గపడు. ద్వ. అ. క్రి. (అగ్గము + పడు.) 1. రూ-అగపడు: చూ, ప్రత్యక్షమగు; 2 అధీనమగు: చూ, లోఁబడు.

అగ్గపాటు. ద్వ. వి: చూ, రూ-అగపాటు.

అగ్గము. దే. విశే. 1. అధీనము: చూ, వశము 1; 2. కనఁబడినది. భోజ. 3, ఆ. 177: చూ, దృష్టము. 2.

అగ్గలము. దే. విశే. 1. అతిశయము: చూ, హెచ్చు 2; 2. అధికము: చూ, హెచ్చు. 1.

అగ్గలించు. దే. అ. క్రి. 1. అతిశయించు: చూ, ముమ్మరించు; 2. పూను: చూ, యత్నించు.

అగ్గలింపు. వై. వి.=అర్ఘ. పొగడిక: చూ, స్తోత్రము.

అగ్గలిక. దే. వి. రూ-అగ్గలికము. 1. తహతహ: చూ, వ్యసనము; 2. పూనిక: చూ, యత్నము; 3. యౌవనామలవల్లనగలుగు గర్వచేష్ట: చూ, విలాసము. 2; 4. వీరము: చూ, శౌర్యము. 1; 5. ఆధిక్యము: చూ, హెచ్చు. 2.

అగ్గి. వై. వి.=అగ్ని. 1. రూ-అగిని. చూ, వహ్ని. 1; 2. చేతనాచేతనాగ్ని: చూ, వహ్ని. 1.

అగ్గించు. వై. స. క్రి పొగడు: చూ, స్తుతించు.

అగ్గింపు వై. వి.=అర్ఘ. పొగడిక: చూ, స్తోత్రము.

అగ్గికంటి. ద్వ. వి. ముక్కంటి. చూ, శివుఁడు.

అగ్గిచూలి. ద్వ. వి. కుమారస్వామి చూ, స్కందుఁడు.

అగ్గిటిక. వా. వి. చెకుముకిరాయి: చూ, రాయి.

అగ్గితత్తడి. వై. వి పొట్టేలు చూ, మేషము. 1.

అగ్గిపుల్ల. దే. వి నిప్పుపుట్టించు పుడక.

అగ్గిపెట్టె వా. వి నిప్పుపుల్లలపెట్టె.

అగ్గిఁబోడి. వై. వి. కరదీపిక. చూ, దివిటీ.

అగ్గిగొడ్డు. దే. వి. రాయి ఉక్కుముక్క దీని యొకపిడిసలనకలిగిన నిప్పునాకర్షించు నులు కాత్రిడు: చూ, సూత్రము. 1.

అగ్గిమేడి. ద్వ. వి: చూ, అగ్నిమేడి*.

అగ్గివాన వా. వి. అగ్నివర్షము.

అగ్గివేంద్రపాకు. ద్వ. వి. చూ, అగింద్రపాకు*.

అగ్గువ. వై. వి.=అర్ఘ్య. వెలతక్కువ, చేవుక: చూ, వెల 1; 2. ఖరీదు. చూ, వెల. 2.

అగ్గెడ. వై. ద్రి. అక్కడ: చూ, తత్ర.

అగ్నాయి. సం. వి. ఈ. స్త్రీ. అగ్నియొక్క భార్య: చూ, స్వాహా. (చూ, భార్య.)

అగ్ని. సం. వి. ఇ. పుం. 1.=అగిని- అగ్గి: చూ, వహ్ని. 1; 2. చిత్రమూలము: చూ, వహ్నిసంజ్ఞకము; 3. జీడి*: చూ, భల్లాతకి: 4. ఇంద్రుఁడు: చూ, వేలుపుఱేఁడు; 5. పరిశుద్ధుఁడు: చూ, పూతాత్ముఁడు; అం. 6. దిగధిపతులు ఎనమండుగురిలో నొకఁడు: చూ, దిగధిపతులు.

అగ్నికణము. సం. వి. అ. పుం. విస్ఫులింగము, మిడుఁగుఱు: చూ, వహ్ని. 1.

అగ్నికము. సం. వి. అ. పుం. 1. క్షుద్రాగ్నిమంథము, పిన్నగెల్లి*: చూ, గెల్లి; 2. రక్తఫలనారికేళము, ఎఱ్ఱచెన్నంగి*: చూ, నారికేళము.

అగ్నికుమారము. పా. ఘుటికౌషధము.

అగ్నిచిత్తుఁడు. సం. వి. త్. పుం. ఒకానొక పితృదేవత: చూ, యముఁడు.

అగ్నిచిత్తు. సం. వి. త్. పుం. 1. అగ్నిచయనమనుయాగము చేసినవాఁడు: చూ, గాతువు. 4. (ఇదివిచార్యము); 2. బొగ్గు: చూ, వహ్ని. 1; అం. 3. రహితానములేడింటిలో నొకటి: చూ, రహితానములు.

అగ్నిజారము. సం. వి. అ. పుం. 1. చిత్రమూలము*: చూ, వహ్నిసంజ్ఞకము; 2. మంట. చూ, వహ్ని. 1. [చూ, హాలిని.

అగ్నిజిహ్వా. సం. వి. అ. స్త్రీ. చెన్నచెలికు*:

అగ్నిజ్వాల. సం. వి. అ పుం. 1. మంట: చూ, వహ్ని. 1; అ. స్త్రీ. 2. ఏలుజాజి*: చూ, ధాతకి.

అగ్నితుండిరసము. పా ఒకరసౌషధము.

అగ్నిదృక్కు. సం. వి. శ్. పుం: చూ, శివుఁడు.

అగ్నివక్రజరాయువు. సం. వి. ఉ. పుం. మంట: చూ, వహ్ని. 1.

అగ్నినిర్యాసము. సం. వి. అ. పుం.—పై.—

అగ్నిపర్వతము. సం. వి. అ. పుం. నిప్పుకొండ: చూ, పర్వతము.

అగ్నిబీజము. సం. వి. అ. న. 1. బంగారు: చూ, లోహము. 1; 2. 'రం' అనుబీజాక్షరము: చూ, బీజాక్షరములు.

అగ్నిభాస. సం. వి. అ. స్త్రీ. ఎక్కుడుఁదీఁగ*: చూ, మాసేరు. [చూ, స్కందుఁడు.

అగ్నిభువు. సం. వి. ఉ. పుం. కుమారస్వామి:

అగ్నిభైరవము. అం. శివప్రోక్తతంత్రములలోని దినాలుగింటిలో నొకటి: చూ, తంత్రములు.

అగ్నిమంథము. సం. వి. అ. పుం. కూరగెల్లి*: చూ, గెల్లి. [చూ, వైజయంతి. 4.

అగ్నిమంథని. సం. వి. ఈ. స్త్రీ. తక్కిలి *:

అగ్నిమఖము. సం. వి. అ. పుం. అగ్నిహోత్రునారాధించు వేదభాగము: చూ, వేదము.

అగ్నిమణి. సం. వి. ఇ. పుం. సూర్యకాంతమణి : చూ, రత్నము. 1. [మందాగ్ని.

అగ్నిమాంద్యము. పా. జఠరాగ్నిమందము: చూ,

అగ్నిమాత. సం. వి. ఋ. స్త్రీ. చిత్రమూలము*: చూ, వహ్నిసంజ్ఞకము. [ముని.1.

అగ్నిమారుతి. సం. వి. ఇ. పుం. అగస్త్యుఁడు: చూ,

అగ్నిమాలుఁడు. సం. వి. అ. పుం. ఒకానొక పితృదేవత: చూ, యముఁడు. [వాయువు.

అగ్నిమిత్రము. సం. వి. అ. పుం. గాలి: చూ,

అగ్నిమిత్రుఁడు. సం. వి. అ. పుం. శూద్రకుఁడనురాజు: చూ, రాజు. 1. [ల్లాతకి.

అగ్నిముఖము. సం. వి. అ. న. జీడి*: చూ, భ

అగ్నిముఖి. సం. వి. ఈ. స్త్రీ.—పై.—

అగ్నిముఖదీప్త. సం. వి. అ. స్త్రీ. చెన్నచెలికు*: చూ, హాలిని.

అగ్నిముఖుఁడు. సం. వి. అ. పుం 1. బాఁపనయ్య: చూ, బ్రాహ్మణుఁడు; 2. దేవుఁడు: చూ, వేలుపు.

అగ్నిమూల. మి. వి. ఆగ్నేయమూల: చూ, ఆగ్నేయి.

అగ్నిమేడి. మి. వి: చూ, అగ్గిమేడి *.

అగ్నిరసము. పా. ఒకరసౌషధము.

అగ్నిలింగము. సం. వి. అ. న. వహ్నిధూమము. చూ, పొగ.

అగ్నివమిత్రన్యాయము. పా. అగ్గికి చెదలుఁ బట్ట[వనురీతి.

అగ్నివర్ధకము. సం. వి. అ. పుం. ఆవర్తమనెడు మేఘము: చూ, మేఘము. 1.

అగ్నివాహనుఁడు. సం. వి. అ. పుం. ఒకానొక పితృదేవత: చూ, యముఁడు.

అగ్నివృక్షము. సం. వి. అ. పుం. కానరేఁగు*: చూ, రేఁగు. 1.

అగ్నిశిఖ. సం. వి. ఆ. స్త్రీ. 1. విటపమను తరిగొజ్జ *: చూ, హాలిని; 2. శక్రపుష్పియను తరిగొజ్జ *: చూ, హాలిని; 3. కలికారియను తరిగొజ్జ *: చూ, హాలిని; 4. మంట: చూ, వహ్ని. 1.

అగ్నిశిఖము. సం. వి. అ. న. 1. కుంకుమపువ్వు: చూ, వహ్నిశిఖము. 1; 2. కుసుమపువ్వు. చూ, వహ్నిశిఖము. 2.

అగ్నిష్ఠము. సం. వి. అ. పుం. 1. సువర్ణాదిలోహములుకరఁగు మూస: చూ, మూస; 2. పెనము: చూ, పాత్రము: 6.

అగ్నిష్టోమము. అం. 1. సోమయాగము, వసంతకాలమందయిదు దినములలో చేసి ముగించు యాగవిశేషము: చూ, యజ్ఞము. (మఱిన్ని) చూ, సోమయజ్ఞములు; 2. సహీనతానము లేడింటిలో నొకటి: చూ, సహీనతానములు

అగ్నిష్వాత్తుఁడు. సం. వి. అ. పుం. ఒకానొక పితృదేవత: చూ, యముఁడు.

అగ్నిసంఘాంశము. పా. షష్ట్యంశము లలో నొకటి: చూ, షష్ట్యంశములు.

అగ్నిసంస్కారము. పా. దహనక్రియ. (శవమును దహించుట): చూ, దహనసంస్కారము.

అగ్నిసహము. సం. వి. అ. పుం. కప్ప: చూ, మండూకము. 1.

అగ్నిసూతరసము. పా. ఒకరసౌషధము.

అగ్నిస్తంభన. అం. అఱువదినాలుగు కళలలో నొకటి: చూ, కళలు.

అగ్నిహోత్రము. సం. వి. అ. పుం. 1. అగ్గి: చూ, వహ్ని. 1; 2. అహితాగ్నులు ప్రాతస్సాయంకాలములయందుఁ జేసెడిహోమము: చూ, హోమము; 3. దధిపయోరూపమైన హవిస్సు, అగ్నిహోత్రమునందు వేల్చుటకు ఇవురఁబెట్టిన యన్నము: చూ, హవిస్సు. 1.

అగ్నిహోత్రుఁడు. సం. వి. అ. పుం =అగిని, అగ్గి: చూ, వహ్ని. 1.

అగ్నీధ్రుఁడు. సం. వి. అ. పుం. బ్రహ్మగణములలో నొకఁడు, పదియార్వురు ఋత్విజులు యాజకులు అనువారిలలో నొకఁడు: చూ, ఋత్విజుఁడు. 1.

అగ్నులు. అం. 1. గార్హపత్యము, దక్షిణాగ్ని, ఆహవనీయము, సభ్యము, అవసథ్యము. 2. పూర్వాగ్ని, దక్షిణాగ్ని, పశ్చిమాగ్ని, ఉత్తరాగ్ని, సూర్యుఁడు. (5); 3. అగ్నిభేదములు —అనలము, కుకూలము, సగలము, వత్సము (4). (చూ, వహ్ని. 1.)

అగ్రగణ్యము. సం. విశే. అత్యుత్తమమైనదానిగా లెక్కింపఁబడినది.

అగ్రగణ్యుఁడు. సం. విశే. అత్యుత్తమమైనవానిగా పరిగణింపఁబడినవాఁడు: చూ, శ్రేష్ఠుఁడు. 2.

అగ్రగము. అం. హస్తపరిచారములు పదునైదింటిలో నొకటి: చూ, హస్తపరిచారములు.

అగ్రజ. సం. వి. ఆ. స్త్రీ. అక్క: చూ, జ్యేష్ఠ. 4.

అగ్రజన్ముఁడు. సం. వి. న్. పుం. 1. బాఁపనయ్య: చూ, బ్రాహ్మణుఁడు; 2. అన్న: చూ, జ్యేష్ఠుఁడు. 1; 3. నలువ: చూ, బ్రహ్మ 1; విశే. 4. ప్రధానుఁడు: చూ, శ్రేష్ఠుఁడు. 2.

అగ్రజుఁడు. సం. వి. అ. పుం. 1. అన్న: చూ, జ్యేష్ఠుఁడు. 1; 2. బాఁపనయ్య: చూ, బ్రాహ్మణుఁడు.

అగ్రణి. సం. విశే. ఈ. ముఖ్యము: చూ, శ్రైష్ఠ్యము. [గలు. 1.

అగ్రత. సం. అవ్య. అభిముఖము: చూ, ముం

అగ్రతస్థలము. అం. హస్తప్రచారములు పదునైదింటిలో నొకటి: చూ, హస్తప్రచారములు.

అగ్రతస్సరుఁడు. సం విశే. ముందు నడచువాఁడు: చూ, పురోగముఁడు; 2. ప్రధానుఁడు చూ, శ్రేష్ఠుఁడు. 2.

అగ్రతలసంచరము. అం. చరణక్రియ లాఱింటిలో నొకటి. చూ, చరణక్రియలు.

అగ్రధన్వుఁడు. సం. వి. న్. పుం. ఇంద్రుఁడు: చూ, వేలుపుఱేఁడు. [చూ, మామిడి.

అగ్రబీజము. సం. వి. అ. పుం. ముంతమామిడి*:

అగ్రమాంసము సం. వి. అ. పుం. పెద్దయుసిరికపండు ప్రమాణముకలిగి కోలగానుండి పశువుయొక్క పార్శ్వముననుండు శ్రోతమందు ప్రసిద్ధమైన వృక్కయను మాంసము: చూ, వృక్క. (చూ, మాంసము.)

అగ్రము. సం. వి. అ. న. 1. చివర. చూ, నుగ. 3; 2. ఎదురు: చూ, ముందఱ. 1; 3. దగ్గఱ: చూ, సమీపము. 1; 4 గుంపు: చూ, సమూహము; 5. మానవిశేషము, నాలుగు కళ్ళకొలఁదిగల భిక్ష; విశే. 6. ప్రథమము: చూ, మొదలు. 4; 7. ముఖ్యము; చూ, శ్రైష్ఠ్యము; 8. అధికము: చూ, హెచ్చు. 1; పా. 9. హస్తక్షేత్రములు పదుమూఁడింటిలో నొకటి: చూ, హస్తక్షేత్రములు.

అగ్రసరి. సం. విశే: చూ, రూ-అగ్రతస్సరుఁడు.

అగ్రసరుఁడు. సం. విశే.—పై.—

అగ్రస్థానము. పా. ప్రధానమగుచోటు.

అగ్రహారము. సం. వి. అ. పుం. 1. బ్రాహ్మణుల యిండ్లవరుస, నల్లిండ్లు: చూ, పట్టణము; అం. 2. సప్తసంతానములలో నొకటి: చూ, సంతానములు; 3. దానములు పదునాఱింటిలో నొకటి: చూ, దానములు; 4 మహాదానములు పదునాఱింటిలో నొకటి: చూ, మహాదానములు. 2.

ఆగ్రిమ్యుఁడు. సం. విశే. పనులయందు నేర్పరి: చూ, సమర్థుఁడు. [4.

అగ్రిమ. సం. వి. ఆ. స్త్రీ. అక్క: చూ, జ్యేష్ఠ.

అగ్రిమము. సం విశే. ముఖ్యము చూ, శ్రైష్ఠ్యము.

అగ్రిముఁడు. సం. విశే: చూ, అగ్రతస్సరుఁడు.

అగ్రిమెంటు. ఆం. ఒడంబడిక.

అగ్రియము. సం. విశే. రూ-అగ్రీయము. ముఖ్యమైనది. చూ, శ్రైష్ఠ్యము.

అగ్రియుఁడు. సం. వి. అ. పుం. రూ-అగ్రీయుఁడు. 1. ప్రధానుఁడు: చూ, శ్రేష్ఠుఁడు. 2. అన్న: చూ, జ్యేష్ఠుఁడు. 1.

అగ్రీయము. సం. విశే. 1: చూ, రూ-అగ్రియము; 2. ప్రధానమైనవస్తువు: చూ, రూ-అగ్ర్యము.

అగ్రేదిధిషువు. సం. వి. ఉ. పుం. 1. బిడ్డలుగన్న మాఱుమనువుదాని మొదటిబ్రాహ్మణస్త్రీయొక్క భర్త: చూ, భర్త. 1; 2. మాఱుమనువుదాని మొదటిమగఁడు: చూ, భర్త. 1. [స్సరుఁడు.

అగ్రేసరుఁడు. సం. విశే. : చూ, రూ-అగ్రత

అగ్ర్యము. సం. విశే: చూ, రూ-అగ్రీయము.

అగ్రుఁడు. సం. విశే. : చూ, అగ్రతస్సరుఁడు.

అగ్న్యుత్పాతము. సం. వి. అ. న. ఆకాశాదులయందుఁబుట్టిన యగ్నివికారము: చూ, తోఁకచుక్క.

అఘనఘము. సం. వి. అ. న. దధివిశేషము: చూ, పెరుఁగు. 1.

అఘమర్షణము. సం. వి. అ. న. సర్వపాపములను పోఁగొట్టెడి మంత్రము:చూ, మంత్రము. 1. "అఘమర్షణస్నానము."

అఘము. సం. వి. అ. న. 1. దోసము:చూ, పాపము. 1; 2. వ్యసనము:చూ, శోకము; 3. అశౌచము:చూ, మైల. 4.

అఘాటము. సం. వి. అ. పుం.1.=అగడిత-అగడ్త:చూ, పరిఖ; విశే. 2. అడ్డులేనిది:చూ, నిరాఘాటము.

అఘాతము. సం. వి. అ. పుం: చూ, దూ-అఘాతము. 1-2; 3. కొండపగులు:చూ, లోయ

అఘాయువు. సం. వి. ఉ. పుం. 1. పాము: చూ, సర్పము; 2 పాపాలముద్ద:చూ, పాపాత్ముఁడు; 3. కాకి.చూ, వాయసము.1; 4. చామరము:చూ, సురటి; 5. కత్తి చూ, ఖడ్గి. 2.

అఘుఁడు. సం. వి. అ. పుం. 1. అఘుఁడనెడు రక్కసుఁడు: చూ, రాక్షసుఁడు. 1; 2. పాపాలముద్ద: చూ, పాపాత్ముఁడు; 3:చూ, మైలవాఁడు; 4. దుఃఖాన్వితుఁడు: చూ, విమనుఁడు.

అఘృణి. సం. విశే. కాంతిలేనివాఁడు.

అఘో. సం. అవ్య. దుష్టసంబోధనము ,దుష్టునిఁ బిలుచుట, పిలుపు: చూ, సంబోధనము.

అఘోర. అం. శివాననములయిదింటిలో నొకటి: చూ, శివాననములు.

అఘోరము. సం. వి. అ. న. 1. ఈశ్వరుని దక్షిణముఖము; 2: చూ, నక్క; విశే. 3. భయములేనిది: చూ, నిర్భయము.

అఘౌఘము. సం. వి. అ. న. పాపసమూహము.

అఘ్న్య. సం. వి. ఆ. స్త్రీ. 1. ఆవు : చూ, ధేనువు; 2. ఓడ: చూ, ఖోడము.

అఘ్న్యా. సం. వి. ఆ. స్త్రీ. ఆవు:చూ, ధేనువు.

అఘ్న్యై. సం. వి. ఆ. స్త్రీ.—పై.—

అచండి. సం. వి. ఈ. స్త్రీ. 1. సాధువైనయావు: చూ, ధేనువు; 2. కోపములేని యాఁడుది: చూ, స్త్రీ.

అచతురుఁడు. సం. విశే:చూ, అసమర్థుఁడు.

అచపలుఁడు. సం. విశే: చూ, స్థిరుఁడు.

అచల. సం. వి. ఆ. స్త్రీ. పుడమి : చూ, భూమి. 1.

అచలచలన్యాయము. పా. ఓడ మొదలగునవి యెక్కి పోవునపుడుకదలకుండునట్టితీరాదులు నడచుచున్నట్టును, నడచుచున్న యోడ నిలిచినట్టును గనఁబడువిధము.

అచలజిహ్వ. అం. శబ్దాలంకారములలో నొకటి: చూ, శబ్దాలంకారములు.

అచలతారలు. పా. స్థిరనక్షత్రములు: చూ, నక్షత్రము. 1.

అచలము. సం. వి. అ. పుం. 1. కొండ. చూ, పర్వతము; 2. కీలము: చూ, మేకు; విశే. 3. కదలనిది: చూ, స్థిరము; అం. 4. విద్యుత్తులేడింటిలో నొకటి: చూ, విద్యుత్తులు.

అచలుఁడు. సం. విశే: చూ, స్థిరుఁడు.

అచాంచల్యము. అం. మానసిక పూజాకుసుమములు బదునాఱింటిలో నొకటి:చూ, మానసిక పూజాకుసుమములు. [యుండుట.

అచాతుర్యము. సం. వి. అ. న. సామర్థ్యములేక

అచాపల్యము. సం. వి. అ. న. చపలత్వములేకయుండుట. [నము.

అచింతము. సం. వి. అ. న. చోవు: చూ, మగ

అచింతితము. సం. విశే. చింతింపఁదగనిది.

అచింత్యము. సం. విశే. 1. బుద్ధికిలోఁబడనిది; అం. 2. సంఖ్యాభేదములు ముప్పదియాఱింటిలో నొకటి: చూ, సంఖ్యాభేదములు.

అచిత్తు. సం. విశే. 1. ప్రాణములేనిది: చూ, జడము; 2. చిత్తుకానిది, తనంతటతెలియంగ నిది.

అచిరద్యుతి. సం. వి. ఇ. స్త్రీ. మెఱపు:చూ, విద్యుత్తు. 1. [క్షణభంగురము.

అచిరము. సం. విశే. నిత్యముకానిది: చూ,

అచిరాత్. సం. అవ్య. శీఘ్రము: చూ, వేగము. 3.

అచీర్ణము. సం. విశే. ఆచరింపఁబడనిది.

అచుంబితము. సం. విశే. అనుభవింపఁబడనిది.

అచూర్ణము. సం. విశే. పొడిచేయఁబడనిది.

అచేతనత్వము. సం. వి. అ. పుం. ప్రాణములేమి:చూ, జడత్వము.

అచేతనము. సం. విశే : చూ, జడము.

అచైతన్యము. సం. వి. అ. పుం: చూ, అచేతనము.

అచోదితము. సం. విశే. ప్రేరేపింపఁబడనిది.

అచౌర్యము. సం. విశే. దొంగతనము కానిది.

అచ్చి. దే. వి. అచ్చిమట్టము, దేశవిశేషము: చూ, దేశము. [చూ, వెలితి. 2.

అచ్చిక. దే. వి. రూ-అచ్చికము. తగ్గుదల:

అచ్చికబుచ్చిక. దే. వి. రూ-అచ్చికబుచ్చికము. 1. కలుపుఁగోలు: చూ, బుజ్జగింత. 1; విశే. 2. చెవులకువినసొంపయినది (వాక్కు.):చూ, సాంత్వము. 3. [చూ, బుజ్జగింత. 1.

అచ్చికబుచ్చికలు. దే. వి. బ. కలుపుఁగోలు:

అచ్చికబుచ్చికలాడు. దే. స. క్రి: చూ, బుజ్జగించు.

అచ్చికము. దే. వి. 1: చూ, రూ-అచ్చిక; 2: చూ, అచ్చికబుచ్చిక. 1; విశే. 3. తేరినది: చూ, పరిపన్నము. 2.

అచ్చిమట్టము. దే. వి: చూ, అచ్చి.

అచ్చియుండు. వా. స. క్రి. బాకీయుండు.

అచ్చివచ్చు. దే. అ. క్రి: చూ, కలిసివచ్చు.

అచ్చెరియము. వై. వి.=ఆశ్చర్యమ్. అద్భుతము: చూ, వింత. 1. (రూ-అచ్చెరువు-అచ్చెరుపాటు-అచ్చెరువుపాటు )

అచ్చెరుపడు. వై. అ. క్రి.(అచ్చెరువు + పడు.) ఆశ్చర్యపడు: చూ, వెఱగొందు. (రూ-అచ్చెరువుపడు.)

అచ్చెరుపాటు. వై. వి: చూ, అచ్చెరియము.

అచ్చెరువు. వై. వి.—పై.—

అచ్చెరువుపాటు. వై. వి.—పై.—

అచ్యుతము. సం.విశే:చూ, స్థిరము. [రాముఁడు.

అచ్యుతాగ్రజుఁడు. సం. వి. అ. పుం:చూ, బల

అచ్యుతుఁడు. సం. వి. అ. పుం. 1. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1; 2. సని:చూ,శని; 3:చూ, శివుఁడు.

అచేట. దే. ద్రి. అక్కడ: చూ, తత్ర. (రూ-అచ్చేట.) అచోటు- అచోటు- అచ్చోటు- అచ్చోటు-అచ్చో-అటు)

అచేటు. దే. వి, ఏ. ఆస్థానము: చూ, రూ-అచోటు. (రూ-అచ్చేటు.) [లము.

అచోటము. దే. విశే. విరివిరైయినది:చూ, పృథు

అచోటు. దే. వి. ఏ. ఆస్థానము:చూ, రూ-అచోటు. (రూ-అచోటు.)

అచోటు. దే.వి ఏ. 1.—పై.—; ద్రి. 2:చూ, రూ-అచేట.

అచ్చంకారము. వై. వి.=అచ్చంకారము. బయానా, క్రయవిక్రయముల గట్టిమాట: చూ, సత్యంకారము. [అచేట.)

అచ్చేట. దే. ద్రి. అక్కడ:చూ, తత్ర. (రూ-

అచ్చేటచ్చేట. దే. ద్రి:చూ, అక్కడక్కడ.

అచ్చేటు. దే. వి. ఏ: చూ, రూ-అచేటు

అచ్చెనగండ్లు. దే. వి. బ. రూ-అచ్చెనగుండ్లు. 1. బాలికాక్రీడావిశేషము. శశా. 6, ఆ. 202: చూ, బాలికాక్రీడ; 2. అచ్చెనగండ్లాడెడు చిన్నచిన్న గుండుఱాళ్ళు. (గిరియకములు) (బ. అచ్చెనఁగల్లు.) చూ, రాయి.

అచ్చెనగాయలు. దే. వి. బ.—పై.—

అచ్చెనగుండ్లు. దే. వి. బ.—పై.—

అచ్చెవలు. వై. వి.=అచ్ఛ.—పై.—

అచ్చెబంగారము. ద్వ. వి. 1. మేలిమిపన్నె బంగారు: చూ, లోహము. 1; వా. 2. ముద్దుపలుకు.

అచ్చెము. వై. విశ.=అచ్ఛమ్. 1. నిశ్చలమయినది: చూ, సత్యము. 1; 2. తేరినది: చూ, ప్రసన్నము. 2; 3. నిర్ణయింపఁబడినది: చూ, కేవలము 1; 4. తెల్లనిది: చూ, వర్ణము. 6; 5. దట్టము: చూ, సాంద్రము. 2.

అచ్చెముగ. వా. అవ్య. సంశయము లేకుండఁగ.

అచ్చెర. వై. వి.=అప్సరస్. దేవతాస్త్రీ. దేవవేశ్య (అనికొందఱు) చూ, వేలుపులు. 2.

అచ్చెరము. దే. వి. 1. కోపము. వై. 5, ఆ 42: చూ, కోపము; 2. పూనిక: చూ, యత్నము.

అచ్చెరించు. దే. అ. క్రి. కోపగించు: చూ, రోషించు.

అచ్చోకారము. వై. వి.=అచ్ఛంకారమ్: చూ, రూ-అచ్చెకారము.

అచ్చోణి. వా. వి. మంచిముత్తెముపంటిది, శ్రేష్ఠవాచకము.

అచ్చోరము. వై. వి.=: చూ, అచ్చోకారము.

అచ్చోవు. దే. వి. తెల్లనియావు: చూ, ధేనువు.

అచ్చోసు. దే. విశ. (అచ్చెము + అసు.) జంకౌటములేనివాఁడు. "ద్వి. అమోఘబలయుక్తిఁ జొచ్చోసుగాఁగ, వనికిసన్నద్ధులమై యుండము మం." పతివ్రతామాహాత్మ్యము. (అసుఅన్యదేశ్యము.)

అచ్చు. వై. వి. 1. గుడము: చూ, బెల్లము. 1; 2. నీడ: చూ, ప్రతిబింబము. 1; 3. కీర. భో. 7, ఆ. 15: చూ, విధము. 1; 4. అచ్చు సంజ్ఞాక్షరములు చెక్కిన ఉంగరములోనగునది: చూ, ముద్ర; 5. సాలెవానిచేఁత సాధనవిశేషము: చూ, మగ్గము; 6. విశ. అచ్ఛమ్. తేరినది: చూ, ప్రసన్నము. 2; దే. అ. క్రి. 7: చూ, ముగబడు; స. క్రి. 8. ఇచ్చు, దానముచేయు: చూ, దయచేయు. 2; 9. వచ్చువిచ్చు. విజ్ఞా. ప్రా, కాం. 48; విజ్ఞా. ప్రా, కాం. 91: చూ, దండుగిచ్చు.

అచ్చుఁగూటము. ద్వ. వి. (అచ్చు + కూటము): చూ, ముద్రాక్షరశాల. (రూ-అచ్చుకూటము.)

అచ్చుకట్టు. ద్వ. స. క్రి. 1. ఏర్పఱచు: చూ, సృజించు; 2. మడిమడిగా గనిమతీయు. (శ. ర.)

అచ్చుకుప్ప. దే. వి. ధనవంతుఁడు: చూ, ధనికుఁడు. 1.

అచ్చుకూటము. ద్వ. వి: చూ, రూ-అచ్చుఁగూటము.

అచ్చుకొను. దే. స. క్రి. 1. తానియ్యవలసిన ధనాదికమును ఒప్పుకొనియిచ్చు: చూ, దయచేయు. 2; వా. 2 అంగీకరించు, ఒప్పుకొను.

అచ్చుటెద్దు ద్వ. వి. (అచ్చు + ఎద్దు.) అచ్చుపోసి స్వేచ్ఛగాఁ దిరుగవిడచిన వృషభము, అఁబోతు: చూ, వృషభము. 1.

అచ్చుడల. దే. వి. 1. అప్పు: చూ, బాకీ. 2; 2. అచ్చివచ్చుట: చూ, శుభాగమము.

అచ్చుపడు. వై. అ. క్రి. 1. ఏర్పడు: చూ, విశదమగు; 2 ముద్రితమగు, ముద్రపడు.

అచ్చుపాటు. వై. వి. అచ్చుపడుట, ఏర్పాటు: చూ, సత్యము. 1.

అచ్చుపోసిన యాఁబోతులు. జా. స్వేచ్ఛగా (హద్దులేక) తిరుగువాండ్రు. "రాజభటుల

సచ్చేబోడిచిన యాఁబోతులకిలిని విచ్చల విడిగా విడవాడినచో." (ధర్మజ)
అచ్చేలు. పా. అకారాదులు, ప్రాణాక్షరములు: చూ, వర్ణము. 1.
అచ్చేవేయు. వై. స. క్రి: చూ, ముద్రించే.
అచ్చోటు. దే. వి. ఏ. (అ + చోటు.) రూ-అచ్చోటు. 1. అస్థానము: చూ, రూ-అచోటు.(రూ-అచ్చోటు.); 2. అఁడుగుతి. హరి. ఉ. 9, ఆ. 42: చూ, ధగము. 12.
అచ్చొత్తు ద్వ. స. క్రి. (అచ్చే + ఒత్తు.). చూ, ముద్రించే.
అచ్చో. దే. దర్శి: చూ, రూ-అచేట.
అచ్చోట. దే. అవ్య. అచ్చేట: చూ, తత్ర.
అచ్చోటికి. దే. అవ్య: చూ,అందులకు.
అచ్చోటు. దే. వి. ఏ: చూ, రూ-అచ్చోటు.
అచ్ఛంకారము.సం.వి.అ.న=:చూ,అచ్ఛేకారము.
అచ్ఛత. సం. వి. ఆ. న: చూ, స్వచ్ఛత.
అచ్ఛదనుఁడు. సం. వి, అ. పుం. యతి: చూ, ముని. 1.
అచ్ఛపిండ. సం.వి.ఆ. స్త్రీ. పింఁడఖర్జూరము*: చూ, ఖర్జూరము. 2.
అచ్ఛఫల్లము. సం. వి. అ. పుం. రూ-అచ్ఛభల్లము: చూ, ఎలుఁగుబంటి.
అచ్ఛభల్లము. సం. వి. అ. పుం. —పై.—
అచ్ఛము సం. వి. అ. పుం. 1: చూ, ఎలుఁగుబంటి; 2. పటికపురాయి: చూ, రాయి; న. 3.=అచ్ఛన. చూ, శాలికాక్రీడ; విణ 4.=అచ్ఛే. తెల్లనిది: (చూ,ప్రసన్నము.2) చూ, వర్ణము. 6.
అచ్ఛాచ్ఛము. సం. విణ. మిక్కిలి స్వచ్ఛము: చూ, ప్రసన్నము. 2.
అచ్ఛావాకుఁడు. సం. వి. అ. పుం. పదియార్వుర ఋత్విజులు యాజకులు అనువారలలో నొకఁడు: చూ, ఋత్విజుఁడు. 1.
అచ్ఛిద్ర. సం. వి. ఆ. స్త్రీ. చేఁతిబీఱ*: చూ, బీఱ. 2.
అచ్ఛిద్రము. సం. విణ. 1. తూఁటులేనిది: 2. దృఢమైనది:చూ,బెడిదము; 3.యజుర్వేదమునందలిపరాయితములోని మూడవ అట్టమునందుగల ఒకపన్నము: చూ, వేదము; పా. 4. ప్రాయశ్చిత్తము సంపూర్ణమయినదనుట..
అచ్ఛిన్నము. సం.విణ. ఎడతెగనిది, దట్టమైనది: చూ, సాంద్రము. 2. [బడినది..
అచ్ఛీకృతము. సం. విణ. నిర్మలముగాఁ జేయఁ
అచ్ఛేద్యము. సం. విణ. చొరరానిది: చూ, సాంద్రము. 2.
అచ్ఛోదము. సం. వి. అ. పుం. 1. కుబేరుని క్రీడాసరస్సు: చూ, సరస్సు. 1; విణ. నిర్మలమైన నీళ్ళుగలది.
అజ. సం. వి. ఆ. స్త్రీ. 1. ప్రకృతి: చూ, మాయ; 2. ఆఁడుమేఁక: చూ, మేషము. 1.
అజకర్ణము. సం. వి. అ. పుం. నల్లమద్ది*: చూ, మద్ది.
అజగంధిక. సం. వి. ఆ. స్త్రీ:చూ, వాయింటు*
అజగంధిని. సం. వి. ఈ. స్త్రీ.—పై.—
అజగరన్యాయము. పా. కొండచిలువ నిద్రించబో పునట్టేయుండి జంతువులను అనాత్తుగా మ్రింగినవిధము.
అజగరము. సం. వి. అ. పుం. కొండచిలువ (మేఁకను మ్రింగునది):చూ, సర్పము.
అజగరోపవాసము. జా. కొండచిలువయనుపాము ఉపవాసముచేయుట: చూ, ఘోటకబ్రహ్మచర్యము.
అజగర్దము. సం. వి. అ. పుం. 1. నీరుపాము: చూ, సర్పము; 2. నల్లత్రాఁచే:చూ, సర్పము. [పందికాఁడు.
అజగలుఁడు. సం. వి. అ. పుం, జాదరి: చూ, 
అజగవము. సం. వి. అ. న. శివునివిల్లు: చూ, బాణము. 1. (రూ-అజగావము-అజీగవము-అజీగావము-అజగవము.)

**అజఘుష్యుఁడు.** అం. ఆదిత్యులు పండ్రెండుగురిలో నొకఁడు: చూ, ఆదిత్యులు.

**అజన్యము.** సం. వి. అ.న. 1. తోఁకచుక్క లోనగునుత్పాతము: చూ, తోఁకచుక్క. (రూ- అంజన్యము.); విణ. 2. నిందకానిది: చూ, ఉపదూషితము.

**అజప.** సం. వి. ఆ. స్త్రీ. 1. సగమువగపోలిక యు సగము ఆఁడుపోలికయుఁగల రూపము; 2. మంత్రవిశేషము: చూ, మంత్రము. 1.

**అజపుఁడు.** సం. వి. అ. పుం. అధ్యేత, వైదికములుకాని గ్రంథములఁ జదువువాఁడు: చూ, పాఠకుఁడు.

**అజబాజోరేటు.** పా: చూ, అతరాపురేటు.

**అజభక్షము.** సం. వి. అ. పుం: చూ, బొబ్బలి*.

**అజమీఢుఁడు.** సం.వి. అ. పుం. యుధిష్ఠిరుఁడు, పాండురాజు పెద్దకొడుకు: చూ, ధర్మరాజు. 1.

**అజమీళుఁడు.** సం. వి. అ. పుం. పాతాళలోకములోని సర్పవనమునందుండు శివుఁడు: చూ, శివుఁడు.

**అజము.** సం. వి. అ. పుం. 1. మేఁకపోతు: చూ, మేషము. 1; 2. మూఁడేండ్లకిందటి వడ్లు: చూ, ధాన్యము; 3. ఆత్మ: చూ, పరమాత్మ; 4. ఆకాశము: చూ, వ్యోమము. 1; విణ. 5. ఉత్పత్తి నాశములులేనిది.

**అజమోద.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఒకరకము ఓమము: చూ, యవాని; 2: చూ, బూరుగు బంక.

**అజర.** సం. వి. ఆ. స్త్రీ. 1. వృద్ధదారుభేదము: చూ, వృద్ధదారువు*; 2: చూ, కలబంద. *.

**అజర్యము.** సం. వి. అ. న. చెలిమి: చూ, స్నేహము. 1.

**అజలోమ.** సం. వి. ఆ. స్త్రీ: చూ, శశి*.

**అజవాహనము.** సం. వి.అ. పుం. తెలిపిట్ట: చూ, హంస. 1.

**అజశృంగి.** సం. వి. ఈ. స్త్రీ. 1. విషాణి. * (మేఁకకొమ్ములవంటి ఫలములు గలది): చూ, దుట్టుపు; 2. బస్తాంద్రి*: చూ, వద్ది.

**అజస్రము.** సం. క్రి. విణ, అ. న. ఎల్లప్పుడు: చూ, సతతము.2. [మూలగొండి.

**అజహ.** సం. వి. ఆ. స్త్రీ. కంపూఁ*: చూ,

**అజహల్లక్షణ.** అం. లక్షణలు మూఁడింటిలోనొకటి: చూ, లక్షణలు; (సంబంధనిబంధనలు.- జహల్లక్షణ, అజహల్లక్షణఅని ద్వివిధము.)

**అజహ్మము.** సం విణ. రూ-అజిహ్మము, ఋజువు, ప్రగుణము: చూ, హృద్యము.

**అజాగవము.** సం.వి.అ.న: చూ, రూ-అగజవము.

**అజాగళస్తనన్యాయము.** పా. మేఁక మెడక్రింద నుండు స్తనములపుట్టుక నిష్ప్రయోజనమను రీతి.

**అజాగళస్తనము.** సం. వి.అ.పుం. బ. మేఁక మెడక్రింది చన్నులు: చూ, స్తనము.

**అజాగ్రత.** సం. వి. అ. స్త్రీ. రూ-అజాగ్రత్త- జాగ్రత్తలేమి.

**అజాగ్రత్త.** సం వి. అ. స్త్రీ.—పై—

**అజాజి.** సం. వి. ఈ. స్త్రీ. జీలకఱ్ఱ*. (స్వాభావికమైన మందాగ్నినిఁబోఁగొట్టునది.): చూ, సుషవి. 2. [మేఁకలఁగాపరి.

**అజాజీవి.** సం. వి. ఇ. పుం. జాబాలుఁడు: చూ,

**అజాజీవుఁడు.** సం. వి. అ. పుం. 1.—పై.—; 2: చూ, గొంగళ్ళుసేయువాఁడు.

**అజాతశత్రువు.** సం. వి.ఉ. పుం. 1: చూ, అజమీఢుఁడు; విణ. 2. శత్రువులులేనివాఁడు.

**అజాతస్మరాలింగనము.** అం. ఆలింగనములు రెండింటిలోనొకటి: చూ, ఆలింగనములు.

**అజాతస్మరాలింగనములు.** అం. స్పృష్టకము, విద్ధకము, ఘృష్టకము, పీడనము. (4.)

అజాపత్యా. సం. వి. ఆ. స్త్రీ. బ్రహ్మపట్టణము: చూ, దేశము.

అజాపుత్రనామోత్కీర్తనన్యాయము.పా. పుట్టని బిడ్డలకుఁ బేర్లు పెట్టినరీతి. [మందు. 1.

అజాయువు. సం వి. ఉ. పుం. ఔషధము: చూ,

అజావయుక్కు. సం. వి. జ్. పుం. బాణము నకుఁ జిక్కనిమృగము: చూ, విషయము. 5.

అజితప్రతాపము. పా. ఇది పండ్రెండవ జగతీ ఛందస్సునందలి ప్రమితాక్షర వృత్తచ్ఛాయను సరిపాదములున్ను, ద్రియంవదావృత్తచ్ఛాయను బేసిపాదములున్ను నడచును.

అజితము. సం. విశే. 1. అడ్డగింపనశక్యమైనది; అం. 2. ఆగమము లిరువదెనిమిదింటిలో నొకటి: చూ, ఆగమములు.

అజితుఁడు. సం. వి. అ. పుం. 1. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1; 2. నలువ: చూ, బ్రహ్మ. 1; 3: చూ, శివుఁడు; విశే. 4. గెలువఁబడనివాఁడు: చూ, అపరాజితుఁడు.

అజినపత్రి. సం. వి. ఆ. స్త్రీ. జతుక (తోలు వంటి ఱెక్కలుగలది): చూ, చీకురువాయి.

అజినము. సం.వి.అ.న. చర్మము:చూ, తోలు.1.

అజినయోని. సం. వి. ఇ. పుం, స్త్రీ. జింక: చూ, హరిణము. 1.

అజిరము. సం. వి. అ. న. 1. అంగణము: చూ, ముంగిలి. 2; 2. కప్పు: చూ, మండూకము. 1; 3. గాలి:చూ, వాయువు; 4:చూ, శరీరము; 5. శబ్దాదివిషయము; 6. తెప్ప, ఏఱుదాఁటెడుపుట్టి: చూ,హోడము; 7. అవ్యక్తాశము *: చూ, వట్టివేరు.

అజిహ్మగము. సం. వి. అ. పుం. అమ్ము: చూ, బాణము. 1.

అజిహ్వము. సం. వి. అ. పుం. 1. కప్ప: చూ, మండూకము. 1; విశే. 2: చూ, రూ-అజహ్మము.

అజిహ్వము. సం. వి. అ. పుం. 1 కప్ప: చూ మండూకము. 1; విశే. 2. నాలుక లేనిది.

అజీగవము. సం. వి. అ. న. రూ-అజీగావము శివునివిల్లు: చూ, రూ-అజగవము.

అజీర్ణము. సం. వి.అ.న. 1. జీర్ణముకాకపోవుయనురోగము: చూ, రోగము. 1; విశే. జీర్ణముకానిది. [అజీర్ణము.

అజీర్తి. సం. వి. ఇ. న. అమబంధము: చూ

అజీవుఁడు. సం. వి. అ. పుం. అజీవమతప్రవర్తకుఁడు. జీవుఁడులేఁడను మతము నేర్పఱచినవాఁడు.

అజుఁడు. సం. వి. అ. పుం. 1. వెన్నుఁడు:చూ విష్ణువు. 1; 2. నలువ: చూ, బ్రహ్మ. 1 3: చూ, శివుఁడు; 4. దశరథుని తండ్రి చూ, రాజు. 1; 5: చూ, మన్మథుఁడు. 6: చూ, మూర్ఖుఁడు.

అజుష్టము. సం. విశే. సేవింపఁబడినది; చూ ఆసేవితము.

అజైకపాత్తు సం. వి. ద్. పుం. 1. పూర్వప్రోష్ఠపదానక్షత్రి దేవత; స్త్రీ. 2. పూర్వాభద్రపదనక్షత్రము: చూ, నక్షత్రము. 1; అం 3. రుద్రులు పదునొకండురులో నొకఁడు చూ, రుద్రులు. [మేషము. 1

అజౌఘము. సం. విశే. మేఁకలమంద: చూ

అజ్జుక. సం. వి. అ స్త్రీ. నాట్యపరిభాషయందువేశ్య: చూ, రూ-అర్జుక.

అజ్ఝటి. సం. వి. అ. స్త్రీ. నేలయుసిరిక*:చూ భూమ్యామలకి.

అజ్ఝటాఫల. సం. వి. అ. స్త్రీ. గురువెంద * చూ, తులాబీజము.

అజ్ఝల. సం.వి. అ. స్త్రీ. బొగ్గు:చూ,వహ్ని. 1

అజ్ఞత. సం. వి. అ. స్త్రీ. తెలివిలేనితనము చూ, మఱపు. 2.

అజ్ఞత్వము. సం. వి. అ. న.—పై.—

అజ్ఞాతవాసము. సం. విశే. ప్రచ్ఛన్నముగనుండుట, తనపేరు ఊరు ఇతరులకు తెలియనియ్యక మాఱుపేరుతో దాఁగియుండుట.

అజ్ఞానదాయకములు. అం. క్రోధము, హింస, అభోజ్యభోజనము, అసత్యవాదము, అసత్ప్రలాపము, పరనారీసంగత్వము, శఠత్వము, అనాచారము, అకార్యకరణము. (9)

అజ్ఞానమరణము. పా. జన్మలగ్నకారకలగ్నములకు తృతీయమునఁ బాపసంబంధము కలిగి శుభసంబంధమేమియు లేనపుడు కలుగునది.

అజ్ఞానము. సం. వి. అ. న. 1: చూ, అజ్ఞత; అం. 2. హేయగుణములు పదునాలింటిలోనొకటి: చూ, హేయగుణములు.

అజ్ఞాని. సం. విశే: చూ, మూర్ఖుఁడు.

అజ్ఞుఁడు. సం. విశే.—పై.—

అజ్మాయిషీ. వా. వి. కరణముల లెక్కలు మొదలగువానిశోధన.

అస్బజో. పా. అతిగతి, దిక్కుమొక్కు.

అజిబాజోరేటు. పా. సరిహద్దు ధర.

అజీరము. దే. వి. 1. నగరితలవాకిలి చోవడి: చూ, రూ-వాజీరము; 2. ఆస్థానమండపము. ఆ. 7, అ. 33: చూ, సభ. 2. (రూ-అజీరము-వాజోలము-వాజీరము.)

అజ్జ. దే. వి. 1. కాలుచేఁచిపెట్టిన యడుగు, రూ-వాజ్జ: చూ, పాదము. 1; 2. అదను: చూ, సమయము. 1; వై. అవ్య. 3. ప్రశంసవార్థకము: చూ, సెబాసు; (అజ్జో-అజ్జోర-అజ్జోరే-అఝ్ఝో-అఝ్ఝోరే.); 4. నేర్పరితనము: చూ, నైపుణ్యము.

అజ్జము. వై. వి.= అధ్యాయము. 1. అనువాకము, కొన్నివచనములుగల వేదభాగము, పాంచా. 4, ఆ. 125:చూ, వేదము; 2. గ్రంథభాగవిశేషము: చూ, సర్గము. 1.

అజ్జర. ద్వ. అవ్య. (అజ్జ+ర.) రూ-అజ్జరే. ప్రశంసవార్థకము:చూ, సెబాసు.

అజ్జరే. ద్వ. అవ్య. (అజ్జ+రే.)—పై.—

అజ్జవాలు. ద్వ. వి. కోడి: చూ, కుంకో.

అజ్జోఅంబారా. పా. అతిగతి, దిక్కుమొక్కు.

అజ్జోర. వై. అవ్య. రూ-అజ్జోరే. ప్రశంసవార్థకము: చూ, సెబాసు.

అజ్జోరే. వై. అవ్య.—పై.—

అఝ్ఝో. మి. అవ్య.—పై.—(అం, భా. కృ.66)

అఝ్ఝోర. మి. అవ్య.—పై.—(రూ-అఝ్ఝోరే.)

అఝ్ఝోరే. మి. అవ్య.—పై.— (అం. వ. పా)

అట. దే. వి. ఏ. 1. అక్కడ:చూ, అచోటు; •ద్రి. 2. అవుల: చూ, పారము. 1; అం. 3. నూడకము (నూళాది) సప్తతాళములలోనొకటి: చూ, నూడకములు. (చూ, అటతాళము.) (చూ, స్వరము. 2.)

అటక దే.వి రూ-అటుక-అట్టుక-అట్టువ-పట్టుక: చూ, మసెల.

అటకమామిడి. దే. వి. రూ-అటికమామిడి. మండలచ్ఛదము*: చూ, మామిడి.

అటకలి. దే. వి. నూనెజిడ్డును పోఁగొట్టెడివస్తువు: చూ, నలుఁగుపిండి.

అటకాపు. వై. వి. అడ్డము: చూ, వారణము.1.

అటకాయించు. వై. స. క్రి. అడ్డగించు: చూ, వారించు.

అటకావు. వా. వి. అడ్డము.

అటట్యా. సం. వి. ఆ. స్త్రీ. కార్యముకొఱకు (భిక్షకొఱకు) తిరుగుట:చూ, పర్యటనము.

అటతాళము. సం. వి. అ. పుం. తాళభేదము, పదునాలుగు అక్షరముల కాలము, నూడకము (నూళాది) సప్తతాళములలో నొకటి: చూ, అట. 3.

అటని. సం. వి. ఇ. ఈ. స్త్రీ. కోటి:చూ, వింటికొప్పు.

**అటమట.** దే. వి. 1. అపలాపము: చూ, మఱుఁగుమాట; 2. వ్యధ: చూ, శోకము; 3. మోసము: చూ, వంచన; విశే 4. ప్రయోజనములేనిది, వమ్ము. (రూ-అటమటము-అటమర): చూ, వ్యర్థము; 5. అసత్యము: చూ, బొంకు. 1.

**అటమటకాఁడు.** దే. విశే: చూ, వంచకుఁడు.1.

**అటమటము.** దే. విశే. రూ-అటమట-అటమర. 1. అసత్యము:చూ, బొంకు. 1; 2. ప్రయోజనములేనిది, వమ్ము: చూ, వ్యర్థము.

**అటమటించు.** దే. అ. క్రి. 1. కదలు ప్రా. 5, అ. 101: చూ, సరించు; స. క్రి. 2: చూ, వంచించు; 3. దొంగిలించు. వి. పు. 6, అ, 305: చూ, ముచ్చిలించు.

**అటమటింపు.** దే. వి. 1. చలనము:చూ, వడఁకు. 1; 2: చూ, వంచన; 3. వ్యధ: చూ, శోకము; 4. దొంగతనము : చూ, ముచ్చిలి.

**అటమటీఁడు.** దే. విశే. (అటమట + ఈఁడు.) మోసకాఁడు. ఉ. హరి. 3, అ: చూ, వంచకుఁడు. 1.

**అటమర.** దే. వి. 1. చూ, రూ-అటమటకు. 2; 2. యుద్ధమువలనఁబోవుట: చూ, పలాయనము.

**అటమరింపు.** దే. వి: చూ, అటమర. 2.

**అటమున్ను.** దే. అవ్య. అంతకముందు.

**అటరుషము.** సం. వి. అ. పుం.=అడ్డసరము* రూ-అటరూషము: చూ, వైద్యమాత.

**అటరూషము.** సం. వి. అ. పుం.—పై.—

**అటవి.** సం. వి. ఈ. స్త్రీ.=అడవి: చూ, విపినము.

**అటాట్య.** సం. వి. అ. స్త్రీ:చూ, రూ-అటాట్య.

**అటి.** దే. విశే. అటువంటి. ప్రా. 3, అ. 84: రూ-అట్టి.

**అటిక.** దే. వి. రూ-అట్టిక. ఎసల, వేట్టి: చూ, పాత్రము. 6.

**అటికమామిడి.** వా.వి:చూ,రూ-అటకమామిడి*

**అటికము.** సం. వి. అ. పుం. శ్రీవల్లి*:చూ, బకపుష్పము.

**అటు.** దే. అవ్య. అపకారము. కళా. 1, అ. 63: చూ, తథా. 2. (రూ-అటులన్-అటులు-అట్టు-అట్టులన్-అట్టులు.); 2:చూ,అచేట.

**అటుక.** దే. వి: చూ, రూ-అటక:చూ, మసెల.

**అటుకులు.** దే. వి.బ. అడుకులు:చూ,పృథుకము.

**అటుగాన.** దే గ. హేత్వర్థము చూ, హేతువు 2.

**అటుల.** దే. ప్రి. రూ-అట్టుల.చూ,రూ-అటు.

**అటులు.** దే. అవ్య.—పై.—(రూ-అట్టులు.)

**అటువంటి.** దే. విశే. అవ్య.—పై— వి. పు. 7, అ. 370.

**అటువలె.** దే. అవ్య.—పై.—

**అటె.** దే. అవ్య. రూ-అటే. 1. ఆశ్చర్యార్థకము: చూ, ఐంత. 1; 2. దుఃఖార్థకము: చూ, శోకము; 3. సంశయార్థకము: చూ, సంశయము.

**అటే.** దే. అవ్య.—పై.—*

**అటొ.** దే. అవ్య.—పై.—(రూ-అటో.)

**అటో.** దే. అవ్య.—పై.—

**అట్ట.** దే. వి. 1. చర్మము: చూ, తోలు. 1; 2. కబంధము, తల తెగినశరీరము: చూ, మొండెము; 3. చెప్పులకొఱకుఁ జెక్కఁబడిన చర్మఖండము; 4. కాగితపు అట్ట : అత్తడము, కాగితపు అట్ట.

**అట్టచెమ్మ.** ద్వ. వి. పాలుగుగవ్వలతో నాడెడు దాయమువంటి యొకానొకఆట: చూ, పాళి కాక్రీడ.

**అట్టడి.** పై. వి.=అట్టు. రూ-అట్టెడి. అట్టము, యుద్ధార్థముగాకిటె మంటపముమీఁదఁ గాష్ఠకొత్తకముమీఁదఁగాని యేర్పరచినగది: చూ,

సదనము. 1.

అట్టము. సం. వి. అ. పుం. 1.=అట్టసి.-పై.- 2. మేడ: చూ, సదనము. 1; 3. అతిశయము: చూ, హెచ్చు. 2; న. 4: చూ, వంటచెఱకు; 5. వెల్లువ: చూ, ప్రవాహము. 1; 6. అన్నము: చూ, సాదము. (1); 7. తొడవు: చూ, భూషణము. 2; వై. వి. (1)= అష్టకమ్. వేదభాగము: చూ, వేదము. (రూ-అట్టము.) [చూ, పక్షి.

అట్టయోధి. సం. వి. ఇ. పుం. ఒకరకముపక్షి.

అట్టశాల. సం. వి. అ. స్త్రీ.=అడసాల. పాకస్థానము: చూ, సదనము. 1.

అట్టహాసకము. సం. వి. అ. పుం. కుంద*. చూ, కూటపుష్పము.

అట్టహాసము. సం. వి. అ. పుం. పెద్దనవ్వు, వీరరౌద్రరసములవలనఁ బుట్టెడినవ్వు: చూ, హాస్యము. 1.

అట్టాలకము. సం. వి. అ. పుం. 1.=అట్టకి. కోటబురుజు: చూ, సదనము. 1; 2. మేడ. చూ, సదనము. 1.

అట్టిఁడు. దే. విశే. (అట్టి + వాఁడు.) అటువంటివాఁడు. (రూ-అట్టివాఁడు-అట్టేఁడు)

అట్టిక. దే. వి: చూ, రూ-అటిక.

అట్టియ. దే. వి. గుంపు: చూ, సమూహము.

అట్టు. దే. వి. 1. అప్పచ్చి: చూ, భక్ష్యము; అవ్య. 2: చూ, రూ-అటు.

అట్టుక. దే. వి. రూ-అటుక: చూ, మసెల.

అట్టుపుట్టానవాలు. దే. వి. తొల్లింటికత: చూ, సమాచారము. 2.

అట్టుప్పు. దే. వి. (అట్టు + ఉప్పు.) బిడాలవణము, రూ-అంటుప్పు: చూ, లవణము. 1.

అట్టుల. దే. దశి: చూ, రూ-అటుల.

అట్టులు. దే. వి: చూ, రూ-అటులు.

అట్టువ. దే. వి. అటక: చూ, మసెల.

అట్టువోలె. దే. దశి. (అట్టు + పోలె) అప్రకారము: చూ, అటు.

అట్టె. దే. అవ్య. రూ-అట్టే. 1. ఆశ్చర్యార్థకము: చూ, వింత. 1; 2. దుఃఖార్థకము: చూ, శోకము; 3. సంశయార్థకము: చూ, సంశయము.

అట్టెడ. దే. వి. 1. కసవులోనగునవి కోయువారు దానినుంచుకొనుటకై సిబ్బెఁదులయిట్టఁదిసోఁఅగట్టుకొనెడి సంచి: చూ, వంచియ. 2; 2. ఆధకమితగోణి, తూమెడుగింజెలు పట్టెడు గోనె: చూ, వంచియ. 1; 3: చూ, వంతెన; 4. ఈఁతబద్దలులోనగు వానితో అల్లినతట్ట: చూ, సజ్జ. 1; 5. కాయధాన్యములయంపిలి మంటిగడ్డలు మొదలగువాని నెలువరించుటకుఁ గట్టినగోఁడు కట్టెలులోనగువానిమోపు; 6. సెర్వసులు పోఁగొట్టుటకై కూర్చిన సీల్లెడవంటితడిక.

అట్టే. దే. అవ్య: చూ, రూ-అట్టె.

అట్లతద్ది. వా. వి. ఆశ్వయుజబహుళతదియనాఁడు బాలికలు అట్లనోఁచుకొనుమహాలక్ష్మీవ్రతము, అట్లనోము: చూ, తిద్ది.

అట్లనోము. వా. వి.—పై.—

అట్లాంటిక్కుమహాసముద్రము. పా. మహాసముద్రములయిగింటిలోనొకటి: చూ, సముద్రములు.

అట్లాగు వా అవ్య అప్రకారము: చూ, అటు.

అట్లు. కే. అవ్య.—పై —

అట్లుదురుపు. జా. కల్లోలమును బొందుట.

అల్లొట్లు. దే. వి. ఒ. వానవెలిసినపిమ్మటచూరునుండిపడు సీరుబొట్లు; జలధారలులోనగునవి నిరంతరముగాపడి యుడిగినవెనుక అచ్చొటవిలిచినిలిచి పడెడుబొట్లు: చూ, వంగుళ్ళు.

అణాత్తు. వా. అవ్య. ఉన్నట్టుండి: చూ, డబ్బాటు.

అడ. దే. వి. 1. పిండము, పిడచ: చూ, ముద్ద, 2;

2. ఆకృతి. ప్రా. 3, ఆ, 46: చూ, రూపు. 3.

అడంగు. వా. వి. 1. మొదటిపోటు. 2. కరణములువ్రాయు గ్రామలెక్కలలోని మొదటిలెక్క. (అడంగులు.)

అడంగాద్యులు. పా. 'డా' కు 'ణ' కారంబు విభాషనగు. అడఁగు-అణఁగు, కడఁగు, చిల్లాడము, తడగము, నాడెము, పోఁడిమి, మిడుఁగు, పడఁకు, మిడుఁగురు ఇవియడంగాద్యులు.

అడఁకువ. దే. వి. నమ్రత: చూ, వినయము. 1 (రూ-అణఁకువ-అణుఁకువ-అణుకువ.)

అడఁగారు. దే. అ. క్రి. అడఁగు: చూ, నుక్కు. 4

అడఁగు. దే. అ. క్రి. 1.—పై—; 2. తగ్గు: చూ, సుక్కు. 9, 3. మెత్తఁబడు: చూ, వంగు; 4. అస్తమించు: చూ, నశించు; 5. లోబడు: చూ, లోపించు 2. (రూ-అణఁగు-అడఁగారు-అణఁగారు-అఁగు-అఱు.)

అడఁగుట. దే. వి. ఉపశమిల్లుట: చూ, ఉపశాంతి. 1.

అడఁగుబొద్దు. దే. వి. బేలుదారిలోపల నణఁగియుండునట్లు గోడయంచులయందు గీటి రేఁగ్రొచ్చెడు బొద్దు (శ. ర): చూ, మొలత్రాడు. 2.

అడఁచు. దే. స. క్రి. అడఁగఁజేయు. (అనుప్రయుక్తమైన అడఁగుధాతువునకును రూపము.): చూ, పిసుకు. 3. [అడ్డకట్టు.)

అడకట్టు. దే. అ. క్రి. చూ, ముద్దకట్టు. (రూ-

అడకత్తు. దే. వి. రూ-అడకత్తెర-అడకొత్తు-అకొత్తు-పోఁకొత్తు). (పోఁకలువత్తునది): చూ, శంకుల. 1. [క్త్తిరించునది.)

అడకత్తెర. దే. వి.—పై.—(పోఁకచెక్కలు

అడకము. దే. విశే. లోపలనడఁగినది: చూ, తీలు.

అడకర. దే. విశే. ఓరిమి: చూ, శాంతము. 1.

అడకాయ. దే. వి. పోఁకకాయ.

అడకించు. దే. స. క్రి. 1. అపహసించు: చూ, వెక్కిరించు 3; 2: చూ, వంచించు. భో. ఆ. 6

అడకొత్తు. దే. వి. (అడకాయ + ఒత్తు): చూ, రూ-అడకత్తు

అడగాను. దే. అ. క్రి: చూ, ముద్దకట్టు.

అడగోలుకొను. దే. స. క్రి. రూ-ఒడగోలుకొ, అపహరించు. భో. 6, ఆ. 14 : చూ, వచ్ఛలించు

అడచిపాటు. దే. వి. శీఘ్రము: చూ, వేగము.

అడజేడి. దే. వి. అలజేడి: చూ, శోకము.

అడజేసిపెట్టు దే. స. క్రి. దుఃఖపఱచు. హ్లా 1, ఆ. 193: చూ, దుఃఖపెట్టు.

అడఁగడి. దే. వి. దొరతనము: చూ, ప్రభుత్వ

అడఁది. వై. వి. హారిద్రా. పచ్చఁదనవ చూ, వర్ణము. 6. (రూ-అలఁది-అళఁది-అళి హాళది.)

అడప. దే. వి. 1. పశుపాదరోగము: చూ, పశురోగము; 2. వక్కలాకుల తిత్తిగలస్త్రీ చూ, తాంబూలధారిణి. [అడపకత్తె

అడపకత్తియ. ద్వ. వి: చూ, అడప. 2. (రూ

అడపకాఁడు. దే. వి. అడపముంచుకొనియుండువాఁడు.

అడపట్టె. వా. వి. పొలమునకు విత్తనములువిమిట్టకల్లములు సమముగుటకై దొడ్డనుకట్రోలెడిమ్రాను: చూ, దిండు. 5. (రూ-డ్డపట్టియ-అడ్డపట్టె-అడ్డమాను)

అడపతడప. వా. వి. అప్పుడప్పుడు.

అడపము. దే. వి. 1. వక్కలాకులతిత్తి: చూ, రూ-హడపము. 1; 2. మంగలితిత్తి: చూ, రూ-హడపము. 2.

అడపొడ. దే. వి. అడుగులగుఱుతు, శశా. ఆ. 44: చూ, జాడ. 2.

**అడమర.** దే. వి. పిండము: చూ, ముద్ద. 2.

**అడబాల,** వై. విశే. 1. వంటకాఁడు: చూ, వంటవాఁడు; 2. పాచకి: చూ, వంటలక్క.

**అడరించు.** దే. స. క్రి. బాణమును ప్రయోగించు. మార్క. 6, ఆ. 210: చూ, విసరు. 8. (అడరుచు-రూ-అడర్చు)

**అడరు.** దే. వి. 1. ఆధిక్యము, ఏపు: చూ, హెచ్చు. 2; 2 ఆపద. చూ, విపత్తు; అ. క్రి. 3. అంగీకరించు. చూ, సమ్మతించు; 4. అంతటను ప్రసరించు. చూ, వ్యాపించు 5. వృద్ధిఁబొందు, పెరుఁగు: చూ, వర్ధిల్లు; 6 జృంభించు, చెలరేఁగు: చూ, విజృంభించు, 7. అతిశయించు: చూ, మున్మిడించు, 8. ఉత్సాహించు, పూను. భో. 4, ఆ. 120: చూ, యత్నించు; 9 జన్మించు చూ, పుట్టు. 2, 10. తొట్రుపడు. . చూ, సంభ్రమించు

**అడరుచు.** దే. స. క్రి: చూ, అడరించు

**అడరుచెంచు.** దే. అ. క్రి. 1. అతిశయించు మార్కం. 5, ఆ. 230: చూ, మున్మిడించు, 2. అంగీకరించు చూ, సమ్మతించు; 3. అంతటను ప్రసరించు చూ, వ్యాపించు, 4. పెరుఁగు: చూ, వర్ధిల్లు; 5. చెలరేఁగు: చూ, విజృంభించు; 6. పూను: చూ, యత్నించు, 7. జన్మించు: చూ, పుట్టు. 2; 8. తొట్రుపడు: చూ, సంభ్రమించు.

**అడర్చు** దే. స. క్రి: చూ, రూ-అడరించు జై. 7, ఆ. 10.

**అడలఁగొట్టు.** దే. స. క్రి. 1. గద్దించు. చూ, జీరించు; 2. భయపెట్టు: చూ, బెదరించు

**అడలించు.** దే. స. క్రి.—పై.—

**అడలు.** దే. వి. 1. చింత: చూ, పశ్చాత్తాపము; 2. వెఱపు: చూ, భయము. 1; 3. [illegible] చూ, శోకము; అ. క్రి. 4. ఏడ్చు: చూ, గోడించు; 5. దుఃఖముతో వనరు, వాపోవు. జై. 8, ఆ. 285: చూ, విలపించు: 6. పుత్రమరణాది దుఃఖము చేతతపించు. వగచు. చూ, శోకించు, 7. బెదరు. పాంచా. 8, ఆ. 22: చూ, భయపడు.

**అడలుకొను.** దే. అ. క్రి. వగచు: చూ, శోకించు.

**అడపలు.** పా. పాచకక్రియలలో నొకటి: చూ, పాదక్రియలు.

**అడవి.** ప్రై. వి. =అటవి: చూ, విపినము.

**అడవికంబ.** ద్వ. వి. సర్పనాశము*: చూ, నూరణము.

**అడవికాఁకర.** దే. వి. వనకారవేల్లము*: చూ, సుపవి. 1. [ముఠి. 1.

**అడవికాఁపు.** దే. వి. వనసంవాసి: చూ,

**అడవికిక్కస.** దే. వి. అడవికిక్కసకసవు*: చూ, తృణము. 1. [వృకము.

**అడవికుక్క.** ద్వ. వి. తోఁడేలు : చూ,

**అడవికోడి.** ద్వ. వి. కానపుంజు: చూ, పుంజు.

**అడవిగెనసు.** ద్వ. వి పిండాంశుకము, అడవికసవు *: చూ, తృణము. 1. [-చిక్కుడు.

**అడవి-చిక్కుడు.** ద్వ. వి. వనశుద్రశింబి*: చూ,

**అడవిచెఱకు.** ద్వ. వి. తెలుపుకలసిన పచ్చచెఱకు*: చూ, రసాలము. 3.

**అడవిచేమ.** ద్వ. వి: చూ, శకుటము*.

**అడవితిరుగుడు.** ద్వ. వి. కోఁతి: చూ, వానరము.

**అడవితొగరి.** ద్వ. వి. తువరి, అడవికందితీఁగ*: చూ, కంది.

**అడవితొలసి.** ద్వ. వి: చూ, తులసి.*

**అడవిదున్న.** ద్వ. వి. కారెనుబోతు: చూ, మహిషము.

**అడవిదొండ.** ద్వ. వి. కాకిదొండ*: చూ, దొండ.

**అడవిదోమ.** ద్వ. వి. దంశి: చూ, దోమ.

**అడవినట్టు.** ద్వ. వి. కోఁతి: చూ, వానరము.

అడవిజాఖి. మి. వి. అరణ్యవసనాఖి*: చూ, నాఖి. 3.

అడవినిమ్మ. ద్వ. వి. వనజంబీరము*:చూ, నిమ్మ

అడవినువ్వులు. ద్వ. వి. బ. జర్తిలము*: చూ, నూవు. 1; 2. కోఁతి: చూ, వానరము.

అడవిసెలవరి. ద్వ. వి. 1. ఋషి: చూ, ముని. 1.

అడవిసెలవు. ద్వ. వి.—పై.— [సెల్లి.

అడవిసెల్లి. ద్వ. వి. వనాగ్నిమంగము*: చూ,

అడవిపంది. ద్వ. వి. వనసూకరము: చూ, సూకరము. [ఊరు:చూ, పట్టణము.

అడవిపల్లె. ద్వ. వి. అడవిలోనుండెడిచిన్న

అడవిపిప్పలి. మి. వి. వనపిప్పలి*: చూ, పిప్పలి. 1.

అడవిపుట్టువు. ద్వ. వి. ఐరావతము, ఇంద్రుని యేనుఁగు: చూ, హస్తి. [చూ, పెసర.

అడవిపెసర. ద్వ. వి. వనముద్గము, కాఋపెసర*.

అడవిప్రత్తి. ద్వ. వి. భారద్వాజి*:చూ, ప్రత్తి

అడవిబచ్చలి. ద్వ. వి. వనోపోదిక*: చూ, బచ్చలి. [బీజ. 2.

అడవిబీజ. ద్వ. వి. కోశఫల, చేఁతిబీజ*: చూ,

అడవిమనికి. ద్వ. వి. కోఁతి చూ, వానరము.

అడవిమనికిపట్టు. ద్వ. వి: చూ, అడవికాఁపు.

అడవిమల్లె ద్వ. వి. ఆస్ఫోట*:చూ, మల్లె.

అడవిమానిసి. ద్వ. వి. అడవియందుండు మనుష్యుఁడు: చూ, మనుష్యుఁడు. [మామిడి.

అడవిమామిడి. ద్వ. వి. పిరియాలము*:చూ,

అడవిమామెన. దే. వి. కారిబాభేరము*. చూ, మామెన. [కగ్గివు. 1.

అడవిమునగ. ద్వ. వి. కారుమునగ*: చూ,

అడవిమేఁక. ద్వ. వి. ఇడిక్కము: చూ, మేషము. 1. [యూధిక. 1.

అడవిమొల్ల. ద్వ. వి. ఏఋమల్లియ*: చూ,

అడవియవిసె. ద్వ. వి. వనయగస్తి*:చూ, కుక్ నాసము. 1. [చూ, వ్యాడంబకము.

అడవియాముదము. ద్వ. వి. వనయేరండము*:

అడవియీఁగ. ద్వ. వి. రూ-అడవీఁగ. దంశము: చూ, మక్షిక. [ఉలవలు.

అడవియులవలు. ద్వ. వి. వనకుసత్థము*: చూ,

అడవిరాజు. ద్వ. వి. అడవిపంది: చూ, సూకరము.

అడవిరేఁగు. ద్వ. వి. వనజబదరి*:చూ, రేగు. 1.

అడవిసదాప. ద్వ. వి. కాలేయము:చూ, సదాప.*

అడవీఁగ. ద్వ. వి: చూ, రూ-అడవియీఁగ.

అడసాల. నై. వి.=అట్టసాలా. పంటయిల్లు చూ, సదనము. 1.

అడావిడి. }
అడావుడి. } వా. వి. అల్లరి, గడబిడ, తొందర.

అడి. నై. ఉప. 1.=అతి, అధికము, ఎక్కువ. మార్కం. 8. అ, 125: చూ, హెచ్చు. 1; 2. వమ్ము: చూ, వ్యర్థము.

అడిగండ్లు. దే. వి. బ. (అడుగు + కండ్లు) మలువఁగా అడుగున నిలిచినతాళ్లు:చూ, రాయి.

అడిగము. దే. వి. భారవిశేషము. హంస. 5, అ. 97: చూ, భారము. 1. [చూ, పాదుక.

అడిగజ్జ. దే. వి. (అడుగు + కజ్జ.) పావకోళ్లు:

అడిగికొను. దే. స. (క్రి. అ. క్రి). 1:చూ, వేఁడుకొను; 2: చూ, యాచించు.

అడిగినకొసఁగెడియావు. ద్వ. వి. కామధేనువు, కోరినవస్తువులిచ్చెడి వేల్పుటావు: చూ, ధేనువు.

అడిగినలేదనుట. అం. అష్టకష్టము లెనిమిదింటిలోనొకటి: చూ, అష్టకష్టములు.

అడిగొంటు. దే. విశే. (అడుగు + కొంటు.) కుటిలహృదయముగలవాఁడు: చూ, వ్యాధుడు. 2. [వ్యాజము. 1.

అడిగొంటుతనము. ద్వ. వి. కపటము: చూ,

**అడిగొట్టు.** దే. వి. (అడుగు + కొట్టు.): చూ, రూ-అడిగొంటు.

**అడిచిపడు.** ద్వ. అ. క్రి. 1. తొట్రుపడు: చూ, సంభ్రమించు; 2. జ్వలించు. వి. పు 7, ఆ. 119: చూ, మండు. 1.

**అడిచిపాటు.** ద్వ. వి 1. తొందరపాటు: చూ, సంభ్రమము. 1; 2. జ్వలించుట: చూ, మండిపాటు.

**అడితి.** దే. వి. ఒకవర్తకుఁడు మఱియొకడంపెడుసరకులనమ్మి మరలవానికి సరకులుఁగొని పంపుటకై వానివద్ద నూటికింతయని పుచ్చుకొనుడుతఱుగు; వా. వి. 2. కలపఅమ్మెడుచోటు: అడుతు.

**అడితీదారుఁడు.** దే. వి. 1.కమీషను వర్తకుఁడు, తెఱుగువర్తకుఁడు; 2. కలపవర్తకుఁడు.

**అడితార్పుడు.** దే. వి. (అడిగి + తార్పుడు.) కఱవు. పంచ. నా. 1, ఆ. 395: చూ, దుర్భిక్షము. [భ కు. 1.

**అడిదపుమెకము.** ద్వ. వి. సెరబము: చూ, శర

**అడిదము.** దే. వి కత్తి: చూ, రిష్టి. 2.

**అడిబండ.** ద్వ. వి. దుష్టుఁడు: చూ, వ్యాఘుఁడు. 2.

**అడిబీరము.** ద్వ. వి. మత్తు: చూ, మదము. 1.

**అడియఁడు.** దే. విణ. (అడుగు + అఁడు.) పాదసేవకుఁడు: చూ, బానిసీఁడు.

**అడియరి.** దే. వి. (అడుగు + అరి.) 1. కొలువుకాఁడు. భార. సౌ. 1, ఆ. 7: చూ, సేవకుఁడు. 1; విణ. 2. పిసినిగొట్టు: చూ, లోభి. 3: చూ, అడియఁడు.

**అడియాలము.** దే. వి. (అడ + అలము.) రూ-అడియాళము. గుఱుతు: చూ, లక్షణము. 1.

**అడియాలముపట్టు.** దే. స. క్రి. (అడ + అలము + పట్టు.) గుఱుతుపట్టు: చూ, గుర్తించు

**అడియాస.** వై. వి.-అర్థాశ (అడి + ఆస.) దురాశ, కలుగునపెడియాశ: చూ, వాంఛ.

**అడియాళము.** దే. వి: చూ, రూ-అడియాలము.

**అడియొత్తు.** దే. వి. (అడుగు + ఒత్తు.) అడిగఱ్ఱ: చూ, పాదుక. [తఱుగు చేరను.

**అడిసాటా.** దే. వి. (అడితి + సాటా) : చూ,

**అడిశేరు.** వా. వి. పదలము, అరవీసె. (60తు)

**అడుకు** దే. వి. 1. దొంతి: చూ, దొర; 2 వెఱపు: చూ, భయము. 1; స. క్రి. 3: చూ, దొంతిగనిడు.

**అడుకులు** దే. వి. బ. రూ-అటుకులు, చిపిటము, వడ్లునానఁబోసివేఁచి కొట్టినవి. భార. ద్రో. 4, ఆ. 89: చూ, పృథుకము.

**అడుగంటు.** దే. అ. క్రి. (అడుగు + అంటు.) ఇంకు, వట్టు, ఎండు: చూ, శోషించు.

**అడుగంటుట.** దే. వి. మాఁడియడుగంటుట: చూ, కాటు.

**అడుగంటులు.** దే. విణ. బ. రూ-అడుగంట్లు. అడుగునవిలిచినవి.

**అడుగంట్లు** దే. విణ. బ.— పై.—

**అడుగు.** దే. వి. రూ-అడ్గు. 1. కాలుచాఁచిపెట్టినయడుగు: చూ, పాదము. 1; 2. క్రిందు: చూ, దిగువాటు; 3. పండ్రెండంగుళముల దూరము; విణ. 4. తక్కువైనది: చూ, హీనము. 1; స. క్రి. 5. ముదలించు: చూ, ప్రశ్నించు; 6: చూ, యాచించు.

**అడుగుకొను.** దే. స. క్రి. 1: చూ, వేఁడికొను; 2: చూ, యాచించు.

**అడుగుకోలు.** దే. వి. 1: చూ, ప్రార్థన. 2; 2: చూ, యాచన. [చూ, పర్యటనము.

**అడుగుకోలుతిరుగుడు.** ద్వ. వి. భిక్షుకుతిరుగుట:

**అడుగుచెమ్మటలాఁడు.** ద్వ. వి. పెన్నుఁడు: చూ, విష్ణువు. 1. [2: చూ, ప్రశ్నము.

**అడుగుట.** దే. వి. 1: చూ, యాచన;

అడుగుతాటించు. ద్వ. స. క్రి. పాదముతో తాడనము చేయు: చూ, తన్ను. 2.

అడుగుదమ్మి. ద్వ. వి. నేలతామర * చూ, పద్మము. 1.

అడుగుదాఁటు. దే. స. క్రి, అ. క్రి అతిక్రమించు సై. 5, ఆ. 145 చూ, దాఁటు. 6.

అడుగుపడు. ద్వ. అ. క్రి: చూ, క్రిందుపడు

అడుగుపుట్టువు. ద్వ. వి. రూ-అడుగుఁబుట్టువు. 1. దేవగంగ, మిన్నేఱు: చూ, నది; 2. నాలవజాతివాఁడు: చూ, శూద్రుఁడు

అడుగుబద్ద. పా. పండ్రెండంగుళములకొలతబద్ద

అడుగులకుమడుఁగులొత్తుట జా. గౌరవించుట. "నడచుచు నడుగులకు మడుఁగులొత్తు చే." "గడఁగలమగనిఁజూచిన, నడుగులకు మడుఁగులిడుదురతివలు" సుమతీ.

అడుగులు పా. 1. అడవలు, గంతులు; అం. 2. పాదక్రియలలో నొకటి: చూ, పాదక్రియలు. [విష్ణువు 1.

అడుగువాఁకగిలాఁడు. ద్వ. వి. వెన్నుఁడు:చూ,

అడుగువాఁడు ద్వ. విశే:చూ, ప్రశ్నకర్త.

అడుగువాలుపులుఁగు. ద్వ. వి. కోడి: చూ, పుంజో [మొత్తు. 2.

అడుచు దే. స. క్రి. తాటించు, చేఱచు చూ,

అడుచుకొను దే. అ క్రి చూ, సంక్షేపించు.

అడుజే. దే వి. ఒకజాతిడేగ.చూ, శ్యేనము.1.

అడుతు. వా. వి చూ, రూ-అడితి. 2.

అడుపు. దే. వి. (అడుగు+పట్టినది.) పశువుల కాళ్ళయందుఁగలిగెడి రోగము: చూ, పశురోగము.

అడుపు. దే. వి: చూ, మొత్తు. 1.

అడుప. దే. విశే. (అడుగు+పట్టినది.) పురాతనము. "అడుపసరకులు.": చూ, ప్రాఁత.1.

అడుసు. దే. వి.రూ-అడుగు,1.కాలుచాఁచిపెట్టి నయడుగు: చూ, పాదము. 1; స. క్రి. 2. రూ-అడుగు: చూ, ప్రశ్నించు

అడుసు. దే. వి. పంకము: చూ, బురద.

అడ్డు :చూ, రూ-అడుగు.

అడ్డ. దే. స. 1: చూ, నాలుగు; సై. స. 2 కుంచెములోసగము. (సం. ప)- అర్థప్రస్థము; దే. వి. 3. గుంటకలోనగువానిటండు: చూ, దిండు. 3.

అడ్డంకి. సై. వి.=అతంకమ్. అడ్డము చూ, నిరోధము. 1 (చూ-అడ్డకట్టు-అడ్డగాలు-అడ్డపాటు-అడ్డపెట్టు-అడ్డము-అడ్డవాటు - అడ్డి-అడ్డు-అడ్డుగట్టు.)

అడ్డకట్ట. దే. వి. (అడ్డము+కట్ట.) ఏఱులోనగువానినీళ్లు వెలికిఁబోకుండుటకు కట్టినకట్ట: చూ, సేతువు. 1.

అడ్డకట్టు దే. స, క్రి. (అడ్డము+కట్టు) అడ్డగించు చూ, నిరోధించు.

అడ్డకత్తి. దే. వి. (అడ్డము+కత్తి) పట్టిసము: చూ, బాణము. 1.

అడ్డకమ్మి ద్వ. వి. (అడ్డము+కమ్మి.) ఉత్తరంగము, గడపయందు త్రొక్కుడుకమ్మికి సరి మీఁదుగా నడ్డముగ నేర్పఱుపఁబడినదారు విశేషము: చూ, లచ్చికమ్మి.

అడ్డకట్టు దే. వి (అడ్డము+కట్టు) 1. విఘ్నము, అడ్డి. చూ, నిరోధము. 1; 2. ఒక పెదరోగము:చూ, రోగము. 1.(అడ్డగట్టులుఅనియు)

అడ్డకోడము. దే. వి. (అడ్డము+కోడము) ఒకానొకవల: చూ, వల. 1.

అడ్డగాలు. దే. వి. (అడ్డము+కాలు.) అడ్డము: చూ, నిరోధము. 1.

అడ్డగించు. దే. స. క్రి: చూ, నిరోధించు.

అడ్డగింత. దే. వి. అడ్డము: చూ, నిరోధము. 1.

అడ్డగింపు. దే. వి —సై.—

**అడ్డచోఁపు.** దే. వి. (అడ్డము+చోఁపు.) అడ్డవాసపుదూలము: చూ, దూలము.

అడ్డతలవాఁడు. ద్వ. వి: చూ, పెద్దతలవాఁడు.

అడ్డదూలము. ద్వ. వి. ఇంటిగోడలపైవేయుమూలము: చూ, దూలము.

అడ్డనము. సం. వి. అ. న.=అడ్డణము: చూ, రూ-అడ్డాణము. 2; నై. వి. (1)=అడ్డనము: చూ, అడ్డాణము. 2. (రూ-అడ్డణ. అడ్డణముఅని కొందఱు)

అడ్డపట్టియ. ద్వ. వి. (అడ్డము+పట్టియ) మడిచేమనుపఱచెడి పలక (రూ-అడ్డపట్టె): చూ, దిండు. 5.

అడ్డపట్టు. దే. స. క్రి. (అడ్డము+పట్టు.) అడ్డముగాపట్టు.

అడ్డపట్టుపాప. ద్వ. వి. సిసువు: చూ, శిసువు.

అడ్డపట్టె. ద్వ. వి. చూ, రూ-అడ్డపట్టియ.

అడ్డపడు. ద్వ. అ. క్రి. (అడ్డము+పడు.): చూ, నట్టుపడు.

అడ్డపాటు. ద్వ. వి. 1. అడ్డుపడుట: చూ, నిరోధము. 1; 2. తిరోధానము: చూ, మఱుఁగు. 1. [త్రుఁడు.

అడ్డపాటులేనివాఁడు. ద్వ. విం: చూ, స్వతం

అడ్డపాప. దే. వి. (అడ్డము+పాప.) 1. సిసువు. చూ, శిశువు; 2. దూరదృష్టిలేనివాని కన్నులలోనిపాప: చూ, పాప. 2.

అడ్డపెట్టు. దే. వి. (అడ్డము+పెట్టు.)1: చూ, అడ్డగింత; స. క్రి. 2: చూ, నిరోధించు; 3. ఈడుపెట్టు, జోడించు: చూ, సంధించు 1.

అడ్డబాస. దే. వి. ముక్కుమంగర, విలువగల రాయి, బంగారము, మంచిముత్యము మొదలగువానితోఁ జేయఁబడి స్త్రీలుముక్కునధరించుకొనుఅలంకారము. (ఇది స్త్రీలయుచ్ఛ్వాసనిశ్వాసములమపరిశుభ్రము చేయునటుచేసిం

దూసంపుద్రాయము.) (వేమనయోగీంద్రచరిత్రము 14 పద్యము): చూ, భూషణము. 2.

అడ్డబొట్టు. దే. వి. స్మార్తులు శివమతిస్థులులోనగువారు ధరించుతిలకము: చూ, బొట్టు. 1.

అడ్డమాడు దే. అ. క్రి. అడ్డముచెప్పు.

అడ్డమాను. దే. వి. (అడ్డము+మాను): చూ, అడ్డపట్టియ.

అడ్డము. దే. వి. 1. అడ్డంకి: చూ, నిరోధము. 1; 2. అడ్డపాటు: చూ, మఱుఁగు. 1; 3. బంధకము: చూ, తాకట్టు; 4. పూఁటకాఁపు: చూ, లగ్నకుఁడు; విణ. 5. అడ్డు: చూ, నిరోధము. 1 (సృష్టియందు అంత్యవర్ణలోపము. అడ్డకట్టు, అడ్డగాలు, అడ్డవేడము. మొ.) [ఆఁపు.

అడ్డముచేయు. దే. స. క్రి. ఆటంకపఱచు చూ,

అడ్డములేనివాఁడు. ద్వ. వి: చూ, అడ్డపాటులేనివాఁడు: [భత్యము.

అడ్డిక. సం. వి. అ. స్త్రీ. ఒబ్బట్టు: చూ,

అడ్డవాళ్లు దే. వి. బ. (అడ్డము + వాళ్లు.) అడ్డము: చూ, నిరోధము. 1.

అడ్డవాయియమ్ము. ద్వ. వి. (అడ్డము+వాయి+అమ్ము.) విశాలముఖ సాయకము: చూ, బాణము. 1.

అడ్డవేడెము. ద్వ. వి. (అడ్డము+వేడెము.)పాము నడకవంటి గుఱ్ఱపునడ: చూ, ఖురి: చూ, హయము.) [మాత.

అడ్డసరము. వై. వి.=ఆటరూషః : చూ, వైద్య

అడ్డసాళులు. ద్వ. వి. బ. (అడ్డము+సారెలు.) రూ-అడ్డసాళ్ళు. 1. శారి, సారె: చూ, పాచిక; 2. సవాలు: చూ, ప్రశ్నము.

అడ్డాణము. సం. వి. అ. న. 1. ఒబ్బట్టు: చూ, భత్యము; 2.=అడ్డణము. ఒడ్డనము: చూ, డాలు. 4. (రూ-అడ్డనము.)

అడ్డాదిడ్డి. దే. విశే. (అడ్డము+దిడ్డి.) అయుక్తము: చూ, అక్రమము.

అడ్డాదులు. వ్యా. అడ్డాదులకించేఁ పరంబగునపుడు గుగాగమంబగు. అప్వాదులకు విభాషనగు. ఉదా- అడ్డము+ఇంచే=అడ్డము+గు+ఇంచే=అడ్డ+గు+ఇంచే=అడ్డగించే. ముగ్గమునకు లోపము. ఇట్లు ఓర-ఓరగించే, చిత్రము-చిత్రగించే; ఇత్యాదులు అడ్డాదులు అప్ప-అప్పగించే-అప్పించే-అప్ప-ఒప్ప-తల్లము ఇత్యాదులు అప్వాదులు. (తత్స) లోపము-లోపించే-లోపగించేననియునగు.

అడ్డి. దే. వి. 1. అడ్డంకి: చూ, నిరోధము. 1; 2. అడ్డపాటు: చూ, మఱుఁగు 1.

అడ్డిగ. దే. వి. అర్ధపణము, రూకలో సగము: చూ, పణార్ధము. (రూ-అడ్డుగ.)

అడ్డిగలు. దే. వి. ఆఁడువారు మెడ నుంచుకొనెడునగ: చూ, భూషణము. 2.

అడ్డిపడు. ద్వి. అ. క్రి. అడ్డుగొను: చూ, నట్టువడు. [(అసం.)

అడ్డీ. దే. వి. అనుక్తైన వస్తువుయొక్క పూఁత.

అడ్డు. దే. వి. 1. అడ్డంకి: చూ, నిరోధము. 1; విశే. 2. అడ్డగింపఁబడినది: చూ, రుద్ధము. 1; స. క్రి. 3. అడ్డగించే: చూ, నిరోధించే.

అడ్డుగ. వ్యా. రెండుపాతికలు. (పాతిక=గురివెందగింజ ఎత్తు); (రెండుఅడ్డుగలు=1 చిన్నము.)

అడ్డుగట్టు. దే. వి. (అడ్డు + కట్టు.) 1. అడ్డకట్టు: చూ, నిరోధము. 1; 2. తలుపునడ్డగించే గడియ: చూ, విష్కంభము. 2; విశే. 3: చూ, నిరోధము. 1.

అడ్డుగుట్టు. దే. వి. 1. తలుపునడ్డగించే గడియ: చూ, విష్కంభము. 2; 2. అడ్డము: చూ, నిరోధము. 1. [పడు: చూ, నట్టువడు.

అడ్డుగొను. దే. అ. క్రి. (అడ్డు+కొను.) అడ్డి

అడ్డుసవాలు. వ్యా. క్రాసుపరీక్ష.

అడ్వాన్సు. ఆం. వి. బయానా: చూ, సత్యంకారము. [1.

అణఁకువ. దే. వి. అడఁకువ: చూ, వినయము.

అణఁగారు. దే. అ. క్రి. అడఁగారు: చూ, నుగ్గు. 4.

అణఁగిన మెడ. దే. వి: చూ, అంటు మెడ.

అణఁగు. గే. అ. క్రి: చూ, రూ-అడఁగు.

అణఁచే. దే. స. క్రి: చూ, రూ-అడఁచే.

అణక. దే. వి. చూ: అంక. 2. [ము. 1

అణకము. సం. విశే. తక్కువైనది: చూ, హీన

అణకించే. దే. స. క్రి. అపహసించే: చూ, వెక్కిరించే. 3. [చూ, వ్యాధుఁడు.2

అణకుఁడు. సం. విశే అధముఁడు, కుత్సితుఁడు

అణవీనము. సం. విశే. అణువులుపండుపొలము చూ, భూమి. 1.

అణవ్యము. సం. విశే.—పై —

అణా. వా. వి. రూపాయిలో పదియాఱవవంతు పండ్రెండుపైసలు.

అణి. సం. వి. ఇ. పుం. స్త్రీ. 1. చీలయమేకు చూ, బండికన్ను; 2. కొన: చూ, చివర. 2 3. ఎల్ల: చూ, సీమ 1.

అణిమ. సం. వి. న్. పుం. 1. అష్టసిద్ధులలో నొకటి: చూ, సిద్ధులు (విభూతులు.); 2 అణుత్వము: చూ, స్వల్పము; 3. అణిమయనునది తన్నుగాని ఇతరమయిన గొప్పవస్తువునుగాని అణువుగాచేయునట్టి యోగశక్తి.

అణీయము. సం. విశే. (న్. ఈ. న్.) అల్పము, మిక్కిలియణువు. (ఈకారాంతమైనపుడు అణీయస్ అనిరూపము.): చూ, అల్పము.

అణుకుఁడు. సం. విశే. 1. అల్పుఁడు: చూ, వ్యాధుఁడు. 2; 2. నేర్పరి: చూ, సమర్థుఁడు

అణుఁకువ. దే. వి: చూ, అణఁకువ. 1.

అణుకులాచలన్యాయము. పా. పరమాణువునకు ను పర్వతమునకును బోలె హెచ్చుతగ్గులుండున నుకీతి. [సన్న్యాడు.

అణుకువాఁడు. దే. వి. మల్లజాతియునికంటె

అణుజో. దే. వి. 1 ఒకజాతిడేగ, రూ-అడుజో: చూ, శ్యేనము. 1; 2. ఈఁకరాల్చిన పక్షి, కురుజో: చూ, గూఁటిగువ్వ. [విద్యుత్తు. 1

అణుభావము. సం. వి. అ. న. మెఱుపు: చూ,

అణువు. సం. వి. ఉ. పుం. 1. లేశము, అన్నున: చూ, స్వల్పము; 2. కొఱ్ఱలకంటెఇంచుకంత గొప్పదైన వ్రీహిధాన్యము. (చిఱువడ్లు అని వాడుక.)' చూ, ధాన్యము; విశే. 3 అత్యల్పము: చూ, స్వల్పము. [ఉ-బు-గ్రా.

అణ్ణులు. పా అ-ఇ-ఉ; అక్కులు. పా. అ-ఇ-

అణ్వాకర్షణ. పా. ఒక వస్తువుయొక్క అణువులను గట్టిగా నొకదాని నొకటి చేరియుండునట్లుచేయుశక్తి, సంశ్లేష. (కోహిషన్.)

అతంత్రము సం విశే. హాక్కులేనిది. (శే. ప.) —అదంత్రము.

అతఁడు. దే. స. అశబ్దమునకుమహదర్థక పుంలైకవచనము, ఆమనుష్యుఁడు: రూ-అతఁగాడు-అతగాఁడు-అతేఁడు, అతను, ఆయన.

అతకరించే వై. స. క్రి. 1 -అధకరించే, క్రిందుపఱచే. హరి. పూ. 4, అ. 26: చూ, తగ్గించే; 2. జేవదాఁటు చూ, దాఁటు. 6

అతకర్ణము. సం. వి. అ న. తప్పు చూ, నేరము

అతగాఁడు. దే. స: చూ, రూ-అతేఁడు.

అతగుఁడు. దే. వి. దుర్బలుఁడు: చూ, బక్కవాఁడు. [గ్రీజేశము.

...ము. సం. వి. అ. పుం. ఎక్కుఁగూడని ...గుణము. అం. ఒక యర్థాలంకారము, ...గుణసంగతమయ్యును బరగుణా నంగీ...తి: చూ, అలంకారము. 3.

అతను. దే. స: చూ, రూ-అతేఁడు.

అతనుఁడు. సం. వి. ఉ. పుం. 1. మరుఁడు: చూ, మన్మథుఁడు; విశే. 2. అధికుఁడు: చూ, హేమాహేములు.

అతరాపురేటు. వా. వి. సరిహద్దుభూముల శిస్తురేటు: చూ, అజీబాకీరేటు.

అతర్కరణము. వై. వి. -అధఃకరణమ్. మట్టుమీఱిసకార్యము. (సం. ప్రి.): —అధఃకరణము.

అతర్క్యము. సం. విశే. అగోచరమైనది (బుద్ధికి లోఁబడనిది) [వ్యత్యస్తముకు.

అతలకుతలపడు. ద్వ. అ. క్రి. తపిఁబడు: చూ,

అతలకుతలము. దే. వి. రూ-అతలాకుతలము. అలసట: చూ, శ్రమము. 1.

అతలము. సం వి. అ. పుం. 1. భూలోకమునకుఁ గ్రిందిలోకము: చూ, లోకము. 1; 2. అం. అధోలోకము లేడింటిలో నొకటి. చూ, అధోలోకములు.

అతలస్పర్శము. సం. విశే. మిక్కిలి లోఁతుగలది, అడుగుభాగముయొక్క స్పర్శలేనిది: చూ, లోఁతు. 2.

అతసి. సం. వి. ఈ. స్త్రీ. -అగసి. *: చూ, శుకనాసము. 1.

అతి సం. అవ్య. 1. అధికము చూ, హెచ్చు. 1; 2. పూజ. చూ, సపర్య; 3. లంఘనము చూ, లంఘు; 4 భయము: చూ, వెఱపు; 5. మీఱుట: చూ, పర్యయము; 6 ప్రీతి: చూ, మాలు. 1; 7. వ్యాధి: చూ, రోగము. 1; 8. నాశము: చూ, చత్తు, 9. వ్యాప్తి, క్రమ్ముట చూ, మరలుఁబాటు; 10 ఆక్షేపము: చూ, ఆరోపము; 11. అనుజ్ఞ: చూ, సెలవు; 12 త్వర: చూ, సంభ్రమము. 1; 13. మోసము: చూ, వంచన; 14. పార్థక్యః చూ, స్తోత్రము; 15. ప్రశ్నార్థకము, సవాలు: చూ, ప్రశ్నము; 16. అంగీకారార్థకము:

చూ, సత్కృతి. 1; 17. గౌరవము: చూ, మర్యాద; ఉప. 18. అతియను ఉపసర్గతోఁ జేరిన శబ్దములు ___ అతిక్రమము, అతివృష్టి, అతిరేకము, అతిశయము, అతిహసితము మొ; దే. అవ్య. 19.=అడి. అమితమైనది: చూ, పెమ్పు. 1

అతికమతము. సం. విణ. అతిసమీపము: చూ, సమీపము. 1.

అతికాయము. సం. విణ బ్రహ్మాండమైనది.

అతికాయుఁడు. సం విణ. 1. బ్రహ్మాండమైన యాకారముగల మనుష్యుఁడు: చూ, మను ష్యుఁడు; 2. ఒక రాక్షసుఁడు: చూ, రాక్ష సుఁడు. 1.

అతికించే. దే. స.క్రి. కూర్చు:చూ,సంధించే 3.

అతికృచ్ఛ్రము. పా. 1. మిక్కిలి కష్టమైనది; 2. చాంద్రాయణాది ప్రాయశ్చిత్త వ్రతముల లో నొకటి. ఏకభుక్తము, అయాచితాన్న భక్షణము, నక్తభోజనము వీనిని ముమ్మాఱు ఆచరించునపుడు పట్టెడుపట్టెడు అన్నము తినవలయును. ఇటులతొమ్మిదిరోజులు చేసిన తరువాత మూఁడుదినము లుపవసించి యుం డుట: చూ, కృచ్ఛ్రము. 3.

అతికృష్ణమచ్ఛము. పా. లక్షణము: చూ, లక్ష ణము. 1.

అతిక్తఫల. సం.వి. ఆ. స్త్రీ. కరుబూజాదోస*· చూ, దోస.

అతిక్రమము. సం. వి. అ. పుం. 1. మీఱుట, క్రమముతప్పుట చూ, పర్యయము; 2. శత్రు వులఁగూర్చి గండెత్తిపోవుట: చూ, అభిక్ర మము; 3. అలస్యము: చూ, విలంబము. 1; ఉప. 4. (ఇచ్చట 'అతి' యనునది ధాత్వర్థ మును 'దాఁటిపోవు' అను నర్థముగా మార్చి నది ) [దాఁటు. 8.

అతిక్రమించే. సం. స.క్రి. తరించే : చూ,

అతిక్రాంత. అం. ఆకాశచారులు పదియార్గురి లో నొకఁడు: చూ, ఆకాశచారులు.

అతిక్రాంతము. సం. విణ. 1. అతిక్రమించినది, మీఱినది: చూ, అతీతము; అం. 2. ఆకాశ మండలములు పదింటిలో నొకటి : చూ, ఆకాశమండలములు; 3. కరణములు నూట తొమ్మిదింటిలో నొకటి: చూ, కరణములు.

అతిక్రాంతి. సం. వి. ఇ. స్త్రీ. మీఱుట· చూ; పర్యయము.

అతిఖట్వుఁడు. సం. వి. అ. పుం. మంచమును మించిన పొడవుగలవాఁడు.

అతిఖరము సం. వి. అ. పుం. 1: చూ, కాకి వెదురు ¹; విణ. 2. మిగుల తీక్ష్ణమయినది.

అతిగండము. సం.వి అ. పుం. 1. విష్కంభాది యోగము లిరువదేడింటిలో నొకటి: చూ, యోగములు; విణ 2. పెద్దచెక్కిళ్ళుగలది.

అతిగుహ. సం. వి. ఆ. స్త్రీ· చూ, ముయ్యాకు పొన్న ¹: [చూ, పద్మము. 1.

అతిచర. సం. వి. ఆ. స్త్రీ. మెట్టతామర *:

అతిచారము. పా. గ్రహము లొక రాశియందు తన నియమితకాలమంతయునుండక ముందు రాశికిఁబోవుట: చూ, గ్రహగతులు.

అతిచిత్రితము. అం. మార్గప్రాణములాఱింటి లో నొకటి: చూ, మార్గప్రాణములు: (చూ, తాళము.)

అతిచ్ఛత్రి. సం. వి. ఆ. స్త్రీ. 1.అవాక్పుష్పి*: చూ, సదాప.(రూ-అతిచ్ఛత్రిక.); 2. ఏనుఁ గుతుమ్మి *: చూ, స్తంబేర.

అతిచ్ఛత్రము. సం. వి. అ. పుం. సుగ్రీవాము చి:* చూ, తృణము. 1.

అతిచ్ఛిద్రము. అం. తాళమార్గము లాఱింటిలో నొకటి: చూ, తాళమార్గములు.

అతిజగతి. అం. ఇరువదియాఱు ఛందస్సులలో నొకటి: చూ, ఛందస్సులు.

అతిజవుఁడు. సం. విణ. మిక్కిలివడిగ నడచు వాఁడు: చూ, జంఘాలుఁడు.

అతితీవ్రదండన. పా. ఉరిశిక్ష.

అతిదీర్ఘాతిహ్రస్వాంగము, పా. విధవాలక్షణము: చూ, లక్షణము. 1.

అతిథి. సం. వి. ఇ. పుం, స్త్రీ. 1. విందునకు పిలువఁబడిన వాఁడు : చూ, విందు 4; 2. కాలనియమములేక అన్నార్థియై వచ్చిన వాఁడు, అనిత్యముగవచ్చువాఁడు, పరదేశమునందుండివచ్చినవాఁడు: చూ, విందు. 4; పుం. 3. వగపు: చూ, శోకము; 4 కోపి: చూ, కోపనుఁడు; 5. కుశునికొడుకు: చూ, పుత్రుఁడు. 1.

అతిథిక్రియ. పా. 1 అతిథ్యము - మనుష్యయజ్ఞము-నృయజ్ఞము- పరులనుఆదరణచేయుట: చూ, విందు. 2; అం 2. నిత్యషట్కర్మలలోనొకటి: చూ, కర్మలు; 3. పంచమహాయజ్ఞములలో నొకటి: చూ, యజ్ఞములు.

అతిథిపూజ. —పై.—(రూ. అతిథిపూజనము)

అతిథిపూజాసమయము. పా. గ్రహసమయములరువదేడింటిలో నొకటి: చూ, గ్రహసమయములు. (భోగము.)

అతిథిసత్కారము. పా: చూ, అతిథిక్రియ. 1.

అతిథిసపర్య. పా.—పై.—

అతిదేశము. సం. వి. అ. పుం. 1. ఒకచోటచెప్పఁబడినదానిని సామ్యముఁబట్టి మఱియొకచోట నుపయోగ పఱచుట; 2. బదులు: చూ, మాఱు. 1.

అతిధృతి. సం. వి. ఇ. స్త్రీ. 1. ధైర్యశాలి: చూ, దిట్టఁడు; అం. 2. ఇరువదియాఱు ఛందస్సులలో నొకటి: చూ, ఛందస్సులు.

అతిను. సం. వి. ఉ. న. ఓడకుమించినసీరు: చూ, సలిలము. [దాఁటినది.

అతినౌ. సం. విణ. ఉ. ఓడఁగడచినది, ఓడఁ

అతినౌక. సం. వి. అ. స్త్రీ: చూ, అతిను.

అతిపథము. సం. వి. అ. పుం. సత్పథము, మంచిత్రోవ: చూ, మార్గము. 1. [నవాఁడు.

అతిపథుఁడు. సం. విణ. మార్గమునతిక్రమించి

అతిపరిచయన్యాయము. పా. మిక్కిలిపరిచయముచేత మనుష్యుని యందనాదరముకలుగు రీతి. [పర్యాయము.

అతిపాతము. సం. వి. అ. పుం. మీఱుట: చూ,

అతిబల. సం వి అ స్త్రీ. 1. గాలివానతోఁ గూడినవాన: చూ, వాన. 1; 2. విశ్వామిత్రుఁడు రామునకుపదేశించిన బల, అతిబల అను రెండు విద్యలలో నొకటి; 3. సహదేవి*. చూ, ముత్తవపులగము; 4. అడవిప్రత్తి*: చూ, ప్రత్తి; 5. చిట్టాముదము*: చూ, వ్యాడంబకము; విణ. 6. మిక్కిలిబలముగలది.

అతిబలుఁడు. సం. విణ. 1. బలసంపన్నుఁడు: చూ, లావరి; 2. జముఁడు: చూ, యముఁడు.

అతిభూమి. సం. వి. ఇ. స్త్రీ అతిశయము: చూ, హెచ్చు. 2.

అతిభేదము. సం. వి. అ. పుం. గ్రహణి: చూ, రోగము. 1.

అతిమధురము. సం. వి. అ. న. 1: చూ, యష్టిమధుకము*; విణ. 2. మిక్కిలితియ్యనిది: చూ, మధురము. 1. [న్యాయాధిపతి.

అతిమాత్రికుఁడు. సం. విణ. గొప్పవాఁడు: చూ,

అతిమాత్రుఁడు. సం. విణ. అతిశయసంతుఁడు: చూ, హెచ్చుగలవాఁడు.

అతిమాత్రము. సం. క్రి. విణ, అ. న. 1. మెల్లు: చూ, హెచ్చు. 2; విణ. 2. ఎక్కువైనది: చూ, హెచ్చు. 1; అం. 3. అర్థదోషములు పదునెనిమిదింటిలోనొకటి: చూ, అర్థదోషములు.(లోకాతీతమయినదానినిగాఁ జెప్పుట)

అతిమానము. అం. హేయగుణములు పదునాలింటిలోనొకటి: చూ, హేయగుణములు.

అతిముక్తకము. సం. వి. అ. పుం. 1. తెల్లమ్మి*: చూ, తినాసము; 2. పూలగురివెంద*: చూ, శ్వేతపాకీ; 3. నల్లతుమికి*: చూ, తుమికి.

అతిముక్తము. సం. వి. అ. పుం.—పై.—; విణ. 4. కూడికలేనిది: చూ, నిష్ఫలము.

అతిముక్తుఁడు. సం. విణ. మిగులనాసక్తిగలవాఁడు. చూ, లుబ్ధుఁడు. 2.

అతిమూత్రము. సం. వి. అ. న. ఉచ్చ హెచ్చుగావెలువరించే రోగము: చూ, రోగము. 1.

అతిమేచక. సం. వి. అ. స్త్రీ. నల్లదింటెన*: చూ, దింటెన.

అతిరక్తము. సం. విణ. 1. అధికమైనది: చూ, హెచ్చు. 1; 2. ముత్తియములలోని యొక్క నిదోషము; చూ, ముత్యము.

అతిరథుఁడు. సం. వి. అ. పుం. పెక్కువిలుకాండ్రతోఁ బోరెడి యోధుఁడు: చూ, భటుఁడు. 1.

అతిరసము. సం. వి. అ. పుం.—అతిరస, భక్ష్యవిశేషము: చూ, భక్ష్యము.

అతిరాత్రము. సం. వి. అ. పుం. 1. యజ్ఞభేదము: చూ, యజ్ఞము; అం. 2. సోమయజ్ఞము లేడింటిలో నొకటి. చూ, సోమయజ్ఞములు.

అతిరిక్తము. సం. వి. అ. పుం. ఇంగిలీకము: చూ, హింగుళము; విణ. 2. హెచ్చినది: చూ, హెచ్చు. 1. [పద్మము. 1.

అతిరుహా. సం. వి. అ. స్త్రీ. మెట్టతమ్మి*: చూ,

అతిరేకము. సం. వి. అ. పుం. అతిశయము: చూ, హెచ్చు. 2; ఉప. 2. (అతియనుఉపసర్గయిచ్చట ధాత్వర్థమును 'హెచ్చు' అనునర్థమునకుమార్చినది.) [మేషము. 1.

అతిరోమశము. సం. వి. అ. పుం. మేఁక: చూ,

అతిలుబ్ధుఁడు. సం. విణ. మిక్కిలిపిసినిగొట్టు: చూ, లోభి.

అతివ. దే. వి. వనిత, ఇంతి, అఁడుది: చూ, స్త్రీ.

అతివక్త సం. విణ. వాక్మి, తానుపలుక నిశ్చయించిన యర్థమును లెస్సగా నిర్వహించువాఁడు: చూ, వక్త. 2.

అతివస. వై. వి.—అతివిషా*: చూ, విష.

అతివాదము. సం. వి. అ. పుం. పరుషముగా మాటలాడుట: చూ, పరుషము. 2.

అతివాసము. వై. వి.—అధివాసగమ్, శ్రాద్ధదినమునకు ముందుదినము: చూ, అధివాసరము.

అతివాహికుఁడు. సం. వి. అ. పుం. నరకమందున్న యాతనాజీవుఁడు. [విష.

అతివిష. సం. వి. అ. స్త్రీ.—అతివస *: చూ,

అతివృష్టి. సం. వి. ఇ. స్త్రీ. 1. దేశమునకు హానికరమైన హెచ్చువాన: చూ, వాన. 1; అం 2. ఈతిబాధలాఱింటిలో నొకటి: చూ, ఈతిబాధలు; ఉప. 3. (ఇచటవృద్ధిశబ్దముతో సమసించి 'మిక్కిలి' యనునర్థమునిచ్చినది).

అతివేలము. సం. క్రి. విణ, అ. న. 1. అతిశయము: చూ, హెచ్చు. 2; విణ. 2. అధికమైనది: చూ, హెచ్చు. 1. [శక్తి. 1.

అతిశక్తిత. సం. వి.అ. స్త్రీ. అధికబలము: చూ,

అతిశక్వరి. అం. ఇరువదియాఱు ఛందస్సులలో నొకటి: చూ, ఛందస్సులు.

అతిశయము. సం. వి. అ. పుం. . 1. అధిక్యము: చూ, హెచ్చు. 2; ఉప. 2. (అతి యను ఉపసర్గ ఇచట ధాత్వర్థమును 'ఆధిక్యము' అనునర్థమునకు మార్చినది).

అతిశయవంతుఁడు. సం. విణ. (త. ఈ. త.) ఏకాంతుఁడు: చూ, హెచ్చుగలవాఁడు.

అతిశయించు. సం. అ. క్రి: చూ, మిమ్మరించు

అతిశయిల్లు. సం. అ. క్రి.—పై.—

అతిశయోక్తి. అం. ఉపమేయమును గప్పివేసి ఉపమానమును మాత్రము కవి ప్రౌఢోక్తిమాత్రముగాఁ జెప్పఁబడినది. ఇది పదునైదువిధములు.

షన్నది. సంబంధ, అసంబంధ, అక్రమ, చపల, అత్యన్త,అభేద, భేదకాది భేదములు. "మేడలఁ గ్రీడలాడుచే డెలు, స్వర్ణదీశ మలములఁ దుర్గించుచున్నారు." : చూ, అలంకారము. 3.

అతిశాయనము. సం.అవ్య. ఎక్కుడు: చూ,కిమ్.

అతిశాయి. సం. విశే. (పు. ఈ. న.) అతిశయించినది: చూ, హెచ్చు. 2

అతిశీతిలాంశము. పా. షష్ట్యంశములలో నొకటి: చూ, షష్ట్యంశములు.

అతిశృంగకము. సం వి.అ. పుం. 1. అతిశృంగకమను చేఁప. చూ, మత్స్యము. 1; విశే. 2. పెద్దకొమ్ములు గలది. [శ్రేష్ఠము.

అతిశ్రేష్ఠనము. సం. విశే. ముఖ్యమైనది: చూ,

అతిసర్జనము. సం. వి. అ. న. 1. ఈవి: చూ, దానము. 1; 2. దోసము: చూ, పాపము. 1

అతిసారకి. సం. విశే. (పు. ఈ. న.) అతిసారరోగము గలవాఁడు: చూ, వ్యాధితుఁడు.

అతిసారకుఠారము. పా. ఒక ఘుటికౌషధము.

అతిసారనుత్తు. సం. వి. ఉ. పుం. కొడిసె * చూ, వత్సకము. [చూ, రోగము. 1.

అతిసారము. సం. వి. అ. పుం. గ్రహణిరోగము:

అతిసౌరభము. సం. వి. అ. పుం. మిక్కిలి పరిమళముగల తియ్యమామిడి*: చూ, మామిడి.

అతిస్థూలమహాశృంగము. పా. విధవాలక్షణము చూ, లక్షణము. 1. [పునుఁగు.

అతిస్పృశ. సం. వి. ఆ. స్త్రీ. పూతిగడ్డ*:చూ,

అతిహసితము. సం. వి. అ. న. శరీరకంపముతోఁ గూడిననవ్వు: చూ, హాస్యము. 1; అం. 2. హాస్యము లాఱింటిలో నిది యథనము: చూ, హాస్యములు.

అతీంద్రియము. సం. విశే. నేత్రాదీంద్రియములచే నెఱుఁగరానిది, ప్రత్యక్షము కానిది: చూ, కంచేమించు. 2.

అతీతకాలము. పా. కాలదోషము.(లిమిటేషన్.)

అతీత. అం. టక్కజభాష లిరువదియొకటింటిలో నొకటి.చూ, టక్కజభాషలు:(చూ,భాష1.)

అతీతము. సం. విశే. 1. కడచినది: చూ, అతిక్రాంతము; అం. 2. తాళగ్రహములు నాలుగింటిలో నొకటి: చూ, తాళగ్రహములు.

అతీవ. సం. అవ్య. చాల: చూ, మిగుల.

అతుకు. దే. వి. రూ-అదుకు. 1. సంధానవసనఖండము: చూ, మాసిక. 1; 2. మాటు:చూ, టంకపుపొడి; 3. బట్టలకుట్టు: చూ, కున్నవాయము; 4. అతికినతావు; అ క్రి. రూ-అదుకు. 5. కూడు:చూ, సంధించు. 1; 6. అదుము. చూ, సంధించు. 2;స. క్రి.రూ-అదుకు. 7. అతికించు, కూర్చు: చూ, సంధించు 3; 8. పొందు, కలియు: చూ, ప్రాపించు; 9. తాఁకు: చూ, స్పృశించు.

అతుకుఁబడి. దే. వి. అమరకము చేయుట: చూ, అమరకము.

అతుకువేయు. దే.స.క్రి కూర్చు:చూ,సంధించు.3.

అతులము. సం. విశే. సరిలేనిది: అతులితము, అనన్యము, అసమానము.

అతులితము. సం. విశే.—పై.—

అతులుఁడు. సం. విశే: చూ, ఈడులేనివాఁడు.

అతుల్యలంబము. పా: చూ, విషమచతుర్భుజము.

అతుల్యవిక్రమము.సం.వి.అ. పుం:చూ,సింహము.

అతృప్తుఁడు. సం. విశే: చూ, తనివిలేనివాఁడు.

అత్త. సం. వి.-అ. స్త్రీ. 1. అక్క:చూ,శ్వేష 4; 2. అమ్మ:చూ, మాత. 1; దే. వి. (1) మగనితల్లి: అత్తమ్మ, అత్తయ్య. (సం.వ.):-అంబిక; (2) భార్యతల్లి:అత్తమ్మ, అత్తయ్య. (సం. వ.):—అంబిక; (3) తండ్రి తోఁబు

ట్టువు: చూ, మేనత్త; (4) మేనమామభార్య: చూ, మాతులాని; అం. (5) గయాపిండదానార్హులు ముప్పదియాఱుగురిలో నొకతె: చూ, గయాపిండదానార్హులు.

అత్తడము. దే. వి. కాగితపు అట్ట: చూ, అట్ట.4.

అత్తడి. దే. వి. గోడిగబుఱుతువు. (గోడిగ=ఆఁడుగుఱ్ఱము.): చూ, రూ-నత్తడి: చూ, హయము.

అత్తపత్తి. దే. వి: చూ, సోఁకుడుముడుఁగు *.

అత్తమిల్లు. దే. అ. క్రి. 1. పండుకొను. ఆచ్ఛ. బాల. కాం. 158: చూ, శయనించు, 2. క్రమ్ము. జై. 2, ఆ. 97: చూ, వ్యాపించు; 3. అస్తమ్. అస్తమించు. కాశీ. 1, ఆ. 122: చూ, నింగిపడు; 4. ఒఱగు. స్వా. 2, ఆ. 27: చూ, వ్రాలు. 3; 5. ఉపశమించు: చూ, స్రుక్కు. 4; 6. చెడు: చూ, నశించు.

అత్తము. దే. వి. 1. అరటిపండ్లగెల, రూ-అత్తెము: చూ, గెల; 2. పూలగుత్తి: చూ, పూగుత్తి; 3. గెలలలో నొకభాగము; 4. సస్యగుచ్ఛము. వరిపొట్టకఱ్ఱ: చూ, పొట్టకఱ్ఱ; 5. గుంపు: చూ, సమూహము; వా. 6. అంటము, చేరము. (వ్య.)

అత్తమ్మ. ద్వ. వి. (అత్త.+అమ్మ.): చూ, అత్త. (1), (2), (3), (4), (5).

అత్తయ్య. ద్వ. వి.—పై.— [మము. 1.

అత్తరము. దే. వి. తొందరపాటు: చూ, సంభ్రమము. 1.

అత్తరు. దే. వి. 1. రూ-అత్తరువు. తావినూనె: చూ, పరిమళద్రవ్యము; అం. 2. గంధములు ఎనిమిదింటిలో నొకటి: చూ, గంధములు.

అత్తఱి. దే. వి. (ఆ+తఱి.) ఆసమయము.

అత్తలము. దే. వి. రూ-అత్తళము. 1. కుంతము, పొడుచునట్టియొకఆయుధము. భార. శల్య. 1, ఆ. 381: చూ, బాణము. 1; 2. బల్లెము, చేమదాకువంటి అలుఁగుగల బాణము. శశా. 3, ఆ. 57: చూ, బాణము. 1.

అత్తవారు. వా. వి. భార్యపుట్టింటివారు; భర్తపుట్టింటివారు.

అత్తి. పై. వి. 1. అంజూరు*: చూ, మేడి; 2. ఏనుఁగు: చూ, హస్తి.

అత్తిక. సం. వి. ఆ. స్త్రీ. నాట్యపరిభాషయందు అక్క: చూ, అంతిక. 1. [యిల్లు.

అత్తిల్లు. వా. వి. భార్యపుట్టినయిల్లు; భర్త పుట్టిన

అత్తు. దే. వి. 1. రూ-హత్తు, మైనపుగుడ్డ: చూ, వస్త్రము; అ. క్రి. రూ-హత్తు. 2. పొందు. విజ్ఞా, వ్య, కాం. 128: చూ, ప్రాపించు; 3. కలుగు. పంచ. నా. 1, ఆ. 119: చూ, పుట్టు. 2; 4. యుక్తమగు: చూ, సరిపడు. 2; పా. 5. అకారము. చూ, వర్ణము. 1.

అత్తుకొను. దే. అ. క్రి. 1. పొందు: చూ, ప్రాపించు; 2. కలుగు: చూ, పుట్టు. 2; 3 జీతపడు: చూ, సారత్రిపడు; 4. కత్తరిగలయు: చూ, సంకరమగు.

అత్తెము. దే. వి. 1. రూ-అత్తము: చూ, గెల: పై. వి. 2. హస్తత్రాణమ్. హస్తకవచము. ఉ. రా. 7, ఆ. 432; చూ, వారవారణము (చూ, వస్త్రము); 3. మైనపుగుడ్డ: చూ, వస్త్రము.

అత్తెసరు. దే. వి. (అత్తు+ఎసరు.) 1. గంజివారకుండ నన్నముతో నిమిడిపోవునట్లు పెట్టెడిఎసరు. "అత్తెసరు మెతుకులు."; 2. వెందటబియ్యము కడిగి నీటితో నింపి పొయ్యిమీఁదనుంచునది, కోష్ణజలము, ఎసరు: చూ, నఖంపచము. (రూ-బ. అత్తెసళ్ళు.)

అత్యంతకోపనుఁడు. సం. వి. అ. పుం. చండుఁడు, మిక్కిలికోపించువాఁడు: చూ, కోపనుఁడు. [వాక్యగతము అని ద్వివిధము.

అత్యంతతిరస్కృతవాచ్యములు. అం. పదగతము,

అత్యంతము. సం. క్రి. విశే, అ. వ. 1. అతిశయము: చూ, హెచ్చు. 2; 2. కడు: చూ, మిక్కుటము; 3. అధికమైనది: చూ, హెచ్చు.

1; అం. 4. సంఖ్యాభేదములు ముప్పదియా ఱింటిలో నొకటి: చూ, సంఖ్యాభేదములు.

అత్యంతయుక్తి. పా. రతిబంధభేదము: చూ, రతిబంధము.

అత్యంతవంతుఁడు. సం. విశే. త్రి. మిక్కుటము గలవాఁడు: చూ, అనవరతుఁడు.

అత్యంతాతిశయోక్తి. అం. అలంకారభేదము: కారణములేకుండఁగనే కార్యము జేరుగుట. చూ, అలంకారము. 3.

అత్యంతాయ. సం. అవ్య. 1: చూ, అతీవ; 2. మిక్కిలి: చూ, హెచ్చు. 2.

అత్యగ్నిష్టోమము. అం 1 సహీనతానము లేడిం టిలోనొకటి: చూ, సహీనతానములు; 2. సోమయజ్ఞము లయిదింటిలోనొకటి: చూ, సోమయజ్ఞములు. [హెచ్చు. 1.

అత్యధికము. సం. విశే. మిక్కిలి హెచ్చు. చూ,

అత్యస్యక్షము. సం. విశే. అతీంద్రియము, ఇంద్రియముల కగుపడనిది: చూ, కంచెమించె 2.

అత్యమ్లపర్ణ. సం. వి. ఆ. స్త్రీ. పుల్లబచ్చలి *. చూ, బచ్చలి.

అత్యయము. సం. వి. అ. పుం. 1. మీఱుట: చూ, పర్యయము; 2. చేటు: చూ, యత్తు; 3. జోహారు: చూ, నమస్కారము; 4. తప్పు: చూ, నేరము; 5. మనఃపీడ: చూ, శోకము; 6. చావు: చూ, మరణము.

అత్యరాళము. సం. వి.అ. పుం. 1. అరాళమనెడి యేనుఁగుకంటె మిక్కిలి ప్రమాణముగల యేనుఁగు: చూ, హస్తి. (ఇది నింద్యము); విశే. 2. నానావిధవక్రము: చూ, వంకర.

అత్యర్కము. సం. వి. అ. పుం. వెల్లజిల్లేడు *: చూ, జిల్లేడు.

[illegible]ము. సం. విశే. చెవులకు విననింప యినది (పలుకు): చూ, సాంత్వము. 3. (చూ, శబ్దము. 2.)

అత్యర్థము. సం. క్రి. విశే, అ. న. 1. అతిశయము: చూ, హెచ్చు. 2; విశే. 2. అధికమైనది: చూ, హెచ్చు. 1. [స్వల్పము.

అత్యల్పము. సం. విశే. మిక్కిలి కొంచెము: చూ,

అత్యష్టి. అం. ఇరువదియాఱు ఛందస్సులలో నొకటి. చూ, ఛందస్సులు.

అత్యాకారము. సం. వి. అ. పుం. తిరస్కారము: చూ, వహేలనము. [పర్యయము.

అత్యాదానము. సం. వి. అ. న. మీఱుట: చూ,

అత్యారూఢము. సం. విశే 1. సమారూఢము, లెస్సగా నెక్కఁబడినది; 2. అత్యధికము; చూ, హెచ్చు. 1.

అత్యావశ్యకము. సం. విశే. పేరాస: చూ, వాంఛ.

అత్యాహితము. సం. వి. అ. న. 1. మిక్కిలి వెఱపు: చూ, భయము. 1; 2. బ్రిదుపఁగోరని పని; విశే. 3. కూడఁబడినది. చూ, సంయుక్తము.

అత్యుక్త అం. ఇరువదియాఱు ఛందస్సులలో నొకటి: చూ, ఛందస్సులు.

అత్యుక్తి. అం. అలంకారభేదము, అద్భుతకార్య వర్ణనము. "దాతవీవగుమండయాచకులె కల్పతరువులైరి." : చూ, అలంకారము. 3.

అత్యుక్షిప్తతల. అం. అశ్వశాస్త్రమునందలి ముఖరజ్జువులు పదునాలుగింటిలో నొకటి: చూ, ముఖరజ్జువులు. [చూ, మలము. 1.

అత్యుషిత. సం. వి.ఆ. స్త్రీ. పిట్టగట్టిన పెంటిక:

అత్యూహము. సం. వి అ పుం. 1. నీటిప్రాఁచి*: చూ, శైవలము. 1; 2. ఎనిమిదిపేటలుగల స్త్రీల మొలనూలు: చూ, భూషణము. 2.

అత్రము. సం. వి. అ. న. పరమాన్నము: చూ, పాదము. (1)

అత్రి. సం. వి. ఇ. పుం. 1. నవబ్రహ్మలలో నైదవవాఁడు: చూ, బ్రహ్మ. 1; 2. ఒక ఋషి: చూ, ముని. 1; అం. 3. సప్తఋషు లలో నొకఁడు:చూ, మహర్షులు (చూ, గోత్రము); 4. మూలస్మృతులు పదునెనిమి దింటిలో నొకటి: చూ, స్మృతులు.

అత్రిజాతుఁడు. సం. వి. అ. పుం. చేందురుఁడు: చూ, హిమాంశువు.

అత్రినేత్రభువు. సం. వి. ఉ. పుం.—పై.—

అత్రిస్మృతి. అం. మూలస్మృతులు పదునెనిమి దింటిలోనొకటి: చూ, స్మృతులు.

అత్వసంధి. పా. ఉదా-అమ్మ + అడిగెను. అత్తు నకచ్చే పరమైనపుడు సంధిబహుళము.

అదంత్రము. నై. విశ.=అతంత్రమ్:చూ, అతం త్రము. [ములులేనిది.

అదంతము. పా.1.అకారముతుదనుగలది; 2.దంత

అదక. దే. వి. పాఁత చెప్పు: చూ, పాదుక.

అదటు. దే. వి. 1. గరువము. కాశీ. 6, ఆ. 22: చూ, హుంకారము; 2. క్రొవ్వు. స్వా. 5, ఆ. 24: చూ, మదము. 1.

అదత్తి. సం. విశ. ఇ. తిండిపోతు:చూ, భక్షకుఁడు.

అదద్భుజ. సం. వి. ఆ. స్త్రీ. కరుబూజాదోస*: చూ, దోస.

అదనము. నై. విశ. =అధికమ్,అధికమైనది:చూ, హెచ్చు. 1. [కుఁడు.

అదనశీలుఁడు. సం. విశ. తిండిపోతు:చూ, భక్ష

అదను. దే. వి. కాలము, రూ-పాదను: చూ, సమయము. 1.

అదనైనవాఁడు. దే. వి. ఆఁకలిగొన్నవాఁడు: చూ, బుభుక్షువు. [హెచ్చు 1.

అదభ్రము. సం. విశ. అధికమైనది: చూ,

అదమాయింపు దే. వి: చూ, మందలింపు. 2.

అదము. సం. వి. అ. పుం. 1. యజ్ఞార్థమైన అపూపము:చూ, పురోడాశము. 1; 2. ఇదమ్, ఈశబ్దమునకు అముహదర్థక ప్రథమైక వచనము:చూ,ఇయ్యది; పా. 3. అయొడైన్ అను రాసాయనిక పదార్థము.

అదయుఁడు. సం. విశ. దయలేనివాఁడు: చూ, నిర్దయుఁడు.

అదరము. వై. వి.=అధరమ్: చూ, పెదవి.

అదరించు. దే. స.క్రి. రూ-అగలించు. 1. గద్దించు. చూ, బెదరింపు; 2. అడలఁగొట్టు:చూ, బెదరించు, 3: చూ, కదలుచు.

అదరిపాటు. దే. అవ్య: చూ, డబ్బాటు.

అదరు. దే. వి. (రూ-అదరుగడ-అదురు-అడలు-అడుకు-అలుకు-అరుకు). 1. వెఱపు : చూ, భయము. 1; 2. భయచలనము; 3. కదలుట: చూ, చలనము. 1; అ. క్రి. రూ-అదురు. 4. అడలు:చూ, భయపడు; 5. కదలు:చూ, చలించు

అదరుగడ. దే. వి. వెఱపు: చూ, భయము. 1.

అదరులు. దే. వి. బ. మిడుఁగుఱులు. భార.అర. 5, ఆ. 151: చూ, వహ్ని. 1.

అదర్శనము. సం. వి. అ. న. 1. కల: చూ, స్వప్నము. 1; 2. కానరాకుండుట: చూ, వినాశము; పా. 3. అక్షరములులోనగునవి కనఁబడకపోవుట.

అదలించు. దే. స. క్రి: చూ, రూ-అదరించు

అదలు. దే. అ. క్రి. 1. బెదరు: చూ, భయపడు; స. క్రి. 2. భయపెట్టు: చూ, బెదరించు.

అదలుచు. దే. ప్రే.రూ-అదల్చు. కోపమునగద్దించు: చూ, బెదరించు. [తర్జనము.

అదలుపు. దే. వి. రూ-అదల్పు. దట్టన: చూ,

అదల్చు. దే. ప్రే: చూ, రూ-అదలుచు.

అదల్పు. దే. వి: చూ, రూ-అదలుపు

అదూరదశకము. పా. పదికిదగ్గఱనుండు లెక్క గలది. (రెండవదశకమునందలి పదునాలుగు పదికి దగ్గఱయగునది; అట్లే పందొమ్మిది యిరువదికి దగ్గఱయగునది; అదూరదశకపద్ధతిని పదునాలుగు పదిలో లెక్క, పందొమ్మిది యిరువదిలో లెక్క.) ఇంగ్లీషులో యీపద్ధతి పదులకు చేరువయగు ఉజ్జాయింపు (అప్రాక్సిమేషన్) అందురు.

అదూరము. సం. విశే. సమీపించినది: చూ, సమీపము. 1.

అదూషితము. అం. వ్యానకగణబంధంబు లిరువదియొకటింటిలో నొకటి. ఇది పదివిధములు.- వ్యానతము, నిర్వీటితము, నిఘాతకము, చటకవిలసితము, జృంభము, పరాహఘాతకము, వృషాభిఘాతకము, హ్రస్వకము, ఐభము, మార్జారము. (10): చూ, వ్యానకగణబంధములు.

అద్మకుఁడు. సం. విశే. శ. తిండివాఁడు: చూ, తిండి. [పమ్మపోవు.

అదృశ్యమగు. మి. అ. క్రి. కనఁబడకపోవు: చూ,

అదృశ్య. పా. అఱువదినాలుగు కళలలో నొకటి: చూ, కళలు.

అదృశ్యము. సం. విశే. దృశ్యముకానిది. (దృశ్యము=చూడఁదగినది.): చూ, కంచెమించె 2.

అదృశ్యుఁడు. సం. విశే: చూ, కానరానివాఁడు.

అదృష్టతరము. పా. షోడశ సంధులలో నొకటి: చూ, షోడశసంధులు.

అదృష్టము. సం. వి. అ. న. 1. అగ్నిజలాదులవలనఁబుట్టెడు కీడులు.-ఇంద్రి, దురదృష్టము అనఘము, దైవఘటన, దౌర్భాగ్యము, భాగ్యము. అది శబ్దముచేతవ్యాధి దుర్భిక్ష మూషికశలభములవలని భయముల; మఱియు దృష్టాదృష్టఫల ప్రదాయకములలో రెండవది. మోక్షము; 2. భాగ్యము: చూ, సంపత్తి 1; విశే. 3. చూడఁబడనిది, ముందుగా తెలియఁబడనిది: చూ, కంచెమించె. 2.

అదృష్టవంతుఁడు. సం. వి. త. పుం: చూ, సంపన్నుఁడు.

అదృష్టశాలి. సం. వి. న. పుం —పై.—

అదృష్టహీనుఁడు సం. వి. అ. పుం: చూ, పెట్టి పుట్టనివాఁడు.

అదృష్టి. సం. వి. ఈ. స్త్రీ. కోపముచేఁగ్రూరమైనమోపు: చూ, దృష్టి. 2.

అదె. దే. ద్రి. రూ-అదే. చూపుటను తెలుపును: చూ, ఏ.

అదే. దే. ద్రి.—పై.—

అదేయము. సం. విశే. ఈయఁగూడనిది, ఈయఁదగనిది. (భార్యాది.)

అద్వైవము సం. విశే. 1. అదృష్టములేనిది; 2. దైవములేనిది: అదోషము.

అదోషము. సం. వి. అ. పుం. 1. దోషములేకయుండుట; విశే. 2: చూ, అదైవము. 2.

అద్ద. వై. వి. 1.=అర్ధమ్. రూ-అర్ధము,,సగము: చూ, సగము; 2. అరసోల: చూ, నికుంచకార్థము; 3. నూర్చకవేసిన కుప్పయొక్క క్రిందిసగముభాగము: చూ, పడివేటు.

అద్దకము. దే. వి. వస్త్రమునకువేయురంగు: చూ, వర్ణము. 6.

అద్దగోడ. వై. వి.=అర్ధకుడ్యమ్. వంటయింటిలోనడ్డపదార్థములు మఱుఁగుగా నుండుటకై అడ్డుగా నమర్చినగోడ: చూ, మఱుగుగోడ.

అద్దమరేయి. వై. వి.=అర్ధరాత్రిమ్. (అద్ద + రేయి.) అర్ధరాత్రి: చూ, రాత్రి.

అద్దము. వై. వి. 1.=అర్ధమ్: చూ, సగము; 2.= అబ్దః. ముఖముచూచుకొనుగాజుబిళ్ల: చూ, ముకురము. (ఒకప్రక్కనుకళాయిపూసినది.)

అద్దరి. దే. వి. ఆవలిదరి: రూ-అద్దలి-అదలి-అతల-అవతల-అపల-అవ్వల-అవల: చూ, పారము. 1.

అద్ది. దే. స: చూ, రూ-అది.

అద్దించు. దే. స. క్రి. 1. ఫలపరిమితి నూహించు: చూ, ఊహించు; 2 ఉనుచు: చూ, గంగువేయు; 3. అద్దు: చూ, ముంచు

అద్దికాడు దే. వి. కావగి. సా. 1, ఆ. 73 చూ, గణ్ణము. [సేబాసు.

అద్దిటి. దే. అవ్య. ప్రశంసనార్థకము: చూ,

అద్దిటెయ్య. దే. అవ్య.—పై.—

అద్దియ. దే. వి. రూ-అద్దె చూ, బాడిగ.

అద్దిగ దే. అవ్య. (అద్ది + గ) చూ, రూ-అ × ఉ, రా. 6, ఆ. 135 (పినికిఅన్న అయ్యలు అను ప్రయుక్తంబులగు —అద్దిగన్న, అద్దిరయ్య): [డబ్బాటు.

అద్దిపాటు. ద్వ. అవ్య. ఉన్నట్టుండి: చూ,

అద్దిరా. దే. వి. (అద్ది + రా.): చూ, రూ-అద్దిగ

అద్దు దే. స. క్రి. చూ, అద్దించు 1, 2, 3.

అద్దువ. దే. విశే: చూ, రూ-అదువ.

అద్ద. దే. వి: చూ, రూ-అద్దియ

అద్దకాపు. దే. వి: చూ, అదుపకాపు.

అద్దెకాపురము. దే. వి: చూ, అదుపకాపురము.

అద్దెటి. దే. అవ్య: చూ, అద్దిటి.

అద్ధ్రిధి. సం. వి. ఇ. స్త్రీ. యజ్ఞపశుమేఢ్రస్థానావయవము.

అద్భుతదృష్టులు. పా. రసదృష్టు లెనిమిదింటిలో నొకటి: చూ, రసదృష్టులు.

అద్భుతపడు. మి. అ. క్రి: చూ, వెఱగొందు

అద్భుతము. సం. వి. అ. న. 1. ఆశ్చర్యము, అబ్రము: చూ, వింత. 1; అం. 2. ఉద్భుతము, నవరసములలో నొకటి: చూ, రస [illegible]. 3. ఆశ్చర్యమయినది: చూ, వింత. 1; 4. లోకచుక్కలోనగు ఉత్పాతము: చూ, తోకచుక్క. [శివుడు.

అద్భుతశ్యనుడు. సం. వి. అ. పుం: చూ,

అద్మ్యాతిము. సం. వి. అ. న. కాగ్గిలపెట్టబడుట.

అద్మని. సం. వి. ఈ. స్త్రీ. 1. విషముచేర్చిన నీటికజ్జపాత్రము: చూ, పాత్రము. 6; 2. యజ్ఞమునందు పశుశిక్షణము. [సుడు.

అద్మరుడు. సం విశే. తిండిపోతు: చూ, భక్షు

అద్య. సం. అవ్య. 1. నడచెడిపగలు: చూ, పగలు; 2. ఇప్పుడు. చూ, సాంప్రతము. 2.

అద్యతనము. సం. విశే. నేటిది, ఇప్పటిది.

అద్యశ్వము. సం. వి. ఇ న. ఇప్పుడు చూ, సాంప్రతము. 2. [చూ, సాదుగు.

అద్యశ్వీనము. సం. విశే. ఆవుసాదుగు చేయుట:

అద్రి. సం. వి. ఇ పుం. 1. కొండ: చూ, పర్వతము; 2. శిల: చూ, రాయి; 3. చెట్టు: చూ, వృక్షము; 4. ఏడులను అంకెను సంకేతము. చూ, సప్తకము; 5. ఇగులగొంగ: చూ, సూర్యుడు, 6. పరిమాణభేదము.

అద్రికాకము. సం. వి. అ. పుం. కొండకాకి: చూ, వాయసము. 1.

అద్రిప్రదక్షిణసమయము. పా. గ్రహసమయము లరువదేడింటిలో నొకటి(దారిద్ర్యము.): చూ, గ్రహసమయములు. [చూ, పర్వతము.

అద్రిరాజు. సం. వి. అ పుం. హిమవత్పర్వతము:

అద్రివాసుడు. సం. వి. అ. పుం: చూ, శివుడు.

అద్రుచు దే. అ. క్రి: చూ, రూ-అదురుచు.

అద్వయవాది. సం. వి. న్. పుం. జైనులదేవత: చూ, బుద్ధుడు. 1.

అద్వైతము. సం. వి. అ. న. 1. భేదములేమి: చూ, ఒక్కటితనము. 1; అం. 2. జీవేశ్వరుల నైక్యము చెప్పు మతము. "జీవో బ్రహ్మైవ నాపరః," "బ్రహ్మసత్యం జగన్మిథ్య" యని

చెప్పు శంకరులమతము; మతములు మూఁడిం
టిలోనొకటి: చూ, మతములు.

అద్వితీయకము. సం. వి. అ. పుం. తాళప్రాణ
కళాభేదము: చూ, తాళము 2.

అద్వైతి. సం. వి. ఇ. పుం. జీవేశ్వరులకైక్యము
చెప్పుమతముగలవాఁడు.

అథ. సం. అవ్య. సూ-అథో. * 1. మంగళము:
చూ, శుభము. 1; 2. అనంతరము: చూ,
పిమ్మట; 3. ఆరంభము: చూ, యత్నము;
4. ప్రశ్న, సవాలు: చూ, ప్రశ్నము; 5 =
అంత. యావత్తు: చూ, సర్వము; 6. అంగీ
కారము: చూ, సమ్మతి. 1; 7. అధికారము.
చూ, ప్రక్రియ; 8. చెదరినవాని నొకటిగా
ప్రోగు చేయుటయను సముచ్చయార్థకమును
తెలుపును: చూ, సముచ్చయము 1; 9. మా
ఱుదల: చూ, వికల్పము. 2; 10. ఉదాహ
రణము, దృష్టాంతము: చూ, నిదర్శనము. 1;
11. అధికార్థకము, అదనము, ఎచ్చు: చూ,
హెచ్చు. 1; 12 స్తుత్యర్థకము: చూ, స్తో
త్రము; 13. మెడను సమముగాఁజేయుట

అధఃకరణము. సం. వి. అ. న. 1. అధఃకార
ము: చూ, క్రిందు పఱచుట; 2. అధఃకారము:
చూ, తక్కువపఱచుట; 3.=అతిక్రమము
మట్టుమీఱినకార్యము: చూ, అతిక్రమము.

అధఃకరించు సం. స. క్రి.= అతికరించు, క్రిం
దుపఱచు: చూ, తగ్గించు.

అధఃకారము. సం. వి. అ. పుం. 1. అధఃకర
ణము: చూ, క్రిందు పఱచుట; 2. అధఃకర
ణము: చూ, తక్కువపఱచుట.

అధఃకృతము. సం. విశే. 1. క్రిందుపఱుపఁబ
డినది: చూ, అధరితము. 1; 2, తక్కువప
ఱుపఁబడినది: చూ, అధరితము. 2.

అథకిం. సం. అవ్య. అంగీకారార్థకము, అవును:
చూ, సమ్మతి. 1. [చూ, బాణము. 1.

అధశాళ్యము. సం. వి. అ. న. ఇంద్రునిబల్లా:

అధమక్షేత్రములు. పా. నాభి, శ్రవణము, స్తనా
గ్రము, మణిబంధము, హనువు, కంఠము.(6).

అధమపక్షము. పా. చిట్టచివరకు, కనీసము.

అధమమగు. మి. అ. క్రి: చూ, క్రిందుపడు.

అధమము. సం. విశే. 1. తక్కువైనది: చూ,
హీనము. 1; 2. నిందింపఁబడినది; 3. అస్ఫు
టమైనది. (కావ్యము.): చూ, అస్ఫుటము;
అం. 4. హస్తక్షేత్రములు మూఁడింటిలోనొ
కటి: చూ, హస్తక్షేత్రములు.

అధమర్ణుఁడు. సం. విశే. అప్పు పుచ్చుకొన్న
వాఁడు. చూ, ధనగ్రాహకుఁడు.

అధమాధమము. సం. విశే. మిక్కిలిచెడ్డది.

అధమాధముఁడు. సం. విశే. మిక్కిలిచెడ్డవాఁడు.

అధమాపారితక్రియ. సం. వి. ఆ. స్త్రీ. నాట
కాంగభేదము: చూ, నాటకము. 1.

అధముఁడు. సం. విశే. నీచుఁడు: చూ,
హీనుఁడు. [చూ, చుంబనములు.

అధరకము. అం. చుంబనములుపదింటిలోనొకటి:

అధరచుంబనము. అం. చుంబనములు పదునైదిం
టిలోనొకటి: చూ, చుంబనములు.

అధరము. సం. వి. అ. పుం. 1.=అదరము.
ఓష్ఠము, మోవి: చూ, పెదవి; అం. 2. కళా
స్థానములు పదునాఱింటిలోనొకటి, పెదవి:
చూ, కళాస్థానములు; 3. స్త్రీలక్షణాంగ
ము లేఁబదియొనిమిదింటిలోనొకటి: చూ, స్త్రీ
లక్షణాంగములు; 4. చుంబనస్థానములు తొ
మ్మిదింటిలోనొకటి: చూ, చుంబనస్థానములు:
5. నాట్యోపయోగాంగములు పందొమ్మిదిం
టిలోనొకటి: చూ, అంగము. 9; చూ, నా
ట్యోపయోగాంగములు; 6. అధరములు.—
నివర్తితము, కంపితము, విసృష్టము, వినిగూ
హితము, సందష్టకము, సముద్గము.(6); 7. మ
ధ్యమక్షేత్రము లయిదింటిలో నొకటి: చూ,
మధ్యమక్షేత్రములు; విశే. 8. క్రిందిది: చూ,

అపరము. 8; 9. తక్కువైనది: చూ, హీనము. 1.

అధరితము. సం. విశే. అధఃకృతము.

అధరీణుఁడు. సం. విశే. పరులచేత నిందింపఁబడ్డవాఁడు: చూ, వెలివాఁడు. 1.

అధరుఁడు. సం. విశే: చూ, అధముఁడు.

అధరేణ. సం. అవ్య. చేరువ: చూ, సమీపము. 1

అధరేద్యుః. సం. అవ్య: చూ, నిన్న.

అధరోష్ఠము. అం. సాముద్రిక శాస్త్రమునందలి లక్షణాంగములు ఏఁబది యొనిమిదింటిలో నొకటి: చూ, లక్షణాంగములు.

అధర్మము. సం. వి. అ. పుం. ధర్మముకానిది: చూ, ఉపరాగము. 3

అధర్వణుఁడు. సం. వి. అ. పుం. 1. అధర్వణవేదముఁ దెలిసిన బ్రాహ్మణుఁడు: చూ, బ్రాహ్మణుఁడు; 2. శుభాశుభ వైదిక కర్మములను చేయించుచు మేలుకీడులను తెలుపుచుండెడి యాచార్యుఁడు చూ, యాజ్ఞికుఁడు; 3. ముక్కంటి: చూ, శివుఁడు.

అధర్వవేదము. అం. 1. చతుర్వేదములలో నొకటి: చూ, వేదములు; 2. విద్యలు పదునాలుగింటిలో నొకటి: చూ, విద్యలు. (అధర్వణవేదము అనియు.)

అధర్వుఁడు. సం. వి. న్. పుం. 1. జన్నిగట్టు: చూ, బ్రాహ్మణుఁడు; 2. ఒకానొక ఋషి: చూ, ముని. 1.

అథవా. సం. అవ్య. తథా నోచే దిత్యర్థకము, అలాగు కాకపోయినచో: చూ, కింవా.

అధస్థలము. పా. 1. దృష్టిక్రియలు పదునెనిమిదింటిలో నొకటి : చూ, దృష్టిక్రియలు; 2 హస్తప్రచారములు పదునైదింటిలో నొకటి: చూ, హస్తపరిచారములు.

అధార్మికుఁడు. సం. విశే. ధర్మబుద్ధి లేనివాఁడు: చూ, రూ-అధార్మికుఁడు. [యుండుట.

అధార్ష్ట్యము. సం. వి. అ. న. సాహసము లేక

అధి. సం. ఉప. 'అధి' యను ఉపసర్గతోఁ జేరిన శబ్దములు.—అధికరణము, అధికము, అధ్యయనము, అధిక్షేపము, అధిగమము; సం. అవ్య. 2. అధికము: చూ, హెచ్చు. 1: 3. ముక్కంటి: చూ, శివుఁడు; 4. కార్యము: చూ, పని. 2; 5. నడవడి: చూ, వర్తనము. 1; 6. ఉపకము: చూ, సలిలము.

అధికతాద్రూప్యరూపకము అం. ఒకానొక రూపకాలంకారము: చూ, అలంకారము. 8.

అధికపదము. అం. వాక్యదోషము లిరువది నాలుగింటిలో నొకటి: చూ, వాక్యదోషములు. ఉ. యోగిసంఘమున నభిముఖుఁడై చచ్చిన వీరుఁడును సూర్యమండలాకారమును భేదించి పోవుదురు. ఇందు 'ఆకారము' అధికము. అక్కఱలేని పదములఁ జేర్చరాదు. (లేనిపోనిమాటలు చెప్పట.)

అధికపరిసంగము. సం. వి. అ. పుం. సంబంధములేని పరిసంగము: చూ, అపరిస్తుతపరిసంగము. [చ్చు. 3.

అధికమగు. మి. అ. క్రి. హెచ్చు: చూ, హె

అధికమాసము. సం. వి. అ. పుం. ఒకసంవత్సరములోని పండ్రెండు మాసములలో నే దైనొక్కటేని రెండుమాఱులు గలిగినయందు మొదటినెల. దీనిని మలమాసమని యాడెదరు: చూ, మలమాసము. (చూ, మాసము. 1 )

అధికము. అం 1. ఒక యర్థాలంకారము, ఆధారముకంటె నాధేయముగాని ఆధేయముకంటె నాధారముగాని హెచ్చేగుట ఉ. "నిదానోదకపుందుధరణికొక దీవియయ్యె": చూ, అలంకారము. 8; 2. సం. వి. అ. పుం. క్రయవిక్రయములవలన వచ్చిన విశేషధనము: చూ, లాభము. 1; విశే. 3. అదనము: చూ, హెచ్చు. 3; ఉప. 4. (ఇచట 'అధి' యను నది ప్రాతిపదికమై 'క' అను తద్ధిత ప్రత్యయమును బొందినది.)

అధికరణము. సం. వి. అ. న. 1. ఆధారము, ఆదరువు: చూ, ప్రాపు. 2; పుం. 2. వడ్రంగి చెక్కెడు మ్రానునకు ఊఁతగా క్రిందనుంచెడి బల్లలోనగు కాఁడిదుంగ : చూ, దాఁగలి. 1; 3. కాఁచిసాగఁగొట్టెడు ఇనుము బంగారులోనగు వానికి ఊఁతగా క్రిందనుండు ఇనుపముద్ద: చూ, దాఁగలి 3; అం. 4. కారకములారింటిలో నొకటి: చూ, కారకములు;(ఆధారము కర్తకుగాని కర్మకుగాని సంబంధించి జరిగెడుస్థితి.—రాజు పీఠమందుండెను. ఇచ్చట పీఠమధికరణము; దేవునియందు భక్తి. ఇచ్చట దేవుఁడధికరణము.); ఉప. 5. (ఇచ్చట 'అధి' అనునది ధాత్వర్థమును 'ఆధారమ' నునర్థముగా మార్చినది.); పా. 6. అధికరణమనఁగా నాధారము. అది మూఁడువిధములు.— ఔపశ్లేషికము, వైషయికము, అభివ్యాపకము. (3)

అధికరించు సం. స. క్రి. చేయు: చూ, పరించు

అధికర్ధి. సం. వి. ఇ. పుం, స్త్రీ. అధికమైన సంపదగలవాఁడు: చూ, సమృద్ధుఁడు.

అధికపర్ణపాతము. పా. అతివృష్టి.

అధికవృద్ధిన్యాయము. పా. వృద్ధిప్రయోజనన్యాయము, యథావృద్ధిన్యాయము.

అధికసంఖ్య. పా. 1. బలాధిక్యము, బహుమత్యము; వా. 2. పెద్దఅంకె.

అధికాంగము. సం. వి. అ. న. నడికట్టు: చూ, వస్త్రము.

అధికాంగుఁడు. సం వి. అ. పుం. అధికమైన అంగము గలవాఁడు.

అధికాభేదరూపకము. అం. ఒకానొక రూపకాలంకారము: చూ, అలంకారము. 3.

అధికారము. సం. వి. అ. పుం. 1. అధిక్రియ: చూ, ప్రక్రియ. 1; 2. చెల్లుబడి : చూ, ప్రాబల్యము; అం. 3. అనుబంధములు నాలుగింటిలో నొకటి : చూ, అనుబంధములు; పా. 4. ఆధిపత్యము.

అధికారి. సం. వి. న్. పుం. అధ్యక్షుఁడు, అధికారము కలవాఁడు: చూ, న్యాయాధిపతి.

అధికుఁడు. సం. వి. అ. పుం.—పై.—

అధికురాలు. మి. వి. ఇ. యజమానురాలు: చూ, స్త్రీ.

అధికృతుఁడు. సం. వి. అ. పుం: చూ, అధికారి.

అధికోపమము. అం. 1. వాక్యదోషము లిరువదియొకటింటిలో నొకటి: చూ, వాక్యదోషములు. ఉ. హెచ్చుపదముండిన నధికోపమము. "అయింతిపూచిన తీఁగవలెనున్నది." ఇందుఁ 'బూచిన' యను పదమెక్కుడగనున్నది. తీఁగ నింతి యుపమానోపమేయములు; ఆరాజు విరోధుల స్త్రీలు వికలముఖులై వాడిన పద్మకుముదములుగల వేసఁగి నదులవలెనైరి. పద్మమునకు ముఖమునకు నుపమానోపమేయములు సరిపోఁగా కుముదశబ్దమధికము ; 2. అర్థదోషములు పదునెనిమిదింటిలో నొకటి: చూ, అర్థదోషములు. ఉ. అల్పుని గొప్పవానితోఁబోల్చుట అధికోపమము. ఉ. కొలనిలోని కొంగలు మునివరులంబోలియుండెను. వాని తలలోని పేను శంకరు శిరస్సులోని చంద్రునివలెనుండెను.

అధిక్రియ. సం. వి. ఆ. స్త్రీ: చూ, అధికారము. 1.

అధిక్షిప్తము. సం. విశే. 1. [illegible]ంచఁబడినది: చూ, వ్యాధము; 2. నిందింపఁబడినది:, చూ, హీనము. 2; 3. బెదరింపఁబడినది.

అధిక్షిప్తుఁడు. సం. వి. అ. పుం. నిందితుఁడు: చూ, వ్యాధుఁడు. 2.

అధిక్షేపము. సం. వి. అ. పుం. 1. దూషణ: చూ, నింద. 1; 2: చూ, బెదరింపు; ఉప. 3. (ఇచ్చట ధాత్వర్థమును 'ఆక్షేపించు' అను నర్థమునకు మార్చినది.)

**అధిక్షేపించు.** సం. స. క్రి: 1: చూ, నిందించు, 2. భయపెట్టు: చూ, బెదరించు

**అధిగతము.** సం. విశే. 1. చేసుకొనబడినది: చూ, ధరితము; 2. పొందఁబడినది : చూ, ప్రాప్తము. 1.

**అధిగమము.** సం. వి. అ. పుం. 1. చేసుకొనుట: చూ, ధనము; 2. పొందుట: చూ, ప్రాప్తము. 1; 3. లాభము: చూ, లాభము. 1; ఉప. 4. (ఇచ్చట వ్యర్థమైనది.)

**అధిగమించు.** సం. క్రి. 1 చేసుకొను. చూ, ధరించు, 2. ఎఱుకపడు: చూ, విదితమగు; 3. పొందు చూ, ప్రాపించు

**అధిచ్ఛత్రిము.** సం. వి. అ. పుం: చూ, తుమికి.

**అధిజ్యము.** సం. విశే. ఎక్కుపెట్టినది.

**అధిత్యక.** సం. వి. అ. స్త్రీ. కొండమీఁది నేల చూ, భూమి. 1.

**అధిదైవికము.** సం. తాపములు మూఁడింటిలో నొకటి: చూ, తాపము.

**అధినగ్నిక.** సం. వి. అ. స్త్రీ వివాహము కాని పదునొకండు వత్సరముల కన్యక చూ, స్త్రీ.

**అధిపతి.** సం విశే. ఇ. అధిపుఁడు : చూ, ప్రభువు. 2

**అధిపికము.** సం. వి. అ. పుం. 1. కోఁతి: చూ, వానరము; 2. తుమ్మెద: చూ, భ్రమరము. 1; 3 కోయిల: చూ, పికము.

**అధిపుఁడు.** సం. విశే. చూ, అధిపతి.

**అధిభువు.** సం. విశే. ఉ.—పై.—

**అధిమాసము.** సం. వి అ. పుం: చూ, అధికమాసము.

**అధియోగము.** పా సప్తమ వష్టాష్టమములలో నేదొకదాని యందైనను శుభగ్రహములుండుట.

**అధిరోహణము.** సం. వి. అ. న. 1. ఆరోహణము, ఎక్కుట : చూ, ఎక్కుడు. 5; పా 2. సింహాసనమునకు వచ్చుట.

**అధిరోహించు.** సం. స. క్రి. ఆరోహించు చూ, ఎక్కు. 6.

**అధిరోహిణి.** సం. వి. ఈ. స్త్రీ. చూ, నిచ్చెన

**అధివసించు** సం. అ. క్రి చూ, వసించు.

**అధివాసము.** సం. వి. అ. పుం. 1. చోటు: చూ, స్థానము. 1; 2. వాసనకట్టుట: చూ, వాసన; 3. గంధమాల్యాదులచేత వస్త్ర తాంబూలాదులయొక్క సంస్కారము: చూ, సంస్కారము. 1; 4. నాగరంగము *: చూ, నారింజ; 5. కయిసేఁత: చూ, సపర్య.

**అధివాసనము.** సం. వి. అ. పుం, న = అధివాసము: చూ, అధివాసము.

**అధివిన్న.** సం. వి. అ. స్త్రీ. 1. మొదటి పెండ్లాము, సపత్నీతనము చేత దుఃఖించునది: చూ, భార్య; 2. రేయి : చూ, రాత్రి; 3 పితలను గుఱించి చేయుహోమాదులందుఁ జెప్పునట్టి యుద్దేశత్యాగము: చూ, స్వాహాకారము. [మఱలఁ బెండ్లియాడుట.

**అధివేదనము.** సం. వి. అ. న. భార్యయుండఁగ

**అధిశయను.** సం. విశే. ఘృతాదికద్రవస్పర్శనము: అధిశ్రయణము.

**అధిశ్రయణము.** సం. విశే. —పై —

**అధిశ్రియణి.** సం. వి. ఈ. స్త్రీ. చూ, పొయ్యి.

**అధిష్ఠాతృ.** సం. విశే. (ఋ. ఈ. ఋ.) అధిష్ఠించువాఁడు. (ఈకారాంతము అధిష్ఠాత్రీ.)

**అధిష్ఠానము.** సం. వి. అ. న. 1. చోటుమేర: చూ, బండికన్ను; 2. ఆక్రమణము: చూ, పురి. 4; 3. కోశబలములవలనఁ గలిగిన తేజము: చూ, ప్రభావము. 1; 4. ఒక పట్టణము: చూ, దేశము; 5. వ్యవస్థాకరణము; 6. ఆరోపణము: చూ, ఆరోపము; పుం. 7: చూ, విమర్శనము; 8. వర్తనము: చూ,

నృత్యము; 3. ధాన్యపుకొట్టు, గాదె: చూ, కుంటసాల.

అధిష్ఠించు. సం. స. క్రి. ఆశ్రయించియుండు.

అధిసంధి. పా. అసాధ్యసంధి.

అధీతము. సం. విశే. అధ్యయనింపఁబడినది.

అధీతి. సం. వి. ఇ. స్త్రీ. 1. అధ్యయనము, గురుముఖమున అను ప్రారిగ వేదముఁ జెప్పుట: చూ, ఉపక్రమము; వి. న్. పుం. 2. అధ్యయనము చేసినవాఁడు.

అధీనమగు. మి. అ. క్రి: చూ, లోఁబడు.

అధీనము. సం. విశే. లోఁకువ: చూ, వశము.1.

అధీనముచేయు. మి. స. క్రి: చూ, వశపఱచు.

అధీనుఁడు. సం. విశే. ఒకరికిలోఁబడినవాఁడు: చూ, పరాధీనుఁడు.

అధీర. సం. వి. ఆ. స్త్రీ. 1. మధ్యయను నాయిక; 2. ప్రగల్భయను నాయిక; 3. మధ్యాప్రగల్భలలో రెండవది, అన్యాసక్తుఁడైనను పతి నేమి యుననక పరాఙ్ముఖియయినది: చూ, మధ్యాప్రగల్భలు.

అధీరుఁడు. సం. విశే. వ్యసనాదులచేత వ్యాకులపడిన వాఁడు: చూ, వెఱపరి.

అధీశుఁడు. సం. వి. అ. పుం. సమస్తసామంతులచేత సేవింపఁబడురాజు: చూ, ప్రభువు.2.

అధీశ్వరుఁడు. సం. వి. అ. పుం. — పై.—

అధుతము. సం. విశే. చలింపఁబడనిది.

అధునా. సం. అవ్య. ఇప్పుడు: చూ, సాంప్రతము. 2.

అధూసరచ్ఛదము. సం. వి. అ. పుం. మధురముగాఁబలికెడు హంస, కలహంస: చూ, హంస. 1.

అధృష్టుఁడు. సం. విశే: చూ, నిష్ప్రయోజకుఁడు.

అధేయపర్యాయము. అం. అలంకారభేదము: చూ, అలంకారము. 3.

అధైర్యపడు. మి. అ. క్రి. బెదరు: చూ, భయపడు.

అధైర్యము. సం. వి. అ. న. ధైర్యములేమి: చూ, పిఱికికండ.

అధో. సం. అవ్య: చూ, రూ-అధః. 1 మొదలు 13 వఱకు; 14. వేఱుమతములలోని విశేషము; 15. సంశయార్థకము: చూ, సంశయము; 16. ఒకపనియందుఁ బ్రవేశించిన వానిని వేఱుపనికిఁ బుచ్చుకొనుట: చూ, అన్యాదేశము

అధోంశుకము. సం. వి. అ. న. మొలను ధరించెడి వస్త్రము: చూ, వస్త్రము.

అధోక్షజాయనమః అం. (అధోక్షజః-జ్ఞాతృత్వాభావాత్ - హీనం, ప్రత్యక్షజ్ఞానం యస్యసః ఇంద్రియాగోచరత్వాత్ పంచమహాభూతేంద్రియాగమ్య ఇత్యర్థః) సమస్తేంద్రియములచే తెలిసికొనఁబడనివస్తువు కొఱకు నమస్కారము: చూ, ఓమ్.

అధోక్షజుఁడు. సం. వి. అ. పుం. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1.

అధోగతము. అం. 1. హస్తప్రచారములు పదునైదింటిలో నొకటి: చూ, హస్తప్రచారములు; 2. భౌమమండలములు పదింటిలో నొకటి: చూ, భౌమమండలములు.

అధోగతుఁడు. సం. విశే. తక్కువస్థితిని పొందినవాఁడు. [చూ, బరిబెంక

అధోపుష్పి. సం. వి. ఈ. స్త్రీ. పక్కా *:

అధోభాగము. సం. వి. అ. పుం. 1. క్రింద: చూ, దిగువాటు; అం. 2. హస్తక్షేత్రములు పదుమూఁడింటిలో నొకటి: చూ, హస్తక్షేత్రములు.

అధోభువనము. సం. వి. అ. న. పాతాళలోకములలో నొకటి: చూ, లోకము. 1.

అధోభూమి. పా: చూ, అంతర్భూమి.

అధోముఖము. సం. విణ. 1. దిగుముఖముగలది: చూ, తలకడవు; అం. 2. శిరోభేదములు తొమ్మిదింటిలో నొకటి: చూ, శిరోభేదములు; 3. శిరఃక్రియలు పదునేడింటిలోనొకటి: చూ, శిరఃక్రియలు; 4. బాహుక్రియాచారములు పదింటిలోనొకటి: చూ, బాహుప్రచారములు. [పుష్ప *.

అధోముఖి. సం. వి. ఈ. స్త్రీ: చూ, అధో

అధోముఖుఁడు. సం. వి. అ. పుం. దిగుముఖము గలవాఁడు: చూ, అవాచీనుఁడు.

అధోయంత్రము పా ముఱికినివెలుపలఁజేయు యంత్రము: చూ, బట్టీ

అధోరేయుఁడు. సం. వి. అ. పుం. ముఖ్యుఁడు కానివాఁడు: చూ, అముఖ్యుఁడు.

అధోలోకములు. అం. అతలము, వితలము, సుతలము, తలాతలము, మహాతలము, రసాతలము, పాతాళము. (7)

అధోవృత్తము. పా: చూ, ఊర్ధ్వవృత్తము.

అధోహలము. సం. వి. అ. న. ఏఁడికోలలేనినాఁగలిదుంప: చూ, లాంగలము. 1.

అధ్యక్షము. సం. విణ. 1. చక్షురాదీంద్రియగోచరమయినది, ఐంద్రియకము: చూ, నెల్లఁడి; 2. నల్లగురివెంద *: చూ, తులాబీజము; 3. పాము: చూ, సర్పము.

అధ్యక్షించు. సం. స. క్రి. చేకొనికాపాడు: చూ, రక్షించు.

అధ్యక్షుఁడు. సం. వి. అ. పుం. 1. అధికారి. (ప్రెసిడెంటు.) : చూ, న్యాయాధిపతి; 2. జమదగ్ని కొడుకు: చూ, పరశురాముఁడు; 3. గ్రామాధికారి: చూ, మునసబు.

అధ్యగ్నిక్కృకము. అం. 1. స్త్రీధనము లాఱింటిలో నొకటి, వివాహవేళ అగ్నిహోత్రసన్నిధియందు చదివింపఁబడు స్త్రీధనము: చూ, స్త్రీధనములు.

అధ్యయనము. సం. వి. అ. న. 1. చూ, అధీతి; అం. 2. షట్కర్మములలో నొకటి: చూ, కర్మములు; ఉప. 3. (ఇచటనిరర్థకమైనది)

అధ్యవసాయము. సం. వి. అ. పుం. ప్రయాసము: చూ, యత్నము. [చూ, యుద్ధము.

అధ్యాఖ్యానము. సం. వి. అ. న. కల్లనిగడము.

అధ్యాఖ్యానుఁడు. సం. వి. అ. పుం. లేనిదోషముల నిరూపించువాఁడు.

అధ్యాత్మము సం. అవ్య. మోక్షవిషయమయిన జ్ఞానము, పరమాత్మస్వభావము: చూ, బుద్ధి.

అధ్యాత్మ రామాయణము. పా. శ్రీరాముని పరమాత్మగాఁజెప్పు తదనుకూలముగా వ్యాసశుక్రుఁడు రచించినకావ్యము: చూ, కావ్యనాటకములు

అధ్యాత్మికము సం. అవ్య. 1 చూ, అధ్యాత్మము; అం. 2. తాపములు మూఁడింటిలో నొకటి: చూ, తాపములు.

అధ్యాపకుఁడు. సం. వి. అ. పుం వేదశాస్త్రములు చెప్పఁజేయువాఁడు: చూ, గణి. 2.

అధ్యాపనము అం. 1. షట్కర్మములలోనొకటి: చూ, కర్మములు; సం. వి. అ. న. 2. వేదముఁ జదివించుట

అధ్యాయము. సం వి. అ. పుం. 1. అధ్యాయము: చూ, వేదము; 2 గ్రంథభాగ విశేషము: చూ, సర్గము. 1.

అధ్యావాహనికము. అం. పుట్టినింటనుండివచ్చి పెనిమిటింటికి పోవునపు డియ్యఁబడు స్త్రీధనము, స్త్రీధనము లాఱింటిలోనొకటి: చూ, స్త్రీధనములు. [చూ, పురి 4.

అధ్యాసనము. సం. వి. అ. న. ఆక్రమణము.

అధ్యాహారము. సం. వి. అ. పుం. 1. వాక్యపూరణమునకయి లేనిపదములు కొన్నిటిని తెచ్చుకొనుట: చూ, అందేపదము; 2. అపూర్వార్థకమును త్ప్రేక్షించుట. చూ, తర్కము 2.

ధ్యూఢ. సం. వి. అ. స్త్రీ. మొదటి పెండ్లాము, అధివిన్న: చూ, కృతసాపత్నిక (చూ, భార్య.)

ధ్యూఢుఁడు. సం. వి. అ. పుం. ముక్కంటి: చూ, శివుఁడు. [చూ, పాతకుఁడు,

ధ్యేత. సం. వి. ఋ. పుం. చదువువాఁడు:

ధ్యేషణ. సం. వి. అ. స్త్రీ. పూజ్యులను సత్కారపూర్వకముగ నొకకార్యమున నియోగించుట, అడిగికొనుట (అనికొందఱు.): చూ, వని. 1.

ధ్రువము సం. విణ. నశించునది, అనిత్యమైనది: చూ, పరిమృతము.

ధ్వగ. సం. వి. అ. స్త్రీ. 1. ఆకాశగంగ: చూ, నది; 2: చూ, లొట్టిపిట్ట

ధ్వగుఁడు. సం. వి. అ. పుం. 1: చూ, సూర్యుఁడు; 2. దారినడచువాఁడు: చూ, పాంథుఁడు; విణ. 3. దారినడచువాఁడు: చూ, పాంథుఁడు. [పాంథుఁడు.

అధ్వనీనుఁడు. సం. వి. అ. పుం. తెరువరి: చూ,

అధ్వన్యుఁడు. సం. వి. అ. పుం.—పై.—

అధ్వము. సం. వి. న్. పుం. 1. త్రోవ: చూ, మార్గము. 1; 2. నాలుగుమార్గములు కలియు దారి, చేదుకము, చతుష్పథము: చూ, మార్గము. 1; 3. కాలము: చూ, సమయము. 1; 4. నిదురలోనగు సమయములందు శత్రువుల పైఁబడుట; పా. 5. అధ్వకాలనిర్మాణంబుల "ంకి" యగు. అధ్వమనఁగా దూరము. ఒకస్థలమునకు మఱియొకస్థలమునకుఁగల దూరము చెప్పవలసి వచ్చినపుడును, ఒకకాలమునుండి మఱియొకకాలమునకుఁగల విశంబము చెప్పవలసి వచ్చినపుడును, "ఉండి" యగును. ఉ. ఆయూరినుండి యీయూరికి నొకయామడ. చైత్రమునుండి ఫాల్గునమువఱకు పండ్రెండు నెలలు. (ఈ. "ఉండి" విభక్త్యర్థము అవ్యయమని యుక్త్యర్థకము కావనియు నెఱుఁగునది.) ఆదిశబ్దార్థము, "ఉండి" యగు. ఉ. ఆదినుండి-మొదటినుండి-వెలినుండి-వెలుపలనుండి-పైనుండి-క్రిందనుండి - అంతనుండి - ఎందుండి - అందుండి ఇత్యాది. [యజ్ఞము.

అధ్వరము. సం. వి. అ. పుం. జన్నము: చూ,

అధ్వరుఁడు. సం. వి. అ. పుం అష్టవసువులలో నొకఁడు: చూ, వసువులు

అధ్వర్యుఁడు. సం. వి. అ. పుం. యజ్ఞమునందు యజుర్వేద తంత్రము నడుపువాఁడు : చూ, ఋత్విజుఁడు. 1.

అధ్వవిభాగము. పా. ఈఛందంబును విస్తరించుట కెన్నియంగుళముల స్థలము కావలెనని సరిచెప్పుట. ఛందస్సంఖ్యను దానంబుట్టిన వృత్తసంఖ్యతోఁగల్పి రెట్టించి యందొకటి తీసివేయగా నన్నియంగుళముల స్థలము: చూ, షట్ప్రత్యయములు.

అధ్వానము. సం. వి. అ. పుం. అమార్గము. చూ, దారిలేమి. (అధ్వాన్నముఅని యువాడుక.)

అధ్వానముచేయు. మి.స.క్రి. దారిలేకుండచేయు.

అధ్వాన్నము. సం. వి అ. పుం. దారిలోనిఅన్నము: చూ, సాదము.(1.)

అన. సం. అవ్య. 1. ఏమియులేమి, అభావార్థకము: చూ, శూన్యము. 1, దే. వి. (1) రూ-అప్ప-అన్న. చూ, జ్యేష్ఠుఁడు. 1; (2)ఏఱులోనగువానినీళ్లువెలికిఁబోకుండుటకు కట్టినకట్ట, అనకట్ట: చూ, సేతువు. 1; (3)చోఁగువట్టిమిక్కిలిశేతఁగొమ్మ. కళా. 6, అ 211: చూ, శేట; అవ్య. (4) ఇంకను. రూ-అనఁగ-అనఁగా-అనాఁగ-అనా: చూ, మఱి. 2.

అనంగమాత. సం. వి. ఋ. స్త్రీ: చూ, లక్ష్మి

అనంగము. సం. వి. అ. న. 1. ఆకాశము: చూ, వ్యోమము. 1; 2. గుండె: చూ, హృదయము

అనంగలతిక. షట. వి. ఆ. స్త్రీ. స్వర్గమందుం డువేశ్య: చూ, వేశ్య.

అనంగలీలము. అం. జన్యతాళముల లోనొకటి: చూ, జన్యతాళములు. [అసమ్మతి.

అనంగీకారము. సం. విశే. సమ్మతిలేనిది: చూ,

అనంగుఁడు. సం. వి. అ. పుం. 1 చూ, మన్మథుఁడు; విశే. 2. అంగములేనివాఁడు; అం. 3. మహారాజులు పదియాఱుగురిలోనొకఁడు. చూ, మహారాజులు. (చూ, రాజు. 1.)

అనంటి. దే. వి. రూ-అనఁటి. అరఁటి*: చూ, రంభ. 2.

అనంత. సం. వి. ఆ. స్త్రీ. 1. నేల: చూ, భూమి. 1; 2. గౌరి. చూ, పార్వతి. 1; 3. ఉసిరిక *: చూ, శ్రీఫలి. 1; 4 కరక * చూ, హరీతకి; 5 దూర్వ, గఱిక*: చూ, తృణము. 1; 6. తఱిగొఱ్ఱ *: చూ, వాలిని; 7. తిప్పతీఁగె*: చూ, సోమవల్లి; 8. తీఁటకసింద*: చూ, సముద్రాంత 1; 9, నీరుపిప్పలి *: చూ, శకులాదని. 2; 10. మూమెన* చూ, శారిబ; 11. దున్నునపుడు కఱ్ఱుచే నేర్పడిన రేఖ. చాలు: చూ, సీత. 2; 12. వాయవ్యమూల: చూ, దిక్కు. 1(చూ, హరిత్తు, చూ, దిక్కులు, దిశలు,); 13 పౌర్ణమి, శుక్లపక్షమునందు పదునేనవతిథి: చూ, పున్నమ; 14. బుద్ధుని భార్య: చూ, స్వాహా. 2.(చూ, భార్య)

అనంతము. సం. వి. అ. న. 1. ఆకసము: చూ, వ్యోమము. 1; విశే. 2. మేరలేనిది: చూ, అపారము; అం. 3. సంఖ్యాభేదములు ముప్పదియాఱింటిలో నొకటి: చూ, సంఖ్యాభేదములు.

అనంతరము. సం. క్రి. విశే, అ. న. 1. పిదప: చూ, పిమ్మట; విశే. 2. వెనుకటిది: చూ, వెనుక. 1.

అనంతవిజయము, సం. వి. అ. పుం. 1. ధర్మరాజుయొక్క శంఖము: చూ, శంఖు. 1; విశే. 2. ఎన్నికకుమీరిన జయముగలది.

అనంతశయనము. అం. 1 క్షేత్రము గిరువదినాలుగింటిలో నొకటి: చూ, క్షేత్రములు; వా. వి. 2. శైవులకటుక. [చూ, విష్ణువు.1.

అనంతశయనుఁడు. సం. వి. అ. పుం. వెన్నుఁడు:

అనంతసముద్భవ. సం. వి. అ. స్త్రీ. తెల్లగఱిక*: చూ, తృణము. 1.

అనంతుఁడు సం. వి. అ. పుం 1.—పై.—; 2. శేషుఁడు: చూ, సర్పము; 3 చూ, బలరాముఁడు; 4. బుద్ధభేదము: చూ, బుద్ధుఁడు. 1.

అనఁగ. దే. క్రి. ఇంకను: చూ, రూ. అన. (4)

అనఁగా. దే. క్రి.—పై.— [శగించే. 1.

అనఁగి పెనఁగు దే. అ. క్రి. కలయు: చూ, పే

అనఁగు. దే. అ. క్రి.—పై.—

అనఁటి. దే. వి: చూ, అనంటి. * [టాకు.

అనఁటియాకు. ద్వ. వి. కదళీపత్రము: చూ, అరఁ

అనకట్ట. దే. వి. రూ-ఆనకట్ట. ఏఱులోనగువాని నీళ్ళు వెలికిఁబోకక ట్టెడుకట్ట. చూ, సేతువు.1.

అనక్షరము. సం. విశే. 1. తిట్టు, ఉచ్చరింపఁగూడనిది: చూ, శాపము. 1; 2. పైఁగఁగాఁ జెప్పినది (మాట.) : చూ, శబ్దము. 2.

అనగ్నిక. సం. వి. ఆ. స్త్రీ. పత్తి*: చూ, పత్తి.

అనఘము. సం. విశే. 1. దోషములేనిది, పాపములేనిది: చూ, నిర్దోషము; 2. నిర్మలము, తేరినది: చూ, ప్రసన్నము. 2; 3: మనోజ్ఞము, ఇంపైనది: చూ, సౌందర్యము. (హృద్యము)

అనఘుఁడు. సం. వి. అ. పుం. 1: చూ, శివుఁడు; 2: చూ, పాపరహితుఁడు. [మలినము.3.

అనచ్ఛము. సం. విశే. కలఁకఁబాఱినది. చూ,

అనడుహి. సం. వి. ఈ. స్త్రీ. ఆవు: చూ, గోవు.

అనడ్వాహము. సం. వి. హా. పుం. ఎద్దు: చూ, వృషభము. 1.

అనడ్వాహి. సం. వి. ఈ. (స్త్రీ): చూ, అనడుహి.

అనద. హై. విశ. 1.=అనాథ. నాథుఁడులేనిది: చూ, విధవ; 2. అల్పుఁడు: చూ, హీనుఁడు; 3. దిక్కులేనిది (స్త్రీ), విధవ: చూ, (స్త్రీ).

అనదితనము. హై. వి.=అనాథత్వమ్. దిక్కులేమి: చూ, అనాథత్వము.

అనదగనము. అం. చుంబనములు పసుపైదింటి లోనొకటి: చూ, చుంబనములు.

అనధిష్ణుఁడు. సం. విశ. సేగ్వరి: చూ, సమర్థుఁడు.

అనధ్యయనము. సం. వి. అ పుం. విద్యార్థులు చేయఁగూడని కాలము; (వేదము వల్లెవేయు వారు పర్వదినములయందును, ఇంగ్లీషు చదువువారు శనివార ఆదివారముల యందును విశ్రాంతితీసికొనుకాలము.) (మేషకర్కాటకతులా మకరసంక్రాంతులయందును, నీరానుల యందొకటిన్నర దివసమును, 1-8-14-15-30- ఈతిథులును, క్షయకాలము నందు దక్షముల 1-8 తిథులు అయిదు ఘడియలుండినను, వృద్ధియందు 3 ఘడియలును, వృద్ధిక్షయములు లేకయుండఁగా4 ఘడియలును, సాయంకాలమందు 7-13 తిథులలో క్షయవృద్ధి సామ్యముల యందుఁగ్రమముగా 6-8-4 ఘడియలు 8-14 తిథులుకలిసియున్న తిథలును అనధ్యయనములు.): అనధ్యాయము.

అనధ్యాయము. సం. వి. అ. పుం.—పై.—

అనన్యజుఁడు. సం. వి. అ. పుం: చూ, మన్మథుఁడు.

అనన్యము. సం. విశ. అదే: చూ, ఏ.

అనన్యవృత్తి. సం. విశ. ఇ. 1. ఒకవిషయము నందే మనస్సునిలిపినవాఁడు: చూ, ఐకాగ్రుఁడు; 2. ఏకాగ్రచిత్తము.

అనన్యసామాన్యము. సం.విశ.మఱియొకదానితో సమానము కానిది: అనన్యాదృశము, అనన్యాదృశ్యము.

అనన్యాదృశము. సం. విశ.—పై.—

అనన్యాదృశ్యము. సం. విశ: చూ, అనన్యసామాన్యము.

అనన్వయము. అం. 1. ఒకఅర్థాలంకారము. ఉపమానము లేకయుండుట. "గగనము గగనమువంటిది, సముద్రము సముద్రతుల్యము." "దాతృత్వంబునఁగర్ణుఁడెబోలువాఁడుకర్ణుఁడె" "అతనికితండెసాటి చతురబ్ధిపరీత, మహీతలంబునన్." విజయ: చూ, అలంకారము. 3;- సం. విశ. 2 అన్వయములేనిది.

అనపరాధి. సం. విశ. (న్. ఈ. న్.) అపరాధి కానివాఁడు: చూ, నిరపరాధి.

అనపరార్ధ్యుఁడు. సం. వి.అ. పుం. అనపరార్ధ్యుఁడు, అత్యుత్తమమైన వానిగా పరిగణింపఁబడినవాఁడు: చూ, శ్రేష్ఠుఁడు. 2.

అనపాయము. సం. విశ. రూ-అనపాయి. అపాయములేనిది.

అనపాయి. సం. విశ.—పై.—

అనయము. సం. వి. అ. పుం 1. కీడు: చూ, హాని. 2; 2. ఆపద: చూ, విపత్తు; 3. దురదృష్టము: చూ, అదృష్టము. 1; 4. ద్యూతాదివ్యసనము; 5. తప్పు: చూ, నేరము; దే. దశ్రి. (1) అత్యంతము, కడు. భార. విరా. 2, అ. 22: చూ, మిక్కిలి; (2) అవశ్యము. భో. 2, అ. 28: చూ, అవశ్యకము; (3)ఎల్లప్పుడు. కళా. 3, అ. 46: చూ, సతతము.2.

అనరానిమాటలు. వా. వి. బ. తిట్లు.

అనరు. దే. వి. 1. సంకటము, ఇక్కట్టు: చూ, శోకము; 2. బ. జీవస్థానము, కీలకము: చూ, మర్మము. 1.

అనర్గళము. సం. విశ. అడ్డంకిలేనిది: చూ, నిరర్గళము. [చూ, నిరర్గళుఁడు.

అనర్గళుఁడు. సం. విశ. అడ్డంకి లేనివాఁడు:

అనర్ఘము. సం. విశ. వెలలేనిది: చూ, గణ్యాటు.

అనర్ఘ్యము. సం. విశ. అర్ఘ్యముకానిది; (అర్ఘ్యము=వెలపెట్టఁదగినది; పూజకు[illegible].)

అనర్థకమగు. వి. అ. క్రి. లోపడు: చూ, లోపించు. 2.

అనర్థకము. సం. విశే. 1. పరస్పరాన్వయము లేనిది, సాముదాయార్థము తెలియమాట. (దశదాడిమములు షడపూపములు లోనగునది.) అసత్యపు పలుకు: చూ, వితథము.

అనర్థము. సం. వి. అ. పుం. 1. కీడు: చూ, హాని. 2; విశే. 3. అర్థములేనిది: చూ, అపార్థ్యము.

అనర్హము. సం. విశే: చూ, అపాత్రము.

అనర్హుఁడు. సం. విశే: చూ, అపాత్రుఁడు.

అనలప్రియ. సం. వి. ఆ. స్త్రీ: చూ, మానేరు.*

అనలము. సం. వి. అ. పుం. 1. అగ్ని: చూ, వహ్ని. 1; 2. జాగరకోశములోని జాఠరికరస సంబంధమగు వహ్ని, జఠరాగ్ని: చూ, వహ్ని. 1; అం. 3. అగ్ని భేదములు నాలుగింటిలో నొకటి: చూ, అగ్నులు. 3.(చూ, వహ్ని. 1); 4. అగర్వణవేదము నందలి ఆగమము లిరువదెనిమిదింటిలో నొకటి: చూ, ఆగమములు.

అనలుఁడు. సం. వి. అ. పుం. 1. అగ్ని: చూ, వహ్ని. 1; 2. విభీషణుని మంత్రి: చూ, మంత్రి. 1; 3. అష్టవసువులలో నొకఁడు: చూ, వసువులు.

అనవటిల్లు. దే. అ. క్రి: చూ, ఉమ్మగిల్లు.

అనవద్యము. సం. విశే: చూ, శ్రేష్ఠము.

అనవధానత. సం. వి. ఆ. స్త్రీ: చూ, ప్రమాదము.

అనవధి. సం. విశే. ఇ: చూ, అపారము.

అనవరతము. సం. క్రి. విశే, అ. న. 1. ఎల్లప్పుడు: చూ, సతతము. 2; విశే. 2. ఎడతెగనిది: చూ, సాంద్రము. 2.

అనవరతుఁడు. సం. విశే. మిక్కుటముగలవాఁడు: చూ, అత్యంతవంతుఁడు.

అనవరార్థ్యము. సం. విశే. ముఖ్యమైనది: చూ, శ్రేష్ఠము.

అనవరార్థ్యుఁడు. సం. వి. అ. పుం: చూ, రూ- అనవరార్థ్యుఁడు. [చూ, అసమయము.

అనవసరము. సం. విశే. సమయము తప్పినది:

అనవస్కరము. సం. విశే. కడుగుట లోనగువానిచేత గాగరికైనది: చూ, శోధితము.

అనశనము. సం. వి. అ. పుం, న: చూ, పస్తు.

అనశ్వరము. సం. విశే. నిత్యమైనది. చూ, శాశ్వతము.

అనసూయ. సం. వి. ఆ. స్త్రీ. 1. అత్రిమహర్షి భార్య: చూ, భార్య; అం. 2. సాత్త్వికగుణము లెనిమిదింటిలో నొకటి: చూ, సాత్త్వికగుణములు

అనస్సు. సం. వి. స్. న. బండి: చూ, శకటము.1.

అనా. సం. అవ్య. 1. లేదనుట, కాదనుట: చూ, శూన్యము. 1; దే. ద్రి. (1): చూ, రూ- అన. (4)

అనాంధ్రగ్రంథయుక్తములు. పా. గాపు, పరి, సీవి, రెవ, ఛాక, మస్తోం ఇత్యాదులు.

అనాఁగ. దే. ద్రి: చూ, రూ-అన. (4)

అనాకారి. సం. క్రి. విశే: చూ, కురూపి.

అనాగతము. సం. వి. అ. పుం. 1 భవిష్యత్కాలము, రాగలకాలము: చూ, భవిష్యత్తు; అం. 2. తారగ్రహములు నాలుగింటిలో నొకటి: చూ, తారగ్రహములు; విశే. 3. రాఁబోవునది: చూ, భవిష్యత్తు.

అనాగతార్తవ. సం. వి. ఆ. స్త్రీ. నగ్నిక, పెండ్లిలేని పదియేండ్లపడుచు, సమర్తాడనిపడుచు: చూ, స్త్రీ. [పుష్పం.

అనాఘ్రాతపుష్పము. పా. వాసనచూడఁబడని

అనాచారము. సం. వి. అ. పుం. 1. ఆచారము లేమి: చూ, దురాచారము; 2. మాలిన్యము:

చూ, మలినము; విణ. 3. ఆచారములేనిది: చూ, దురాచారము; అం. 4. అజ్ఞానదాయకములలో మిక్కిదింటిలో నొకటి: చూ, అజ్ఞానదాయకములు.

అనాతకి. సం. వి. స్. పుం. రూ-అనాధకి. సన్న్యాసి: చూ, ముని. 1.

అనాతురము సం. విణ. ఉత్సాహములేనిది: చూ, నిరుత్సాహము.

అనాగిరణము. సం. వి. అ. న. అపావరణ చేయఁబడ్డది: చూ, ఉపావృతము.

అనాదరము. సం. వి. అ. పుం. ఆదరణలేమి చూ, పరిహేలనము.

అనాదరించే మి. స. క్రి: చూ, తిరస్కరించే

అనాది సం. విణ. ఇ. 1. ఆది తెలియనిది.(ఆది_మొదలు.); వై. వి. (1) చింతలేనిది: చూ, అనాధిని.

అనాదిజటిలుఁడు. సం.వి. అ.పుం: చూ, శివుఁడు

అనాదీయము. సం. విణ. మిక్కిలిపురాతనమయినది.

అనాద్యవర్ణములు. పా. సంస్కృత భాషలో లేనివి. ఎ...ఎ ఒ ఁ చే జే ఱ.

అనాధ. సం. విణ. 1.=అనద. నాథుఁడులేనిది: చూ, విధవ: చూ, స్త్రీ; 2 =అనద. దిక్కులేనిది;(స్త్రీ): చూ, విధవ: చూ, స్త్రీ.

అనాధకి: చూ, రూ-అనాతకి.

అనాధత్వము. సం. విణ_అనదతనము: చూ, అనదతనము.

అనాధిని. సం. వి.ఇ.స్త్రీ.=అనాది. చింతలేనిది: [చూ, అనాది. (1)

అనామకుఁడు. సం. వి. అ. పుం: చూ, పేరులేనివాఁడు.

అనామతరువు. జా. 1. పేరులేనిచెట్టు; 2. నామకర్త్వములేనిది, నామకర్త్వము లేనివాఁడు. (స్త్రీ పురుషాదులు.)

అనామతు. వా. వి. 1. నమ్మకముమీఁద, అల్పకాలమొక వస్తువునిచ్చుట; 2. ఒకవస్తువును వాడుకొనక యూరకుండుట.

అనామతుబుక్కు. వా. వి. చిరాను జమకట్టక జ్ఞాపకముకొఱకు వేఱుగా వ్రాసికొనిన పద్దుల చిన్నపొత్తము.

అనామధేయుఁడు. సం. విణ: చూ, పేరులేని [వాఁడు.

అనామయము. సం. వి. అ. న. 1. ఆరోగ్యము: చూ, కల్యత్వము; పుం. 2. చందనపుచెక్క: చూ, అగరుచెక్క.

అనామిక. సం. వి. అ. స్త్రీ. బొటనవ్రేలు మొదలు నాల్గవదగు పవిత్రపువ్రేలు, ఉంగరపువ్రేలు: చూ, వేలు. 1.

అనామికాదిరేఖ. సం. వి. అ. స్త్రీ. చేదువును దెలిపెడి రేఖ: చూ, హస్తరేఖలు.

అనాయకము. సం. విణ. రాజులేనిది: చూ, అరాజకము.

అనాయత్తము. దే. విణ: చూ, స్వతంత్రము.

అనాయాసకృతము. సం. వి. అ. పుం. ఆయాసములేక చేయఁబడిన కషాయాదులు: చూ, ఫాంటము.

అనాయాసమరణము. పా. ఆయాసములేనిచావు: చూ, మరణము.

అనాయాసము. సం. వి. అ. పుం. 1. ఆయాసములేమి; విణ. 2. ఆయాసములేనిది.

అనారతము. సం. క్రి. విణ: చూ, అనవరతము.

అనార్యతిక్తము. సం. వి. అ.పుం. నేలవేము*: చూ, భూనింబము.

అనావృష్టి. సం. వి. ఇ. స్త్రీ. 1. దేశమునకు హానికలుగునట్లు బొత్తిగా వాన లేకపోవుట: చూ, ఎఱువు; అం. 2. ఈతిబాధలాఱింటిలో నొకటి: చూ, ఈతిబాధలు.

అనాస. దే. వి. గోపిత *; చూ, [illegible]

అనాసపండు. దే. వి. మొగలిపనసపండు, పుష్పలపండు, (పుష్పసమూహపరిణామఫలము.)(చూ, గుంజకాయలు )

అనాసపనస. దే. వి: చూ, అనాస౯.

అనాసిక. సం. వి. అ. స్త్రీ.—పై.—

అనాసికము. సం. విణ. ముక్కునఁబలుకఁబడనిది.

అనాసికుఁడు. సం. విణ. ముక్కులేనివాఁడు: చూ, ముక్కిడి.

అనాహతము. సం. విణ. 1. చలువచేయనిది (వస్త్రము.): చూ, వస్త్రము; అం. 2. వెన్నెముకలయందుగల షట్చక్రములలో నొకటి: చూ, షట్చక్రములు; 3. నాదములు రెండింటిలో నొకటి: చూ, నాదములు.

అనాహలము. సం. వి. అ పుం. మాలకాని యొకానొక నీచజాతి.

అని. దే. వి. 1. కయ్యము చూ, యుద్ధము; 2. అల్లిక మొదలు: చూ, రూ-అన్ని. 2; స. ఏ. 3: చూ, రూ-అన్ని. 1; అవ్య. 4. సవి, ఈప్రకారము అనునర్థమును తెలుపును చూ, సావి. 2; 5. ప్రకారమును తెలుపును చూ, విధము 1; 6. తలఁచుటను తెలుపును: చూ, స్మృతి 1; 7. కారణమును తెలుపును: చూ, హేతువు. 1; 8. ప్రసిద్ధిని తెలుపును: చూ, ప్రసిద్ధి. 1.

అనికి. దే. వి. 1. నడల్పునోరుగలకుండ: చూ, పాత్రము. 6; 2. నేలల, అల్లిక: చూ, వ్యాప్తి. [రసాలము. 3

అనిక్షువు. సం. వి. ఉ, పుం. నల్లచెఱకు*: చూ,

అనిత్యము. సం. విణ. నిత్యముకానిది.(నిత్యము=శాశ్వతము.): చూ, క్షణభంగురము.

అనిదంపూర్వము. సం. విణ. అబ్బురము చూ, క్రొత్త. 2.

అనిన. దే. క్రి. చెప్పిన, చెప్పినయెడల: చూ, రూ-అన్న. 2.

అనిపించు. దే. అ. క్రి. 1. కనఁబడు: చూ, ప్రత్యక్షమగు; స. క్రి. 2. కపటముగాఁబ్రవర్తించు చూ, నటించు. 3. (మాటను) చెప్పించు; 4. (బలవంతముగా) పలికించు; 5. తానుచ్చరించుమాటకు మాట సహాయముగా సంగీతాది స్వరములయందు సహాయముగా అనునటులచేయు.

అనిబద్ధవంతము. సం. విణ. నోటితోపాడెడు సంగీతము. చూ, స్వరము. 2.

అనిమిషత్వము. సం. వి. అ. న. ఈశ్వరత్వము: చూ, దైవత్వము. [మత్స్యము. 1.

అనిమిషము. సం. వి. అ. పుం. చేఁప: చూ,

అనిమిషుఁడు. సం. వి. అ. పుం. రూ-అనిమేషుఁడు: చూ, వేలుపు. [మిషము.

అనిమేషము. సం. వి. అ. పుం: చూ, రూ-అని

అనిమేషుఁడు. సం. వి. అ. పుం: చూ, రూ-అనిమిషుఁడు. [ర్గళము.

అనిరుద్ధము. సం. విణ. అడ్డంకిలేనిది: చూ, నిర

అనిరుద్ధుఁడు. సం. వి. అ. పుం. 1. మన్మథుని కొడుకు. చూ, విశ్వకేతువు; విణ. 2 అడ్డగింపఁబడనివాఁడు, బంధరహితమైనవాఁడు.

అనిర్ణయచాంద్రాయణము. పా. ఒకానొకచాంద్రాయణవ్రతము. (చూ, కృచ్ఛ్రము.)

అనిర్దిష్టము. సం. విణ. నిర్దిష్టములేనిది: చూ, అనిశ్చయము.

అనిర్దిష్టములు. పా. ఇవిప్రశ్నార్థకములు, సంబంధములు, తదితరములు అని మూఁడువిధములు.

అనిర్వచనీయము. సం. విణ. చెప్పనలవిఁగానిది.

అనిలజుఁడు. సం. వి. అ. పుం. 1. ఎఱ్ఱమూతికోఁతి: చూ, వానరము; 2. తోఁడేటికడుపువాఁడు, భీమసేనుఁడు: చూ, వృకోదరుఁడు. 3. ఆంజనేయుఁడు: చూ, వానరము.

అనిలము. అం. నలుబదితొమ్మిది వాయువులలో నొకటి: చూ, వాయువు.

అనిలి. సం. వి. ఇ. పుం. ఆంజనేయుఁడు: చూ, వానరము.

అనిలుఁడు. అం. నలుబదితొమ్మిది వాయువుల లోనొకటి: చూ, వాయువు; 2. అష్టవసువు లలో నొకఁడు: చూ, వసువులు.

అనివారణము. సం. విశే: చూ, అనిరుద్ధము.

అనివారణుఁడు. సం. విశే: చూ, నిరర్గళుఁడు.

అనివార్యము. సం. విశే. నివార్యముకానిది. (నివార్యము=నివారింపఁదగినది.)

అనిశము. సం. క్రి. విశే, అ. న. 1 ఎల్లప్పుడు: చూ, సతతము. 2; 2. కడు: చూ, మిక్కిలి.

అనిశ్చయము. సం. విశే. నిశ్చయములేనిది: అనిర్దిష్టము, అనిశ్చితము.

అనిశ్చితము. సం. విశే.—పై—

అనిష్టము. సం. వి. అ. న. 1. ఇష్టములేమి: చూ, రోఁత. 2; విశే, 2. ఇష్టములేనిది: చూ, అప్రీతి. 2.

అనీకము. సం. వి. అ. పుం, న. 1. కయ్యము: చూ, యుద్ధము; 2. దండు: చూ, సేన. 1.

అనీకస్థము. సం. వి. అ. పుం. 1. గుఱుతు చూ, లక్షణము. 1; 2. శతృవీరుల పేళ్లును దుపుఁ జెక్కి కూరులుబిరుదుగా కాలి పెద్దవ్రే లిని ధరించెడు ముద్రిక: చూ, భూషణము. 2; 3. స్త్రీలు కాలి పెద్దవ్రేలిని ధరించెడు ముద్రికావిశేషము: చూ, భూషణము. 2; 4. రాజ్యాంగములను గాపాడువారి సమూహము: చూ, సమూహము;5: చూ, శైలి*; 6. యుద్ధభూమి: చూ, భూమి. 1

అనీకస్థుఁడు. సం. వి. అ. పుం. 1. యుద్ధమునందు నిలిచినవాఁడు; 2. ఏనుఁగులను శిక్షించుటయందు నేర్పరియైనవాఁడు; 3. రాజున కంగరక్షణముచేయువాఁడు.

అనీకిని. సం. వి. ఈ. స్త్రీ. 1. దండు: చూ, సేన. 1; 2. సేనావిశేషము. అక్షౌహిణిలో పదియవభాగము. రెండువేల నూటయేబదియొక్క రథములు, అన్నియేనుఁగులు, ఆఱువేల నేనూట యేబదియొకటి గుఱ్ఱములు, పది వేలందొమ్మన్నూట ముప్పది యేడవ్వ కాల్బ రును గలది: చూ, సేన. 1.

అను. సం. అవ్య. 1. పశ్చాదర్థకము, వెంట: చూ, వెంబడి; 2. సాదృశము, పోలిక: చూ, సమానము. 2; 3. అసదు: చూ, హీనము 1; 4. నిడివి: చూ, దైర్ఘ్యము; 5. అనుపూర్వ్యము, ఒకటివెంబడి నొకటి: చూ, విధము. 1; 6. సహితమనునర్థమును తెలుపును, కూడ చూ, సహితము; 7. గుఱుతు: చూ, లక్షణము. 1; 8. హేతువును తెలుపును: చూ, హేతువు. 1; 9. ఇటువంటివాఁడు అనిచెప్పుట; 10. కంపకము, వంతు: చూ, భాగము. 1; 11. ఒకటివెనుక నొకటి వ్యాపింపనిచ్చు: చూ, వీప్స; 12. దగ్గఱ: చూ, సమీపము. 1; ఉపసర్గలమీఁది యర్థములు;— 13. దయ; 14. అవబోధము; 15 అన్వయము; 16. అనుమతము; 17. నియోగము; 18. సాంత్వనము; 19. సేవ; 20. ఆసక్తి; 21. ఆనుపూర్వి; 22. ఎల్లప్పుడు; 23. ఇచ్ఛ; 24. మేలు; 25. ఉత్సాహము; 26. పశ్చాత్తాపము; 27. వాసనకలుగఁజేయుట; 28. అలంకరించుట; 29. అడుగుట; 30. ఆచారము; 31. ఆలోచించుట; 32. అనుకూలము; 33. వెదకుట; 34. వరుస; 35. యాచించుట; 36. మంగళము; 37. ఆదరణ;ఉప. 38. 'అను' అను ఉపసర్గలతోఁజేరినశబ్దములు — అనుకంప, అనుకూలము, అనుక్షణము, అనుగమనము, అనుగ్రహము; దే. స. క్రి. (1) భాషించు, మాటాడు. "ఇట్లనియె: చూ, వచించు. (2) అనిచెప్పు. "ఇంద్రాదులకుఁబ్రియంబుసేయు మనిన."; (3) అనియడుఁగు. "ఏను మీకిష్టంబుగాదూశ్వ... యేమిసేయుదుననిన." భార. అర. 2. ఆ.

అనుగమము. సం.వి. అ. న. 1. చూ, అనుగతి; 2. ఒకలక్షణము వెక్కింటికి సరిపోకపుట

అనుగమించే సం. స. క్రి. చూ, వెంబడించే

అనుగము. సం. విణ వెంబడించేది: చూ, అనుపదము. [సరసోక్తు. 1.

అనుగలమగు. మి. అ క్రి. జోడుపడు చూ,

అనుగలము. వై. విణ 1. సహాయము. చూ, వెంబడి, 2. అనుకూలము. మైత్రి: చూ, స్నేహము 1; 3 పోలిక: చూ, సమానము 2.

అనుగవంతి. సం. వి ఈ. స్త్రీ. అంచే, బట్ట మొదటిబద్దె. చూ, బద్దె. 1.

అనుగవీనుడు. సం. వి. అ. పుం. గొల్లవాడు: చూ, మహాశూద్రుడు [యుడు. 1.

అనుగుడు సం. విణ. తోడివాడు: చూ, సహా

అనుగుణము. అం. 1. ఒకయర్థాలంకారము, తన రూపగుణము లన్యసన్నిధచే హెచ్చేగుట. "నల్లగలువలు నీకటాక్షములచే నధిక నీలము లయ్యె" చూ, అలంకారము 3, (చూ, హేతువు. 2.); సం. విణ. 2. తగినది చూ, యోగ్యము. 2.

అనుగుణ్యము. సం. విణ. 1. చూ, యోగ్యము. 2, 2. ఒకానొకవల. చూ, వల. 1.

అనుగ్రహము. సం. వి. అ. పుం. 1. ఏలుకొనుట: చూ, పాలనము. 2; ఉప. 2. (ఇచటధాత్వర్థమును "ఏలుకొను" అనునర్థముగా మార్చినది.)

అనుగ్రహించే. సం. స. క్రి. ప్రియముతో పుచ్చుకొను, ఏలుకొను చూ, పుచ్చుకొను.

అనుచరుడు. సం. విణ. తోడివాడు: చూ, సహాయుడు. 1.

అనుచితము. సం విణ. ఉచితముకానిది. (ఉచితము=తగినది.): చూ, కిల. 8.

అనుచే. దే. స. క్రి. 1. రూ- అన్పు. అడుగు చేయు, పుచ్చే: చూ, పంపు. 11; 2. ఆజ్ఞాపించే: చూ, సెలవిచ్చే.

అనుజ. సం. వి. అ. స్త్రీ: చూ, చెల్లెలు.

అనుజీవకుడు. సం. వి. అ. పుం. 1 చూ, సేవకుడు; 2 కార్యాలోచన యోగ్యుడగు ప్రధానమంత్రి: చూ, మంత్రి 1.

అనుజీవి. సం. వి. ఇ. పుం చూ, సేవకుడు.

అనుజుడు. సం. వి. అ. పుం చూ, తమ్ముడు.

అనుజ్ఞ. సం.వి ఆ స్త్రీ. 1. ఆజ్ఞ: చూ, సెలవు; అం. 2. ఒకయర్థాలంకారము, దోషమందు గుణము కన్పట్టి యాదోషమునె కోరుట "ఆపదలందె హరిః స్మరింపబడుగాన నయ్యాపదలె కావలెనని కోరుట": చూ, అలంకారము. 3.

అనుజ్ఞాతుడు. సం. విణ. ఆజ్ఞాపింపబడిన వాడు: చూ, ఆజ్ఞాతుడు.

అనుజ్ఞానము. సం. వి. అ. న. ఆజ్ఞ: చూ, సెలవు.

అనుట. దే. వి. చెప్పట. చూ, ప్రస్తావము 2.

అనుతర్షణము. సం. వి. అ. పుం. 1 కల్లుత్రాగెడు గిన్నె: చూ, పాత్రము. 6; 2 కల్లు వడ్డించేట: చూ, సరకము. 5; 3. కల్లుత్రాగుట: చూ, సరకము. 2; 4. కల్లుమీదియాశ: చూ, సరకము. 4. [5. చూ, వాంఛ.

అనుతర్షము. సం. వి. అ. పుం. —వై.—;

అనుతర్షించే. సం. స. క్రి: చూ, త్రాగు.

అనుతాపపడు. మి. అ. క్రి: చూ, పశ్చాత్తాపపడు.

అనుతాపము. సం. వి. అ. పుం. 1: చూ, పశ్చాత్తాపము; 2. ఒకానొక జ్వరము: చూ, రోగము 1. [శ్రేష్ఠము

అనుత్తమము. సం. విణ. ముఖ్యము: చూ,

అనుత్తముడు. సం. విణ: చూ, శ్రేష్ఠుడు. 2.

అనుత్తరము. సం. విణ. 1. ఉత్తరదిశకానిది.

డుట, వేటకాని గాఁగుడుపల్లము: చూ, మాటు. 3; స. క్రి 4. ఆజ్ఞాపించు: చూ, సెలవిచ్చు, 5. అడుగఁజేయు, ప్రచ్చు చూ, పంపు 11.

అనుప్రాసము. అం శబ్దసామ్యముగలిగి యుండునట్లు రచనయొక్క శబ్దాలంకారము అప్ప 3, 391-392: చూ, అలంకారము 3 (చూ, హేతువు, 2)

అనుప్లవుఁడు సం. వి. తోడివాఁడు చూ, సహాయుఁడు. 1

అనుబంధి. సం వి ఇ. స్త్రీ. 1. ఎక్కిలి చూ, హిక్క. 1; 2. చూ, దాహము.

అనుబంధము. సం. వి. అ. పుం. 1. జరుగుచున్నదాని ననుసరించుట. చూ, వెంబడి; 2. కట్టు: చూ, బంధము. 1; 3. తప్పుబయలుపఱచుట, 4 (వ్యాకరణమున) ప్రకృతిప్రత్యయాదులచేఁ జేఱెడి యక్షరము: చూ, వర్ణము 1; విశే 5. చేర్పఁబడినది; చూ, ఉపాంగము, 6 చూ, స్వల్పము.

అనుబంధములు. అం. అధికారము, సంబంధము, విషయము, ప్రయోజనము. (4)

అనుబంధించు సం. స. క్రి. తోడరు: చూ, వెంబడించు.

అనుబంధుఁడు. సం. వి. అ. పుం. తల్లిదండ్రులుగోనగు పెద్దలననుసరించి నడుచు కొడుకులోనగువారు: చూ, పుత్రుఁడు. 1.

అనుబోధము. సం. వి. అ పుం అత్తరు: చూ, పరిబోధనము.

అనుభయతామాత్రవ్యరూపకము. అం కావ్యాలంకార విశేషము. చూ, అలంకారము. 3. (చూ, హేతువు. 2.)

అనుభయోక్తిరూపకము అం.—పై.—

అనుభవము. సం. వి. అ పుం. 1. కుడుపు: చూ, భుక్తి. 2; 2. ఎఱుక: చూ, బుద్ధి.

అనుభవశాలి. సం. విశే.(న్. ఈ న్.) అనుభవముకలవాఁడు: అను వి.

అనుభవి —పై.— [భుజించు. 2.

అనుభవించు. సం. స. క్రి. పుచ్చుకొను: చూ,

అనుభావము. సం వి. అ పుం. 1 భావమును దెలిపెడి ముఖవిలాసాదులు. కారణమైన విభావములచేఁగలుగు రసములవలనఁబుట్టిన కటాక్షాది వికారములు చూ, వ్యంజకము. 1. (ఇవిఅయిదు. అభినయము, ఆకృతి, చేష్ట, భావబోధకము, సంజ్ఞ.); అం. 2 భావములైదింటిలోనొకటి: చూ, భావములు: పుం. 3. బలిమి: చూ, శక్తి 1; 4. నిశ్చయము. చూ, సత్యము. [చూ, ఉపభోగ్యము.

అనుభావ్యము. సం. విశే. అనుభవింపఁదగినది:

అనుభుక్తము. సం. విశే అనుభవింపఁబడినది: చూ, భుక్తము. [భుక్తి. 2.

అనుభుక్తి. సం. వి. ఇ. స్త్రీ. కుడుపు: చూ,

అనుభూతము. సం. విశే చూ, అనుభుక్తము.

అనుభూతి. సం. వి. ఇ. స్త్రీ: చూ, అనుభుక్తి

అనుభోగము. సం. వి. అ. పుం.—పై —

అనుమఁడు. వై. వి.—హనుమాన్: చూ, వానరము అచ్చ. యు, కాం. 407.

అనుమంతిగాఁడు వై. వి.—హనుమాన్. హనుమత్. హనుమంతుని సామర్థ్యమువంటిసామర్థ్యముకలుగుట చేతకుక్కకియ్యఁబడినపేరు. స్వా. 4, ఆ. 32: చూ, సివఁగి. 2.

అనుమత. సం. వి. ఆ. స్త్రీ. మొదవగడ్డి*: చూ, తృణము. 1.

అనుమతము. సం. వి. అ. న. 1. అంగీకారము: చూ, సమ్మతి. 1; విశే. 2. అంగీకరింపఁబడినది: చూ, సమ్మతి. 1.

అనుమతి. సం. వి. ఇ. స్త్రీ. 1. అంగీకారము: చూ, సమ్మతి. 1; 2. ఒకకళతక్కువైన చంద్రుఁడుగల పున్నమ: చూ, పున్నమ.

అనులోమము. పా. 1. ఆరోహణక్రమముగలది. అప్ప. 4, ఆ. 364; 2. ఒకానొకశబ్దాలంకారము. చూ, శబ్దాలంకారములు.

అనుపక్త్రికము. అం. చుంబనవిశేషములలోనొకటి: చూ, చుంబనములు. [మరలఁ జెప్పు.

అనుపదించు. సం. స. క్రి. ఒకరు చెప్పినదానిని

అనుప్రయోగించు. సం. స. క్రి. గుర్తులలోనగువాని (సేయు) చూ, సేయు. 1

అనువరి. దే. విశే. (అనువు + అరి) ఉపాయశాలి. ఉ, హరి. 5. ఆ. 105. చూ, సమర్థుఁడు.

అనువర్ణములు. అం. 1. గంగాజలవర్ణి, మేఘవర్ణి, కపిలవర్ణి, శుకవర్ణి, నీలోత్పలవర్ణి, కుముదవర్ణి, నీలవర్ణి, మనుపుష్పవర్ణి, సితాసితవర్ణి, అంజనవర్ణి, రక్తపాటలము, సింధువారకము, (12.) (అశ్వశాస్త్రములోనివి.); 2 వర్ణములుమూఁడింటిలోనొకటి: చూ, వర్ణములు.

అనువర్తనము. సం. వి. అ. న. చూ, అనురోధము.

అనువర్తించు. సం. స. క్రి. చూ, అనుబంధించు

అనువాకము. సం. వి. అ. పుం. అర్ణము: చూ, వేదము. [దానిని మరలఁ జెప్పుట.

అనువాదము. సం. వి. అ. పుం. ఒకరు చెప్పిన

అనువాది. సం. వి. న్. పుం. పాటకాఁడు: చూ, నీకారి.

అనువిద్ధము. సం. విశే. కూడినది. చూ, సంయుక్తము. [చూ, నఖక్షతములు

అనువినుత. అం. నఖక్షతములాఱింటిలోనొకటి.

అనువు. దే. వి. 1. చేందము. ఉ, హరి. 5. ఆ. 304: చూ, విధము. 1; 2 ఎత్తుగడ: చూ, వెరవు; 3. అవకాశము. కళా. 3, ఆ. 120: చూ, తెఱపి. 1; విశే. 4. యుక్తము: చూ, యోగ్యము. 2. [సమకట్టు. 3

అనువుచేయు. ద్వి. స. క్రి. సిద్ధపఱచు: చూ,

అనువుపడు. ద్వి. అ. క్రి. యుక్తమగు: చూ, సరిపడు. 2.

అనుసృత్తము. సం. విశే. ఒకవిధమయిన సహజదృష్టి గలది; అం. 2. దృష్టిక్రియలు పదునెనిమిదింటిలో నొకటి: చూ, దృష్టిక్రియలు; 3. దృష్టిభేదములు తొమ్మిదింటిలో నొకటి: చూ, దృష్టిభేదములు.

అనుప్రాసుఁడు. సం. విశే. ఒకరినప్రితము ననుసరించి చేయు రీతిముగలవాఁడు. చూ, వశ్యి. 2.

అనుశయము. సం. వి. అ. పుం. 1. జేసుగుపన్నదాని ననువర్తించుట, అనుబంధము. చూ, వెంబడి; 2. పగ. చూ, విరోధము. 1; 3 ఉలమట: చూ, పశ్చాత్తాపము.

అనుశాయి. సం. వి. న్. పుం. పుణ్యపాపరూప కర్మములకు ఫలభూతములైన స్వర్గనరకాదుల ననుభవించిన పిమ్మట శేషించిన పుణ్యపాపముల వాసనగలవాఁడు.

అనుశాసకుఁడు. సం. వి. అ. పుం. బోధించువాఁడు: చూ, బోధకుఁడు. 2.

అనుశాసనము. సం. వి. అ. న. ఆనతి. చూ, సెలవు.

అనుశాసనికపర్వము. అం. రూ-ఆనుశాసనికపర్వము. భారతపర్వములు పదునెనిమిదింటిలో నొకటి: చూ, పర్వములు (ఇది వాడుకలోనిది)

అనుశ్రుతి. సం. వి. ఇ. స్త్రీ. ప్రస్తావన విషయము ననుసరించిన యితర జనసంభాషణముల వినికి: చూ, వినికిడి.

అనుషంగము. సం. వి. అ. పుం. 1. కూడిక: చూ, సంయోగము; 2: చూ, వాంఛ.

అనుష్టుప్పు. సం. వి. బ్. స్త్రీ. 1. ఛందస్సులిరువదియాఱింటిలో నొకటి: చూ, ఛందస్సులు. (రూ- అనుష్టుప్పు = పాదమునకు ఎనిమిది అక్షరములుగల చిన్నశ్లోకము.); 2. పలువరాణి: చూ, సరస్వతి. 1.

రము. 3; 4. మన్నీరు: చూ, సముద్రము; విశే. 5: చూ, అనుపము. 2.

అనూరుఁడు. సం. వి. అ. పుం. ఒకానొకరాజు: చూ, రాజు 1.

అనూరాధ. సం. వి. ఆ. స్త్రీ: చూ, రూ_అను[రాధ.

అనూరుఁడు. సం. వి. అ. పుం. రూ_అనూరువు చూ, సూరసూతుఁడు.

అనూరువు.__పై.__

అనూర్జితము. సం. విశే. నిత్యముకానిది: చూ, [ఋణాధంగకము.

అనృజుఁడు. సం. విశే. ఉ. 1. కుటిలవ్యాదయుఁడు, దుష్టుఁడు: చూ, వ్యాధుఁడు. 2; 2. ఇంద్రజాలము మొదలగు గారడీవిద్యలు చేయువాఁడు: చూ, ప్రాతిహారికుఁడు. [అబుణి

అనృణి. సం. విశే. ఇ. అప్పులేనివాఁడు: చూ,

అనృతము. సం. వి. అ. న. 1. కృషి, దున్ని పైరు పెట్టుట: చూ, వ్యవసాయము 2; విశే. 2 అసత్యమయినది: చూ, వితథము.

అనేకకాకువివేకము. అం. సుగుణము లిరువదెనిమిదింటిలో నొకటి: చూ, సుగుణములు.

అనేకపము. సం. వి. అ. పుం.=ఏనుఁగు: చూ, హస్తి.

అనేకపముఖస్వామి. సం వి. న్. పుం. గణపతి, ఏనుఁగు మోముసామి. చూ, వినాయకుఁడు. 1.

అనేకపస్వరము. సం. వి. అ. పుం.=ఏనుఁగు సొరము, వీణయందును కంఠమునందునుబుట్టు స్వరవిశేషము: చూ, స్వరము. 2.

అనేకము. సం. న. అధికమయినది: చూ, హెచ్చు 1.

అనేకపద్భావి. పా. ద్విగుసమాసములలోనొకటి త్రిలోకములు_పంచభూతములు. (చూ, ఏకవద్భావిద్విగువు.) చూ, సమాసము. 1.

అనేడమూకుఁడు. సం. విశే 1. ఏడమూకుఁడు: చూ, చెవిటిమూఁగ; 2. అంధుఁడు: చూ, గ్రుడ్డి; 3. వివేకములేనివాఁడు, ఎఱుకలేనివాఁడు: చూ, వ్యాధుఁడు. 2; 4. పాలుపోనిపడుచు: చూ, శిశువు.

అనేడుఁడు. సం. విశే. వివేకములేనివాఁడు: చూ, వ్యాధుఁడు. 2.

అనేహస్సు. సం. వి. స్. పుం. 1. ఒంటికంటిగాము, శుక్రుఁడు: చూ, రాహువు. 2; 2. ఏకాక్షుఁడు. చూ, ఒంటికంటివాఁడు; 3. కాలము: చూ, సమయము. 1.

అనైకాంతికుఁడు. సం. వి. అ. పుం. నిశ్చయములేనివాఁడు.

అనో. సం అన్య. 1. మనసుయొక్క కాని మాటయొక్క కాని మాఱుపాటు: చూ, విస్మృతి; 2. స్త్రీ సంభోగకాలమందు స్త్రీ కంఠమునఁ బుట్టిన పావురపు కూఁతవంటి ధ్వని: చూ, స్వరము. 2; 3. ఆకృతి: చూ, రూపు. 3.

అనోకహము సం. వి. అ. పుం. చెట్టు: చూ, వృక్షము.

అనౌచిత్యము. సం. వి. అ. న. అయుక్తము: చూ, ఆగ్రహము. 3.

అన్న. దే. వి. 1. అగ్రజుఁడు. రూ_ అని: చూ, జ్యేష్ఠుఁడు 1; 2 తండ్రి: చూ, పితరుఁడు; ద్రి. 3. చెప్పినయెడల: చూ, రూ_ అనిన.

అన్నకోశము. అం. కోశములయిదింటిలో నొకటి, జఠరకోశము: చూ, కోశములు.

అన్నగంధి. సం. వి. ఈ. స్త్రీ. ఆమరోగము: చూ, రోగము 1.

అన్నగళ. దే. వి. కొజ్జా: చూ, సొవిడల్లుఁడు. (అప్ర.)

అన్నగళి. దే. వి. __పై.__

అన్నగున. దే. వి. __పై.__

అన్నదమ్ములు. అం. పిండదానకరు లేడుగురిలో నొకరు: చూ, పిండదానకరులు (చూ, గయాపిండదానార్హులు); 2. సోదరులు.

అన్నన్న. దే. అవ్య. (అన్న + అన్న.) ఆశ్చర్యమును దెలుపును. రూ-అన్నా. కాశి. 1, ఆ. 149: చూ, వింత. 1.

అన్నపురాసి. వ్య. వి. కుంభము, అన్నపు ప్రోవు: చూ, సాదము. (1)

అన్నప్రాశనము. సం. వి. అ. న. బిడ్డలకు మొట్టమొదట పరమాన్నము తినిపించెడియొక శుభకర్మము, పదియారుకర్మములలో నొకటి: చూ, కర్మములు.

అన్నభార్య. అం. 1. మాతలయిదుగురిలో నొకతె. చూ, మాతలు; 2. చూ, వదినె.

అన్నభేది. సం. వి. ఇ. స్త్రీ. ఇనుముయొక్క గంధకద్రావకము చేరికవలననైన ఉప్పు. చూ, లవణము. 1.

అన్నభేదిభస్మము. పా. అజీర్ణరోగులకు మందు. కాసీసభస్మము (అన్నభేదినిమ్మరసమునతడిపి పుటము బెట్టిన గొల్లని భస్మము అగును.)

అన్నమదము. అం. మదము లెనిమిదింటిలో నొకటి: చూ, మదములు.

అన్నము. సం. వి. అ. న. 1 వంటకము, తినుటకుపయుక్తమైనపదార్థము: చూ, సాదము (1), విణ. 2. తినఁబడ్డది: చూ, భుక్తము.1; అం. 3. భోగము లెనిమిదింటిలో నొకటి. చూ, భోగములు.

అన్నరసము. సం. వి. అ. న. 1. చూ, వాయువు; వా. 2. ధాతువము, అన్నసారము.

అన్నా. దే. అవ్య. ఆశ్చర్యార్థకము. రూ-అన్నన్న. అచ్చ. అ, కాం. 110: చూ, వింత. 1.

అన్ని. ద్వ. స. ఏ. అంతశబ్దమునకు అమహదర్థక బహువచనాదేశము; 1. సమస్తము, అంత చూ, సర్వము; 2. అల్లిక మొదలు. చూ, రూ-అని. 2; విణ. 3. అంతసంఖ్య గలది. [illegible]

అన్నింటవిముఁగఁబుట్టుట. అం. మన్మథావస్థలు పదింటిలో నొకటి: చూ, మన్మథావస్థలు

అన్నితిండికాఁడు. ద్వ. వి. అగ్ని. చూ, వహ్ని.1.

అన్నిఁదినువాఁడు. ద్వ. వి.—పై.—

అన్ను. దే. వి. 1. అఁదుది. చూ, స్త్రీ; 2. [illegible] ఉంగము: చూ, పిస్మృతి.

అన్నుకొను. గే. అ. క్రి. పరవశమగు. స్వా. 5, ఆ. 22 చూ, విస్మృతినొందు. (క్రి) అన్నుకొలుపు)

అన్నువ. దే. వి. 1. అఁదుగి: చూ, స్త్రీ; విణ 2. అల్పము. భార. ఆది. 7, ఆ. 224. చూ, స్వల్పము.

అన్నువు. దే. వి: చూ, అన్ను 2.

అన్నెకాఁడు. ద్వ. విణ (అన్నెము + కాఁడు) అన్యాయకారి "అన్నెకాఁడైవాఁడు నావల పల్లవారు దూఱు చేసెనే." క్షేత్రియ: చూ, భాంసలాఁడు.

అన్నెకారి. పై విణ.—అన్యాయకారిణి. "అన్నెకారి చాడీవిన్నాఁడు." క్షేత్రియ.

అన్నెము. పై. వి. 1.—అన్యాయము. అధర్మము: చూ, ఉపరాగము 3; పై. స 2.—అన్యత్, అన్యము. నన్నుఁగూడిన నాఁటనుండియు నన్నెమెఱుఁగఁడు." క్షేత్రియ: చూ, పరాయి.

అన్ను. దే. వి. 1: చూ, రూ- అనుము[1], 2. అందము. రూ-అనుము: చూ, సౌందర్యము.

అన్య. అం. 1. పరకీయలలోనొకతె, ఇతరునియాసక్తమైన పరపురుష భోగముగలది. చూ, పరకీయ; 2 సామాన్యనాయికలలో నొకతె చూ, సామాన్యనాయికలు.

అన్యజుఁడు. సం వి. అ. పుం. చూ, [illegible] 2.

అన్యతరము. సం. స. 1. రెంటిలో నేదో యొకటి; విణ. 2. రెంటిలో యొకటి. చూ, [illegible]

అన్యతరుఁడు. సం. విణ. మఱియొకఁడు: చూ, పరాయివాఁడు. [నొకవాఁడు.

అన్యతరేద్యుపు. సం. అవ్య. రెండుదినములలో

అన్యత్పర్యాయోక్తము. అం: చూ, అన్యాపదేశోక్తి.

అన్యత్పర్యాయోక్తి. అం.—పై.—

అన్యత్ర. సం. అవ్య. మఱియొక్కడనైనను.

అన్యథా. సం. అవ్య. మఱియొకవేళ.

అన్యదేశ్యములు. పా. ఇతరదేశములపదములు. ఇవి లోకమున నిదివఱకు రూఢిగవ్యాపించినవిగాయుండవలెను (సరియైనయాంధ్రపదములేనిచో నెచ్చటనైనఁగ్వాచిత్కముగ వాడినవాడవచ్చునుగాని యిచ్ఛలనిడి వాడరాదు)

అన్యద్విషము. అం: చూ, అన్యాపదేశోక్తి.

అన్యధా. సం. అవ్య. మఱియొకలాగున.

అన్యధాకరించు. సం. స. క్రి. మఱియొకలాగునసేయు. భార. ఆది. 7, అ. 254: చూ, వెఱుసేయు.

అన్యపు. సం. వి. ఆ. స్త్రీ: చూ, సోమెద.

అన్యబంధురి. సం. వి. ఆ. స్త్రీ. భోగముది: చూ, వేశ్య.

అన్యము. సం. స. 1.—అన్యము: చూ, పరాయి, విణ. 2. సరిలేనిది: చూ, అతులము.

అన్యవర్ణస్త్రీనిఁబెండ్లియాడుట. అం. కలియుగవర్జ్యము లిరువదింటిలో నొకటి: చూ, కలియుగ వర్జ్యములు. [వాయసము. 1.

అన్యవాహము. సం. వి. అ. పుం. కాకి: చూ,

అన్యస్త్రీ. సం. వి. ఈ. స్త్రీ. మఱియొకఁడుని చూ, స్త్రీ.

అన్యాకరణము. సం. వి. అ. న. వింటినారియొక్క యొగ్గము చూ, స్వరము. 2.

అన్యాతుల్యయోగిత. అం: చూ, అన్యాపదేశోక్తి

అన్యాదృశము. సం. విణ. మఱియొకటివలె సరియైనది.

అన్యాయకారి. సం. విణ. ఇ. పుం.—: చూ, అన్నెకాఁడు. [అన్నెకారి.

అన్యాయకారిణి. సం. వి. ఈ. స్త్రీ.—: చూ,

అన్యాయము. సం. విణ—అపనాయము: చూ, ఉపరాగము. 3.

అన్యార్థము. అం. పదదోషములు పదునేడింటిలో నొకటి: చూ, పదదోషములు.

అన్యాపదేశోక్తి. అం. అలంకారభేదము: చూ, అలంకారము. 3 (చూ, హేతువు. 2.)

అన్యాసంగతి. అం.—పై.—

అన్యుఁడు. సం. స: చూ, పరాయివాఁడు.

అన్యేద్యువు. సం. అవ్య: చూ, మఱునాఁడు.

అన్యోన్యము. సం. వి అ. న. 1. ఇతరేతరము: చూ, పరస్పరము; అం. 2. పరస్పరశోభవర్ణించుట, ఒక అర్థాలంకారము. "మణిచేఁగంకణము కంకణముచే మణియువెలుఁగును.": చూ, అలంకారము. 3.

అన్యోన్యసంఘప్రవచనము అం. సామపంచకములలో నొకటి చూ, సామపంచకము.

అన్వక్షు. సం. విణ. (చ్. ఈ. చ్.) : చూ, అనుచరుఁడు.

అన్వర్థుఁడు. సం. విణ. 1.—పై.—; అం. 2 పరశురామావతారము: చూ, అవతారములు. [నొకటి: చూ, చుంబనములు.

అన్వర్థము. అం. చుంబనములు పదునైదింటిలో

అన్వయము. సం. వి. అ. పుం. 1. కులము: చూ, వంగడము; 2 అన్వవాయము, గోత్రము: చూ, ప్రవరము. 1; 3. పొందిక: చూ, సంయోగము; పా. 4. ఉపస్థావేజాలులోనగువానియొక్క అర్థమును తెలియఁబఱచుట; విణ. 5. వాక్యములలో నుండు శబ్దసంబంధమును దెలియఁజేయునది.

అన్వయించు. సం. స. క్రి: చూ, పొందికపఱచు.

అపకీర్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. చెడుపేరు: చూ, బన్నము 2; ఉప. 2. ఇచేట కీర్తిశబ్దముతో సమసించి,'అభావార్థము' ను జెప్పుచున్నది.)

అపకృష్టి. సం. వి. ఇ. స్త్రీ: చూ, అపకారము.

అపకృష్టము. సం. విణ. 1. తక్కువైనది: చూ, హీనము. 1; ఉప. 2. (ఇచేట ధాత్వర్థమును 'అధమము' అను నర్థమునకు మార్చినది.)

అపకృష్టి. సం. వి. ఇ. స్త్రీ. ఆకర్షించుట చూ, లాగు. 3.

అపక్రమభిన్నము. పా. లవము పెద్దదిగను హారము చిన్నదిగనుండునది. 4/2, 8/4, 12/6 మొ.

అపక్రమము. సం. వి. అ. పుం. 1. యుద్ధము వలనఁ బాఱుట: చూ, పలాయనము; అం. 2. అగ్రగోషములు పదునెనిమిదింటిలో నొకటి: చూ, అగ్రగోషములు.

అపక్రమించు సం.అ.క్రి. యుద్ధమువలనఁ బాఱు చూ, వెనుదీయు. 1.

అపక్రయము. సం. వి. అ. పుం. కొనువస్తువులు లోనగువానివెల: చూ, విలువ.

అపక్రాంతము. అం. కరణములు నూటయెనిమిదింటిలో నొకటి: చూ, కరణములు.

అపక్రాంత. అం. ఆకాశచారులుపదునాఱింటిలో నొకటి: చూ, ఆకాశచారులు.

అపక్వము. సం. విణ. 1. పండనిది, పచ్చిది, లేఁతది: చూ, లేఁత. 1; 2. ఉడకనిది, పరిపాకముఁబొందనిది: చూ, కషణము. 1.

అపక్షియతే. అం. భావవికారము లాఱింటిలో నొకటి: చూ, భావవికారములు.

అపక్షేపణము. అం.తర్కశాస్త్రమునందలి పంచవిధకర్మములలో నొకటి: చూ, కర్మములు.

అపఖ్యాతి. సం. వి. ఇ. స్త్రీ: చూ, అపకీర్తి.

అపగ. సం. వి. ఆ. స్త్రీ. 1. వాగ్పిప్పాదులు; 2. రూ-అపగ. ఏఱు: చూ, నది.

అపగతము. సం. వి. అ. పుం. 1. పోయినది: చూ, అక్రమము. 2; ఉప. 2. (ఇచేట నిరర్థకమైనది.)

అపగమము. సం.వి అ.పుం: చూ, ప్రయాణము.

అపగల్భ్యము. సం. వి. అ. పుం.1.కాశ్మీరమంటుపము; విణ. 2. దోషములేనిది: చూ, నిర్దోషము.

అపగల్భ్యుఁడు. సం. వి. అ. పుం:చూ, శివుఁడు.

అపఘనము. సం. వి. అ. పుం. 1. ఒడలు: చూ, శరీరము; 2. అవయవము: చూ, విశేషము.3.

అపచయము. సం. వి. అ. పుం. 1.తగ్గుదల:చూ, వెలితి. 2; 2. పూజ:చూ, సపర్య; 3. కీడు: చూ, హాని. 2.

అపచయించు సం. స. క్రి. పువ్వులుకోయు: చూ, చిదుము. 4. [పూజితము.

అపచాయితము. సం.విణ.పూజింపఁబడినది:చూ,

అపచాయితుఁడు సం. విణ. పూజింపఁబడినవాఁడు: చూ, పూజితుఁడు. 1.

అపచారము. సం. వి అ. పుం. పెద్దలయెడల చేసినతప్పు: చూ, నేరము.

అపచితము. సం. విణ: చూ, అపచాయితము.

అపచితి. సం. వి. ఇ స్త్రీ. 1. పూజ: చూ, సపర్య; 2. పాప పరిహారార్థము చేయుడి కర్మము: చూ, ప్రాయశ్చిత్తము; 3. ఖర్చు, వ్యయము: చూ, వెచ్చము. 1; 4. తగ్గుదల: చూ, వెలితి. 2; 5. కీడు: చూ, హాని. 2; 6. నాశము, చేటు: చూ, రుత్త; 7. ప్రత్యుపకారము: చూ, ప్రతీకారము.

అపచితుఁడు. సం. విణ:చూ,అపచాయితుఁడు.

అపజయము. సం. వి. అ. పుం. ఓటు: చూ, పరాజయము. [ప్రాప్తము. 1.

అపటాంతరము. సం. విణ. కదిసినది: చూ,

అపటి. సం. వి. ఈ. పుం. తెర:చూ, వస్త్రము.

అపటువు. సం. వి. ఉ. పుం. 1. పదునాఱేండ్లకు లోఁబడినపిల్లవాఁడు: చూ, శిశువు; విణ. ఉ. తెలివిలేనివాడు: చూ,బాల్యాధికుఁడు.

పతల్పకము. సం. వి. అ. న. అర్ధచంద్రాకారమయిన తలగడ: చూ, లోడు.

అపతోఁక. మి. వి. అ. స్త్రీ. రూ-అవతోఁక. ఈచుకపోయిన యావు: చూ, ధేనువు.

అపత్నీకుఁడు. సం. వి. అ. పుం. భార్యపోయినవాఁడు.

అపత్యము. సం. వి. అ. న. 1. పాలపాపఁడు: చూ, శిశువు; 2. పుత్రపౌత్ర పారంపర్యము: చూ, సంతానము. 3.

అపత్రప. సం. వి. అ. స్త్రీ. స్వభావమునకుఁడగనిపనులు మొదలగునవి చేయుటచేఁగలిగిన సిగ్గు: చూ, సిగ్గు.

అపత్రపిష్ణువు. సం. విణ. ఉ. లజ్జయే స్వభావముగాఁగలవాఁడు: చూ, సిగ్గరి.

అపథము. సం. వి. అ. న, పుం. తప్పుదారి చూ, మార్గము. 1. [రూ- అపపథ్యము.

అపథ్యము. సం. విణ పథ్యముకానిది చూ,

అపదంశక్షమము. సం. వి. అ. పుం: చూ, మూఁగ.

అపదంశము. సం. వి. అ. పుం. సాగాతాగున పుడు తినునట్టిమాంసము మొదలగునవి [ము.

అపదాంతరము. సం. విణ: చూ, రూ-అపటాంతర

అపదానము. సం. వి. అ. న. 1. కడచినపని. చూ, రూ-అవదానము; 2. నఱకుట: చూ, నఱకుడు; 3. నిర్మలమైనపని: చూ, పరిశోధనము. 1. [చూ, శూన్యము. 1.

అపదార్థము. సం. వి. అ. న. ఏమియులేమి

అపదిశము. సం. వి. అ. న, అవ్య. మూలవాటు, రెండు దిక్కులకు నడిమిభాగము చూ, దిక్కు. 1 (చూ, హరిత్తు)

అపదూఱు. మి. వా. వి. నిరాపనింద, ఊఱక మోపిననింద: చూ, నింద. 1.

అపదేశము. సం. వి. అ. పుం. 1. కపటము, పరపోగ్రహార్థ మొకటి యుద్దేశించినట్లు తెలిపి యొకటి చేయుట: చూ, వ్యాజము. 1; 2. కారణము: చూ, హేతువు. 1; 3. ఖ్యాతి: చూ, ప్రసిద్ధి. 1; 4. చోటు: చూ, స్థానము. 1; 5. గుఱుతు: చూ, లక్షణము. 1.

అపధ్వంసము. సం. వి. అ. పుం. 1. వదలుట: చూ, విమోచనము; 2: చూ, అపదూఱు, 3. పాడిచేయుట: చూ, సురుము.

అపధ్వస్తుఁడు. సం. విణ. 1. వెలివేయఁబడ్డవాఁడు: చూ, వెలివాఁడు. 2; 2. పరులచేత పీడింపఁబడినవాఁడు: చూ, అవచూర్ణితుఁడు. 3. దూఱఁబడినవాఁడు: చూ, నిందితుఁడు. 4. విడువఁబడినవాఁడు: చూ, పరిత్యక్తుఁడు.

అపనమ్మకము. మి. వా. వి. నమ్మకములేమి: చూ, అవిశ్వాసము. [అ, 130.

అపనమ్మిక. మి. వా. వి.—పై.—హరిశ్చ. 5,

అపనయము. సం. వి. అ. పుం. 1. కీడు: చూ, హాని. 2; 2. విడుపు: చూ, విమోచనము.

అపనయించె సం. స. క్రి. తొలఁగు: చూ, విసర్జించె. [చూ, సంసక్తము.

అపనాంతరము. సం. విణ. కదిసినది, చేరినది:

అపనింద. సం. వి. అ. స్త్రీ: చూ, అపదూఱు.

అపనీతము. సం. విణ. విడువఁబడినది: చూ, సముజ్ఝితము.

అపనీతములు. వా. పా. యివి వాతాపనీతములు, జలాపనీతములు అని ద్వివిధము (చూ, అపనీతము).

అపనుదము. సం. విణ. తొలఁగించునది. ఉ, హరి. 6, ఆ. 19: అపనోది.

అపనెపము. మి. వా. వి: చూ, అపదూఱు.

అపనేయము. సం. విణ. తొలగింపఁదగినది.

అపనోదనము. సం. వి. అ. పుం. తొలఁగింపు: చూ, విమోచనము.

అపనోది. సం. విణ. (న్. ఈ. న్.): చూ, అపనుదము. [వాఁడు.

అపన్నతి. సం. వి. ఇ. పుం. నిరాశచేసికొనిన

అపన్నసత్వ. సం. వి. అ. స్త్రీ. రూ-ఆపన్న సత్వ, గర్భిణి: చూ, మేలాలు.

అపన్యాయము. సం. విణ. న్యాయములేనిది: చూ, ఉపరాగము. 3.

అపపాడి. మి. వా. వి. అన్యాయము, అన్నె ము మార్క. 8, ఆ. 113: చూ, ఉపరాగ ము. 3. [బన్నము. 2

అపప్రథ. సం. వి అ. స్త్రీ. అగౌరవము చూ,

అపభ్రంశము. సం. వి. అ. పుం. 1: చూ, అప శబ్దము; 2. పడుట: చూ, పతనము; అం 3. ప్రాకృతభాషాభేదము లాఱింటిలో నొ కటి: చూ, ప్రాకృతభాషాభేదములు; 4. వ్యా కరణములు తొమ్మిదింటిలో నొకట. చూ, వ్యాకరణములు; 5. భాషలు ఎనిమిదింటిలో నొకటి: చూ, భాషలు. [శ్లోకము

అపమర్దము. సం. వి. అ. పుం. బాధ: చూ,

అపమిత్యకము. సం. వి. అ. న: చూ, అక్లిష్టము. 1.

అపమృత్యువు. సం. వి. ఉ. పుం, స్త్రీ. తిటా లునకలిగిన చావు: చూ, మరణము.

అపయశము. సం. వి. స్. న: చూ, అపఖ్యాతి

అపయానము. సం. వి. అ. న: చూ, అపక్ర మము. 1.

అపర. సం. వి. ఆ. స్త్రీ. 1. మనుష్యాది గర్భస్థ పిండమునకు రక్షకముగా మీఁదికప్పుకొని యుండు తోలుసంచి: చూ, మావి. 2; 2. గౌరి: చూ, పార్వతి. 1.

అపరంజి. దే. వి. మేలిమి: చూ, లోహము. 1.

అపరక్రియ. సం. వి. ఆ. స్త్రీ. అంత్యకర్మము, చేచ్చినవానిగుఱించి వెనుకచేయు కర్మము: చూ, కర్మములు.

అపరదినము. సం. వి. అ. న: చూ, మఱునాఁడు.

అపరభాగము. సం వి. అ. పుం: చూ, అండ. 3.

అపరము. సం. వి. అ. న. 1. రూ. అవరము. ఏనుఁగు వెనుకటిపిక్క లోనగుకాలు: చూ, హస్తి; స. 2. అన్యము: చూ, పరాయి; 3. క్రిందిది: చూ, అధరము. 8; 4. ఊర్ధ్వ భాగము: చూ, మీఁదు. 2; విణ. 5. వెనుక టిది: చూ, వెనుక. 1; 6. తరువాత: చూ, పిమ్మట; 7. ఇటుగనువాత: చూ, ఈవల. 2; 8. కొంతమంది: చూ, కొందఱు; 9. దగ్గఱ నుండునది. [చూ, రాత్రి.

అపరరాత్రము. సం. వి అ. పుం. _అపరాత్రి:

అపరవక్త్రుఁడు. సం. వి. అ. పుం: చూ, సూర్యుఁడు.

అపరస్వరము. సం. వి. అ. న. 1: చూ, అజస్ర ము; 2. గుంపుగూడినడచుట; విణ. 3. ఎడ తెగని క్రియగలది: చూ, సతతము. 2.

అపస్వరుఁడు. సం. విణ. అనేకులుచేరి చేయు నట్టి పనిగలవాఁడు.

అపరాజయ. సం. వి. అ. స్త్రీ. వాయువేగము: చూ, వేగము. 3

అపరాజిత. సం. వి. ఆ. స్త్రీ. 1. గౌరి: చూ, పార్వతి. 1; 2. తక్కెలగి: చూ, వైజయంతి; 3. ఎఱ్ఱవిష్ణుకాంత: చూ, విష్ణుకాంత; 4. నల్లవిష్ణుకాంత: చూ, విష్ణుకాంత; 5. వాస్మి, బమ్మి*: చూ, సోమెద, 6. నల్ల నేలగుమ్ముడు*: చూ, భూమికర్కాడువు; 7. ఈశానునిదిక్కు: చూ, హరిత్తు.

అపరాజితము. సం. వి. అ. పుం. ఇంద్రునితేరు. చూ, శకటము. 1; పా. 2. ఒకానొకవృత్త ము. (ఈ.-న-న-ర-స-వ గణములుగలిగి తొ మ్మిదవ యక్షరము యతిగాఁగల పదునాలు గవ ఛందస్సునందలి వృత్తము): చూ, వృత్త ము. 1.

అపరాజితుఁడు. సం. వి. అ. పుం. 1. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1; 2. ముక్కంటి: చూ, శివుఁడు; అం. 3. ఒకానొక రుద్రుఁడు: చూ, రుద్రులు; విణ. 4. అనిర్జితుఁడు, జయింపఁబడనివాఁడు: చూ, అజితుఁడు.

అపరాత్రి. మి. వా. వి.=అర్ధరాత్రము: చూ, రాత్రి.

అపరాతుల్యయోగిత. అం: చూ, అపరివిషమము.

అపరాద్ధపృషత్కుఁడు. సం. వి. అ. పుం. గుఱి తప్పి సెగసిన విలుకాఁడు.

అపరాద్ధము. సం. విణ. తప్పినది. చూ, అభిపన్నము.

అపరాధము. సం. వి. అ. పుం. 1 తప్పు: చూ, దోషము; పా 2. సింహాసనా.

అపరాధి. సం. విణ. (త్రి. ఈ. న్.) తప్పు గల వాఁడు: చూ, వ్యాసుఁడు 2.

అపరాలు. దే. వి. బ. పైరుధాన్యము, దక్షిణపు గాలిచేఁ బండెడు పెసలులోనగు కాయధాన్యము: చూ, ధాన్యము.

అపరావృత్తినిలయము. సం. వి. అ. పుం. వండి కొండ: చూ, పర్వతము.

అపరాసంగతి. అం. అలంకారభేదము: చూ, అలంకారము 3. (చూ, హేతువు. 2.)

అపరాహ్ణము. అం. కాలములు మూఁడింటిలో కొకటి: చూ, కాలములు. (దినము మూఁడు భాగములైనప్పుడు కడపటిభాగము అయిదు భాగములైనప్పుడు నాలవభాగము.)

అపరిమితము. సం. విణ. పరిమితముకానిది (పరిమితము=మితము.): చూ, అపారం.

అపరిమితాయుర్దాయము. పా. 120 సంవత్సరములకాలముకన్న నెక్కువకాలము జీవించుట.

అపరివిషమము. అం. అలంకారభేదము. చూ, అలంకారము. 3. (చూ, హేతువు. 2.)

అపరుఁడు. సం. వి. అ. పుం: చూ, తమ్ముఁడు.

అపరేద్యుః. సం. స, అవ్య: చూ, మఱునాఁడు.

అపర్ణ. సం. వి. ఆ. స్త్రీ. 1. గౌరి: చూ, పార్వతి. 1; విణ. 2. ఆకులులేనిది; 3. అప్పు తీర్చినది.

అపలపించు. సం. స. క్రి: చూ, మఱుఁగుపెట్టు.

అపలధ. సం. వి. ఆ. స్త్రీ. ధారణాశక్తిగలబుద్ధి. మేధ: చూ, బుద్ధి.

అపలాపము. సం. వి. అ. పుం. 1. మొదట చెప్పిన మాటను కాదని వేఱువిధముగాఁ జెప్పుట, అటమటింపు: చూ, మఱుఁగుమాట; 2. సంబరము: చూ, సంతోషము.

అపవనము. సం. వి. అ. న. మనుష్యులు వేసి పెంచినతోట ఆరామము: చూ, వనము. 2.

అపవరకము. సం. వి. అ. న. 1. ఓవరి అంతర్గృహము, లోఁగది: చూ, సదనము. 1; 2. అనేకవిధ కాంతులుగల మేఘము: చూ, మేఘము. 1.

అపవర్గము. సం. వి. అ. పుం. 1. ముక్తి: చూ, మోక్షము. 1; 2. ముగింపు: చూ, సమాప్తి; 3. దానము: చూ, వితరణము; 4. నెఱవేఱుట: చూ, సిద్ధి. 1.

అపవర్జనము. సం. వి. అ. న. 1. విడుపు. చూ, విమోచనము; 2. ముక్తి: చూ, మోక్షము. 1; 3. దానము, ఈవి: చూ, వితరణము; 4. ఆకాశము: చూ, వ్యోమము. 1; 5. సత్రము, అన్నదానగృహము. చూ, సదనము. 1.

అపవర్తనము. సం. వి. అ. న. మిక్కిలికష్టపనులనుండి మరలుట.

అపవాదము. సం. వి. అ. పుం. 1. దూఱు: చూ, నింద. 1; 2 ఆజ్ఞ: చూ, సెలవు; 3. నమ్మిక: చూ, విశ్వాసము; 4. నెమిళ్లకు లయిక: చూ, సంయోగము.

అపవాదుఁడు. సం. వి. అ. పుం: చూ, తెలుపల వాఁడు.

అపవారణము. సం. వి. అ. న. మఱుఁగు: చూ, వ్యవధానము. 3.

అపవిద్ధుఁడు. పా. ఆచమించునప్పుడు శిరస్సుగాని కంఠమునుగాని కప్పుకొనినను, కచ్చె విడిచినఁగాని, జుట్టుముడి విరియఁబోసికొనిగాని, యజ్ఞోపవీతరహితుఁడైగాని యుండు వాఁడు.

అపవిద్ధము. అం. 1. బాహుప్రచారములు పదింటిలో నొకటి: చూ, బాహుప్రచారములు; 2. కరణములు నూటయెనిమిదింటిలో నొకటి: చూ, కరణములు.

అపవిద్ధుఁడు. అం. తల్లిచేతఁగాని, తండ్రిచేతఁగాని, యుభయులచేతఁగాని విడువఁబడఁగా తెచ్చి పెంచుకొన్న కొడుకు, పుత్రులుపన్నిద్దఱిలో నొకఁడు: చూ, పుత్రులు.

అపవిష. సం. వి. ఆ. స్త్రీ. అతివస*: చూ, విష.

అపవేష్టితకము. అం. హస్తప్రాణములు పండ్రెండింటిలో నొకటి: చూ, హస్తప్రాణములు.

అపశదుఁడు. సం. విణ. రూ-అపసదుఁడు. చూ, హీనుఁడు.

అపశబ్దము. సం. వి. అ. పుం. అపభ్రంశము. తొచ్చెపుమాట: చూ, శబ్దము. 2.

అపశబ్దనుఁడు. సం. విణ. వ్యాకరణవిరుద్ధముగ శబ్దించువాఁడు, గ్రామ్యవాది.

అపష్ఠువు. సం. వి. ఉ. పుం. 1. కాలము: చూ, సమయము. 1; విణ. 2. వాటము తప్పినది: చూ, ప్రతికూలము.

అపసంస్కృతము. సం. విణ. పదదోషములలో నొకటి. ఉదా.-దర్శనము, స్పర్శనము, అను శబ్దములను దరిశనము, స్పరిశనము అని వ్రాయరాదు. సంస్కృతశబ్దములందలి సంయుక్త వర్ణములను విడఁదీసి వ్రాయుటతప్పు. నైవేద్యము అనుదానిని నయివేద్యమనరాదు: చూ, పదదోషములు. (చూ, కావ్యదోషములు)

అపసదుఁడు. సం. విణ: చూ, రూ-అపశదుఁడు.

అపసధ్యము. అం. ఔపాసనాగ్ని, పంచాగ్నులలోనిది యొకటి: చూ, అగ్నులు. (చూ, వహ్ని. 1.) [విమోచనము.

అపసరణము. సం. వి. అ. పుం. విడుపు: చూ,

అపసరము. సం. వి. అ. పుం.— పై.—

అపసరిల్లఁజేయు. వి. అ. క్రి: చూ, విసర్జించు.

అపసరిల్లు. సం. అ. క్రి. తొలఁగు: చూ, విరియు. 5.

అపసర్జనము. సం. వి. అ. న. 1. విడుపు: చూ, విమోచనము; 2. దానము: చూ, వితరణము; 3. చంపుట: చూ, వధము.

అపసర్పుఁడు. సం. వి. అ. పుం. చారుఁడు: చూ, వేగువాఁడు.

అపసవ్యజానువు. అం. మల్లశాస్త్రమునందలి ప్రచారములు ముప్పదిరెండింటిలో నొకటి: చూ, ప్రచారములు.

అపసవ్యము. సం. విణ. 1. దక్షిణభాగము. కుడి: చూ, వలపల (చూ, హారత్తు.); 2. వాటముతప్పినది: చూ, ప్రతికూలము.

అపసారము. సం. వి. అ. పుం. తలఁగుడు: చూ, విమోచనము.

అపసృతము. అం. పార్శ్వక్రియలయిదింటిలో నొకటి: చూ, పార్శ్వక్రియలు.

అపస్కరము. సం. వి. అ. పుం. నొగకాఁడి బండికన్ను మొదలయిన రథావయవము: చూ, రూ-అపస్కరము. 2.

అపస్నాతుఁడు. సం. విణ. చావునిమిత్తము స్నానముచేసినవాఁడు; పుత్రాదులచేత సంస్కారార్థమై స్నానముచేయించఁబడిన శవము పేర్లం నుబోధినీకారుఁడు: చూ, మృతస్నాతుఁడు.

అపస్నానము. సం. వి. అ. న. చావునిమిత్తమయిన స్నానము: చూ, స్నానము. 1.

అపస్మారము. సం. వి. అ. పుం. 1. మోహాదిదుఃఖాలచేఁగలిగెడి యావేశము: చూ, అపస్మృతి. 1; 2. తిఱుపుమఱుపుమాటల రోగము: చూ, రోగము. 1.

అపస్మారి. సం. విశే. (న. ఈ. న.) అపస్మారము కలవాఁడు: చూ, మూర్ఛితుఁడు. 2.

అపస్మృతి. సం. వి. ఇ. స్త్రీ. 1: చూ, అపస్మారము; అం. 2. సంచారి (?) [illegible]

అపేక్షణీయము. సం. విశే. కోరఁదగినది: చూ, వాంఛనీయము. [వాంఛించు.

అపేక్షపడు. మి. అ. క్రి. అక్కఱపడు: చూ,

అపేక్షపెట్టు. మి. స. క్రి :చూ, ఆసపెట్టు.

అపేక్షించు సం. స. క్రి. కోరు: చూ, వాంఛించు. [వాంఛితము.

అపేక్షితము. సం. విశే. కోరఁబడినది: చూ,

అపేక్ష్యము సం. విశే. కోరఁదగినది: చూ, వాంఛనీయము. [చనము.

అపేలము. సం. విశే. తొలఁగినది: చూ, విమో

అపైశునము. సం. వి. అ. న. న్యాయబుద్ధి చూ, సత్యము. 1.

అపోగండఁడు. సం. వి. అ. పుం. 1. రూ-ఆపోగండఁడు. పాలపాపఁడు: చూ, శిశువు; విశే. 2. చొట్టపోయిన శరీరముగలవాఁడు. అంగవికలుఁడు: చూ, లేవఁజాలనివాఁడు; 3. ముడుతలుగలవాఁడు:చూ, సూ-అపోగండఁడు.

అపోటకి. సం. వి. ఈ. స్త్రీ. మట్టుబచ్చలి: చూ, బచ్చలి.

అపోసనము. వై. వి.=ఆపోశనమ్. భోజనమప్పుడు ముడిఁట జలముపోసికొని మంత్రపూర్వకముగాఁబుచ్చుకొనుట, రూ-ఆపొసనము-ఆపోసనము-అపోసము చూ, శుద్ధాచమనము.

అపోహము. సం.వి అ పుం లేనిది ఊహించుట; ఊహించుట: చూ, యోచన.

అప్డు చూ, రూ-అపుడు. [ధేనువు.

అప్తువు. సం. వి. ఉ. స్త్రీ. యజ్ఞపసువు: చూ,

అప్తోర్యామము. అం. సోమయజ్ఞము లయిదింటిలో నొకటి. చూ, సోమయజ్ఞములు.

అప్ప. వై. వి. 1.—అమ్బశః. రూ-అప. తండ్రి. అచ్చ. యయ, కాం. 65: చూ, పితరుఁడు; 2.= అమ్బా. రూ-అప, తల్లి:చూ, మాత. 1; 3. అక్క, రూ-అప: చూ, జ్యేష్ఠ. 4; 4. అన్న: చూ, జ్యేష్ఠుఁడు. 1; వై. అవ్య. 5. ఆశ్చర్యమును తెలుపును. రూ-అప్పా. ఆమ్రేడితమందు అప్పప్ప. సా. 1, ఆ. 81: చూ, వింత. 1.

అప్పఁగించు. వై. స. క్రి.=అర్పణ: చూ, వశపఱచు; 2 =అర్పించు. పదిలముగా కాపాడుమని యొప్పగించు: చూ, ఒప్పగించు.

అప్పగింత వై. వి.=అర్పణమ్: చూ, ఒప్పగింత.

అప్పచి వై వి రూ-అప్పచ్చి. అపూపమను భక్ష్యము: చూ, భక్ష్యము.

అప్పచిలు దే. వి. బ. రూ-అప్పచ్చిలు చంద్రా. 2, ఆ. 6: చూ, బాలక్రీడ.

అప్పచ్చిలు. దే. వి. బ.—పై.—

అప్పటము. దే. విశే. తేటనది: చూ, పరిశుద్ధము.2.

అప్పటి. దే. అవ్య. పునర్గ్రకము:చూ, పిండియు.

అప్పడము. వై. వి. అర్పటః. ఒకభక్ష్యము. కాశీ. 7, ఆ. 81: చూ, భక్ష్యము.

అప్పణ. వై. వి.—అర్పణ. రూ-అప్పన, ఆజ్ఞ: చూ, సెలవు. [వరుణుఁడు. 1.

అప్పతి. సం. వి. ఇ పుం. నీటిఱేఁడు చూ,

అప్పన. వై. వి. 1. అర్పణ:చూ, రూ-అప్పణ. శుక 2, ఆ. 215, 2 పన్ను: చూ, సిస్తు.1.

అప్పనము. వై. వి. 1. రూ-అప్పన, పన్ను చూ, సిస్తు 1; 2. కట్నము, కానుక: చూ, లంచము; 3 = అర్పణమ్. అప్పగింత: చూ, ఒప్పగింత. వా. 4. ఉచితము. "అప్పనపు మెతుకులుతిన్నాను."

అప్పనసేయు. వై. స. క్రి. 1. (అప్పనము + సేయు) చెప్పు: చూ, పంచించు; 2. అప్పగించు: చూ, వశపఱచు.

అప్పము. అం. 1. అష్టవసువులలో నొకటి:చూ, వసువులు; వై. వి. (1)=అపూపః. గుడాపూపమను భక్ష్యము: చూ, భక్ష్యము.

అప్పళము. వై. వి. 1.—అర్పటః. రూ-అప్పడ

ట్టి అష్టభాగముగా కాచి దింపుకొని ఆకషాయము సేవించిన సమస్తదోషములు, సమస్తజ్వరములు, సమస్త వాయువులు హరింపును. పథ్యము చెప్పిడి చేయవలయును.

అష్టానీకము. అం. అసంహతవ్యూహములా ప్రింటిలో నొకటి: చూ, అసంహతవ్యూహములు.

అష్టాపదము. సం. వి. అ. న. 1. సొగటాలపాళి: చూ, శారిఫలము; పుం, న. 2. బంగారు: చూ, లోహము. 1; పుం. 3. ఎనిమిదికాళ్ళ మెకము: చూ, శరభము; 4. కైలాసము, వెండికొండ: చూ, పర్వతము;





5. లూత: చూ, సాలెపురుగు; 6. పూర్వ్యాధిపదిపదస్తకతిము: చూ, సత్తతిము. 1.

అష్టాపది. సం. వి. ఈ. స్త్రీ: చూ, మల్లె. *. 1.

అష్టాపదుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) చతురంగమాడువాఁడు: చూ, సందెగాఁడు.

అష్టారక్తము. సం. వి. అ. పుం. ఎఱ్ఱఉత్తరేణి *: చూ, శైఖరికము.

అష్టారచక్రవంతుఁడు. సం. వి. త్. పుం. పూర్వజైనవిశేషము: చూ, బుద్ధుఁడు. 1.

అష్టావధానము. సం. వి. అ. పుం. ఎనిమిది భిన్నాభిప్రాయములొక్కమారు వెలిపుచ్చు మేధాశక్తి: చూ, అవధానము.

అష్టావధాని. సం. వి. ఇ. పుం. ఎనిమిదిమందికి యెనిమిది భిన్నాభిప్రాయములొక్కమారు వెలిపుచ్చు మేధాశక్తి గలవాఁడు: చూ, అవధాని.

అష్టాశతము. సం. వి. అ. న: చూ, ఎనమన్నూఱు.

అష్టి. సం. వి. ఇ. స్త్రీ. 1. భోజనము: చూ, సాపాటు; ఈ. స్త్రీ. 2. ఛందస్సు లిరువదియాఱింటిలో నొకటి: చూ, ఛందస్సులు.

అష్టీలము. సం. వి. అ. పుం. ఆదర్శము: చూ, ముంజెమొలనూలు.

అష్టీవత్తు. సం. వి. త్. పుం. జానువు: చూ, మోఁకాలు.

అష్టైశ్వర్యములు. అం. దాసి, ధనము, ధాన్యము, బంధుఁడు, భృత్యుఁడు, వస్త్రము, వాహనము, సుతుఁడు. (8.)

అష్టోత్తరశతము. సం. వి. అ. న: చూ, నూటయెనిమిది.

అసంకీర్ణద్రవ్యములు. పా. నొక్కఁబడక్యము కాని వస్తువులు.

అసంఖ్యేయము. సం. విశే. (అ. ఆ. అ.) లెక్కపెట్టలేనిది: అగణితము, అపారము.

అసంగతము. సం. విశే. (అ. ఆ. అ.) 1. కూడనిది: చూ, నిష్ఫలము; 2. పొసఁగనిది: అసంబంధము, అసంబద్ధము.

అసంగతి. సం. వి. ఇ. స్త్రీ. 1. ఒకానొకఅర్థాలంకారము. కార్యకారణములకు భిన్నదేశత్వము విరుద్ధముగఁగల్గుట. "మేఘములు విషముగ్రోలఁబడకాంగనలు మూర్ఛిల్లిరి": చూ, అలంకారము. 8; విశే. 2. కూడికలేమి: అయోగము.

అసంగరచనము. సం. వి. అ. న. తడఁబడక ఏదువుట, తురాయణము: చూ, పఠనము.

అసంతుష్టి. సం. విశే. (అ. ఆ. అ.) సంతుష్టి కానిది: అతృప్తము.

అసందర్భము. సం. వి. అ. పుం. సందర్భములేమి.

అసంపూర్ణము. సం. విశే. (అ. ఆ. అ.) సంపూర్తి కానిది: అపూరణి, అసమగ్రము, అసంపూర్తి; (తె. ప.) అందదుకు.

అసంపూర్తి. సం. వి. ఇ. పుం. సంపూర్తిలేమి.

—పై.—

అసంప్రత్యకారిత్వము. అం. తంత్రములయిదిలో నొకటి: చూ, తంత్రములు.

అసంబంధము. సం. విశే. (అ. ఆ. అ.) 1. కూ

కలేనిది: చూ, నిష్ఫలము; 2. పొసఁగనిది: చూ, అసంగతము. 2.

అసంబద్ధము. సం. విశే. (అ. ఆ. అ.)—వై.—

అసంబాధ. పా. ఒకానొక వృత్తము ఇందొక్కొక్క పాదము మ,త,న,స, గగములతోఁ గూడి పండ్రెండవయింట యతిగాఁ గల చతుర్దశ ఛందమునందుఁ బుట్టినవృత్తము. ఉ.—"వాలాయంబుగ సత్కవిజనములు- వంశప్రియాక్, వాలాయత గోవిందకరధృత- వాగ్విలాస కాళిందీప్రాంతశ్రీ మతవసుగ- గప్రాప్తిక్, జాలా భాస్వద్విక్రమమునను న-సంబాధక్." అప్ప. 4, ఆ: చూ, వృత్తము. 1.

అసంభవము. సం. విశే. (అ. ఆ. అ.) 1. కలుగనిది: అపాతము; 2. ఒకానొక యర్థాలంకారము ఇట్లు జేయగుననియెవఁడెఱుఁగుననియెన్నుట. ఉ.— "గొల్లపిల్లవాఁడు గోవర్ధనమెత్తుననియెవ్వఁడను కొనును.": చూ, అలంకారము. 8.

అసంభావ్యత. సం. వి. అ. న. సాధ్యము కానిది: చూ, అసాధ్యము.

అసంభావ్యము. సం. విశే. (అ. ఆ. అ.) సాధ్యము లేనిది: చూ, అసాధ్యము.

అసంయుతము. సం. వి. అ. పుం. అభినయహస్తములు రెండింటిలో నొకటి: చూ, అభినయహస్తములు.

అసంయుతహస్తములు. అం. అరాళము, అర్ధచంద్రము, అర్ధపతాకము, అర్ధసూచీముఖము, అలపల్లవము, ఊర్ణనాభము, కటకాముఖము, కపిత్థము, కపిలము, కర్తరీముఖము, ఖంజము, ఖండచతురము, గజతుండము, చంద్రకళ, చతురము, తామ్రచూడము, త్రిపతాకము, త్రిశూలము, పతాకము, పద్మకోశము, బాణము, భ్రమరము, మణి, మయూరము, ముకుళము, ముష్టి, మృగశీర్షము, యష్టికము, రాజమండలము, లాంగూలము, వంకాళము, విరళము, శిఖరము, శుకతుండము, సందంశము, సర్పచతురము, సర్పశీర్షము, సాంగశము, సాలపద్మము, సింహముఖము, సూచి, స్వర్ణకంఠము, స్వస్తికము, హంసపక్షము, హంసాస్యము. (45) (28 విధములని 45 విధములని ద్వివిధము)

అసంశ్రియ. సం. వి. ఆ. స్త్రీ. రుదంతి: చూ, స్రవంతి.

అసంహతము. సం. వి. అ. పుం. బలములు వేఱువేఱుగాఁ దీర్చిన వ్యూహభేదములయిదింటిలో నొకటి: చూ, వ్యూహభేదములు.

అసంహతవ్యూహములు. అం. అష్టానీకము, అర్ధచంద్రికము, ద్వితీయము, ప్రథమము, శృంగాటకము, సర్వతోముఖము. (6)

అసకృత్తు. సం. అవ్య. అభిన్నము. 1, ముహుర్ముహుర్థకము, మాటిమాటికి: చూ, శశ్వత్తు.

అసద్ద. వై. వి.=అశ్రద్ధా. ఉపేక్ష: చూ, మందెమేలము. 1.

అసతి. సం. వి. ఈ. స్త్రీ. కులట: చూ, ఱంకులాఁడి.

అసతీసుతుఁడు. సం. వి. అ. పుం. కౌలటేయుఁడు: చూ, ఱంకులాఁడికొడుకు.

అసత్యము. సం. వి. అ. న. 1. అబద్ధము, కల్ల: చూ, వితథము; 2 పరస్పరాన్వయము లేనిది (మాట.) బొంకు: చూ, వితథము. "క. వినుమిచ్చెదననియీవియ, గానియెదనవిపలికిపిదపఁ గొనకునికి యసత్యవ్రతంబులు సత్యవ్రతమునకుం దొలఁగంగమనకుభూవరతగునే." భార, శాం. 4, ఆ. 180.

అసత్యవాదము అం. అజ్ఞానదాయకములుతొమ్మిదింటిలోనొకటి: చూ, అజ్ఞానదాయకములు.

అసత్యుఁడు. సం, విశే. (అ. ఆ. అ.) అప్రియముగాఁ బలుకువాఁడు: చూ, ముఖరుఁడు.

అసత్ప్రలాపము. అం. అజ్ఞానదాయకములుతొమ్మిదింటిలోనొకటి: చూ, అజ్ఞానదాయకములు.

అసదర్థనిదర్శన. సం. వి. ఆ. స్త్రీ ఒకానొక అలంకారము: చూ, హేతువు. 2

అసదర్థవాదము. అం. అర్థవాదములుమూఁడింటిలో నొకటి: చూ, అర్థవాదములు.

అసదు. వై. వి.=అసత్. 1.అల్పము. "అసదుగాను." చూ, స్వల్పము; 2. నికృష్టము, తక్కువైనది. "సీ. గాంగేయ కుంభజకర్ణుల మిగిలె డుఁగాదేని సముఁడగుఁ గానియసదు,గాఁదలఁపఁగరాదు" భార. శల్య. 1, ఆ: చూ, హీనము. 1.

అసదృశము. సం విణ. (అ. ఆ. అ) సమము కానిది

అసనపర్ణి. సం. వి. ఈ. స్త్రీ. సోమిందః: చూ, సోమిద.

అసన. సం. వి. ఆ. స్త్రీ. ఉసిరిక*: చూ, శ్రీఫలి. 1.

అసనము. సం. వి. అ. న. 1. చిమ్ముట: చూ, విక్షేపము.4; పుం 2. సర్జకము*: చూ, వేఁగిస.

అసభికుఁడు. సం.విణ. అ.పుం. ద్యూతకారుఁడు, జూదమాడించువాఁడు: చూ, పందెకాఁడు.

అసభ్యము. సం. విణ. (అ. ఆ. అ.) సభకుయోగ్యము కానిది

అసభ్యుఁడు. సం. వి అ. పుం సభాప్రాజ్యత లేనివాఁడు.

అసమంజసము. సం. విణ. బాగుకానిది: చూ, దుర్జాతము.

అసమగ్రము. సం. విణ, (అ. ఆ. అ.) పూర్ణము కానిది: చూ, అసంపూర్ణము.

అసమయము సం. విణ. (అ. ఆ. అ) సమయము తప్పినది: అకాలము, అనవసరము.

అసమర్థము. సం. వి. అ. పుం. 1. కావ్యదోషములలో నొకటి: చూ, కావ్యదోషములు; విణ. 2. సమర్థము కానిది; అం. 3. పదదోషములు పదునేడింటిలో నొకటి: చూ, పదదోషములు.

అసమర్థసమాసము. సం. వి. అ. పుం. సమాసములలో నొకటి. "తనుమధ్యాళియన్ మర్త్యః శివభాగవతో యది, అరిషడ్వర్గతి స్తస్య భయం నాస్తి కదాచన." భగవతీభక్తః-భాగవతః, శివేభాగవతః-శివభాగవతః, షణ్ణాంవర్గః-షడ్వర్గః, అరీణాంషడ్వర్గః-అరిషడ్వర్గః, సూర్యం నపశ్యంతీత్యసూర్యంపశ్యాః ఇత్యేవమాదయః. "ప్రాయికమేషాంకథితంప్రాధాన్యంచాతిమాలాదౌ, దన్తోష్ఠే ద్విత్రాదౌ నైతత్సూపప్రతీత్యాదౌ." మాలామతిక్రాన్తః-అతిమాలః, దన్తశ్చఓష్ఠశ్చతయోః సమాహారః- దన్తోష్ఠమ్, ద్వౌవాత్రయోవా-ద్విత్రాః, సూపస్యలేశః-సూపప్రతి, శాకస్యలేశః-శాకప్రతి.

అసమశరుఁడు. సం. వి. అ. పుం మరుఁడు, బేసితూపులవాఁడు: చూ, మన్మథుఁడు.

అసమాధానము. సం. వి. అ న. చూ, అసమ్మతి

అసమానము. సం విణ: చూ, అతులము.

అసమానాంతరరేఖలు పా. సమానాంతరముగా లేకఏటవాలుగా నుండురేఁఖలు. (క్రూకెడ్ లైన్.)

అసమాపకక్రియ. పా కార్యముపూర్ణముగముగియనట్లుచెప్పునది.ఉ.-హనుమంతుఁడు సముద్రము దాఁటిలంకఁజొచ్చి సీతఁజూచిమాటలాడి రాక్షసులఁజంపిలంకఁగాల్చి మరలివచ్చెను. మొ.

అసమీక్ష్యకారి. సం. విణ. (న్. ఈ. న్.) చక్కఁగాయోచింపక యేపనినేనిచేయువాఁడు: చూ, జాల్మఁడు.

అసమీక్ష్యకారిత్వము. సం. విణ. (అ. ఆ. అ.) చక్కఁగా యోచింపక యేపనినేని చేయుట,

అసము. వై. వి. 1.=యశః. కీర్తి: చూ, యశస్సు; దే. వి. 2. ప్రేమము: చూ, స్నేహము.1; 3. గర్వము. "చ. అసమున మీఁదెఱుంగక మహాగ్రహవృత్తిఁగడంగిచచ్చెఁబన్, బకులతోఁ

గూయి గాఁ జేనియె బాఁపఁడు." భాగ. విరా. 5, అ. 384: చూ, పాంకారము

అసముఁడు. సం. వి. అ పుం అద్వితీయుడు: చూ, బుద్ధుఁడు 1.

అసమేషువు. సం. వి. ఉ పుం. మదనుఁడు, బేసి తూపులజోదు: చూ, మన్మథుఁడు.

అసమోపమము. అం. అర్థదోషములు పదునెనిమిదింటిలో నొకటి: చూ, అర్థదోషములు.

అసమ్మతి సం. విణ 1. సమ్మతిలేనిది అనంగీకారము, అసమాధానము; (తె ప.):-ఏఅపటికము, ఒప్పమి

అసర. వై. వి.=అసుర. రక్కసుఁడు: చూ, రాక్షసుఁడు. 1.

అసరవేయు. దే. స క్రి. ఆలస్యము చేయు: చూ, తడయు.

అసరసంజె. వై. వి.=అసురసంధ్యా ప్రదోషకాలము, రాత్రియొక్క మొదలు: చూ, సాయంకాలము (రూ-అసరసంజె-అసరసంద)

అసరు. దే. వి. అకుపసరు. "పీ. ఒక్కనాఁడత్త పస్వి వెళ్లెల్లాటిదర్భ, గంటిఁగార యసరుగా తిన నర్తించె." భార. శల్య. 2, అ 160: చూ, పసరు. 2

అసలార. దే. క్రి. విణ. ఒప్పిదముగా: చూ, సరిగా.

అసలారు దే. అ క్రి. అతిశయిల్లు "ప్రియమసలారఁగ." భార. అను. 2, అ: చూ, ముమ్మరించు

అసలు. దే. వి. 1. పంకము: చూ, బురద; 2. మూలధనము: చూ, సంచి మొదలు

అసలుఁబుట్టువు. దే. వి. (అసలు + పుట్టువు) పంకజము, తామర *: చూ, పద్మము. 1.

అసలుకొను. దే. అ. క్రి: చూ, పంకిలమగు

అసలుపైకము. అం. పరిశాలింపఁజేయఁగూడనిపదునొకటింటిలో నొకటి: చూ, పరిశాలింపఁజేయఁగూడనిది

అసలుమినహాభూమి. పా. మినహాయింపఁబడి (పన్నులేని) నేల. (రూ-అసల్ మినహా భూమి)

అసవు సం. వి. ఉ పుం. ఉసులు, ప్రాణము: చూ, ప్రాణము. 6.

అసహత. సం. వి. అ. స్త్రీ. అసహనము, ఓర్వమి: చూ, నూడు. 1.

అసహనపడు. మి అ. క్రి. ఈర్ష్యపడు: చూ, నూడుకొను. 2.

అసహనము సం విణ. (అ. ఆ. అ.) : చూ, అసహత.

అసహనుఁడు. సం. వి. అ. పుం. 1 పగతుఁడు: చూ, శత్రువు. 1; విణ. 2. ఓర్వలేనివాఁడ : చూ, నూడుంకాఁడు.

అసహాయత. సం. వి. అ. పుం: చూ, దిక్కుమాలినతనము.

అసహాయశూరుఁడు. సం. వి. అ. పుం. సహాయములేకనే యుద్ధమందు నిపుణత్వముఁ గనఁబఱచువాఁడు: చూ, ఒంటరీఁడు. 1.

అసహాయుఁడు. సం విణ. (అ. ఆ. అ.) సహాయములేనివాఁడు: చూ, ఒంటరీఁడు. 2.

అసహిష్ణుఁడు సం. విణ ఉ రూ-అసహిష్ణువు: చూ, నూడుకాఁడు.

అసహిష్ణుత. సం. వి అ. పుం. ఓర్వలేమి: చూ, నూడు. 1.

అసహిష్ణువు. సం. విణ. ఉ : చూ, రూ- అసహిష్ణుఁడు.

అసహ్యత. సం. వి. అ. న. ఓకరింత : చూ, రోత. 2.

అసహ్యపడు. మి. అ. క్రి: చూ, రోతపడు.

అసహ్యము. సం. విణ. (అ. ఆ అ.) 1. సహింపఁగూడనిది: చూ, రోత. 2.

అసహ్యించు. సం. అ. క్రి: చూ, రోతపడు.

అసహ్యుఁడు. సం. వి. అ. పుం. 1. పగవాఁడు: చూ, శత్రువు 1; 2. రోఁతకలవాఁడు: చూ, రోఁతకాఁడు.

అసాంప్రదాయికము. సం. విణ. (అ. ఆ. అ.) సాంప్రదాయవిరుద్ధము, సాంకర్యమునొందినది.

అసాఁటు. దే. అవ్య. ప్రశంసనార్థకము, బళీ. రూ. వాసాదు. "క. బుధుల్, సాదనకాత్రివు రెల్లన, సాదన జేఁగ జెట్లఁదొడరి సాదన సేయుఁగా." రామా. 3, అ. 149. (పెద్దలయాజ్ఞను శిరసావహించుటయందువర్తించుట.): చూ, సెబాసు.

అసాధారణము. సం. విణ. (అ. ఆ. అ.) 1. సాధారణము కానిది; 2. ఎక్కువ ఆధిక్యతగలది; 3. మిక్కిలి శ్రేష్ఠమైనది; 4. అత్యుత్తమమైనది. (ఇట్లు అసామాన్యము.)

అసాధువు. సం. విణ. ఉ. సాధువుకానిది.

అసాధ్యత. సం. వి. అ. స. సాధ్యముకామి: చూ, అసాధ్యము.

అసాధ్యము. సం. విణ. (అ. ఆ. అ.) సాధ్యము కానిది: వి. అసంభావ్యత, అసాధ్యత, విణ. అసంభావ్యము.

అసాధ్యసన్నిపాతము. వై. హృద్దాహసన్ని, అంతకసన్ని, భగ్నసేత్రసన్ని, అభిన్యాసన్ని, కంఠకుబ్జసన్ని, రక్తష్ఠీవసన్ని, శీతాంగసన్ని యీయేడు నసాధ్యములు.

అసాధ్యాతిసారము. వై. మలము మిశ్రవర్ణముగ వెడలినను, తెల్లవర్ణముగ వెడలినను అధికముగ వెడలినను దుర్గంధమై వెలువడుచున్నను, కంపు సహింపరానిదిగానున్న నసాధ్యము.

అసామాన్యము. సం. విణ. (అ. ఆ. అ.). చూ, అసాధారణము.

అసారము. సం. విణ. (అ. ఆ. అ.) సారములేనిది. (దూది మొ.): చూ, ఫల్గువు. 2.

అసి. సం. వి. ఇ. పుం. 1. అస్త్రము, ముప్పదియంగుళములకు తక్కువగలకత్తి: చూ, రిష్టి. 2; అవ్య. 2. త్వమర్థకము, నీవనుట: చూ, త్వమ్; 3. ఒకానొక వాక్యాలంకారము: చూ, హేతువు. 2; ఆం. 4. ఆయుధములు ముప్పదిరెండింటిలో నొకటి చూ, బాణము. 1; దే. ఉప. (1) అల్పార్థకము. అసి, కోఁత, అసిగాయము. మొ.

అసిఁబోవు. దే. అ. క్రి. (అసి + పోవు) తప్పిపోవు. "సీ. అసిఁబోవు టెట్లు నాయసిఁబోవు మెకము లంజెంచునా చేయమ్ము చిలుకుటమ్ము" రామా. 2, అ: చూ, తప్పిపోవు.

అసిక్ని. సం. వి. ఈ. స్త్రీ. 1. శరీరాయాసముచే జీవనముచేయుచు అంతఃపురమునందు మెలఁగెడి ప్రాయపు ఆఁడుది.=నెఱయని వెండ్రుకలు గలది: చూ, స్త్రీ; 2. ఒకానొక యేఱు: చూ, నది.

అసిగాయము. మి. వి. కత్తితో నఱకుట.

అసిగ్లాడికము. సం. వి. అ. పుం. వెల్లుల్లి *: చూ, లశునము. (దీనిగడ్డయేమాత్రము.)

అసితపక్షము. సం. వి. అ. పుం. అమవసతోఁజేరి ముందుండు పదియేనుదినములు, కృష్ణపక్షము: చూ, పక్షము. 1.

అసితము. సం. వి. అ. పుం. 1. నీలము, నలుపు: చూ, వర్ణము. 6.

అసితాంగము. సం. వి. అ. పుం. 1. అస్త్రము, ముప్పదియంగుళములకు నెక్కువఁగలకత్తి: చూ, రిష్టి. 2; విణ. 2 నల్లని దేహముగలది.

అసితాననము. సం. వి. అ. న. కొండముచ్చు: చూ, వానరము.

అసితాద్రిశేఖరుఁడు. సం వి. అ. పుం బుద్ధభేదము: చూ, బుద్ధుఁడు. 1.

అసితార్చి. సం. వి. న్ పుం. అగ్ని: చూ, నిప్పు.

అసితుఁడు. సం. వి. అ. పుం 1. శని, చాయకొడుకు: చూ, గ్రహము. 1; విణ. 2. నల్లనివాఁడు: చూ, నల్లనయ్య.

అసిదంష్ట్రము. సం. వి. అ. పుం. మొసలి: చూ, మత్స్యము. 1.

అసిద్ధవిషయఫలోత్ప్రేక్ష. సం. వి. ఆ. స్త్రీ. అలంకారభేదము: చూ, హేతువు. 2.

అసిద్ధవిషయహేతూత్ప్రేక్ష. సం. వి. ఆ. స్త్రీ. —పై.—

అసిధరుఁడు. సం. వి. అ. పుం. 1 నైర్ఋతి: చూ, మూలకోఁడు; 2. కుబేరుఁడు: చూ, శ్రీదుఁడు

అసిధారావ్రతము. పా. ఉత్కృష్టమైన వ్రతము. సౌందర్యవతియు, యౌవనవతియు నైన స్త్రీతో నేకశయ్యయందు శయనించియు మెయందు మనసైనఁ బ్రసరింపకుండుట. (కత్తిమీఁదిసాము)

అసిధావకుఁడు. సం. వి. అ. పుం: చూ, సానలవాఁడు.

అసిధేనుక. సం. వి. ఆ. స్త్రీ. ఛురిక, చురకత్తి, మొలనుంచుకొను నాగకత్తి: చూ, ఋష్టి 2.

అసిపత్రకుఁడు సం. వి. అ. పుం. కత్తి యొఱ గలవాఁడు.

అసిపత్రము. సం. వి. అ. పుం. 1. నరకము లిరువదియొకటింటిలో నొకటి: చూ, నరకములు; 2 ఇక్షువు *: చూ, చెఱకు; 3. కత్తియొఱ, ఖడ్గాదులయొఱ: చూ, పరిత్యాకారము

అసిపత్రవనము. పా. "సీ. అసిపత్రవననిరయంబు సహస్రయోజనవిస్తరము పటుజ్వలనమయము, దానిమధ్యమున శీతలమును నసిరూపదళ ఫలకలితంబు బలవ దుగ్ర,సారమేయాయుత స్వనసంకులము నై పెనుపొంది యొక మహావనము వోలుచుఁ, బాపులాబహిరగ్నిఁ బడి తను వులు గాగిఁగ వనముదాయఁగఁ జేని యనిలవాతిని." "గీ. రాలు నారుల తాఁకునవ్రస్సియొడళు. లవనిఁగూలంగఁ గుక్కలుకవిసి కఱవ, బహువిధంబులనలుగుల పసుదురింకఁ, దప్తకుంభంబు దారుణత్వంబువినుము." మార్క. 2, ఆ. 58: చూ, అసిపత్రము. 1

అసిపుచ్ఛకము. సం. వి. అ. పుం. మత్స్యవిశేషము: చూ, మత్స్యము. 1.

అసిపుత్రి సం. వి. ఈ. స్త్రీ: చూ, అసిధేనుక.

అసిమి. దే. వి. ఎద్దుమీఁద వేసెడు గోనెసంచి కుట్టినసంచి, గోణి: చూ, సంచి

అసిమిగొల్లెన. దే. వి. ఇరుప్రక్కల వంపుగాశాల వలె పేర్పఱచిన చిన్నగుడారము. "గీ. మునుపుగా నేగి యసిమిగొల్లెనలు పన్ని" కళా. 8, ఆ. 42 చూ, గృహము. 1.

అసియాడు. దే. అ. క్రి. (అసి + ఆడు) వణఁకు: చూ, చలించు.

అసిగమ్మ. ద్వ. వి. ఒకానొక గ్రామదేవత: చూ, మహాలక్ష్మి. 3. (రూ- అసినమ్మ.)

అసిలేరు. వై. వి. = ఆశ్లేష. సప్పుఱుజొక్కు: చూ, నక్షత్రము. 1.

అసివారు. దే. వి. సవారిమార్గము: చూ, కసివారు.

అసివాలు. దే. వి. (అసి + వాలు.) సివారు. "సీ. ఎవ్వఁడు నలువకేరెక్కి యష్టాదశద్వీపాళిఁ సివాలు దిరిగెలీల." కాశీ. 4, ఆ. 195: చూ, విహారము. 1.

అసిహేతి. సం. విశే. ఇ. కత్తి యాయుధముగా గలది (వాఁడు: చూ, నైస్త్రింశికుఁడు.

అసీతికము. సం. విశే. అసీతిక్రీతవస్త్రము: చూ, వస్త్రము.

అసీత్యము. సం. విశే. —పై.—

అసుక్షణము. సం. వి. అ. న. అవమానము: చూ, పహేలనము.

అసుతీబలుఁడు. సం. వి. అ. పుం. 1. శూద్రిజాతి విశేషమునఁ బుట్టిన కన్యాపాలుఁడను వాఁడు. రూ- అసుతీవలుఁడు: చూ, సోమయాజి. 2; 2. రూ- అసుతీవలుఁడు. క్షత్రియ స్త్రీకి శూద్రునకుం బొడమి అయిదువిధముల సారాయిని అమ్మువాఁడు చూ, శుండికి.

అసుతీవలుఁడు. సం. వి. అ. పుం. —పై.—

**అసుధారణము.** సం. వి. అ. న. జీవనము: చూ, బ్రతుకు. 1.

**అసుధారిణి.** సం. వి. ఈ. స్త్రీ. మహామేద *: చూ, మహామేద.

**అసుర.** సం. వి. అ. స్త్రీ. 1 రాత్రి : చూ, రాత్రి; 2. బోగముదాన: చూ, వేశ్య; పుం 3.=అసర. రక్కసుఁడు: చూ, రాక్షసుఁడు. 1; 4 అసురకృత్యముచేత కుక్క కియ్యఁబడిన పేరు. గాంభీర్యమునుబట్టి కుక్కకియ్యఁబడిన పేరు. "అసురపోతులరా జేనుమంతిగాఁడు." స్వా. 4, ఆ. 32: చూ, సివఁగి 2.

**అసురము.** సం వి. అ. పుం. 1. ఏనుఁగు: చూ, హస్తి; 2. కాకోలము, మాలకాకి: చూ, వాయసము, 1.

**అసురసంధ్య.** సం. వి. ఆ. స్త్రీ.=అసరసంజ,అసరసంజె, అసరసందె. ప్రదోషకాలము, రక్కసులు తిరుగుకాలము: చూ. సాయంకాలము.

**అసురాహ్వయము.** సం. వి. అ. న. 1. కాంస్యము, కంచు: చూ, లోహము. 1; 2. మురామాంసియను గ్రంథిద్రవ్యము: చూ, రాజావర్తము.

**అసురి.** సం. వి. ఈ. స్త్రీ. 1. రూ-ఆసురి తుపము, నల్లావలు *: చూ, సర్షపము; (కూ్రసిఫరే కుటుంబములోనిది.) 2. అసురునిభార్య, రాక్షసాంగన: చూ, స్త్రీ.

**అసురుఁడు.** సం. వి. అ. పుం. 1. రక్కసుఁడు: చూ, రాక్షసుఁడు. 1; 2. సూరుఁడు: చూ, సూర్యుఁడు.

**అసురుసురగుట.** పా. ఆయాసపడుట. "వ. అసురుసురై యలంతినడు మల్లలనాథుఁగ." సారంగధర చరిత్రము.

**అసురుసురు.** దే. వి. శ్రమమునందగు ధ్వన్యనుకరణము "క. మసురుకొను జరభరంబున్న నసురుసురైయున్న మమ్మునడకించితివి." స్వా. 4, ఆ: చూ, హూహూ.

**అసుర్క్షణము.** సం. వి. అ. న. తెగడిక: చూ, వహేలనము.(రూ-అనూక్షణము- అనూర్క్షణము, అసుక్షణము.)

**అసువు.** సం. వి. ఉ. పుం రూ-అసవు.ఉసులు: చూ, ప్రాణము 6 (బ. అసువులు.)

**అసుహృత్తు.** సం. వి. త్. పుం. పగతుఁడు: చూ, శత్రువు 1.

**అసూక్షణము.** సం. వి. అ. న. తిరస్కారము. రూ- అసూర్క్షణము, అసుర్క్షణము : చూ, వహేలనము.

**అసూచ్యము.** పా. దృశ్యము,శ్రావ్యమునని ద్వివిధము.

**అసూర్క్షణము.** సం. వి. అ. న: చూ, రూ-అసూక్షణము.

**అసూయ.** సం. వి. ఆ. స్త్రీ. 1. మంచిగుణముగల దానియందు దోషము నారోపించుట: చూ, ఇడుగడ; 2. వ్యభిచారీభావభేదము: చూ, రసములు; విణ. 3 కోపము: చూ, కోపము; అం 4 హేయగుణములు పదునాలింటిలో నొకటి: చూ, హేయగుణములు; 5 సంచారీభావభేదములు ముప్పదిమూఁడింటిలో నొకటి: చూ, సంచారీభావభేదములు.

**అసూయాపరుఁడు.** సం. విణ. ఓర్వలేనివాఁడు: చూ, సూడుకాఁడు.

**అసూర్యంపశ్య.** సం. వి ఆ. స్త్రీ. 1. రాజభార్య, రాణి, దొరసాని : చూ, భార్య; 2. అంతఃపురస్త్రీ:చూ, స్త్రీ; విణ. 3.ఎండకన్నెఱుఁగనిది

**అసృక్కు.** సం. వి. క్. న మాంసమలము, నెత్తురు: చూ, రక్తము. 1.

**అసృగ్ధర.** సం. వి. ఆ. స్త్రీ. చర్మము : చూ. తోలు. 1.

అస్పృగ్వర. సం. వి. ఆ. స్త్రీ: చూ, అస్పృగ్ధర.

అసేవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) సేవింపఁగూడనిది.

అసైంధవము. సం. విణ. (అ. ఆ. అ.) 1. గుఱ్ఱములేనిది; 2. ఉప్పులేనిది; 3. సముద్రసంబంధము కానిది.

అసోగము. వై. వి. 1 =అశోకః. కంకేలిః: చూ, హేమపుష్పము; 2.=అశోకః కటుకరోహిణిః: చూ, శకులాదని. 1.

అసోమ. సం. వి. ఆ. స్త్రీ చంద్రుఁడులేని రాత్రి: చూ, రాత్రి.

అసౌమ్యము. సం. విణ. (అ. ఆ. అ.) తిన్నఁదనములేనిది

అసౌమ్యస్వరుఁడు. సం. వి. అ. పుం. చెవులకింపుఁగాని స్వరమును బలుకువాఁడు, అస్వరుఁడు: చూ, బొంగురుగొంతుకవాఁడు.

అస్కంధము. సం. వి. అ. పుం. మ్రానులేనిచెట్టు, తీఁగజాతిలోనగునది, దుంపజాతిలోనగునది. (భూమిలోని దుంపను మ్రానుగా వాడెదరు.): చూ, వృక్షము.



అస్కంధుఁడు. సం. వి. అ. పుం. బుజములు లేనివాఁడు.

అస్కాంతపదార్థములు. పా. సూదంటురాతిచే నాకర్షింపఁబడని వస్తువులు.

అస్ఖలితబ్రహ్మచారి. సం. వి. న. పుం. ముంజెత్రాడు లోనగువానిధరించి వేదముచదివిస్ఖాలిత్యము (లేక) వ్యభిచారదోషములేనిబ్రహ్మచర్యవ్రతమునందుండువాఁడు: చూ, బ్రహ్మచారి.

అస్ఖలితము. సం. విణ. (అ. ఆ. అ.) 1.వ్యభిచారదోషములేనిది; 2 పతివ్రతగనున్నది; 3 స్ఖలితములేనిది.

అస్తంగతత్వము. పా. సూర్యునితోఁగలసిన గ్రహములకు పేరు: చూ, గ్రహాగతులు.

అస్తంబము. సం. వి. అ. పుం. బోదెలేని చిన్నచెట్టు: చూ, వృక్షము. (చూ, అస్కంధము)

అస్తమనము. సం. వి. అ. పుం. అస్తమించుట: అస్తమయము, అస్తమానము. (తె.ప.):-క్రుంకు, క్రుంకుడు.

అస్తమయము. సం. వి. అ. పుం. —పై.— సాసం. 2, ఆ. 109.

అస్తమానము. సం. వి. అ. పుం 1. —పై.—; 2. (అ ప్ర) ఎల్లప్పుడు.

అస్తమించు. సం. అ. క్రి. 1.=అత్తమిల్లు. చెడు: చూ, నశించు; 2. కనఁబడకపోవు, క్రుంకు: చూ, నింగివడు.

అస్తమితము. సం.విణ.(అ. ఆ. అ.)అస్తమించినది

అస్తము. సం వి అ. పుం. 1 సూర్యుఁడు అస్తమించుకొండ: చూ, పర్వతము; విణ. 2. త్రోయఁబడినది: చూ, విద్ధము; 3. ముగిసినది: చూ, సమాప్తి. 1; 4 అదృశ్యము: చూ, కంచుమించు; వై. వి. (1)= అత్తము గెలలోనొకభాగము, (అరఁటిపండ్లఅత్తము.): చూ, గెల.(గ్రా.)



అస్తర వై. వి.=ఆస్తర. సంధాన వసనఖండము, గుడ్డకు జతగాఁ జేర్చి కుట్టిన వేఱొక గుడ్డ: చూ, మాసిక. 1. (రూ-అస్తరువు-ఆస్తర-ఆస్తరు.)

అస్తరువు. వై. వి.=—పై.—

అస్తరువేయు. వై. స. క్రి లోపల అస్తరుగుడ్డ మొ. వేయు.

అస్తాచలము. సం. వి. అ.పుం. సూర్యుఁడు అస్తమించు కొండ: చూ, పర్వతము.

అస్తాద్రి. సం. వి ఇ. పుం —పై.—

అస్తి సం. తిఙంతప్రతిరూపకావ్యయము. 1. కాలసామాన్యము: చూ, ఔను; 2. కలదు; 3. ఉన్నది; అం. 4. భావవికారము లయిదింటిలో నొకటి: చూ, భావవికారములు.

అస్తిక్షీర. సం. విణ. (అ. ఆ. అ.) పాలుగలది: చూ, క్షీరవతి.

అస్తిమంతుఁడు. సం. విణ. త్. ధనవంతుఁడు: చూ, సంపన్నుఁడు.

అస్తు. సం. అవ్య. 1. మేలు: చూ, శుభము 1; 2 కోపముచేత నంగీకరించుట. (అసధాతువు యొక్క లోట్ప్రథమైకవచనము. కానిమ్ము అనుట.); 3. అలాగే కానిమ్ము: చూ, తథా. 2; 4 దుఃఖముచేత నంగీకరించుట; 5. అవుఁగాక: (శ్రీరస్తు-శుభమస్తు-అవిఘ్నమస్తు- మహదైశ్వర్యాభివృద్ధిరస్తు- దిగ్విజయోస్తు-వంశాభివృద్ధిరస్తు ఇత్యాదులు.): చూ, సమ్మతి. 1.

అస్తుంకారము. సం. వి. అ పుం. ఇయ్యకోలు: చూ, సమ్మతి. 1.

అస్తేయము అం. సాత్త్వికగుణము లెనిమిదింటిలో నొకటి: చూ, సాత్త్వికగుణములు; 2 యోగయమాంగములు పదింటిలో నొకటి: చూ, యోగయమాంగములు (చూ, అంగము, 9 )

అస్తోకము సం. విణ (అ ఆ.అ ) స్తోకముకానిది (స్తోకము=అల్పము.)

అస్త్రకంటకము. సం. వి. అ. న. అమ్ము: చూ, బాణము. 1; హారావళి. 58. శ్లో.

అస్త్రజీవి. సం. వి. న్. పుం. పెక్కువిలుకాండ్రతోఁ బోరెడి యోధుఁడు: చూ, భటుఁడు.

అస్త్రజీవుఁడు. సం. వి. అ. పుం.—పై—

అస్త్రము. సం. వి. అ. న. 1 అమ్ము: చూ, బాణము 1; 2. ఖడ్గము, కత్తి: చూ, రిష్టి. 2; 3. చాపము, విల్లు: చూ, బాణము. 1; 4. యజ్ఞప్రయోజ్యమంత్రవిశేషము, గాయత్రి లోనగునది: చూ, మంత్రము. 1.

అస్త్రములు. అం. అశని (శుష్కాశని, ఆర్ద్రాశని.), అసిరత్నము, ఆగ్నేయాస్త్రము, ఐంద్రాస్త్రము (వజ్రాస్త్రము.), ఐషీకము, కంకణము, కంకాలము, కాందర్పము, కాపాలము, క్రౌంచాస్త్రము, గద (శిఖరిగద, మోదకీగద.), గంధర్వాస్త్రము, గాంధర్వాస్త్రము, చక్రము (దండచక్రము, కాలచక్రము, విష్ణుచక్రము.), తామసము, తేజఃప్రదము, తేజోపకర్షణము, త్వాష్ట్రికము, దమనము, దర్పము, నందనాస్త్రము, నారాయణాస్త్రము, పాశము (ధర్మపాశము, కాలపాశము, వరుణపాశము.), పైనాకాస్త్రము, పైశాచము, ప్రమథాస్త్రము, ప్రశమనము, ప్రస్వాపనము, బ్రహ్మశిరోస్త్రము, బ్రహ్మాస్త్రము, మానవాస్త్రము, మాయావంతము, ముసలము, మోహనము, మౌసలము, వాయువ్యాస్త్రము, వారుణాస్త్రము, విద్యాధరాస్త్రము, విలాపనము, శక్తి, శిఖరాస్త్రము, శిలేషు మానవాస్త్రము, శైవశూలము, శోషము, సంతాపనము, సంవర్తనము, సత్యాస్త్రము, సర్వమాయాదమనము, సుధామనము, సోమాస్త్రము, సౌమనస్యము, సౌరము, హయశిరము. (53.): చూ, బాణము. 1: చూ, శస్త్రములు: చూ, ముప్పదిరెండాయుధములు.

అస్త్రి. సం విణ. న్: చూ, విలుకాఁడు.

అస్థానసమాసము అం. వాక్యదోషములు ఇరువదినాలుగింటిలో నొకటి:చూ,వాక్యదోషములు.

అస్థాయము. సం. వి. అ. పుం మిక్కిలిలోఁతుగలది: చూ, లోఁతు. 2.

అస్థి. సం. వి. ఇ. న.=ఎముక: చూ, శల్యము.1.

అస్థిగతజ్వరలక్షణము. పా. అంతర్దాహము, శరీరము చేల్లగనుండుట, కుటిలమైనజ్వర మెప్పుడు విడువకుండుట, శరీరము చిక్కుట, తెల్లబాఱియుండుట, తృష, దగ్గుగలిగియుండుట, ఇవి అస్థిగతజ్వరలక్షణములు.

అస్థిపంజరము. సం. వి. అ. పుం. 1 మనుజునిలోనగువాని ఎముకలగూడు:చూ, శల్యము. 1. (స్కెలిటన్.)



ము. 1; 2; పక్కి—బొమికలగుంపు: చూ, శల్యము. 1.

అస్థిభక్షము. సం. వి. అ. పుం. కుక్క: చూ, శునకము.

అస్థిమాలి. సం. వి. ఇ. పుం. పుఱ్ఱెలతాలుపు: చూ, శివుఁడు.

అస్థిరత. సం. వి. అ. న. స్థిరత్వములేమి: చూ, అస్థిరము.

అస్థిరము. సం విశే. (అ. ఆ. అ.) స్థిరముకానిది. వి. అస్థిరత, విశే. అస్థైర్యము. (తెప) — అదువ. రూ-అద్దువ.

అస్థిరుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) ఎందును నిలుకడలేనివాఁడు: చూ, సంకుసుకుఁడు.

అస్థివిగ్రహుఁడు. సం. వి. అ. పుం. భృంగీశ్వరుఁడు: చూ, శలుఁడు.

అస్థిసంచయనము. పా. చచ్చినపిదప మంచిదినము చూచి ఎముకలు పోఁగుచేయుకర్మము చూ, సంచయనము.

అస్థిసంహారము. సం. వి. అ. న. నల్లేరు *: చూ, హస్తిశుండి.

అస్థిస్నేహము. సం. వి. అ. పుం. ఎముకలలోని క్రొవ్వు: చూ, మజ్జ. 2.

అస్థిహారుఁడు. సం. వి. అ. పుం. పాఁపతొడవుల వేలుపు: చూ, శివుఁడు.

అస్థ్యుపదేహిక. సం. వి. ఆ. స్త్రీ. చెట్టునతెట్టెఁ బెట్టు నల్లచీమ, ఉద్దీపకము: చూ, పిపీలిక.

అస్థైర్యము. సం. విశే. (అ. ఆ. అ.) : చూ, అస్థిరము.

అస్పష్టత. సం. వి. అ. న. స్పష్టముకానిది: చూ, రహస్యము.

అస్పష్టము. సం. విశే.—పై.—

అస్ఫుటము. సం. విశే.—పై.—

అస్ఫుటవాచ్యుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) వ్యక్తముకాకుండ మాటలాడువాఁడు: చూ, లోహాలుఁడు.

అస్పృజితుఁడు. సం. వి. త్రా. పుం. శుక్రుఁడు: చూ, గ్రహము. 1.

అస్పృశ. సం. వి. ఆ. స్త్రీ. 1. నీలి *: చూ, రంజని, 2. ఫల్లతీఁగ *. చూ, సోమలత.

అస్పృశి. సం. వి. ఈ. స్త్రీ. బృహతి *: చూ, వాఁకుడు.

అస్పృష్టి. సం. వి. ఇ. స్త్రీ. చావుమైల : చూ, మృతాశౌచము.

అస్మచ్ఛబ్దము. పా. ఒకశబ్దము. "నేను" అస్మచ్ఛబ్దవిశేషణము.

అస్మత్పృథకము. పా. నాయట్లు, మాయట్లు.

అస్మి. సం. అవ్య. అస్మదర్థమునువాచకము, నేనను.

అస్రపుఁడు. సం. వి. అ. పుం. నిర్రృతి : చూ, మూలవేలుఁడు.

అస్రము. సం. వి. అ. న. 1. రూ-అశ్రము. కన్నీరు: చూ, రోదనము. 2; 2. రూ-అస్రము. నెత్తురు: చూ, రక్తము 1; పుం. 3. కోణము, రెండుదిక్కులనడుము, మూల: చూ, విదిక్కు; 4. రూ-ఆస్రము. కేశము.

అస్రువు. సం. వి. ఉ. న. 1. రూ-అశ్రువు. కన్నీరు: చూ, రోదనము. 2, 2. నెత్తురు: చూ, రక్తము. 1; పుం. 3. క్లేశము, వ్యసనము: చూ, దుఃఖము.

అస్వాంతము. సం. వి. అ. పుం. 1. చావు: చూ, మరణము; 2. ఛుల్లి: చూ, ప్రొయ్యి.

అస్వచ్ఛందుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) ఒకరికి లోఁబడినవాఁడు: చూ, పరాధీనుఁడు.

అస్వతంత్రము. సం. విశే. (అ. ఆ. అ.) స్వతంత్రములేనిది. వి. అవగ్రహము.

అస్వతంత్రుఁడు. సం. వి. అ. పుం. స్వతంత్రములేనివాఁడు, గృహ్యకుఁడు: చూ, గృహ్యుఁడు.

అస్వపుట్. సం. వి. ష. పుం. కాకి: చూ, వాయసము. 1.

అస్వప్నుఁడు. సం. వి. అ. పుం. దేవుఁడు: చూ, వేలుపు.

అస్వరుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) చెవికింపు గాని కంఠస్వరముగలవాఁడు: చూ, బొంగు గొంతుకవాఁడు.

అస్వాధీనము. సం. విణ. (అ. ఆ. అ.) వశము కానిది: అవశము.

అస్వాధీనుఁడు. సం. వి. అ. పుం. స్వాతంత్ర్యము లేనివాఁడు.

అస్వాధ్యాయుఁడు. సం. వి. అ. పుం. వేదము చెప్పుకొనని బ్రాహ్మణుఁడు: చూ, నిరాకృతి.

అస్సుసు. దే. వి పరితాపానుకరణధ్వని : చూ, హూహూ. (రూ-అసురుసురు.)

అహమ్. సం. స. ద్. అస్మదర్థకము, నాశబ్దమున ప్రథమైకవచనము, ఏను: చూ, నేను.

అహఃకరుఁడు. సం. విణ. పుం. పగటిజ్యోతి: చూ, సూర్యుఁడు.

అహఃపతి. సం. వి. ఇ. పుం. —పై.—

అహఃప్రమాణము. పా. పగలుప్రొద్దుకట్టువిధము. ఉదా.—ఒకనాటి యుదయమునుండి 9¾ పాదచ్ఛాయలు వచ్చినవి. అప్పుడు ప్రొద్దెంతయెక్కినదో మనకుఁ దెలియవలెను.—

| | గ. | వి. |
|---|---|---|
| ఆనాటిఅహస్సు | 31 | 45 |
| లోవిధిగా తీసివేయవలసినది. | 26 | 30 |
| (31,45-26,30) = | 5 | 15 |
| (9¾ = 9-45) పయిపాద చ్ఛాయలు దీనితో గలుపవలెను. | 9 | 45 |
| (5,15 + 19,45) = | 15 | 0 |

అహస్సును మూఁడింట గుణింపవలెను గనుక అహస్సు. 31—45
3

(31, 45 × 3) = 95—15

దీనిని పయిసంఖ్యచే భాగింపవలెను.

95,15 ÷ 15 = 6-21 ప్రొద్దెక్కినది. సచ్ఛాయాహ్నమునకు యీలాగున యెడల యింత ప్రొద్దెక్కినదని చెప్పవలెను.

రాత్రిలు ప్రొద్దుకట్టువిధము. ఉదా.— ఒకనాటిరాత్రి వృశ్చిక లగ్నసత్తుత్రీయమైన ధను లగ్నమేమయినది, ఆలగ్నభుక్తియెంత, అప్పటికెంతరాత్రియాయెనని, చెప్పుము ఆనాడు సూర్యోదయలగ్నము తుల.

| | గ. | వి. |
|---|---|---|
| ఆసూర్యోదయలగ్నభుక్తి ... | 2 | 15 |
| ఆరోజు అహఃప్రమాణము | 28 | 30 |
| తులాలగ్నప్రమాణము. | 5 | 15 |

| | గ. | వి |
|---|---|---|
| ఈతులాలగ్నప్రమాణము... | 5 | 15 |
| లో సూర్యోదయతులాలగ్న భుక్తి తీసివేయవలెను. | 2 | 15 |
| ఇది సూర్యోదయతులాలగ్న శేషము. ... ... | 3 | 0 |

మిగత పగటిలగ్నముల ప్రమాణములను గలుపవలెను. ఏమనగ,

| | | |
|---|---|---|
| వృశ్చికము. | 5 | 30 |
| ధనుస్సు. | 5 | 30 |
| మకరము. | 5 | 15 |
| కుంభము. | 4 | 30 |
| మీనము. | 4 | 0 |
| ఇది పగటియా | 27 | 45 |

అలగ్నములప్రమాణములనుగలిపిన మొత్తము

**అహంత.** సం. వి. ఆ. స్త్రీ.—వై.—(నేనుట.)

**అహంపూర్వికా.** సం. వి. ఆ. స్త్రీ. యుద్ధాదుల యందు నేను ముందు నేను ముందని యొకరొక రి మీఱుట, అహమహమిక: చూ, తండోప తండము.

**అహంభావము.** సం. వి. అ. పుం. గర్వము, నేనను ట: చూ, అహంకారము.

**అహంయువు.** సం. విశే. ఉ: చూ, అహంకారి.

**అహతము.** సం. విశే. (అ. ఆ. అ.) రూ- అహత ము. క్రొత్తబట్ట, అనాహతము: చూ, వస్త్రము.

**అహమహమిక.** సం వి. ఆ. స్త్రీ.= అహమిక, హోమి క: చూ, అహంపూర్వికా.

**అహమించు.** సం. స. క్రి. గర్వించు. "చ. లెక్కకుఁ, మిగిలిన సేన నిక్కడహమించి వధించుటయె ట్లు." జై. 2, ఆ. చూ, అహంకరించు.

**అహము.** సం. వి. స్. న. రూ-అహస్సు: చూ, పగలు.

**అహమ్మతి.** సం. వి. ఇ. స్త్రీ. తెలివిలేనితనము చూ, మఱపు. 2.

**అహరహము.** సం. అవ్య. అజస్రము: చూ, సత తము. 2.

**అహర్గణము.** సం. వి. అ. పుం. నెల: చూ, మాసము. 1.

**అహర్పతి.** సం. వి. ఇ. పుం: చూ, రూ-అ హఃపతి.

**అహర్ముఖము.** సం. వి. అ. పుం. ప్రభాతము, తె ల్లవాఱునెడ: చూ, వేగుజాము.

**అహర్దానము.** సం. వి. అ. న. ఔర్ధ్వదైహికము, మృతులకొఱకుఁ జేయఁబడు పిండజలాదిదా నము: చూ, కర్మములు.

**అహల్య.** సం. వి. ఆ. స్త్రీ. 1. గౌతమునిభార్య: చూ, భార్య; అం. 2. కన్యకలయిదుగురిలో నొకతె: చూ, కన్యకలు.

**అహవము.** సం. వి. అ. న. రూ-ఆహవనము, ఆహ వము. జగడము: చూ, యుద్ధము.

**అహస్సు.** సం. వి. స్. న. రూ-అహము: చూ, పగలు.

**అహస్కరుఁడు.** సం. వి. అ. పుం. పగటిజోతి చూ, సూర్యుఁడు.

**అహహా.** సం. అవ్య. 1. అద్భుతము: చూ, వింత. 1; 2. ఖేదము చూ, దుఃఖము; 3. హర్షము: చూ, సంతోషము; 4. ఊఱట చూ, ప్రశ్న యము, వై. అవ్య. (1)=అహో. ఆశ్చర్యార్థ కము, ఔర. చూ, వింత. 1.(రూ-అహో.)

**అహా.** చూ, రూ-అహహా.—వై.—

**అహో.** వై. అవ్య. ఆశ్చర్యార్థకము, ఔర. చూ, వింత. 1; పాంచా. 1, ఆ. 38.

**అహోరె.** ద్వి. వై. అవ్య.—వై.—(రూ-అహోరే.)

**అహోరే:** చూ, రూ-అహోరె.

**అహార్యము.** సం. వి. అ. పుం. 1. కొండ: చూ, పర్వతము; విశే. 2. దోఁచఁదగనిది; 3. స్థిరమైనది.

**అహి.** సం. వి. ఇ. పుం. 1. పాము: చూ, సర్ప ము; 2. వృత్రాసురుఁడు: చూ, వృత్రుఁడు; 3. వజ్రాయుధము: చూ, బాణము. 1; 4. న క్షత్రభేదము: చూ, నక్షత్రము. 1; 5. పగ తుఁడు చూ, శత్రువు. 1.

**అహింస.** సం. వి. ఆ. స్త్రీ. 1. హింసచేయకుండు ట: చూ, అక్షతలు; 2. సాత్త్వికగుణము లెని మిదింటిలో నొకటి: చూ, సాత్త్వికగుణములు; 3. యోగయమాంగములు పదింటిలో నొకటి. చూ, అంగము. 9; 5. సుజ్ఞానదాయకము లు పదునాలుగింటిలో నొకటి: చూ, సుజ్ఞాన దాయకములు; 6. రాజలక్షణము లేడింటిలో నొకటి: చూ, రాజలక్షణములు.

**అహింసావ్రతము.** అం. బౌద్ధధర్మములలో నొక టి: చూ, బౌద్ధధర్మములు.

అహింసాస్వరూపము. పా. "తే. హింసచేయనివాఁడు లేఁడిజ్జగమున, నొక్కఁడైనను దమ తను వోపినట్లు, హింస తెలుపున కడగద్దియేఁగవల యు, నదియ చూవె యహింసనానతిశయిల్లు" భాగ. అర. ౯, అ. ౯౮.

అహికజ్వరలక్షణము. పా. శైత్యము, పులకరింపు, దగ్గు, దాహము, తాపము, తలనొప్పి, కడుపు నొప్పి, నిద్ర, కన్నులుపచ్చన, శరీరము తెల్లన, గోళ్ళకు రెప్పలకు రక్తహీనము, విరోచనములు, కీళ్ళనొప్పులు, అరికాళ్ళు అరిచేతులు నొప్పులు. వై.

అహికజ్వరనామములు. పా. ఏకాహికజ్వరము, ద్వ్యాహికజ్వరము, త్ర్యాహికజ్వరము, చాతుర్థికజ్వరము, పంచాహికజ్వరము, అర్ధరాత్రిజ్వరము, పాక్షికజ్వరము, మాసికజ్వరము. ఈయ నిమిదింటితో వాతపిత్త శ్లేష్మజ్వరాలు చేరిన యెడల అహికజ్వరమని పేరు.

అహికేసరము. సం. వి. అ. పుం. నాగకింజల్కము *: చూ, నాగకేసరము.

అహిచ్ఛత్రి. అం. దేశములు యేబదియాఱింటిలో నొకటి: చూ, దేశములు.

అహిచ్ఛత్రము. సం. వి. అ. న. చూ, పుట్టగొడుగు *.

అహిజిహ్విక. సం వి. ఆ. స్త్రీ. పిల్లపీఁచగ *: చూ, శతమూలి. (కన్న-దొడ్డఆపాది.)

అహితము. సం. విణ. (అ. ఆ. అ.) హితవుకానిది. (తసిల్ ప్రత్యయాంతమయిన అవ్యయమగు నప్పుడు శత్రువునుంచి పామునుంచి అను అర్థము.) చూ, కనరు.

అహితాగ్ని. సం. వి. ఇ. పుం. అగ్నిచిత్తు, అగ్ని చయనము చేసినవాఁడు: చూ, గాతువు. 4.

అహితుండికుఁడు. సం. వి. అ. పుం. పాములవాఁడు. చూ, వ్యాళగ్రాహి.

అహితుఁడు. సం. వి. అ. పుం. పగతుఁడు. చూ, శత్రువు. 1.

అహిదంష్ట్రి. సం. వి. ఈ. స్త్రీ. తేలుకొండి * చూ, వృశ్చికము. 2.

అహిద్విషము. సం. వి. అ. న. పగినెమిలి. చూ, మయూరము. 1.

అహిద్విషుఁడు. సం. వి. ష్. పుం. 1. గరుత్మంతుఁడు: చూ, హరివాహనుఁడు; 2. ఇంద్రుఁడు: చూ, వేలుపుఱేఁడు.

అహిపతి. సం. వి. ఇ. పుం. పాఁపఱేఁడ చూ, సర్పము.

అహిపుత్రకము. సం. వి. అ. న. నౌకావిశేషము, తరాలువు చూ, దోనె. 1.

అహిఫేనము. సం. వి. అ. న. 1. అభిని, అఫేనము చూ, నల్లమందు; 2. చిలుము: చూ, విసము. 1.

అహిభయము. సం. వి. అ. న. రాజునకు పుత్రదాయాదిప్రభృతి స్వపక్షజనకృతమైన భయము. (స్వపక్షము నారేడ్వురు.—మూలబలము, మిత్రబలము, సమాశ్రితుఁడు, సంబంధజుఁడు, కార్యసముద్భవుఁడు, భృత్యుఁడు, ఉపకారగృహీతుఁడు.)

అహిభుక్కు. సం. వి జ్. పుం. గరుత్మంతుఁడు. చూ, హరివాహనుఁడు; 2. నెమిలి: చూ, మయూరము. 1.

అహిభూషణుఁడు. సం. వి. అ. పుం. పాఁపతొడవులవేలుపు చూ, శివుఁడు.

అహిమాకరి. సం. వి. న్. పుం. కంపుగుమ్మ *. చూ, విట్ఖదిరము.

అహిమారకము. సం. వి. అ. పుం. తుమ్మ *. చూ, విస్ఫదిరము.

అహిమేదము. సం. వి. అ. పుం: చూ, అహిమాకరి *.

అహిరూపధృత్. సం. వి. త్. న. సర్పాకృతముక

ము, సాముపాగు. చూ, సీదగము. 3.

అహిర్బుధ్న. సం. వి. ఈ. స్త్రీ. ఉత్తరాభాద్రపద నక్షత్రము. చూ, నక్షత్రము.1.

అహిర్బుధ్న్యుఁడు. సం. వి. అ. పుం. చూ, అహిభూషణుఁడు.

అహి[illegible]హా. సం. వి. ఆ. స్త్రీ. నల్లవిష్ణుక్రాంత ము *: చూ, విష్ణుక్రాంత.

అహిహా. సం. వి. హ. పుం. 1. ఇంద్రుఁడు: చూ, వేలుపుఱేఁడు, 2. పామును జంపిన వాఁడు, 3. శత్రువును గొట్టినవాఁడు.

అహీంద్రుఁడు. సం. వి. అ. పుం. 1. నాగఱేఁడు, సర్పరాజు, శేషుఁడు: చూ, సర్పము; విణ. 2. శత్రుశ్రేష్ఠుఁడు: చూ, శత్రువు. 1.

అహీనుఁడు. సం. విణ. 1. హీనుఁడు కానివాఁడు, 2. పాములలో శ్రేష్ఠుఁడు, వాసుకి: చూ, సర్పము.

అహీరణి. సం. వి. ఇ. పుం. ద్విముఖాహి, రెండు తలలపాము: చూ, సర్పము.

అహుతము. సం. విణ. (అ. ఆ. అ.) హోమము చేయఁబడినది. రూ-ఆహుతము.

అహుతి. సం. వి. ఈ. స్త్రీ. 1. హోమాభావము; 2. పిలువకయుండుట.

అహృష్టము. సం. విణ. (అ. ఆ. అ.) సంతసము లేనిది. అసంతుష్టి.

అహేతుకము. సం. విణ. (అ. ఆ. అ.) హేతువులేనిది: చూ, నిర్హేతుకము.

అహేతువు. సం. వి. ఉ. స్త్రీ. రూ-ఆహేతువు. పిల్లపీచర *: చూ, శతమూలి. (కిన్న-దొడ్డఆసాది.)

అహైన్యము. సం. వి. అ. న. కొఱతలేకయుండుట.

అహో. సం. అవ్య. 1. ఆశ్చర్యార్థకము, ఓహో. చూ, వింత. 1; 2. వికల్పార్థకము, ఉతాహో: చూ, యద్వా; 3. విషాదము. రూ-అహో: చూ, దుఃఖము; 4. తిరస్కరించుట. చూ, వహేళనము; 5. కృప: చూ, వాత్సల్యము.

అహోపురుషిక. సం. వి. ఆ. స్త్రీ. రూ-అహోపౌరుషిక, ఆహోపురుషిక, ఆహోపౌరుషిక. గర్వముచేఁగలిగెడి ఆత్మగౌరవము.

అహోపౌరుషిక. సం. వి. ఆ. స్త్రీ.—పై.—

అహోబత. సం. వి. అ. న, అవ్య. 1. కనికరము: చూ, దయ; 2. వగ: చూ, దుఃఖము; 3. పిలుపు: చూ, సంబోధనము; 4. అమృతము: చూ, సుధ. 1, 5. సంతసము: చూ, సంతోషము.

అహోబలము. అం. క్షేత్రములు యిరువదినాలుగింటిలో నొకటి: చూ, క్షేత్రములు.

అహోరాత్రము. సం. వి. అ. పుం. 1. రాత్రి పగలున్ను, ముప్పదిముహూర్తముల కాలము, రేఁబగలు: చూ, హోర. 1, 2. మనుష్యుల యొక్క మాసము పితరులకొక్క యహోరాత్రము, పితృసంబంధమైన యహోరాత్రము.

అహౌత్రము. సం. వి. అ. న. హోతయనువాఁడు చేయుక్రియ హౌత్రము అదికానిది.

అహ్నాయము. సం. అవ్య. శీఘ్రముగా: చూ, వేగము. 3.

అహ్రీకుఁడు. సం. వి. అ. పుం. బౌద్ధుఁడు, బౌద్ధుని పేరు: చూ, బుద్ధుఁడు. 1.

అళక. సం. వి. ఆ. స్త్రీ. రూ-అలక. కుబేరుని పట్టణము: చూ, దేశము.

అళకము. సం. వి. అ. పుం. రూ-అలకము, అళికము. ముంగురులు: చూ, వెండ్రుక. 1. (బ. అళకలు.)

అళఁది. వై. వి.=హరిద్రా. పచ్చదనము: చూ, వర్ణము. 6.

అళము. దే. వి. 1. ఉప్పుపంటఁబెట్టెడియేఁబదిపాదులకొలఁది నేల: చూ, భూమి. 1; 2. ఉప్పు అమ్మెడుచోటు: చూ, దుకాణము.

**అళిఘారతి.** ద్వ. వి. ఆరాత్రికావిశేషము: చూ, తద్వి.—ఏకాదశారతి, కుంభారతి, గరుడారతి, పంచారతి, పురుషమృగారతి.

**అళాకు.** దే. వి. పడికి ఆళాకులు ఎనిమిది. 1/8 చూ, అలాకు. 2.

**అళి.** సం. వి. ఇ. న్, పుం. తుమ్మెద: చూ, భ్రమరము, 2. తేలు: చూ, వృశ్చికము. 1; 3. కల్లు: చూ, సుర. 1, 4. నిర్మలాంతఃకరణుఁడు; ఇ. స్త్రీ. 5. రూ-ఆళి. బారు: చూ, పంక్తి. 1; 6. చెలికత్తియ: చూ, సఖి. 1; 7. రూ-ఆళి. ఏఱులోనగువాని నీళ్ళు వెలికిఁబోవక కట్టెడుకట్టు: చూ, సేతువు. 1; 8. నొసటిరెమ్ముక, శంఖము చూ, శల్యపంజరము.

**అళింజరము.** సం. వి. అ. పుం. రూ-అలింజరము. పెద్దబాన: చూ, పాత్రము. 6.

**అళిందము.** సం. వి. అ. పుం. రూ-ఆళిందము. తలవాకిటి ప్రక్కనుండెడు చిన్నగది. వాకిలి తొట్టికట్టునకు వెలుపలనుండు తలవాకిలిముందఱి చావడి. కొన్నిచోట్ల నడవా యనివాడుక: చూ, హాహారము.

**అళికము.** సం. వి. అ. న: చూ, రూ-అళీకము.

**అళిగర్దము.** సం. వి. అ. పుం. 1. నీరుపాము: చూ, సర్పము; 2. నల్లత్రాఁచు: చూ, సర్పము.

**అళిది.** వై. వి. 1. చూ, రూ-అళిఁది. (రూ-హాళిది.) 2. తెల్లతెగడ *: చూ, సర్వానుభూతి.

**అళిని.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడుతుమ్మెద: చూ, భ్రమరము. 1; 2. ఆఁడుతేలు: చూ, వృశ్చికము. 1.

**అళిపకము.** సం. వి. అ. పుం. 1. తుమ్మెద: చూ, భ్రమరము. 1; 2. కోయిల: చూ, పికము.

**అళిపకుఁడు.** సం. వి. అ. పుం. పల్లవుఁడు, లంజెకాఁడు: చూ, విటుఁడు.

**అళిమకము.** సం. వి. అ. పుం: చూ, రూ-అళిముకము.

**అళిసుహృత్తు.** సం. వి. ద్. పుం. కుందము, మొల్ల *: చూ, మల్లె. 1.

**అళీకము.** సం. వి. అ. న. 1. ప్రియముకానిది: చూ, వ్యళీకము. 1; 2. రూ-అలీకము, నుదురు: చూ, లలాటము; 3. అసత్యపుపలుకు: చూ, వితథము; 4. ఆకాశము: చూ, మిన్ను; 5. అమ్ము: చూ, బాణము. 1; 6. కుక్షైధనము.

**అళుకరి.** దే. వి. భయశీలుఁడు: చూ, వెఱపరి.

**అళుకు.** దే. వి. 1. వెఱపు: చూ, భయము. 1; అ. క్రి. 2. బెదరు. చూ, భయపడు. (రూ-అలుకు, అలుక్కు, అళుక్కు.)

## ఆ

**ఆ.** 1. సంస్కృత, ప్రాకృత తెలుఁగు, ఆంధ్రభాషలవర్ణంబులందలి యచ్చులలోని రెండవ యక్షరము. "సీ. ఆదులు పదియారు అనచ్చులు" అప్ప. 2, ఆ. 6. "క. మొదలనకారాద్యచ్చులు, పదియారు" అప్ప. 2, ఆ. 20: చూ, వర్ణము. 1; సం. ఉప. 2. ఇదియొకపదమునకు ముందువచ్చునపుడు 'వఱకు' అనునర్థమునిచ్చుచున్నది. (ఉదా.—ఆచంద్రతారకము=చంద్రతారకలున్నవఱకు, ఆబాలగోపాలము=బాలగోపాలురవఱకు ఇట్లుఆకంఠము, ఆపండాలము. మొ.); 2. ప్రగృహ్యసంజ్ఞకమైనఅవ్యయము, 3. స్మరణమును తెలుపును. "ఆ ఏవంకిలతత్." చూ, స్మృతి. 1; 4. మునుపు చెప్పిన వాక్యార్థమును సూచించుటను తెలుపును. లేక వాక్యపూరణమందుఁగాని వర్తించును. "ఆ ఏవంమన్యసే-ఆ అద్యస్వాద్విష్టంభోజనంలబ్ధమ్." అనిప్రగృహ్యసంజ్ఞమైనందుకు "అఏవం అనుదిక్కున సంధి లేక స్వభావమునునుండుట ప్రయోజనము

అవ్య. 5. ఆక్షేపించుటను తెలుపును: చూ, నింద. 1; 6. అద్భుతమును తెలుపును: చూ, వింత. 1; 7. హర్షమును తెలుపును: చూ, సంతోషము; 8. ఊహించుటయందు వర్తించును: చూ, గోవచన; 9. పీడయందువర్తించును: చూ, దుఃఖము; 10. సంతాపమునందు వర్తించును: చూ, సంతాపము; 11. శాంతమునందు వర్తించును: చూ, శమము. 1; 12. వైరాగ్యమునందువర్తించును;చూ,వైరాగ్యము; 13. నీచకర్మలయందు వర్తించును; 14. ప్రభావమునందు వర్తించును, కోశబలమువలనఁగలిగిన తేజమును తెలుపును: చూ, ప్రభావము. 1; 15. సంబుద్ధియందు వర్తించును: చూ, సంబోధనము; 16. ప్రయోగమునందువర్తించును: చూ, ప్రయోగము. 1; 17. ముఖ్యమనుటయందు వర్తించును: చూ, శ్రైష్ఠ్యము; 18.వితర్కమందువర్తించును,సందేహము: చూ, సంశయము;19.కోపమును దెలుపును: చూ,రోషము, 20. అలాగుండుటను దెలుపును, అప్రకారము: చూ, తథా. 2; పుం. 21. చోటు: చూ, స్థానము. 1; 22. సత్తువ: చూ, శక్తి. 1; 23. తాపము: చూ, పరితాపము; 24. బ్రహ్మ, నలువ: చూ, బ్రహ్మ. 1; 25. ఘటము, కడవ: చూ, భాండము. 3; 26. బరువు: చూ, భారము. 1; 27. పరితాపము: చూ, సంతాపము; 28. అర్చన, పూజ: చూ, సపర్య; 29. మంగళసూత్రము: చూ, బొట్టుదారము; 30. తాత, తండ్రితండ్రి: చూ, పితామహుఁడు. 1; 31. అభిప్రాయము, తలఁపు: చూ, విషయము. 4 (దీనిసంస్కృతరూపము అః.)దే. స. (1) ముందుచెప్పఁబడిన దానిఁదెలుపును. "అవరము."; (2) ఎదుటుదానిఁదెలుపును. "అవాని కృపలేక యేతియుఁగలుగదు": చూ, ముందఱ. 1; (3). ఉద్దేశింపఁబడిన దానిఁదెలుపును. "క. ఏకథల యందుఁబుణ్యశ్లోకుఁడు హరిచెప్పఁబడును సూరిజనులచే, నాకథలు పుణ్యకథలని, యాకర్ణింపుదురు పెద్దలతిహర్షమునన్." భాగ. 8, స్కం: చూ, గోవచన; అవ్య.(4) అంగీకారమును తెలుపును. "మ. అరయన్ శూరుఁడు బభ్రువాహనుఁడు శాఁడా పెట్టు ముక్తామణుల్" జై. 7, ఆ. 151: చూ, సమ్మతి. 1; (5) ఆశ్చర్యార్థకము "చ. మదగజవైరివంటి నడుమాకమలంబులవంటి కన్నులా, యదునకళాంకువంటి మొగమాముకురంబుల వంటి చెక్కులా, మదనుని వంటి చక్కఁదనమామధురాధర వాని రూపునా,హృదయపటంబునందు లిఖియించిన కైవడిగాననయ్యెడిన్." అని. 2, ఆ: చూ, వింత. 1; (6) ప్రశ్నార్థకము."ఉ. అస్త్రశస్త్రవిద్యానిపుణుండు క్రీడిసుఖియా" భార. ఉద్యో. 3, ఆ: చూ, ప్రశ్నము; (7) ప్రార్థనార్థకము. "అనఘూదినవలతుఁజెప్పుమా." ఉ, హరి. 2, ఆ: చూ, ప్రార్థన; (8) వ్యతిరేకార్థకము. "ఉ. ఇన్నిరో, యావసుదేవసూను సరియాయితఁడు." ఉ, హరి. 3, ఆ:ఎ,ఏ; (9) ఎదుటఁగలదానిఁదెలుపును. "అయిల్లు." "ఆకథలు" "వాఁడా; వాఁడున్నాఁడా; చెప్పుమా కమలముల వంటి కన్నులా." ఇత్యాదులు.

ఆమ్. సం. అవ్య. 1. మాబాగు, స్వయమంగీకారము, అంగీకారార్థకము: చూ, సమ్మతి. 1, 2. స్మరణమందువర్తించును: చూ, స్మృతి. 1; 3. నిశ్చయమును దెలుపును: చూ, నిశ్చయము.

ఆఙ్. సం. అవ్య. 1. కొంచెమును దెలుపును: చూ స్వల్పము; 2. మొదలుకొని అంతటానున్ను: చూ, అభివ్యాప్తి; 3. ఉద్గమము, పైకివచ్చుట: చూ, పుట్టుక; 4. గ్రహణము, పుచ్చుకొనుట: చూ, ప్రతిగ్రహము. 1; 5. కోపగించుట:చూ, రోషము; 6. కౌఁగిలించుట:

చూ, సంశ్లేషము; 7. తిట్టుట: చూ, శాపము. 1; 8. కోరుట : చూ, వాంఛ. 1; 9. తదేకశరణత్వము, అవష్టంభము: చూ, స్తంభనము. 1; 10. కాలముగడపుట: చూ, కాలయాపనము; 11. ఇష్టమైనవస్తువును పొందుటయందు వేగిరపడుట, ఉత్కంఠ: చూ, తహతహ; 12. దగ్గఱ : చూ, సమీపము. 1; 13. పగ: చూ, విరోధము. 1; 14. ఆవాపము: చూ, విత్తుట; 15. అడ్డగించుట: చూ, నిరోధము. 1; 16. మోసము: చూ, వంచన; 17. కట్టుట: చూ, బంధము. 1; 18. చంపుట: చూ, వధము; 19. మునక: చూ, స్నానము. 1; 20. హద్దు: చూ, సీమ. 1; 21. వాడుక: చూ, స్వభావము; 22. చూచుట: చూ, లక్షణము. 3; 23. ఆలోచించుట: చూ, యోచన; 24. శాస్త్రజ్ఞానము: చూ, బుద్ధి; 25. తెలియఁజేయుట: చూ, జ్ఞాపనము; 26. పరాధీనము: చూ, పారతంత్ర్యము; 27. త్యాగము: చూ, వితరణము; 28. ఉత్సవము: చూ, సెలవు; 29. అలంకారము: చూ, భూషణము. 2; 30. ఒకరితోనొకరుమాటలాడుట, సంభాషణము: చూ, మాట. 1; 31. చిత్తరువు వ్రాయుట: చూ, చిత్తరువు; 32. ఎదురు: చూ, ముందఱ. 1; 33. ఆక్రమించుట : చూ, పురి. 4; 34. జీవనోపాయము: చూ, వృత్తి 4; 35. మహాఅర్థకము, చీటికి మాటికి: చూ, శశ్వత్తు; 36. నివృత్తి: చూ, మానుట; 37. పొందించుట: చూ, ప్రాపణము; 38. అంగీకారము: చూ, సమ్మతి. 1; 39. మఱుపు: చూ, విస్మృతి; 40. నమ్మిక : చూ, విశ్వాసము; 41. దానితోకూడా, అభివిధి; 42. ఉద్యోగము, వ్యాపారము: చూ, యత్నము; 43. తొట్రుపాటు: చూ, స్ఖలనము. 2; 44. భోజనము: చూ, సాపాటు; 45. పిలుచుట: చూ, సంబోధనము; 46. కప్పుట, అడ్డపాటు: చూ, వ్యవధానము. 3; 47. అధ్మ: చూ, పూరించుట; 48. సత్కారము, పూజ : చూ, సపర్య; 49. బడలిక: చూ, శ్రమము. 1; 50. ఉక్తి: చూ, మాట. 1; 51. పీడ: చూ, దుఃఖము; 52. అర్మిలి: చూ, వాత్సల్యము; 53. కూడఁబెట్టుట: చూ, సంచయము. 2.

ఆంక్షు. వా. బహిష్కారము, అపాంక్తేయునిగాఁ జేయుట: చూ, వెలి. 2; పా. 2. శాసించుట.

ఆంగము. సం. వి. అ. పుం. కోమలమగుఅంగము. "అంగమాంగంతు కోమలమ్." త్రి, శే. మను. 136: చూ, శరీరము.

ఆంగలదేశము. మి. వి. ఇంగ్లాండుదేశము: చూ, దేశము. (రూ-ఆంగ్లదేశము.)

ఆంగలేయులు. పా. ఇంగ్లీషువారు. (రూ-ఆంగిలేయులు-ఆంగ్లేయులు.)

ఆంగారము. సం. వి. అ. న: చూ, రూ-అంగారము 1, 2.

ఆంగిక. సం. వి. ఆ. స్త్రీ=అంగీ : చూ, రూ-అంగిక; పా. 2. అభినయవిశేషము: చూ, అభినయము.

ఆంగికము. సం. విశే. (అ. ఆ. అ.) అంగముచే తఁగలిగినది, కనుబొమ లెగురవేయుటలోను గాఁగలది. (రూ-అంగికము.): చూ, వ్యంజకము. 1

ఆంగిరసస్మృతి. అం. మూలస్మృతులిరువదింటిలో నొకటి: చూ, స్మృతులు.

ఆంగిరసుఁడు. సం. వి. అ. పుం. వేల్పుటొజ్జ: చూ, బృహస్పతి. (రూ-ఆంగీరసుఁడు.)

ఆంగిలేయులు. పా: చూ, ఆంగలేయులు.

ఆంగీరస. సం. వి. అ. పుం. 1. ప్రభవాది యఱువది సంవత్సరములలో నొకటి: చూ, సంవత్సరములు; 2. పుష్యమీనక్షత్రము: చూ, నక్షత్రము. 1.

ఆంగీరసుఁడు. సం. వి. అ. పుం: చూ, రూ-ఆం

గిరసుఁడు.

అంగ్లేయులు. పా: చూ, అంగరేయులు. "ఉ. న్యాయముదప్పి యన్యులధనంబులఁ గైకొన గర్వకారణ న్యాయపుమాటలాడుచు మహోద్భుత వస్తువులన్ రచింతుర, న్యాయపు దండనంబుఁ మహోగ్రమైనను జేయరేమియుఁ, న్యాయము గాగ్రహింపుమి గుణాఢ్యత నే కడుహాని కోట్లవో."

అంజనము. సం. వి. అ. న. 1. కాటుక. రూ-అంజనము: చూ, చోఁడు; విణ. 2. కాటుక సంబంధమైనది.

అంజనేయుఁడు. సం. వి. అ. పుం.=అనుమఁడు హనుమంతుఁడు, అంజనాదేవి కొడుకు. చూ, వానరము.

అండు్రి. దే. వి. ఇ. 1. భార్యావాచకము; 2. స్త్రీవాచకము. "పేరటాండు్రి, ఇల్లాండ్రు." వా.

అంతరతలము. పా. నేలయందలి మంటిరేణువుల యుపరితలముయొక్క మొత్తపు విస్తీర్ణము. (ఇంటర్నల్ సర్ఫేస్.)

అంతరము. అం. కొచములు రెండింటిలో నొకటి: చూ, కొచములు.

అంతరిక్షము. సం. విణ. (అ. ఆ. అ.) అంతరిక్షమువలనఁ గలిగినది. రూ-అంతరిక్షము: చూ, విష్ణు.

అంతర్గతము. సం. వి. అ. న. ఆకాతలము, తలఁపు: చూ, విషయము, 4.

అంత్రిటీక. అం. విసరులు పదునాలుగింటిలో నొకటి: చూ, విసరులు

అంత్రము. సం. వి. అ. న. రూ- అంత్రము: చూ, ప్రేగు.

అంత్రసమావృతము. సం. వి. అ. పుం. బలుకు క్కుటము, సిరకోడి: చూ, క్రుంబా.

అందోళనము సం. వి. అ. న. 1. ఊఁగుటమూ, ఊఁగులాటు; పుం. 2.= అందలము : చూ, అందోళము.

అందోళము. సం. వి. అ. పుం.=అందలము. పాక్కముల మఱుఁగుశేని పల్లకి. (సవారియని కొందఱు): చూ, పాలకి,

అందోళించు సం. అ క్రి. ఊఁగు : చూ, ప్రేలాడు.

అందోళిక. సం. వి. అ. స్త్రీ.=అందలము: చూ, అందోళము.

అందోళితము. సం విణ. (అ. ఆ. అ.) ఊఁచఁబడినది: చూ, ప్రేంఖితము,

అంధకము. సం. వి. అ. న. 1 పాతాళలోకము: చూ, లోకము 1, 2. గ్రుడ్డివాళ్ళ గుంపు.

అంధకి సం వి. ఇ. స్త్రీ నిర్వృతిమూల : చూ, నైఋతిమూల: చూ, దిక్కు. 1.

అంధతి. సం. వి. ఇ. పుం. నైఋతిపట్టణము: చూ, దేశము.

అంధసికుఁడు. సం విణ. (అ. ఆ అ.) సూపకారుఁడు: చూ, వంటవాఁడు.

అంధ్యము. సం. వి. అ. న. అంధత్వము: చూ, గ్రుడ్డితనము.

అంధ్రకౌముది. పా. కణ్వవిరచితమగు వ్యాకరణము: చూ, వ్యాకరణములు.

అంధ్రదీపిక. సం. వి. అ. స్త్రీ. రంగనాయకులు శ్రీస్త్రివిరచితమగు నిఘంటువు: చూ, నిఘంటువులు.

అంధ్రనామశేషము. సం. వి. అ. పుం. అడిదము సూరకవి రచించిన నిఘంటువు: చూ, నిఘంటువులు.

అంధ్రనామసంగ్రహము. సం. వి. అ. పుం. పైడిపాటి లక్ష్మణకవి రచించిన నిఘంటువు: చూ, నైఘంటు

**ఆంధ్రపదపారిజాతము.** సం. వి. అ. పుం. ఓగిరాల జగన్నాథకవి విరచితమగు నిఘంటువు: చూ, —పై.—

**ఆంధ్రపదాకరము.** సం. వి. అ. పుం. శ్రీరాజా త్యాడ పూసపాటి దక్షిణకవాటదుర్గ రాజా బహద్దరువారు రచించిన నిఘంటువు: చూ, —పై.—

**ఆంధ్రభాషాభూషణము.** సం. వి. అ. పుం. కేతనకవి విరచితమగునిఘంటువు: చూ, —పై.—

**ఆంధ్రభాషార్ణవము.** సం. వి. అ. పుం. కోటి వేంకనార్య విరచితమగు నిఘంటువు: చూ, -పై.-

**ఆంధ్రమండలము.** సం. వి. అ. న: చూ, రూ- అంధ్రమండలము. శ్రీశైలకాళేశ్వర ద్రాక్షారామంబులనెడి త్రిలింగక్షేత్రములకు నడుమనుండు ప్రదేశము: చూ, దేశము. (తెలుఁగు మాటలాడు జనుల స్వస్థానమగు దేశమునకే ఆంధ్రదేశమని పేరు. దీనిని త్రిలింగములు, త్రినగములు అని అందురు.)

**ఆంధ్రము.** సం. వి, అ. పుం. 1. —పై.—; 2. తెనుఁగుబాస: చూ, భా. 1. (రూ- అంధ్రము.) (ఆంధ్రదేశము తమదేశమని యభిమానముగలవారు మాటలాడు స్వభాషకు ఆంధ్రభాషయని పేరు. ఆంధ్రభాషలోని గొన్ని శబ్దములు సంస్కృతమువలనఁ బుట్టినవి. మఱి కొన్ని ప్రాకృతము భాషలనుండి కలిగినవి. అనఁగా పాలు తనస్వరూపముచెడి పెరుఁగు యైనట్లుగా సంస్కృత ప్రాకృత శబ్దములు తమ స్వరూపముచెడి యాంధ్రశబ్దములగుచున్నవి. దీనికే తెనుఁగు, తెలుఁగు నియును పేర్లు. తేనె + అగు = తెనుఁగు అని కొందఱందురు. అనఁగా తేనెవలె మృదువై మధురమై మనోహరమైన దనియర్థము. "దేశభాషలందుఁ దెలుఁగు లెస్స." ఆంధ్రభాషకు వర్ణంబులేబదియాఱు. అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఎ ఏ ఐ ఒ ఓ ఔ ం ః, 19. క ఖ గ ఘ ఙ, చ ఛ జ ఝ ఞ, ట ఠ డ ఢ ణ, త థ ద ధ న, ప ఫ బ భ మ, య ర ఱ ల వ శ ష స హ ళ. 37. దీనివలన సంస్కృతమునందలి 50 అక్షరములును, ఆభాషయందులేక అచ్చ తెలుఁగున నెక్కువగ నుండు అక్షరములును గలసి 56 ఆంధ్రభాషావర్ణంబులయ్యె. తెలుఁగునకు వర్ణములు 37. అందు అచ్చులు 14:— అ ఆ ఇ ఈ ఉ ఊ ఎ ఏ ఐ ఒ ఓ ఔ ం ః. హల్లులు. 23:—క గ చ ఛ జ ఝ ట డ ణ త ద న ప బ మ య ర ఱ ల వ స హ ళ. ఆంధ్రభాష చతుర్విధము—తత్సమము, తద్భవము, దేశ్యము, గ్రామ్యము (4); అం. 3. భాష లెనిమిదింటిలో నొకటి: చూ, భాషలు.

**ఆంధ్రవ్యాకరణము.** సం. వి. అ. న. ఆంధ్రభాషయందుఁ గల మాటల తప్పొప్పులను దెలుపునది యాంధ్రవ్యాకరణము. (ఇది సంజ్ఞా, సంధి, తత్సమ, ఆచ్ఛిక, కారక, సమాస, తద్ధిత, క్రియ, కృదంత, ప్రకీర్ణక, వాక్య, వ్యాస అను పండ్రెండు పరిచ్ఛేదంబులనున్నది. ఈవ్యాకరణశాస్త్రము చేదువుకుటవలన కావ్యార్థగ్రహణము, సత్కావ్యరచనము ఫలములు. కణ్వాదులు ఆంధ్రవ్యాకరణముల రచించిరి. ఆంధ్రభాషకు వాల్మీకి ఆదివ్యాకరణకర్త.): చూ, వ్యాకరణములు.

**ఆంధ్రశబ్దచింతామణి.** పా. నన్నయ విరచితమగు వ్యాకరణము: చూ, వ్యాకరణములు.

**ఆంధ్రి.** అం. స్వరజాతులలో నొకటి: చూ, స్వరము. 2.

**ఆంధ్రుఁడు.** సం. వి. అ. పుం. తెలుఁగుదేశమునఁ బుట్టినవాఁడు: చూ, తెలుఁగువాఁడు.

**ఆంబికేయుఁడు.** సం. వి. అ. పుం. ధృతరాష్ట్రుఁడు: చూ, రాజా. 1.

**ఆంహోనము.** అం. హస్తక్రియ తిరుపదింటిలో నొకటి: చూ, హస్తక్రియలు.

ఆఁక. దే. వి. 1. అభ్యంతరము. "సీ. ప్రాడ్వివాకులై కటువు లాజ్ఞలకొప్పగించిరి చేదువు రెల్ల, గికురించి రిచ్చి పుచ్చుకొనుచోటుల వారలాఁక లేక లోనుగా కప్పులీల." స్వా. 3, ఆ. 129: చూ, నిరోధము. 1; 2. ఆజ్ఞ: చూ, సెలవు; 3. కారాగృహము. "చ. హృదయంబున దోషముపట్టి లేని వ్యధ్యతకుబంధింప సేలయితఁడాఁకకుఁ బాత్రము." ఉ, హరి. 5, ఆ: చూ, బంధనాలయము; 4. త్రోపు: చూ, నిషేధము.

ఆఁకట్టు. దే. స. క్రి. (ఆఁక + కట్టు) అడ్డగించు. "దండకము. మాడ జలకముజ్జగంబుల్ కరంబబ్బురం బొప్ప నాఁకట్టి." నీలా. 2, ఆ: చూ, నిరోధించు.

ఆఁకత్రాళ్ళు. దే. వి. బ. కవ్వమును దగిలించుటకై తరిగంబమునందుఁ గట్టెడుత్రాళ్ళు. "సీ. ఆహవప్రహ్లాదులగు మారుతంబులు తగులఁగట్టి యాఁకత్రాళ్ళుగాఁగ." భీ. 4, ఆ. చూ, ఎల్లగుదులు.

ఆఁకపడు. ద్వ. అ. క్రి. అడ్డుపడు. "క. ఇలఁ బాతాళమున నభస్స్థలి సంబుధి నాఁకపడక చరియింపఁగ శక్తులుగల వానరవీరులు, గలరెన్న నసేకు లేనుఁగల నీపనికిన్." రా. కిష్కిం. కాం: చూ, పట్టువడు.

ఆఁకపెట్టు. ద్వ. స. క్రి. రూ-ఆఁకవెట్టు. అడ్డగించు. "క. మంత్రులఁ దా,రెద్దియును బల్కకుండిరి, పెద్దతడవు వింజేమాఁకపెట్టినభంగిన్." రా. యు, కాం: చూ, నిరోధించు.

ఆఁకయొనరించు. ద్వ. స. క్రి.—పై.—

ఆఁకరము. వై. వి.=అగ్రహః. కోపము: చూ, గోపము.

ఆఁకలి. దే. వి. గొద: చూ, క్షుత్తు. "చ. కనుఁగవఁజీఁకటుల్ గవియఁ గర్ణపుటంబులఁ దిమ్ముగ్రమ్మ ఖిన్నుదును జఠరాగ్ని దుస్సలత చొప్పడు నంగములన్ శిరంబునొచ్చు నితరభోగ్యవస్తువులు నూడఁచుపోంపదు మాటమాత్ర మాడనుసది పుట్టుడాఁకటఁబడక్ వశమే క్షణమైన సైరికన్." దశావతారచరిత్రము.

ఆఁకలిఁ జెందు. దే.అ.క్రి. ఆఁకలిఁగొను: ఆఁకొను.

ఆఁకలింపు. దే. వి. ప్రాగడిక: చూ, స్తోత్రము.

ఆఁకవెట్టు. ద్వ. స. క్రి. చూ, రూ-ఆఁకపెట్టు.

ఆఁకొంట. దే. వి, ఆఁకలి: చూ, క్షుత్తు.

ఆఁకొను. దే. అ. క్రి. (ఆఁకలి + కొను.) ఆఁకలిగొను. "ఆఁకొన్నకూడె యమృతము." సుమతీశతకము. ఆఁకలిఁ జెందు.

ఆఁకొన్నవాఁడు. దే. వి. ఆఁకలిఁ గొన్నవాఁడు: చూ, జిఘత్సువు.

ఆఁగాఁకర. ద్వ. వి. (అకు + కాఁకర.) కరోటము, మట్టుకాఁకర* (హిందీ-కకోడా- ఫేస్వసా, అర-కాదుపావక్కాయ.): చూ, కాఁకర.

ఆఁగించు. దే. స.క్రి. అడ్డగించు: చూ, నిరోధించు.

ఆఁగు. దే. స. క్రి. 1.—పై.—; 2. త్రోయు. "గీ. ఆఁగఁబడినవానిలోఁగఁగఁ జేయుట, యధమగతికి మార్గమనిరి బుధులు." భాగ. ఆగి. 3, ఆ: చూ, నిషేధించు; 3. అవధరించు, మోచు. "బోరమాఁగఁజాలక." భాగ. 10, స్కం. పూ: చూ, వహించు; 4. కాపాడు: చూ, రక్షించు; అ. క్రి. 5. ఉపశమించు, అడఁగు: చూ, సుళ్ళు. 4.

ఆఁచికొను. దే. స. క్రి. అపహరించు, కొల్లగొను. "సీ. పురిలోనఁ జొచ్చి విస్ఫురితగేహంబులయగసంచయమును నాఁచికొనుఁడు" హరి. ఉ. 6, ఆ: చూ, దొంగిలించు.

ఆఁచు. దే. క్రి. అణఁగించు, ఆఁగఁ జేయు. "సీ. ఆదిత్యపస నాఁచి హాలహాలంబునలోఁచి హుతవహుగర్వ ముబ్బూఁతలూచి" కళా. 1, ఆ. 76: అక్రు.

ఆఁటది. దే. వి. రూ-ఆఁడుది. "క. ఏటికి నీరాచేతకం, బోఁటుది వెంటవెట్టఁ బనువులాతురపడక్, యాఁటుదనినేచి దొంగల, గీఁటువు వెడలం

గ శవముక్రియనుండెడిదే." భాగ. 9, స్కం. చూ, స్త్రీ.

ఆఁటు. దే. వి. 1.—పై—; 2 ఆఁడుతనము: చూ, స్త్రీ; అ. క్రి. 3. ఓప్పు. "ఉ.నీ,రాఁటని రాటుపుం కెఱువులారయ నబ్బురము." య.1, ఆ: చూ, పర్యాప్తమగు; 4. తాళికయగు. "సగ్రగ. నాఁటితేకాఁటుం గూర్చేవ్యాసంబులే దోక్కొఁడు." రాఘ. 2, ఆ: చూ, తాళు.

ఆఁడంగి. దే. వి. 1. వందుఁడు, కొజ్జు: చూ, సౌవిదల్లుఁడు; 2. ఆఁడుదానివలె మాటలాడు వాఁడు: చూ, స్త్రీభాషి.

ఆఁడంగులు. దే. వి. బ. ఆఁడువారు: చూ, స్త్రీ.

ఆఁడతనము. దే. వి: చూ, ఆఁటు. 2. (రూ-ఆఁడుతనము.)

ఆఁడపీక. వా. బాలిక. (భయాప్రచలప్రాంతమున వాడుక.)

ఆఁడది. దే. వి. రూ-ఆఁడుది: చూ, స్త్రీ.

ఆఁడారిమాట. వా. చేతకానిమాట. (కొజ్జావాని మాట, పుంసత్వములేనిమాట.)

ఆఁడి. దే. అప. కల యను నర్థమునందు వచ్చెడి దొక స్త్రీప్రత్యయము. "కులుకులాఁడి, వగలాడి." మొ॥ (రూ-ఆఁడు.)

ఆఁడు. దే. అప. 1.—పై.— "ముద్దులాఁడు." మొ; 2. ఆఁడుతనము: చూ, రూ-ఆఁడతనము.

ఆఁడుఎట్టు. దే. వి. కలి, ఒకరకపు చేప: చూ, మత్స్యము. 1.

ఆఁడుఒంటె. ద్వ. వి. ఉష్ట్రి: చూ, లొట్టిపిట్ట.

ఆఁడుకట్టు దే. వి. ఆఁడుదాని కోకకట్టు. "కాళ్ల దొప్పిద మాఁడుకట్టు మజ్జ్వలము చేయఁగ." భార. విరా. 1, అ. (ఇక్కడ ఆఁడుకట్టనఁగా ఆఁడుదానికోకకట్టువంటి కట్టని అర్థము.)

ఆఁడుకూఁతురు. దే. వి. ఆఁడుది: చూ, స్త్రీ.

ఆఁడుకోయిల. ద్వ. వి. కాదంబరి, ఆఁడుకోవెల: చూ, పికము.

ఆఁడుగుంటి. దే. వి. మరునిల్లు: చూ, భగము. 12.

ఆఁడుగుఱ్ఱము. ద్వ. వి. అర్వతి: చూ, హయము.

ఆఁడుగొఱ్ఱె. దే. వి. ఏలిక, మేషి: చూ, మేషము. 1.

ఆఁడుగోరింక. ద్వ. వి. కాదంబరి,ఆఁడుగోరువంక: చూ, శారిక. 1.

ఆఁడుతనము. దే. వి: చూ, రూ-ఆఁడతనము.

ఆఁడుతాఁబేలు. ద్వ. వి కచ్ఛపి: చూ, తాఁబేలు.

ఆఁడుఁదోడు. దే. వి తోఁబుట్టువు. "ఉ. ఓయి దయావిహీనమతి యోరక యీపనికిద్దఁ గొట్టఁగాఁ, జేయెటులాడెనీకునిది చేసినదేమి వృథా కపింతురే, బోయవె యాఁడుఁదోడునను బుట్టువె." స్వా. 4, అ. 87: చూ, సహోదరి.

ఆఁడుది. దే. వి. రూ-ఆఁడది: చూ, స్త్రీ.

ఆఁడుపంది. ద్వ. వి. కచ్ఛ: చూ, పంది.

ఆఁడుపడుచు. దే. వి. 1. కూఁతురు: చూ, పుత్రిక. 1; 2. మగనితోఁడఁ బుట్టినది: చూ, వదినె.

ఆఁడపాఁప. దే. వి. 1. కన్యక, పెండ్లికానిపడుచు: చూ, స్త్రీ; 2. బాలిక, పదుమూఁడేండ్లకులోఁ బడినపిల్ల: చూ, స్త్రీ.

ఆఁడుపుట్టువు. దే. వి. ఆఁడుది: చూ, స్త్రీ.

ఆఁడుబిడ్డ. దే. వి. 1. కొమార్తె: చూ, పుత్రిక.1; 2. మగనితోఁడఁ బుట్టినది: చూ, వదినె.

ఆఁడుమేఁక. దే. వి. అజ: చూ, మేషము. 1.

ఆఁడువారు. దే. వి. బ: చూ, ఆడంగులు.

ఆఁడేనుఁగు. ద్వ. వి. హస్తిని: చూ, హస్తి.

ఆఁదోఁక. దే. వి. (ఆవు + తోఁక.)1.ఆవుతోఁక వలె మొదట లావుగ నుండి అవల క్రమక్రమముగా సన్నమైనట్టి యాకృతి. (ఇక్కడ ఆవు అనునది ఇతరములకునుఁ ఉపలక్షణము.) 2. ఆవు తోఁక: చూ, గోవాలము.

ఆఁదోఁకపాటు. ద్వ. వి. ఆవుతోఁకవలె నగుట, ఆఁదోఁకపడుట. "గీ. కదళి తివియించెనగాఁ

ఆదుర్దా. వా. జడుపు: చూ, భయము. 1. (వాశక.)

ఆదృతి. సం. వి. ఇ. స్త్రీ. ప్రియమైనది: చూ, ముద్దు.

ఆదృతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఆదరింపఁబడినవాఁడు; 2. ఆదరించువాఁడు.

ఆదేయము. సం. విణ. (అ. ఆ. అ.) గ్రహింపఁదగినది: చూ, ఉపాదేయము.

ఆదేశము. సం. వి. అ. పుం. 1. ఆజ్ఞ: చూ, సెలవు; 2. ఉపదేశము, మంచిమాట: చూ, హితవచనము; 3. మంత్రోపదేశము. "బ్రహ్మోపదేశము" ఇత్యాది; 4. వ్యాకరణము:—ఒకటిని బోఁగొట్టి వచ్చు మఱియొకవర్ణము లో నగునది.

ఆదేశించు. సం. స. క్రి. ఆజ్ఞాపించు: చూ, సెలవిచ్చు.

ఆదేష్ట. సం. వి. ఋ. పుం. 1. ఆజ్ఞాపించువాఁడు; 2. అధ్వర (యజ్ఞము) తంత్రము నుపదేశించువాఁడు: చూ, యజ్ఞకర్త.

ఆదేష్టృఁడు. సం. వి. అ. పుం.—వై.—

ఆద్యంతరహితము. సం. వి. అ. న. 1. నశింపనిది, అనశ్వరము: చూ, శాశ్వతము; విణ. 2. మొదలు తుది లేనిది.

ఆద్యమాషకము. సం. వి. అ. పుం. అయిదు గురిగింజల యెత్తు.

ఆద్యము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ప్రథమము, మొదటిది: చూ, మొదలు. 4; 2. ముఖ్యము, మేలుతరము: చూ, శ్రేష్ఠము; 3. తినఁదగినది: చూ, భక్ష్యము; 4. మునుపటిది: చూ, పూర్వము. 1.

ఆద్యుదుంబరి. సం. వి. ఈ. స్త్రీ. కమ్మమేడి* (కన్న-కల్లత్తి.): చూ, మేడి.

ఆద్యూనము. సం. విణ. (అ. ఆ. అ.) పదిమంది కూడి పానముచేయుస్థలము, అపానము: చూ, పానగోష్ఠిక.

ఆద్యూనుఁడు. సం. విణ. ఒకరిచేతికూటికై కని ట్టుకొనియుండువాఁడు.

ఆద్వయికుఁడు. సం. వి. అ. పుం. ఆద్వయికప్రవర్తకుఁడు.

ఆథర్వణము. సం. వి. అ. న. అథర్వమంత్రసమూహము. (అథర్వుఁడను ఋషిచేఁ జెప్పఁబడిన వేదము. అభేదోపచారమువలన అథర్వణమనఁబడును.) అథర్వమంత్రములసమూహము పేళ్ళు—కారీషము, వార్మణము, సాహసము. (త్రి.)

ఆథర్వణుఁడు. సం. వి. అ. పుం. అథర్వణవేదము జదివినవాఁడు.

ఆధర్షణము. పా. ద్రోహవిచారణ.

ఆధాతువు. సం. వి. ఉ. స్త్రీ. ఆధారిక, నెత్తు కాళ్ళుగల ఒకజాతిజెట్టి: చూ, జెట్టి.

ఆధానము. సం. వి. అ. న. 1. న్యాసము, ఉంచుట: చూ, పెట్టుకోలు; 2. కప్పుట: చూ, స్థాపనము; 3. తొలుపు: చూ, ధరణము. 1; పుం. 4. కట్టుగట్టి నీళ్ళు నిల్పిన మడుగు, హ్రదము: చూ, సరస్సు. 1.

ఆధానికము. సం. వి. అ. పుం. ఆధానికమను ఉత్సవము. (ఆధానికము, పుంసవనము, సీమంతోన్నయనము రూ-సీమంతము ఇవి శుభకర్మములు.)

ఆధారకుండము. సం. వి. అ. న. కుండలు లోనగునవి యుంచెడు కుదురు, కుదురు, చుట్టకుదురు: చూ, మట్టు. 3.

ఆధారదండము. సం. వి. అ. పుం. వెన్నెముక: చూ, కల్యము. 1.

ఆధారము. సం. వి. అ. పుం. 1. =ఆదరువు, ఆసరా: చూ, ప్రాపు. 2; 2. చెఱువు: చూ, సరస్సు. 1; 3. కుదురు, ఆవాపము: చూ, పాదు. 1; 4. గుద్ద: చూ, ముడ్డి; 5. మోసికొని యుండు అధారము. "ఆధారచక్రము."

ఆధారశక్తి. పా. సర్వలోకభారము వహింపఁగల శక్తి.

ఆధారాధేయసంబంధము. అం. సంబంధములు తొమ్మిదింటిలో నొకటి: చూ, సంబంధములు.

ఆధారి. సం. వి. ఈ. స్త్రీ. కోరింద* : చూ, ధార్య. (రూ-ఆధారిక.)

ఆధారిక. సం. వి. ఆ. స్త్రీ. 1.—పై.—; 2: చూ, ఆధాతువు.

అధార్మికుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ధర్మబుద్ధి లేనివాఁడు; రూ-అధార్మికుఁడు.

ఆధి. సం. వి. ఇ. పుం. 1.=ఆద, వంత, మనోవ్యధ: చూ, దుఃఖము; 2. అగావు: చూ, తాకట్టు; 3. కలుగునని యెడి ఆశ: చూ, వాంఛ; 4. వ్యసనము, సేగి: చూ, దుఃఖము; 5. ఇల్లు, ఉనికిపట్టు: చూ, గృహము. 1.

ఆధిక్యము. సం. వి. అ. న. గొప్పదనము, అతిశయము: చూ, హెచ్చు. 2.

ఆధిదైవికము. సం. విణ. తాపత్రయములలో నొకటి: చూ, తాపత్రయములు.

ఆధిపత్యము. సం. వి. అ. న. దొరతనము: చూ, ప్రభుత్వము.

ఆధిభౌతికము. సం. విణ. (అ. ఈ. అ.) భూతములవలనఁ గలిగినది. (భూతము=పృథివ్యాది.) తాపత్రయములలో నొకటి: చూ, తాపత్రయములు.

ఆధిమన్యవము. సం. వి. అ. న. జ్వరమువలనఁ గలిగిన వేడిమి: చూ, జ్వరాగ్ని.

ఆధివేదనికము. సం. విణ. (అ. ఆ. అ.) అధివేదననిమిత్తమైనది. స్త్రీధనము. (అధివేదనము=భార్యయుండఁగ మఱలఁ బెండ్లియాడుట.)

ఆధీగవము. సం. వి. అ. పుం. సామ భేద ము చతురుపాయములలో నొకటి: చూ, ఉపాయములు.

ఆధీగవుఁడు. సం. వి. అ. పుం. 1. తల్లితోడఁ బుట్టినవాఁడు: చూ, మేనమామ; 2. మునిభేదము: చూ, ముని. 1.

ఆధీతము. సం. వి. అ. న. 1 చక్కఁగా అధ్యయనము చేయఁబడ్డది; 2. కొంచెము అధ్యయనము చేయఁబడ్డది.

ఆధీన్యము. సం. వి. అ. న. అధీనత్వము: చూ, అగపాటు. 2.

ఆధుతము. సం. విణ. (అ. ఆ. అ.) కదలింపఁబడినది: చూ, ప్రేంఖితము.

ఆధునికము. సం. విణ. (అ. ఆ. అ.) 1. సద్యఃకాలసంబంధమయినది: చూ, ఇప్పటిది; 2. నవీనము, క్రొత్త: చూ, నూతనము.

ఆధునికుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) క్రొత్తవాఁడు: చూ, నూతనుఁడు.

ఆధూతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. కదలింపఁబడినది: చూ, ప్రేంఖితము; అం. 2. శిరఃక్రియలు పదునేడింటిలో నొకటి: చూ, శిరఃక్రియలు.

ఆధృతము. సం. వి. అ. న. అంతట లేక కొంచెము ధరింపఁబడ్డది.

ఆధేయపర్యాయము. సం. వి. అ. పుం. అలంకారవిశేషము: చూ, హేతువు. 2.

ఆధేయము. సం. విణ. (అ. ఆ. అ.) ఉంచతగ్గది.

ఆధోరణుఁడు. సం. వి. అ. పుం. ఆరోహుఁడు, మావటివాఁడు: చూ, హస్త్యారోహుఁడు.

ఆధోరూపిక. సం. వి. ఆ. స్త్రీ. 1. అధోరూపమయిన యభిప్రాయము యొక్క ప్రసిద్ధి; 2. అధోరూపమయిన పనియొక్క ప్రసిద్ధి.

ఆధాతము. సం. వి. అ. న. చక్కఁగా ఊఁతకఁబడినది.

ఆధ్మాతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. చప్పుడు చెయ్యఁబడ్డది; 2. కాల్చఁబడినది; 3. గాలి:

చూ, వాయువు; 4. వాతరోగము: చూ, రోగము. 1; 5. దధి: చూ, పెరుఁగు 1.

ఆధ్యాత్మికము. సం. విణ. (అ. ఈ. అ.) ఆత్మవలనఁ గలిగినది.

ఆధ్యానము. సం. వి. అ. న. 1. చింత, తలఁపు: చూ, స్మృతి. 1; 2. ఇష్టానిష్టములగు పనులను గుఱించి యాలోచించుట; అం. 3. సంచారిభావములు ముప్పదిమూఁడింటిలో నొకటి: చూ, సంచారిభావములు

ఆన. వై. వి. 1.=ఆజ్ఞ, ఉత్తరువు: చూ, సెలవు; అన్యదే. 2. క్రీస్తుశకసూచన. (ఆన=హూణశకః 1934, స్న=ఫసలీ 1344, శాలివాహనశకాబ్దాః 1856, కల్యాద్యబ్దాః 5035; ఇవి సమానములు.)

ఆనంగ్గుఁడు. సం. వి. అ. పుం. 1. కుబేరుఁడు: చూ, శ్రీదుఁడు; 2. ముక్కంటి: చూ, శివుఁడు; విణ. 3. స్వారస్యము నెఱుఁగువాఁడు, వ్యవహారజ్ఞాన మామూలాగ్రము గ్రహించినవాఁడు.

ఆనంద. సం. వి. అ. పుం. ప్రభవాది అఱువది సంవత్సరములలో నొకటి: చూ, సంవత్సరములు. (రూ-ఆనందము.)

ఆనందకాననము. సం. వి. అ. న. కాశి, బనారస్, వారణాసి: చూ, దేశము.

ఆనందథువు. సం. వి. ఉ. పుం. సంతోసము: చూ, సంతోషము.

ఆనందనము. సం. వి. అ. న. 1.—పై—; 2. చుట్టములు మొదలగువారిశాలింగనాదులచే సంతోషపఱచుట: చూ, సభాజనము.

ఆనందని. సం. వి. ఈ. స్త్రీ. బ్రహ్మపట్టణము: చూ, దేశము.

ఆనందపటము. సం. వి. అ. న. పెండ్లిలో వధూవరుల కిచ్చెడు వస్త్రము, సవోఢావస్త్రము. "సవోఢావస్త్ర మానందపట మిచ్ఛంతి సూరయః." హారావళి: చూ, వస్త్రము.

ఆనందభైరవి. పా. వాఛి, ఇంగిలీకము, మిరియాలు, పిప్పళ్ళు, వెలిగారము ఈవస్తువులను బాగుగ శుద్ధిచేసి సమభాగములు తీసికొని కల్వావవైచి నిమ్మపండ్లరసమున మర్దించి గుంజాప్రమాణముగ మాత్రలు చేసి నీడను ఎండించి ఒకమాత్ర యిచ్చిన సమస్తరోగములు పోవును. ఇచ్ఛాపథ్యము. మఱియొకవిధము— ఇంగిలీకము తు 1, వాఛి తు 2, పిప్పళ్ళు తు 1, మిరియాలు తు 1, శొంఠి తు 1, ఈవస్తువులు కల్వావ వైచి నిమ్మపండ్లపులుసున మూఁడుదినములు విడవకుండ మర్దనచేసి తుప్పెలు కట్టి కార్క్ గలిగిన గాజుసీసాలలో భద్రపఱచి వాడుకొనేది. అజీర్ణము, అగ్నిమాంద్యము, జ్వరములు మొ॥ హరించును

ఆనందమయకోశము అం కోశములయిదింటిలో నొకటి: చూ, కోశములు.

ఆనందము. సం. వి. అ. పుం 1. సంతోసము: చూ, సంతోషము; 2. ఆకసము: చూ, మిన్ను; 3. వర్షించెడు సూర్యకిరణము; 4. ప్రభవాది అఱువది వత్సరములలో నొకటి: చూ, రూ-ఆనంద; 5. సన్యాసుల సంప్రదాయమును దెలిపెడి గుఱుతు: చూ, లక్షణము. 1; అం. 6. మానసిక పూజాకుసుమములు పదునాఱింటిలో నొకటి: చూ, మానసిక పూజాకుసుమములు.

ఆనందాత్మ. సం. వి. న్. పుం. నలువ: చూ, బ్రహ్మ. 1.

ఆనందాలయము. సం. వి. అ. పుం. చంద్రుని యొక్క లోకము: చూ, దేశము.

ఆనందించు. సం. అ. క్రి. సంతోసించు: చూ, సంతోషించు.

**ఆనందగజపతి.** పా. 1757-వ సంవత్సరమున బొబ్బిలియుద్ధములో వీరస్వర్గము గాంచిన విజయరామగజపతిమహారాజు గారికి పితరుఁడు. ఈతఁడు బాలుఁడై యున్నకాలమున యీతని జ్యేష్ఠసోదరుఁడును, ఉపాభ్యుదయమను శృంగార రస ప్రబంధకర్తయునగు శ్రీఘాసపాటి వేంకటపతిమహీపాలుఁడే రాజ్యభారమును వహించి తమ్మునికిగాఁ బరిపాలన మొనర్చెను; కళింగదేశచరిత్ర. 138 పుట.

**ఆనందతీర్థులు.** పా. పురుషోత్తమమహాతీర్థులశిష్యులగు నీయానందతీర్థులు భగవత్ పాదాచార్య యను బిరుదమునొంది ద్వైతమతసిద్ధాంతప్రకారము వ్యాసనూత్రములకు భాష్యమును వ్రాసిరి. వీరి శిష్యులు నరహరితీర్థులు కళింగదేశమున మండలిక పదవియందుండి శబరులు శ్రీకూర్మముపై దండెత్తివచ్చినపుడు దానిని సంరక్షించిరి కళింగదేశచరిత్ర. 624. పుట.

**ఆనందితము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. సంతోషము నొందినది; 2. సంతోష పెట్టఁబడినది.

**ఆనందుఁడు,** సం. విణ. (అ. ఆ. అ.) సంతోషముగల మనస్సుకలవాఁడు: చూ, హృష్టుఁడు.

**ఆనందోబ్రహ్మ.** పా. ఆనందమయమగుబ్రహ్మ, అంతయు ఆనందమయము.

**ఆనకట్ట.** దే. వి. ఏటియడ్డకట్ట: చూ, సేతువు.1.

**ఆనకదుందుభి.** సం. వి. ఇ. పుం. శ్రీకృష్ణుని తండ్రి: చూ, వసుదేవుఁడు.

**ఆనకము.** సం. వి. అ. పుం. 1. కరకాయవంటి మృదంగము, అంక్యము: చూ, వీణె; 2. భేరీయను వాద్యవిశేషము: చూ, వీణె; 3. మృదంగాది ధ్వని విశేషము: చూ, స్వరము. 2; 4. ఉఱిమెడి మబ్బు: చూ, మేఘము. 1; 5. ఆఁడుగుఱి: చూ, భగము. 12.

**ఆనతము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. వంగినది: చూ, భుగ్నము 1; 2. చివర కొంచెముక్రిందికి వంగినది.

**ఆనతి.** వై. వి.=అజ్ఞప్తి. ఆజ్ఞ: చూ, సెలవు.

**ఆనతిచ్చు.** ద్వ. స. క్రి. (ఆనతి + ఇచ్చు.) ఆజ్ఞాపించు. "వంశమెల్లఁ బూతమ్మగు నీదు పద్యనని ధాతపడంతిరు యానతిచ్చె." కళా. 4, ఆ. 125: చూ, సెలవిచ్చు. (రూ-ఆనతి యిచ్చు.—"మాతృము తెరువానతియీవే." భాగ. కాం. 4, ఆ.)

**ఆనద్ధము.** సం. వి. అ. న. మృదంగాది చర్మవాద్యము: చూ, వీణె. 2; విణ. 2. కట్టఁబడినది: చూ, సందానితము. 1.

**ఆనద్ధవాద్యములు.** అం. ఝల్లరి, మురజము, భేరి, పటహము, కరడ, కుడుక్క, హుడుక్క, ఢక్క, డమరుకము, నిస్సాణము, సోల్లుక, బాణము, తుంబురి, దుందుభి, మద్దువు, డిండిమము, ఝర్ఝరము, పణవము. (18.)

**ఆననము.** సం. వి. అ. న. 1. ముఖము: చూ, వదనము. 2; 2. నోరు: చూ, వదనము. 1.

**ఆనఁబెట్టు.** ద్వ. స. క్రి. ఆజ్ఞనిమ్ము.

**ఆనప.** దే. వి. అలాబువు *: చూ, సొర. (రూ-ఆనబ.)

**ఆనపకాయ.** ద్వ. వి. 1. నాగస్వరపుకాయ: చూ, సొర; 2. శాకములలో నొకటి, కూర అనబ: చూ, సొర; పా. 3. వీణకు పైభాగమున నమర్పఁబడు కాయ; 4. పైపెంకు కండకాయ. (బూడిదెగుమ్మడి, గుమ్మడి మున్నగు వానివంటిది.) (అనబకాయ.)

**ఆనమితము.** సం. విణ. (అ. ఆ. అ.) వంపఁబడినది.

**ఆనము.** సం. వి. అ. పుం. లోపలి వెలిఁబుచ్చుట, ఉచ్ఛ్వాసము: చూ, శ్వాసము.

ఆనయనము. సం. వి. అ. పుం. 1. ఆపత్తి, పొందించుట: చూ, పొందింపు; 2. ఆహరణము, ఆహృతి: చూ, తెచ్చుట.

ఆనయించు. సం. స. క్రి. కొనివచ్చు: చూ, తెచ్చు.

ఆనర్తము. సం. వి. అ. పుం. 1. ఆటపాక: చూ, గృహము. 1; 2. ఉదకము: చూ, నీరు; 3. పోరు: చూ, యుద్ధము; 4. పశ్చిమసముద్రతీరమున ద్వారకకు సమీపమునున్న దేశము: చూ, దేశము; బ. 5. జనపదములు: చూ, ప్రజ; 6. ఏఁడాది: చూ, సంవత్సరము; 7. ఇష్టము లేమి: చూ, రోఁత. 2.

ఆనవాలు. దే. వి. 1. రూ-ఆనాలు, గుఱుతు: చూ, లక్షణము. 1; 2. (ఆన + పాలు.) జున్ను, కూర్చిక, ఇవురఁగాచినపాలు "సీ. పాలఁ జొల్ వయ్యకుని పాలుసేయుట కిజ యానవాలన్నట్టు లానవాలు." శకుం. 4, ఆ: చూ, పాలు. 1. (రూ-ఆనాలు.)

ఆనవాలుపట్టు. దే. స. క్రి. గుఱుతుపట్టు: చూ, గుర్తించు.

ఆనాది. దే. వి. కిరాతుఁడు: చూ, వ్యాధుఁడు. 1.

ఆనాయము. సం. వి. అ. పుం. 1 చేఁపవల: చూ, వల 1; 2. అంతట తీసికొనిపోవుట.

ఆనాయ్యము. సం. వి. అ. పుం. గార్హపత్యాగ్నిలోనుండి యెత్తి దక్షిణాగ్నియందుంచిన అగ్ని: చూ, నిప్పు.

ఆనాలు. దే. వి. 1. గుఱుతు: చూ, లక్షణము. 1; 2. కూర్చిక, జున్ను, ఇవురఁగాచినపాలు. "మ. కలమాన్నంబు ఘృతంబుఁ బాయసము శాకవ్రాతముల్ పిండివంటలుఁ బాల్ పేరిన జున్ను వెన్నయుడి యానాలుక్రొ-త్తల్ చక్కెరల్, ఫలముల్ పానకముల్." రాజశేఖరచరిత్రము: చూ, ఆనవాలు. 2.

ఆనాహము. సం. వి. అ. పుం. 1. దైర్ఘ్యము, నిడుపు: చూ, పొడవు. 2; 2. మలమూత్రబంధరోగము. ఇరువాయికట్టు: చూ, మూత్రకృచ్ఛ్రము.

ఆనించు. దే. అ. క్రి. అదఁగఁజేయు, ఆను: చూ, పిసుకు. 2.

ఆనిక. దే. వి. 1. ఆశ్రయము, ఆసరా: చూ, ప్రాపు. 2; 2. ఒలిమి: చూ, శక్తి. 1; 3. త్రాగుడు: చూ, పానము. 1.

ఆనియ. దే. వి. దద్రురోగము. రూ-ఆని: చూ, దద్రువు.

ఆనిర్హతము. సం. వి. అ. పుం. 1. దేవతల గుంపు; 2. ప్రాణిసంఘము.

ఆనిర్హతుఁడు. సం. వి. అ. పుం. లచ్చిమగఁడు: చూ, విష్ణువు. 1.

ఆనిలి. సం. వి. ఇ. పుం. ఆంజనేయుఁడు: చూ, వానరము.

ఆనీచదర్శి. సం. వి. న్. పుం. బుద్ధభేదము: చూ, బుద్ధుఁడు. 1.

ఆనీతము. సం. విశే. (అ. ఆ. అ.) 1. పొందింపఁబడినది. చూ, ప్రాప్తము. 1; 2. తేఁబడినది.

ఆనీలయష్టిక. సం. వి. ఆ. స్త్రీ. ఆంబుదసలి *: చూ, మూలుగు. 2.

ఆను. దే. వి. 1. జీవస్థానము, కీలకము: చూ, మర్మము. 1; 2. ప్రథమము, మొదటిది: చూ, మొదలు. 4; స. క్రి 3. తిను: చూ, పొందు; 4. అడ్డగించు: చూ, నిరోధించు; 5 పానము చేయు, త్రాగు. "భావజాతామృతం, బానఁగఁ జేసెనా చెవులు" భార. అను. 1, ఆ: చూ, త్రాగు; 6. అణఁచు, అదుము. "మోకాళ్ళు నత్తుస్థలంబున నాని." కళా. 8, ఆ. 266: చూ, పిసుకు. 3; 7. అదఁగఁజేయు. "ఆనఁగరానికోపమున." కాశీ. 2, ఆ: చూ, పిసుకు. 3.

8. ధరించు, తాలుచు: చూ, వహించు; అ. క్రి. 9. అనికయగు. "ఇంపు సొంపారఁగ వానియాని." భార. అర. 6, అ: చూ, వహించు,

ఆనుకట్ట. దే. వి. ఊనుకొనెడు కట్ట: చూ, పట్టుఁగొమ్మ.

ఆనుకూల్యముగ. వి. అ. క్రి. అనుకూలముగ: చూ, పొత్తుపడు.

ఆనుకూల్యము. సం. వి. అ. న. ఒద్దిక: చూ, స్నేహము. 1

ఆనుకొను. దే అ. క్రి, స. క్రి. అనికయగు: చూ, వహించు

ఆనుగ. దే. వి. అనబు*: చూ, సాఱ

ఆనుగము. దే వి.రూ—పై.—

ఆనుగు దే. వి.—పై —

ఆనుగుణ్యము. సం. వి. అ. న. అనుగుణభావము, ఒద్దిక: చూ, స్నేహము. 1.

ఆనుడుబిల్ల. దే. వి. ఒఱగుదిండు: చూ, లోడు.

ఆనుపూర్వి. సం. విశే. న, ఈ. స్త్రీ. 1. అనుక్రమము, వరుసక్రమము, ఒకటి వెంబడి నొకటి: చూ, విధము. 1; 2 అనుక్రమణిక: చూ, పరిపాటి

ఆనుపూర్వ్యము. సం. వి. అ. న —పై—

ఆనువు. దే. వి. బలము: చూ, శక్తి. 1.

ఆనుషంగిక. పా. ఒకదానితోపాటుగానుండుట.

ఆనుషంగికసాక్ష్యము. పా. అనుబంధిక సాక్ష్యము

ఆనె. దే. వి: చూ, రూ—ఆనియ.

ఆనేత. సం. విశే. (బు. ఈ. బు.) 1: చూ, పొందించువాఁడు; 2: చూ, తెచ్చువాఁడు.

ఆనేతవ్యము. సం వి. అ. న. 1. ఆనయము: చూ, తెచ్చుట; విశే. 2 పొందింపఁదగినది: ఆనేయము; 3 తేఁదగినది: ఆనేయము, ఆహార్యము.

ఆనేయము. సం. విశే. (అ. ఆ. అ.) 1: చూ, ఆనేతవ్యము. 2; 2: చూ, ఆనేతవ్యము. 3

ఆన్వయికుఁడు సం. వి. అ. పుం. కొలకతిష్ఠుఁడు: చూ, కొలఁడు.

ఆన్వీక్షికి. సం. వి. ఈ. స్త్రీ. దండనీతి, దండనశాస్త్రము; (ఇందు విజ్ఞానము తెలుపఁబడును. అనఁగా నయానయములు తెలుపఁబడును.): చూ, విద్యలు.

ఆపంచనఖము. సం. వి. అ. పుం. పెద్ద గోకుమాత్రము *: చూ, కాకోటము.

ఆపక్వము. సం. వి. అ. న. గుగ్గిళ్ళు: చూ, పేలి.

ఆపగ సం. వి. ఆ. స్త్రీ. ఏఱు: చూ, నది.

ఆపణము. సం. వి. అ. పుం. నిషద్య, అంగడి: చూ, దుకాణము.

ఆపణికుఁడు. సం. వి. అ. పుం. వణిగ్వ్యాపారము చేయువాఁడు: చూ, వణిజుఁడు.

ఆపత్యాలమునరక్షించువాఁడు. అం. పితలు అయిదుగురిలో నొకఁడు: చూ, పితలు.

ఆపత్తి. సం వి. ఇ. స్త్రీ. 1 ఆపద, ముప్పు: చూ, విపత్తు; 2. పొందించుట: చూ, పొందింపు.

ఆపత్ప్రాప్తుఁడు. సం. వి. అ. పుం. ఆపదఁబొందినవాఁడు: చూ, కడగండ్లమారి.

ఆపద. సం. వి. ద. స్త్రీ. ఇడుమ, ముప్పు: చూ, విపత్తు.

ఆపదకుఁబ్రతిక్రియ. సం. విశే. అంగపంచకములో నొకటి: చూ, అంగపంచకము.

ఆపద్గతము. సం. విశే. (అ. ఆ. అ.) ఆపదఁబొందినది: అభిపన్నము.

ఆపన్నగ్రాముఁడు. సం. విశే. (అ. ఆ. అ.) గ్రామముఁ బొందినవాఁడు.

ఆపన్నము. సం. విశే. (అ. ఆ. అ.) ఇడుమగలది; 2. పొందఁబడినది: చూ, ప్రాప్తము. 1.

ఆపన్నసత్వ. సం. వి. ఆ. స్త్రీ. రూ-ఆపన్నసత్వా. గర్భిణి: చూ, చూలాలు.

ఆపన్నుఁడు. సం. వి. అ. పుం, విణ. ఆపదఁబొందినవాఁడు: చూ, కడగండ్లమారి.

ఆపమిత్యకము. సం. వి. అ. న. ఒకవస్తువునిచ్చి మారుగాపుచ్చుకొన్న మఱియొక వస్తువు, మారకము: చూ, వినిమయము.

ఆపము. సం. వి. అ. న. జలసమూహము, నీరుముప్ప: చూ, నీరు. 1.

ఆపరేషను. ఆం. 1. వ్యాపారక్రియ; 2 శస్త్రచికిత్స.

ఆపవనము. సం వి. అ. న. కాఁగు: చూ, పాత్రము. 6.

ఆపవారుకము. సం. వి. అ. పుం. శిల, ఱాయి: చూ, రాయి.

ఆపసోపాలుపడు. ద్వ. అ. క్రి. ఉపస్వరమునను "వీఁడు అలసి ఆపసోపాలుపడుచున్నాఁడు." తాపమునం దగు ధ్వన్యనుకరణక్రియ: చూ, హాహాహా.

ఆపస్తంభస్మృతి. ఆం. మూలస్మృతులు పదునెనిమిదింటిలో నొకటి: చూ, స్మృతులు.

ఆపస్సు. సం. వి. స్. న. నీరుకుప్ప: చూ, నీరు. 1.

ఆపాటున. దే అవ్య ఉన్నట్టుండి: చూ, ఢప్పాటు.

ఆపాతము. సం. వి. అ. పుం. 1. పడుట: చూ, పతనము; 2. అవలీల, తేలిక: చూ, లాఘవము; 3. తత్కాలము, అకాత్తు: చూ, ఢప్పాటు.

ఆపాతలిక. పా. వైతాళీయజాతివృత్తములలో నొకటి. ఇందు రెండటిపాదమున నాలుగులఘువులును నొక భగణ, గగములును, కడమపాదములందు నెనిమిది లఘువులు నొక భగణము, గగము గలిగి, రెండటిపాదమున యేడింట, కడమ పాదమున తొమ్మిదింట యతిగల వృత్తము: చూ, వృత్తము. 1.

ఆపాదకము. సం. విణ (అ. ఆ. అ.) కలిగించునది: చూ, ఉపపాదకము.

ఆపాదనము సం. వి. అ. న. కలిగించుట: చూ, ఉపపాదనము.

ఆపాదించు. సం స. క్రి. సృష్టిచేయు: చూ, సృజించు.

ఆపాదితము. సం. విణ. (అ. ఆ. అ.) కలిగింపఁబడినది: చూ, ఉత్పాదితము.

ఆపాదిల్లు సం అ. క్రి. జన్మించు: చూ, పుట్టు. 2. (ప్రే. ఆపాదించు.)

ఆపానము. సం. వి. అ. న. 1. అనేకులు గుంపుఁగూడి వ్యాపారముచేయుచోటు; 2. అనేకులు కల్లు త్రాగెడిచోటు: చూ, పానగోష్ఠిక.

ఆపితము. సం. విణ. (అ ఆ అ.) పొందఁబడినది: చూ, ప్రాప్తము 1.

ఆపీడము సం. వి. అ. పుం 1. అదుముడు: చూ, పీడనము; 2. శిరోభూషణము, సిగ నిడిన పూలదండ: చూ, భూషణము. 2; 3. గోడ బయటికి వచ్చిన గృహదారువిశేషము.

ఆపీడితము. సం. విణ. (అ ఆ. అ.) నలపఁబడినది.

ఆపీతము సం. విణ. (అ. ఆ. అ.) 1. త్రాగఁబడినది; 2. అత్యల్పము, మిక్కిలి కొంచెము: చూ, స్వల్పము; 3. భేదము: చూ, వేఱుపాటు. 1; 4. పీతవర్ణమైనది: చూ, వర్ణము. 6.

ఆపీనము. సం. వి, అ న. పాలచేత నిండియుండునది, ఊధము: చూ, పొదుఁగు.

ఆపు. దే. స. క్రి. ఆపుచేయు: చూ, ఉత్తంభించు.

ఆపుచేయు. దే. స. క్రి. —పై—

ఆపుఁడు. సం. వి. అ. పుం. అష్టవసువులలో నొకఁడు: చూ, వసువులు.

ఆపూతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. అంతట పరిశుద్ధమైనది; 2. కొంచెము పరిశుద్ధమైనది.

ఆపూపికము. సం. వి. అ. న. రూ-ఆపూపము, అప్పచ్చి: చూ, భక్ష్యము.

ఆపూపికుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) పిండివంటలు చేయువాఁడు లేక అమ్మువాఁడు: చూ, భక్ష్యంకారుఁడు.

ఆపూప్యము. సం. వి. అ. న. అన్నము: చూ, పాదము. 1.

ఆపృక్తము. సం. వి. అ. న. అంతట కలిసినది

ఆపృచ్ఛనము. సం. వి. అ. న. చుట్టములులోనగు వారిని ఆలింగనాదులచేత సంతోషపఱచుట; యాత్రాదులయందు బంధువులు లోనగువారి యాజ్ఞఁ బడయుట. (అని కొందఱు), ఆనందనము: చూ, సభాజనము.

ఆపె. ద్వ. స. ఏ. (ఆ + అప.) రూ-ఆమె: చూ, ఆకె.

ఆపేశలము. సం. విణ. (అ. ఆ. అ.) 1. అంతట మృదువైనది; 2. కొంచెము మృదువైనది.

ఆపోసనము. వై. వి.=ఆపోశనమ్. రూ-ఆపోసనము-ఆపోసానము: చూ, శుద్ధాచమనము.

ఆపోక. దే. వి. తనివి: చూ, తృప్తి.

ఆపోక్లిబములు. పా. జన్మలగ్నమునకు 3-6-9-12 రాసులు.

ఆపోగండఁడు. సం. వి. అ. పుం. 1. పొట్టివాఁడు: చూ, వామనుఁడు 2; 2. పాలపాపఁడు: చూ, శిశువు; విణ. 3. భయశీలుఁడు: చూ, పిఱికి; 4. వళులు గలవాఁడు: చూ, రూ-ఆపోగండుఁడు; 5. చొట్టపోయిన శరీరముగలవాఁడు: చూ, లేవఁజాలనివాఁడు.

ఆపోవు. దే. అ. క్రి. (అదట + పోవు) అదటపోవు: చూ, తృప్తిపడు.

ఆపోవుట. దే. వి. తనివి: చూ, తృప్తి.

ఆపోవువాఁడు. దే. వి. తృప్తిపడువాఁడు, ఆప్యాయిత: చూ, తనియువాఁడు.

ఆపోశనము. సం. వి. అ. న.=ఆపోసనము: చూ, శుద్ధాచమనము.

ఆపోశనించు. సం. స. క్రి. ఆపోశనము చేయు: చూ, వారుచు.

ఆపోసనము. వై. వి.=ఆపోశనమ్. ఆచమనము, రూ-ఆపోసనము, ఆపోసానము: చూ, శుద్ధాచమనము.

ఆపోసము. వై. వి.=—వై.—

ఆప్తము. సం. విణ. (అ. ఆ. అ.) 1. పొందఁబడినది: చూ, ప్రాప్తము. 1; 2. ఆప్తమైనది; 3. సత్యమైనది: చూ, సత్యము. 5.

ఆప్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. కలిమి: చూ, సంపత్తి. 1; 2. చెలిమి: చూ, స్నేహము. 1.

ఆప్తుఁడు. సం. వి. అ. పుం. 1. చెలికాఁడు: చూ, స్నేహితుఁడు. 1; 2. అయ్యవారు, పవిత్రమయినవాఁడు, అమలుఁడు: చూ, మహనీయుఁడు.

ఆప్యము. సం. విణ. (అ. ఆ. అ.) 1. నీటిపుట్టు: చూ, నీరు. 1; 2. నీటఁ బుట్టిన సమస్తవస్తువులు; 3. చెంగల్వకోష్టు*: చూ, పారిభాష్యము; 4. క్షౌద్రము, తేనె: చూ, మధువు. 5.

ఆప్యాయనము. సం. వి. అ. న. 1. తనివి: చూ, తృప్తి; 2. సంతోసము: చూ, సంతోషము; 3. బంధువులు చేరుట: ఆప్యాయము

ఆప్యాయము. సం. వి. అ. న. బంధువులుచేరుట: ఆప్యాయనము

ఆప్యాయానము. సం. వి. అ. న. మంచిపుడోలి: చూ, పాలకి.

ఆప్యాయిత. సం. విణ. (ఋ. ఈ. ఋ.) ఆపోవువాఁడు: చూ, తనియువాఁడు.

ఆప్యాయితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) తృప్తిపడినవాఁడు: చూ, తనిసినవాఁడు.

ఆప్రిక్కు. దే. వి: చూ, ఆదిక్కు.

ఆప్రిచ్ఛనము. సం. వి. అ. న. ఒహాదినములకు వచ్చిన చుట్టములను జూచుటవలనఁ గలిగిన సుఖానుభవము. (రూ-ఆప్రిచ్ఛన్నము.)

ఆప్రపదీనము. సం. విశే. (అ. ఆ అ.) పాదాగ్రము కప్పియుండు చీర: చూ, వస్త్రము.

ఆప్లవము. సం వి. అ. పుం. అభిషవము, మునక: చూ, స్నానము 1 (రూ-ఆప్లావము.)

ఆప్లావము సం. వి. అ. పుం స్నానికవ్రతము

ఆప్లుతుఁడు. సం విశే (అ. ఆ. అ) 1 వేదము చదివిన వెనుక వేరొక యాశ్రమమును బొందక గృహస్థుఁడై తీర్థస్నానశీలుఁడై యుండు బ్రహ్మచారి: చూ, స్నాతకుఁడు; 2. స్నానము చేసినవాఁడు: చూ, స్నాతుఁడు.

ఆఫలోదయకర్మ. సం. వి. అ పుం ఫలము కలిగెడువఱకు పనిచేయువాఁడు.

ఆఫీసు. ఆం. కచ్చేరి, ఉద్యోగశాల.

ఆఫుల్లము సం వి. అ. న. 1 కొంచెము వికసించినది; 2 అంతట వికసించినది.

ఆఫ్రికా. ఆం. ఖండము లయిదింటిలో నొకటి: చూ, ఖండములు.

ఆబ. దే వి. 1. కనీనిక, కంటినల్లగుడ్డు. "వాని యాబ లణఁగెను": చూ, బిడాలము. 2; 2. కనీనిక, కంటినల్లగుడ్డులోనిప్రతిఫలనము: చూ, తారకము. 1.

ఆబంధము. సం. వి. అ. పుం. 1: చూ, గట్టికట్టు; 2. దృఢముగాఁ గట్టుట; 3. నాఁగటికాడికిఁ గట్టెడు మోకు: చూ, వల్లె. 2; 4. పశుబంధ రజ్జువు: చూ, వల్లె. 2; 5 చెలిమి: చూ, స్నేహము. 1; 6. ఆభరణము, తొడవు: చూ, భూషణము. 2.

ఆబద్ధము. సం. వి, అ, పుం. అలంకారము, తొడవు: చూ, భూషణము. 2.

ఆబలు. దే. వి. బ. సర్షపబీజములు రూ-ఆవలు: చూ, సర్షపము.

ఆబాదు. పా. జనసంకీర్ణము.

ఆబాధ. సం వి, ఆ స్త్రీ అంగలార్పు: చూ, దుఃఖము.

ఆబాలగోపాలము. పా. చిన్నలు మొదలు పెద్దలవఱకు. (అందఱు.)

ఆబాలవృద్ధము. పా. —పై.—

ఆబిడ. గ్రా స. (ఆ + బిడ్డ.) ఆస్త్రీ, రూ-ఆబిడే: చూ, అక్క.

ఆబిడే. దే. స. —పై.—

ఆబుకారి. ఆం. రూ- అబ్కారి. (ఎక్సైజు.)

ఆబూతి. వై ని = ఆభుక్తి "వీని నాబూతి యుపరు వేయుదురు.": చూ, పెనుతిండి.

ఆబూతికాఁడు. వై. విశే. తిండిపోతు: చూ, భిక్షుకుఁడు.

ఆబూరు. అన్యదే గౌరవము "నీవు చెప్పిన పనిచో ఆబూరు దక్కదు." (వా.): చూ, మర్యాద. (ఆబోరు- ఆబోసు. వా.)

అబ్కారి. ఆం రూ-ఆబుకారి

ఆబ్దికము సం. వి. అ న. గద్దినము. మృతినొందిన వారికి ప్రతి వత్సరమునఁ జేసెడి కర్మము: చూ, సాంవత్సరికము.

ఆభ. సం వి ఆ స్త్రీ. కాంతి: చూ, వెలుతురు 1.

ఆభరణము, సం, వి, అ, న, 1. తొడవు: చూ, భూషణము. 2; ఆం, 2. అలంకారము లయిదింటిలో నొకటి: చూ, భూషణము. 2. (చూ, అనులేపనము.)

ఆభాషణము. సం వి. అ. న 1 చక్కఁగా మాటలాడుట: చూ, సంభాషణము; 2. బంధుమిత్రులతో మాటలాడుట.

ఆభాసము. సం వి అ పుం. 1. ప్రకాశము: చూ, వెలుఁగు. 3; 2. కాంతి: చూ, వెలుతురు. 1; 3. ప్రతిఫలనము, మాఱురూపము తోఁచుట: చూ, ప్రతిబింబము. 1.

ఆభాస్వరము. పా. అఱువదినాలుగు భాస్వరదేవతలు.

ఆభిజాత్యము. సం. వి. అ. న. అభిజాతభావము.

ఆభినివేశము. అం. మానసికపూజాకుసుమములు పదునాలింటిలో నొకటి: చూ, మానసికపూజాకుసుమములు.

ఆభిముఖ్యము. సం. వి. అ. న. అభిముఖభావము, అభిముఖముగా నుండుట.

ఆభిషువు. సం. వి. ఉ. పుం. రూ-అభీషువు. కిరణము: చూ, మయూఖము. 1.

ఆభీరపల్లి. సం. వి. ఈ. స్త్రీ. గొల్లపల్లె: చూ, దేశము.

ఆభీరము. సం. వి. అ. పుం. 2. కొంకణ దేశము. చూ, దేశము.

ఆభీరి. సం. వి. ఈ. స్త్రీ. 1. గొల్లది: చూ, మహాశూద్రి; 2. గొల్లవానిభార్య: చూ, మహాశూద్రి; అం. 3. పంచమజభాషలుపదింటిలో నొకటి: చూ, భాష. 1

ఆభీరిక. అం. మాళవకైశికజభాషలు పదుమూఁడింటిలో నొకటి: చూ, భాష. 1

ఆభీరుఁడు. సం. వి. అ. పుం. 1. గొల్లవాఁడు: చూ, మహాశూద్రుఁడు; 2. నాపితుఁడు, ఓడవాఁడు: చూ, సరంగు

ఆభీలము. సం. వి. అ. న. 1. కష్టము, బాధ: చూ, దుఃఖము; 2. భయానకరసము, నవరసములలో నొకటి: చూ, రసములు; విశే. 3. భయమును పుట్టించునది: చూ, ఉదగ్రము

ఆభీలుఁడు. సం. వి. అ. పుం. నీటిఱేఁడు: చూ, వరుణుఁడు. 1.

ఆభీషువు. సం. వి. ఉ. పుం. 1. కిరణము, కళుకు: వెలుతురు 1; 2. తాడు: చూ, పాశము 1.

ఆభుక్తి. సం. వి. ఇ. స్త్రీ.=చూ, అభూతి.

ఆభుగ్నము. సం. విశే. (అ. ఆ. అ) కొంచెము వంకరైనది; అం. 2. వక్షక్రియలయిదింటిలో నొకటి: చూ, వక్షక్రియలు.

ఆభూషితము. సం. విశే. (అ. ఆ. అ) అంతట లేక కొంచెము భూషింపఁబడినది.

ఆభోగము. సం. వి. అ. పుం. 1. వస్తువులయొక్క-గాని గుణాంగలయొక్క-గాని నిండు: చూ, పరిపూర్ణత; 2. ప్రయత్నము, పూనిక: చూ, యత్నము; 3. వరుణుని ఛత్రము: చూ, ఛత్రము.

ఆమ్. సం. అవ్య. ఒకఁడు చెప్పినదాని నంగీకరించుట: ఆమ.

ఆమ. సం. అవ్య. 1. —పై—; 2. అవునుగా, కాగా; 3. తెలిసి అవునుట.

ఆమండము. సం. వి. అ. పుం.=ఆముదము. ఏరండము * (కన్న-సామువిత్తిడ.) చూ, ఏరండబీజము (గూ-అమండము)

ఆమండితము. సం. విశే. శృంగారింపఁబడినది, అలంకృతమైనది.

ఆమంత్రణము. సం. వి. అ. న. 1.= ఆమతి. ఆహ్వానము, పిలుపు: చూ, సంబోధనము; 2. మిత్రులు మొదలగువారిని అతిథులుగా వారలచే సంతోషపఱచుట: చూ, సభాజనము; 3. యాత్రాదులయందు బంధువులలోనగువారి యనుజ్ఞఁబడయుట: చూ, వీడ్కోలు. 1.

ఆమంత్రించు. సం. స. క్రి. ఆహ్వానించు: చూ, పిలుచు.

ఆమంత్రితము. సం. విశే. (అ. ఆ. అ) పిలువఁబడినది: చూ, ఆవాహితము.

ఆమగంధి. సం. వి. ఇ. స్త్రీ. అపక్వమైన మాంసాదుల గంధముగలది, ఉడకని మత్స్య మాంసాదుల కంపుగలవస్తువు: చూ, విస్రము.

ఆమడ. దే. వి. నాలుగుకోసుల దూరము: చూ, యోజనము.

ఆమతి. వై. వి.= ఆమన్త్రణమ్. ఆహ్వానము: చూ, సంబోధనము.

ఆమతించు. వై. స. క్రి. 1. ఆహ్వానించు. "ఈ రాజులఁబిల్వఁ బంపుము ధరాసురసంఘము నామతింపుము." భార. ఆర. 6.ఆ: చూ, పిలుచు; 2 కైసేయు. "గీ ఓలిఁదగుచోట్ల వారిఁగూర్చుండఁబెట్టి, తమ్మలమ్ములు మంచి గంధములు జింక, పొక్కిలియుఁ గప్పురము గందపొడి మొదలగు, మంచిసరకులచే నామతించియంత" అచ్చ. బాల, కాం. 166. చూ, పూజించు.

ఆమతింపు. వై వి.=ఆమన్త్రణమ్ ఆహ్వానము, పిలుపు. చూ, సంబోధనము.

ఆమతిలు. వై. అ. క్రి ఒప్పించు. చూ, పుట్టు 2. "ఇంపామతిలంగనిల్చ" య. 1, ఆ.—(రూ-ఆమతిల్లు.)

ఆమతిల్లు. వై. అ. క్రి. రూ-—వై.—

ఆమద్రవ్యములు. పా. పాత్రయందుంచు బియ్యము, కూరలు, తాంబూలము, దక్షిణ మొదలగు వస్తుసముదాయము. (పాత్రగ.)

ఆమనస్యము. సం వి. అ. న. 1. రూ-అమానస్యము, ప్రసవవేదన: చూ, బిడ్డకుట్టు; 2. వంత: చూ, దుఃఖము.

ఆమని. దే. వి. 1. వసంతఋతువు=చైత్రవైశాఖమాసములు, నవకారు, పూఁదఱి, పువ్వుసమయము. ఒకఋతువు: చూ, మాసద్వయము; 2. గ్రీష్మఋతువు=జ్యేష్ఠఆషాఢమాసములు, వెట్టకారు, ఒకఋతువు: చూ, మాసద్వయము; 3. ఉత్సవము. చూ, పండుగ. 2; 4. పండ్లమొక్కవృద్ధి: చూ, ఫలసమృద్ధి; 5. మిక్కిలి సంపద: చూ, సమృద్ధి; 6. పండినపంట యొబ్బిడిచేయింపెడి తావు, కళ్ళము: చూ, ఖలము. 4.

ఆనుపూర్వకము. సం. వి. అ. న. అనుక్రమము, వరుస: చూ, విధము. 1.

ఆమబంధము. సం. వి. అ. పుం. 1. మూత్రము చేయఁబడుట; 2. అజీర్ణమువలనఁబుట్టిన రోగము: చూ, రోగము. 1.

ఆమబంధుఁడు. సం. వి. అ. పుం. కొడుకు: చూ, పుత్రుఁడు. 1.

ఆమము. సం. వి. అ. పుం. 1. తెగులు: చూ, రోగము. 1; 2. ఆమరోగము: చూ, రోగము. 1; విశే. 3. ఉడకనిది: చూ, కమణము. 1; వై. వి. (1) = ఆవాప. రూ-ఆవము. కుమ్మరివాని ఆవము, కుండలుకాల్చు చోటు: చూ, కావు.

ఆమయము. సం. వి. అ. పుం. తెగులు: చూ, రోగము. 1.

ఆమయాంశము. పా. షష్ట్యంశములలో ముప్పదియేఁడవది: చూ, షష్ట్యంశములు.

ఆమయావి. సం. విశే. (న. ఈ. న.) తెవులుగొంటు: చూ, వ్యాధితుఁడు.

ఆమరము. సం. వి. అ. న. 1. కురువేరు *: చూ, హ్రీబేరము; 2. అమరావతి, ఇంద్రుని పట్టణము: చూ, దేశము.

ఆమరి. సం. వి. ఈ. స్త్రీ. అమరియను ఆఁడుది: చూ, స్త్రీ.

ఆమర్షము. సం. వి. అ. పుం. కోపము: చూ, కోపము.

ఆమలకము. సం. వి. అ. న. 1: చూ, ఉసిరికాయ. ఆమలకి; పుం, న. 2. ఆమలకి, ఉసిరిక *: చూ, శ్రీఫలి. 1.

ఆమలము. సం. వి. అ. పుం. అశ్వత్థము *: చూ, రావి.

ఆమలకి. సం. వి. ఈ. స్త్రీ: చూ, ఆమలకము. 1. 2; 3. నేలయుసిరిక *: చూ, భూమ్యామలకి.

ఆమలకీదళము సం. వి. అ. న. అకుపత్రి *: చూ, రోమశము.

ఆమవడ. వై. వి. మజ్జిగపులుసులోనగు వాని యందు నానవేసిన వడ: చూ, భక్ష్యము.

ఆమాశయము. అం జాఠరికరసములో ఆహారపదార్థములను జీర్ణింపఁజేయు మొదటితిత్తి, అన్నకోశము, కోశములయిదింటిలో నొకటి: చూ, కోశములు.

ఆమిక. వై. వి.=అహమహమిక. రూ-ఆము. గర్వము: చూ, మదము. 1.

ఆమిక్ష. సం. వి. ఆ. స్త్రీ. 1 కూడు : చూ, పాలవిఱుగుడు; 2. ఇవురఁగాచిన పాలు, కూర్చిక, జున్ను: చూ, పాలు. 1; 3. ఈనిన అయిదారుదినములలోని పాలు: చూ, పాలు.1.

ఆమిత. వై. వి. = ఆమంత్రణమ్. ఆహ్వానము: చూ, సంబోధనము.

ఆమితి. వై. వి.= ఆమంత్రణమ్ —వై.—

ఆమిదము. వై. వి. = ఆమండ. ఏరండతైలము. రూ-ఆముదము. దివ్వెచమురు: చూ, తైలము. (ఇది విరేచనకారి. చంటిబిడ్డలకు ఉగ్గుగా ఆముదము వాడెదరు. ఉగ్గాముదమునకు చిట్టి ఆముదపు గింజలు శ్రేష్ఠము.)

ఆమిషము. సం. వి. అ. పుం, న. 1. రూ-ఆమిషము. పొలసు: చూ, మాంసము; 2. తనపని చేకూర్చుకొనుటకై యొకనికి రహస్యముగానిచ్చు ధనము: చూ, లంచము; 3. లాభము, ఒడుపు: చూ, లాభము. 1; 4. సుకము, సంతోసము: చూ, సంతోషము; న. 5. కరంజకము, కానుగ *: చూ, కాదఘ్నము; విణ. (అ. ఆ. అ.) 6. అనుభవింపఁదగిన వస్తువు; 7. పన్ను: చూ, సిస్తు. 1; 8. ఆస, కోరిక: చూ, వాంఛ; విణ.9 చక్కఁదనము మొదలయినది.

ఆమిషాశి. సం. వి. ఇ. పుం, స్త్రీ. విణ. మాంసమును దినువాఁడు: చూ, రాక్షసుఁడు.

ఆమిషి. సం. వి. ఈ. స్త్రీ. 1. జటామాంసి *: చూ, మాంసి. 1; 2. ఒకరోగము : చూ, రోగము. 1.

ఆమీలనము. సం. వి. అ. న. కొంచెము కన్నులు మూయుట.

ఆమీలితము. సం. వి. అ. పుం. కొంచెము కన్నులు మూయఁబడ్డది.

ఆమీవత్కము. సం. వి. అ. న. దేవదారు *: చూ, సూక్ష్మదారువు.

ఆమీషము. సం. వి. అ. న. రూ- ఆమిషము. పొలసు: చూ, మాంసము.

ఆము. సం. వి. అ. న. 1.= ఆమిక. మత్తు: చూ, మదము. 1; వై. వి. (1)= అహమ్. గర్వము: చూ, హంకారము; (2)= అహమ్. మత్తు: చూ, మదము. 1.

ఆముకవియు. దే. అ. క్రి. (అలము + కవియు.) క్రమ్ము: చూ, వ్యాపించు.

ఆముకొను. దే. అ. క్రి. (అలము + కొను.) —వై.—

ఆముక్తమాల్యద. పా. శ్రీకృష్ణదేవరాయలు రచించిన యాముక్తమాల్యదను పెద్దనార్యుఁడు రచించినట్లు వాద ప్రతివాదములు కలవు; రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక. 177. పుట.

ఆముక్తము. సం. విణ. (అ. ఆ. అ.) కట్టఁబడినది (వస్త్రము.): చూ, వస్త్రము; 2. తొడుగఁబడినది (కవచము.) : చూ, బొందడము; 3. భోగించి విడిచినది.

ఆముఖము. సం. వి. అ. పుం. చెప్పుట : చూ, ప్రస్తావము. 2.

ఆముత్రికము. సం. విణ. (అ. ఆ. అ.) పరలోక సంబంధమయినది: ఆముష్మికము.

ఆముదపుచెట్టు. ద్వ. వి. (కన్న-హరుళుగిడ.) *: చూ, వ్యాడంబకము.

ఆముదపుగింజలశుద్ధి. పా. ఆముదపుపప్పు నేపా ళములకు శుద్ధిచేసినట్లు చేయవచ్చును. లేదా కొబ్బరికాయనీళ్ళలో నుడకఁబెట్టిన శుద్ధియగును.

ఆముదపుపిండి. పా. చెఱుకు, అల్లము, పసుపు, మిర్చి, వంగ, అరఁటి, తములపాకులు మొదల గు సస్యములకుపయోగము. పశువులకొమ్ముకు కలిపివేసిన శ్రేష్ఠము.

ఆముదము. వై. వి. 1.= ఏరండము: చూ, తైల ము; 2. ఆముదపుగింజలు: ఆముదములు, ఆ ముదాలు.

ఆముదములు. వై. వి. బ. ఆముదపుగింజలు: చూ ఆముదము. 2.

ఆముదాలు. వై. వి. బ.—వై.—

ఆముదాలవలస. పా. దంతవక్త్రని కోటగల ముఖ లింగాలవలసయనుగ్రామ మీగ్రామమునకు స మీపమునయున్నది; కళింగదేశ చరిత్ర. 190. పుట.

ఆముష్మికము. సం. విశే. (అ. ఈ. అ.) పరలో కసంబంధమైనది: చూ, ఆముత్రికము.

ఆముష్యాయణుఁడు. సం. విశే. (అ. ఆ అ.) ప్ర సిద్ధులుఁడైన తండ్రివలనఁ బుట్టినవాఁడు, అం గములతో వేదముఁ జదువుకొన్నవాఁడు: చూ, సజ్జనుఁడు.

ఆమూలము. సం. క్రి. విశే. కడవేళ్ళ : చూ, మూలమట్టు.

ఆమూలాగ్రము. సం. అవ్య. అడుగుమొదలు కొ నవఱకు: చూ, సమూలము.

ఆమృదితము. సం. వి. అ. న. 1. చేక్కఁగా తొక్కఁబడ్డది; 2. కొంచెము తొక్కఁబడ్డది

ఆమృష్టము. సం. వి. అ. న. 1. చేక్కఁగా తో మఁబడినది; 2. కొంచెము తోమఁబడినది.

ఆమె. ద్వా. స. ఏ. (ఆ + అది.) ఆకృతి. రూ—ఆపె: చూ, ఆక.

ఆమెత. వై. వి. 1.= ఆమంత్రణమ్. ఆహ్వాన ము. రూ—ఆమిత: చూ, సంబోధనము; 2. ఉ త్సవము: చూ, పండుగ. 2; 3. ఆతిథ్యము, విందు, పగలను భోజనాదికముచే ఆదరణచే యుట. " పేటికు మ్మోదల కామెతలు పెట్టి." ర సి. 4, ఆ చూ, విందు. 2.

ఆమేరసింగ గ్రామము. శా. స్వేతకాధిష్ఠానవాసి యు, సకలకళింగాధరాజైన ఇంద్రవర్మ దేవు నిరాజ్యమునం దొక గ్రామము. ఈగ్రామము ను ఇంద్రవర్మదేవుఁడు తన యశోపుణ్యాభివృ ద్ధికై జాతుకర్ణసగోత్రుఁడగు చండస్వామి యను బ్రాహ్మణునకు దానముచేసెను; 18. ఇంద్రవర్మ దేవుని తామ్రశాసనము; కళింగదేశ చరిత్ర. 85. పుట.

ఆమోద. సం. వి. ఆ. స్త్రీ. జయంతిక *: చూ, సోమిద.

ఆమోదము. సం. వి. అ. పుం. 1. దూరముగా వ్యాపించెడి పరిమళము: చూ, పరిమళము. 1; 2. చందనము, గంధము : చూ, సుగంధము; 3. సంతోసము: చూ, సంతోషము.

ఆమోది. సం. వి. ఈ. స్త్రీ. 1. కర్పూరాది వా సన: చూ, ముఖవాసన; ఇ. పుం. 2. పదియే డు వత్సరముల యేనుఁగు: చూ, హస్తి.

ఆమోదించు. సం. అ. క్రి. సంతోషించు: చూ, సంతోషించు.

ఆమ్నాతము. సం. వి. అ. పుం. గుంపు : చూ, సమూహము.

ఆమ్నాతుఁడు. సం. వి. అ. పుం. 1. శిక్షింపఁబ డినవాఁడు: చూ, శిక్షితుఁడు; 2. సద్గుణసం పన్నుఁడు: చూ, సజ్జనుఁడు.

ఆమ్నాతకము. సం. వి. అ. పుం. నల్లగోరంట*: చూ, గోరంట.

ఆయకళ్యూలికుఁడు. సం. వి. అ. పుం. వాఁడి లయాయుధముచేతఁ జెంపఁబడనివాఁడు.

ఆయకాఁడు. వి. వి. (ఆయము + కాఁడు.) కరణములోనైన ఊరి ఉద్యోగస్థుఁడు, కరణము: చూ, పంజీకరుఁడు.

ఆయక్క. ద్వ. వి. (ఆ + అక్క.): చూ, రూ-ఆయక.

ఆయతి. సం. వి. అ. స్త్రీ. సంగీతశ్రుతి జాతివిశేషము: చూ, స్వరము. 2.

ఆయతనము. సం. వి. అ. న. 1. ఇల్లు: చూ, గృహము. 1; 2. వర్తులదేవాలయము: చూ, వేలుపుటెంకి; 3. దేవాలయము: చూ, వేలుపుటెంకి; 4. బౌద్ధాలయము, చైత్యము: చూ, వేలుపుటెంకి; పుం. 5. దేవతరువు * : చూ, రచ్చ; 6. యజ్ఞశాల, చైత్యము: చూ, గృహము. 1; షా. 7. ద్రవపదార్థములకు వేఁడిమి కలుగఁజేసినచో వీడల(పొందుమార్పు.) ఆయతనము వృద్ధియగును. ఇట్లగుట "వ్యాకోచము." ఉ. తప్పేడు నేయి కరగించిన హెచ్చగును; పేరుకొనఁబెట్టిన తగ్గును. ఇట్లాయతనము తగ్గుట "సంకోచము." అని పేరు.

ఆయతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. దీర్ఘము నిడివి: చూ, పొడవు. 2; వై. వి.= ఆయత్నమ్. ఉత్సాహము, ఆయిత్తము: చూ, యత్నము; అం. 2. త్రిస్థానకములు మూఁడింటిలో నొకటి: చూ, త్రిస్థానకములు.

ఆయతసంప్రదర్శనము. అం. సామపంచకములయిదింటిలో నొకటి: చూ, సామపంచకములు.

ఆయతి. సం. వి. ఇ. స్త్రీ. 1. దీర్ఘము, నిడుపు: చూ, పొడవు. 2; 2. కోపమువలనఁ గలిగిన తేజము: చూ, ప్రభావము. 1; 3. రాగలకాలము: చూ, భవిష్యత్తు; 4. ఆయము: చూ, వచ్చుబడి, 5 బహుళము, చాల: చూ, విస్తారము. 1; 6. కూడుకొనుట, కూడిక : చూ, సంయోగము; దే. వి. (1). జ్యేష్ఠాదిమాస చతుష్టయము, సంవత్సరమునందు మూఁడవభాగము, కందాయము: చూ, కారు. 1.

ఆయతికాఁడు. వి. విణ. ధనార్జనపరుఁడు, సొమ్ము ప్రోగుచేయువాఁడు.

ఆయత్తము. సం. విణ. (అ. ఆ. అ.)=ఆయతము. లోకువ, పరాధీనము: చూ, వశము. 1.

ఆయత్తి. సం. వి. ఇ. స్త్రీ. 1 —పై—; 2. ఎల్ల. చూ, సీమ. 1; 3. చెలిమి : చూ, స్నేహము. 1; 4. దినము, అహము : చూ, పగలు.

ఆయత్తుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ఒకరికి లోఁబడినవాఁడు: చూ, పరాధీనుఁడు.

ఆయత్నము. సం. వి. అ. న.=ఆయితము. ప్రయత్నము: చూ, యత్నము.

ఆయది. దే. స. (ఆ + అది.) అశబ్దమునకు అమహదర్థక ప్రథమైకవచనము: అది రూ-అద్ది-అయ్యది.

ఆయన. దే. స. (ఆ + అన.) అతఁడు, ఆమనుష్యుఁడు. వీనియందలి అశబ్దమునకు మహదర్థక ప్రాథమైకవచనము: చూ, అతఁడు.

ఆయప. ద్వ. స. (ఆ + అప.) తత్సతి. రూ-ఆయమ: చూ, అక.

ఆయపఱచు. దే. స. క్రి. సాగుబడిచేయు: చూ, సాగుచేయు.

ఆయమ. ద్వ స. (ఆ + అమ.) తత్సతి రూ-ఆయప చూ, అక.

ఆయము. సం. వి. అ. పుం. 1. ఆదాయము: చూ, వచ్చుబడి; 2 భాగధేయము, పన్ను: చూ, సిస్తు. 1; వై. వి. (1) గుఱ్ఱముల చావడి: చూ, వాజిశాల; (2)= ఆయువు, కీలకము: చూ, మర్మము. 1.

ఆయర్లు. దే. వి. అర్మిలి: చూ, వాత్సల్యము.

ఆయలె. దే. అవ్య (ఆ + అ + లెమ్మ.) అనాదరమును దెలుపును. "చ. అలరె బ్రియాళి వార్త ప్రియమాట వసంతము గాడ నప్పుడ, వ్వేలది సపత్నిభక్తికిని వేల్పులు మెత్తురు గాన రాగమక్తో, చలమున దన్ను గాడగ వసంతుడు తా దయసేసె గాక యా, యలె నిజభక్తినాయనుచు నాపసకుం గొదవెట్టె నీవు నక్తో." ఆము. 5, ఆ: చూ, వహేలనము.

ఆయల్లకము. సం. వి. అ న. ఎడబాటు: చూ, విరహము.

ఆయవాగము. వై. వి.=యాయావరః. ధాన్యాదుల యాచన: చూ, యాచన.

ఆయవి. దే. స. తదర్థకామవాద్వాచకబహువచనము.

ఆయశ్శూలికుడు. సం. వి. అ. పుం. తీక్ష్ణమగు కర్మగలవాడు: చూ, తీక్ష్ణకర్మ.

ఆయసము. సం. వి. అ, న, 1. అశ్మసారము, ఇనుము: చూ, లోహము. 1; 2. ఇనుపది: అయోమయము.

ఆయసి. సం. వి. ఈ. స్త్రీ. బచ్చెలి* (కన్న-బసళె.): చూ, బచ్చలి.

ఆయస్థాగము. సం. వి. అ. న. పోగాలి మొదలు: చూ, ప్రిజంఘాగ్రము.

ఆయస్తము. సం విశే (అ. ఆ. అ.) 1. కొట్టబడినది: చూ, ఆహతము; 2. కోపము నొందినది: అభినీతము; 3. ఉంపబడినది: చూ, ఉపహితము; 4. నిశ్చలమయినది: చూ, ప్రసన్నము. 2; 5 త్రోయబడ్డది: చూ, విద్ధము; 6. దుఃఖమునొందినది : చూ, దుఃఖితము ; 7. వాడి చేయబడినది.

ఆయస్తుడు. సం విశే. (అ. ఆ. అ.) కోపగింపబడ్డవాడు: చూ, రోషణుడు

ఆయాతము. సం. విశే. వచ్చినది.

ఆయానము. సం. వి. అ. పుం. అంకుశము: చూ, సృణి.

ఆయామము సం. వి. అ. పుం 1. దైర్ఘ్యము, నిడుపు: చూ, పొడవు. 2; అవ్య. 2. యామము వఱకు.

ఆయాసకరము. సం. విశే. ఆయాసముతో కూడినది.

ఆయాసపడు. మి. అ. క్రి. (ఆయాసము + పడు.) శ్రమపడు, లంపటుపడు: చూ, వేసరు. 2.

ఆయాసపాటు మి. వి. అలసట చూ, శ్రమము. 1.

ఆయాసపెట్టు. మి. స. క్రి. అలపటపెట్టు: చూ, శ్రమపెట్టు.

ఆయాసము. సం. వి. అ. పుం. 1. క్లేశము, లంపటు: చూ, శ్రమము. 1; 2. ఉత్సాహము, కడంక: చూ, యత్నము.

ఆయిటి. దే. వి. బూరుగు*. "ఆ. ఊటతనీరు చెలంది నేత మూటాయిటి, దూదియొండ పసుపు తొట్టియక్క, గంబు మేను దీని రహిం బుణ్యనుమ్మటు, కప్పురంబువెట్టె యుప్పుగొమటు." ఆము. 6, ఆ: చూ, శాల్మలి.

ఆయితపడు. ద్వ. అ. క్రి. (ఆయితము + పడు.) రూ-ఆయిత్తపడు. సిద్ధమగు: చూ, సంతనకట్టు.

ఆయితపాటు. ద్వ. వి. (ఆయితము + పాటు.) రూ-ఆయిత్తపాటు. సర్వసన్నాహనము: చూ, సర్యోషసము.

ఆయితపెట్టు దే. స. క్రి. (ఆయితము + పెట్టు,) సిద్ధము చేయు. "సర్వము నాయితపెట్టి." విజ. 2, ఆ: రూ-ఆయిత్తపెట్టు.

ఆయితము. దే. వి, వై. వి 1.=ఆయత్త. సన్నాహము, ఉత్సాహము. రూ-ఆయిత్తము: చూ, యత్నము; విశే 2. ఆయిత్తమైనది, రూ-ఆయిత్తము. "గీ. విశ్వ, వ్యాదయుండై తలచీగ యాయితము చేసి." భాగ. విరా.2 ఆ: చూ, సిద్ధము. 2.

ఆయితముచేయు. దే. స. క్రి. రూ-ఆయిత్తము చేయు: చూ, సన్నాహముచేయు.

ఆయిత్తపడు. దే. అ. క్రి: చూ, రూ-ఆయితపడు.

ఆయిత్తపాటు. ద్వ. వి: చూ, రూ-ఆయితపాటు

ఆయిత్తపెట్టు. దే. స. క్రి: చూ, ఆయితపెట్టు.

ఆయిత్తము. దే. వి, వై. వి. 1.=ఆయత్త: చూ, రూ-ఆయితము. 1; విశ. 2. ఆయిత్తమైనది: చూ, రూ-ఆయితము.

ఆయిత్తముచేయు. దే. స. క్రి: చూ, రూ-ఆయితముచేయు.

ఆయిదము. వై. వి.=ఆయుధ శస్త్రము. అస్త్ర: చూ, బాణము. 1.

ఆయిని. సం. వి. ఈ. స్త్రీ. వచ్చుబడిగల స్త్రీ: చూ, స్త్రీ.

ఆయిన్. సం. వి. న్. పుం. ఆదాయముగలవాఁడు.

ఆయివారము. వై. వి.=యాయావరః, ధాన్యాదుల భిక్షము. రూ-ఆయవారము: చూ, యాచన.

ఆయీ. వై. వి.=ఆర్యా. పూజ్యురాలు: చూ, స్త్రీ.

ఆయీరితము సం. వి. అ. న. వరుసబడిగలదానిచే చెప్పఁబడినది.

ఆయుఃప్రమాణము. అం. ప్రకాశింపఁజేయఁ గూడని పదునొకండుకర్మలలో నొకటి: చూ, ప్రకాశింపఁజేయఁగూడనివి.

ఆయుధము. సం. వి. ధ్. స్త్రీ, అ. న.=ప్రహరణము: చూ, బాణము. 1. (ముప్పదిరెండు ఆయుధములు బాణము. 1.క్రిందఁ జూపఁబడినది.)

ఆయుధశాల. సం వి. ఆ. స్త్రీ. బాణములుంచు ఇల్లు, అంబసాల: చూ, గృహము. 1.

ఆయుధాగారము. సం. వి. అ. పుం. —వై.—

ఆయుధాభ్యాసము. అ. 64 కళ లఱువదినాలుగింటిలో నొకటి: చూ, కళలు.

ఆయుధికుఁడు. సం. విశ. (అ. ఆ. అ) ఆయుధము చేత బ్రదుకువాఁడు: చూ, శస్త్రజీవుఁడు.

ఆయుధీయుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) —వై.—

ఆయుధేంద్రము. సం. వి. అ. న. విష్ణుచక్రము, సుదర్శనము: చూ, బాణము. 1.

ఆయురేఖ. సం. వి. ఆ. స్త్రీ. జీవితకాల లక్షణము: చూ, లక్షణము. 1.

ఆయుర్దాయము పా. (ఆయుః + దాయము.) మనుష్యులకు 120 సంవత్సరములు పరమాయుర్దాయము. కాని వారివారి ప్రభావాదులచేతను 120 సంవత్సరములకంటె నెక్కువకాలము జీవించువా రరుదుగ నుందురు. ఇది త్రివిధము. 1. అల్పాయుర్దాయము = 32 సంవత్సరముల వఱకు; 2. మధ్యాయుర్దాయము=70 సంవత్సరములవఱకు; 3. పూర్ణాయుర్దాయము = 120 సంవత్సరములవఱకు.

ఆయుర్లక్షణము. సం. వి. అ. న: చూ, ఆయురేఖ.

ఆయుర్వేదము. సం. వి. అ. పుం. 1. రోగచికిత్సాశాస్త్రము: చూ, వైద్యము; అం. 2. విద్యలు పదునెనిమిదింటిలో నొకటి: చూ, విద్యలు.

ఆయువు. సం. వి. స్. న. 1. జీవితకాలము: చూ, వయస్సు; 2. కీలకము: చూ, మర్మము. 1; 3. నెయ్యి. (కన్న-తుప్ప.): చూ, తైలము; అం. 4. ఆయుస్థానము, లగ్నకారకత్వములు పండ్రెండింటిలో నొకటి; (చూ, అష్టమము. 2.): చూ, లగ్నకారకత్వములు; 5. ఎనిమిది, అష్టకము: చూ, దచ్చి.

ఆయుష్కరము. సం. విశ. (అ. ఆ. అ.) ఆయుస్సును వృద్ధిచేయునది.

ఆయుష్కర్మము. సం. వి. న్. న. మంగలిపని: చూ, ముండనము.

ఆయుష్మంతము. సం. వి. త్. పుం. 1. విష్కంభాదియోగము లిరువదియేడింటిలో నొకటి రూ-ఆయుష్మత్తు: చూ, యోగములు; విశే. 2. చిరకాలము బ్రిదుకునది: ఆయుష్యము.

ఆయుష్మంతుఁడు. సం. వి. త్. పుం. దీర్ఘాయుష్మంతుఁడు: చూ, పూర్ణాయుర్దాయవంతుఁడు.

ఆయుష్మత్తు. సం. వి. త్. పుం: చూ, రూ-ఆయుష్మంతము. 1.

ఆయుష్మాన్. అం. యోగము లిరువదేడింటిలో నొకటి: చూ, యోగములు.

ఆయుష్యము. సం. వి. అ. న. 1. ఆయువు: చూ, వయస్సు; విశే. 2. ఆయువు గలది: ఆయుష్మంతము.

ఆయుస్సు. సం. వి. అ. న. 1. రూ-ఆయుష్యము: చూ, వయస్సు; 2. ఆయుఃస్థానము: చూ, ఆయువు. 4; 3. జీవస్థానము, కీలకము: చూ, మర్మము. 1.

ఆయుస్థానములు. పా. జన్మలగ్నమున కష్టమస్థానమును (అష్టమస్థానమున కష్టమస్థానమును, అనఁగా) తృతీయస్థానమును నయియున్నవి.

ఆయుస్థానాధిపతులు. పా. తృతీయాష్టమాధిపతులు.

ఆయుఃకారకుఁడు. పా. శని.

ఆయెడ. వై. క్రి. అట, అచ్చోట: చూ, తత్ర.

ఆయెనా. సముచ్చ అయినదా, అయింటా. (వా.)

ఆయెను. దే. అవ్య. క్రి. అయినది, బహూవార్థకము, ఆస.

ఆయేశము. సం. వి. అ. న. వరియింబడికి యజమానత్వము: ఆద్యైశ్వర్యము.

ఆయేశుఁడు. సం. వి. అ. పుం. వరియింబడికి యజమానుఁడు.

ఆద్యైశ్వర్యము. సం. వి. అ. న: చూ, ఆయేశము

ఆయోగము. సం. వి. అ. పుం. 1. గంధమాల్యముల కానుక; 2. మోక్షవిషయమయిన జ్ఞానము, తెలివి: చూ, బుద్ధి; 3. చేష్ట, చేఁత: చూ, పని. 2; 4. తెగులు: చూ, రోగము. 1; 5. మిక్కిలి చుట్టుట, వ్యాకృతము: చూ, పుగ. 4; 6. కపటము: చూ, వ్యాజము. 1; 7. ఎడఁబాటు: చూ, విరహము; 8. కఠినప్రయత్నము: చూ, రూ-ఆయోగము. 5; అవ్య. 9. ఎరువలుకు.

ఆయోగుఁడు. సం. వి. అ. పుం. 1. వైశ్యస్త్రీకి శూద్రునివలనఁ బుట్టినవాఁడు; 2. భాగ్యాదియోగమయినవాఁడు.

ఆయోధనము. సం. వి. అ. న. 1. జగడము: చూ, యుద్ధము; 2. చంపుట: చూ, వధము.

ఆర. సం. వి. ఆ. స్త్రీ. 1.=ఆరె. మాదిగవాని సూది. రూ-ఆరె ఎడారె: చూ, చర్మభేదిక; దే. అవ. (1) సంబోధనమునందు వచ్చెడి ఆగమము. "రాములార." మొ.

ఆరంగపువక్క. దే. వి. మేలగు ఒకవిధమయిన వక్క, పూగఖండము: చూ, వక్క.

ఆరంగము. దే. వి. —వై.—

ఆరంజోతి. వై. వి.=అరుంధతి. వశిష్ఠుని భార్య. "క. చీరచెఱంగులు ముడియిడి, కూరిమి చిటికెనలు వట్టికొనఁ గూర్చి తా, రారంజోతిని గదు నిం, పారఁగ మ్రొక్కించి గప్పు డాలిక మగనిన్." నీలా. 3, ఆ: చూ, నక్షత్రము. 1.

ఆరంబము. వై. వి. 1.=ఆరంభమ్. ప్రయత్నము: చూ, యత్నము; 2. = ఆరంభమ్. ప్రారంభస్థానము: చూ, మొదలు. 4.

ఆరంబించు. వై. వి.=ఆరంభించు. తలపెట్టు: చూ, యత్నించు.

ఆరంభము. సం. వి. అ. పుం.=ఆరంబము. 1; 2. —వై.—; 3. గర్వము: చూ, పొంకారము;

4. తొందఱపాటు: చూ, సంభ్రమము. 1; 5. చంపుట: చూ, వధము; 6. చెప్పుట: చూ, ప్రస్తావము. 2.

ఆరంభశూరత్వము. సా. ప్రారంభమున శౌర్యము చూపుట.

ఆరంభించు. సం. అ. క్రి.=ఆరంభించు తలపెట్టు: చూ, యత్నించు.

ఆరకాటి. దే. వి. ఓడనడపువాఁడు, నావికుఁడు: చూ, సరంగు.

ఆరకాఁడు. దే. వి. కృషీవలుఁడు, కమతకాఁడు: చూ, వ్యవసాయి.

ఆరకూటము. సం వి. అ. పుం, న. పిత్తలము ఇత్తడి: చూ, లోహము 1.

ఆరక్తమూల. సం. వి. ఆ. స్త్రీ దాసనము*: చూ, హయజీవనమారకము.

ఆరక్షము. సం. వి. అ. పుం. 1. ఏనుఁగుకుంభస్తనముల క్రిందిచోటు, కుంభములసంధి (అని కొందఱు.): చూ, హస్తి; విణ. 2. రక్షింపఁదగినది.

ఆరక్షుఁడు. సం. వి. అ. పుం. 1.=ఆరక్షకుఁడు. బంటు: చూ, తలారి; 2. దక్షిణనాయకుఁడు, జముఁడు: చూ, యముఁడు; 3. రక్షింపఁదగినవాఁడు, అవిత: చూ, రక్షకుఁడు.

ఆరగించు. వై. స. క్రి.1.=ఆహరించు. తిను, భుజించు: చూ, సాపడు; 2. పానముచేయు: చూ, త్రాగు.

ఆరగింత. వై. వి.=ఆహారః. ఆహారము, తిండి, సాపడుట: చూ, సాపాటు.

ఆరగింపు. వై. వి.=ఆహారః—పై.—

ఆరఁగూరుట. దే. వి. లెస్సగా నమట, క్షేమయుక్తము. "సీ. బాలార్క బింబంబులో నారఁగూరిన యంధకార మన." పారిజాతాపహరణము: చూ, లెస్స. 2.

ఆరగ్వధము. సం. వి. అ. పుం. కర్ణికారము, రేల*: చూ, రేల.

ఆరఘట్టము. సం. వి. అ. పుం. 1. నూతినుండి నీళ్ళు వెలుపలికిఁ దెచ్చుట కేర్పఱచిన యంత్రవిశేషము, ఏతాము: చూ, తలము. 2; 2. లోఁతుగల నూయి. (కీకకాపురము - పెద్దాపురము - రాజమహేంద్రవరము మున్నగుస్థలములందలి నూతులు.) "పెద్దాపురపు చెంత్రాళ్ళు ఆరఘట్టముల కుపయోగింతురు." : చూ, నుయ్యి.

ఆరజము. సం. వి. అ. పుం.=ఆరజేము. అవజము, రుంజ, డంగురము, వీగణము: చూ, వీణె.

ఆరజేము. దే. వి. 1.=ఆరజమ్.—పై.—; 2. అవ్యక్తమధురధ్వని. "పావురము లారజేంబులు పలుకుచోట." స్వా. 3, ఆ. 110: చూ, స్వరము. 2; 3. ఇంపు, అందము. "గీ. తుణ్యాచిహ్నంబు లఘుసంబున ఘటింప, సిగ్గువడుగాని కరనఖశిఖరలసిత, జాతి నూత్నక్షతాంకముల్ సమ్మతించు, నారజేమిమీతి యాదుర్విహారహారి" పాండు. 3, ఆ: చూ, సౌందర్యము; విణ. 3. కలకలము, గుంపునఁ బుట్టిన పెద్దమ్రోఁత. "రగడ. ఇంతి పావురపురొద యేల వినె నారజేము." స్వా. 3, ఆ. 84: చూ, స్వరము. 2; 4. ఒప్పిదమైనది, మనోజ్ఞము. "సీ. హైరిక సడల్చి యారజేపుఁ బైఁటుఘటించి యదిమేలో యిదిమేలో యనుచు నడుగు." శశాం. 2, ఆ: చూ, రమ్యము. 3.

ఆరట. దే. వి. వేడుకగా తిరుగుట, వాహ్యాళి: చూ, విహారము. 1.

ఆరటపడు. ద్వి. అ. క్రి. (ఆరటము + పడు.) తపించు: చూ, సంతాపించు.

ఆరటపాటు. ద్వి. వి: చూ, ఆరట.

ఆరటపెట్టు. దే. స. క్రి. (ఆరటము + పెట్టు.) పరితపింపఁజేయు.

ఆరటము. దే. వి. 1. రూ-అరాటము: చూ, సంతాపము; 2. రూ-ఆరాటము. వినవాశ్వాసనము: చూ, దుఃఖము

ఆరటించు. దే అ క్రి. పరితపించు, గుఁదిల్లు: చూ, సంతాపించు

ఆరట్టజము. సం. వి. అ. పుం. ఆరట్టదేశపుగుఱ్ఱము: చూ, హయము

ఆరట్టము. పా హిందూదేశముయొక్క పశ్చిమోత్తరమున నుండు ఒకానొక దేశము: చూ, దేశము.

ఆరడము. దే. వి. పూనిక: చూ, యత్నము.

ఆరడి. వై. వి రూ-ఆఱడి. దూఱు: చూ, నింద 1.

ఆరడిసేయు. వై స. క్రి. దూఱు చూ, నిందించు.

ఆరణపక్కి. వై వి. కహ్వాము, కొక్కెరింక: చూ, బకము.

ఆరణి సం. వి ఇ. పుం 1. కుక్కుటము: చూ, కోడి; 2 ఆవర్తము చూ, నీటిసుడి.

ఆరణ్యకాండ అం. రామాయణకాండలేడింటిలోనొకటి: చూ, కాండలు.

ఆరతి సం వి. ఇ. స్త్రీ. 1. ఊరట: చూ, విశ్రాంతి. 2; వై. వి. (1)= ఆరాత్రికమ్. నీరాజనము: చూ, రూ- హారతి.

ఆరనాళకము సం. వి. అ. న. కడుగు: చూ, శుక్తము. 1.

ఆరనాళము. సం. వి. అ. న.—వై.—

ఆరబము. వై. వి. 1. సస్యము "అకీర్తునకువావల్ కల్గకమాని నారబము పెండంజొచ్చె." వి, పు. 2, ఆ. 166: చూ, సస్యము; 2.=ఆరంభమ్. పూనిక: చూ, యత్నము; 3.=ఆరంభమ్. ప్రథమము: చూ, మొదలు. 4.

ఆరబ్ధము. సం. విశే. (అ. ఆ. అ.) ఆరంభింపఁబడినది: చూ, ప్రారబ్ధము. 2.

ఆరభటము. సం. వి. అ. పుం. ధ్వని: చూ, స్వరము. 2.

ఆరభటి. సం. వి. ఈ. స్త్రీ. 1. రూ-ఆర్భటి —వై.—; 2. ఒకానొకవృత్తి. (ఇవి నాలుగు.—కైశికి, ఆరభటి, సాత్వతి, భారతి.): చూ, వృత్తులు; 3 ప్రౌఢిమము, విజ్ఞానము: చూ, సామర్థ్యము. 1.

ఆరభటుఁడు. సం. వి. అ. పుం. పెక్కుకలు కాండ్రతోఁబోరెడి యోధుఁడు: చూ, భటుఁడు. 1.

ఆరభి. సం. వి. ఇ. స్త్రీ. ఒకానొకరాగము: చూ, స్వరము. 2.

ఆరము. సం, వి. అ. పుం. అగ్ని: చూ, నిప్పు.

ఆరయు. దే. స. క్రి. 1. రూ-అరయు. అన్వేషించు: చూ, వెదకు; 2. రూ-అరయు, వివరించు: చూ, విచారించు. 1.

ఆరయుట. దే. వి, రూ-అరయుట. అన్వేషణము: చూ, వెదకుట.

ఆరవము. సం. వి. అ. పుం. రూ- ఆరావము. ధ్వని: చూ, స్వరము. 2.

ఆరాచి. సం. వి. ఇ. స్త్రీ.=తూఁకపు త్రాసు: చూ, త్రాసు(ఇందు ఆధారము (ఫల్కరమ్.) రెండు కొనలకు మధ్య నున్నది. ఆధారమునకును కొనకును మధ్య నుండు భాగము భుజము (అరమ్.) అనఁబడును. ప్రతి తులాదండమునకును రెండు భుజములుండును. లక్షణములు.—1. దాని రెండుభుజములును సమానమైన పొడవుకలిగియుండవలెను. లేనియెడల, అసమానమైన బరువులు సమానముగా నున్నట్లు కనఁబడును. 2. దాని యాధారము, సరిగా దండమధ్యమునకుండి,యచ్చటనే యది వ్రేలాడఁదీయఁబడవలెను. 3. దాని యాధారము, ఘర్షణములేక, దండమును మిక్కిలి సులభముగా తిరుగనియ్య

వలెను; లేనియెడల, ఎంతబరువైనను, దండము ను తిరుగునట్లు చేయక, తక్కువభేదములు చూపలేకపోవును. ఘర్షణముతగ్గించుటకు సాధారణముగా, దానియాధారము. "కత్తియంచు" (నైఫ్ యడ్జి) వలె చేయఁబడును.

ఆరాట. దే. వి. రూ-ఆరాటము: చూ, సంతాపము.

ఆరాటపెట్టు. దే. అ. క్రి. తపించు : చూ, సంతాపించు.

ఆరాటము. దే. వి: చూ, రూ-ఆరాటు. వి, ప్ర 1, అ. 147.

ఆరాటించు. దే. అ. క్రి: చూ, ఆరాటపెట్టు.

ఆరాత్. సం. వి. త్. అవ్య 1.=అరతి. సమీపమునందు: చూ, సమీపము. 1; 2. దూరమునందు: చూ, దూరము; 3. అశుభము, కీడు: చూ, హాని. 2; 4. తొడపైభాగము: చూ, ఒడి, 2; 5. అందము : చూ, సౌందర్యము; 6. కల్లమాట: చూ, వితథము.

ఆరాత్రికము. సం. వి. అ. న.= ఆరతి. నీరాజనము: చూ, హారతి.

ఆరాధకుఁడు. సం, విశే. (అ. ఆ. అ.) ఆరాధించువాఁడు, అర్చకుఁడు, పూజకుఁడు : చూ, పూజారి.

ఆరాధన. సం. వి. అ. న. రూ- ఆరాధనము. పూజ: చూ, సపర్య.

ఆరాధనము. సం. వి. అ. న. 1. —పై—; 2. సంతోసము: చూ, సంతోషము; 3. పొందు: చూ, లాభము. 1; 4. వంట: చూ, సూపకారము.

ఆరాధనీయము. సం. విశే. (అ. ఆ. అ.) ఆరాధింపఁదగినది: ఆరాధ్యము.

ఆరాధించు. సం. స. క్రి. సంతసపఱచు: చూ, పూజించు.

ఆరాధితము. సం. విశే. (అ. ఆ. అ.) ఆరాధింపఁబడినది.

ఆరాధ్యము. సం. విశే. (అ. ఆ. అ.): చూ, ఆరాధనీయము.

ఆరాధ్యుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) 1. శైవమతస్థుఁడు; 2. పూజింపఁబడువాఁడు.

ఆరామము. సం. వి. అ. పుం. 1.=ఆరాము. మనుష్యులు వేసి పెంచినతోఁట, ఉపవనము: చూ, వనము. 2, 2 =ఆరాము, ఇంటిదొడ్డి ఆవరణలోని తోఁట చూ, వనము. 2; 3. ఒకరకపు చేఁప. చూ, మత్స్యము. 1.

ఆరామములు. అం. ద్రాక్షారామము, భీమారామము, అమరారామము, కుమారారామము, క్షీరారామము. (5.)

ఆరామశాకము. సం. వి. అ. న. 1. కన్నీరు: చూ, రోదనము. 2; 2 తోఁటకూర: చూ, మారిషము.

ఆరామశీతల. సం. వి. ఆ. స్త్రీ. గొడపాల *: చూ, దేవదర్భ.

ఆరాము. వై. వి =ఆరామము: చూ, ఆరామము

ఆరాముఖము. సం. వి. అ, న. ఒకరకపుబాణము: చూ, బాణము. 1; అం. బాణాగ్రములు పదింటిలో నొకటి: చూ, బాణాగ్రములు

ఆరాలికుఁడు. సం విశే (అ ఈ. అ.) అడబాల: చూ, వంటవాఁడు.

ఆరావము. సం. వి. అ పుం: చూ, రూ-ఆరవము.

ఆరిక. దే వి. రూ-అరిక. కోద్రవమను సస్యము: చూ, సస్యము. 1.

ఆరితేఱు. దే. అ. క్రి. ధైర్యవంతుఁడగు: చూ, గడికట్టు.

ఆరిమిత్రుఁడు. అం. ద్వాదశరాజమండలములు పండ్రెండింటిలో నొకటి: చూ, ద్వాదశరాజమండలములు.

ఆరియము. వై. వి = చూ, ఆరాసము.

ఆరిరంస. సం. వి. ఆ. స్త్రీ. అంతట "మింపవల యును అను ఇచ్ఛ: చూ, వాంఛ.

ఆరివేరపుఁదపసి. వై. వి. (ఆరివేరము + తపసి.) నారదుఁడు, ముళ్ళయాతి: చూ, ముని. 1.

ఆరివేరము. సం వి. అ. పుం 1. రేలు* చూ, ఓలు; వై. వి. (1) రూ-ఆర్వేరము. కలహ. "ఎ, గీ. బల్లిదులతోడ మురారిని సాపకిద్దండు చెంపగర్భారమనుచు, సంవనాపాటవంబునఁ గొంచుఁ బోయి, యారివేరంబు చేసిన యరణ ముస" కాశీ. 5, ఆ. చూ, కోపము. 1; (2)=ఆరివీర్య రూ-ఆర్వేరము. పగ: చూ, విరోధము. 1; (3)=ఆరివీర్య రూ-ఆర్వేరము. కలహము: చూ, యుద్ధము.

ఆరు. దే. వి 1. నూఁగరు: చూ, గోమరాజి; ఆ. క్రి. 2, అంగీకరించు: చూ, సమ్మతించు; 3. నిండు. "విప్రులకు నాహారం బుపూపాజ్య పూర్వకమై తిద్దయుఁ దృప్తిగాఁగ మనసారం బెట్టి." (మనసారగ=మనఃపూర్తిగా నసుట.) భో. 3, ఆ. (అడఁగారు, ఒప్పారు ఇత్యాదు లయం దిది వ్యాపారమాత్రబోధక మగును.): చూ, మెండుకొను. 8; 4. జన్మించు, "ఉ. కరుఁ డా, భూరమణుండ వడిదొ గదిసి ఘూరిశరంబులు మేన నింప నా, వ్వారుటయుం డొలంగ నతఁడు." భా. కర్ణ. 3, ఆ: చూ, పుట్టు. 2.

ఆరుఁడు, సం. వి. అ. పుం 1. అంగారకగ్రహము: చూ, గ్రహము. 1, 2. కప్పు మేనిగాము, శని: చూ, గ్రహము. 1.

ఆరుక. దే వి: చూ, రూ-ఆరికె.

ఆరుగ. దే. వి. 1. —పై —; బ. 2. ఆరువడ్లు: చూ, ధాన్యము.

ఆరుచు. దే. క్రి: చూ, రూ-ఆర్చు.

ఆరుగూలు. దే. వి 1. దోషముయొక్క ప్రకటనము. "ఆరుదూలుచేసి నన్నలయించిన యది దే." త్రైత్రియ: చూ, గద్దు. 2; విణ.2. దోషముయొక్క ప్రకటనమైనది: చూ, గద్దు 2.

ఆరుగొండ ద్వ. వి. 1. ఆగ్రాశము* (కన్న-ఈగురుడు.) చూ, దొండ; వై. వి. 2 = ఆగ్ర శ. బా.౧, నల్లగోరంటు*: చూ, గోరంటు.

ఆరుద్రపురుగు వై వి. వాన కురిసి నేల తడిగా నుండునపుడు కలుగునట్టి పట్టువంటి దేహము గల యొకానొక పురుగు. (ఆరుద్రము=ఆర్ద్ర ము.): చూ, పట్టుపురుగు.

ఆరుపు దే. వి 1. ప్రణాదము. రూ-ఆర్పు: చూ, స్వరము. 2; 2. సింహనాదము, ఏనుఁగులు మొదలయినవి భయపడుటకై కిరీటులు చేసెడి ధ్వని. రూ- ఆర్పు: చూ, స్వరము.2.

ఆరుపోరు దే. వి సంకులరణము, ఎడ తెగని యుద్దము: చూ, యుద్ధము

ఆరుమూడగు. దే. అ క్రి రూ-ఆఱుమూడగు గచ్చువిచ్చగు: చూ, వైకల్యమగు.

ఆరుమూడు. దే. వి. రూ-ఆఱుమూడు. గచ్చు విచ్చు: చూ, వైకల్యము.

ఆరురుక్షువు. సం విణ. ఉ. 1. ఎక్క నిచ్ఛగలవాఁడు; 2. మోక్షమం దిచ్ఛగలవాఁడు.

ఆరులు. దే. వి. బ. సస్యవిశేషము, ఆరికెదుబ్బులు: చూ, సస్యము. 1.

ఆరువు. సం. వి అ. పుం. 1. ఒకానొకచెట్టు: చూ, వృక్షము; 2. కర్కటకము, ఎండ్రకాయ: చూ, పీత; 3. పంది: చూ, సూకరము

ఆరూఢపతితుఁడు. సం. వి. అ. పుం ఎక్కిపడినవాఁడు.

ఆరూఢము, పా. ఆరూఢము లెనిమిదివిధములు. 1. లగ్నారూఢము=దీనికే పద మని పేరు; 2. కోశపదము=దీనికే కోశారూఢ మనియు వాడఁబడును; 3. వాహనపదము; 4. మంత్రి

పదము=సుతపదమని వాడుక కలదు; 5. దార పదము; 6. భాగ్యపదము; 7. వ్యయపదము= దీనికే రాజ్యపద మనియును గలదు; 8. ఉప పదము. వీటిని అష్టపదములందురు. (1 ఏభావ మునకు ఆరూఢము కనిపెట్టవలెనో ఆభావము నకు ఆభావాధిపతి యెన్నవరాశియం దుండు నో దాని కన్నవరాశి ఆపేరుగల ఆరూఢమనం బడును. 2, ఏభావమునకు ఆరూఢము కనిపెట్ట వలెనో ఆభావాధిపతి ఆభావమునందే యున్న మొదల, అదియే ఆ పేరుగల ఆరూఢ మనం బడును.)

ఆరూఢమూలము. సం. విశే. (అ. ఆ. అ.) చీ క్కగా వేరు దిగినది.

ఆరూఢలగ్నము. పా. జన్మలగ్నమునకు జన్మల గ్నాధిపతి యెన్నవయింటయందునో ఆయిల్లు మొదలు అన్నవరాశి ఆరూఢలగ్నమగును. ఉ. ఒకజాతకునకు జన్మలగ్నము కుంభము. కుంభాధిపతి కుంభలగ్నమునకు 12 వ రాశియ యిన మకరమందుండెను. గనుక మకరమునకు 12 వ రాశియయిన ధనుస్సు ఆరూఢమయి నది. గనుక ఆరూఢలగ్నము ధనుస్సు.

ఆరూపకము. సం. అవ్య. రూపకాలంకారము వలెను.

ఆరూపితము సం. అవ్య. తెల్లజిల్లేడు వలెను.

ఆరూఢి. సం. వి. ఇ. స్త్రీ. అధిరోహణము: చూ, ఎక్కుడు. 5.

ఆరె. దే. వి. 1. ఏలుబాలక*: చూ, ధాతకి; వై. వి. 2.=ఆరా. చెప్పులు కుట్టెడు సూది, అర: చూ, చర్మభేదిక; 3.=ఆరా. ఆయుధ విశేషము. "వ. పేరెలమిం దలపడిన వీరుల వారెలం జీఱి నాలుకలు వ్రేసినట్లు చేసియు." ఉ, హరి 6, అ: చూ, బాణము, 1; వై. విశే. 4. మరాటివాండు: చూ, మహా రాష్ట్రుండు; అవ్య. 5. ప్రశ్నార్థకము: చూ, ఏకారము.

ఆరెకుండు. వై వి.=అరకుడు. కలవరి: చూ, గిలారి

ఆరెగోల దే. వి. తోత్రము: చూ, ముల్లుకోల.

ఆరెతీగ. దే. వి. పానీయవల్లి*: చూ, కుమవి తాఫల.

ఆరెపువ్వు. ద్వ. వి. ఏలుబాలక*: చూ, ధాతకి.

ఆరెబొట్టె. ద్వ. వి. కోడి కాలివేళ్ళకు వెనుక తట్టున సూదివలె మొక్కలివాడిగానుండెడు ఒంటిగోరు.

ఆరెము. దే. వి. 1 అనుభావ, దాక్షిణ్యభావ: చూ, భావ 1; వై. వి. 2.= అంకుశ: చూ, ఆరెము.

ఆరెవడ్లు. ద్వ వి. సూదులవంటి తోకలుగల ఒకరకము వడ్లు, ఆరెలు: చూ, ధాన్యము.

ఆరేవతము. సం. వి. అ. పుం. రేచ* చూ, రేల.

ఆరోగణము. వై. వి.=ఆహారః ఆరోహణ. రూ- ఆరోగిణము: చూ, సాపాటు

ఆరోగిణము. వై. వి.= —వై— (రూ-ఆరో గణము.)

ఆరోగించు. దే. స. క్రి. భుజించు: చూ, సాపడు.

ఆరోగ్యము. సం. వి. అ. న. రోగములేక యుం డుట: చూ, కల్యత్వము

ఆరోగ్యశాస్త్రము, పా. మానవదేహ మందలి నా నావిధభాగముల పనులనుగూర్చియు, విధులను గూర్చియు, ఆరోగ్యస్థితియం దెట్లు ఆయా పనులు నెఱవేర్పబడునో అట్టిరీతులను గురిం చియు తెలుపు శాస్త్రము

ఆరోపణము. సం. వి. అ. పుం. ఆరోపించుట: చూ, రూ-ఆరోపము.

ఆరోపము, సం. వి. అ. పుం.—వై.—: అధిష్ఠా నము, ఆరోపణము;-అవ్య. అతి.

ఆరోపించు. సం. స. క్రి. ఆరోపణము చేయు: చూ, పాదుకొట్టు.

ఆర్టిక్యులర్ సర్ ఫేస్. ఇం ఎముక ఏముకి సరిగా అతుకుటకు వీలుగానుండునట్లు ఒకదానిమీఁద నొకటి వెన్నుపూసలన్నియు నుండి పై ఎముక పైరెండు నున్నటిప్రదేశములు స్లేంటెంగు (దొప్పలు) గా నుండుట.

ఆర్డరు. ఇం ఆజ్ఞ: చూ, సలవు

ఆర్తకంఠధ్వని. సం. వి. ఇ. పుం. ఏడుపు: చూ, స్వరము 2

ఆర్తగళము సం వి. అ. పుం 1.=అరుదొండ. నల్లగోరంట*: చూ, గోరంట; 2 =అరుదొండ తుజాలకము*: చూ, దొండ; 3. తుండకేరి, బింబిక*: చూ, దొండ.

ఆర్తజనరక్షణ. పా పేదల (స్త్రీలు మొ॥) సంరక్షణదీక్ష.

ఆర్తము. సం. విశే. (అ. ఆ. అ ) దుఃఖము నొందినది: చూ, దుఃఖితము.

ఆర్తవము. సం. వి. అ. న. 1. స్త్రీఋతువు : చూ, ముట్టు 1; 2. పువ్వు, పువ్వు: చూ, సుమము. (ఈ మిశ్రితపుష్ప పటము.ఇందు రక్షకపత్రములు,ఆకర్షణపత్రములు,పురుష కేసరములు, స్త్రీ కేసరము, అండాశయము కలవు.); విశే 3. ఋతుసంబంధమైనది

ఆర్థాప్టరములు పా మిడుతలును, గొల్లభామలును ఈయమలోనములోనివి. ముందుజత రెక్కలు చిన్నవి. వెనుకటివి మడతలు. గుడ్లు పొరచేగప్పఁబడును. ఇవి పచ్చికయందుసంచరించును.

ఆర్తి. సం. వి ఇ. స్త్రీ. 1. ఇడుమ: చూ, దుఃఖము; 2. అటని. కోటి: చూ, వింటికొన; వై. వి. (1)=ఆరాత్రికమ్. రూ-ఆరతి: చూ, హారతి; ఆం. 2. సంచారీభావములు ముప్పది మూఁడింటిలో నొకటి: చూ, సంచారీభావములు

ఆర్తుఁడు. సం విశే. (అ. ఆ. అ.) దుఃఖముతో నున్నవాఁడు: చూ, దుఃఖితుఁడు.

ఆర్త్విజ్యము. సం. వి. అ న ఋత్విజునిభావము.

ఆర్థి. సం వి. ఈ. స్త్రీ. సదృశాది శబ్ద ప్రయోగములనుఁ బూర్ణోపమాభేదము

ఆర్దితము. సం విశే. (అ. ఆ. అ.) 1. యాచింపఁ బడినది; 2 హింసింపఁబడినది; వి. అ. న. 3. వాతరోగము: చూ, రోగము 1.

ఆర్దుము ద్వ. వి. (ఆఱు + తూము.): ఆఱుతూములు రూ-ఆర్దుము.

ఆర్ద్ర. సం. వి. ఆ. స్త్రీ 1 ఆర్ద్రానక్షత్రము, కాలిని: చూ, నక్షత్రము. 1, విశే. 2 తడిసినది: చూ, వోదము.

ఆర్ద్రింబగు. మి. అ. క్రి తడియు: చూ, నాను. 2

ఆర్ద్రిక. ఆం ఘృతములు పదింటిలో నొకటి: చూ, ఘృతములు.

ఆర్ద్రకము. సం వి. అ న 1 = అల్లము(కన్నడ-హాసినొంటి.)*: చూ, శృంగిబేరము (అజీర్ణము పోగొట్టును ) 2. అరుద్రపురుగు: చూ, పట్టుపురుగు.

ఆర్ద్రత. సం. వి ఆ. స్త్రీ తడి: చూ, పదను 2

ఆర్ద్రతామాపకము పా. వాయువుయొక్క ఆర్ద్రతనుగనిపెట్టు సాధనము (హైగ్రోమీటర్.); అంతరిక్ష విద్యాధికారులు ప్రమరించుపట్టికల కిదియే ప్రధానము

ఆర్ద్రము. సం. వి. అ. న. 1. అల్లము *: చూ, శృంగిబేరము; విశే 2 తడిసినది:చూ వోదము.

ఆర్ద్రవస్త్రము సం వి. అ. న. తడిబట్ట : చూ, పిడప.

ఆర్థికన్యాయము. పా జీవితమందుఁగల ధర్మము. (ఎకనమిక్ లా )

ఆర్థికపరిస్థితులు. పా. జీవితమందుఁగల మంచిచెడ్డలు.

ఆర్థికశాస్త్రము పా. అర్థశాస్త్రము(ఎకనమిక్సు.)

ఆర్ధికము. సం. వి. అ. న. వడ్డిచేతఁ బ్రదుకుట: చూ, వృద్ధిజీవనము.

ఆర్ధికోత్సాహము. పా. ఆర్ధికశోధ.

ఆర్పు. దే. వి. 1 ప్రణాదము, బొబ్బరింత: చూ, రూ-ఆరుపు. 1; 2 సింహనాదము : చూ, రూ-ఆరుపు. 2; స. క్రి. 3. అఱుపు: చూ, దక్కించు.

ఆర్ఫనేజీ. ఆం అనాథబాలబాలికా శరణాలయము.

ఆర్భాటము. వై. వి.=ఆర్భటి. ధ్వని, చేప్పుడు: చూ, స్వరము. 2.

ఆర్బిట్రేషన్. ఆం మధ్యవర్తిత్వము.

ఆర్భటము సం. వి అ. పుం. = ఆర్భాటము రూ-ఆరభటము. ధ్వని, చేప్పుడు: చూ, స్వరము. 2

ఆర్భటి సం వి. ఈ. స్త్రీ = ఆర్భాటము. —వై.—

ఆర్య సం. వి. అ స్త్రీ. 1. బాలిక, పదునాలేండ్లప్రాయముగల ఆఁడుది: చూ, స్త్రీ; 2. దుర్గ: చూ, పార్వతి. 1; 3. పూజ్యస్త్రీ: చూ, స్త్రీ; 4. ధాన్యవిశేషము : చూ, ధాన్యము; 5. తల్లి: చూ, మాత; 6. ఆర్యాగీతి. కందపద్యభేదములలో నొకటి. ఇది పథ్యాకందముకన్న నొకగురువు అధికముగా నుండును. ఇదియే సమాజ కందంబనఁబడును. (చూ, కందము ): చూ, వృత్తము. 1.

ఆర్యకము. సం. వి. అ. న పితృకార్యము. ఆబ్దికము: చూ, సాంవత్సరికము.

ఆర్యపుత్రుఁడు. సం. వి. అ. పుం. (నాట్యపరిభాషయందు.) పెనిమిటి: చూ, మారిషుఁడు.

ఆర్యమిశ్రుఁడు. సం వి. అ. పుం గౌరవింపఁబడువాఁడు: చూ, మర్యాదకుఁడు.

ఆర్యాణి. సం వి ఈ. స్త్రీ. పూజ్యురాలు: చూ, స్త్రీ.

ఆర్యావర్తము. సం. వి అ. పుం. 1 పుణ్యభూమి హిమవత్పర్వతమునకును వింధ్య పర్వతమునకును నడుమనుండు దేశము: చూ, దేశము; ఆం 2. దేశము లేబదియాఱింటిలో నొకటి: చూ, దేశములు.

ఆర్యి సం. వి. ఆ. స్త్రీ. పూజ్యుని యిల్లాలు: చూ, భార్య

ఆర్యుఁడు. సం. వి అ. పుం. 1. (నాట్యపరిభాషయందు) పెనిమిటి : చూ, మారిషుఁడు; 2. శ్రేష్ఠు. చూ, పెద్దల్లుఁడు; విణ. 3.= అయ్య. పూజ్యుఁడు: చూ, మహనీయుఁడు; 4.= అయ్య. తండ్రి. చూ, పితరుఁడు; 5. మంచికులమునఁ బుట్టినవాఁడు: చూ, సజ్జనుఁడు; 6. న్యాయము తెలిసినవాఁడు

ఆర్వేరము. వై. వి.= అరివీర్య రూ-అరివేరము: చూ, అరివీర్యము.

ఆర్షజగతి సం. వి. ఈ. స్త్రీ. ఋషిప్రోక్తమైన జగతీఛందస్సు: చూ, ఛందస్సులు.

ఆర్షపంక్తి. సం. వి. ఇ స్త్రీ ఋషిప్రోక్తమైన పంక్తిఛందస్సు: చూ, ఛందస్సులు.

ఆర్షబృహతి. సం. వి. ఈ. స్త్రీ. ఋషిప్రోక్తమైన బృహతీఛందస్సు: చూ, ఛందస్సులు

ఆర్షభి. ఆం. శుద్ధజాతులేడింటిలో నొకటి: చూ, జాతులు

ఆర్షభ్యము. సం. వి. అ. పుం. ఆఁబోతుగా విడువఁదగిన కోడెదూడ: చూ, వృషభము 1

ఆర్షము. సం వి. అ. పుం. 1. ధర్మార్థము వరునివలన గోమిథునము పుచ్చుకొని కన్యకనిచ్చి యథాశాస్త్రముగాఁ జేయు వివాహము: చూ, వివాహము; 2. పదముయొక్క నడుమను పాదముయొక్క కొనను రెండవపాదము గలిగిన మూఁడుపాదముల మంత్రము: చూ, మంత్రము. 1; విణ. 3. ఋషిది; ఆం. 4. వివాహము లెనిమిదింటిలో నొకటి: చూ, వివాహములు.

ఆర్షగాయత్రి. సం. వి. ఈ. స్త్రీ. ఋషిప్రోక్తమైన గాయత్రీ ఛందస్సు: చూ, ఛందస్సులు

ఆర్షత్రిష్టుప్పు. సం. వి. భ్. స్త్రీ. ఋషిప్రోక్తమైన త్రిష్టుప్ఛందస్సు: చూ, ఛందస్సులు.

ఆర్ష్యనుష్టుప్పు. సం. వి. భ్. స్త్రీ. ఋషిప్రోక్తమైన యనుష్టుప్ఛందస్సు: చూ, ఛందస్సులు.

ఆర్షోష్ణిక్కు. సం. వి. హ్. స్త్రీ. ఋషిప్రోక్తమైన ఉష్ణిక్ఛందస్సు: చూ, ఛందస్సులు

ఆర్హతి. సం వి. ఆ. స్త్రీ, న. పూజ్యత్వము, రూ-ఆర్హత: చూ, సౌగతి.

ఆర్హతి. సం. వి. ఇ. స్త్రీ, న.—పై.—

ఆర్హతుఁడు. సం. వి. అ. పుం. జైనశాస్త్ర మెఱిఁగినవాఁడు.

ఆఱఁగట్టు. దే. స. క్రి. (ఒట్టు) ఆఱవేయు: చూ, ఎండ వేయు

ఆఱడి. దే వి. 1. దూఱు. "సీ. రక్తాక్త మౌక్తికాంత మూర్ధాబ్జగశాలి నాఱడిరిత్త చెంపు కొంటి." జై. 7, అ. 34: చూ, నింద. 1; విణ 2. పొల్లు, వమ్ము, ప్రయోజనములేనిది: చూ, వ్యర్థము.

ఆఱడిపడు. ద్వ. అ. క్రి. 1. పొల్లువోవు "ద్వి. నూఱువేలేండ్లు సన్నుతి తిలేక, యాఱడిపడి భస్మమై యున్నవారు" రా. బాల, కాం: చూ, వ్యర్థమగు; 2. తిట్టుపడు: చూ, దూఱుపడు.

ఆఱడిపెట్టు. ద్వ. అ. క్రి.—పై —

ఆఱడిపోవు. ద్వ అ. క్రి.—పై.— (రూ-ఆఱడివోవు.)

ఆఱవసంద్రము. ద్వ. వి. పాలసముద్రము: చూ, సముద్రము.

ఆఱవేయు. దే స. క్రి. చూ, ఆఱఁగట్టు.

ఆఱాపు. దే. వి. ప్రణాదము, అఱపు: చూ, స్వరము. 2. (బ. ఆఱాపులు)

ఆఱు. దే స. 1. ఐదునొకటి: చూ, షట్కము; 2. నూఁగారు: చూ, రోమరాజి; అ. క్రి. 3. అడఁగారు: చూ, శుష్కు. 4; 4 చెడు: చూ, నశించు; 5. తడిలేయు, ఎండు: చూ, మిడుకు. 8.

ఆఱుకుంచెములు వై. వి ఆఱుస: చూ, షట్ప్రసి. "షట్ప్రస్థి పేరాఱుసయన వెలయు." ఆం, భా. ద్వి. వై.

ఆఱుగురు. దే. స. ఆఱుమంది. (ఆఱు కు మహత్మహత్యర్థక రూపము.) రూ-ఆఱువురు

ఆఱుమ. దే. పే్రి. చూ, రూ-ఆర్పు.

ఆఱుతూములు. దే. వి. బ: చూ, అర్ధము.

ఆఱుపలము. మి వి. రూ-ఆఱ్పలము. (పలము= నాలుగు కర్షములయెత్తు.): చూ, పలము. 1

ఆఱుపు. దే. వి: చూ, రూ-అఱుపు.

ఆఱుము. దే. వి: చూ, అర్ధము.

ఆఱుమూడగు. దే. అ. క్రి. చూ, రూ-ఆగుమూడగు; ఆం, శ. 9.

ఆఱుమూడు. దే. వి: చూ. రూ-ఆరుమూడు.

ఆఱుమోముల వేలుపు. ద్వ. వి షణ్ముఖుఁడు, జేమిలిముత్తల: చూ, స్కందుఁడు.

ఆఱువ. దే. వి. పీను: చూ, దేశము.

ఆఱువాళ్ళు. దే. వి. బ. (ఆఱు + వాదులు.) కొంచెము ఎండుట.

ఆఱువురు. దే. స: చూ, రూ-ఆఱుగురు.

ఆఱుస. ద్వ. వి. (ఆఱు + కుంచెము.): చూ, ఆఱుకుంచెములు.

ఆఱ్తుము. ద్వ. వి. (ఆఱు + తూము.) : చూ, రూ-అర్ధము

అలంకి. దే వి. 1. కురిచీవంటి పల్లకి: చూ, పాలకి; 2. బాలక్రీడా విశేషము: చూ, బాలక్రీడ.

అలంకిగుడి. ద్వ. వి. —పై—. రా, వి. 2, అ. 23.

ఆలంకులు. దే. వి. బ. —ప్రై.— వి, పు. 7, ఆ. 302.

ఆలంబనవిభావము. ఆం విభావములు రెండింటిలో నొకటి: చూ, విభావములు. (స్త్రీపురుషాదులాలంబన విభావము=రసాధారమనుట.)

ఆలంబము. సం. వి. అ. పుం. ఆశ్రయము, ఊఁత: చూ, ప్రాపు. 2.

ఆలంబించు. సం. స. క్రి. ఆశ్రయించు. ఊఁతకొను: చూ, ప్రాపుగొను.

ఆలంభము. సం. వి. అ. పుం. 1. చంపుట: చూ, వధము; 2. తాఁకుడు: చూ, స్పర్శము.

ఆలఁగాఁపరి. దే. వి. 1. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1; 2. గొల్లవాఁడు. చూ, మహాశూద్రుఁడు. (రూ- ఆలఁగాఁపు- ఆలకాఁపరి- ఆలకాఁపు.)

ఆలకము. సం. వి. అ. పుం పెద్దనీలి *: చూ, రంజని.

ఆలకి. దే. వి. 1. నాథుఁడులేనిది: చూ, విధవ; 2. దిక్కులేనిది (వాఁడు.): చూ, విధవ; 3 ఒకరిమాట వినని ఆఁడుది: చూ, స్త్రీ.

ఆలకించు. వై. స. క్రి. 1.= ఆలక్షించు పాటించు. "సీ. అంచేలార యాలకించివినుఁడు." చంద్రా. 4, ఆ. 59: చూ, సంభాళించు; 2. ఆకర్ణించు: చూ, విను. 2.

ఆలక్షించు సం. స. క్రి. 1.= ఆలకించు: చూ, సంభాళించు; 2. చూచు: చూ, వీక్షించు.

ఆలగోఁడు బాలగోడు. దే. వి. విపరీతధ్వని, పెడబొబ్బ, మొత్తుకోళ్ళు: చూ, స్వరము 2.

ఆలతి. వై. వి.= ఆలప్తిః. రూ-ఆలత్తి- ఆళతి: చూ, స్వరము. 2.

ఆలత్తి. వై. వి.= ఆలప్తిః.—ప్రై.—

ఆలన. దే. వి. ఏలుబడి. "నాఆలన చేూడరు.". చూ, రక్షణము. (నాఆలనపాలన చూడరు అని వాడుక.)

ఆలపించు. వై. స. క్రి.= ఆలాపించు. రాగము తిన్నఁగా తీద్చు: చూ, ఆలాపించు.

ఆలపోతు. దే. వి. రూ-ఆఁబోతు: చూ, వృషభము. 1.

ఆలప్తి. సం. వి ఇ. స్త్రీ.= ఆలతి-ఆలత్తి: చూ, స్వరము. 2 (రూ-ఆలాప్తి.)

ఆలప్యాలము. సం. అవ్య. పలుకవలదనుట.

ఆలము సం. వి. అ. న. 1. రూ-ఆళము. తేలుకొండిముల్లు: చూ, అలము. 2; 2. రూ- ఆలము పసుపువర్ణము గల మట్టి: చూ, హరిదళము; దే. వి. (1) ఆక్రోశ: చూ, మంటమేలము. 2; వై వి. (2) హారః. జగడము: చూ, యుద్ధము.

ఆలముచేయు. ద్వ. స. క్రి. 1. యుద్ధముచేయు; 2. అండముచేయు

ఆలమెకము ద్వ. వి. నక్క: చూ, సృగాలము.

ఆలయము. సం. వి. అ. పుం. 1. ఇల్లు: చూ, గృహము. 1; (ఇట్లు అనాథశరణాలయము, ముద్రణాలయము, విద్యాలయము. మొ.); 2. దేవాలయము: చూ, వేలుపుటింటి.

ఆలరి. దే. విశ. దుశ్శీలుఁడు, శీలస్వభావాదులచేత నిందితుఁడు. "ఉ. సోలుఁ బురే సరోజభవ సత్ప్రవృత్తిఁ దొలంగి కూఁతు ని, ట్లాలరివై రమింప హృదయంబునఁ గోరుట ధర్మరీతియే." భాగ. 3, స్కం: చూ, వ్యాధుఁడు. 2.

ఆలకోఁడు. దే. వి. ఎద్దు, బసవఁడు: చూ, వృషభము. 1.

ఆలవట్టము. వై. వి. 1.=ఆలావర్తమ్. వస్త్రముతో గుండ్రముగాఁ జేసిన విసనకఱ్ఱ: చూ, సూరెపాను; 2 =ఆలావర్తమ్. గుడ్డగొడుగు: చూ, ఛత్రము,

ఆలవాలము. సం. వి. అ. న. ఆవాలము: చూ, పాదు. 1.

ఆలసము. వై. వి.=ఆలస్యమ్: చూ, విలంబము. 1.

ఆలసించు. వై. అ. క్రి.= ఆలస్యమ్ ఆలస్యము చేయు: చూ, తడయు.

ఆలస్యము సం. వి. అ. న. 1.= ఆలసము చూ, విలంబము. 1; 2. జడ్డుదనము: చూ, సోమరితనము; 3. మోఱకు: చూ, పర్యాయము; పుం. 4. జలమార్జరము, నీరుపంది: చూ, మత్స్యము. 1; అం. 5. సంచారీభావములు ముప్పదిమూఁడింటిలో నొకటి: చూ. సంచారీభావములు. (స్మర మనోహరుం డగు వరుం దలంచుచు నక్కరంగాక్షి సరసంగ ల సరసిజాక్షులు తన్నుం బిలువ నెగాదిగం బూమిం గాని మారు మడుపకుండె.)

ఆలస్యసమయము. పా. గ్రహసమయము లిరువది యేడింటిలో నొకటి చూ, గ్రహసమయములు. (మిక్కిలి భయమును గలిగించును.)

ఆలస్యుఁడు. సం. వి. అ. పుం. అలసుఁడు, బద్ధకుఁడు: చూ, సోమరి.

ఆలాగు. దే. అవ్య. రూ-అలాగు: చూ, ఁథా 2.

ఆలాజ్యము. సం. వి. అ. న. వంటకిట్టియలు చూ, వంటచెఱకు.

ఆలాత. అం. ఆకాశచారులు పదునాలుగురిలో నొకరు: చూ, ఆకాశచారులు.

ఆలాగము. అం. కరణములు నూటయెనిమిదింటిలో నొకటి: చూ, కరణములు.

ఆలానము. సం. వి. అ. పుం, న. 1. ఏనుఁగును కట్టు కంబము చూ, స్తంభము. 1;2 పగ్గము: చూ, సూత్రము. 1.

ఆలానిక. సం. వి. అ. స్త్రీ. తములపాకులతీఁగె*: చూ, నాగవల్లి.

ఆలాప. అం. గాంధారగ్రామగతమూర్ఛన లేడింటిలో నొకటి: చూ, గాంధారగ్రామగత మూర్ఛనలు.

ఆలాపనము. సం. వి. అ. న. 1. బంధుమిత్రసంభాషణము, నిండుమాట: చూ, సంభాషణము; 2. రాగాలాపము; చూ, ఆలప్తి.

ఆలాపము. సం వి. అ. పుం. —వై.— ఆలాపి. అం. ఋత్విజు లిరువదిరెండింటిలో నొకటి: చూ, ఋత్విజులు.

ఆలాపించు. సం. స. క్రి. రాగముఁ దీర్ఘఁగా నీడ్చు: చూ, రూ-ఆలపించు.

ఆలాపిని సం. వి. ఈ. స్త్రీ. 1 వల్లకి: చూ, వీణె; అం. 2. తతవాద్యము లిరువదింటిలో నొకటి: చూ, తతవాద్యములు.

ఆలాప్తి. సం వి ఇ. స్త్రీ = ఆలతి- ఆలప్తి: చూ, రూ-ఆలప్తి.

ఆలాబువు. సం. వి. ఊ. స్త్రీ. చూ, గూ-అలాబువు *.

ఆలాయము. సం. వి. అ. న. 1. అశ్వశాల: చూ, గృహము. 1; వై. వి. (1) గాబు: చూ, పాత్రము 6; విశే. (2) ఆయిత్తమైనది: చూ, సిద్ధము. 2.

ఆలార్తి. సం. వి. ఈ. స్త్రీ.= ఆలతి- ఆలప్తి: చూ, ఆలప్తి.

ఆలానము. సం. వి. అ. పుం పైర్లు మొ॥ కోయుట: చూ, లవనము.

ఆలావర్తము. సం. వి అ. న.= చూ, ఆలవట్టము.

ఆలి. సం. వి. ఇ. స్త్రీ. 1. శ్రేణి: చూ, పంక్తి. 1; 2. చెలికత్తె: చూ, సఖి. 1; 3. తేలు: చూ, వృశ్చికము. (రూ-ఆళి.); దే. వి. (1) పెండ్లాము: చూ, భార్య; విశే. (2) తక్కువైనది. "మ. మగఁడా నీవు జగంబుచొప్పు మిగులన్ మానంబు వాటించు వాలిగ పెద్దంబగుమాట వాటిలెనె." నిర్వ. 5, ఆ: చూ, హీనము. 1.

ఆలింగనము. సం. వి. అ న. కవుఁగిలింత: చూ, కౌఁగిలి.

ఆలింగనములు. అం. 1. పరసాలింగనము, దృఢాలింగనము, సర్వాలింగనము, స్పృష్టకాలింగనము, పృథకాలింగనము, అనురూపాలింగనము, గూహనాలింగనము, కుచాలింగనము, లాటికా

లింగనము, నిరూపణాలింగనము, లతావేష్టితాలింగనము, వృక్షాధిరూఢాలింగనము, తిలతండుల కాలింగనము, క్షీరకాలింగనము. (14.); 2. అజాతస్మరాలింగనము, జాతస్మరాలింగనము. వీనిలో అజాతస్మరాలింగనము నాలుగు విధములు.- స్పృష్టకము, విద్ధకము, ఘృష్టకము, పీడనము; జాతస్మరాలింగనము యెనిమిదివిధములు.-లతావేష్టితము, వృక్షానిరూఢము, తిలతండులము, నీరక్షీరము, ఊరూపగూహనము జఘనోపశ్లేషము, కుచాశ్లేషము, లాలాటము.

ఆలింగితము. సం. విణ. (అ ఆ. అ.) కవుఁగిలింపఁబడినది చూ, ఉపగూఢము.

ఆలింగ్యము. సం వి. అ పుం. 1 గోపుచ్ఛము వంటి ఆకారముగల మృదంగము, ఆగోకు మద్దెల: చూ, మృదంగము 1, విణ. 2. కవుఁగిలింపఁదగినది

ఆలించు. వై. స. క్రి.=ఆలకించు: చూ, ఆలకించు.

ఆలిందకి సం. వి. ఈ. స్త్రీ. ఉడుత చూ, చిక్రోడము. (రూ-ఆలిందకి.)

ఆలిందము. సం. వి. అ. పుం. ఇంటిచోపా.

ఆలింపన. సం. వి. ఆ. స్త్రీ. తనివి చూ, తృప్తి

ఆలిగొను. దే. స. క్రి. (ఆలి + గొను.) 1. అపహసించు: చూ, వెక్కిరించు. 8; 2. తిరస్కరించు: చూ, వంచించు.

ఆలిచిప్ప. దే. వి. జలశుక్తి (జలసామాన్యమునందెల్లఁ బుట్టునది.): చూ, సంకు. 1.

ఆలిప్తము. సం. విణ. (అ. ఆ. అ.) పూయఁబడినది

ఆలిప్రిదేశము, శా. ఉత్తర ఒరిస్సా రాజగు ముకుందదేవుని చంపి యాతనిమంత్రికుమారుఁడగు రామచంద్రదేవు ఉత్తర ఒరిస్సారాజ్యము నేలుచుండెను. ముకుందదేవుని పుత్రుఁడు ఢిల్లీచక్రవర్తిని శరణు వేఁడఁ జక్రవర్తి రాజా మానసింహునిఁ బంపెను. అతఁడు రామచంద్రదేవుని ఒరిస్సారాజుగా నియమించి ముకుందదేవునిపుత్రునకు యీ ఆలిప్రిదేశము నిచ్చెను తరువాత కొంత కాలమునకు రామచంద్రదేవు కటకమున నున్న ఆఫ్గనులకు సహాయము నొసర్చుచుండెనని విని తిరిగి మానసింహుఁడు ఒరిస్సాపై దండెత్తి ఆఫ్గనుల నోడించి ఒరిస్సాదేశము మొగల్ రాజ్యములో కలిపివేసెను. ముకుందదేవుని కొడుకగు తెల్ (తెలుఁగు) రాజునకు ఆలిప్రిదేశము పూర్తిగా నిచ్చివేసెను. కళింగదేశచరిత్ర. 662. పుట.

ఆలిప్స. సం. వి. ఆ. స్త్రీ. పొందనిచ్ఛ.

ఆలిప్సుఁడు సం. వి. అ. పుం. పొందుటకు యిచ్ఛయించినవాఁడు: చూ, వలపుకాఁడు.

ఆలీకులము సం. వి. అ. న. చెలికత్తెలగుంపు.

ఆలీఢము. సం. వి. అ. న. 1. విలుకాఁడు కుడికాలు ముందటికి చాఁచి నిలుచుట: చూ, సమపదము; 2. విలుకాఁడు రెండు కాళ్ళు సమముగానుంచుకొని నిలుచుట: చూ, సమపదము; విణ 3. నాకఁబడినది; అం. 4. విలుకాని స్థానము లయిదింటిలో నొకటి: చూ, విలుకానిస్థానములు; 5. అశ్వసంచారమార్గములు తొమ్మిదిటిలో నొకటి: చూ, అశ్వసంచారమార్గములు; 6. పుంస్థానకము లాఱింటిలో నొకటి: చూ, పుంస్థానకములు

ఆలీనమీనము. సం. వి అ. న. అంతట దాఁగిన మత్స్యములు గలది.

ఆలీనము. సం. వి అ. న. 1. పాఁతఱ: చూ, లిబ్బి; విణ. (అ. ఆ. అ.) 2. అంతట లయించియున్నది.

ఆలీనలులాయము. సం. వి. అ. న. అంతటదాఁగిన ఎనుములు గలది.

ఆలీయమానము. సం. విశ. (అ. ఆ. అ.) అంతట లయించుచున్నది.

ఆలు. దే. వి. 1. పెండ్లాము (దీనికి వ్యుత్పత్తియందు ఆఁడుది యనిమాత్రి మర్థము. "జవరాలు, ధీవరాలు." మొ॥): చూ, భార్య; బ. 2. ఆవులు: చూ, ధేనువు; 3. స్త్రీవాచకమందు వచ్చునది. "జవరాలు, ముద్దరాలు." మొ॥

ఆలుక. సం. వి. అ స్త్రీ. 1 =ఆలకి. గిండివంటి కుండ: చూ, పాత్రము. 6; 2.=అనుగ. అనబ*: చూ, సాఱ.

ఆలుకము. సం. వి. అ. పుం. 1. ఆలువు, గెను సు*: చూ, గెనుసుదుంప; 2. చేమగడ్డ*: చూ, చేమ; 3. అనుగు*: చూ, సాఱ.

ఆలుతితము. సం. విశ. (అ. ఆ. అ.) అంతట పొర్లింపఁబడ్డది.

ఆలుండి. దే. వి. పవిత్రిచరిత్రిము: చూ, శీలము.2.

ఆలుబ్ధకము. సం. వి. అ. న. అంతట బోయలు గలది.

ఆలుబ్ధుఁడు. సం. వి. అ. పుం. మిగుల లోభి: చూ, లోభి.

ఆలులేదుచూలులేదు కొడుకుపేరు సోమలింగము. లో. ఒకానొక లోకోక్తి, ఏమియు లేనిదే పేర్లు పెట్టుట.

ఆలువు. సం. వి. ఊ. స్త్రీ. 1. రూ-ఆలూవు. గిలంటిక, సన్న మెడగలచెంబు: చూ, పాత్రిము. 6; న. 2. రూ-ఆలూవు. కడిమి*: చూ, నీపము; 3. రూ- ఆలూవు. గెనుసు*: చూ, గెనుసుదుంప; 4. రూ-ఆలూవు. ప్లవము: చూ, పవను.

ఆలూనము. సం. వి. అ. న. అంతటకోయఁబడ్డది.

ఆలూనశాలికులము. సం. వి. అ. న. కోయఁబడిన సంబావుగల క్షేత్రిము: చూ, భూమి. 1.

ఆలూవు. సం. వి. ఊ. స్త్రీ: చూ, రూ-ఆలువు.

ఆలెగాఁడు. దే. వి. పరిచారకుఁడు: చూ, సేవకుఁడు, 1.

ఆలుప్రొయ్యి. దే. వి. ఒకసారిగ నాలుగయిదు పాత్రిములు వేఱువేఱుగాఁ బెట్టి వండునట్లేర్పఱచిన ప్రొయ్యి, గాఁడిప్రొయ్యి: చూ, ప్రొయ్యి.

ఆలేఖనము. సం. వి. అ. న. 1. రూ-ఆలేఖ్యము. లిఖితము: చూ, వ్రాఁత; 2.రూ-ఆలేఖ్యము. చిత్తరువువ్రాయుట: చూ, చిత్తరువు.

ఆలేఖి సం వి. ఇ. పుం. 1. చిత్తరువు వ్రాసెడు తూలిక: చూ, లేఖిని; 2 వ్రాయుసీసపు పోతపుల్ల, పెన్సిలు: చూ, లేఖిని.

ఆలేఖ్యకృత్తు సం. వి. త్ పుం. చిత్తరువు వ్రాయువాఁడు: చూ, ముచ్చి.

ఆలేఖ్యము. సం. వి. అ. న: చూ, రూ-ఆలేఖనము.

ఆలేహ్యము. సం. వి. అ. న. ఆస్వాదింపఁదగినది.

ఆలోకనము. సం. వి. అ. న. 1. రూ-ఆలోకము. చూపు: చూ, లక్షణము 3; 2. ఎండ: చూ, వెలుఁగు. 3; 3. బట్టువాఁడు చేయు స్తోత్రిము: చూ, స్తోత్రిము.

ఆలోకము. సం వి. అ. పుం. 1 రూ-ఆలోకనము చూపు: చూ, లక్షణము 3; 2. కొలువు: చూ, కుతూహ్రివ. 2.

ఆలోకించు. సం. స. క్రి. చూచు: చూ, వీక్షించు.

ఆలోకితము. సం విశ. (అ ఆ. అ.) 1. చూడఁబడినది, స్వభావమయిన దృష్టివిశేషము: చూ, ఆదర్శితము; అం. 2. దృష్టిభేదము లెనిమిదింటిలోనొకటి: చూ, దృష్టిభేదములు; 3. దృష్టిక్రియలు పదునెనిమిదింటిలో నొకటి: చూ, దృష్టిక్రియలు.

ఆలోచన. సం. వి. ఆ స్త్రీ, అ. న. తలఁపు: చూ, యోచన.

ఆలోచించు. సం. స. క్రి. 1. తలఁచు: చూ, యోచించు; 2. అరయు; చూ, విచారించు1.

ఆలోడనము సం. వి. అ. న. కలఁత: చూ, క్షోభము. 1.

ఆలోడించు. సం. స. క్రి. కలఁగఁజేయు: చూ, కలఁగుండుపెట్టు.

ఆలోడితము సం. విణ. (అ. ఆ. అ.) కలఁచఁబడినది: చూ, మలినము. 3.

ఆలోన. దే. అవ్య. ఇట్లుండఁగా : ఆలోపల, ఇంతలో.

ఆలోపల. దే. అవ్య. —పై.—

ఆలోమోద్గమము. సం. అవ్య. రోమము మొలిచినది మొదలు.

ఆలోలము. సం. విణ. (అ. ఆ. అ.) 1. కదలు: చూ, చలనము. 1; 2. విషయలంపటము, కార్యముకొఱకు చలయుట.

ఆలోలితము. అం. శిరఃక్రియలు పదునేడింటిలో నొకటి: చూ, శిరఃక్రియలు.

ఆలోలుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. చంచలుఁడు, కాముకుఁడు: చూ, వలపుకాఁడు; 2. స్త్రీయందాసక్తిగలవాఁడు.

ఆలోళితము. అం. శిరోభేదములు తొమ్మిదింటిలో నొకటి: చూ, శిరోభేదములు.

ఆల్బకారాపండు. పా. ఆరుకఫలము (హిందీ-ఆలుబుకారా, అర-ఆల్ పాకడాఫళం.) ఇది పైత్యశాంతి చేయును

ఆవ. దే వి. 1. నిమ్నము, మిక్కిలి పల్లపుప్రదేశము: చూ, బాడవ; 2. వరిపండు నేల, చేను: చూ, పొలము. 2; 3. ఆవ*. (క్రూసిఫరే కుటుంబములోనిది, పుష్పదళములు క్రాసుగా ప్లస్ + గుర్తువలెనాలుగు ఉండును.): చూ, సర్షపము, బ. 4. సర్షప బీజములు, ఆవలు: చూ, సర్షపము. (ఆవాలు అని వాడుక.)

ఆవంక. దే. వి: చూ, అదిక్కు.

ఆవంత. దే. వి. గొప్పవెత.

ఆవకాయ. దే. వి. ఊరుఁగాయ: చూ, రుచిఁగాయ. (బెల్లపు ఆవకాయ, అల్లపుఆవకాయ, వెల్లుల్లి ఆవకాయ మొదలగునవి.)

ఆవగింజలు. దే. వి. బ. సర్షపబీజములు : చూ, సర్షపము.

ఆవగుండ. దే వి ఊరుఁగాయపిండి.

ఆవజము. వై వి.=ఆగజః. రుంజ అను వాద్యము: చూ, వీణె.

ఆవటము దే వి 1. మైత్రి, పొత్తు: చూ, సంయోగము; విణ. 2. పొందికయైనది. "ఎ, కీ వలయు సంపద లందు నావటము పటము." భాగ. 4, స్కం, 186 చూ, సంయుక్తము

ఆవటముచేయు దే. స. క్రి. పొందికపఱచు. "సీ. మోఁచేతి వంపుగా ముడిచిపట్టినకేల వరదాభయంబు లావటముచేసి." పాండు. 2, ఆ. 229: చూ, పొందికపఱచు.

ఆవటించు దే. క్రి. అనుకూలపడు: చూ, పొందుపడు.

ఆవటిల్లు దే అ. క్రి. పై =ఆవాహ. "గీ. అతఁడుఁ గొలుపాప్రాణములనుండి హరువు దెరువు, లావటిలఁ దెల్ప." రామా. 5, ఆ. 175: చూ, పొందుపడు.

ఆవట్టుజము. సం. వి. అ. న పారశీకాశ్వము: చూ, హయము.

ఆవడ. దే వి. 1. కార్పణ*: చూ, బీద. 2; 2. రూ-ఆమవడ. మజ్జిగపులుసులోనగు వానియందు నానవేసిన వడ: చూ, భక్ష్యము.

ఆవడి. దే. వి. రూ-హావడి. ఉపద్రవము. "క. మానుగ జగముల యావడి, మానుపఁగాఁగోరి." అచ్చ. సుం, కాం: చూ, విపత్తు.

ఆవణ్యపురి. శా. క్రి, శ 388 సంవత్సరమున వధూవల్లభమల్ల దేవనందివర్మ అను బాణరాజు 12,000 గ్రామములను యీపురిరాజధానిగాఁ జేసికొని పరిపాలించెను. రాజరాజ నరేంద్ర పట్టాభిషేక సంచిక. 98. పుట.

ఆవలి ష్ణ అమ్మకుయేఁగఁబారినదట, లో. ఒకానొక లోకోక్తి.

ఆవపనము. సం. వి. అ. న. 1. కాఁగు, గూన: చూ, పాత్రము. 6; 2. గోనియ: చూ, గోనె.

ఆవపాఱు. దే. అ. క్రి. భావముదయించు, జ్ఞప్తికివచ్చు: చూ, స్ఫురించు. 2.

ఆవము. వై. వి. 1.= ఆవాపః. కుమ్మరి కుండలు లోనగునవి కాల్చుటకేర్పఱచిన (కావు): చూ, కావు 5, 2 దండింపు: చూ, నిందు. 1; 3.= హిం. జగడము, లడాయి : చూ, యుద్ధము.

ఆవరణలు. పా. పశువులనుండియు, ఇతర మృగములనుండియు, దొంగలనుండియు, తమసస్యములకు నష్టము కలుగకుండ కాపాడుకొనుటకు వ్యవసాయదారుఁడు తన పొలముచుట్టు కట్టు హద్దులు. ఇవి రెండువిధములు.–ఇటుక, రాయి మొదలగువానిచే కట్టఁబడుగోడలును, కంప, కఱ్ఱలు వీనిచే నేర్పఱచు కంచెలును ఒకవిధమయినవి. కిత్తనార, బొమ్మచెముడు మొదలగు ముండ్లచెట్లను వరుసగా పాఁతుటవలన నేర్పడునావరణలు మఱియొకవిధమైనవి.

ఆవరణము సం. వి. అ న. ఆచ్ఛాదనము, [illegible]: చూ, వ్యవధానము. 3.

ఆవరణములు. అం. పృథివ్యప్తేజోవాయ్వాకాశాహంకార మహత్తత్త్వములు. (7); ప్రకృతితోఁ గూడ అష్టావరణములగు (8.)

ఆవరించు. సం. స. క్రి. చుట్టుకొను : చూ, వేష్టించు.

ఆవరించుకొను. మి. స. క్రి.—పై.—

ఆవరింత. దే. వి. 1. రూ-ఆవలింత: చూ, హాళిక; 2. ఆక్రమణము: చూ, పురి. 4.

ఆవర్జనము. సం. వి అ. న. ఆకర్షణము, ఈడ్పు: చూ. లాగు 3.

ఆవర్జా. హిం. వి. ఆసామివారీలెక్క. (కాతా.) (లెడ్జరు.)

ఆవర్త. సం. వి. ఆ. స్త్రీ. నేలతామర *: చూ, పద్మము. 1.

ఆవర్తనము. సం. వి. అ. న. 1. అప్రివృత్తి: చూ, మరలఁబాటు; 2. పాఠముయొక్క వల్లె: చూ, వల్లె. 4.

ఆవర్తని. సం. వి. ఈ. స్త్రీ. సులితడ *: చూ, మహాబల.

ఆవర్తనీయము. సం. విశే. (అ. ఆ అ.) 1. మరలఁదగినది; 2. వల్లింపఁదగినది.

ఆవర్తకము. అం. అలంకారములేడింటిలోనొకటి: చూ, అలంకారము. 3

ఆవర్తము. సం. వి. అ. పుం. 1. గుఱ్ఱపు సుడి: చూ, [illegible]యము; 2. నీటి సుడి: చూ, సుడి.1, 3. శరీరమందలి సుడి: చూ, సుడి. 1; 4. రోమావర్తము: చూ, సుడి. 1; 5 భ్రూమధ్యావర్తము: చూ, సుడి. 1; 6. మెడపై సుడి చూ, సుడి. 1; 7. గాలిసుడి: చూ, సుడి.1, (ఇత్యాదులు); 8. అప్రివృత్తి: చూ, మరలఁబాటు; 9 పాఠముయొక్క వల్లె: చూ, వల్లె 4; 10. ఆవర్తకమను మేఘము: చూ, మేఘము. 1; అం. 11. మేఘములు నాలుగింటిలో నొకటి: చూ, మేఘములు; 12. మేఘములు తొమ్మిదింటిలో నొకటి: చూ, మేఘములు; 13 ఆవర్తరూపము లెనిమిదింటిలో నొకటి: చూ, ఆవర్తరూపములు; 14. భౌమమండలములు పదింటిలో నొకటి: చూ, భౌమమండలములు; 15. కరణములు నూటయొనిమిదింటిలో నొకటి: చూ, కరణములు.

ఆవర్తరూపములు. అం. అశ్వమునకు క్రిందిపెదవియందుఁగల సుళ్ళు. శుక్తి, ఆవర్తము, ముఖసంఘాతము, పాదుక, అర్ధపాదుక. అవలీ[illegible] [illegible] [illegible]. (8)

ఆవర్తించు. సం. స. క్రి: చూ, వర్తించు.

ఆవర్తితము. సం విశే. (అ. ఆ. అ.) 1. మరలి నది: చూ, నివర్తితము; 2. వర్తింపఁబడినది; అం 3 జంఘాక్రియ లైదింటిలో నొకటి చూ, జంఘాక్రియలు.

ఆవల. దే. వి (ఆ + వలను ) 1. అప్రక్క: చూ, అదిక్కు; 2. అనంతరము: చూ, పిమ్మట.

ఆవలి. సం. వి ఇ స్త్రీ. 1. వరుస : చూ, పంక్తి. 1; దే. వి. (1) రూ-ఆవళి. ఉపద్రవము చూ, విపత్తు; 2. ఇబ్బంది, కష్టము: చూ, దుఃఖము; (3) అధికము : చూ, హెచ్చు. 1.

ఆవలించు. సం. అ. క్రి. రూ-ఆవులించు: చూ, జృంభించు.

ఆవలింత. దే. వి: చూ, రూ-ఆవరింత.

ఆవలిమొన్న. ద్వ. వి. మొన్నటికి పూర్వదినము

ఆవలినాఁడు ద్వ. వి. ఎల్లుండికి పరదినము: ఆవలియెల్లుండి.

ఆవలియెల్లుండి. ద్వ వి.—పై.—(ఆవలియెల్లుండికి పరదినము=అటావలి యెల్లుండి.)

ఆవలఈవల. ద్వ. క్రి. విశే. ప్రకారముగ : చూ, ఇటుల.

ఆవశము. సం. వి. అ. పుం. ఇష్టానిష్టములగు పనులయందుఁగలిగెడి తొందర: చూ, సంభ్రమము. 1.

ఆవశ్యకము. సం. వి. అ న. 1, అక్కఱ: అవశ్యము, అవ్య-అనయము; (తె ప):— అక్కఱ; తద్వి:—మిక్కిలి అక్కఱ.—ఆవశ్యావశ్యకము; విశే. 2. అక్కఱైనది: ఆవశ్యము.

ఆవశ్యము.—పై.—

ఆవసథము. సం. వి. అ. న. ఇల్లు : చూ, గృహము. 1.

ఆవసితము. సం. విశే. (అ. ఆ. అ.) బుద్ధము, ముగించినది. (ధాన్యము): చూ, ధాన్యము.

ఆవసితరి. సం. వి. ఇ న.—పై.—

ఆవహము. సం. విశే. (అ. ఆ. అ.) 1. కలిగించునది: చూ, ఉపపాదకము; అం. 2. వాయువులేడింటిలో నొకటి: చూ, వాయువులు.

ఆవహించు. సం. ప్రే.అవతరించు: చూ, పుట్టు.2.

ఆవిద్ధము. అం. స్త్రీస్థానకములు మూఁడింటిలో నొకటి: చూ, స్త్రీస్థానకములు.

ఆవహిల్లు సం. అ. క్రి.—పై.—

ఆవళి: చూ, రూ-ఆవలి.

ఆవాపకము. సం. వి. అ. పుం. బంగారపు నూడిగము: చూ, భూషణము. 2. (అందు దాని చేతి పట్టిగా జీఅని కొందఱు.)

ఆవాపము. సం. వి. అ. పుం. 1. రూ- అవాపము చూ, పాదు. 1; 2. విత్తడము: చూ, విత్తుట; 3.=ఆవము: చూ, కావు. 5; 4. పరరాష్ట్ర చింత. (ఇది స్వరాష్ట్రచింతన తంత్రమనఁబడును.); చూ, తంత్రము.2; 5. తాళప్రాణ క్రియాభేదము: చూ, తాళము. 2, 6. ఓడ బాఁటించిన కూలి: చూ, తరపణ్యము; 7. వ్యధ: చూ, దుఃఖము; 8. మంగలిపని : చూ, ముండనము; అం. 9. నిశ్శబ్దక్రియలు నాలుగింటిలో నొకటి: చూ, నిశ్శబ్దక్రియలు.

ఆవాయకము. సం. వి. అ. పుం: చూ, ఆవాపకము.

ఆవాలము. సం. వి. అ. న. అవాపము : చూ, పాదు. 1.

ఆవాలు. దే. వి. బ. ఆబలు. (హిందీ-రాయీ, అర-కడుఘూ.): చూ, సర్షపము. (ఆవాల పిండి లోపలకియిచ్చిన వాంతి చేయును. వాత నొప్పులలోను కలరావాంతులలోను ఆవాలపట్టి వేయుదురు: చూ, ఆవ.

ఆవాసము. సం. వి. అ. పుం. ఇల్లు: చూ, గృహము. 1.

ఆవాహనము. సం. వి. అ. న. 1. పిలుపు: చూ, సంబోధనము; 2. షోడశోపచారములలో నొకటి: చూ, ఉపచారములు.

ఆవాహించు. సం. అ. క్రి. అనుకూలపడు: చూ, పొందుపడు.

ఆవాహితము. సం. విశే. (అ. ఆ. అ.) పిలువఁబడినది: అభిమంత్రితము, ఆకారితము, ఆమంత్రితము.

ఆవి. సం. స్త్రీ. అవ్య. 1. కనఁబడినది; దే. వి. (1) తాపము. "మ. విహరించుఙ్ పలయాని లంబచేటఁదావించిల్కి నెమ్మేని యా,విహరించుంబిక నాదముల్ చెవికిఁ గావించుంజేవుఙ్ పోదమా" విజ 2, ఆ. 58: చూ, సంతాపము; (2) ఊపిరి. "గీ అసురయోధను ముక్కు ననావిగలుగఁ, బుడమినీకేఁడు." భార. ఉద్యో. 3, ఆ: చూ, శ్వాసము; (3) ఆవిరి: చూ, ఔష్ణ్యము.

ఆవించు. దే. స. క్రి. వానెనమీఁదఁ బెట్టి ఆవిరితోఁ బక్వము చేయు. "వ. కీచకతెండులంబులం బిండిఁగొట్టి కొట్రింబోసి యుప్పిగొప్పలు గాఁచేసి యావించిన కుడుముల బానలు" కాశీ. 8, ఆ. 36: చూ, ఉప్పు. 2.

ఆవిఘ్నము. సం. వి. అ. పుం. 1: చూ, రూ-అవిఘ్నము *; విశే. 2. ఆవేగము పొందినది.

ఆవిడ. దే. స. ఏ. రూ-ఆవిడె: చూ, ఆకె.

ఆవిడి. దే. వి. రూ-అవళి ఉపద్రవము: చూ, విపత్తు.

ఆవిడె. దే. స. ఏ: చూ, రూ-ఆవిడ.

ఆవిధము. సం. వి. అ. పుం. రత్నాదులకు బెజ్జము వేయు వజ్రపు పోగర, ఆస్ఫోటని: చూ, వైధని.

ఆవిద్ధ. అం. ఆకాశచారులు పదునాలుగురిలో నొకరు: చూ, ఆకాశచారులు.

ఆవిద్ధము. సం. విశే. అ. (అ. ఆ. అ.) 1. చేక్కఁగా తొలువఁబడినది; 2. ఆవిధము: చూ, వైధని; 3. కొట్టఁబడినది, ఆయస్తము: చూ, ఆహతము; 4. ఉంచఁబడినది: చూ, ఉపహితము; 5. వంకరైనది: చూ, వంకర.

ఆవిద్ధవక్త్రము. అం. నృత్తహస్తములు యిరువది తొమ్మిదింటిలో నొకటి. చూ, నృత్తహస్తములు.

ఆవినము. సం. వి. అ. న. నిధి: చూ, లిబ్బి.

ఆవిరి. దే. వి. ఊష్మము చూ, ఔష్ణ్యము.

ఆవిరినాఁగళ్ళు. పా. ఇంగ్లాండు, అమెరికా మొదలగు దేశములందు వాడుదురు. అవి ఏకఖండములుగను, చేదుముగను, నుండువిశేషః స్త్రీ రముగల చోట్లుమాత్రము ముపయోగింపఁబడును: చూ, ఇనుపనాఁగలి.

ఆవిరిపెట్టినయెముకలు. వా. ఇందు రమారమి $2\frac{1}{4}\%$ నత్రజనియు $25\frac{1}{2}\%$ స్ఫురత్పాంచాస్ల జనిదమును ఉండును.

ఆవిరియంత్రము పా. దీనిసహాయముచేతనీరుతోడుటకు మధ్యావర్తన జలాకర్షములను నొకవిధమగు యంత్రములు సామాన్యముగనుపయోగింపఁబడును

ఆవిరిల్లు. దే. అ. క్రి చెమటఁగలదియగు: చూ, చెమటపోయు.

ఆవిర్భవించు. సం. అ. క్రి. అవతరించు: చూ, పుట్టు. 2.

ఆవిర్భవిల్లు. సం. అ. క్రి.—పై.—

ఆవిర్భావము. సం. వి. అ. పుం. జన్మము: చూ, పుట్టుక.

ఆవిర్భూతము. సం విశే. (అ. ఆ. అ.) పుట్టినది, ప్రభూతము: చూ, సంభూతము.

ఆవిలకము. సం. విశే. (అ. ఆ. అ.) కలఁకఁబాఱినది: చూ, మలినము. 3.

ఆవిలము. సం. వి. అ. పుం.—పై.—

ఆవిలి. దే. వి. మాంత్రికుఁడు ఉపయోగించెడి కాఁచపాత్రి. (మాంత్రికుఁడు = మంత్రవిద్య నెఱిఁగినవాఁడు.): చూ, పాత్రము. 6

ఆవిష్కరణము. సం. వి. అ. న. ఖ్యాతి చూ, ప్రసిద్ధి. 1.

ఆవిష్కరించు. సం. స. క్రి. ప్రకటించు: చూ, [illegible]

ఆవిష్కృతము. సం. విశే. (అ. ఆ. అ.) 1 ప్రకటింపఁబడినది: చూ, ప్రకటితము; 2. తెలియింపఁబడినది

ఆవిష్కృతి. సం. వి. ఇ. స్త్రీ. ఖ్యాతి: చూ, ప్రసిద్ధి. 1.

ఆవిష్క్రియ. సం. వి. ఆ. స్త్రీ. —పై—

ఆవిష్టము. సం. విశే. (అ. ఆ. అ.) 1. ఆవేశము కొన్నది; 2. చొచ్చినది.

ఆవిష్టుఁడు. సం. వి. అ. పుం. ప్రేతాదులచే యెవఁడు గ్రహింపఁబడి [illegible] వాఁడు: చూ, ప్రేతవాహితుఁడు.

ఆవు. దే. వి గోవు: చూ, ధేనువు. (వృత్తయందు అంత్యవర్ణలోపము వికల్పము నగు.—ఆఁగ దుపు, ఆఁబడ్డ, ఆఁబెయ్య, ఆఁ మంద ము.)

ఆవుఆవు కుమ్ములాడి లేఁగకాలు విఱిగినట్లు. లో. ఉదా.—"ఆవునావును గుమ్ములాడ నడిమి లేఁబెయ్య కాళ్ళు విఱిచినట్లు రాజురాజునుం బోట్లాడి దూతకెగ్గు సేయ దగ్గరదే." (నీతిచంద్రిక —విగ్రహము.)

ఆవుకుఁడు. సం. వి. అ. పుం. (నాట్య పరిభాష యందు) తండ్రి.

ఆవుత్తుఁడు. సం. వి. అ. పుం. (నాట్యపరిభాష యందు) బావ. రూ-ఆవృత్తుఁడు.

ఆవుతోఁక. దే. వి. ఆఁదోఁక: చూ, గోవాలము.

ఆవురించు. దే. అ. క్రి: చూ, రూ-ఆవులించు.

ఆవురింత. దే. వి: చూ, రూ-ఆవులింత.

ఆవురు. దే. వి. బావురు, గోదవార్త ధ్వనులయందగు ధ్వన్యనుకరణము. "ఉ. దేవుఁడొ మానిసోయని మదిందలపోఁతలు వాకొనా నినిన్, దేవురు వేయుచెందముల నిందఱుమిన్నొరిదరిష్ట మూఁగఁగన్, పాపులనోరు నీయెడను పాదతలంబునఁ దన్నినట్లుగా, నీవొకయింత యావురని యేడ్వఁగ దన్నకుమార రత్నమా" పర.2, ఆ: చూ, హాహాహూ.

ఆవురుమను. దే అ. క్రి. బావురుమని (బావురు మని) ఏడుచు: చూ, విలపించు.

ఆవులవ ల్లించినవాఁడు అర్జునుఁడు. లో. ఒకానొకలోకోక్తి.

ఆవులించు. దే. అ. క్రి. రూ-ఆవరించు: చూ, జృంభించు.

ఆవులింత. దే. వి: చూ, రూ- ఆవురింత : చూ, హాస్యిక.

ఆవులేనియిల్లు అం. నిరర్థకము లేడిందిలోనొకటి: చూ, నిరర్థకములు.

ఆవూకుఁడు. సం. వి. అ. పుం. తండ్రి : చూ, పితరుఁడు.

ఆవృతము. సం. విశే. (అ. ఆ. అ.) చుట్టఁబడి నది: చూ, సంవృతము.

ఆవృత్తము. సం. విశే. తిరుగుడుపడినది : చూ, ఆఘూర్ణితము.

ఆవృత్తి. సం. వి. ఇ. స్త్రీ. 1 : చూ, తడవ; 2 అప్రవృత్తి: చూ, మరలఁబాటు; 3. కంఠ పాఠము, వల్లె: చూ, వల్లె. 4.

ఆవృత్తిదీపకము. సం. వి. అ. న. ఒకానొక అలంకారము. పద, అర్థ, ఉభయములను త్రివిధ ములచే ధర్మైక్యమందుట : చూ, అలంకారము. 3.

ఆవృత్తు. సం. వి. త్. స్త్రీ, న. 1. రీతి: చూ, విధము. 1; 2. స్వాధ్యాయక్రమము, అను క్రమణిక: చూ, పరిపాటి.

ఆవృత్తుఁడు. సం. వి. అ. పుం. (నాట్యపరిభాష

యుండు) భావ: రూ-ఆవుత్తుఁడు.

ఆవేగము. సం. వి. అ. పుం. 1. (ఇష్టానిష్టప్రాప్తిచేఁగలుగు)తొట్రుపాటు: చూ. స్ఖలనము. 2; 2. కోపము: చూ, రోషము; అం. 3 సంచారీభావములు ముప్పదిమూఁడింటిలో నొకటి: చూ, సంచారీభావములు (ఆరాక్షసభటుండు రామునకెదురై కేలంగోలఁ గీలించి కేలఁబడఁగసంబెదిడచెను.)

ఆవేగి. సం వి. ఈ. స్త్రీ. బొద్ది *. చూ, వృద్ధదారకము.

ఆవేదకుఁడు. సం. విణ. (అ ఆ. అ.) : చూ, తెలిపెడువాఁడు.

ఆవేదనము. సం. వి. అ. న. తెలియఁజేయుట: చూ, సూచకము. 6.

ఆవేదించు. సం. స. క్రి: చూ, తెలియఁజేయు: చూ, సూచించు. 2.

ఆవేదితము. సం. విణ. (అ, ఆ అ.) తెలుపఁబడినది: చూ, సూచితము. 2.

ఆవేలము. సం. వి. అ. న. తాంబూలకల్కము, నమలిన తాంబూలము: చూ, తమ్మ.

ఆవేశనము. సం. వి. అ. న. 1. కమ్మరిసాల: చూ, గృహము. 1; 2. భూతావేశము. రూ-ఆవేశము: చూ, సోకుఁడు; 3. చొరవ: చూ, ప్రవేశము; 4. సంతోషాదులవలనఁ గలిగెడు పారవశ్యము. రూ-ఆవేశము: చూ, సుమాశము; 5 తొందర: చూ, సంభ్రమము. 1.

ఆవేశము. సం. వి. అ. పుం. చూ, ఆవేశనము. 2, 3, 4, 5.

ఆవేశించు. సం. అ క్రి. చొచ్చు. "గ్రహము ఆవేశించినది.": చూ, సోఁకు. 4.

ఆవేశికుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) విందునకు పిలువఁబడినవాఁడు, అతిథి: చూ, విందు. 4.

ఆవేష్టకము. సం. వి. అ. పుం. ముండ్లకంచె: చూ, ప్రాచీనము. 1.

ఆవేష్టితము. అం. హస్తకరణములు నాలుగింటిలో నొకటి: చూ, హస్తకరణములు.

ఆవేళ. దే. అవ్య. ఆకాలము.

ఆవైపు దే. వి: చూ, ఆదిక్కు.

ఆవ్రశ్చన. సం. వి అ. న. 1 మంత్రభేదము: చూ, మంత్రము. 1; 2. మ్రానితొఱ్ఱ: చూ, రంధ్రము. 1.

ఆశ. సం వి. ఆ. స్త్రీ 1.= ఆస ఇచ్ఛ: చూ, వాంఛ; 2.= ఆస. దిక్కు: చూ, హరిత్తు; 3 = ఆస. అత్యాశ. "చ. పిపీకితి దుర్గదుర్వ్యవయ విభ్రమయుక్తిఁ గులాభిమానముఁ, బసచెడ సేవఁజేసితివిపన్నుఁడవై పరగేహసీమ వ్యాయసమువలెన్ భుజి వితఁ బ్రియత్నము నిష్ఫలమైనఁ ళించె సంతిసపడ పుగ్రికర్మపికు నత్యముఁజూపెద వాశయేటికిన్" భర్తృ. 3, ఆ. 3: చూ, వాంఛ; అ. పుం. 4 అంతట వ్యాపించుట: చూ, వ్యాప్తి. 1; 5. భుజము: చూ, హస్తము.

ఆశంపిత సం. వి. ఋ. పుం. ప్రియవస్తువును కోరువాఁడు, ఆశంసిత, ఆశంపితుఁడు, ఆశంసువు: చూ, కోరువాఁడు.

ఆశంసనము. సం. వి. అ. న. ఇచ్ఛ: చూ, వాంఛ.

ఆశంసిత. సం. విణ (ఋ. ఈ. ఋ.) 1: చూ, ఆశంపిత; 2 పరోక్షమునందుఁబొగడువాఁడు: ఆశంసితుఁడు, ఆశంసువు.

ఆశంసితము. సం. విణ (అ. ఆ. అ.) కోరఁబడినది: చూ, వాంఛితము.

ఆశంసితుఁడు. సం. వి. ఋ. పుం: చూ, ఆశంసిత.

ఆశంసువు. సం. విణ. ఉ.—హై.—

ఆశకుఅంతములేదు. లో. ఒకానొక లోకోక్తి.

ఆశపడు. మి. అ. క్రి. అక్కఱపడు: చూ, వాంఛించు.

ఆశపెట్టు. మి. స. క్రి: చూ, ఆసపెట్టు.

ఆశము. సం. వి. అ. పుం. 1. అగ్ని: చూ, నిప్పు; 2. అంతటను ప్రసరించుట: చూ, వ్యాప్తి. 1.

ఆశయ. సం. వి. ఆ. స్త్రీ. గుంటాలయనుగడ్డి: చూ, తృణము. 1.

ఆశయము. సం. వి. అ. పుం 1. తలఁపు: చూ, విషయము. 4; 2. చోటు: చూ, స్థానము.1; 3. ఆశ్రయము: చూ, ప్రాపు.2; 4. మనసు: చూ, హృదయము; 5. పాఁతఱ చూ, లిబ్బి.2; 6 మడుగు: చూ, సరస్సు. 1.

ఆశయిత సం. విశ. (ఋ. ఈ. ఋ.): చూ, తినిపించువాఁడు.

ఆశయేశయుఁడు. సం. వి. అ. పుం. మరుఁడు: చూ, మన్మథుఁడు.

ఆశరుఁడు సం. వి అ. పుం. 1. అగ్ని: చూ, నిప్పు; 2. కోనఱేఁడు, నైరృతి: చూ, మూలఱేఁడు; 3. రక్కసుఁడు : చూ, రాక్షసుఁడు 1.

ఆశాపరవశుఁడు. సం వి అ. పుం ఆశకు అధీనమైనవాఁడు.

ఆశాపాలుఁడు. సం. వి అ. పుం. దిక్పాలకుఁడు: చూ దిక్పాలుఁడు.

ఆశాపాశము. సం. వి. అ న. ఆసయను త్రాడు (ఇట్లు ఆశాబంధము = ఆసయను ముడి.); జా. ఆసయనుత్రాడు. "క. ఆశను విడువనిజీవికి, క్లేశము విడిపింపఁదరమె- క్లేశపున కునా, యాశాపాశము లెల్లను, గోసినఁ గ్లేశంబువిడును రూఢిగ వేమా." వేమన. 322. ప.

ఆశాపిశాచిక. సం. వి. ఆ. స్త్రీ. ఆశయను పిశాచము.

ఆశాబంధము. సం. వి. అ. పుం. 1.ఊఱట: చూ, ప్రశ్రయము; 2. సాలెపురుగు చేసిన జేత: చూ, సాలెగూఁడు; 3. ఆసయనుముడి: చూ, ఆశాపాశము, 4. కోఁతిగూఁడు: చూ, మర్కటగృహము. (చూ, గృహము. 1.)

ఆశాబద్ధుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) ఆశకు కట్టుఁబడినవాఁడు.

ఆశాభంగము. సం. వి. అ. పుం. ఆస చెడఁగొట్టుట.

ఆశారదాశాంతము. సం. అవ్య. బ్రహ్మాండమువఱకు.

ఆశాసనము. సం వి. అ. న ఆశీర్వచనము: చూ, దీవన.

ఆశాసించు సం. స. క్రి. ఆశీర్వదించు : చూ, దీవించు.

ఆశాస్తి. సం. వి. ఇ. స్త్రీ. ఇచ్ఛ: చూ, వాంఛ.

ఆశాస్యము. సం. విశ. (అ. ఆ. అ.) 1. ఆశీర్వదింపఁదగినది; 2. ప్రార్థింపఁదగినది : చూ, ప్రార్థనీయము

ఆశాహీనము. సం. విశ. (అ. ఆ. అ.) నిరాశఁ జెందినది.

ఆశి. సం. వి. ఈ. స్త్రీ. పాముయొక్క కోఱ, ఆశీస్సు: చూ, దంష్ట్ర.

ఆశించు. సం. స. క్రి.=ఆసించు: చూ, వాంఛించు.

ఆశిత. సం. వి. ఆ. స్త్రీ. ఇచ్ఛ: చూ, వాంఛ.

ఆశితము. సం. విశ. (అ. ఆ. అ.) 1. తినఁబడినది: చూ, భుక్తము. 1; 2. అంతకుముందు ఆవులను మేపిన పొలము: చూ, గవీనము.

ఆశితసుతుఁడు. సం. వి. అ.పుం. సగరచక్రవర్తి.

ఆశిరుఁడు. సం. వి. అ. పుం. అగ్నిహోత్రుఁడు: చూ, నిప్పు.

ఆశీకరశేకము. సం. అవ్య. అంబుకణములు చేల్లినది మొదలు.

ఆశీతశైలము. సం. అవ్య. హిమాలయమువఱకు.

ఆశీతిభవ. సం. వి. ఆ. స్త్రీ. తనివి: చూ, తృప్తి.

ఆశీరము. సం. వి. అ. పుం. 1. పాలవిఱుగుడు చూ, పాలు. 1; 2. జొన్న: చూ, పాలు.1;

3 అగ్ని: చూ, నిప్పు; 4. తిండి : చూ, పొపొటు.

ఆశీరాద్యర్థకము. పా. వ్యుత్పత్తియందుఁగల శబ్దములలో నొకటి. ఉదా.— ఎకున్-తకా వర్ణకములు. మిమ్ము దైవము రక్షించెడున్, మిమ్ము దైవము రక్షించుఁగాఁతకా, ఇత్యాది.

ఆశీరుఁడు. సం. వి. అ. పుం. రవి: చూ, సూర్యుఁడు.

ఆశీర్వదించు. సం. స. క్రి: చూ, ఆశాసించు.

ఆశీర్వచనము. సం. వి. అ. న: చూ, దీవన. (వాడుకఁ గలిగి నిఘంటువులలోలేనిది.)

ఆశీర్వాదము. సం. వి. అ. పుం. —పై.— (శాస్త్రసమ్మతమైనది.)

ఆశీవిషము. సం. వి. అ. పుం: పాము : చూ, సర్పము.

ఆశీస్సు. సం. వి. స. స్త్రీ. 1 ఆశీర్వాదము: చూ, దీవన; 2. ఇచ్ఛ: చూ, వాంఛ; 3 మంచిపని: చూ, హితము; 4. పొగడిక: చూ, స్తోత్రము; 5. పాముయొక్క కోఱ, ఆశి: చూ, దంష్ట్ర.

ఆశుకవిత్వము. పా. తలంచినంతమాత్రమున ధారాళముగఁ గవిత్వము చెప్పుట.

ఆశుగము. సం. వి. అ. పుం. 1. అమ్ము: చూ, బాణము. 1; 2. గాలి: చూ, వాయువు.

ఆశుగుఁడు. సం. వి. అ. పుం. వేగిరముగాపోవు వాఁడు.

ఆశువ్రీహి. సం. వి. ఇ. పుం, స్త్రీ. ఒకరకము తోటకూర: చూ, తోటకూర.

ఆశువు. సం. వి. ఉ. పుం. 1. ఎఱ్ఱజిలుగు వడ్లు: చూ, ధాన్యము; న. 2. వాసి: చూ, ప్రసిద్ధి. 1; క్రి. విశే. 3. వేగ: చూ, వేగము. 3; విశే. 4. వేగముగలది: చూ, వేగము. 3.

ఆశువ్రీహి. సం. వి. ఇ. పుం. ఎఱ్ఱజిల్లవ వడ్లు: చూ, ధాన్యము.

ఆశుశుక్షణి. సం. వి. ఇ. పుం. 1. అగ్ని: చూ, నిప్పు; 2 వేఁడియూపిరి : చూ, శ్వాసము; 3. ఉచ్ఛిష్టము: చూ, ఎంగిలి.

ఆశ్రుతము. సం. వి. అ. న. 1. కొంచెము పక్వమయినది; 2. చక్కఁగా పక్వమయినది

ఆశౌచము. సం. వి. అ. న 1 అంటు: చూ, మైల 4, 2. చావుపుట్టుకలు: చూ, మృతాశౌచము; 3. జాతాశౌచము: చూ, పురుడు

ఆశౌచములు. పా. జాతాశౌచము, మృతాశౌచము. (2)

ఆశ్చర్యపడు. వి. అ. క్రి చూ, వెఱఁగొందు.

ఆశ్చర్యము. సం. వి. అ. న. 1.=అక్కజము: చూ, వింత. 1; 2. నవరసములలో నొకటి: చూ, అద్భుతము 2. (చూ, రసములు.), విశే. 3. అచ్చెరువయినది: చూ, వింత. 1; అం 4. రసస్థాయీభావములు తొమ్మిదింటిలో నొకటి, విస్మయము: చూ, రసస్థాయీభావములు. (మున్నెన్నఁడుఁ జూడని వస్తువులఁ జూడ మనమునఁ బుట్టెడి సంతోషము. ఉదా. రావణుం డట్లుసరిమితమగు వానరసేనావిస్తారంబును జూచి యయ్యారే! యింతటివానరసేనను మున్నెన్నఁడుఁ జూచియుండలేను. అని యచ్చెరువొందెను.

ఆశ్రమము సం. వి. అ. పుం, న 1. మునుల యిల్లు, ఆకుటిల్లు చూ, గృహము. 1 2. బ్రహ్మచర్యాది — ఇవి నాలుగు :— బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము సన్యాసము; 3 సన్యాసులు లోనగువారు ఉండెడుచోటు, మఠము: చూ, గృహము. 1 4. అడవి: చూ, విపినము; 5. సన్యాసుల సాంప్రదాయభేదమును దెలిపెడి గుఱుతు చూ, లక్షణము. 1; 6. శిష్యులు మొదలగువారుండు ఇల్లు: చూ, గృహము. 1.

ఆశ్రమవాసపర్వము. అం. భారతపర్వములు పదునెనిమిదింటిలో నొకటి: చూ, పర్వములు.

ఆశ్రయము. సం. వి. అ. పుం 1.=ఆసరా: చూ, ప్రాపు. 2; 2 బలవంతు నాశ్రయించుట, సంధ్యాది ఆఱుగుణములలో నొకటి: చూ, గుణములు; 3. చోటు: చూ, స్థానము. 1; 4. ఇల్లు: చూ, గృహము. 1; 5. ఒకానొక దేశము: చూ, దేశము.

ఆశ్రయాశి సం. వి శ. పుం అగ్ని: చూ, నిప్పు.

ఆశ్రయాశుఁడు సం. వి. అ. పుం. 1 -పై.-; విణ. 2. ఆశ్రయించినవానిని జెఱుచువాఁడు: చూ, ప్రాపుచెఱుచువాఁడు.

ఆశ్రయించు సం. స. క్రి. చూ, ప్రాపుగొను.

ఆశ్రయుఁడు. సం. విణ (అ ఆ అ.) పొందించువాఁడు: చూ, ప్రాపకుఁడు.

ఆశ్రవము. సం. వి. అ. పుం 1. అంగీకారము: చూ, సమ్మతి. 1; 2 రాగద్వేషాదిప్రయుక్త దుఃఖము. చూ, దుఃఖము, 3. శ్రవణేంద్రియముతోఁ గూడ కొనిన బుద్ధి: చూ, బుద్ధి, 4. పట్టుగల: చూ, ప్రతిజ్ఞ.

ఆశ్రవుఁడు. సం విణ. (అ. ఆ. అ.) 1 మాట దాఁటనివాఁడు. చూ, విధేయుఁడు; 2. బాగుగా వినువాఁడు; 3 మాటలలో భేదముఁ గల్పించువాఁడు

ఆశ్రావణము. సం. వి. అ. న. ఒకానొక నాటకాంగము, నాటకపరిచ్ఛేదము: చూ, నాటకము. 1.

ఆశ్రావకము సం. వి. అ న పారేవతము *. చూ, రైవతకము

ఆశ్రి. సం. వి ఇ. స్త్రీ. చూ-అశ్రి. కత్తి లోనగువాని వాయి: చూ, వాదర.

ఆశ్రితము. సం. విణ. (అ ఆ. అ.) ఆశ్రయింపఁబడినది: చూ, ప్రాపు. 2

ఆశ్రితవత్సలుఁడు. పా ఆశ్రితులయందు వాత్సల్యము గలవాఁడు. (ఇట్లు ఆశ్రితరక్షకుఁడు మొ.)

ఆశ్రితుఁడు సం వి. అ పుం. ఒకనిపోషణలో నుండువాఁడు.

ఆశ్రుతము. సం విణ (అ. ఆ. అ) 1. అంగీకరింపఁబడినది: చూ, సమ్మతి. 1; 2 మంత్రభేదము: చూ, మంత్రము 1; 3 హోమవస్తువు; 4. మాయచేతఁ జేయఁబడిన యడవి: చూ, కపిసము.

ఆశ్లిష్టము సం విణ (అ. ఆ అ.) కవుఁగిలింపఁబడినది: చూ, ఉపగూఢము.

ఆశ్లేష. సం. వి. ఆ స్త్రీ.= ఆసిలేరు. ఇరువదియేడు నక్షత్రములలో నొకటి: చూ, నక్షత్రము. 1. (రూ-ఆశ్లేషము)

ఆశ్లేషము. సం. వి. అ. పుం. 1.—పై.—; 2 కవుఁగిలింత: చూ, కౌఁగిలి.

ఆశ్లేషాభవము. సం. వి అ పుం. కేతుగ్రహము: చూ, గ్రహము. 2.

ఆశ్లేషించు. సం. స. క్రి: చూ, కౌఁగిలించు.

ఆశ్వత్థము సం వి. అ న: చూ, రావిపండు.

ఆశ్వము. సం. వి. అ. న. గుఱ్ఱపుసమూహము: చూ, హయము.

ఆశ్వమూత్రి. సం వి. ఈ. స్త్రీ. అంగుగు, మురుము*: చూ, సల్లకి.

ఆశ్వయుజము. సం. వి. అ. పుం. 1. ఆశ్వయుజమాసము: చూ, మాసము 1; 2. శరదృతువులో మొదటినెల. (ఆశ్వయుజ కార్తికమాసములు శరదృతువు.)

ఆశ్వయుజి. సం. వి. ఈ. స్త్రీ ఆశ్వయుజపౌర్ణమి, అశ్వినక్షత్రయుక్తమగు పౌర్ణమి, కోజాగరము, కౌముది, కౌముదీచారము: చూ, పున్నమ

ఆశ్వలాయనస్మృతి. అం. మూలస్మృతులు పదునెనిమిదింటిలో నొకటి: చూ, స్మృతులు.

ఆశ్వసించు. సం. స. క్రి. రూ- ఆశ్వాసించు: చూ, ఓదార్చు.

ఆశ్వసితము. సం. విణ. (అ. ఆ. అ.) ఊరడింపఁబడినది. రూ-ఆశ్వాసితము.

ఆశ్వాసనము. సం. వి. అ. న. ఓదార్పు: చూ, ప్రియము. (రూ-ఆశ్వాసము.)

ఆశ్వాసపూర్ణనియతశైలబంధచిత్రకందము పా. ఒకానొక చిత్రకవితా విశేషము. ఉదా.— "క. శ్రీగా గుణాంగనాగ్వా, హాకవసఖ లలిత కేలి- యాధృతకేలీ, గాళగళికఃకరళన ద,యా కరధి కృతాంబుజభవ- యాంచితవిధి నా." ఈ పద్యమునందు శ్రీగద్వాలకేశవ యనియున్నది. ముకుందవిలాసము. 1, 282.

ఆశ్వాసము సం వి అ. పుం. 1.—పై.—; 2. ఆఖ్యాయిక యను వచనకావ్యములోని వర్గువు: చూ, పరికథ; 3. గ్రంథభాగము: చూ, పరిచ్ఛేదము; 4. నాటకపరిచ్ఛేదము: నాటకము. 1; 5. ఎగఊపిరి: చూ, శ్వాసము; అం. 6. సప్తవ్యసనములలో నొకటి: చూ, వ్యసనములు.

ఆశ్వాసించు. సం. స క్రి: చూ, రూ- ఆశ్వసించు.

ఆశ్వాసితము. సం. విణ. (అ. ఆ. అ): చూ, రూ-ఆశ్వసితము.

ఆశ్వికము. సం. వి. అ .. సంభోగబంధములలో నొకటి: చూ, రతిబంధము.

ఆశ్వికుఁడు. సం. వి. అ. పుం: చూ, రూ-అశ్వికుఁడు.

ఆశ్వితి. సం. వి ఈ. స్త్రీ: చూ, అశ్విని.

ఆశ్వినము. సం. వి. అ. పుం. 1: చూ, అశ్వయుజము; విణ. 2. గుఱ్ఱము ఒకదినము పోఁదగిన (త్రోవ.): చూ, మార్గము. 1. (రూ-ఆశ్వీనము.)

ఆశ్వినేయులు. సం. వి. అ. పుం. అశ్వినీదేవతల కుమారులు అనఁగా దేవవైద్యులు: చూ, అశ్వులు.

ఆశ్వీనము సం. విణ. (అ. ఆ. అ.): చూ, రూ-ఆశ్వినము. 2.

ఆశ్వీయము. సం. వి. అ. పుం. 1. గుఱ్ఱముల గుంపు, ఆశ్వము: చూ, హయము; విణ. 2. గుఱ్ఱముల కిష్టమయినది.

ఆషాఢపూర్వజము. సం. వి. అ. పుం: చూ జ్యేష్ఠమాసము.

ఆషాఢభవుఁడు. సం వి అ. పుం అంగారక గ్రహము: చూ, రాహువు. 2.

ఆషాఢము. సం. వి. అ. పుం. 1 ఒకానొక నెల: చూ, మాసము. 1; (రూ-అషాఢము.); 2. ఉత్తరాషాఢానక్షత్రము, ఏచికంకటి చుక్క: చూ, నక్షత్రము. 1, 3. పూర్వాషాఢానక్షత్రము: చూ, నక్షత్రము 1; 4. మలయపర్వతము, గిరిసారము: చూ, పర్వతము; 5. బ్రహ్మచారి పట్టుకొను మోదుగుకఱ్ఱ

ఆషాఢి. సం. వి. ఈ. స్త్రీ. ఆషాఢశుద్ధపౌర్ణమి: చూ, పున్నమ. (పూర్వాషాఢా నక్షత్రయుక్తముగాగాని (లేక) ఉత్తరాషాఢా నక్షత్రయుక్తముగా గాని గల పౌర్ణమి.)

ఆషూర్ఖానా. హిం. సత్రము.

ఆష్టగుణికుఁడు. పా. ఎనిమిదిరెట్లు వడ్డి కిచ్చెడు వాఁడు.

ఆస. 1. సం. అవ్య. ఆయెను, బహువార్థకము: పై. వి (1)= ఆశ. కోరిక: చూ, వాంఛ; (2)= ఆశ. అత్యాశ: చూ, వాంఛ; (3)= ఆశ దెస: చూ, హరిత్తు.

ఆసంగము. సం వి. అ. పుం. 1. ఆసరా: చూ, ప్రాపు. 2; 2. కోరిక: చూ, వాంఛ.

ఆసుగిని. సం. వి. ఈ. స్త్రీ. వాత్య, సుడిగాలి: చూ, వాయువు.

ఆసంది. సం. వి. ఇ. స్త్రీ. 1. కటువు, పాడె:

చూ, శవయానము; 2. చేచ్చోకమైన మంచ మువంటి పీఁట: చూ, పీఁట; 3. చౌకమగు మంచము: చూ, మంచము. (రూ-ఆసంధి.)

ఆసంధి. సం. వి. ఇ. పుం. —వై.—

ఆసకస్వైరగాఁడు. ద్వ. వి. ఒకానొక పక్షి: చూ, పక్షి.

ఆసక్తము సం. విశ. (అ. ఆ. అ.) కూడియున్నది: చూ, సంయుక్తము.

ఆసక్తి సం. వి. ఇ. స్త్రీ.= ఆసత్తి: చూ, వాంఛ.

ఆసక్తుఁడు. సం. విశ. (అ. ఆ. అ) ఆసగలాఁడు: చూ, లుబ్ధుఁడు. 2.

ఆసలది. ద్వ. వి. కులట: చూ, జంకులాఁడి.

ఆసగలాఁడు. ద్వ. విశ: చూ, ఆసక్తుఁడు.

ఆసగొను. ద్వ. స క్రి. కోరు: చూ, వాంఛించు.

ఆసచేయు. ద్వ. స. క్రి.—వై.— "ఉ. ఇంద్రపదంబుకోరఁడు దిగీశుల రాజ్యము లాసచేయఁడు." వి పు, 2, ఆ. 65.

ఆసత్తి సం వి. ఇ. స్త్రీ. 1. లాభము, మూల ద్రవ్యముకంటె అదనముగ వచ్చిన సొమ్ము: చూ, లాభము. 1; 2 కూడిక: చూ, సంయోగము; వై వి. (1)= ఆసక్తి. కోరిక: చూ, వాంఛ.

ఆసత్యులు. సం. వి అ. పుం. అశ్వినీ దేవతలు: చూ, అశ్వులు.

ఆసన. సం. వి. అ. స్త్రీ. 1.= ఆసాను. కూర్చుండుట: చూ, స్థితి 2; 2. అంగడివీధి : చూ, వీధి. 3.

ఆసనము. సం. వి. అ. న. 1 పీఠము: చూ, పీఁట; 2. ఏనుఁగు మూఁపు: చూ, స్కంధము. 1; 3. ఏదియు అక్కఱలేకపోవుట; 4. దేశకాలాద్య పేక్షచేత నిలుచుట; బలాద్య పేక్షచే దండెత్తిపోక నిలుచుట: చూ, యానములు. (చూ, గుణము.); (ఇది పంచవిధము.—సంధాయాసనము, ప్రసంగాసనము, విగృహ్యాసనము, సంభూయాసనము, ఉపేక్ష్యాసనము (వీనికర్థము యానశబ్దము కడచూడుము.) 5. కూర్చుండుట: చూ, స్థితి 2; 6. చోటు: చూ, స్థానము. 1; శ్రు. 7. సగ్గకము *: చూ, వేఁగిస; అం. 8, షోడశోపచారములలో నొకటి: చూ, ఉపచారములు; 9 యోగాంగములు రెనిమిదింటిలో నొకటి : (చూ, అంగము. 9); చూ, యోగాంగములు. 10. సంధ్యాది షడ్గుణములలోనొకటి: చూ, గుణములు.

ఆసనములు. అం. స్వస్తికాది—స్వస్తికాసనము, గోముఖాసనము, బద్ధాసనము. పద్మాసనము, వీరాసనము, సింహాసనము, భద్రాసనము, ముక్తాసనము (దీనికి సిద్ధాసనమని, వజ్రాసనమని, గుప్తాసనమనియు నామాంతరములు గలవు.) మయూరాసనము, కుక్కుటాసనము, వరాహాసనము, విణాసనము, క్రౌంచాసనము, ముద్రికాసనము, సర్వతోభద్రాసనము, నాగాసనము, మత్స్యాసనము, వ్యాఘ్రాసనము, అర్ధచంద్రాసనము, అశ్వాసనము, దండాసనము, శైలాసనము, ఖడ్గాసనము, ముద్గరాసనము, మకరాసనము, హస్తికాసనము, కర్ణికాసనము, సీరాసనము, స్థాణ్వాసనము, సిద్ధాసనము. (30.)

ఆసనావర్తి. గ. అం. శుభావర్తములలో నొకటి: చూ, అశుభావర్తములు.

ఆసన్నము. సం. వి. అ. న. 1. దాపు : చూ, సమీపము. 1; 2. దాపైనది: చూ, సవిధము.

ఆసన్నవింశ. సం. వి. ఇ. స్త్రీ. ఇరువది వస్తువులు.

ఆసపడు. వై. అ. క్రి: చూ, వాంఛించు.

ఆసపాటు. వై. వి. కోరిక: చూ, వాంఛ.

ఆసపెట్టు. వై. స. క్రి: చూ, అపేక్షపెట్టు.

ఆసరా. వై. వి.= ఆశ్రయము. ఊఁత : చూ, ప్రాపు. 2.

ఆసవము. సం. వి. అ. పుం. 1. పక్వముకాని చెఱకురసమున చేసిన కల్లు, చెఱకురసమునఁ

తేనెను కల్లు (అని కొందఱు.): చూ, సుర. 1; 2. కల్లుతేట: చూ, సురామండము, 3 పూఁదేనె: చూ, మకరందము.

ఆసవములు. అం. ద్రాక్షాసవము, మాతాసవము, సురాసవము, చెంగల్వాసవము, పద్మాసవము, రుద్రపత్రాసవము, సునాముఖిపత్రాసవము, మధ్వాసవము, శర్కరాసవము, తింత్రిణ్యాసవము. (9.)

ఆసాదనము. సం. వి. అ. న. పొందు, ప్రాప్తి: చూ, లాభము. 1.

ఆసాది. దే. వి. మతంగుఁడు: చూ, మాదిగ.

ఆసాదించు. సం. స. క్రి. పొందు, లభించు: చూ, ప్రాప్తించు.

ఆసాదితము. సం. విణ (అ. ఆ. అ.) పొందఁబడినది: చూ, ప్రాప్తము. 1.

ఆసాద్యము. సం. విణ. (అ. ఆ. అ.) పొందఁదగినది: చూ, ప్రాప్యము.

ఆసాను. పా. అధాగము.

ఆసామి పా. వ్యక్తి.

ఆసామీవారీ. పా. పేర్లవరుసగా వ్రాయుట.

ఆసారము. సం. వి. అ. పుం. 1. జడివాన: చూ, ధారాసంపాతము; 2. ముసుగ *: చూ, కిగుర్వు. 1; 3. అగ్రపగ్గము * : చూ, జిల్లేడు; 4. మిత్రబలము - మిత్రసంధిబలము - మిత్రసైన్యము; 5. అంతట సేన వ్యాపించుట: చూ, ప్రసరణి; 6. దండువిడిసిన చోటు : చూ, శిబిరము; 7. తొలిచేదువులు: చూ, వేదము.

ఆసించు. వై. స. క్రి.=ఆశించు : చూ, వాంఛించు.

ఆసిక. సం. వి. ఆ. స్త్రీ. కూర్చుండుట : చూ, స్థితి. 2,

ఆసికుఁడు. సం. వి. అ. పుం. కటారికాఁడు: చూ, ఖడ్గి.

ఆసిక్తము. సం. విణ (అ. ఆ. అ.) అంతటఁ తడుపఁబడినది.

ఆసితము సం. వి. అ. న. 1. కూర్చుండుట: చూ, స్థితి. 2; విణ. 2. పూర్వమునందు ఆవులుండు తావు: చూ, భూమి 1; 3 కూర్చుండినది.

ఆసితసంతుఁడు. సం వి. అ. పుం. సగర చక్రవర్తి: చూ, రాజు. 1.

ఆసిద్ధము. సం విణ. (అ. ఆ. అ.) 1. అడ్డగింపఁబడినది: చూ, రుద్ధము. 1. 2. కట్టాయిత్తమైనది.

ఆసియా. అం. ఖండము లయిదింటిలో నొకటి: చూ, ఖండములు.

ఆసీనము సం విణ (అ. ఆ. అ.) కూర్చున్నది.

ఆసీనుఁడు. సం. విణ (అ. ఆ. అ.) కూర్చున్నవాఁడు: చూ, ఉపవిష్టుఁడు.

ఆసు దే. వి. సాలెవాఁడు ఆసుపోయునపుడు నూలు చొప్పించెడు క్రోవి: చూ, ఆసుఁగ్రోవి.

ఆసుఁగ్రోవి. దే. వి. (ఆసు + క్రోవి.): చూ, తంత్వా తర్పణము.

ఆసుతీబలుఁడు. సం. విణ నేర్పరి : చూ, సమర్థుఁడు.

ఆసుపోయు. దే. స. క్రి. కొయ్యపట్టముగుండా దారమునుపోయు: చూ, పోఁగువాలు (రూ- ఆసువోయు.)

ఆసుమ్రాను. దే. వి. నూలుపోఁగు వాటించుటకై వయిసకు మూఁడువంతునగాని అయిదువంతునగాని నాలుగైదు మునలుగా మెలలు గూర్చిన కొయ్యపట్టము.

ఆసురము. సం. వి. అ. పుం. 1. బొంతకాకి: చూ, వాయసము 1; న. 2. చెవుటియుప్పు: చూ, లవణము. 1; 3: చూ, విస్తృతము; పుం. 4. ధనమిచ్చి కన్యను దీసి చేసికొనఁబడి యొకానొక వివాహము: చూ, వివాహము.

ఆసురి. సం. వి. ఈ. స్త్రీ. 1. నల్లావాలు: చూ,

**ఆసురి.** సం. వి. ఈ. స్త్రీ. 1. నల్లావలు: చూ, సర్షపము; 2. మూలానక్షత్రము: చూ, నక్షత్రము. 1; 3. ఆర్షచ్ఛందోబద్ధమైన యొకానొక మంత్రపాఠము: చూ, మంత్రము. 1; 4. బెల్లముపేయక చేసిన సారాయి: చూ, సుర. 1; 5. పంది: చూ, సూకరము.

**ఆసురీణము.** సం. విణ. (అ. ఆ. అ.) నల్లావలం పండునది (పొలము): చూ, భూమి. 1.

**ఆసురుఁడు.** సం. వి. అ. పుం. 1. నైర్ఋతి: చూ, మూలవేలుఁడు; 2. రక్కసుఁడు: చూ, రాక్షసుఁడు. 1.

**ఆసులోకొవిదలె.** లో. ఉదా.— "అమరపురిఁ గేలు వెలుచు దిశాధిపతుల, కెలువుఁ జేయంగ నచ్చటి కిచ్చటికిని, వారదుండాసుగోవి చేందముగ దిరుగు." కువలయాశ్వచరిత్ర. (ఆసులోకండి.)

**ఆసుపోయు.** దే. స. క్రి. (ఆసు + పోయు.): చూ, రూ-ఆసుపోయు.

**ఆసేకము.** సం. వి. అ. పుం. ఆసేచనము: చూ, చేల్లుట.

**ఆసేచనకము.** సం. విణ. (అ. ఆ. అ.) ఎంత చూచినను తనివితీరని వస్తువు.

**ఆసేచనము.** సం. వి. అ. పుం. 1: చూ, ఆసేకము; విణ. 2. కోరఁబడినది: చూ, సమీహితము.

**ఆసేదివంతుఁడు.** సం. వి. స. పుం. కూర్చున్నవాఁడు: చూ, ఆసీనుఁడు.

**ఆసేధము.** సం. వి. అ. పుం. అడ్డంకి: చూ, నిరోధము. 1.

**ఆసేధించు.** సం. స. క్రి. అడ్డగించు: చూ, నిరోధించు

**ఆసేధ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) అడ్డగింపఁబడినది: చూ, రుద్ధము. 1.

**ఆసేవితము.** సం. విణ. సేవింపఁబడినది: అజుష్టము.

**ఆసేవ్యము.** సం. విణ. సేవింపఁదగినది.

**ఆసోత్రామణి.** సం. అవ్య. 1. సౌత్రామణియాగముపఱకు; 2. యజుర్వేదపరాయితమునందు సౌత్రామణియను ప్రశ్నములు: చూ, వేదము.

**ఆస్కందనము.** సం. వి. అ. న. 1. జగడము: చూ, యుద్ధము; 2. ఇంకుట: చూ, శోషణము. 1; 3. తిరస్కారము: చూ, కహేలనము; 4. గతి: చూ, ప్రయాణము; విణ. 5. ఎండినది: చూ, శుష్కము. 2.

**ఆస్కందితము.** సం. వి. అ. న. 1. అతివేగమును అతిమందమును గాక నడితరముగాఁ బాఱెడి యొక (అశ్వధార.): చూ, ఖురి; అం. 2. అశ్వధారలయిదింటిలో నొకటి: చూ, అశ్వధారలు; 3. గుఱ్ఱపునడకలయిదింటిలో నొకటి: చూ, నడకలు; 4. భూమమండలములు పదింటిలో నొకటి: చూ, భూమమండలములు.

**ఆస్తరణము.** సం. వి. అ. న. 1. పీఠము: చూ, పీఁట; 2. ఎఱ్ఱకంబళి: చూ, రల్లకము; 3. ఏనుఁగుమీఁద బఱచెడి రత్నకంబళి: చూ, రల్లకము; 4. పడక: చూ, శయ్య. 1.

**ఆస్తరము.** సం. వి. అ. పుం. = ఆస్తర పు. —పై.—

**ఆస్తి.** దే. వి. ధనము: చూ, విత్తము. 1.

**ఆస్తికత.** సం. వి. ఆ. స్త్రీ. ఆస్తికుని భావము: చూ, ఆస్తికత్వము.

**ఆస్తికత్వము.** సం. వి. అ. న.—పై.—

**ఆస్తికాఁడు.** దే. వి. అచ్చుతప్పు: చూ, ధనికుఁడు. 1.

**ఆస్తికుఁడు.** సం. వి. అ. పుం. 1. భగవంతుఁడున్నాఁడని నమ్మువాఁడు. (వ్య.—నాస్తికుఁడు.); విణ. 2. (అ. ఆ. అ.) ఓపికగలవాఁడు: చూ, శ్రద్ధధానుఁడు.

**ఆస్తిక్యము.** సం. వి. అ. న. 1: చూ, ఆస్తికత; అం. 2. నియమములు పదింటిలో నొకటి: చూ, నియమములు.

ఆస్తీర్ణము. సం. విణ. (అ. ఆ. అ.) పఱుపఁబడినది: ఆచితము.

ఆస్థ. సం. వి. ఆ. స్త్రీ. 1. కొలువు, గ్రామస్థులుచేరి వ్యవహారముచేయు చోటు: చూ, రచ్చ; 2. రాజసభ: చూ, సభ. 2; 3. ప్రయత్నము: చూ, యత్నము.

ఆస్థానము. సం. వి. అ. న. 1. కొలువు: చూ, రచ్చ; 2. రాజసభ: చూ, సభ. 2.

ఆస్థాని. సం. వి. ఈ. స్త్రీ.—పై.—

ఆస్థికము. సం. విణ. (అ. ఆ. అ.) వజ్రాయుధము, కులిశము: చూ, బాణము. 1.

ఆస్పదము. సం. వి. అ. న. 1. చోటు: చూ, స్థానము. 1; 2. కృత్యము, చేఁత: చూ, పని. 2.

ఆస్పష్టము. సం. విణ. (అ. ఆ. అ.) స్పృశింపఁబడినది, ఉద్గాహితము— రూ-ఉద్గ్రాహితము: చూ, స్పృశ్యము.

ఆస్ఫుజితుఁడు. సం. వి. త. పుం. నవగ్రహములలో నొకటి: (చూ, శుక్రుఁడు.) చూ, రాహువు. 2.

ఆస్ఫాలనము. సం. వి. అ. న. = అప్ఫళము: చూ, చేఱుపు. 1.

ఆస్ఫాలము. సం. వి. అ. పుం. 1. —పై—; 2. ఏనుఁగు చెవి కొట్టుకొనుట: చూ, ఝులఝుల.

ఆస్ఫాలించు. సం. స. క్రి. చేఱచు: చూ, పటితళించు.

ఆస్ఫాలితము. సం. విణ. (అ. ఆ. అ.) చేఱపఁబడినది: ఆస్ఫోటితము.

ఆస్ఫుజిత్తు. సం. వి. త. పుం. శుక్రగ్రహము: చూ, ఆస్ఫుజితుఁడు.

ఆస్ఫుటము. సం. వి. అ. పుం. అర్కపర్ణము*: చూ, జిల్లేడు.

ఆస్ఫోట. సం. వి. ఆ. స్త్రీ. 1. అడవిమల్లె*: చూ. మల్లె; 2. నల్లదింటెన*: చూ, దింటెన.

ఆస్ఫోటక. సం. వి. ఆ. స్త్రీ. వేరుమల్లె, పటికి*: చూ, ముఖరి.

ఆస్ఫోటకము. సం. వి. అ. పుం. తెల్లజిల్లేడు* (కన్న-బిళిఎక్క-దగిడ): చూ, జిల్లేడు.

ఆస్ఫోటనము. సం. వి. అ. న. 1. ఆస్ఫాలనము: చూ, చేఱుపు. 1; 2. జీవస్థానమునందు పొడిచిన పోటు: చూ, పోటు. 4; 3. తునుక; చూ, శకలము. 4.

ఆస్ఫోటని. సం. వి. ఈ. స్త్రీ. రత్నములకు బెజ్జము వేసెడు వజ్రపుపోగర: చూ, వైధనిక.

ఆస్ఫోటించు. సం. స. క్రి. 1. చేఱచు: చూ, పటితళించు; 2. పొడ్వనాటు: చూ, పొడుచు; 3. చీలు, అగలుచు: చూ, ఛేదిల్లు.

ఆస్ఫోటితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. చేఱపఁబడినది: చూ, ఆస్ఫాలితము; 2. పొడువఁబడినది; 3. చీల్పఁబడినది: చూ, ఛేదితము.

ఆస్ఫోతము. సం. వి. అ. పుం. 1: చూ, ఆస్ఫుటము*; 2. కాంచనము* (చూ, కోవిదారము.): చూ, దేవకాంచనము; 3. నల్లదింటెన*: చూ, దింటెన; 4. నవమాలిక*: చూ, విరజాజి; 5. అడవిమల్లె*: చూ, మల్లె.

ఆస్య. సం. వి. ఆ. స్త్రీ. కూర్చుండుట: చూ, స్థితి. 2.

ఆస్యము. సం. వి. అ. న. 1. ముఖము: చూ, వదనము. 2; 2. నోరు: చూ, వదనము. 1; విణ. 3. వక్త్రభవము: చూ, మాట. 1; 4. ఉండఁదగినది: చూ, స్థాతవ్యము.

ఆస్యోటని. సం. వి. ఇ. స్త్రీ. అడవిమల్లె*: చూ, మల్లె.

ఆస్రము. సం. వి. అన. 1. కన్నీరు, రూ-అశ్రము: చూ, రోదనము. 2; 2. నెత్తురు: చూ రక్తము. 1; 3. రోమము: చూ, వెండ్రుక. 1.

ఆస్రవము. సం. వి. అ. పుం. రాగద్వేషాది ప్రయుక్తమగు దుఃఖము: చూ, క్రమము. 1.

ఆస్వదనము. సం. వి. అ. న. 1. రూ-ఆస్వాదనము, కుడుపు: చూ, భుక్తి. 2; 2. చేవి: చూ, రుచి. 1. (రూ-ఆస్వాదనము.)

ఆస్వదించు. సం. స. క్రి. 1. కుడుచు : చూ, భుజించు. 2; 2. రూ- ఆస్వాదించు : చూ, చేవిగొను.

ఆస్వనితము. సం. వి. అ. న. ఉల్లము, మనస్సు: చూ, హృదయము. 2.

ఆస్వాదనము. సం. వి. అ. న: చూ, రూ- ఆస్వదనము.

ఆస్వాదించు. సం. స. క్రి : చూ, రూ- ఆస్వదించు.

ఆస్వాదితము. సం. విణ (అ. ఆ. అ.) 1. అనుభవింపఁబడినది: చూ, భుక్తము; 2. చేవి చూడఁబడినది.

ఆస్విన్నము. సం. వి. అ న. అంతటచెమర్చినది.

ఆహా. సం. 1. తిజంత ప్రతిరూపకావ్యయము. కాలసామాన్యము: చూ, అస్తి. 1; 2.ఉవాచ, పలికెను.

ఆహాకము. సం. వి. అ. పుం. 1. కుడుక: చూ, తాకట్టు. "ద్వి. ఆహాకంబులు పెట్టి." హరిశ్చ. 2, భా. (ఆహాకశబ్దము ఆయకమై యుండనో.పు)

ఆహతము. సం. వి. అ. పుం. 1. తమ్మటమను వాద్యము: చూ, భేరి; విణ. 2. అసత్యమైనది: చూ, వితథము; 3. క్రొత్తది (వస్త్రము) కోరా : చూ, వస్త్రము; 4. పాఁతది (వస్త్రము.): చూ, వస్త్రము; 5. కలుగనేరనిది. (గొడ్రాలికొడుకు చూచుచున్నాఁడు లోనగుమాటలు.): చూ,అసంభవము; 6.కొట్టఁబడినది: ఆయస్తము, ఆవిద్ధము; 7. రెట్టింపఁబడినది, గుణకారము : చూ, హెచ్చవేత; 8. వాయింపఁబడినది; 9. ముద్రవేయఁబడిన వెండి బంగారము: చూ, నాణకము; అం, 10. గమకములు పదునైదింటిలో నొకటి:చూ గమకములు; 11. నాదములు రెండింటిలో నొకటి: చూ, నాదములు; 12. చక్రము లారింటిలో నొకటి: చూ, చక్రములు.

ఆహతలక్షణుఁడు. సం. విణ. (అ. ఆ. అ.)కుంచి గుణములచేతఁ బ్రసిద్ధిఁజెందినవాఁడు: చూ, కృతలక్షణుఁడు.

ఆహతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. కల్లమాటలాడువాఁడు: చూ, ముఖరుఁడు; 2: చూ, కొట్టఁబడినవాఁడు

ఆహరణము. సం. వి. అ. పుం. ఆనేతవ్యము: చూ, తెచ్చుట.

ఆహరించు. సం. స. క్రి. 1. అపహరించు. "నేదల్లడమంద భూవణ వితానము సర్వమునాహరించి." షో. 4, ఆ : చూ, దొంగిలించు; 2. ఆక్షేపించు. "విజ్ఞానమునఁ జేసి విషయాది వలన నెమ్మనమూహరించి." ఆము. 8, ఆ:చూ, రెమ్ము; 3 తిను. "ఎ, గీ. బ్రహ్మచర్యమునకుఁ బరమారయుపవాసములకుఁ జిత్తశుద్ధి ఫలజలంబులాహరించి యునికి కాధి రాజ్యము పుత్ర, భక్షితకు దివంబు ఫలములధిప." భార. అను. 1, ఆ: చూ, సాపడు.

ఆహర్త. సం. విణ. (ఋ. ఈ. ఋ.) దొంగ: చూ, ముచ్చు. 1.

ఆహవనము. సం. వి. అ. న. జన్నము : చూ, యజ్ఞము.

ఆహవనీయము. సం. వి. అ. పుం. 1. శ్రౌతాగ్ని, వేదికకుఁ దూర్పునందు నాలుగుమూలల కుండములలోని యగ్ని. అగ్నులయిదింటిలో నొకటి: చూ, అగ్నులు విణ. 2. యజ్ఞమునందు బలియియ్యయోగ్యమైనది; అం. 3. అగ్నులు మూడింటిలో నొకటి: చూ, అగ్నులు-

ఆహవమల్లసోమేశ్వరుఁడు. పా. క్రి. శ. 104 లగాయితు 1068 వఱకు రాజ్యమును పరిపా

లించిన పశ్చిమ చాళుక్యరాజులలో నొకఁడు. (జగదేకమల్ల) జయసింహునిపుత్రుఁడగు నీరాజు రాజరాజనరేంద్రుని సమకాలీనుఁడు. రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక 21. పుట.

ఆహవము. సం. వి. అ. పుం. 1. రూ-ఆహావము, జగడము: చూ, యుద్ధము; 2. రూ- ఆహావము, నూతియొద్దఁగట్టిన నీళ్ళతొట్టి: చూ, నిపానము; 3. పిలుపు: చూ, సంబోధనము; 4. జన్నము: చూ, యజ్ఞము.

ఆహా. వై. అవ్య. ఆశ్చర్యార్థకము. "ఆహా పుట్టెడులాఁతి చూపులకు." భార. శల్య. 2, ఆ: చూ, వింత. 1. (రూ-ఆహాహా.)

ఆహాయనము. సం. అవ్య. సంవత్సరము వఱకు.

ఆహారము. సం. వి. అ. పుం, 1. = ఆరగింపు భోజనము: చూ, సాపాటు; 2 = ఓగిరము, అన్నము: చూ, సాదము; 3. ఆహరణము: చూ, తెచ్చుట; 4, కందుకము: చూ, బంతి.3; 5. అపహరణము, దొంగతనము : చూ, ముచ్చిలి; అవ్య. 6. హారమువఱకు; 7. హరించే వఱకు.

ఆహారి. అం. స్త్రీరాగము లిరువది నాలుగింటిలో నొకటి: చూ, స్త్రీరాగములు.

ఆహారించు. సం. స. క్రి. తిను. "సీ. గ్రహణ వేళలయందు రాహువాహరించి తృప్తిపై గణ్ణుఁ దేఁచెనని." వై. 2, ఆ. 128: చూ, సాపడు.

ఆహార్యకము. పా. నాట్యమునకుఁదగిన వస్త్రాభరణముల ధరించుట.

ఆహార్యము. సం. వి. అ. పుం. 1. హారాదిభూషణాదులచేఁ గలుగు అభినయవిశేషము: చూ, అభినయము. (చూ, వ్యంజకము. 1.); 2. భూషణాది వేషసామగ్రి; విణ. 3. తెచ్చుకోఁదగినది: ఆనేతవ్యము, ఆనేయము; 4. కాలనియమములేక వచ్చునది: ఆగంతుకము; అం. 5. అభినయములు నాలుగింటిలో నొకటి: చూ, అభినయములు.

ఆహావము. సం. వి. అ. పుం. 1. పశువులు నీరు త్రాగుటకై నూతియొద్దఁగట్టిన తొట్టి, రూ- ఆహావము: చూ, నిపానము; 2. రూ- ఆహవము, జగడము: చూ, యుద్ధము.

ఆహాహా. వై. అవ్య: చూ, రూ-ఆహా.

ఆహికము. సం వి. అ. పుం. 1. వంతుపక్కెగను విడిచి విడిచి వచ్చెడు ఊపిరి. (శ్వాసము) చూ, రోగము. 1; 2. సుషిరమను వాద్యము: చూ, స్వరము 2; 3. కేతుగ్రహము : చూ, రాహువు. 2; అం. 4. మల్లశాస్త్రమునందలి పరిచారములు ముప్పదిరెండింటిలో నొకటి చూ, పరిచారములు.

ఆహితము. సం. విణ (అ. ఆ. అ) 1. ఉంపఁబడినది చూ, ఉపహితము; 2. చేయఁబడినది: చూ, ఉద్ధృతము.

ఆహితలక్షణుఁడు. సం. విణ. (అ. ఆ. అ.): చూ, రూ- ఆహతలక్షణుఁడు:

ఆహితాగ్ని. సం. వి. ఇ. పుం. అగ్నిహోత్రము నుంచుకొని యుండువాఁడు.

ఆహితుండికుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) పాములవాఁడు: చూ, సర్పగ్రాహకుఁడు (గారడివాఁడనియు వాడుదురు.)

ఆహిరిణి. సం. వి. ఈ. స్త్రీ. రూ-అహీరణి, విషముగల ఇరుదలల పాము: చూ, సర్పము.

ఆహినము. సం. వి. అ. పుం. అప్పనము: చూ, లంచము.

ఆహుతము. సం. విణ. (అ. ఆ. అ.) వ్రేల్వఁబడినది: చూ, రూ-హుతము.

ఆహుతి. సం. వి. ఇ. స్త్రీ. అగ్నియందువ్రేల్చుట.

ఆహుల్య. సం. వి. ఆ. స్త్రీ : చూ, కాంచనపుష్పకము *

**ఆళువరి** దే. వి. అలంగము: చూ, వప్రము.

**ఆళువారు.** దే. వి: చూ, రూ-ఆళ్వారు. "గీ. అనిశమాళువలుక నళికి యయ్యాళువార్యియ్యకొని యోఁబోవ." ఆము. 2, ఆ.

**ఆళ్ళకోస.** దే. వి. ఆతాపి, ఒకగకము కాకి: చూ, వాయసము. 1.

**ఆళ్ళు** దే. వి. బ. (ఆళగ + లు.) 1. కోద్రవము: చూ, ధాన్యము; 2. సస్యవిశేషము: చూ, సస్యము.

**ఆళ్వారు.** దే. వి. హరిభక్తుఁడు. "శా. అంచత్త్రేమ వశంవదుండగుచు నాయాళ్వారిఁ జేరంగ గృహమ్మంచుంజెల్చి ము ॰ రి" పర. 4, ఆ: చూ, రూ-ఆళువారు.

**ఆళ్వారులు.** పా. పొయిఘాళ్వారు, పూదత్తాళ్వారు, పేయాళ్వారు, పెరియాళ్వారు, నమ్మాళ్వారు, తిరుమంగయాళ్వారు, తిరుమిషియాళ్వారు, తొండరడిప్పొడియాళ్వారు, మధురకవియాళ్వారు, నాథమునియాళ్వారు, కులశేఖరాళ్వారు, తిరుప్పాణియాళ్వారు. (12.)

## ఇ

**ఇ.** 1. సంస్కృత, ప్రాకృత, తెనుఁగు, ఆంధ్ర భాషల వర్ణంబులందలి యచ్చులలోని మూఁడవయక్కరము "సీ. ఆదులు పదియాఱునచ్చులు" అప్ప. 2, ఆ. 6; "క. మొదలనకారాద్యచ్చులు, పదియాఱు." అప్ప. 2, ఆ. 20: చూ, వర్ణము. 1; సం. అవ్య. 1. చిత్రము: చూ, వింత. 1; 2. కోపములోని భేదము: చూ, కోపము; 3. వంత: చూ, దుఃఖము; 4. శబ్దము: చూ, మాట. 1; 5. తేడామాట: చూ, మాటతేడా; 6. ఆశ్చర్యార్థకము: చూ, వింత. 1; ఇ. పుం. 7. మరుఁడు: చూ, మన్మథుఁడు; 8. పాము: చూ, సర్పము; 9. మణి, మానికము: చూ, రత్నము; 10. కాంతి: చూ, వెలుతురు. 1; 11. మంట: చూ, నిప్పు; 12. అగ్రము: చూ, కొన. 3; 13. ముందు: చూ, ముందఱ. 1; 14. ఆఁడుగుఱి: చూ, భగము. 12; 15. మహర్షులు స్నానముచేసిన పుణ్యోదకము, తీర్థము: చూ, నీరు 1; 16. ముక్కంటి: చూ, శివుఁడు; 17. కరేణువు, ఆఁడేనుఁగు: చూ, హస్తి; 18. ఆఁడేనుఁగుయొక్క గర్భాంతర్భాగము: చూ, హస్తి; 19. చంద్రకిరణము: చూ, మయూఖము 1; 20. శుద్ధాంతము, రాణివాసము: చూ, గృహము. 1; దే. వి. (1) పరమందలి వర్ణమునకు ద్విత్వముపుట్టించి ఇదంతశబ్దార్థమగును. "ఇయ్యడవి." మొ; (2) ఇదంతశబ్దములకుఁ బ్రథమైకవచన ప్రత్యయము రాదు. ఉ. హరి - మతి; ప్రథమైకవచన ప్రత్యయములైన "డు - ము - వు" -లు ఇకారము కడపటఁగల శబ్దములకు రావు హరిఁడు- మతిము అనరాదు. హరి, మతి రీతియనవలయును.

**ఇంక.** దే. క్రి. 1. ముందు: చూ, ముందఱ. 1; 2 ఇంకను, ఇప్పటికిని, ఇదివఱకును: చూ, యిఁక; 3. అనఁగా: చూ, మఱి. 2.

**ఇంక నేమిచేతునని మొఱ్ఱకట.** అం. చిహ్నములు యెనిమిదింటిలో నొకటి: చూ, చిహ్నములు.

**ఇంకించు.** దే. అ క్రి. 1. చిగురొత్తు: చూ, పల్లవించు. అం పద. పారి; 2. అడఁగు, అఱు: చూ, నశించు.

**ఇంకు.** దే. అ. క్రి. వట్టు, శోషిల్లు: చూ, శోషించు

**ఇంకుడు.** దే. వి. 1. ఇంకుట: చూ, శోషణము. 1 విశే. 2. ఇంకినది; 3. ఎండినది. "సీ. ఇంకుడు చేన్నులు వంకచేతులు." హరిశ్చ. 4, ఆ: చూ, కుమ్మము. 2. (రూ-ఇంకుట.)

ఇంకువ. దే. వి. 1. గుఱుతు: చూ, లక్షణము 1; 2. స్థలి, మెరక నేల: చూ, భూమి 1.

ఇంగము. సం. వి. అ. పుం. 1 తలఁపు: చూ, విషయము. 4; 2 ఆశ్చర్యము: చూ, వింత. 1; 3. బుద్ధి: చూ, బుద్ధి; 4. సంజ్ఞచేయుట; స 5. అభిప్రాయసూచకమైన ముఖరాగాది వికారము, ఇంగితము: చూ, బొమముడిపాటు; వి.ఎ. 6. తిరుగునది, చరిష్ణువు: చూ, త్రసము.

ఇంగలము. సం. వి. అ. పుం. 1. పిడకనిప్పు చూ, నిప్పు; వై. వి.= 1. అంగారః. అగ్ని. "క. వంగడపు వెనుఁగోపపు, టింగలముసఁ జేర్చి కవిసయాసిరి." పాం. 5, ఆ: చూ, నిప్పు; (2)= హింగుళ: చూ, ఇంగిలీకము.

ఇంగలింపు. దే. వి. మల్లయుద్ధములోని మెలఁకువలలో నొకటి: చూ, మల్లశాస్త్రము.

ఇంగాలము. ప్రా. వి. అ. పుం. బొగ్గు: చూ, నిప్పు.

ఇంగితము. సం. వి. అ. న. 1. తలఁపు: చూ, విషయము. 4; 2. ఆకారము: చూ, బొమముడిపాటు; 3. పయనము: చూ, ప్రయాణము; అం. 4. అశ్వహృదయపరిజ్ఞానములలో నొకటి: చూ, అశ్వహృదయ పరిజ్ఞానము.

ఇంగిలము. వై. వి. = అంగారః. అగ్ని: చూ, నిప్పు.

ఇంగిలాయ. దే. వి. కరదీపిక: చూ, దివిటి.

ఇంగిలాయి. దే. వి. ఒకరకపు చేప: చూ, మత్స్యము. 1.

ఇంగిలికము. వై. వి. = హింగుళః. రాగద్రవ్యవిశేషము, కొండకావితాయి: చూ, హింగుళము.

ఇంగిలీక. అం. భస్మములు పంగొమ్మిదింటిలో నొకటి: చూ, భస్మములు.

ఇంగిలీకభస్మము పా. ఇంగిలీకము వేడినీటియందు రెండుగోజాలు నాననిచ్చి గుంటకన్నాకు నూరి ముద్దచేసి ఆముద్దలో యింగిలీకము పెట్టి రెండు ఘామముల వేళ సూర్యున కెదురుగానుంచిన భస్మమగును. (పచ్చాకుతో పైవిధముగా సూర్యపుటము వేసిన భస్మమగును.)

ఇంగిలీకమయినము. పా. ఆరతికర్పూరము దమ్మిడీయెత్తు, గవ్వసాంబ్రాణి దమ్మిడీయెత్తు, ఇంగిలీకము దమ్మిడీయెత్తు కలిపి నూరి పెసరగింజంత లేసి తేనెతో పెద్దలకు చనుఁబాలతో పిల్లలకు యివ్వవలెను.

ఇంగిలీకము. వై. వి.= —వై.— "సీ. ఇంగిలీకపు వింతగంగుళీస." స్వా. 1, ఆ. 5. (గంధకము గల మిశ్రద్రవ్యము.)

ఇంగిలీకముశుద్ధి. పా. ఇంగిలీకము చనుఁబాలను గాని, నిమ్మపండ్ల రసముఁగాని నూరిన శుద్ధియగును.

ఇంగుదము. సం. వి. అ. పుం. 1. రూ- ఐంగుదము; చూ, గారపండు; 2. గార *: చూ, హింగుది.

ఇంగుది. సం. వి. ఈ. స్త్రీ. గార *: చూ, రూ- హింగుది.

ఇంగువ. వై. వి. 1.= హింగు. ఉగ్రగంధము * (కన్న-హింగు.): చూ, హింగువు. 1; (ఋతుశూలలకు పుల్లదానిమ్మపండ్ల రసము, అపస్మారమునకు మొగలిచెక్కరసము ప్రశస్తము.) 2.= హింగు, సంబారవిశేషము: చూ, హింగువు. 2. (అత్యుగ్రభూతనాశము అనియుఁ గలదు.)

ఇంగువశుద్ధి. పా. ఇంగువ తామరాకురసముతో భావనచేసిన శుద్ధియగును.

ఇంగ్లీషువారు. పా. ఆంగ్లేయులు.

ఇంచాకము. సం. వి. అ. న. రొయ్యచేప, జలవృశ్చికము: చూ, మత్స్యము. 1.

సూ.95 ప్రేరణంబునందించుక్కుమీఁదనించుక్కు లేదు; సూ.96. ఇత్వంబుగాని యత్వంబుగాని కూడుచోనన్నాద్యంబయిన యుత్వంబున కిత్వంబగు; సూ. 97 ప్రేరణేంచుక్కు పరంబగునపుడు పకారంబు చకారంబగు; సూ. 98. సృష్టీస్తులు ముత్తునాఁబడు; సూ. 99 ఆగమాద్యకారంబు లకద్విముక్తంబులగుముత్తు పరంబగునపుడు పవలగు.

ఇంచుట. దే. వి: చూ, ఎచ్చుట. "ఇంచిన వేడ్క నాత్మసంపదయేశ్వరిఁ గన్గొని" హం. హాస.

ఇంచుపాలకడలి. ద్వ. వి. 1. పాలసముద్రము ఆఱవసంద్రము: చూ, సముద్రము, అం. 2. సముద్రము లేడింటిలో నొకటి : చూ, సముద్రములు.

ఇంచుమించు. ద్వ. వి. అంచునకు."నలి శీలించు నలినలిగావించు, నిమిషించులాటి నించుమించు, లేమసగవు చూపులు." విజ. 1, ఆ. 34: చూ, వేలుపాటు 1

ఇంచుమించుగా. ద్వ. అవ్య. కొంచెము హెచ్చు తగ్గుగా.

ఇంచుమ్రాను ద్వ. వి. ఇక్షువు, చెఱకు*: చూ, గసాలము, 8.

ఇంచువిలుకాఁడు. ద్వ. వి. మరుఁడు: చూ, మన్మథుఁడు. (రూ-ఇంచువిల్కాఁడు.)

ఇంచువిలుతుఁడు ద్వ.వి.—పై.—(రూ-ఇంచువిల్తుఁడు.)

ఇంజంక్షను. ఆం. ఒకపని చేయుమనిగాని కూడదనిగాని శక్తిదాయనికి కోర్టు ఉత్తరువు.

ఇంజెక్షను. ఆం. మందును శరీరములోనికెక్కించుట.

ఇంజేటి. దే. వి, రూ-ఈఁజేటి, ఒకరకము కంద*: చూ, కూరణము

ఇంటఁగుడిచి యింటివాసములు లెక్కవెట్టినట్లు. లో. ఉదా.—"ఓస్వామి ద్రోహీ! యింటఁగుడిచి యింటివాసము లెన్నికయిడిన వడువున మాదేశమునఁగుప్రమర్మములు మాస్వామి వేయాక్షేపింపఁజొచ్చితివి." (నీతిచంద్రిక—విగ్రహము)

ఇంటగెలిచి రచ్చగెలువవలెను. లో. ఉదా.—దేవా! ఇంట గెలిచి మఱి రచ్చ గెలువవలయును. మనలో మనమాట విచారింతము. (నీతిచంద్రిక—విగ్రహము.)

ఇంటరము. దే. వి. రూ- ఇంట్రము. సంకటము. "ఒంటర మింటరములు వలుకు టుచితమే." భాగ. ఉద్యో 4, ఆ. 287: చూ, దుఃఖము·

ఇంటాతఁడు. ద్వ. వి మగఁడు: చూ, భర్త 1.

ఇంటికప్పము. ద్వ. వి ఇంటిపన్ను: చూ, బాడిగ.

ఇంటికప్పు ద్వ. వి. ఇంటికి వేసెడు పైకప్పు: చూ, పటలము.

ఇంటికాఁపు. దే. వి. (ఇల్లు + కాఁపు.) గృహస్థుఁడు (భార్యను పరిగ్రహించి ధర్మార్థకామముల నడపుచు వేదపారము వైశ్వదేవాదిహోమము అతిథి పూజ పితృతర్పణము భూతబలియు ననెడు పంచయజ్ఞములను జేయుచు ప్రవర్తించువాఁడు.): చూ, యజమానుఁడు.

ఇంటికోన. ద్వ. వి. గృహాగ్రము: చూ, ప్రకోష్ఠము.

ఇంటిచోఁపా. ద్వ. వి. గృహైకదేశము : చూ, ముంగిలి. 2.

ఇంటితోఁట దే. వి. గృహారామము : చూ, వనము. 2.

ఇంటిపట్టు. దే. వి. (ఇల్లు + పట్టు.) గృహస్థుని ధర్మము. "సీ. పసుపునిగ్గులుదేఱు పాఁపజన్నిద మొప్పఁ బ్రమథాధిపతి యింటి పట్టెఱింగి." స్వా. 1, ఆ. 11: చూ, గృహస్థధర్మము.

ఇంటిపన్ను. ద్వ. వి: చూ, బాడిగ.

ఇంటిపాప. ద్వ వి. (ఇల్లు + పాప.) వెలకుఁగొన్న దాసి: చూ, పరిచారిక.

ఇంటిపెంట. ద్వ వి. పోరకతోఁ జిమ్మిచేర్చిన కసవుకుప్ప: చూ, పెంట. 1.

ఇంటిపెత్తనకత్తె. ఆం. దూతీచతుష్టయములో నొకటి: చూ, దూతీచతుష్టయము.

ఇంటిపేరు. ద్వ వి. 1. గృహనామము; 2 మనిషి యొక్క ఇంటిపేరు; 3. వంశానుక్రమణికగ వచ్చు కుటుంబముయొక్క పేరు.

ఇంటిగూత్తఁడు. ద్వ. వి. మగఁడు: చూ, భర్త. 1.

ఇంటిల్లిపాది. పా. (ఇల్లు + ఇల్లు + పాది.) కుటుంబము వారందఱు.

ఇంటివాఁడు. ద్వ. వి. చూ, ఇంటికాఁపు

ఇంట్రిపడు. ద్వ. అ క్రి. (ఇంట్రిము + పడు.) తపించు. "గీ. కడఁగి కల్పాదిఁ గ్రమ్మఱఁ గలుగఁజేయఁ దనకపని గావున్నట్లు వొచ్చినజగముల, నొలిఁగంజోదరుండు నిజోదరమున, నింట్రిపడకుండఁగానిల్పె నెడములిచ్చి." హరి ఉ. 9, ఆ. 159: చూ, సంతాపించు.

ఇంట్రిము. దే. వి. రూ-ఇంటరము. సంకటము. "గీ. ఎదురుగా నేగుదెంచుచో నింట్రియయ్యెఁ, బెండ్లి యిరువంకచుట్టంపుఁ బెద్దలకును" సై. 6, ఆ. 84: చూ, దుఃఖము.

ఇండాక్సీ. ఆం. పత్రిముయొక్క సంఖ్య పొందిన వాఁడు.

ఇండియా. ఆం. హిందూదేశము. (ఆసేతు హిమాచల పర్యంతము.)

ఇండు. దే. వి. ఈత *: చూ, మధుఖర్జూరిక.

ఇండుగు. దే. వి. 1. కతకము *. "ఉ. ఇండుగు గింజచే నుదక మెంతయు శీఘ్రముగఁ బ్రసన్నతన్, జెందు విధంబునన్." శివ. ఉ. 2, ఆ: రూ-ఇండువు: చూ, చిల్ల; 2. కతకబీజము. "సీ. రాగహీనతి మనోగ్రంథిఁ ద్రెంపఁగ నీళ్ళ కలఁక నిండుగుఁడాచి తెలుచుభంగి." వాసి. 3, ఆ: చూ, చిల్లగింజ. (రూ- ఇండువు.) (నేత్రిరోగములకు వీర్యస్తంభనకుప్రశస్తము.)

ఇండె. దే. వి. 1. చీలిక: చూ, శకలము. 4; 2. ఎముకకీలు. (బాయంటు.): చూ, మాటు.

ఇండెంటు. ఆం. కావలసిన సరకులపట్టీ.

ఇండెక్సు ఆం. అనుక్రమణిక; (విషయసూచిక.)

ఇండెవాయు. దే. అ. క్రి. చీలు: చూ, ఛేదిల్లు.

ఇండైగట్టు. ఆం. పరోక్షము.

ఇండ్లవరుస. ద్వ. వి. గృహక్రమము: ఇలువరుస.

ఇంత. ద్వ. స. (ఈ + అంత.) 1. ఈకొలఁది; "ఎ, గీ. నీకొంగవిభవ, మింతయంతని పొగడనేనెంతదాన." కళా. 2, ఆ. 178: ఇంతవట్టు, ఇంతయు- రూ- ఇంతె - ఇంతే, 2. ఇదియంతయు, ఈసమస్తము "క. తోడె, వ్యాగిక్కిఁబోనింత నిక్కవఁ బెబ్బంగికన్." భార. ఉద్యో. 1, ఆ: ఇంతవట్టు, (శబ్దముకంటెఁ బరమైన ఆశబ్దముయొక్క ఆకారమునకువలె ఈ లోనగు శబ్దములకంటెఁ బరమైన అంతలోనగుశబ్దములయొక్క అకారమునకు లోపమునియెఱుంగునది. ఈకారము మొదలగువానిదీర్ఘమునకు హ్రస్వమగును. "వ. సర్వలోకాభిగమ్యుండగు నమ్మహానుభావునకు మన మభిగమ్యులమైతిమి. మనకింతకంటెను బెంపెయ్యది, ఇత్యాదిస్థలములయందు ఇంతశబ్దము ఈయను శబ్దముయొక్క అర్థము నిచ్చుచున్నది.); 3. ఇంత కాలము. "చ. కుంతి యింతకున్, బడుగయి పాలలోఁబడిన బల్లివిధంబున నుండకుండునే." ఇక్కడ ఇంతకున్ అనఁగా ఇంతకాలమునకు అని అర్థము: చూ, అంత.

ఇంతకమున్ను. ద్వ. వి. ఇకాలముకంటెఁ బూర్వకాలము: ఇఁక. (వా.)

ఇంతటనుండి. ద్వ. వి. ఇప్పటినుండి. (రూ-ఇంతటినుండి. వా.)

ఇంతంత. ద్వ స: చూ, ఇంత అంత.

ఇంతంతనరానిది. ద్వ. వి. పరిమితిచేయుట శక్యముకానిది; (రూ-ఇంతంతయనరానిది.)

ఇంతఅంత. ద్వ. స: చూ, ఇంతింత.

ఇంతలు ద్వ. అవ్య. ఇంతపరిమాణము కలగనుట (వా): ఇంతలేసి

ఇంతలేసి. ద్వ. అవ్య.—పై.—

ఇంతలో. ద్వ. వి: చూ, అలోన.

ఇంతివట్టు ద్వ. స. (ఇంత + పట్టు.) 1. ఇదియంతయు. "మ. సంధాన మిట్లొనరం జేయక యున్నఁ గృష్ణునకునిన్నొప్పించు వారింత వట్టునిజంబు." భార. ఉద్యో. 3, ఆ: చూ, ఇంత. 2; 2. ఇంతమాత్రము. "ఉ. అతులిత విష్ణుశక్తి సము సాహితమూర్తివి కమ్మకెమ్మ సంతతభుజ శక్తినిట్టి యవధానమొనర్పఁగ నీవకాని యీ క్షితినొకరుండు లేఁడధికకీర్తి గుణంబుణ్యముఁజేసునిన్ను మూర్తిగుణ యింతవట్టు తగఁజేయుము కావుము లోకమంతయున్." భాగ. అర 4, ఆ: చూ, ఇంట. 1; అవ్య. 3. ఇంతపర్యంతము: ఇంతవడి, ఇందనుక-రూ-ఇందాఁక.

ఇంతివడి. ద్వ. అవ్య చూ, ఇంతవట్టు. 3.

ఇంతివింతలు. ద్వ. వి. బ. మిగులగొప్పవి.

ఇంతి. వై. వి.= స్త్రీ. ఆఁడుది: చూ, స్త్రీ.

ఇంతికాపుంజు. ద్వ. వి. ఇంద్రుఁడు చూ, వేలుపు ఱేఁడు.

ఇంతియు ద్వ. స. (ఈ + అంతియు.): చూ, రూ-ఇంత. 1. "మ. వెక్కొండ్రిక్రింతియ కాలంబు యియుండ నీవనము కాంచింబొంచఁగా నేర్పునే." భార. ఉద్యో. 4, ఆ: (రూ-ఇంతే-ఇంతే.)

ఇంతేకాకుండ. దే. అవ్య. క్రి. విణ: చూ, అది గాక. (వా.)

ఇంద. దే. అవ్య. 1. ఇచ్చేటనే: చూ, ఇచ్చేట. 2; 2. ఇదిగో తీసికొనుము: ఇందండి, ఇందము; ద్రి. 3. ఈస్థానము: చూ, ఇందు. 3.

ఇందండి. దే స. క్రి. నిత్య. బ: చూ, ఇంద. 2. (ఏ. ఇందము)

ఇందనుక. ద్వ. అవ్య (ఇంత + దనుక.): చూ, ఇంతవట్టు. 3. (రూ-ఇందాఁక.)

ఇందము దే. స. క్రి. ని. ఇదిగో తీసికొనుము. "నీడలో గత్నమిందమనుచు నిచ్చి." రామా. 6, ఆ. 198; (బ. ఇందండి.): చూ, ఇంద.2.

ఇందఱు. ద్వ స. (ఇంత + వారు) 1. ఇంతశబ్దమునకు మహన్మహత్యార్థక బహువచన రూపము వీరందఱు.(ఈపురుషులందఱు,ఈస్త్రీలందఱు, ఈస్త్రీ పురుషులందఱు.); 2. ఇంత సంఖ్యగలవారు; అవ్య 3. ఇయదర్థకము.(రూ-ఇందొఱు.)

ఇందలి. ద్వ. అవ్య. ఇచ్చట నున్నట్టి.

ఇందాఁక. ద్వ. ద్రి. (ఇంత + దనుక.): చూ, రూ-ఇందనుక.

ఇంది. సం. వి. ఈ. స్త్రీ లచ్చి:చూ, లక్ష్మి 1.

ఇందిందిరము. సం. వి. అ. పుం. తుమ్మెద: చూ. భ్రమరము.

ఇందిర. సం. వి. ఆ. స్త్రీ లచ్చి: చూ,లక్ష్మి.1,

ఇందిర. శా. తెలుఁగుదేశమును పరిపాలించిన వెనుకటి చోడగంగుని భార్యలలో నొకతె యగు యీ యిందిరవలన కలిగిన రాఘవుఁడు రాజ్యమును పరిపాలించెను. ఈ ని ప్రతాపము నరసింహదేవుని కెందుపట్న తామ్రశాసనములో వర్ణింపఁబడినది. 19. నరసింహదేవుని కెందుపట్న తామ్రశాసనము. కళింగదేశ చరిత్ర. 96. పుట.

ఇందివరము. సం. వి. అ. న. 1 నల్లగలువ(కన్న-కర్ణికైనదరి.) *: చూ, పద్మము. 1; 2. తామర *: చూ, పద్మము. 1; 3. జుట్టుపు*: చూ, దుట్టుపు.

ఇందివరి. సం. వి. ఈ. స్త్రీ. పిల్లపీచర.(కన్న-చిక్కఆపాది.) *: చూ, శతమూలి.

ఇందీవరివరి. సం. వి. ఈ. స్త్రీ. పెద్దపిల్లచర. (కన్న-దొడ్డుబసాది.) *: చూ, శతమూలి.

ఇందీవరుఁడు. సం. వి. అ. పుం. లచ్చిమగఁడు: చూ, విష్ణువు. 1

ఇందు. దే. అ. క్రి. 1. అడఁగు "ఇందరి యాముచేఁ బొదలు నేనుఁగులు" య. 4, ఆ: చూ, సుర్రుక్కు. 4; 2. అనుకూలపడు: చూ, పొంగుపడు; ద్రి.వి. ఈస్థానము: ఇంద, ఇక్కడ, ఇచట- రూ-ఇచటు- ఇచోట- ఇచ్చట-ఇచ్చటు- ఇచ్చోటు- ఇచ్చో- ఇచ్చోటు, ఇట, ఇయ్యెడ, ఈచోటు, ఈడ, ఈయెడ; (సం. ప.):—ఇహ.

ఇందుఁడు. సం. వి. ఉ. పుం. చందురుఁడు: చూ, చంద్రుఁడు.

ఇందుకమథ. సం. వి. ఆ. స్త్రీ. ఏరుమద్ది *: చూ, మద్ది.

ఇందుకాంతము. సం. వి. అ. పుం. వెండి: చూ, లోహము. 1.

ఇందుక్షయము సం. వి. అ. పుం. అమవస: చూ, మార్త్యేందుసంగమము.

ఇందుగు. దే. వి: చూ, రూ-ఇండుగు*. "ఎ, గీ. అందుగులు గేదఁగులుమత్తు లిందుగులును." అప్పా. సుం. కాం: చూ, సల్లకి.

ఇందుజనకుఁడు. సం. వి. అ. పుం. కడలి: చూ, సముద్రము.

ఇందునామము. సం. వి. న్ న. 1. కప్పురము: చూ, సితము; 2. కంపిల్లము *: చూ, రోచని.

ఇందుప్పు. ద్వ. వి. (ఇందు + ఉప్పు.) సైంధవలవణము, చెందుప్పు: చూ, లవణము. 1.

ఇందుభము. సం. వి. అ. న. మృగశిర, జింకతలరిక్క: చూ, నక్షత్రము. 1.

ఇందుముఖాంశము. పా. షష్ట్యంశము లఱువదింటిలో నొకటి: చూ, షష్ట్యంశములు

ఇందురేఖాంశము. పా.—పై.—

ఇందులకు. దే. ద్రి. 1 ఇచ్చోటికి. "ఉ. ఇందులకేమ్మెయిన్ మనుజులెన్నఁడు వత్తురు." భార. ఆది. 6, ఆ: ఇచ్చోటికి; 2. దీనికి "ప ఇంగులకుఁ బొందునదు ప్రత్యుత్తరంబుల." ఆము. 6, ఆ: దీనికి.

ఇందులగ్నము. పా. జాతకునియొక్క జన్మలగ్నమునకు నవమాధిపతియొక్క కళలను, చంద్రలగ్నమునకు నవమాధిపతియొక్క కళలును కలుపవలెను. కలుపగావచ్చిన మొత్తమును 12 చేతను భాగింపవలెను. భాగింపఁగావచ్చిన శేషమును చంద్రస్థితిగాఁ జేసి మొదలు లెక్కింపఁగా నెన్నవరాశియగునో యారాశి యిందులగ్నమగును ఒకప్పుడు శేషము రానియెడల 12 వ దే చూచుకొనవలెను. కళలు,— రవి=30; చం=16; కు=12; గు=10; బు=8, శు=6; శని=1

ఇందులూరి అన్నయ దేవు. శా. "ఈతఁడును కొలని రుద్రదేవుఁడును ఓరుగల్లు మొదలు సింహాద్రి వఱకుఁగల భూమిని కాకతీయ రుద్రమదేవి యాజ్ఞచే పాలించిరి. శివయోగసారమున వీరి ప్రశంస నిట్లు వర్ణింపఁబడియున్నారు..."సీ. మొగినోరుగంటి తూర్పుగవని మొదలుగా సింహాద్రి సీమగా క్షితిభరించె, వారలు పశ్చిండు వేలంతియరాతులు పంచలక్షల కాల్బలంబు నేలె............గీ. నేర్పుమై పంచపాండ్యుల రూపుమాపె, యోలచెర్లాదిగాభూమి లీలఁగొనియె, కొలనిరుద్రుఁడుదాను నిర్మలతగాను, నిందులూరి యన్నయదేవహీనబలుఁడు."

ఇందురేఖ. సం. వి. ఆ. స్త్రీ. 1. తిప్పతీఁగె *: చూ, సోమవల్లి; 2. అస్పృశ *: చూ, సోమలత; 3. చంద్రరేఖ: చూ, శశికళ.

ఇందువారము. సం. వి. అ. పుం. సోమవారము: చూ, వారము. 2.

ఇందువు. సం. వి. ఉ. పుం. 1. తింగళము *: చూ, తుమికి; 2. ముక్కు ఎడమరంధ్రము; 3. పలమెత్తువెండి (పావుశేరువెండిఅని సర్వశబ్ద సంబోధిని; 4. చెందురుఁడు : చూ, చంద్రుఁడు; 5. కర్పూరము చూ, సితము; 6. మృగశిర: చూ, నక్షత్రము. 1; 7 ఒకటి అను సంఖ్యకు సంకేతపదము; దే. వి. (1) చిల్ల *: చూ, సల్లకి; 2. కతకబీజము: చూ, చిల్లగింజ. (రూ- ఇందుగు-ఇందుగు.)

ఇందువ్రతము. సం. వి. అ. న. చాంద్రాయణమను పేరుగల వ్రతము : చూ, చాంద్రాయణము.

ఇందోలు: చూ, ఇందలు. 1, 2, 3.

ఇంద్ర. సం. వి. ఆ స్త్రీ. వాసనగల ఒకానొక చెట్టు: చూ, మరువము.

ఇంద్రకరుప. సం. వి. ఆ. స్త్రీ. ఏపె *: చూ, మద్ది.

ఇంద్రకము. అం. ఉత్తానకరణబంధములు నలుబది యొకటింటిలో నొకటి: చూ, ఉత్తానకరణబంధములు.

ఇంద్రకీలము. సం. వి. అ పుం. మందర పర్వతము, కవ్వపుఁగొండ: చూ, పర్వతము.

ఇంద్రకోశము. సం వి అ. పుం. 1. అరప: చూ, మంచె; 2 తిట్టు: చూ, శాపము. 1.

ఇంద్రకోషము. సం. వి అ. పుం. అరప: చూ, మంచె. (రూ-ఇంద్రకోశము.)

ఇంద్రక్రియ. అం. క్రియాంగములు పండ్రెండింటిలో నొకటి: చూ, క్రియాంగములు. (చూ, అంగము. 9.)

ఇంద్రగణములు. పా. భ, ర, త, నగ, సల, నలములు. (6.)

ఇంద్రగోపకము. సం. వి. అ. పుం: చూ, పట్టుపురుగు.

ఇంద్రగోపము.—వై.—

ఇంద్రచాపము. సం. వి. అ. న. 1. ఇంద్రధనస్సు, కొఱడు: చూ, బాణము. 1; 2. సూర్యునకెదురుగానుండు మేఘము: చూ, మేఘము. 1.

ఇంద్రజాల. అం. కళలఱువదినాలుగింటిలో నొకటి: చూ, కళలు.

ఇంద్రజాలసాధనమునకు ప్రయోజనములు. పా. రక్షణ, శక్తి, కౌతుకము. (3.)

ఇంద్రజాలము. సం. వి అ. పుం 1. కనుకట్టు విద్య: చూ, మాయము. 1; 2. ఉపాయము లేడింటిలో నొకటి: చూ, ఉపాయములు.

ఇంద్రజాలికుఁడు. సం. వి. అ. పుం. కనికట్టు విద్య చేయువాఁడు: చూ, ప్రాతిహారకుఁడు.

ఇంద్రజిత్తు. సం. వి. త్. పుం 1. గరుత్మంతుఁడు: చూ, హరివాహనుఁడు; 2. రావణుని పెద్దకొడుకు: ఇంద్రారి.

ఇంద్రతూలము. సం. వి. అ. న గ్రీష్మహాసము: చూ, సూదిప్రోవు.

ఇంద్రద్యుమ్నుఁడు. శా. దంతిపురియను పేరుగల జగన్నాథక్షేత్రమును రాజధానిగాఁ జేసికొని ఏకచ్ఛత్రముగ పరిపాలించిన రాజచంద్రుఁడు. ఇతఁడే జగన్నాథదేవుని వెలయింపఁజేసెనని కొందఱందురు.

ఇంద్రద్రుమము. సం. వి. అ. పుం.ఏఱుమద్ది*: చూ, మద్ది.

ఇంద్రద్రువు. సం. వి. ఉ. పుం.—వై.—

ఇంద్రధనువు. సం. వి. ఉ. స్. పుం. న. కొఱడు: చూ, బాణము 1.(రూ-ఇంద్రధనస్సు.) వర్షాకాలములో ఆకాశమున ఏడురంగుల వలయములు గలిగియుండును. ఇవి సూర్యకిరణమును పృథక్కరించినపుడు కానవచ్చిన రంగులే. క్రమముగా ఎఱుపు, నారింజరంగు, పసుపురంగు, ఆకుపచ్చరంగు, నీలపురంగు, నీలిరంగు, ఊదారంగు గానవచ్చును.(రాయల్ బో.)

ఇంద్రధ్వజము. సం. వి. అ. పుం భాద్రపదశుద్ధ ద్వాదశినాఁడు వర్షవృద్ధికై ఇంద్రుని తృప్తికొఱకు ఎత్తు జెండా.

ఇంద్రనగరి. సం. వి. ఈ. స్త్రీ. ఇంద్రుని పట్టణము: చూ, దేశము

ఇంద్రనామము. సం. వి న్. పుం. 1. గుగ్గిలము *: చూ, గుగ్గులువు; 2 గుడ్లగూబ: చూ, సకినంపుఁబులుఁగు; 3. మజ్జివాలు: చూ, కోడి.

ఇంద్రనీలము. సం. వి. అ. పుం. కానాలి మెడ ఛాయవంటి ఛాయగల నీలమణి: చూ, రత్నము. 1.

ఇంద్రపుత్రుఁడు. సం. వి. అ. పుం. కుబేరునికి వాహనమైన మనుజుఁడు, ఇంద్రుని కొడుకు: చూ, జయంతుఁడు.

ఇంద్రపుష్పి సం వి. ఈ. స్త్రీ. కలికాలియను తలిగొట్టి *: చూ, హాలిని.

ఇంద్రప్రియము. సం. వి. అ. న. మలయపర్వతమునందుఁ బుట్టిన పచ్చగంధపు చెట్టు.

ఇంద్రభట్టారకుఁడు. శా. క్రీ శ. 500 లగాయతు 525 వఱకు రాజ్యము చేసిన రాజోత్తముఁడు. ఈతఁడు ఉత్తరకులాభరణుఁడని బిరుదునొందె. విక్రమేంద్రవర్మ కుమారుఁడు. ఈతని తామ్రశాసనములు రెండు విశాఖపట్టణము జిల్లాలోని రామతీర్థమునందు దొరికినవి. ఈతని 37 వ రాజ్యకాలమున దానశాసన మీయఁబడెను. దీనిని బట్టి యీతఁడు చాలకాలము రాజ్యమేలెనని తెలియుచున్నది. కళింగ దేశ చరిత్ర 467. పుట.

ఇంద్రభోగము. జా. ఎక్కు-భోగము. "పరిభవ మింద్రభోగమె దొరకెఁ." విజయ విలాసము

ఇంద్రమహాకాముకము. సం. వి అ. న. కుక్క: చూ, కుక్కకము (వర్షాకాలాగంధమున కామవికారముగలది, చిత్తకార్తె కుక్కలలక్షణము.)

ఇంద్రమార్గము. సం. వి. అ. పుం. 1. ఇంద్రలోకమునకు పోవుమార్గము; 2. బదరీపాచనమను తీర్థమునకు దగ్గఱనున్న తీర్థము.

ఇంద్రము. సం వి. అ. పుం. 1. కాకిచెఱకు *: చూ, శరము; 2. చతుర్దశసంఖ్య: చూ, పదునాలుగు; 3: చూ, ఇంద్రనీలము; అం. 4. విష్కంభాదియోగము లిరువదేడింటిలోనొకటి: చూ, రూ-ఐంద్రము; 5 ఖండములు తొమ్మిదింటిలోనొకటి: చూ, ఖండములు.

ఇంద్రమూర్ధము సం. వి. న్. పుం. పుట్ట: చూ, వల్మీకము.

ఇంద్రయవము. సం. వి. అ. న. కొడిసె *: చూ, వత్సకము. (కొడిసెకాయ.)

ఇంద్రలుప్తకము. సం. వి. అ. న. పేను కొఱుకుట: చూ, బట్టతల

ఇంద్రలుప్తకుఁడు. సం. విశే. (అ. ఆ. అ) ఖల్వాటుఁడు: చూ, బట్టతలవాఁడు.

ఇంద్రలుప్తము. సం. వి అ. పుం. 1.—పై.—; 2. పేను: చూ, యూకము.

ఇంద్రలోకము. సం. వి అ పుం. 1. దేవేంద్రుని పట్టణము: చూ, దేశము; 2. జేజేపట్టు: చూ, స్వర్గము.

ఇంద్రవంశము. సా. ఒకానొకవృత్తము. ఈవృత్తమునందొక్కొక్క పాదమునందు త, త, జ, రలు గలదై ఎనిమిదవయింట యతిగల ద్వాదశఛందస్సునందుఁ బుట్టిన వృత్తము. ఉదా "ఇందీవరాక్షుల్ తగ । నింద్రవంశమా, నందంమునం బాడిరి । నందసూతిపై, డెందంబులన్ మోహము । రేనమీఱఁగాఁ, బొందైగ జక్రింతులు । పూనఁ దాజ్రిలన్."

ఇంద్రవజ్ర. సా. ఒకానొకవృత్తము, ఇందు ఒక్కొక్క పాదమున త, త, జ, గ, గములతోఁగూడి ఎనిమిదవయింట యతిగలిగి ఏకాదశ ఛందస్సు

సంగుఁబుట్టిన వృత్తము ఉదా.—"ఇంచుల్స గాపాతుదు । రింద్రివజ్రిల్, స్వాయింబుఁజ మోహము । సంధిలంగ్, వంతావళి శ్రాంతిని । తాజకారు, పాంతంబుసంధ్యయ । మంద మందన్."

**ఇంద్రవర్మ** శా. కళింగరాజ్యాధిపుఁడగు నీరాసింగుడు గాంగశకవర్షములు 87 లో వసించు వర్తనియందు సిద్ధార్థకగ్రామమున గౌతమస గోత్రుఁడగు దుర్గశర్మకొసంగినట్లు యీతని అచ్యుతాపుర తామ్రశాసనములో కనఁబడుచున్నది. ఇంద్రవర్మ అచ్యుతాపురము శాసనము; కళింగ దేశచరిత్ర. 35. పుట.

**ఇంద్రవర్మఅచ్యుతాపురశాసనము.** 4.(Ep. Ind Vol. III. No. 20) ఈయనకు రాజసింహయని బిరుదుకూడనుండెను. ఈశాసనము తారీఖు. (పంక్తి 22):— ఉదగయనే (పంక్తి 22) ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరాః సప్తాశీతిః 87 చైత్రఅమావాస్యాంఅపగా గాం. శ. 86. సం॥ మకరసంక్రాంతినాడు= క్రీ. శ 435 డిశంబరు ది 15 స 10 గం. 48 వి.ఘ.లకు మకరసంక్రమణప్రవేశము; కళింగ దేశచరిత్ర. 312. పుట.

**ఇంద్రవర్మకళింగశాసనము.** శా. ఇంద్రవర్మరాజు కళింగనగర వాసకమునుండియు,దంతపురవాసకమునుండియుఁగూడ శాసనములనిచ్చెను. ఈ శాసనలిపినిబట్టి అందువాడఁబడినకొన్ని తెలుఁగు పదములనుబట్టియుఅకాలమున ప్రజలు (కాళింగులు,ఆంధ్రులు తెలుఁగుభాష నే వాడుచుండిరనినమ్మవలెను); కళింగ దేశచరిత్ర. 507. పుట.

**ఇంద్రవర్మజిర్జింగిశాసనము** శా ఇది గంజాం జిల్లాలోని టెక్కలిగ్రామ సమీపమునున్న జిర్జింగి గ్రామములో పొలముత్రవ్వుచుండగా దొరికినది. శాసనమునచెప్పఁబడిన్న జిజ్జికగ్రామము ఇప్పటి జిర్జింగిన్ని ఒక్కటేయని తెలియుచున్నది. శాసనపులిపి ప్రాచీన తెలుఁగు కన్నడలిపి. భాష సంస్కృతము. త్రికళింగాధిపతియు మాతాపితృపాదానుధ్యాతయు నగు శ్రీమన్మహారాజ ఇంద్రవర్మ వోంఖారభోగములోని జిజ్జికగ్రామమును, సర్వవిధములైన పన్నులనుండి తప్పించి రుద్రస్వామి కొడుకగు అగ్నిస్వామికిని అతని కొడుకగు రుద్రస్వామికిని రెండు సమభాగములుగా విభజించియిచ్చెను, కళింగదేశచరిత్ర. 499-పుట

**ఇంద్రవర్మతెక్కలిశాసనము.** శా. 5 (Ep. Rep. 1926. App A. No. 2) విజయరాజ్యసంవత్సర 87 జ్యేష్ఠ 10= క్రీ శ. 436 మేయి ది 11 సోమవారము ఈరాజునకు రాజసింహ బిరుదుండెను; కళింగదేశ చరిత్ర-312.

**ఇంద్రవర్మదేవుఁడు.** శా. శ్వేతకాధిష్ఠాన వాసియు, మహేంద్రాచల గోకర్ణేశ్వర పాదభక్తుఁడును, సకల కళింగాధిరాజున్ను, పరమమాహేశ్వరుఁడున్ను, మాతాపితృపాదానుధ్యాతయు, అగుభట్టి మహారాజశ్రీ ఇంద్రవర్మదేవుఁడు జలమ్బూర విషయములోని ఉద్యోగస్థుల పిలిపించి వారియెదుట అవిషయమందలి అమేరసింగ గ్రామమును కాశ్యపగోత్రికుండగు చండస్వామియను బ్రాహ్మణునకు పుణ్యాభివృద్ధికై దానముచేసెను. 18. ఇంద్రవర్మదేవుని తామ్రశాసనము; కళింగదేశచరిత్ర. 85. పుట.

**ఇంద్రవర్మపర్లాకిమిడి శాసనము.** శా. 6 (Ind. Ant. Vol. xvi. No. 169)ఈయనకూడ రాజసింహ బిరుదుగలవాఁడే. (పంక్తి 18) ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరాః. ఏకనవతి 90 + 1మాఘుది సేత్రింశతి తమ 30. ఇది సూర్యమాన దినములని ప్లీటుదొరగారభిప్రాయ

పడిరి; గాని అమావాస్యయని యేసూచించు నని నాయభిప్రాయము.= క్రీ. శె. 441 జనవరు ది 28 లక్ష్మివారం 11 ఘ. 24 విఘ. వరకు అమావాస్య యుండెను; కళింగదేశ చరిత్ర. 313. పుట.

ఇంద్రవర్మపుర్లిశాసనము, శా 8. (Ep Ind Vol xiv No. 27.) (పంక్తి 11) కార్తిక పౌర్ణమాస్యాం (పంక్తి 29) విజయరాజ్య సంవత్సరాః. 100 + 30 + 7 పుష్య ది 20 (Ep. Ind. Vol. xviii P. 308) లో డాక్టరు హుల్ టుజ్ గారు మొదట చేదివిన తారీఖును సవరణచేసినారు. దానదినం :— గంగశక 136 సం॥ కార్తిక పౌర్ణమి=క్రీ. శె. 486 అక్టోబరు ది 29 బుధవారము శాసన తేదీ =క్రీ. శె. 487 జనవరు ది 1. గురువారము.

ఇంద్రవర్మమద్రిసుమ్యూజియమ్ శాసనము. శా. ఈశాసనమును బట్టి, యథాకాలాధ్యాసి మహాసామంత, శ్రీసామంత, రాజానక, రాజపుత్ర, కుమార, అమాత్య, ఉపరిక, దండనాయక, విషయపతి, గ్రామపతి, బ్రహ్మ, పుగో, గ్రామణి, అక్షశాలి, భట, దండపాశిక, ఇత్యాది రాజకీయ ఉద్యోగీయులుండి యున్నట్లు తెలియుచున్నది; కళింగదేశచరిత్ర 535. పుట.

ఇంద్రవర్మ శ్రీకాకుళశాసనము. శా. 7. (Ind. Ant Vol. xiii P. 121.) (పంక్తి 10.) మార్గశిర పౌర్ణమాస్యాం సోమోపరాగే. (పంక్తి 20.) ప్రవర్ధమానవిజయ రాజ్య సంవత్సరాః 100 + 20 + 8 చైత్ర ది 10 + 5. గంగశక 127 మార్గశిర పౌర్ణమిని సోమోపరాగము.=క్రీ. శె. 476. నవంబరు ది. 17 సోమవారము. శాసన తేదీ= క్రీ. శె. 477. మార్చి ది 15 మంగళవారము; కళింగదేశ చరిత్ర 313. పుట.

ఇంద్రవల్లి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఇల్లింద *: చూ, మాతులుంగము; 2: చూ, సవిరేల *, 3. పారిజాతలత *; 4. గవాదని *: చూ, పెద్ద పాంపర.

ఇంద్రవారుణి. సం. వి. ఈ. స్త్రీ: చూ, పెద్ద పాంపర *.

ఇంద్రవారుణిక. సం. వి ఆ. స్త్రీ.—పై—

ఇంద్రవ్యాకరణము. అం. వ్యాకరణములు తొమ్మిదింటిలో నొకటి: చూ, వ్యాకరణములు.

ఇంద్రశిఖ. అం. శిఖలయిదింటిలో నొకటి: చూ, శిఖలు.

ఇంద్రసాహ్వ సం వి ఆ. స్త్రీ· చూ, ఇంద్రవారుణి.

ఇంద్రసురసము. సం వి. అ. పుం. నిర్గుండి *. చూ, వావిలి.

ఇంద్రాంశము. పా. షష్ట్యంశము లఱువదింటిలో నొకటి: చూ, షష్ట్యంశములు.

ఇంద్రాక్షము. సం వి. అ. న. 1. ఇంద్రాక్షపూస: అక్షము; 2. శృంగి *· చూ, వృషభ.

ఇంద్రాక్షి. సం. వి. ఈ. స్త్రీ. గౌరి: చూ, పార్వతి. 1. (చంటి బిడ్డల యాయురారోగ్యాభి వృద్ధికిని, పీడాపరిహారమునకును విభూతితో ఇంద్రాక్షిని మంత్రించి యిచ్చెదరు.)

ఇంద్రాగ్నిధూమము. సం. వి అ పుం. మంచు. "హిమమింద్రాగ్ని ధూమశ్చ -ఖబాష్పరజనీజలం" హారావళి: చూ, హిమము 1.

ఇంద్రాణి; సం. వి. ఈ. స్త్రీ. 1. ఇంద్రుని భార్య: చూ. శచి; 2. సప్తమాతృకలలో నొకటి: చూ, మాతృకలు; 3. నిర్గుండి (కన్నె-బీలికి[—] *: చూ, వావిలి; 4 ఎఱ్ఱవస *: చూ, రక్తవస; 5. స్త్రీలవిలాస చేష్ట,

సంభోగ క్రియాభేదము: చూ, రతిబంధము; 6. యజమానురాలు: చూ, స్వామిని; అం. 7. శివప్రోక్తములగు చతుష్షష్టి తంత్రములలోపది నాలుగింటిలో నొకటి: చూ, తంత్రములు; అం. 8. మాత లేడుగురిలో నొకతె: చూ, మాతలు.

ఇంద్రాణిక. సం. వి. అ స్త్రీ. నిర్గుండి *: చూ, వావిలి.

ఇంద్రాణికము. అం ఉత్తానకరణ బంధములు నలుబది యొకటింటిలో నొకటి: చూ, ఉత్తానకరణ బంధములు (చూ, బంధములు.)

ఇంద్రాయుధము. సం. వి. అ. న 1. దేవేంద్రుని విల్లు: చూ, ఇంద్రధనువు; 2. మేఘములందు నానావర్ణమై ప్రతిఫలించుచు ధనురాకారముగా గానబడియెడి సూర్యకిరణము: చూ, మయూఖము 1; పుం. 3. [illegible] గుఱ్ఱము: చూ, హయము.

ఇంద్రారి. సం. వి. ఇ. పుం: చూ, ఇంద్రశత్రు. 1. 2; 3. రక్కసుడు: చూ, రాక్షసుడు.1.

ఇంద్రావరజుఁడు సం. వి. అ పుం. లచ్చిమగఁడు: చూ, విష్ణువు. 1.

ఇంద్రావరుఁడు. సం. వి. అ పుం.—పై.—

ఇంద్రాసనము. సం. వి. అ. న. నెఱ్ఱిపజ్జ: చూ, భూమి. 1.

ఇంద్రియజయాధ్యాయము. పా. కామందక ప్రకరణము లిరువదింటిలో నొకటి: చూ, కామందకము.

ఇంద్రియనిగ్రహము. అం. సాత్త్వికగుణములు యొనిమిదింటిలో నొకటి: చూ, సాత్త్వికగుణములు.

ఇంద్రియపుష్టి. పా. మంచు జాజికాయ తొలిచి అందు సెనగ గింజంతనల్లమందు పెట్టి మునగచెట్టు తొలిచి అందులో యీజాజికాయ పెట్టి ఆ పయిన మునగచెక్క మూఁతవేసి 40 రోజులు వుంచి పిదప తీసి పెసరగింజంతమాత్ర ప్రొద్దున నే వేసికొని ఆరాత్రి స్త్రీని గూడవలెను. దీని విరుగుడు చిమ్మకాయ పిండుకొని తినవలెను. (ఇదియొకవిధము.)

ఇంద్రియము సం. వి. అ. న. 1. వీర్యము: చూ, రేతస్సు. 1; 2. అయిదను లెక్క: చూ, పంచకము.

ఇంద్రియములు. అం. జ్ఞానద్వారములు, జ్ఞానేంద్రియములు.—త్వక్కు, చక్షువు, శ్రోత్రము, జిహ్వ, ఘ్రాణము. (5); కర్మేంద్రియములు.— వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థ (5); మనస్సుతోఁ గూడ ఏకాదశేంద్రియములగును. (1)= (11)

ఇంద్రియార్థము. సం. వి. అ పుం. ఇంద్రియవిషయములగు శబ్దము మొదలైన పంచభూతముల గుణములు.—శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము. (5); (చూ, విషయములు. 3.): చూ, హృషీకము.

ఇంద్రియవిషయములు. అం. గంధము, రూపము, రసము, స్పర్శము, శబ్దము. (5)

ఇంద్రియసర్గము. అం. సృష్టిసర్గములు తొమ్మిదింటిలో నొకటి: చూ, సృష్టిసర్గములు.

ఇంద్రుఁడు. సం. వి. అ పుం. 1. దేవేంద్రుఁడు: చూ, వేలుపుఱేఁడు; 2. ద్వాదశాదిత్యులలో నొకఁడు: చూ, ఆదిత్యులు; 3. జీవుఁడు: చూ, హంసుఁడు; 4 చాయమగఁడు: చూ, సూర్యుఁడు; 5. స్వజాతి సమూహములో ముఖ్యుఁడు. (ఈయర్థము యీశబ్దముత్తర పదముగా నుండునప్పుడగును.); 6. నాగుఁబాము: చూ, సర్పము; 7. ఆఁబోతు: చూ, వృషభము. 1; విణ. 8. అధిపతి: చూ, ప్రభువు. 1; అం. 9. దిగధిపతులు యెనమండ్రలో నొకఁడు: చూ, దిగధిపతులు.

ఇంద్రోత్సవఫలము. పా. "సీ. దేవతాధీశ పోదిత ములై మేఘముల్ వసుమతీతలమున వాన గురియు, వానగల్గిన మహీవలయంబు సస్యసమృద్ధమై ధాన్యంబు మిగులగల్గు, ధాన్యంబుగలిగిన ధరణీప్రజలకెల్ల సంతతానందంబు నలుపుచుండు.........ఎల్లప్రజలకు మనకు నష్టైకము లేక, యుండఁ, లుగును మహిమంబులుల్లసిల్ల." వి, పు, 7, ఆ. 228.

ఇంధనము. సం. వి. అ న. 1. చిదుగు : చూ, సమిధ; 2. వంటకట్టియ: చూ, వంటచెఱకు.

ఇంపారు. దే. అ. క్రి. ఆనందించు : చూ, సంతోషించు.

ఇంపితము. దే. విణ. (ఇంపు + ఇతము.) ఇంపైనది. (ఇది పోరితమువంటిది.): చూ, రమ్యము.

ఇంపు. దే. వి. 1. ఆనందము. "ఆయింపే పరబ్రహ్మము." స్వా. 2, ఆ. 62: చూ, సంతోషము; 2. ఇచ్ఛ. "ఉ. నా, నెమ్మదియింపు గింపుసని నీరజలోచనపల్కె వెండియున్." పర. 3, ఆ చూ, వాంఛ; విణ. 3 ఇచ్చె వచ్చినట్లు "క. అనిందితచరితములై సుమ్మనీ మదికింపుల్." శకా. 7, ఆ. 92: చూ, యథేచ్ఛము; 4. వస్త్రభూషణాదులవలన శోభ: చూ, సౌందర్యము. (రూ-ఇంబు)

ఇంపైనవాఁడు. దే. విణ. అందగాఁడు: చూ, సౌందర్యవంతుఁడు.

ఇంపొలయు. దే. అ. క్రి:చూ, సొగసుఁగాంచు.

ఇంబు. దే. వి 1: చూ, రూ-ఇంపు. (ఆనందమనకు—"ఉ. ఇంబడరంగ నియ్యకొనియెన్." ప్రభా. 1, ఆ.)

ఇఁక. దే. ద్రి. 1. ఇతఃపరము : చూ, ఇంతకమున్న; 2. పునరర్థకము, మరల. "ఇమ్మనీశ్వరు సామర్థ్యము నింకఁజెప్పెద." రా. అర. 1, ఆ: చూ, వెండియు. (రూ-ఇఁగ.)

ఇఁకమీఁద. దే. అవ్య. పురోర్థ పురోర్థము:: ముందట. 1.

ఇఁకమీఁదట. దే. అవ్య.—పై.—

ఇఁడి. దే. అప అభావార్థమునందు వచ్చు ప్రత్యయము. "ముక్కిఁడి, సిగ్గిఁడి" మొ.

ఇకారము. (1) మధ్యమపురుషక్రియల యికారమునకు సంధి నిత్యము. ఉదా.—వాసితివి + అది=వాసితివది; వచ్చితిం + ఇంటికి=వచ్చితింటికి; (2) ప్రథమోత్తమపురుషంబుల యికారమునకు సంధి వికల్పము. ఉదా.—చూచిరి + ఆర్యులు=చూచిరార్యులు, చూచిరియార్యులు, తింటిమి + అన్నము=తింటిమన్నము, తింటిమియన్నము; (3) ఏమి, మఱి, కి (షష్ఠి) అది, అవి, ఇది, ఇవి, ఏది, ఏవి, వీని యికారమునకు సంధి వైకల్పికము. ఉదా.—ఏమి + ఉన్నది=ఏమున్నది, ఏమియున్నది; మఱి + ఒకటి=మఱొకటి, మఱియొకటి; వానికిన్ + ఇచ్చెను=వానికిచ్చెను, వానికినిచ్చెను. N.B ఇచట (కి) అనుదానికిని పైఅచ్చునకును ద్రుతమడ్డున్నను సంధిని సాధించుటచే నకారము లోపించుఁగాని యాసంధి విధియే లోపించుచున్నది అది + ఇమ్మ=అదిమ్మ, అదియిమ్మ; అవి + ఎక్కడ=అవెక్కడ,అవియెక్కడ;ఇది + ఎవ్వరిది=ఇదెవ్వరిదిఇదియెవ్వరిది;ఇవి + ఉన్నవి=ఇవున్నవి,ఇవియున్నవి; ఏది + అయ్యా=ఏదయ్యా, ఏదియయ్యా; ఏవి + అమ్మ=ఏవమ్మ, ఏవియమ్మ; (4) "అవ" పరమగునపుడు ఇకారమునకు సంధి వైకల్పికము. ఉదా. ఎనిమిది + అవ=ఎనిమిదవ, ఎనిమిదియవ; (5) క్త్వార్థక ఇకారమునకును, ప్రథమావిభక్తి ఇకారమునకును, ప్రథమాతుల్య ఇకారమునకును, షష్ఠీసమాస ఇకారమునకును సంధిలేదు. ఉదా.—వచ్చి + ఇచ్చెను=వచ్చియిచ్చెను.—క్త్వార్థకము; హరి + అతఁడు=హరియతఁడు—

పరిభవము; ఎత్తిలి + ఏనది = ఎత్తిలియైనది — పరిభవమాతుల్యము; నది + ఒడ్డు = నదియొడ్డు. — షష్ఠీసమాసము. (చూ, ఇ.)

**ఇకి.** ప్రా. వ్యా. — ఇకి కొన్ని ధాతువులకగు. కోరు + ఇకి = కోరికి; పూనికి, పోలికి, మనికి, వినికి — (చూచుటకు చోటు.) చూడికి, కోర్కి, కోరికె. అపభ్రంశములు.

**ఇక్క.** దే. వి. 1. తానము. "క. ఎయ్యది సుఖములకు నిక్క." భాగ. అర. 7, అ. చూ, స్థానము. 1; 2. ఇల్లు: చూ, గృహము. 1.

**ఇక్కట్టు.** దే. వి. (ఇక్క + కట్టు.) సంకటము, ఇక్కపాటు. (ఇక్క ఇఱుకు యొక్క మారూపమని తెలియవలెను.): చూ, దుఃఖము.

**ఇక్కడ.** దే. వి. ఏ. దర్శి. (ఈ + కడ) 1. ఈ చోటు: చూ, ఇందు. 3; దర్శి. 2. ఇచ్చటనే చూ, ఇచ్చట. 2.

**ఇక్కము.** దే. వి. ఇఱుకటము, సంకటము. "ఉ. ఎక్కడివాఁడవన్న కడునిక్కపుఁ గాఱడవిం జరించెదు." ఉ. హరి. 2, అ: చూ, దుఃఖము.

**ఇక్కపాటు.** దే. వి. (ఇఱుకు + పాటు.) — పై. — "ద్వి. అక్కటా పుణ్యాత్ముఁడైన నీకట్టి, యిక్కపాటును గల్గెనే లింగడియను చు." రా. సుం, కాం.

**ఇక్కలు.** ప్రా. ఇ-ఉ-ఋ-ౠ.

**ఇక్కవ.** దే. వి. 1. తానము. "క. నీనీ యిక్కవల కుఁజనుఁడు." రా. యు, కాం చూ, స్థానము. 1; 2. ఇల్లు, ఉనికి. "ఎచ్చటఁగంటి నో విజయునిక్క వనిక్కవమానె." విజ. 2, ఆ. 165; "క. అక్కడనె పాలియుఁబోలియక, యిక్కవనిట వచ్చెనేని యిక్కడఁ బోలియున్." (ఇక్కవన్ = జీవములో.) రామా. 6, ఆ: చూ, గృహము. 1; 3. జాడ, అందు బరహాప్యము, ఆచోకి. "ద్వి. ఇటు చెల్లుమాటల యిక్కవలెఱిఁగి." రా, యు, కాం:

చూ, సూచన. 1; 4. కర్మస్థానము. కళలుండు స్థలములు పండ్రెండింటిలో నుండియుగాక తద్విశేషములలో నొకటి. "ఇక్కవలంటి." నీలా. 3, ఆ. చూ, కళలుండు స్థలములు.

**ఇక్షు.** సం వి. ఆ. స్త్రీ. తిప్పతెల్లు. (కన్న-లాళ్.) *: చూ, బాణ.

**ఇక్షుకుట్టకుఁడు.** సం. వి. అ. పుం. 1. క్షత్రియ స్త్రీకి శూద్రునకుంబొడమి అయిదువిధముల సారాయిని అమ్మువాఁడు: చూ, సురాజీవి; 2. కల్లుదించువాఁడు, గవుండ్లవాఁడు: చూ, సురాజీవి.

**ఇక్షుకుసుమ** సం. వి. ఆ స్త్రీ. తిప్పతెల్లు. (కన్న-లాళ్.) *: చూ, బాణ.

**ఇక్షుగంధ.** సం. వి. ఆ. స్త్రీ. 1. గొలిమిడి *: చూ, మొగబీర; 2. తెల్లనేలగుమ్మడు * చూ, భూమి కర్కారువు; 3. అశ్వలాయన దర్భ, కాకిచెఱకు *: చూ, శరము; 4. ఏనుఁగు పల్లేరు *: చూ, పల్లేరు.

**ఇక్షుచ్ఛాయ.** సం. వి. ఆ. స్త్రీ. చెఱకు చెట్టు నీడ: చూ, మధుతృణచ్ఛాయ.

**ఇక్షుజము.** సం. వి. అ. పుం. పేంకణపు చెట్టు యొక్క నీడగల చెఱకునుండి పుట్టిన ముత్తియము: చూ, ముత్తెము.

**ఇక్షుధన్వుఁడు.** సం. వి. న్. పుం. ఇంచు విలుకాఁడు: చూ, మన్మథుఁడు.

**ఇక్షునాళిక.** సం. వి. ఆ. స్త్రీ. నల్లచెఱుకు *: చూ, రసాలము. 3.

**ఇక్షుపుంఖము.** సం. వి. అ. పుం. శరపుంఖము*: చూ, వెంపలి.

**ఇక్షుభక్షిక.** సం. వి. ఆ. స్త్రీ. చెఱకుతినుట.

**ఇక్షురంక.** సం. వి. ఆ. స్త్రీ. శణము, తెల్లు*: చూ, శరము.

**ఇక్షురము** సం. వి. అ. పుం. గొలిమిడి *: చూ, మొగబీర.

ఇక్షువణము. సం. వి. అ. న. చెఱకుతోఁట: చూ, మధుతృణవనము.

ఇక్షువనము. సం. వి. అ. న.—వై.—

ఇక్షువల్లి. సం. వి. ఈ. స్త్రీ. పాలనేల గుమ్మడి *: చూ, భూమికర్కారువు.

ఇక్షువు. సం. వి. ఉ. పుం.= ఇంచె. *(కన్న-కబ్బు.): చూ, రసాలము. 3.

ఇక్షుశరాసనుఁడు. సం. వి. న్. పుం : చూ, ఇక్షుధన్వుఁడు.

ఇక్షుశాకటము. సం. వి. అ. న. చెఱకు పండఁదగిన నేల: చూ, భూమి. 1.

ఇక్షుశాకినము. సం. వి. అ. న.—వై.—

ఇక్షుసముద్రము. సం. వి. అ. పుం: చూ, ఇంచె పాల కడలి. (చూ, సముద్రము.)

ఇక్షుసాయకుఁడు. సం. వి. అ. పుం: చూ, ఇక్షుశరాసనుఁడు.

ఇక్షూదము. సం. వి. అ. పుం: చూ, ఇక్షుసముద్రము.

ఇక్ష్వాకువంశము. శా. 1. రూ- ఇఖాకు, యువాన్ చ్వాంగ్. కృష్ణవేణీనది నానుకొనియున్న నీ చిన్నికొండపై రెండువందల యకరముల మేర విశాలమై చేదునైన బయలుకలదు. అంతే పురాతనమైన బౌద్ధసాంఘచైత్య, విహారముల చిహ్నములు గలవు. అచ్చట నిటీవల ప్రాకృతభాషా శాసనములు ఇక్ష్వాకువంశపురాజులవి ముప్పదిరెండు వఱకు లభించినవి. వాటిలో శ్రీపర్వతము, సిరిపర్వతము అని యుదాహరింపఁబడియున్నది. ప్రాచీనాంధ్రదేశము. 57. పారటు; 2. మార్కోపోలో. మోటుపల్లి ప్రసిద్ధనౌకాశ్రయమై విదేశవాణిజ్యమునకు అవిచ్ఛిన్నముగ వరుసగా శాతవాహనాంధ్ర సామ్రాజ్యకాలము నందును తరువాత ఇక్ష్వాకు (ఇఖాకు) బృహత్పాలాయన, విష్ణుకుండి, చాళుక్యాది రాజవంశముల కాలములందును నిలయమై యలరారెను. ప్రాచీనాంధ్రదేశము. 117. పారటు.

ఇక్ష్వాకువు. సం. వి. ఉ. పుం. 1. సూర్యవంశపు రాజులలో నొకఁడు: చూ, రాజు. 1; స్త్రీ. 2. చేదుసొర (కన్న-కైసోరె.) *: చూ, సొఱ; 3 అంగుగు, చిల్ల *: చూ, సలకి.

ఇక్ష్వారిక. సం. వి. ఆ స్త్రీ. కాశము, రెల్లు*: చూ, శరము.

ఇక్ష్వాలిక. సం. వి. ఆ స్త్రీ. బల్బజము, పెంద వడ్డి *: చూ, తృణము. 1.(రూ-ఇక్ష్వాలిక.)

ఇగము. వై. వి. 1. = హిమమ్. రూ- ఇవము: చూ, హిమము. 1; 2. జలుబు: చూ, శైత్యము.

ఇగఁబెట్టు. దే. అ క్రి ఇగురునట్లుచేయు

ఇగిరించు. దే. అ. క్రి. 1 చిగిరించు: చూ, పల్లవించు; 2. ఎత్తైనగు. "అని మఁడలిగిన మొగ మిగిరింపన్." చు. 3, అ: చూ, పల్లటిల్లు.

ఇగిరిక. దే. వి. అగ్నిహోత్రమునందు వేల్చుటకు ఇవురఁబెట్టిన యన్నము: చూ, హవిస్సు. 1 (రూ-ఇగిరిక.)

ఇగిలించు. దే. స. క్రి. పండ్లిగిలించు-రూ-ఇగుల్చు-ఇవులుము-ఇవుల్చు.

ఇగిలింత దే. వి. ఇగిలించుట.

ఇగురు. దే. వి. 1. రూ-ఇవురు, మొలక: చూ, మొక్క. 1; 2. రూ-ఇవురు, చిగురు: చూ, విద్రుమము; 3. పండ్లచుట్టు నుండుకండ: రూ-ఇవురు; అ. క్రి. 4. ఇంకు, వట్టు, ఎండు: చూ, శోషించు. (రూ-ఇవురు.)

ఇగురుఁబోఁడి. దే. వి. ఇగురు + పోఁడి.) 1. ఆఁడుది: చూ, స్త్రీ; 2. చిగురువలె మనోజ్ఞురాలగు ఆఁడుది: చూ, స్త్రీ.

ఇగురుకూర. దే. వి. ఉడికించి వార్చి పోగుపులో వేసిన కూర.

ఇగుగుకొను. దే. అ. క్రి. ఇగిరించు: చూ, పల్లవించు

ఇగురుచు. దే. అ.క్రి.——వై.——(రూ-ఇగుర్చు.)

ఇగురువిలుతుఁడు. ద్వ. వి. మరుఁడు : చూ, మన్మథుఁడు. (రూ-ఇగురువిల్తుఁడు.)

ఇగుర్కొత్తు. దే. అ. క్రి. 1. చిగిరించు : చూ, పల్లవించు; 2. అనురక్తమగు. "పెడవప్పునఁ బ్రియునిచిత్తం బిగుర్కొత్తు." భాగ. అగ. 7, ఆ: చూ, చిగుర్కొత్తు

ఇగులుచు. దే. స. క్రి: చూ, ఇగిలించు (రూ-ఇగుల్చు.)

ఇగో దే. దక్రి. చూపుటను దెలుపును "వీఁడిగో గుఱ్ఱపుదొంగవచ్చె." జై 3, ఆ. 114 ఇదిగో-రూ- ఇదిగో, ఇదియ-రూ-ఇదె.

ఇగ్గు. దే. అ. క్రి. రూ-ఈగు, వెనుకకొఱగు. "ఇగ్గమొగ్గి నీడ్చెను." "ఇగ్గడు వెక్కసుంబయికి నీడ్చినఁ జైటఁ దొలంగఁజేయఁ గ్రేలొగ్గడు." విజ. 2, ఆ. (ఇక్కడ ఒఱగుట మాత్రమర్థము.): చూ, వ్రాలు 3

ఇగ్గులాట. దే. వి. ఈగులాడుట.

ఇగ్గులాడు. దే. స. క్రి. వెనుకకీడ్చు. "చిరగతి నిగ్గులాడకువె సిగ్గు." రసి. 3, గుచ్ఛము.

ఇగ్రుచు. దే. అ క్రి: చూ, రూ- ఇగురుచు. "ఎ, గీ. ఇగ్రుచు కోర్కులఁ దనడెందమువశతింప." కవిక. 3, ఆ

ఇచింగు. శా. యుఁవాన్‌చ్వాంగ్. 41. పొరటు. చీనాదేశీయుఁడు; 47 పొరటు. చీనీయుఁడైన ఇచింగు భరతవర్షమును చూడవచ్చినపుడు 'సుహృల్లేఖ' యత్యాదరముతో జనులచే పఠింపఁబడుచుండెనట; 51. పొరటు. ఇచింగ్ కూడ నాగార్జుని పోషకుని షా-తో-పో-హ-నా, అనఁగా శాతవాహనుఁడని దెలుపుచున్నాఁడు. 69. పొరటు.దిఙ్నాగాచార్యునిగ్రంథములం కొందటిమాలు క్రి. శ. 560 సం॥ న చీనాభాషలోని కనువదింపఁబడెను. అతఁడు తర్కము నభ్యసించువారల కుపయుక్తములైన గ్రంథముల నెనిమిదింటిని, తర్కశాస్త్రగ్రంథములను రచించెను. వాటి పేర్లను ఇచింగ్ తన గ్రంథమున తెలిపియున్నాఁడు; 89. పొరటు. భావవివేకుఁడాంధ్రుఁడు అతనిశిష్యులు నాగార్జుననికని, దిఙ్నాగునికిని మధ్యకాలమున జీవించియుండినట్లు ఇచింగు చెప్పియున్నాఁడు. (ప్రాచీనాంధ్రదేశము.)

ఇచ్చినగానిని నురలించుట. పా. వివాదములు పదునెనిమిదింటిలో నొకటి: చూ, వివాదములు.

ఇచ్చిపుచ్చుకోలు. ద్వ. వి. ఇచ్చిపుచ్చుకొనుట.

ఇచేట. దే. వి. ఏ. దక్రి. ఈస్థానము : చూ, ఇందు. 3.

ఇచేటు. దే. వి. ఏ.——వై.——(రూ-ఇచోటు.)

ఇచ్చ. వై. వి = ఇచ్ఛ. 1. చిత్తము. "అని తన మాట కియ్యకొనునన్నరు వల్కుల కిచ్చమెచ్చి." భార. మహా. 1, ఆ: చూ, హృదయము; 2. యదృచ్ఛ, ఇంపు. "క. తా, నచ్చట నంతర్హితుఁడై, యిచ్చజేనిరొ." భార. విరా. 5, ఆ: చూ, యథేచ్ఛము; వై. విశ.3.కోరిక. "క. మీ, కెన్నఁగ నేవరములిచ్చ బుచ్చెదవానిన్." ఉ. హరి. 4, ఆ: చూ, వాంఛ

ఇచ్చకమాడు. దే. స. క్రి. అచ్చిక బుచ్చికలాడు: చూ, బుజ్జగించు.

ఇచ్చకము. వై. వి. 1. = ఇచ్ఛ. ఇష్టోక్తి: చూ, బుజ్జగింత. 1, విశ. 2. కూరిమి. "ఎట్లిచ్చకమయ్యెనీకును." కాశీ. 2, ఆ : చూ, స్నేహము. 1.

ఇచ్చకాలమారి. వై. విశ. ఇచ్ఛకుఁడు : చూ, ప్రియవాది.

ఇచ్చకుఁడు. వై. విశ.——వై.——

ఇచ్చగలవాఁడు. దే. విశ. కాముకుఁడు: చూ, వలపుకాఁడు.

ఇచ్ఛగించు. వై. స. క్రి. 1. =ఇచ్ఛించు: చూ, వాంఛించు; 2. ఒప్పుకొను. "ఉ. నాతలపిచ్ఛ గింపుమనినన్ బ్రిభుడింక యియ్యకోలునన్." హరి. 7, ఆ: చూ, సమ్మతించు.

ఇచ్ఛగింత. వై. వి.=ఇచ్ఛ. ఇయ్యకోలు' చూ, సమ్మతి. 1.

ఇచ్ఛగొండి. వై. విణ: చూ, ఇచ్ఛకాలమారి.

ఇచ్చట. దే. వి ఏ, ద్రి. 1 ఈస్థానము: చూ, ఇందు. 3; 2. ఇచ్చటనే: ఇంద, ఇక్కడ, ఇచో్ఛ

ఇచ్చటు. దే వి. ఏ. ఈస్థానము:చూ, ఇందు.3.

ఇచ్ఛనందువాఁడు. ద్వ. వి. అడ్డపాటులేనివాఁడు: చూ, స్వతంత్రుఁడు.

ఇచ్చు. దే స. క్రి. 1 ఒసఁగు: చూ, దయచేయు. 2; 2. వ్యా. ఇచ్చునకు స్వరంబున కీయగు. (సూ. 103.) ఇచ్చునకు ముత్తుపరంబగునపుడు అన్నిరూపంబుల 'ఈ' యగు.— ఇచ్చుఁడు=ఈఁడు-ఇమ్ము-ఈని-ఈక-ఈఁగల -ఈఁబడు-ఇచ్చునకు 'ఈయ' యుఁగలదు. ఈయని- ఈయఁగల ఇత్యాదులు - ఇవ్వక- ఇవ్వని ఇత్యాదులు గ్రామ్యరూపంబుల సాధువులు చ్చద్విత్వముగావున 'వ' రాదు.

ఇచ్చునపుడు కొమునిపండుగు, పుచ్చుకొనునప్పుడు దీపావళి పండుగు. లో. ఒకానొక లోకోక్తి.

ఇచ్చువాఁడు. దే. వి. ఇడువాఁడు:చూ, దాత.

ఇచో్చటు. దే. వి. ఏ. (ఈ + చోటు.)ఈస్థానము: చూ, ఇందు. 3. (గా-ఇచో్చటు.)

ఇచో్ఛ. దే. ద్రి. 1.—పై.—; 2 ఇచ్చటనే: చూ, ఇచ్చట 2.

ఇచ్ఛ. సం. వి. ఆ. స్త్రీ.= ఇచ్ఛ:చూ, వాంఛ.

ఇచ్ఛాదులు. అం ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి. (3.)

ఇచ్ఛామతి, పా. ఏబదిసంవత్సరములు వీడు జవ్వనముగల స్త్రీ: చూ, స్త్రీ.

ఇచ్ఛావతి. సం వి. ఈ. స్త్రీ. గంధపుష్పాలంకారముల కాసపడు స్త్రీ, సంభోగముతక్కతక్కినవిషయములందు ఇచ్ఛగల ఆఁడుది: చూ, స్త్రీ.

ఇచ్ఛావసుఁడు. సం. వి. ఉ. పుం కుబేరుఁడు: చూ, శ్రీదుఁడు.

ఇచ్ఛావాక్యసంఘుట్టనము పా. ఇందు తోఁటు, తాటు, పేఁటు, ఆటఅను మాటలర్థవంతముగా గూర్చుట. (ఇత్యాదులు ) అప్ప. 4, ఆ.381.

ఇచ్ఛాశక్తి. అం. 1. ఇచ్ఛాదులు మూఁడింటిలో నొకటి:చూ, ఇచ్ఛాదులు; అం 2.శక్తులుఆయిదింటిలో నొకటి' చూ, శక్తులు.

ఇజారా. వా. వి. ఫలప్రదమైన యొకసొత్తును ఆసొత్తుగలవానికి తత్పదార్థము తగిన ధనమిచ్చి తన యనుభవమున నుంచుకొనుట. "ఇజారాదారు, శాశ్వతపు యిజారా." : గుత్త -గూ- గుత్తగ-గుత్తవ.

ఇజారాగారు. వా. విణ. గుత్తయెత్తనవాఁడు: చూ, పాలెగాఁడు.

ఇజారాదారుఁడు. వా. వి.—పై.—

ఇజారాగ్రిమము వా. గుత్తయెత్తనగ్రామము

ఇజారు. దే. వి. రూ-హిజారు కాళ్లకు తొడుగుకొను లాగు. చూ, వస్త్రము.

ఇజాకు. దే వి. 1. ఇక్కట్టు, సంకటము' చూ, దుఃఖము; 2. అలసట: చూ, శ్రమము, 1.

ఇజ్జలము. సం, వి. అ. పుం. రూ- హిజ్జలము, ఎఱ్ఱగన్నేరు * : చూ, హయమారకము.

ఇజ్య. సం. వి. ఆ. స్త్రీ. 1. కైసేఁత, పూజ: చూ, సపర్య; 2. ఈవి : చూ, వితరణము; 3. జేన్నము : చూ, యజ్ఞము; 4. బూమి: చూ, భూమి. 1; 5. తలయిక : చూ, పం

రోగము; 6. తల్లి: చూ, మాత 1; 7. కుంటెనకత్తె: చూ, శంభలి.

ఇజ్యాశీలుఁడు. సం. వి. అ. పుం పలుమాఱు యాగము సేయువాఁడు: చూ, యాయజూకుఁడు.

ఇజ్యుఁడు. సం. వి. అ. పుం. 1. బృహస్పతి చూ, వేలుపుటొజ్జ; విణ 2. ఒజ్జ చూ, పంతులు. 1; 3. మంచి కులమునఁ బుట్టినవాఁడు, సత్కులప్రసూతుఁడు: చూ, సజ్జనుఁడు; 4. అంతఃపుర పాలకుఁడు: చూ, సౌవిదల్లుఁడు.

ఇటు. దే వి. ఏ. 1. ఈస్థానము. "వాఁడిటు వచ్చువాఁడొ యేసందులఁ గేగుచున్నాఁడో." భాగ. అగ. 2, ఆ: చూ, ఇందు. 3; క్రి. 2. ఈ ప్రక్క, ఈవల.

ఇటఁబట్టి. దే. అవ్య ఇది మొదలుకొని (ఈపైనియని భవిష్యత్కాలము దెలుపును.) "క. దివసములైన యింక భువనంబులందిటఁ, బట్టి రాత్రి లేనియట్టుగాఁగ, జేసినాఁడు విధి." భార. అర. 7, ఆ: ఇటమీఁద.

ఇటక. వై. వి. = ఇష్టక ఇటికరాయి, బంకమట్టితోఁ జేసి కాలవేసినరాయి' రూ-ఇటిక- ఇటీక- ఇటుక- ఇట్టిక- ఇట్టీక- ఇట్టుక: చూ. రాయి.

ఇటుకగోడ. ద్వ. వి. తాపీపనివాఁడు అడుసులో ఇటుకలు పేర్చి కట్టిన నిలువుగోడ "పండు ఇటుకగోడ." "పచ్చిఇటుకగోడ."

ఇటుకనూయి. ద్వ. వి. భూమిలోపల నీటిమట్టము నుండి భూమిపైకి గుండ్రముగా సున్నముతోఁగాని అడుసుతోఁగాని కట్టిన నుయ్యి: చూ, నుయ్యి.

ఇటమీఁద. దే. క్రి: చూ, ఇటఁబట్టి.

ఇటిక. వై = వి. ఇష్టక: చూ, రూ- ఇటక.

ఇటికపగడము. వై. వి. తిక్కటిక: చూ, మట్టి పగడము.

ఇటీక. వై. వి. = ఇష్టక: చూ, రూ- ఇటక.

ఇటు. దే. అవ్య. రూ- ఇట్టు, ఏవమర్థకము. "ఉ. ఊహాపోహసర్వరీ యతిశగోత్రుల వర్గులందు నిట్టియ, వ్యాహతి సెల్లునంచునొయిటాడిరి." కళా. 1, ఆ. 58: చూ. ఏవమ్. 5.

ఇటుక వై. వి. = ఇష్టక: చూ, రూ- ఇటక.

ఇటుకనూయి. ద్వ. వి: చూ, ఇటుకనూయి.

ఇటుల. దే. క్రి. కుప్రకారము: చూ, ఆవలీవల.

ఇటులు. దే. అవ్య. ఇటు: చూ. ఏవమ్. 5. (రూ-ఇట్టులు.)

ఇటువంటి. దే విణ. ఇట్టి. "కాఁగా నిటువంటి పల్కునక." కళా. 3, ఆ 88: ఇట్టి.

ఇటువలె. దే క్రి ఇటు. "ఇటువలె వెదకియు" రామా. 6, ఆ: చూ, ఏవమ్. 5. (రూ-ఇట్టువలె.)

ఇట్వరము. సం. వి. అ. పుం. పండము, అచ్చువెద్దు: చూ, వృషభము. 1.

ఇట్టలము. దే. విణ. 1. చేవ: చూ, స్థైర్యము .1; 2. తిరము: చూ, స్థిరము; 3. అధికము. "ఇట్టలపు రయంబునఁ బొదివిడాసె." భార. విరా. 3, ఆ; "క. ఇట్టలముగఁ దగిలినట్టి యొఱ్ఱలువోలెన్." స్వా. 4, ఆ. 48: చూ, హెచ్చు. 1.

ఇట్టులు. దే. వి. లంఘన విశేషము, పేరెములు. "ఖుమాయించిన సేల గ్రక్కదలనిట్టులుగా నడి ద్రొక్కుచున్." య: చూ, లంఘు.

ఇట్టి. దే., వి: చూ, ఇటువంటి.

ఇట్టిక. వై. వి = ఇష్టక: చూ, రూ-ఇటక.

ఇట్టీక. వై. వి. = —పై —

ఇట్టు. దే అవ్య. రూ- ఇటు: చూ, ఏవమ్. 5.

ఇట్టుక. వై. వి. = ఇష్టక: చూ, ఇటక.

**ఇట్టుపు.** వై. వి. గుట్టుపు*(మేఁక కొమ్ములవంటి ఫలములు గలది.): చూ, విషాణి.

**ఇట్టులు.** దే. వి. రూ-ఇటులు: చూ, ఏవమ్.5.

**ఇట్టువోలె.** దే. క్రి: చూ, రూ- ఇటువలె. —వై.— "చ. వనుఁగనియొందు సత్త్వము మనంబున బెగ్గిలిడాయు నప్పుడిమ్ముని వరుఁ డిట్టువోలెఁ గృపమొక్కలమై శరభంబుగాఁ గఁజేయునా." భార. శాం 3, ఆ 95.

**ఇట్లు.** దే అవ్య. —వై.— (రూ- ఇటులు- ఇట్టులు)

**ఇడ.** సం. వి. ఆ. స్త్రీ 1. ఇందునాడి, (ప్రాణాయామ విషయమున నాడులు మూఁడు. ఇడ, పింగళ, సుషుమ్న.) ముక్కుడమరంధ్రము; 2. నేల: చూ, భూమి. 1; 3. పురోడాశపాత్రము, యజ్ఞమునందలి భక్షణపాత్రము: చూ, పాత్రము. 6; 4. బుధగ్రహముయొక్క పెండ్లాము: చూ, భార్య; 5. శబ్దము: చూ, మాట. 1; 6. ఆవు: చూ, ధేనువు; 7. వినుప్రోలు: చూ, స్వర్గము; 8 అంత్రము: చూ. ప్రేగు; 9. వాయుదేవుని పట్టపురాణి: చూ, భార్య; అం. 10 మహీంతానము లేడింటిలో నొకటి: చూ, మహీనతానములు; 11 నాడులుమూఁడింటిలో నొకటి: చూ, నాడులు.

**ఇడి.** దే. వి ఒకతూరి యోపిరిని ఒకతూరి రొమసటను వండిన పిండిని తామరనాలిపోఁగంత సన్నముగా యంత్రమునఁబిండెడు భక్ష్యవిశేషము. "వ. బుడుకులు నడుకులునిడియుఁ జిలిమిడియును." కాశీ. 7, ఆ: చూ, భక్ష్యము.

**ఇడిపుడుక.** దే వి.—వై.—"వ ఏలకికాయలు వెన్న మెఱుంగులు నిడిపుడకలు నడిపుడకలు" హంస. 1, ఆ.

**ఇడిపుడము.** దే. వి.—వై—

**ఇడిక్కము.** సం. వి. అ. పుం. మేఁక : చూ, మేషము. 1.

**ఇడియగొట్టు.** దే. స క్రి. అవమానపెట్టు: చూ, భంగించు.

**ఇడియు.** దే. అ. క్రి చీలు "సీ. మారుతాహతి రాలు నారికేళ ఫలాళి నిడిసిజల్లించు పుండేక్షురసము." పాం. 1, ఆ. 118; "సీ. ఇది చిల్కపోటుల నిడియుతాడిమ ఫలంబుల జారురసముచాల్ పారలువాఁక." చంద్రా. 4, ఆ. 192: చూ, ఛేదిల్లు. 2.

**ఇడు.** దే. స. క్రి. 1. ఇచ్చు చూ, దయచేయు. 2; 2. ఉనుచు: ఉంచు, ఉండఁజేయు, ఉనుచు; (సం ప):—ఉపన్యసించు.

**ఇడుగడ.** దే. వి 1. మంచిగుణములుగల దానియందు దోషము నారోపించుట. "చ. తనయక మొక్కియున్న వినతాసుతు నప్పుడు నూచి యాత్మలో, నిడుగడసేయుచుఁ గడు సహింపక." భార. ఆది.2, ఆ.93: చూ, అసూయ; 2. హీనత్వము. "చ. వెడలఁగనీక గొందినిడి వేయువిధంబుల భంగపెట్టుచుఁ,...... నేల తెంకిపై, నిడుగడ సేయఁగావలరు నీలువు మాలిన అంకుటాండ్రికిఁ." విజ్ఞా ఆచా. కాం. 111. (ఇది పిచార్యము.)

**ఇడుపు** దే. వి. 1. వైపు. "పొడుపు గుబ్బలి నేల పుగాకింటియిడుపున జేరిచిన గంధపుఁ జట్టులనఁగ." పా హ: చూ, పార్శ్వము. 2; 2. గోడ యిరుపార్శ్వములమీఁది చోటు. "గీ దారువన వీధి ...... తీర్చి యిడుపుల యందుఁ జిత్రించినారు." నై. 7, ఆ. 151: చూ, పొదికట్టు; 3. చీలిక. "ఇడిసిన యిడుపులయొడల." ఆము. 6, ఆ: చూ, శకలము.4.

**ఇడుము.** దే. వి. 1. ఆపద. "గీ. మగువగోల్పోయి కడు నిడు మలఁగలంగు." అప్ప. సుం. కాం: చూ, విపత్తు; 2. అలసట. "గీ. విప్రవరులు భోగములకు వేడ్కసేయ, రిడుమలి హమునఁబడి శాంతు లెలమిఁ బరమునందు

సుఖము." మార్క. 4, ఆ. 249 : చూ, క్రి మము. 1; 3 కష్టము, కడగండ్లు : చూ, దుఃఖము; 4. వగ, వంత: చూ, దుఃఖము.

ఇడుమపాటు. దే. వి: చూ, ఇడుముడిపాటు.

ఇడుముకొను. దే. అ. క్రి. ఆక్రమించు : చూ, మొంగరించు.

ఇడుముడి. దే. వి. కష్టము, కడగండ్లు : చూ, దుఃఖము.

ఇడుముడిపాటు. దే. వి' చూ, ఇడుమపాటు.

ఇడువాఁడు దే. వి. ఇచ్చువాఁడు: చూ, దాత.

ఇడ్డెన. వై. వి = ఇడియాణ వా సెన కుడుము: చూ, భక్ష్యము.

ఇడ్వరము. సం వి. అ పుం. ఆఁబోతు : చూ, వృషభము. 1.

ఇతఁడు. దే. స. ఏ. 1. ఈపూజ్యుఁడు: ఇతగాఁడు, ఈతఁడు, ఈతగాఁడు: ఈయన; 2. ఈమనుష్యుఁడు, ఇతగాఁడు, ఈతఁడు, ఈతగాఁడు, ఈయన.

ఇతఃపరము. సం. క్రి. విశ అ. న: చూ, ఇంతకుమున్ను.

ఇతకరి. వై. వి. = హితకారి. హితము సేయువాఁడు: చూ, హితవరి.

ఇతగాఁడు. దే. స. ఏ: చూ, ఇతఁడు.

ఇతము. సం. విశ. (అ. ఆ. అ.) 1. తలఁపఁబడినది: చూ, అభిప్రేతము; 2. నడవఁబడినది; 3. పొందఁబడినది : చూ, ప్రాప్తము. 1; 4. తెలివి: చూ, బుద్ధి; వై. విశ. (1)=హితమ్. చెలిమి. "ఎ. గీ. పలుపలుకులేల యింక నా చెలులు గిలులు, నేగుదెంచి విఘ్నమొనర్తురిత మెఱుఁగక." (ఇతము=ఇతమైన కార్యము) కళా. 6, ఆ. 61: చూ, స్నేహము. 1.(అప్పటి కప్రియముగానుండినను మీఁదటికి మేలుకలుగఁజేయునది.)

ఇతరము. సం. స. 1. అన్యము: చూ, పరాయి; వి. 2. తక్కువ: చూ, కెలితి. 2.

ఇతరుఁడు. సం స. 1. అన్యుఁడు: చూ, పరాయివాఁడు; 2. అధముఁడు: చూ, హీనుఁడు; 3 అజ్ఞాని: చూ, మూర్ఖుఁడు.

ఇతరేతరద్వంద్వము. పా. మూఁడు విధములగు ద్వంద్వములలో నొకటి: చూ, ద్వంద్వములు. (1. ఇతరేతరద్వంద్వము, 2. సమాహారద్వంద్వము, 3. ఏకశేషము.)

ఇతరేతరము. సం. స. ఒండొకటి : చూ, పరస్పరము.

ఇతరేద్యువు. సం. సాంతావ్యయము : చూ, మఱునాఁడు.

ఇతవరి. వై. విశ.= హితకారి. (ఇతవు + అరి.) హితముచెప్పువాఁడు: చూ, హితవరి.

ఇతవు. వై. వి.= హితమ్,రూ-హితవు. "క పిత్రుపూజనమని యెవ్వరి, కితవుగఁజేయుదురు దీని నెఱిఁగింపు శివా." భార. అను. 5, ఆ 306: చూ, స్నేహము. 1.

ఇతవుఁడు. వై విశ. 1.= హితః. చెలికాఁడు. "వ. ఇట్టివారితవులు తండ్రికిక్ సుతులకేమన నేర్తుము పెద్దరాజులక్." భార. ఉద్యో. 4, ఆ. 240: చూ, స్నేహితుఁడు. 1; 2: చూ, ఇతవరి.

ఇతివృత్తము. పా. వస్తువనఁగా కథ. దీనికే ఇతివృత్తమని పేరు.

ఇతివృత్తవిస్తరము. పా. కథను పెంచిచెప్పుట. సంధులేనింటికి నఱువది వాఙ్గంగములుగలవు. దీనికిఁ బ్రయోజనములాఱు. (1. వివక్షితార్థప్రతిపాదనము= చెప్పఁదలఁచినది చెప్పుట, 2. గోప్యార్థగోపనము = దాచఁదగిన దానిని దాచుట, 3. ప్రకాశ్యార్థప్రకాశనము= వెల్లడింపఁదగినదానిని వెల్లడించుట, 4. అభినయరాగసమృద్ధి=అభినయించి సభికుల రంజిం

చేయుట, 5. చమత్కారిత్వము=నేర్పుతో నుపన్యసించుట, 6. ఇతివృత్తవిస్తరము= కథను పెంచి చెప్పుట.)

ఇతిహాసరులు. పా. సభాసప్తాంగము లేడింటిలో నొకటి: చూ, సభాసప్తాంగములు. (చూ, అంగము. 9.)

ఇతిహాసము. సం. వి. అ. పుం. 1.ప్రాచీనచరిత్ర బోధక వ్యాసాది ప్రణీతములైన భారతాదులు, తొల్లింటికత: చూ, సమాచారము. 2, 2. తెలివి: చూ, బుద్ధి; 3. ఏర్పాటు: చూ, నిజము. 2; అం. 3. కళలఱువదినాలుగింటి లోనొకటి: చూ, కళలు.

ఇతోధికము. పా. ఇంతకంటె హెచ్చు

ఇత్కటము. సం. వి. అ. న. కోశాంగము: చూ, ఖరచ్ఛదము.

ఇత్తడి. వై. వి.= పిత్తళమ్. (కన్న-హిత్తాళే.): చూ, లోహము. 1. (రూ-ఇత్తళి.)

ఇత్తటి. దే. వి. (ఈ+తటి.) ఈసమయము: చూ, సాంప్రతము. 2.

ఇత్తిగ. ద్వ. వి. (ఇరు+తిగ.) 1. రూ-ఇద్దుగ పాచికలమీఁది మూఁడుబొట్ల జీత : చూ, దుందుభి. 1; స. 2. రూ-ఇఱతిగ ఇఱ్ఱిగ: చూ, పట్కాము.

ఇత్యా. సం. వి. ఆ. స్త్రీ. ఒకరకము పాలకి:చూ, పాలకి.

ఇత్యర్థకము పా. అని, అట.

ఇత్యాది సం. అవ్య. మొదలగునవి.

ఇత్రాలము. సం. వి. అ. న. కరబుజీము: చూ, పగిడి.

ఇత్వరము. సం. వి. అ. పుం. అఁబోతు : చూ, వృషభము. 1.

ఇత్వరి. సం. వి. ఈ. స్త్రీ. కులట: చూ, ఱంకులాఁడి.

ఇత్వరుఁడు. సం. విణ (అ. ఆ. అ.) 1. ఆకింమఁడు: చూ, బీదవాఁడు; 2. అధముఁడు: చూ, హీనుఁడు; 3. భయంకరముగు పని చేయువాఁడు: చూ, క్రూరకర్ముఁడు;4. దారి నడచువాఁడు: చూ, పాంథుఁడు.

ఇత్వసంధి. పా. వ్యా.—ఉ. తలఁచి+ఉండి= తలఁచుండియనుట తప్పు. తలఁచియుండియనుట సాధువు. క్త్వార్థకేత్వమునకు సంధిలేదు. కావునఁ దలఁచియను క్త్వార్థమునకునచ్చు పరముకాఁగా యడాగమమువచ్చి తలఁచియుండియయ్యెను. సంధి. సూ. 9

ఇదమ్. సం విణ. ఏతచ్ఛబ్దార్థకము : చూ, ఇయ్యది.

ఇదంతము. పా. ఇదంతంబులకు బహువచన ప్రత్యయంబులు పరంబులగునపు డుపధాశవర్ణంబు సవర్ణంబగు. ఉ. రాశి-రాసులు, పరదేశి-పరదేసులు, పేశి-పేసులు. మొ.

ఇదానీమ్. సం. అవ్య. 1. వాక్యభూషణము: చూ, ఊఁతపదము; 2. ఇప్పుడు: చూ, సాంప్రతము. 2; 3. అంతట వ్యాపించినది; 4 పాదపూరణము; 5. కాంతి: చూ, వెలుతురు. 1.

ఇది. దే. స. రూ-ఇద్ది: చూ, ఇయ్యది.

ఇదికదా. దే. అవ్య. ఇదియేకదా.

ఇదిగొ. దే. ద్రి. (ఇది+కొమ్ము.): చూ, రూ-ఇగొ. (రూ-ఇదిగో.)

ఇదిగో. దే ద్రి.—వై.—"క. పూఁబోఁడి యిది గనికొఁనిచేన,గాఁబఱ్యోద యొడిసిపట్టెఁగనుఁ గొంటె చెలీ, లేఁబొన్నను బళిరాయిద్దిగోఁ బురుహూత్యాయను నిలుపుతోమసమయంబున్." కళా. 1, ఆ. 35.

ఇదియ. దే. అవ్య.—వై.—(రూ-ఇదె.)

ఇద్దరి. దే వి. (ఈ+దరి.) అపారము : చూ, ఈవల.

ఇద్దఱు. దే. స. రెండుశబ్దము తొ మహన్మహత్యర్థక బహువచనాదేశము: ఇరుగురు - రూ- ఇరువురు-ఇర్వురు.

ఇద్దఱుతల్లుల ముద్దుబిడ్డఁడు. ద్వ. వి. గణపతి: చూ, వినాయకుఁడు. 1.

ఇద్ది. దే. స. ఈశబ్దమునకు అమహదర్థక ప్రథమైక వచనము: చూ, రూ-ఇది

ఇద్దుగ. ద్వ. స. (ఇరు + దగ.): చూ, రూ- ఇత్తిగ. "క. అత్తివంచిత్తిగదుగ, సత్తాదచ్చాక వంచపౌవంచీర్తి, ఇత్తిగ యద్దుగ బద్రిలు! చిత్తంబుఁదలఁచినట్లు చేతికిఁదెచ్చున్." ఉ. హరి. 8, ఆ. 121

ఇద్దుము. దే. వి. (ఇరు + తూము) రెండుతూములు: రూ-ఇరుదూము.

ఇద్దెస. దే. వి రూ-ఈదెస, ఈతట్టు, ఈకడ, ఈవంక, ఈవైపు.

ఇద్ధము. సం వి. అ పుం. 1. కాంతి: చూ, వెలుతురు. 1; విణ. 2. పరిశుద్ధము; 3. వెలిగింపఁబడినది: చూ, ప్రకాశితము; 4. తపింపఁజేయఁబడినది: చూ, తప్తము; అవ్య. 5. ఈలాగు: చూ, ఇటు.

ఇధ్మము. సం. వి. అ. న. 1. చిదుగు : చూ, సమిధ; 2. వంట కట్టెయ: చూ, వంటచెఱకు.

ఇన్‌కంటేక్సు. ఆం. ఆదాయపుపన్ను

ఇన్‌కంబరెన్సు. ఆం. ఒక ఆస్తికి అదివఱలోనే యేర్పడిన తాకట్టు మొదలగు సన్యాక్రాంతము.

ఇన్‌టరెస్టు. ఆం. 1. వడ్డీ; 2. అభిరుచి.

ఇన్‌ఫ్లూయెన్‌జా. ఆం. దుష్టప్రతిశ్యాయ. (శీతము కారణముగ సంభవించుజంతుజన్యరోగము.)

ఇన్‌సల్టు. ఆం. పరిభవము.

ఇన్‌సాల్వెన్సీ. ఆం. దివాలా, ఋణతీర్మాసాశక్తత.

ఇన్‌సాల్వెంటు. ఆం. దివాలాతీసినవాఁడు.

ఇన్‌స్టాల్మెంటు. ఆం. కిస్తీ వాయిదాప్రకారము యిచ్చు చెల్లుబడిసొమ్ము.

ఇన్‌స్ట్రక్షను. ఆం. 1. ప్రవృత్తి రేఖ; 2. ఒకసంగతి చెప్పుట; 3. వ్యాజ్యగాఁడు తన వకీలునకు దావాసంగతులు నివేదించుట.

ఇన్‌స్పెక్టరు. ఆం.పరీక్షాధికారి (బడులు,రివెన్యూ, ఆరోగ్యశాఖ, పోలీసు మున్నగువారి పయి అధికారి.)

ఇన్‌స్క్రిప్షను. ఆం. శాసనము. (శిలాశాసనము, తామ్రశాసనము.)

ఇన్‌స్యూరెన్సు. ఆం. భీమా.

ఇనపరెడ్లు. శా. ఇన్నరెడ్లు.=గేదెలు, ఎనుములు. సౌ, ఇం, ఇ. 4 సం. 1186 శాసనము.

ఇని. ద్వ స. ఏ: చూ, రూ-ఇన్ని.

ఇను. దే. స వృత్తియందు హల్లు పరమగుచో రెండింటికి నాదేశముగా వచ్చునది. "ఇనుమడి, ఇనుమాఱు." మొ.

ఇనాము. దే. వి. 1. బహుమానము : చూ, మర్యాద; 2 కొద్దిగ క్విటిరెంటు (పన్ను) కట్టయిచ్చిన శాశ్వతపు హక్కుగల భూమి, రూ-ఈనాము.(ఇనాము.=క్విటిరెంటుఇనాము దరిమిలా ఇనాము, మొ.)

ఇనుఁడు. సం. వి. అ. పుం. 1. పగటివేలుపు: చూ, సూర్యుఁడు; 2. అధిపతి : చూ, ప్రభువు. 2; 3. ఒకరాజు : చూ, రాజు. 1; 4. ఆస్తికాఁడు: చూ, సంపన్నుఁడు; 5. మగఁడు: చూ, భర్త. 1.

ఇనుకు. దే. వి. 1. బొంతుచేతఁగప్పఁబడిన యల్పధాన్యము. "ఎ, గీ. ఉపయుక్తములగు నల్పధాన్యములు చింత యినుకనఁదగుసుహేళ." ఆం, ఛా. ద్వి. పై: చూ, ధాన్యము; అ క్రి. 2. రూ-ఇంకు. ఎండు: చూ, శోషించు.

ఇనుపకచ్చడము. ద్వ. వి. ఇనుపగోఁచి. "ఇనుప కచ్చడాల్ గట్టుకొమమునిముచ్చులెల్ల."

ప్వా. 2, ఆ. 73. "ఆ. ఇల్లునాలిపిడిచియినుప కచ్చెలఁగట్టి." వేమన. 416.

ఇనుపగుదియ. ద్వి. వి. గునపము : చూ, ముద్గరము.

ఇనుపగోఁచి. ద్వి. వి: చూ, ఇనుపకచ్చడము.

ఇనుపగోలెము. ద్వి. వి. ఇనుపకుంపటి : చూ, పొయ్యి.

ఇనుపచేట్టు. పా. చేట్టులలో నవియేర్పడు విధమునుబట్టి కొన్ని భేదములుఁగలవు. నేల యందు లోహి శామ్లజనిదము విస్తారముగా నుండి యది క్రిందికిదిగి యచీటి మంటిరేణువులను బంధించి రాతివలెఁ జేయుటవలన నేర్పడిన చేట్టు.

ఇనుపచిట్టెము. ద్వి. వి. కలంకము: చూ, మండూరము.

ఇనుపకుందులు. ద్వి. వి. తలుపు బందులకాధారమైనవి.

ఇనుపతేలు. ద్వి. వి. ఎనుపతేలు : చూ, వృశ్చికము. 1.

ఇనుపదుడ్డు. ద్వి. వి: చూ, ఇనుపగుదియ.

ఇనుపనాఁగలి. పా. ఇనుపనాగలి కఱ్ఱనాఁగలి కంటె కొన్నివిషయములలో శ్రేష్ఠము. ఇనుపనాఁగలి యంగములు.—1. తల్లికోఱు, 2. కఱ్ఱు, 3. ఱెక్కకోఱు, 4. ఏడికోల, 5. పేడి, 6. కట్టు, 7. మడమ; పెద్దఇనుపనాఁగలి యంగములు.—1. తల్లికోఱు, 2 కఱ్ఱు, 3. ఱెక్కకోఱు, 4. దూలము, 5. మేళ్ళు, 6. పిడులు, 7. చక్రము, 8. చక్రధ్వజము, 9. అడ్డుకర్ర్యము, 10. నిలువుకర్లము. (ఖరీదు22-8-0.); నాగపురిలోఁ జేయఁబడిన స్వీడిష్ నాఁగలిమాదిరి నాఁగలి 16-0-0; ప్రత్తిరేవడి నాఁగలి బళ్ళారిలోఁగలదు. 5-6 జతలఎడ్లు కట్టుకరు. రు 70-0-0; టర్న్‌రెస్టు నాఁగలి. (దీనిలో ఱెక్కకోఱొకవైపున వేయఁదలచిన వావైపున వేయవచ్చును.) రు 40-0-0. మొ. కలవు (చూ, ఆవిరి నాఁగళ్ళు; లాంగలము.)

ఇనుపపమిడె. ద్వి. వి. అయఃప్రతిమ : చూ, సూర్మి.

ఇనుపబొమ్మ. ద్వి. వి.—పై—

ఇనుమడి. దే. వి. (ఇను + మడుగు.) రూ-ఇన్మడి: చూ, రెట్టి. 1

ఇనుమడించు దే. స. క్రి. రూ- ఇన్మడించు: చూ, రెట్టించు.

ఇనుమద్ది. దే. వి. (ఇనుము + మద్ది.) కార్ష్యము, నల్లమద్ది *: చూ, మద్ది.

ఇనుమనుమఁడు. దే. వి. మనుమని కొడుకు: చూ, ప్రపౌత్రుఁడు. 1.

ఇనుమనుమరాలు. దే వి. మనుమరాలికూతురు: చూ, ప్రపౌత్రిక. 1.

ఇనుమాఱు. దే వి రెండు తడవలు: రెండుసార్లు,

ఇనుమిక్కిలి దే. విశే. మిక్కిలి ఎక్కువ: చూ, హెచ్చు. 1.

ఇనుము. దే. వి. 1. రూ-ఇన్ము. అయస్సారము: చూ, లోహము. 1. "ఆ. ఇనుము విఱిగెనేని యినుమాఱు ముమ్మాఱు, కాచి యతుకవచ్చు." వేమన. 402; 2. లోహము లయిదింటిలో నొకటి: చూ, లోహములు.

ఇనుముఁజేరియగ్గియిమిడిన చందము. లో. "ఆ. కనక మవలఁదాటి కడగండ్లుపడనేల, మనసు నిలుపవలెను మర్మమెఱిఁగి, ఇనుముఁజేరి యగ్గియిమిడిన చందమా, విశ్వదాభిరామవినురవేమ." వేమన, 895. పద్యము.

ఇనుమునుగూడిన యగ్గికి సమ్మెటదెబ్బలు. లో. ఉ.—ఇనుమునుగూడి వేఁడివెల్వనకు సమ్మెటపెట్లబ్బునట్లు హీనునిగూడిన మానసీయునకు లాఘవంబు గలుగుట సహజము." (నీతిసంద్రిక.—విగ్రహము.)

ఇన్ని. ద్వ. స. ఏ. 1. ఇన్ని శబ్దమునకు అమహదర్థక బహువచనాదేశము; 2. ఈసమస్తము; 3. ఇంతసంఖ్య కలవి. (రూ-ఇని.) "ఆ. ఇన్ని ఫలములందు నేఫలంబెక్కుడు, అన్న ఫలముకంటె నధిక మేది." వేమన. 400. ప.

ఇన్నుగ. దే. వి. ఇందుగు *: చూ, సల్లకి.

ఇన్నూరు. దే. వి.(ఇరు + నూరు.)రూ-ఇన్నూఱు: చూ, రెండువందలు.

ఇన్నూఱు. దే. వి. (ఇరు + నూఱు.)—పై—

ఇన్మడి. దే. వి. (ఇను + మడుగు.): చూ, రూ-ఇనుమడి.

ఇన్మడించు. దే. స. క్రి: చూ, రూ-ఇనుమడించు.

ఇన్ము. దే. వి: చూ, రూ-ఇనుము.

ఇన్వక. సం. వి. అ. స్త్రీ. బ. మృగశిరా నక్షత్రమునకు మీఁదినక్షత్రములు : చూ, నక్షత్రము. 1.

ఇపుడు. ద్వ. స. ఏ (ఈ + ప్రొద్దు) అద్యత్వము: చూ, సాంప్రతము. 2. (రూ-ఇప్డు.)

ఇప్ప. దే. వి. అలిమకము *: చూ, మధూకము. (హిం-మహుఆ; తో°వా.)

ఇప్పటిది. దే. వి: చూ, ఆధునికము.

ఇప్పనూనె. దే. వి, మధూకబీజతైలము : చూ, తైలము.

ఇప్పపువ్వు. పా. మధూకపుష్పము. (భద్రాచలరాములవారి ప్రసాదముగా నిచ్చెదరు.)

ఇప్పశ్యూరాజనములు, ద్వ. వి. శాలిధాన్యము: చూ, ధాన్యము.

ఇప్పాటు. దే. వి. ఈలాగు: చూ, ఏవమ్. 5.

ఇప్పికోలు. దే. వి. ఇచ్చేగింత: చూ, సమ్మతి. 1.

ఇప్పిలి. శా. ఈపురిని గంగమనాయకులను వారు పరిపాలించిరి.

ఇప్పుడు. ద్వ. స, ఏ. (ఈ + ప్రొద్దు.): చూ, రూ-ఇపుడు.

ఇప్పుడే. ద్వ. వి. ఈసమయముననే:-వ్య-అప్పుడే.

ఇబ్బంది. ద్వ. వి. (ఇను + బంది.) మిక్కిలిర్బంధము "నన్ను ఇబ్బంది పెట్టవలదు. రాత్రికి ఇల్లు చేరవలెను.": చూ, బలవంతము.

ఇబ్బెడ. దే. వి.ఒకరకముచెట్టు*: చూ, వృక్షము.

ఇభనిమీలిక. సం. వి. అ. స్త్రీ. నేరుపు: చూ, సామర్థ్యము. 1.

ఇభము సం. వి. అ. పుం ఏనుఁగు: చూ, హస్తి.

ఇభసంజ్ఞ. సం. వి అ. స్త్రీ. నాగకింజల్కము, (కన్న-నాగకేసగ.) *: చూ, నాగకేసరాలు.

ఇభాఖ్యము. సం. వి. అ పుం.—పై.—

ఇభాశ్వప్రియ. సం. వి. ఆ. స్త్రీ. నల్లనేలగుమ్మడు *: చూ, భూమికర్కారువు.

ఇభి. సం. వి. ఈ స్త్రీ. ఆఁడేనుఁగు: చూ, హస్తి.

ఇభుఁడు. సం. వి. అ. పుం. 1. చేందురుఁడు: చూ, చంద్రుఁడు; 2. గణపతి: చూ, వినాయకుఁడు. 1.

ఇభేరమము. సం. వి. అ. పుం. పదునాలుగేండ్ల యేనుఁగు: చూ, హస్తి.

ఇభ్య. సం. వి. ఆ. స్త్రీ. 1. అందుగు *: చూ, సల్లకి; 2 ఆఁడేనుఁగు: చూ, హస్తి.

ఇభ్యుఁడు సం. వి. అ. పుం. ఆస్తికాఁడు: చూ, సంపన్నుఁడు.

ఇమిడిక. దే. వి. 1. అడకము : చూ, తీలు; 2. పొందిక: చూ, స్నేహము. 1.

ఇముకలము. దే. వి. కలము: చూ, లేఖని.

ఇముకు. దే. అ. క్రి. ఇంకు: చూ, శోషించు.

ఇముడు. దే. అ. క్రి. 1. అడఁగు : చూ, సుత్రక్కు. 4; 2 అనుకూలపడు: చూ, పొందుపడు.

ఇముడుకొను. దే. అం. ప్రే. ఇముడునటులఁ జేసికొను. "ఆ. గర్భమందు కమలగర్భాండ శతముల, నిముడుకొని నటించు నీశ్వరేశ." భాగ. 1, స్కం. 184; "క. అభయార్తమ్ము, గాత్రీకో దాశానుక నిముడుకొనుచుక

గావుము కావుమని వానికరములు పట్టెన్" కళా. 3, అ. 118: (రూ-ఇముడ్చుకొను.)

**ఇముడుచు.** దే. ప్రే. ఇముడఁజేయు. (రూ-ఇముడ్చు.)

**ఇమ్మడి.** దే. వి. రూ-ఇనుమడి: చూ, రెట్టి. 1.

**ఇమ్మడించు.** దే. స. క్రి. రూ- ఇనుమడించు: చూ, రెట్టించు.

**ఇమ్మడివజ్రహస్తుఁడు.** శా. క్రీ. శ. 859, ల. 874 వఱకు రాజ్యముచేసి అనియంక భీముఁడని బిరుదునందెను. ఈతఁడే ముఖలింగము నందలి మధుకేశ్వరాలయమును పరిసమాప్తి నొందించినటుల తోఁచుచున్నది కళింగదేశ చరిత్ర. 217. పుట.

**ఇమ్ము.** దే. వి. 1. సుఖము, ఆనందము. "ఉ. ఇమ్ములనున్న వాఁడెహరి." భాగ. 10.స్కం, పూ. 1474. (ఈయర్థమందు ఇది తఱచుగా ద్వితీయా బహువచనాంతముగానే ప్రయోగములయందుఁ గానఁబడుచున్నది.): చూ, సంతోషము; 2. ఇల్లు: చూ, గృహము. 1; 3. చోటు. "ఎ, గీ. అతులధైర్యంబునకు నీవు పట్టుమిమ్ము." ఉ, రా. 5, అ. 140. చూ, స్థానము. 1; 4. విరివి "వ. వినువిటులున్న యీజనుల విప్పగనుంగొన వచ్చినంబు రంబున కిచటిమ్ము చాలదనబుద్ధి జనించె గణించి చూడుమా." హరి. ఉ. 2, అ. 112: చూ, విస్తారము. 1; 5. మనోజ్ఞత, ఇంపు. "క. విదితంబై యుద్యోగము, మొదలుగఁ బదునొక్క పర్వముల నెంతయు నొప్పిదమై యేనవపర్వంబిది నానుద్యోగ పర్వమిమ్మగు సభలన్." భార. ఆది. 1, అ. 40: చూ, సౌందర్యము; 6. పొందిక "క.తనకిమ్మగునంతకు దుర్జనుఁడిష్టుఁడపోలెనుండి సర్వమువోలెన్, దనకిమ్ముగుడును గెలుచును, ఘనదారుణ కర్మగరళఘనదంష్ట్రలచేన్." భార. ఆది. 6, అ. 118: చూ, సంయోగము; 7. అనువు. "క. నెమ్మిగలవారినొల్లరు, తమ్మొల్లని వారివెనుకఁ దగులుదు రధిక,త్వమ్మెఱిఁగి యెఱిఁగి తొడరుదు, రిమ్ములుఁగని యట్టివారలిభపుర నాథా." భార. ఉద్యో. 2, అ. 34: చూ, ఉపాయము; విణ. 8. పొత్తు. "ఆ. ఎత్తికొనిచేనంగనిమ్మగునట్లుగా, మెదలుచున్న బ్రియ్యలది మిరెంటిఁ,గూడఁబెట్టె." భార. సభా. 1, అ. 148: చూ, సంయోగము; 9. అంత, యావత్తు "వ. విచారపూర్వారబ్ధ కార్యంబునకు దైవంబును ననుకూలంబగుంగావున నిమ్మగా విచారింపవలయు." భార. అర. 1, అ: చూ, సర్వము; 10. ఒప్పిదము. "వ. సూపకారుండు వధ్యస్థానంబునకుంజని మనుష్య మాంసంబుఁ దెచ్చి యిమ్మగా వండిపెట్టిన." భార. ఆది. 7, అ.115: చూ, రమ్యము; 11.యుక్తము. "వ. ఇమ్మగునవసరంబునఁ దద్గృహద్వారంబునందు ఘోరానలంబు దరికొల్పి." భార. ఆది. 6, అ. 140: చూ, యోగ్యము. 4; 12 స్పష్టము. "గీ. వృక్షశాఖాగ్రమునమున్న పక్షిశిరము, తెల్లముగఁ జూచితే మహీవల్లభుండ, యనిన నిమ్ముగఁ జూచితి ననిన నెండి,యును గురుఁడు ధర్మజున కిట్టులని యెఱుఁగ్రీతి." భార. ఆది. 5, అ. 249: చూ, తెల్లడి.

**ఇమ్ముకొను.** దే. అ. క్రి. కాఁపురించు "సీ. కాపునవీర్యకలితుఁడా శత్రులయమ్మనా కుల వృత్తి నిమ్ముకొనఁగ,జేసె." రాఘ. 2, అ. 28: చూ, వసించు.

**ఇమ్ముదప్పు.** దే. వి. (ఇమ్ము + తప్పు) సంకటము, ఇక్కట్టు. "ఆ. ఇమ్ముదప్పువేళ నెమ్మలన్నియుఁదప్పు." వేమన. 408 : చూ, దుఃఖము.

**ఇమ్మెయి.** దే. వి. (ఇమ్ము + మెయి.) 1. ఈ శరీరము; అవ్య. 2. ఈప్రకారము : చూ, ఇటు.

ఇయత్త. సం. వి. అ. స్త్రీ. కొలది: చూ, పరిమితి.

ఇయాంశము. సం. వి. న. పుం. 1.—పై—; 2. స్వర్ణగృహము: చూ, గృహము. 1; 3. రాజ్యగృహముల ముంగిలి: చూ, ముంగిలి. 2; 4. కళుకు, కిరణము: చూ, మయూఖము. 1; అవ్య. 5. కించిదర్థకము, అత్యల్పము: చూ, స్వల్పము.

ఇయోసీను. పా. (నవోదయ) భూమి పైభాగమునున్న పొరల వయస్సునుబట్టి మూఁడు యుగములక్రింద విభజింపఁబడిన తృతీయ యుగము (నవజీవయుగము) లోని పడియవ భాగము (పరిణామవాదము. చిం.దీ.28పుట.)

ఇయోహాయము. పా. కాండిలార్ త్రి అను జంతుజాతినుంచి గుఱ్ఱమునుబోలిన జంతువు ఉద్భవించి యుండును దానికి పాదమునకు అయిదువ్రేళ్ళుచొప్పునగలవు. పాదమంతయు నేలపైనఆనినడచును. చెవులపిల్లికన్న చిన్నదై యుండును. ఉత్తర అమెరికా ఇయోసీను పొరలయందు దొరికినది. ఇది పదునొకండంగుళముల యెత్తును మించియుండదు (చిం-దీ పరిణామవాదము. 39. పుట)

ఇయ్య. పై. వి.= ఈహ. అపేక్ష. రూ-ఈయ (దీనికి ప్రత్యేకప్రయోగముఁ గనఁబడదు) "ఇయ్యకొను, ఇయ్యసేయు: చూ, వాంఛ.

ఇయ్యకొను. ద్వ. స. క్రి. ఒప్పుకొను. రూ- ఈయకొను: చూ, సమ్మతించు; భార. విరా. 2, ఆ. 245.

ఇయ్యకోలు ద్వ. వి. రూ-ఈయకోలు. "చ. విచారవిమూఢునకైన నీవు పల్కినపలుకియ్యకోలగునె." భో. 4, ఆ. 242: చూ, సమ్మతి. 1.

ఇయ్యకోలువాఁడు. ద్వ. వి. అంగీకరింపఁబడినవాఁడు: చూ, రూ-ఈకోలువాఁడు.

ఇయ్యది. దే. స. ఏతచ్ఛబ్దార్థకము:రూ-ఈయది- అదము, ఇది-రూ- ఇద్ది. ఇయ్యది- ఈయది, ఈ; బ — ఇవి-రూ-ఇవ్వి-ఇయ్యవి-ఈయవి; (సం. ప):—ఇదమ్.

ఇయ్యవి. దే. స. బ.—పై.—

ఇయ్యవు. దే. అవ్య. ఒసంగవు: రూ- ఈయవు- ఈవు.

ఇయ్యసేయు. పై. అ. క్రి (ఇయ్య + చేయు.) ఒప్పారు, అంగీకరించు: చూ, సమ్మతించు; రాజ 3, ఆ.

ఇయ్యెడ దే. క్రి. ఇక్కడ: చూ, ఇందు. 3.

ఇయ్యేఁడు. దే. వి (ఈ + ఏఁడు.) వర్తమాన సంవత్సరము: రూ-ఈయేఁడు.

ఇర. సం. వి. అ. స్త్రీ. 1. కల్లు: చూ, సుర. 1, 2. ఉదకము: చూ, నీరు. 1; 3. అజ్యధార: చూ, నేతిసోలు; 4. పుడమి: చూ, భూమి 1; 5. పమూముఖము: చూ, సేనాముఖము, 6 శబ్దము: చూ, మాట. 1; 7. ఎల్ల: చూ, సీమ. 1.

ఇరమ్మదము. సం. వి. అ పుం, మేఘమునందలి యగ్ని: చూ, నిప్పు.

ఇరవారు. దే. అ. క్రి. (ఇరవు + ఆరు.) తిరపడు: చూ, స్థిరపడు.

ఇరవు. దే. వి. 1. చోటు: చూ, స్థానము 1. "తే. ఇరవుఁగనుఁగొని పరమార్థమెన్నఁగోరి" వేమన. 406; 2. పొత్తు: చూ, సంయోగము; 3. ఇల్లు: చూ, గృహము. 1. (ఇది అకారమధ్యముగ వాడుకనుబట్టి వ్రాయఁబడియెను.); విశ. 4. కదలనిది. "క. ఇరవుగసిద్ధించున సఘు యిహపరసుఖముల్." భార. అర. 4, అ: చూ, స్థిరము. (రూ-ఇరువు.)

ఇరవుకొను. దే. అ. క్రి. 1. తిరపడు: చూ, స్థిరపడు; 2. నిలుకడయగు: చూ, మట్టుపడు.

ఇరవుపట్టు. ద్వ. వి. రూ-ఇరువుపట్టు, ఇల్లు: చూ, గృహము. 1.

ఇరవుపడు. దే. అ. క్రి: చూ, ఇరవుకొను.

ఇరవొందు. దే. అ. క్రి. ఈడేఱు: చూ, సిద్ధించు.

ఇరస. దే. వి. రూ-ఇరుస, రెండు కుంచెములు: చూ, తూము. 3

ఇరసాలు పా. (ప్రభుత్వమునకు) సొమ్ముపంపుట.

ఇరసాలునామా. పా. అధికారులకు పంపుసట్టి రూకలపట్టి, సొమ్ముపంపుపట్టి పట్టి.

ఇరాచరము. సం. వి. అ. పుం. కరక: చూ, వడగల్లు.

ఇరాఱు. దే. స (ఇరు + ఆఱు.) రూ-ఈరాఱు, ద్వాదశసంఖ్య. "ఉ. అసగరంబు తో్రవనుది నాధిపుఁ డేగుచు దారికడ్డమై, భూనికనున్న కోటఁగని పోవఁగలేక యిరాఱు మేనులన్, దానటుదిద్దు దూఱిచనెఁ దథ్యముగాదని యంటిరేనియా, భానునిద్వాదశాత్ముఁడని పల్కఁగఁ గారణమేమి నిచ్చటన్." రుక్మి. 1, ఆ. 43: చూ, ముచ్చోకము

ఇరావణము. సం. వి. అ పుం. ఇంగ్రునిఏనుఁగు: చూ, హస్తి.

ఇరావతము. సం. వి. అ. స. 1. మేఘములందు చోటు; పుం 2. సప్తియనునూర్యుని గుఱ్ఱము: చూ. హయము; 3. గుఱ్ఱము: చూ, హయము.

ఇరావతి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఒకరకము తీఁగె: చూ, లత. 1; 2. ఒకానొకయేఱు: చూ, నది; 3. యమునిపట్టణము: చూ, దేశము.

ఇరింగణము. సం. వి. అ. పుం. 1. వడిగాలి: చూ, వాయువు; 2. వాయువు లెనిమిదింటి లోనొకటి: చూ, వాయువులు.

ఇరిణము. సం. విశే. (అ. ఆ. అ.) 1. చవుటిది (నేల.): చూ, భూమి. 1; 2. పాడైనది (నేల.): చూ, భూమి. 1; 3. ఎడారి: చూ, బయలు. (రూ-ఈరిణము.)

ఇరిపకము. సం, వి. అ. పుం. కందుకము: చూ. బంతి. 3.

ఇరివిరి. దే. వి. 1. పోగరతోఁ జేయఁబడిన రంధ్రము: చూ, రంధ్రము. 1; 2. రత్నాదులకు బెజ్జమువేయు వజ్రపు పోగర: చూ, వైధనిక.

ఇరు. దే. స. రూ-ఈరు. (వృత్తియందు హల్లు పరమగుచో రెంటికాదేశముగా వచ్చునది): చూ, రెండు.

ఇరుఁగెలంకులు. దే. వి. బ. ఉభయపార్శ్వములు: చూ, పార్శ్వము. 2. (రూ- ఇరుఁగెలఁకులు- ఇరుఁకెలఁకులు.)

ఇరుఁదలతేజి. దే. వి. (ఇరు + తలతేజి.) మేఁక: చూ, మేషము. 1.

ఇరుఁదలపాము. దే వి. (ఇరు + తలపాము.) రాజిలము, రూఁడుఁబాము: చూ, సర్పము.

ఇరుఁదలపులుఁగు. దే. వి (ఇరు + తలపులుఁగు.) గండభేరుండము, రెండుతలలుగల పక్షి: చూ, పక్షి.

ఇరుఁదూము, దే. వి. (ఇరు + తూము.) రెండు తూములు; రూ-ఇద్దుము.

ఇరుఁబుట్టువు దే. వి. (ఇరు + పుట్టువు.) 1. పక్కి: చూ, పక్షి; 2. పాఱుఁడు. "సీ. పలుమఱుఁ జెలువతావులఁజేరి పొరలుచు వంకరనడలచే వఱలియరిది, తేజునఁ బడగెత్తియు నిరుఁబుట్టువు దొరలఁగన్గొని మూలఁ దూఱుకొనుచు." ఆచ్చ బాల, కాం. 80: చూ, బ్రాహ్మణుఁడు.

ఇరుగడలు. దే. వి. బ: చూ, ఇరుఁగెలంకులు.

ఇరుగు. దే. వి. 1. రూ-ఇరువు. ప్రక్కయిల్లు: చూ, పొరుగు. "ఆ. ఇరుగు పొరుగులందు నిమిడికతోనుండి." వేమన. 408; 2. రూ-ఇరువు. ప్రైపు. (వృత్తియందు అంత్యవర్ణలోపము.) "క. ఇరుచెవి యొఱుఁగక యుండదే." ఉ, హరి. 5, అ: చూ, పార్శ్వము. 2.

ఇరుగుడు. దే. వి. రూ-ఇరువుడు. నల్లదిరిసెనము*: చూ, శింశుప. (హిం-సీసమ్ కాపేడ్.) (చర్మవ్యాధులు, వృషణములవాపు తగ్గును.)

ఇరుగురు. దే. స రూ-ఇరువురు. (రెంటికి మహన్మహాత్మ్యర్థక బహువచనా దేశము.): చూ, ఇద్దఱు.

ఇరుచేక్క. ద్వ. వి. ఉభయపార్శ్వసమాహారము: ఇరుదెస, ఇరుపక్క, ఇరుప్రక్క, ఇరువంక.

ఇరుచేక్కయలు. దే. వి బః చూ, ఇరుగెలంకులు.

ఇరుచాలుదుక్కి ద్వ వి. రెండుచాళ్ళు దున్నినదుక్కి

ఇరుతిగ. ద్వ. స. ఆఱు: చూ, షట్కము.(రూ-ఇర్తిగ.)

ఇరుదంతి ద్వ. వి. ఏనుఁగు: చూ, హస్తి.

ఇరుదెస. ద్వ. వి: చూ, ఇరుచేక్క.

ఇరుదెసలు. ద్వ. వి. బః చూ, ఇరుగెలంకులు.

ఇరునాలుగు దే. స. ఎనిమిది: చూ, దచ్చి.

ఇరుపక్క. ద్వ. వి: చూ, ఇరుచేక్క.

ఇరుపక్కయలు. ద్వ. వి. బః చూ, ఇరుగెలంకులు.

ఇరుపరువునేల. దే. వి క్రోశద్వయము: (రూ-ఇరుపర్వునేల.)

ఇరుపలము. దే. వి. రెండుపలములయెత్తు బంగారులోనగునది : రూ- ఇర్పలము, ఇల్లము; (సం. ప):—ద్విఫలి.

ఇరుపేద. దే. వి. మిక్కిలి పేదవాఁడు : చూ, బీదవాఁడు.

ఇరుపోటుల నిల్లుచెడె వాతనొప్పులనోడలుచెడె. లో. ఒకానొకలోకోక్తి.

ఇరుప్రక్క. దే. వి: చూ, ఇరుచేక్క.

ఇరుప్రక్కలు. దే. వి బః చూ, ఇరుగెలంకులు.

ఇఱబగులు. దే. వి. బ.—పై.—

ఇరుమయిలు. దే. వి. బ.—పై.—

ఇరుమూఁడు. దే. స. ఆఱు: చూ, షట్కము

ఇరుమెయి. దే. వి. రెండుశరీరములసమాహారము: ఇరుమేను.

ఇరుమెయిలు. దే. వి. బ. 1: చూ, ఇరుగెలంకులు; 2. రెండుమేఘములు.

ఇరుమేను. దే. వి: చూ, ఇరుమెయి.

ఇరుమేరలు. దే. వి. బః చూ, ఇరుగెలంకులు.

ఇరుమైల. దే. వి. 1. రెండువైపులు, ద్రి. 2. రెండువైపులను.

ఇరులు. దే. వి. రూ-ఇర్లు. చీఁకటి: చూ, మేచకము. 1. (ఇరులునకో అని ప్రయోగము.)

ఇరులుకొను. దే. అ. క్రి: చూ, చీఁకటిపడు.

ఇరులుగొంగ. దే. వి. వెలుఁగుఱేఁడు : చూ, సూర్యుఁడు.

ఇరువంక. దే. వి: చూ, ఇరుచేక్క.

ఇరువంకలు. దే వి. బః చూ, ఇరుగెలంకులు.

ఇరువండ్రు. ద్వ. స. (ఇరు + వండ్రు.) ఇరువదికి మహన్మహాత్మ్యర్థక రూపము : ఇరువదిమంది.

ఇరువది ద్వ. స. (ఇరు + పది.) రెండుపదులు: చూ, వింశతి. (రూ-ఇర్వది.)

ఇరువదిమంది. ద్వ. సః చూ, ఇరువండ్రు.

ఇరువదియాఱు. ద్వ. స. (26) "క. ఇరువదియాఱవ తత్త్వం,బరయఁగ." వేమన. 411.

ఇరువయి. ద్వ. సః చూ, రూ-ఇరువది. (రూ-ఇర్వై.)

ఇరువాఁగు. ద్వ. వి. రెండుసేనలు.

ఇరువాయికట్టు. ద్వ. వి. మలమూత్రబంధరోగము: చూ, మూత్రకృచ్ఛ్రము.

ఇరువాయిపక్క. ద్వ. వి : చూ, ఇరుఁదలపులుఁగు.

ఇరువు. దే. వి. 1. ప్రక్కయిల్లు. రూ-ఇరుగు: చూ, పొరుగు; 2. రూ-ఇరుగు. వైశ్య. "క. అని నియతిచేయుటయు నమ్మని పలుకులు

కన్యకాసమూహంబెల్లన్, వినియట్టిరువులఁజే రక, చేననందొక్కర్తె కధివళంబున వినమిన్." నిర్వ. 2, ఆ. 20; 3 రూ-ఇరవు. చోటు. "రగడ. మావులుదగు మరుమావులకిరువులు, దావులకును గడుఁదావుల వివవులు." య 4, ఆ. 20. చూ, స్థానము. 1; 4. రూ-ఇరవు, ఇల్లు: చూ, గృహము. 1; విశే. 5 కదలనిది: చూ, స్థిరము.

ఇరువుంట్లు. దే. వి. ఇల్లు: చూ, గృహము. 1.

ఇరువుడు. దే. క. చూ, రూ-ఇరుగుడు *.

ఇరువురు. దే. స: చూ, రూ-ఇరుగురు

ఇరువై. ద్వ. స: చూ, రూ-ఇరువయి.

ఇరుస. దే వి. (ఇగ + కురోచము.): చూ, రూ-ఇగస. "ఎగ్గిరి పర్షన్గు శాఖ్య యిరుస నాఁబలుకఁ బడును." ఆం, భ. గ్వా. పై 270.

ఇరుసు. దే. వి. 1. బండియిరుసు, బండికిరెండ దొలుపుకమ్మి నడుమ అడ్డముగాఁజేర్చు నలు పలకల యినుపకమ్మి; 2.వీతపుమార్గనికిరెండి నడిమి యగ్గు కొయ్య; పా. 1. భూమియొక్క ఉత్తర దక్షిణధ్రువములఁ జూపునది. [ఇరుసు=అక్షము.] (ఆక్సిస్.)

ఇరేనుఁడు సం. వి. అ. పుం. 1 బమ్మ: చూ, బ్రహ్మ. 1; 2. వేలుపుటొజ్జ: చూ, బృహస్పతి.

ఇరైషి. సం. వి. ఇ. పుం.భూమినికోరినవాఁడు.

ఇరోన్మత్తుఁడు. సం. వి అ. పుం. కల్లుత్రాగి పిచ్చియైనవాఁడు.

ఇరాద్ధత్యము. సం. వి. అ న. విద్యచేఁగలిగిన గర్వము: చూ, హంకారము.

ఇర్తగ. ద్వ. స: చూ, రూ-ఇరుతిగ.

ఇర్వలము. ద్వ. వి: చూ, రూ-ఇరుపలము.

ఇర్లు. దే. వి. బ. 1. రూ-ఇరులు చీకటి: చూ, మేచకము. 1; 2. కేటాడుజంతువిశేషము.

ఇర్వది. ద్వ. స. (ఇరు + పది.) చూ, రూ-ఇరువది.

ఇర్వారువు. సం. వి. ఉ. న. కర్కటి *: చూ, దోస. (రూ-ఈర్వారువు.)

ఇర్వారుకుక్క సం. వి. ఆ. స్త్రీ. పగిలిన దోసకాయ: చూ, దోస.

ఇర్వురు. దే. స: చూ, రూ-ఇరువురు.

ఇఱుకటము. దే వి. 1.ఇఱుకుచోటు; రూ-ఇఱుకాటము, ఇఱుకటము-ఇఱుకాటము-ఇఱుకు: చూ, స్థానము. 1; 2. సంకటము : చూ, దుఃఖము. (రూ-ఇఱుకాటము )

ఇఱుకాటము. దే. వి.—పై.—

ఇఱీ. దే. వి ఇఱీసినది "ఇఱీగాఁగిలి, ఇఱీగొను." ఇట్లును చెప్పవచ్చును. (అప్పుడిది నలిలోనగువాని వంటిది. అయినను వ్యస్తముగాఁ బ్రయోగము గానఁబడదు.)

ఇఱికి. దే. వి ఒకానొక బాలుఁరయాట : చూ, బాలక్రీడ.

ఇఱికికొను. దే. అ. క్రి. 1 ఇఱుకైన తావులో కూర్చుండు, 2. అడఁగు: చూ, సుగ్రుక్క.4

ఇఱీఁగాఁగిలి. ద్వ.వి. సూక్ష్మమధ్యస్థమును కవుఁగిలించుకొనుట.

ఇఱీఁగొను. ద్వ. వి సూక్ష్మమధ్యము.

ఇఱీమర్తిగండ. శా. చాళుక్యభీమునికి ముప్వురు కుమారులు గలరు. వానిలో మూఁడవవాని పేరు తెలియరాదు గాని, యాతనికి ఇఱీమర్తిగండయని బిరుదుండినట్లును యాతడభిమన్యు కుమారునిఁబోలు పరాక్రమశాలియనియు నాతఁడు పదునాఱేండ్ల బాలుఁడై యుండినపుడు రాష్ట్రకూటులతో నిరవద్యపుర, పెరంగూరగ్రామములనడుమ జరిగిన ఘోరసంగ్రామమునందు తనయసమానయుద్ధ క్రియాకౌశల్యమును బ్రకటించి శత్రుసైన్యాధ్యక్షుఁడగు గుండయ దండనాథుని వధించి యనురులు

గోల్పోయెనని చాళుక్యభీముని శాసమునందు దెలుపఁబడి యున్నది; రాజరాజనరేంద్రుని పట్టాభిషేకసంచిక. 8. పుట.

**ఇఱియు.** దే. అ. క్రి 1. దగ్గఱించు: చూ, సమీపించు; 2. సలఁగు : చూ, సదమదమగు; 3. సన్నమగు చూ, సన్నగిల్లు.

**ఇఱుకటము.** దే వి: చూ, రూ- ఇఱుకటము. (సంకటమునకు.—"క తెఱుచేగు సెనుసంద డిలో, నిఱుకటమునఁ బడ్డనృపతి." సై.4, 2.)

**ఇఱుకాటము.** దే. వి. (ఇఱుకు + ఆట.) -పై -

**ఇఱుకు.** దే. వి 1. ఇఱుకుచోటు : చూ, స్థానము. 1. 2 సంకటము: చూ, దుఃఖము "ఆ. ఇఱుకువచ్చువేళ నీశ్వరుఁదలఁచిః." వేమన. 407; 3. కోణము, గొంది "ప్రాతాళ భవన కోటి,కల్ల నుగ్రంబైన యిఱుకునను న్నమీఁతండిరి." హరి. ఉ 7, ఆ. 36· చూ, విదిక్కు; అ. క్రి. 4.కొంచెపుతావున నడఁగు. "గీ. పాఱఁకియమ్మేటి యిరుగుడు మ్రాఁకుఁ జివురు, జొంపములలోన నిఱికి యజ్జోటిసారె, సారెకును రామరామయటఁ పేరునుడువ,నొసర నాలించి సీతయంచును జెలంగి." అచ్చ. సుం, కాం. 31: చూ, సుళ్కు. 4; 5. రెంటిసందునఁ జిక్కియదుముడువడు. "క. బిగువెడలి చీలయూడిన, నగచరుబీజంబులిఱుక నానొప్పిఁగడుచ్, వెగడొంది మొఱలువెట్టుచుఁ, దెగియెఁ మర్కటము దా నిత్రిమ్మటవించే." పంచ. నా. 1, ఆ. 98: చూ, ఒత్తువడు, అం, ప్రే. 6. కొంచెముతావున నడఁచు "క. నిఖిలలోకభీకరుఁడగు నృద్దనుజేంద్రు నవాయాసంబునఁజెంకిటనిఱికి యిందరిపుతుఁడచలుఁడై" నిర్వ. 7, ఆ. 88:చూ,పిసుకు.8; 7. నొక్కు, రెంటిసందునఁ జిక్కఁబట్టిఁబుదుము. "ఎ, గీ. ఊఱికి కొక్కొరకంఠంబు నిఱికిచేంసె" పంచ. నా. 1, ఆ. 242 : చూ, పిసుకు. 1.

**ఇఱుకుకొను.** దే. స. క్రి. 1. నిలుకడయగు: చూ, మట్టుపడు; 2. పట్టుకొను: చూ, పుచ్చుకొను.

**ఇఱుకుపడు.** దే. అ. క్రి. ఆరటపడు : చూ, సంతాపించు.

**ఇఱుకుమెడ.** ద్వ. వి. అంటుమెడ· చూ, మెడ.

**ఇఱుకుమ్రాను.** దే. వి. వెలుఁగు లోపలికిఁబోవు ద్వారమునందు ఒక్కొక్క మనుష్యుఁడుగా సంకటపడిపోవునట్లుగా నాటిన పంగకలగుంజెలోనగునది: చూ, పంగలగుంజె.

**ఇఱుకుపీఁది.** ద్వ. వి. వెడల్పు తక్కువగాఁగల గల్లీ: చూ, సందు. 5.

**ఇఱుగుట.** దే. వి అపజయము, ఓడు : చూ, పరాజయము

**ఇఱుము.** దే. వి. మఱుఁగు. "వ ఎడలిఱుములు సందులు రంధ్రంబులు లేకుండనిండి" భాగ. 8, స్కం: చూ. వ్యవధానము. 3.

**ఇఱుముకొను.** దే. అ. క్రి. తిరోహితమగు. "ఇఱుముకొనందొడంగె దెసలేచినచీఁకటిని." రా. యు, కాం: చూ, మఱుఁగుపడు.

**ఇత్తి** దే. వి. జింక. "క. మనసిజరాగంబునఁ బెనఁగిన యిత్తిని లేడిఁజూచి" భాగ. ఆది· 5, ఆ. 49· చూ, హరిణము. 1.

**ఇత్త్రింకులు.** దే. వి. బ. (ఇంకులు + ఇంకులు) మిక్కిలి యింకుటలు. "సీ. భామవారపు వీరభద్రి పళ్ళెరమిడు గృహదైవతంబు లిత్త్రింకులింక." ఆము. 4, ఆ. 48. (ఇత్త్రింకులింక= నిప్పస్తుపడగా.); "ఎవ్వాఁడు వింధ్యాద్రి నిత్త్రింకులింకించె." భీ. 2, ఆ. 77; "ఉ. పద్మనేత్రి యిత్త్రింకులుచేసె." సై. 7, ఆ. 193. (ఇత్యాదిస్థలములయందు ఇత్త్రింకులింకించె, ఇత్త్రింకులుచేసె అనఁగా అణఁచెనని యర్థము.)

ఇఱ్ఱిగోరజము. ద్వ. వి. కస్తూరి. "గీ.ఒక్కయెలుక తేఁడు నక్కకొమ్ములనిఱ్ఱి, గోరజంబు జున్నుఁ జోఱపప్పుఁ, బీలిగఱులయంచపతోలలు నెలవిండ్లు, గానుకిచ్చికరయుగంబు మొగిచి." స్వా. 4, ఆ. 14: చూ, మృగమదము.

ఇఱ్ఱిదాల్పుబావ. ద్వ. వి. లచ్చిమగఁడు: చూ, విష్ణువు. 1.

ఇఱ్ఱియలు. దే. వి. బ.ప్రక్క: చూ, పార్శ్వము.2.

ఇల. పా. 1. ఒకానొకవృత్తము. ఇందొక్కొక్క పాదమున స, జ, స, స, సగణములు గలిగి యెనిమిదవయింట యతిగల పదునేనవ ఛందస్సునందుఁబుట్టిన వృత్తము. "ఉ. గజవిక్రమంబునఁగనలు నిలయనఁగా, సజనానులుండిన- సకలకవికృతమై,భుజగాశనధ్వజు- భుజగపతిశయునున్, వ్రజసుందరీముఖ- వనజహితుఁ బొగడన్." అప్ప.4,ఆ: చూ, వృత్తము.1; సం.వి. ఆ.స్త్రీ. 2. రూ-ఇళ. పుడమి: చూ, భూమి.1. "ఆ.ఇలనుజ్ఞానమనెడి యీఁత నేర్చినవాఁడు," వేమన 412; 3. బుధునిభార్య. రూ- ఇళ: చూ, భార్య; 4. రూ-ఇళ. ఆవు : చూ, ధేనువు; 5. వాక్కు: చూ, మాట. 1; 6.వాయువుభార్య. రూ-ఇళ: చూ; భార్య. (చూ, వాయువు.)

ఇలకఱచు. దే. స. క్రి. (ప్రాణము) బిగఁబట్టు. "గీ. కడిఁదివిలుచేఁది గుటికిల కఱచినిలుపు, మరునికువలయశరము కంపములఁ బోలు."అము. 5, ఆ. 13; "ఆ. అతండు మనసిల, కఱచి ధైర్యమూఁతగాఁగ నిలిచి." (ఇక్కడ బిగఁబట్టుట మాత్రమర్థము.) రా. యు, కాం. రూ- ఇల్కఱచు- ఈలకఱచు: చూ, బిగించు.

ఇలకోడి. దే. వి. రూ-ఈలకోడి. చిమ్మట: చూ, ఝిల్లి.

ఇలవరము. దే. వి. రూ- ఇలారము- ఇలయరము- ఇలువారము- నిలువరము- నిలువారము- నిల్వరము, గుడిసె, గుడుసు: చూ, గృహము. 1. (ప్రస్తుతోపయోగకుటీరము.)

ఇలసము. సం. వి. అ. పుం. నీరుగన్నేరు * : చూ, హింజలము.

ఇలాపతి. సం. వి. ఇ. పుం. 1. బుధగ్రహము: చూ, రాహువు. 2, 2. భూపుఁడు : చూ, రాజు. 1.

ఇలాకా పా. సంబంధించిన (శాఖ) డిపార్టుమెంటు.

ఇలాయి దే వి. చుట్టును వత్తులువేసెడుదివ్వటీ, కాగడా "తగనూర్యప్రభలా యిలాయిలును జంద్రజ్యోతులున్." హంస. 5, ఆ. 28: చూ, దివిటి. (రూ-ఇలాయ )

ఇలారము దే. వి: చూ, రూ-ఇలవరము

ఇలావృతము. సం. వి. అ. న. భూమియొక్క నవవర్షములు. "భారతం నరభూః కింపూరుషం హరివర్షకతః, భద్రాశ్వముత్తర కురుర్హిరణ్మయ మిలావృతమ్. 8. కేతుమాలమమాని స్యుర్భువి "వర్షాణివైనవ." త్రి, శే.ద్వి.భగా; వర్షములు తొమ్మిదింటిలో నొకటి: చూ, వర్షములు.

ఇలి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఎలుక: చూ, మూషికము; దే. వి. (1) సిక్థము. "ఈఁగకు ఇలి పాముకు బలిదొరకదు.": చూ, మెతుకు. 2.

ఇలింగము. సం. వి. అ. న. యముని శంఖము: చూ, సంకు. 1.

ఇలింద. వై. వి.= ఇంగ్రవల్లి *. చూ, మాతులుంగము. (రూ- ఇల్లంద-ఇల్లింద.)

ఇలిందకము. సం. వి. అ. న. నల్లఁగలువ. *: చూ, పద్మము. 1.

ఇలికము. సం. వి. అ పుం. ఎలుక: చూ, మూషికము.

ఇలిపాషాణము. సం. వి. అ. పుం. ఉల్లిపాషాణము: చూ, సౌవీరము. 2.

ఇలు. దే. వి. రూ-ఇల్లు. "క. లక్క యిలుగాలి నది మొదలు." భార. ఉద్యో. 3, ఆ 136 (హల్లుపరమగుచో ఉత్వలోపము వికల్పముగానగు. "లక్కయిల్ గాలిచి" భార. ఉద్యో. 3, ఆ. 366. మఱియు ఇది వృత్తియందు కులవాచకమగును. "ఇలువేలుపు." "క. మనయింటిచేటు చూచితె." నిర్వ. 9, ఆ. 52): చూ, గృహము. 1.

ఇలుకు. దే. వి. కీళ్ళసరము బెడఁకుట. "నాచెయి యిలుకు పట్టినది. "ఇలుకుమంత్రము:" వై. (ఇఱుకునొప్పి అని గోదావరీమండలమున వాడెదరు.)

ఇలుకుపట్టు. దే. అ. క్రి కీళ్ళసరము బెడఁకు (ఇఱుకుపట్టుఅని వాడుక.)

ఇలుగు. దే. అ. క్రి. చెచ్చు. రూ- ఈలుగు. "క. బలివిక్రమఘనులగు వారలిగిన మనసేన మేదినీశ్వరవిమ కన్నులు చెడినట్లున్నది." భార. శల్య. 1, ఆ. 51: చూ, మరణించు.

ఇలుదొర. దే. వి గృహస్థుఁడు : చూ, యజమానుఁడు.

ఇలునింపడము. దే. వి. వధూవరుల నూతన గృహప్రవేశము. రూ-ఇలునింపతము: చూ, దంపతి.

ఇలునింపతము. దే. వి —పై.—

ఇలునింపుటు. దే. వి —పై.—

ఇలుఱేఁడు. దే. వి: చూ, ఇలుదొర.

ఇలువడి. దే. వి. 1. మంచికులమునఁ బుట్టుట. "చ. సుహృజ్జన మిత్రమహాబలం, బిలువడి గర్వ సేని యిలయెల్లను నేలఁగఁ." భార శాం. 3, ఆ. 103; రూ-ఇల్వడి: చూ, కులీనత; 2 మంచినడత. రూ-ఇల్వడి. "ఇలువడిసున్నఁజేసి" భాగ. 10, స్కం. పూ: చూ, వర్తనము. 1; 3. వడిగలతనము. రూ- ఇల్వడి: చూ, శౌర్యము. 1; 4. ఇంటిమర్యాద: రూ- ఇల్వడి. ఇల్వరుస

ఇలువరగము. దే వి. 1: చూ, రూ- ఇలవరగము; 2 తృణముచే నేర్పఱుపఁబడినపుట్టవంటిగూడ. "సీ. భూమి నశుభ్రతస్ఫుత దృష్టపూర్వమైన బహుళసంపత్పరంపరపొదుకొనిన, గరిసెయనఁ గోటయటమింపి గణనకెక్కు,నందు పైనుంచు నిలువరమనదిఱంబు." చంద్రా. 1, ఆ. 5: (రూ-ఇలువారము.)

ఇలువరుస. ద్వ. వి. 1. ఇంటిమర్యాద: చూ, ఇలువడి 4; 2. గృహాశ్రమము: ఇండ్లవరుస

ఇలువేలుపు. దే. వి. ఇంటివారుగొలుచుదేవుఁడు, ఇష్టదైవము. "ఇలువేలుపుఁగొలుతుమమ్మ.": చూ, గృహదేవత.

ఇలేశుఁడు. సం. వి. అ.పుం పుడమిఱేఁడు:చూ, రాజు. 1.

ఇలైశ్వర్యము. సం. వి. అ. న. భూమివలనకలిగిన సంపద.

ఇల్కఱచు. దే. స. క్రి: చూ, రూ-ఇలకఱచు. "వడివడియూనమిల్కఱచి పట్టుచు." రామ, కాం.

ఇల్ల. అర. లేదనుట (రూ-ఇల్లై.)

ఇల్లంట్రము. దే. వి. అల్లుఁడు మామగారియింట నేయుండుట. "ఇల్లంట్రమనఁగమ నిల్లటమన శ్వశురునిగృహాధి వాసంబుచనును." ఆం, భా. ద్వి. మ. 111: రూ-ఇల్లటము- ఇల్లాటము- ఇల్లరికము- రూ-ఇల్లఱికము.

ఇల్లటము. దే. వి. (ఇల్లు + అట.) —పై.— "సీ. దానిసరుండు శాలీనాఖ్యయుండిల్లటపుటల్లుఁడత్తయింటను వసించు." కళా. 4, ఆ 60

ఇల్లడ. దే. వి. (ఇల్లు + అడకము.) 1. న్యాసము. పదిలపఱచిపెట్టి అడిగినప్పుడు ఇమ్మని యేదేని యొకవస్తువును ఒకరివద్ద దాఁచుట, "వ. నన్నెదనమ్మదేని యిల్లడయిదు భీమసర్జునసలంఘ్య బలాఢ్యులనావశంబునన్."

భార.సభా. 1, అ: చూ, వాడిక; 2. రూ-ఇల్లడము, అప్పగింత: చూ, ఒప్పగింత; 3. రూ-ఇల్లడము - కాఁపురము : చూ, విడిమట్టు; 4 రూ-ఇల్లడము. ఏలుబడి: చూ, రక్షణము.

ఇల్లడము. దే. వి ——పై.——

ఇల్లడయిడు. దే. అ. క్రి: చూ, దాఁచియుంచు

ఇల్లము. మి. వా. వి. (ఇరు + పలము.): చూ, రూ-ఇరుపలము.

ఇల్లరి. దే. వి. (ఇల్లు + అరి.) ఇంటిపన్ను: చూ, బాడిగ.

ఇల్లరికము దే. వి (ఇల్లు + అరికము.) : చూ, ఇల్లంట్రము.

ఇల్లలికము. దే వి (ఇల్లు + అలికము.)——పై.——

ఇల్లలికినఁ బండువగునా. లో. "తుత్రిళ్ళఁగ నేటికి నిలునిలు, మిల్లలికినఁబండువగునె యింతటిలో న్నే, వల్లభునకుఁగడునచ్చిన, యిల్లాలవె యేను లాఁతినేపోఁదోలఁ." కళాపూర్ణోదయము.

ఇల్లవ. వై. వి. = ఇల్లిశము. ఇల్లెము : చూ, మత్స్యము. 1.

ఇల్లాటము. దే. వి. (ఇల్లు + ఆట.): చూ, రూ-ఇల్లంట్రము.

ఇల్లామల్లి. దే. విశే. కొండెకాఁడు: చూ, తంటలమారి. 1.

ఇల్లాలు. దే. వి. (ఇల్లు + ఆలు.) పెండ్లాము (అగ్నిహోత్రసాక్షిగ వివాహమాడినది.): చూ, భార్య.

ఇల్లి. దే. వి. ఉపవాసము: చూ, పస్తు.

ఇల్లింద. వై. వి.=ఇంద్రవల్లి*: చూ, రూ-ఇలింద.

ఇల్లిగ్గులు. దే. వి. బ. (ఇగ్గులు + ఇగ్గులు.) మిక్కిలి వెనుక కొఱగుటలు. "క. లొల్లియగు వగలత్రొక్కిన, విల్లిగ్గులుగానవచ్చు." ఉ, హరి. 5, అ 166.

ఇల్లిముక్కు. దే. వి. పగిలి నెత్తురుకారెడి ముక్కు లోపలిభాగము,

ఇల్లిశము. సం. వి. అ. పుం. = ఇల్లవ : చూ, మత్స్యము. 1. (రూ-ఇల్లీశము.)

ఇల్లిస. వై. వి.= ఇల్లిశము.——పై.——

ఇల్లు. దే వి రూ-ఇలు : చూ, గృహము 1. "ఆ. ఇల్లు కల్లఁజేసి యిహముపరముఁజేసి, దీన వృత్తిచేతఁ దిరుగుచుండి, భక్తి కలిగియున్న ఫలమెట్లులేదయా, విశ్వ..." వేమన. 415; "ఇల్లుసుమీ సంసారమె,యిల్లుసుమీ యాయు ధంబు." వేమన. 418.

ఇల్లుఅలుకగానే పెండ్లిఅయినట్లా. లో. చేయవలసిన పనియంతయు ముందున్నదని భావము.

ఇల్లుకట్టిచూడు పెండ్లిచేసిచూడు. లో. కష్టసాధ్యమైన పనులని భావము.

ఇల్లుకాలిపోవుట. అం. నష్టములేడింటిలోనొకటి: చూ, నష్టములు.

ఇల్లువిప్పిపందిలివేసినట్లు. లో. గొప్పపనిని కొద్దిదానిగాఁ జేసినట్లు.

ఇల్లెడ. దే. వి అధీనము: చూ, వశము. 1.

ఇల్లెము. వై. వి. = ఇల్లిశము. "అరుగని ల్లెపుఁ జేప యాకుజెల్ల." హంస. 4, అ : చూ, మత్స్యము. 1.

ఇల్లోనారాయణమ్మ. పా. పిల్లికి బిచ్చమైన పెట్టని బాల విధవ, ఎంగిలిచేతిని కాకకిఁగూడ విదల్పనిది. (ఇందులకొక కథకలదు.)

ఇల్వక. సం. వి. అ. స్త్రీ మృగశిరకు పైనక్షత్రము: చూ, నక్షత్రము. 1.

ఇల్వాడి. దే. వి: చూ, రూ- ఇలువడి. (మంచి నడత.—"ఉ. రాకుతులకెక్కుడి యిల్వాడి యంచుదుర్గుణ, స్తోమమునిందసేయు." పద్మ. 9, అ )

ఇల్వరుస. దే. వి: చూ, రూ-ఇలువరుస.

ఇల్వల. సం వి. ఆ. స్త్రీ: చూ, ఇల్వక.

ఇల్వలము. సం. వి. అ. పుం: చూ, ఇల్లిశము.

ఇల్వలుఁడు. సం. వి. అ. పుం. ఒక రక్కసుఁడు: చూ, రాక్షసుఁడు. 1.

ఇవ. సం. అవ్య. వలెను: చూ, సామ్యము.

ఇవక. వై. వి.= హిమమ్. శీతము. "గీ. జలుబు సీతివతాళింపు ఁలువయి వక్యయనఁగ శీతంబు." ఆం, భా. ప్రి. ది. 80: చూ, శైత్యము

ఇవతల. ద్వ. వి. 1. (ఇవలి + తల) ఈవలి ప్రదేశము: రూ- ఇవతలి- ఇవల - ఇవ్వల - ఈతల; 2. ఈపిమ్మట: రూ- ఇవతలి- ఇవల- ఇవ్వల - ఈతల; 3. ఇద్దఱ : చూ, ఈవల. (రూ-ఇవతలి.)

ఇవతలి ద్వ. వి.—వై.—

ఇవతళించు. ద్వ. అ. క్రి. చల్లనగు. "ఎ, గీ. ఇగుర్చు కోర్కులఁదనడెంద మివతళింప" కవిక. 3, ఆ. 222: చూ, శైత్యించు. (రూ- ఇవతాళించు. (ఇవక + తాళించు) "సీ. కడు నివతాళించు కప్రింపుటరఁటుల యిరవులఁ బూవుఁ జెప్పగనువన్ని" కశా 6, ఆ.251.)

ఇవతాళింపు. ద్వ. వి. జలుబు: చూ, శైత్యము.

ఇవము. వై. వి. 1.=హిమమ్. రూ-ఇగము: చూ, హిమము. 1; 2. రూ-ఇగము జలుబు: చూ, శైత్యము.

ఇవముకొను. ద్వ. అ క్రి. తడియు. "గీ. ఎండ సెండితి మంచుననివముకొంటి." కాశీ. 3, ఆ: చూ, నాను.

ఇవముమేపరి. ద్వ. వి తెలుఁగుఱేఁడు. "ఎ, గీ. వాఁలివము మేపరికొలపుఁజిక్కవల నూడు,మ ఱుపు సేరికి." అచ్చ యు, కాం. 311: చూ, సూర్యుఁడు.

ఇవమునూడు ద్వ. వి.—వై— "ఎ గీ. ఇవ మునూడు కొలపుకెకిమానిబంటుఁ." అచ్చ. యు, కాం.

ఇవల. దే. వి: చూ, రూ-ఇవతల.

ఇవి వై. స. బ. ఏతచ్ఛబ్దార్థకము ఈశబ్దమునకు అమహదర్థక ప్రథమా బహువచనము. రూ- ఇవ్వి: చూ, ఇయ్యది.

ఇవిరించు దే అ. క్రి: చూ, రూ-ఇగిరించు

ఇవురు: చూ, రూ-ఇగురు. (అ. క్రి. కోష్టిల్లు-హల్లు పరమగువో వృత్తియందు కడపటిఉ కాగమునకు లోపము వికల్పముగాఁగు. ఇవుర్వంటకము.)

ఇవురుచు. దే. అ క్రి: చూ, రూ- ఇగురుచు. (రూ-ఇవుర్చు.)

ఇవులుచు. దే. అ. క్రి. చూ, రూ- ఇగురుచు. 1, 2; 3 పండ్లిగిలించు: చూ, ఇగిలించు.

ఇవ్వల. దే. వి చూ, రూ- ఇవల, ద్రి. 2. ఈవైపుఁ.

ఇవ్వి. వై. స. బ చూ, రూ-ఇవి.

ఇషణము సం. వి అ న. 1 ఇచ్ఛ : చూ, వాంఛ, 2: చూ, ఈషణత్రియము. (చూ, త్రియము.)

ఇషము సం. వి అ. పుం. ఆశ్వయుజమాసము: చూ, మాసము. 1

ఇషార్. హిం. ఉషార్. సంజ్ఞ, జ్ఞాపకసూచన, కనుగీటుట. (సిగ్నల్-సైన్-వింక్.)

ఇషిక. సం. వి. అ. స్త్రీ. ముండ్లదుబ్బు : రూ- ఇషీక-ఈషిక.

ఇషీక. సం. వి. అ. స్త్రీ. 1.—వై.—; 2.రూ- ఈషిక, చిత్తరువువ్రాసెడి కుంచె : చూ, లేఖిని; 3. ఏనుఁగు కనుగ్రుడ్డు: రూ- ఈషిక; 4. ఏనుఁగు కండ్లపైనుండెడు గుంటలు: రూ-ఈషిక; 5. రూ-ఈషిక. కొక్కెము వ్రాయు కలము: చూ, లేఖిని; 6. రూ- ఈషిక. తాటాకుమీఁద వ్రాయు గంటములోని గునది: చూ, లేఖిని.

ఇషుధి. సం. వి ఇ. పుం, స్త్రీ. అమ్ములపొది, తూణీరము: చూ, బాణము. 1.

ఇషువు సం. వి. ఉ. పుం, స్త్రీ 1. అమ్ము: చూ, బాణము. 1; 2. మహీనతానము లేడింటిలో నొకటి: చూ, మహీనతానములు.

ఇష్టక. సం. వి. అ. స్త్రీ.=ఇటిక: చూ, ఇటుక.

ఇష్టకపరివాళము సం. వి. అ. పుం: చూ, ఇటిక పుఁడము.

ఇష్టకాపథము. సం. వి. అ. న. 1. నీరువట్టివేరు*: చూ, వట్టివేరు; 2. అభయము*చూ,వట్టివేరు.

ఇష్టగంధము. సం. వి. అ. న 1 ఏలావాలుకము, నూఁగుదోస *: చూ, దోస; విశే. 2 మంచివాసనగలది.

ఇష్టదేవత. సం. వి. అ. స్త్రీ:చూ, ఇలువేలుపు.

ఇష్టపడు. మి. అ క్రి అంగీకరించు: చూ, సమ్మతించు.

ఇష్టపడు. మి. అ. క్రి. ప్రియపడు : చూ, సంధించు. 2.

ఇష్టము. సం. వి. అ. పుం. 1. జేన్నము : చూ, యజ్ఞము; న. 2. యజ్ఞమధ్యమునందుఁ జేయు హోమదానాదిక్రియ; 3: చూ, సంస్కారము; న, క్రి. విశే. 4. తన మనసువచ్చినట్లు: చూ, యథేచ్ఛము; విశే. 5. కోరఁబడినది: చూ, వాంఛితము; 6 ఈఁబడ్డది : చూ, దత్తము; 7. హోమము చేయఁబడ్డది: చూ, హుతము; 8. ప్రియమైనది: చూ,వల్లభము.2; 9. పూజింపఁబడినది: చూ, పూజితము.

ఇష్టసిద్ధి. సం. వి. ఇ. స్త్రీ. కోరిన కోరికయీడేరుట "అ. ఇష్టసిద్ధికొఱకు నీరారుబీజముల్, కిష్టమునకు జీవి గానలేడు" వేమన. 421, "అ. ఇష్టసిద్ధిగోరి కష్టమొందఁగలేరు." వేమన. 422.

ఇష్టాగోష్ఠి. సం. వి. ఈ స్త్రీ. 1. సరస సల్లాపములు: చూ, సల్లాపము; 2. ఆనందముతోఁ గూడిన లోకవ్యవహారసంబంధమగు సంభాషణాదులు: చూ, సల్లాపము.

ఇష్టాపూర్తము. సం విశే కోరికనింపఁబడినది.

ఇష్టి. సం. వి. ఇ. స్త్రీ. 1. జేన్నము : చూ, యజ్ఞము; 2 కత్తి: చూ, రిష్టి. 2; 3. ఇచ్ఛ: చూ, వాంఛ; 4 టూకీగాచేసిన పద్యము సంగ్రహశ్లోకము: చూ, శ్లోకము. 1; 5. కయిసేత: చూ, సపర్య; 6. దానము: చూ, వితరణము; 7. సంగ్రహము, కొంచెము: చూ, స్వల్పము.

ఇష్టిక. సం. వి. అ. స్త్రీ = ఇటిక: చూ, ఇటుక.

ఇష్టికాశిల. పా (లేటెరిట్) ఇది మృత్తికచే బంధింపఁబడినట్టియు రమారమి సగముభాగము వఱకు లోహికామ్లజనిదముఁ గలిగియుండినట్టియు నొకవిధమగు వాలుకాశిల. ఇటిక రంగు గనుండుటచే దీనికీపేరు గలిగెను. కంకరనేల లీజాతి పాషాణములనుండి యేర్పడినవి. అవి చెంగల్పట్టు నెల్లూరు నీలగిరి జిల్లాలలో విశేషముగాగలవు

ఇష్టుఁడు. సం విశే. (అ. ఆ. అ.) చెలికాఁడు: చూ, స్నేహితుఁడు. 1.

ఇష్టోక్తి. సం వి. ఇ. స్త్రీ. ఇచ్ఛోకము : చూ, బుజ్జగింత.

ఇష్వాసము. సం వి. అ. పుం. 1. విల్లు: చూ, బాణము. 1; 2. అమ్ములపొది: చూ, బాణము. 1.

ఇష్వాసుఁడు సం. వి. అ. పుం. ధన్వి : చూ, విలుకాఁడు.

ఇసక. దే. వి. ఏ. ఒకటితోనొకటియంటని మంటియణువుల సముదాయము. రూ- ఇసుక: చూ, సికత. 4.

ఇసడిలు. దే. అ క్రి. నిర్వేదించు. "కా.ఇసడిలక మణియుఁజేనియువ్యాసుథేకుఁడు దండః మున వర్తింపఁగ." రా. అర. 2 అ:చూ,విసుగు.2.

ఇసిరో. దే. అవ్య. (ఇసి + రో.) 1. రూ- ఇస్సిరో.నిందార్థకము."ఇసిరో యిదిపోరిపాడియే"

భార. మా. 1, ఆ: చూ, హిహీ; 2 ఈశ్వర స్మరణమందుఁ గలిగిననిపాత: ఇసీ-రూ-ఇస్సీ-ఇస్సిరో.

ఇసిలింతలు. దే. వి బ కదలిక. "క. మాపిన్న ది యిసిలింతల, చూపులనగుంట వెలుచుమన్నినుఁజూచున్." వై. 8, ఆ. 61: చూ, చల నము. 1.

ఇసిలింతలువాఱు. దే అ. క్రి. (ఇసిలింత లు + పాఱు.) పణఁకు. "మందినములఁ బెదవులు నిక్కి, లింతలు వాఱంగినావు జెప్పవుగోరన్." విక్రి 8, ఆ: చూ, చలించు.

ఇసీ. దే. అవ్య. 1. నింద్యార్థకము రూ- ఇస్సి. "ఇసీ యిటునాపని నీవచేసితివి." భార. శాం. 3. ఆ: చూ, హిహీ; 2 ఈశ్వర స్మరణమం దుఁగలిగిన నిపాత: రూ-ఇస్సీ. చూ, ఇసిరో.2

ఇసుక. దే. వి. ఏ: చూ, రూ-ఇసక. "ఇసుక పాతఱ." (1/250 మి. 1/25. అం. వఱకు మధ్యకొలతిగల రేణువులు.)

ఇసుకగరుములు. పా. ఇసుక నేలలకును గరప నేల లకును మధ్యస్థముగనుండు నేలలు.

ఇసుకదాసరి. ద్వ. వి. ఒకరకమునూర : చూ, సైకతశాకము.

ఇసుకదిన్నియ. ద్వ వి. (ఇసుక + తిన్నియ.) సైకతము: చూ, భూమి. 1. (రూ- ఇసుక దిన్నె.)

ఇసుకదిబ్బ. ద్వ. వి —వై.—

ఇసుకదొందు. ద్వ. వి. ఒకరకముచేప : చూ, మత్స్యము. 1.

ఇసుకనేల. ద్వ. వి. సైకతము: చూ, భూమి. 1. (తేలికవర్ణపు నేల, వాలుకాశిలలు మృత్తిక సున్నము శైలము మొదలగు సంశ్లేషకర్తలవలన బంధింపఁబడుటచే శిలారూపమును దాల్చిన యిసుకరేణు సముదాయము ను. వీనివిశ్లేషము వలన పుట్టిన నేలలు ఇసుకనేలలు.) (పొండి పోయిలల్సు.)

ఇసుకపాతఱ. జా. పాద్దులేనిది."తే.అనఘవేశ్యా విడంబవర్తనములెన్న, నిసుకపాతఱ యిూజో లియేల త్రివ్వ." వైజయంతీవిలాసము.

ఇసుకపులకండము. దే. వి. మత్స్యంది,పంచదార: చూ, బెల్లము. 1.

ఇసుకబేలు. ద్వ. వి.ఒకానొకతీఁగె: చూ, లత.1.

ఇసుకమాత్రిము. ద్వ. వి ఉలిమిరి. (కన్న-ఉలిమిరి బసలె) *: చూ, శ్వేతపుష్పము.

ఇసుబగోలువిత్తులు. మి. వి. బ. (అం-ఇస్పాగల్ స్పాకెల్) (రక్తగ్రహణికి అతిసారబేదులకు మంచిది.)

ఇసుమంత దే. అవ్య. ఈషదర్థకము : చూ, స్వల్పము.

ఇసుమంత కాఁక. ద్వ. వి. గోరువెచ్చ : చూ, మందోష్ణము.

ఇసుము. దే. వి ఏ: చూ, ఇసక.

ఇసులు. దే. వి. ఏ.—వై.—

ఇసుళ్ళు. దే. వి. బ. ఆక్కు చెదలు: ఉసిళ్ళు-రూ-ఉసుళ్ళు.

ఇస్తిఫా. హిం. విడుదలపెట్టుట.

ఇస్త్రి. } ఇస్త్రీ. } పా. బట్టలను నిప్పులపెట్టెతో నునుపు చేయుట.

ఇస్తిహారు. పా. ప్రకటన. ఉ.—"కోర్టువేలపు యిస్తిహారు."

ఇస్తువు. దే. వి. సొంతము: చూ, స్వామ్యము.

ఇస్సిరో. దే. అవ్య నింద్యార్థకము. రూ-ఇసిరో. "శా. అంభోగర్భముఁజొచ్చి పాండుసుత బాహాగర్వదుర్వార సంరంభంబోర్వక డాఁగి యుండెదనటంచు రారాజిస్సిరో." భార. శల్య. 2, ఆ 58: చూ, హిహీ; 2. ఈశ్వర స్మరణ మందుఁగలిగిన నిపాత: చూ, రూ-ఇసిరో. 2.

ఇస్సీ. దే. అవ్య.—వై.—"ఇస్సీ యెంతలుప్పుట్టె తితికి రఁగుండిస్లేచునే." "క. అందఱు రథి

ళులు పఱవఁగ, నింటికి మున్నువచ్చి రిస్సి యని." భార. విరా 5, ఆ. 79.

ఇస్సు. దే వి. ప్రియాణ బడలికచేఁగలుగు ధ్వన్యనుకరణము: చూ, హుహూహూ.

ఇహ. సం. అవ్య ఇచ్చోట. చూ, ఇందు. 3.

ఇహము. సం. అవ్య. ఇహలోకము. "ఆ. ఇహమునందు గురునికీదేహమిచ్చిన." వేమన. 428. "గీ. కుడిచికట్టిన నున్కి-గాకిడుమపడుచు, నింటనున్నను బుధపార్థ మేమికలదు, కడఁగియిహమైనఁ బరమైనఁగాకదాన, యూరకుండుట నరునకు బారుసంబె." భో 2, ఆ. 9: చూ, దేశము. (ఐహికము.)

ఇహలోకము. సం వి అ. పుం 1.—వై.—; అం. 2. లోకములు రెండింటిలోనొకటి: చూ, లోకములు. (ఐహికము.)

ఇహాముత్రార్థఫలభోగవిరాగము. అం. సాధనములు నాలుగింటిలో నొకటి: చూ, సాధనములు (చూ, సాధనచతుష్టయము.)

ఇహిహీ. దే వి. 1. నవ్వుటయందగు ధ్వన్యనుకరణము. రూ- ఈహీ. "ఇహిహీ యని నవ్వె మదంబు పెంపునన్." నక్మి. 3, ఆ 94: చూ, హుహూహుహూ; అవ్య. 2. నిందార్థకము. రూ- ఈహీ. "క. మగఁటిమిగల రాచపెందమా యిది యిహిహీ" రామా. 5, ఆ. 148: చూ, హిహీ.

ఇళ. సం. వి. ఆ. స్త్రీ: చూ, రూ-ఇల.

ఈ.

ఈ. అచ్చులలోని నాలుగవ యక్కరము. "సీ. ఆయులు పదియాఱునచ్చులు." అప్ప 2, ఆ. 6. "క. మొదల నకారాద్యచ్చులు, పదియాఱు" అప్ప.2, ఆ.20: చూ, వర్ణము. 1; సం. వి. ఈ. స్త్రీ. 1. పేఱుగలద్ది నదీపతి; 2. లచ్చి: చూ, లక్ష్మి, 1; 3. నలువరాణి: చూ, సరస్వతి. 1; 4. గౌరి; చూ, పార్వతి. 1, 5. నాలుక: చూ, రసన; 6. అబ్జదళము: చూ, తామరరేకు; 7. తామరపూల (కింజల్క-ము) కేసరము: చూ, అకరు; 8 ఇంద్రధనుస్సు: చూ, బాణము. 1; 9. అంపు చూ, బాణము. 1; 10. సర్పము, పాము: చూ, సర్పము; 11. కొండయందు తొలువఁబడిన గొప్పబిలము: చూ, గంధ్రము. 1; 12. మొలనూలు: చూ, భూషణము. 2; అవ్య. 13. కోపార్థము: చూ, కోపము; 14. దుఃఖార్థకము: చూ, దుఃఖము; స.(1) ఎదుట నుండు దానిఁ దెలుపును. "ఆ ఈ కనులను మిమ్ము నెట్లు చూడఁగవచ్చు." వేమన. 438; "ఈ తపము: చూ, ఏ; అవ్య. (2) ఏతచ్ఛబ్దార్థకము. "ఆ. ఈ ఘనమునందు." వేమన.445; "ఆ. ఈ కపటనాటకము మఱి, యీ కపటపు జేరువులన్ని." వేమన 439; "ఈతఁడు.": చూ, ఇయ్యది; (3) ప్రశ్నార్థకమందు శబ్దానుబంధమై వచ్చునిపాత. "ఏరీ నీసాటివారు." (4) ప్రార్థనార్థకధాతువునకుఁ బశ్నార్థమందుఁ గలిగిన నిపాత. "నన్ను రక్షింపుమీ వేగ నళినవాథ."

ఈండ్ర. దే. వి రూ-ఈడిగ, తాటిచెట్టు లోని గువాని గీఁచి జీవించెడు జాతి: చూ, సెట్టిబలిజె. (ఈండ్రవాఁడు, ఈండ్రది.)

ఈండ్రము. దే. వి. రాపిడి. "కం. ఎన్నఁడు నినుఁ బెట్టుమనుచు నీండ్రము సేయక్." భాగ. 8, స్క-ం. 565: చూ, పీడనము.

ఈండ్రవాఁడు. దే. వి. చూ, గురాజీవి. (ఈండ్రజాతిది, ఈండ్రది.)

ఈండ్రించు. దే. స. క్రి. నలఁగుడువెట్టు. "శా. ఈరీతిం గుచతోట్టలం జనని తమిస్తాం డ్రింప నారాటముం, బోగాటంబు ఘనరిఱు

తైన." కాశీ. 4, ఆ. 50: చూ, పీడితముగు

**ఈఁక.** దే. వి. పక్షము: చూ, ఱెక్క. 1. (రూ-ఈఁకె.)

**ఈఁకు.** దే. అ. క్రి. రూ-ఇంకు: చూ, శోషించు.

**ఈఁకె.** దే. వి: చూ, రూ-ఈఁక. "ఆ. ఈఁకె లంటఁజేసెఁ దోఁకలంటను జేసెఁ, గోకలంటఁ జేసె లోకమునకు, మానరక్షణంబు మర్యాద యని తెల్పి, విశ్వ..." వేమన. 440; "ఆ. ఈఁకెలను చుగొన్ని." వేమన. 441

**ఈఁకెలదారము.** దే. వి. ఒకరకము పందెపు కోడిపుంజు. చూ, కోడి.

**ఈఁగ.** దే. వి. రూ-ఈఁగె: చూ, మక్షిక. "ఆ. ఈఁగ తేనెరుచికి నింపుగాఁ జేర్చును." వేమన. 443.

**ఈఁగకు నిలి పాముకు బలిపెట్టెఁడు.** లో. దాలినివాఁడని భావము. ఉదా. "ఎ,గీ. ముంచియీఁగకుఁ గాటుపామునకు బలియు, నొసఁగడనిపా భర్తకె యువిదవుదిని." పాండు 4, ఆ. 149.

**ఈఁగపులి.** దే. వి. లూత: చూ, సాలెపురుగు.

**ఈఁగముంగిలికూర.** దే. వి: చూ, పుదీన* (ఇది తీవ్రముగావచ్చు త్రేనుపులు తగ్గించును.)

**ఈఁగు** దే. అ. క్రి. 1. ప్రవేశించు, చొచ్చు. "క. ఈ గంగాదికతీర్థము, లీఁగంగా నీవు దనుసమిద్ధాంబువులన్, దోఁగెడువారల గన గన, గ్రాఁగెడు నంగారసింధు కల్లోలములన్." పాండు. 1, ఆ. 150: చూ, సోఁకు. 4; స. క్రి. 2. తొలఁగించు. "గీ. ఎల్లభంగుల మాభంగ మీఁగుమధప." భాగ. 6, స్కం.341 (రూ-నీఁగు): చూ, విసర్జించు.

**ఈఁగె.** దే. వి. రూ-ఈఁవె: చూ, రూ-ఈఁగ.

**ఈఁజేటి.** దే. వి ఒకరకముకంద*. "తే. వెదురు బియ్యంబుగొట్టి, చెట్లు నీఁజేట్లుఁ దుంగముస్తియలు." కాశీ. 3, ఆ. 251: చూ, రూ-ఇంజేటి,

**ఈఁటియ.** దే వి. కుంతలమను నాయుధము: చూ, బాణము. 1. (రూ-ఈఁటె.)

**ఈఁటె** అం. ఆయుధములు ముప్పదిరెండింటిలో నొకటి: చూ, బాణము. 1.(రూ-ఈఁటియ.)

**ఈఁటెకాఁడు.** దే. వి. ఈఁటె ఆయుధముగాఁ గలవాఁడు: చూ, కాంతికుఁడు.

**ఈఁడు.** దే. అప. కల అను నర్థమునందు వచ్చెడి ఒక పుం ప్రత్యయము "అగడీఁడు, కమ్మతీఁడు." మొ.

**ఈఁడులేనివాఁడు.** దే. వి: చూ, అతులుఁడు.

**ఈఁత** దే. వి. 1. ఖర్జూరి*. రూ-ఈఁదు: "ఆ ఈఁతగింజీవంటి దెటిఁగియు దానికే, యాసపడును. "వేమన. 451: చూ, మధుఖర్జూరిక; 2. నీటియందు ఈఁదుట; "ఆ. ఈఁత కన్న లోఁతు నెంచంగఁ బనిలేదు." వేమన. 450; ఈఁదుట; 3. (పశ్వాదులు) ఈనుట, ఈనిక: చూ, ప్రసవము. 6.

**ఈఁతకాఁడు** దే. వి. ఈఁదెడువాఁడు. భాగ. అశ్వ 4, ఆ. 167.

**ఈఁతకు లోఁతేమిటి.** లో. ఉదా.—"ఈ కలహంసయానన మెక్కడి కెక్కడినుండి తెచ్చెనా, హా కడుదూర మెక్కడని యక్కనఁ జేర్పక జంపుమాటలన్, వ్యాకుల నెట్టులెల్ల విరహాంబుధి ముంపక పోదు నంజలం, బే కద నీకు మంచిదిఁక నీఁతకు మిక్కిలి లోఁతుగల్గునే." విజ. 1. ఆ. 101. ("ఈఁతకు మించినలోఁతు బుద్ధికిమించిన పనిలేదు." "ఈఁతకు మించిన లోఁతు గోఁచికి మించిన దరిద్రములేదు.")

**ఈఁతకొట్టు.** దే. అ. క్రి. నీటియందు ఈఁదులాడు. "ఈఁతకొట్టవలదు": ఈఁదు, ఈఁదులాడు.

**ఈఁద.** దే. వి. 1. చేలిగాలి, అల్లిగాలి: చూ, వాయువు; 2. ఖర్జూరి*: చూ, రూ-ఈఁత, (రూ-ఈఁదు.)

ఈఁదర. దే. వి. ఈఁద, చలిగాలి: చూ, వాయువు.

ఈఁదాడన్నఁగోదాడనుట. జా. ఒకటియనిన మఱియొకటి యనుట. (ఈఁదాడి=గిఱకతాడి, కోదాడి=ఒకరకముతాడి) "ఈఁదాడన్నను మదనుఁడు, కోదాడనువాఁడు బిగువుకొన సాగునోకో." విజ. 2, ఆ. 190.

ఈఁదాడి. వై. వి =హింతాలః.(ఈఁగు + తాడి.) గిఱకతాడి*: చూ, హింతాలము. (రూ-ఈఁదాడు.)

ఈఁదు. దే. వి. 1. గాలి: "క. ఈఁదునకుం, గాదిలికొమరుఁడ." అచ్చ సుం కాం. 139: చూ, వాయువు; వై. వి 2.=హింతాలః*: చూ, ఈఁదాడి; 3. ఖర్జూరి*: చూ, ఈఁత. (రూ-ఈఁద.);(ఇది ద్వివిధము-పేరీఁదు, చిట్టీఁదు.) అ. క్రి.4 ఈఁదులాడు: చూ, ఈఁతకొట్టు; స. క్రి. 5. దాఁటు: చూ, తరించు.

ఈఁదుకాయ. దే. వి ఏఱుదాఁటుఁదగిన కొయ్య: చూ, దోనె. 1.

ఈఁదుకొయ్య. దే. వి.—వై.—

ఈఁదుట. దే వి. 1. నీటియందు ఈఁదుట: చూ, ఈఁత. 2. (ఈఁతలు.—నిలువు ఈఁత, బోరగిలు ఈఁత, వెల్లికిలుఈఁత, మునిఁగిన ఈఁత లోనగునవి.); 2 ఒకానొక కార్యమునకై శ్రమముచేఁ బ్రాకులాడుట. "వాఁడు రాజ్యముకొఱకు రేయింబవళ్ళు యీఁదుట నేనెఱుఁగుదును."

ఈఁదురు. దే. వి. తుపానుగాలి: చూ, వాయువు.

ఈఁదురుగాలి. ద్వ. వి.—వై.—

ఈఁదులాడు. దే. అ. క్రి. (ఈఁదులు + ఆడు.) 1: చూ, ఈఁతకొట్టు; 2. ఊఁగు. "ఎ, గీ. ఈఁకె పోటులఁబడి ప్రేవు లీఁదులాడ" హ్వా. 4, ఆ. 42: చూ, వ్రేలాడు.

ఈకడ దే. వి. ఈవైపు: చూ, ఇద్దెస.

ఈకరణి. దే. వి. ఈ విధము.

ఈకువ. దే. వి. తడి: చూ, పదను. 2.

ఈకె. ద్వ. స. ఏ. (ఈ + అకె.) ఈ పూజ్యస్త్రీ· చూ, స్త్రీ. (ఆకె, ఈకె, ఏకె, ఎవతె ఇత్యాదులయందు ఎ కారము ఆదేశముగ వచ్చెనని ఎఱుఁగునది.)

ఈకొను. ద్వ స. క్రి. రూ-ఈయకొను అంకరించు: చూ, సమ్మతించు.

ఈకోలు. ద్వ. వి. రూ-ఈయకోలు అంగీకరము: చూ, సమ్మతి 1.

ఈకోలుకాఁడు. ద్వ. వి. అంగీకరింపఁబడిన వాఁడు: రూ- ఇయ్యకోలుకాఁడు- ఈయకోలుకాఁడు, అభిపన్నుఁడు.

ఈక్షు. సం. వి అ. స్త్రీ చూపు: చూ, లక్షణము. 8.

ఈక్షణము సం వి. అ. న. 1.—వై.— 2.కన్ను: చూ, నేత్రము. 1.

ఈక్షణిక. సం వి. ఆ. స్త్రీ. ఎఱికెత: చూ సోదెకత్తె.

ఈక్షిక. సం. వి. ఆ. స్త్రీ: చూ, ఈక్షు

ఈక్షితప్రియము సం. వి. అ. పుం: చూ, చెప్పతట్టు *

ఈక్షితము. సం విశే. (అ. ఆ. అ.) చూపిఁపఁబడినది: చూ, ఆదర్శితము.

ఈక్షితపహా.సం. వి. ఆ.స్త్రీ.-చూముయూరశిఖి*

ఈగడ. దే. వి. అందుల రహస్యము, ఆచోకి. "చ. ఏమిమాయగాో, యిది యని వీరికైన నొక యీగడ వెళ్ళునోయంచు నేగిరిఁ." కళా 3, ఆ. 168; "క. ఈ, గడ కొంచె దివ్యవచ్చెఁగా." పగ. 5, ఆ: చూ, సూచన. 1

ఈగి. దే. వి. 1. రూ-ఈవి, త్యాగము: చూ, వితరణము; 2. చతురుపాయములో నొకటి (1 మంచి=సామ; 2. ఈగి=దాన; 3. వేఱు=

భేద; 4. కోట్లు—దండ): చూ, ఉపాయములు.

ఈగికాఁడు. దే. వి. రూ-ఈవికాఁడు: చూ, దాత.

ఈగిమాని దే. వి. రూ-ఈవిమాను: చూ, వేలుపుఁజెట్టు.

ఈగు. దే. అ. క్రి. వెనుకకొఱగు "ద్వి. ఈగి దిక్కరులు ఘీంకృతులొనరించెఁ, గ్రాఁగిన యసురుల గతి నబ్బురించె" రా. యు. కాం చూ, రూ-ఇగ్గు.

ఈగుట. దే. వి. 1. అపజయము: చూ, పరాజయము; 2. పోఁగొట్టుట; 3 ఓర్చుట; 4 ఒదుగుట; 5. డయ్యుట; 6. దూఱుట.

ఈచెవిగాడ్పు ఆచెవింబోవుట. జా ఎక్కువ వడగాడ్పువీచుట. "సీ. ఏచి యీచెవిగాడ్పు నాచెవిఁబోవంగ నుబ్బి లింగముకోలె నుండు నెండ." పాండు 2, ఆ. 29

ఈచే. దే, వి 1. (కాలుసేతులు) వంకర "ద్వి కాలకౌశికుఁడనఁగాఁ బేరువడసి, కాలీచేఁ జేనుమే" హరిశ్చ 2, భా: చూ, వంకర; 2. కుశికపృంతము: చూ, ఊచే; 3. బలహీనము: అశక్తము.

ఈచేచేతులవాఁడు. ద్వి వి. ఊచచేతుల వాఁడు: చూ, కోణి.

ఈచేపడు. ద్వ. అ. క్రి. (కాలుసేతులు) వంకరయగు. "గీ. అధిపకాలీచేపడఁగ నుగ్రాటవులకు నరిగి." పంచ. వా. 1., ఆ: చూ, వంకరవోవు.

ఈచేఁబోవు. ద్వ. అ. క్రి.—పై.— "ఈచేఁబోయినచేతులు." ఉ, హరి. 2, ఆ; "ద్వి. కాలీచేఁబోయిన కట్టెఁడిమాల." హరిశ్చ. 2, భా.

ఈచు. దే. అ. క్రి. (పాఁడిపసుల పాలు) వట్టు: చూ, శోషించు.

ఈచుకపోవు. దే అ. క్రి. (పశ్వాదులు) పోవు దూడవేయు.

ఈచుకొనునది. దే. వి, స్రివద్గర్భ: చూ, ధేనువు.

ఈవోటు. దే. అవ్య. ఈస్థానము: చూ, ఇందు. 3 (రూ-ఇచ్చోటు)

ఈటు. దే. విణ 1. పొల్లు: చూ, వ్యర్థము; 2. వట్టి: చూ, శూన్యము. 1.

ఈటువోవు. దే. అ. క్రి. (ఈటు + పోవు.) 1. ఆఱడిపడు: చూ, వ్యర్థమగు; 2. వట్టిదగు: చూ, శూన్యమగు.

ఈడ సం. వి ఆ స్త్రీ. 1. పొగడ్త: చూ, స్తోత్రము; దే వి. (ఈ + కడ) (1) పారేవతము, ఎఱ్ఱకిత్తిలి. (కన్న-కిత్తళె.)*, "గగడ. ఈడకుఁ జెలిరాకీడకుఁగోయఁగ." య. 4, ఆ: చూ, శర్కరాంకము; (2) నారంగము*: చూ, నారింజ; (3) ఈస్థానము: చూ, ఇందు. 3; ద్రి. (4) ఇచ్చట: చూ, ఇంద. 3,

ఈడఁబోక. దే. వి. యుద్ధమువలనఁ బాఱుట: చూ, పలాయనము

ఈడఁబోవు. దే. అ. క్రి. (ఈడన్ + పోవు.) యుద్ధమువలనఁ బాఱు. "శా. ఈడంబోవక వీఁకమైఁ బొడువఁగా." భార-ఆది. 1, ఆ: చూ, వెనుదీయు. 1.

ఈడాడు. దే. స. క్రి. (ఈడు + ఆడు.) ఎదిరించు "ద్వి ఓడక కోడకుదేవి యూగరాత్రిసుని, నీడాడినీ వెఱసేవిడిపింతు." రా. అర. కాం: చూ, ప్రతిఘటించు.

ఈడిక. దే. వి. 1. అలత, కంపతోడుగు: చూ, ప్రాచీనము. 1; 2. గడ్డి లోనగువానిఁ దెచ్చెడి బండి పరమువంటి యొక సాధనము: చూ, సరవడి.

ఈడిగ. దే. వి. 1. రూ-ఈండ్రి: చూ, పెట్టి

బలిజె; 2. ఈండ్రజాతివాఁడు: చూ, సురాజీవి. (రూ-ఈడిగవాఁడు.)

ఈడిగిలఁబడు. ద్వ.అ.క్రి. (ఈడిగిలన్ + పడు) భయాదులచే రానని ముడిచివేసికొని కూర్చుండు. "వ. ఒక్క వృక్షం బిరుగలం బట్టుకొని యీడిగిలంబడియున్న బెట్టుదల్చి." రా. అర. 2, ఆ. 148: రూ-ఈడ్గిలఁబడు. ఈడిగిలు- రూ-ఈడిగిల్లు.

ఈడిగిలు. దే. అ. క్రి —పై— "వ ఆ, పెన పరివక్కరాలు మొఱపెట్టుచు నీడిగిలంగనం దలం, బున వడిఁగట్టి వైచుకొనిపాండని చెప్పి సుదేవుఁడంతటన్." జై. 2, ఆ. 111.

ఈడితము. సం విణ. (అ. ఆ. అ.) పొగడఁబడినది: చూ, స్తుతము

ఈడు. దే వి. 1. ప్రాయము, పడుచుతనము: చూ, వయస్సు 1; 2. ఆగావు: చూ, తాకట్టు; 3 ప్రతినిధి: చూ, మాఱు. 1; విణ 4. పోలిక: చూ, సమానము 2; 5. బ్రతికియున్నంతకాలము; అ. క్రి. 6. చ్యుతమగు. "గీ క్రిద్ధగలిగి లోకసంగ్రహాసంగంబు, నీడ విడిచి యెవ్వఁడీ యుపాయములఁ భజించువాఁడు మోక్షలక్ష్మిపతి, యగు నొకింత సందియంబువలదు" భార అశ్వ. 1, ఆ. 228: చూ, వీడుకోను; 7. దీర్ఘమగు: చూ, పొడవగు; స. క్రి. 8. పాలుపిదుకు "వ గోవుల కుంగ్రేపుల విడువకయు విడిచి విడిచి యీడకయు, యీడియీడినపాలు కాఁచకయు" భాగ. 10, స్కం. పూ. 966: చూ, పిదుకు.

ఈడుచు. దే. క్రి. ఆకర్షించు: చూ, రెమ్ము. 2 (రూ-ఈడ్చు.)

ఈడుపడు. ద్వ. అ. క్రి. అనుగుణమగు: చూ, సరిపోవు. 1.

ఈడుపఱచు. ద్వ. స. క్రి. జీతపఱచు: చూ సరిపఱచు.

ఈడుప్రాయము ద్వ. వి ప్రాయము: చూ, వయస్సు. 1.

ఈడుపు దే. వి 1. ఆకర్షణము: చూ, లాగు. 3; 2. జాగు: చూ, విలంబము. 1; 3 గుమ్మము ప్రక్క: చూ, పార్శ్వము. 2. (రూ-ఈడ్పు.)

ఈడుపులు దే. వి. బ. బుగడలగొలుసు అను చెవినగ: చూ, భూషణము 2.

ఈడుపెట్టు. దే. స. క్రి. జోడించు: చూ, సంధించు. 1.

ఈడుమాఱు. దే. అ. క్రి. తలయెత్తు: చూ, వర్ధిల్లు

ఈడుముంత. దే. వి. పాలచెంబునకు మాఱురూపము పాలుపిదుకుచెంబు: చూ, పాత్రము. 6.

ఈడె. దే వి. పారేవతము, ఎఱ్ఱకితలి*. "ఎ,గీ. ఈడెఱుంగని విభుఁ జూపుఁడీ డెలార." భాగ. 10, స్కం పూ. 105: చూ, శర్కరాంకము.

ఈడేఱు. దే. అ క్రి. (ఈడు + ఏఱు.) 1. పెరుగు. "మ. నా, తనయుండెంతయుఁ బూఁటపూఁటకు సముద్యత్కాంతి నీడేఱఁగా." మై. 2, ఆ; చూ, వర్ధిల్లు; 2 రజస్వలయగు: చూ, సమర్తాడు; 3. నెఱవేఱు: చూ, సిద్ధించు.

ఈడేఱుచు. దే. స. క్రి. నెఱవేఱుచు: చూ, సిద్ధిపొందించు. (రూ-ఈడేర్చు)

ఈడేఱుట. దే. వి. నెఱవేఱుట: చూ, సిద్ధి. 1.

ఈడ్గిలఁబడు. ద్వ. అ.క్రి. (ఈడ్గిలన్ + పడు.): చూ, రూ-ఈడిగిలఁబడు.

ఈడ్చు. దే. క్రి: చూ, రూ-ఈడుచు.

ఈడ్చువాఁడు. ద్వ. వి. ఆకర్షించువాఁడు: చూ, తిగుచువాఁడు.

ఈడ్పు. దే. వి: చూ, రూ-ఈడుపు.

ఈడ్యము. సం. విణ. (అ. ఆ. అ.) పొగడఁదగి నది. చూ, స్తుత్యము.
ఈతఁడు. దే. స. ఏ: చూ, రూ-ఇతఁడు.
ఈతగాఁడు. దే. స. ఏ. —పై.— (స్వార్థమున కాఁడు)
ఈతల. దే. వి: చూ, రూ-ఇవతల.
ఈతి. సం. వి. ఇ. స్త్రీ. 1: చూ, ఈతిబాధలు; 2. ఉపద్రవము: చూ, విపత్తు; 3. ఊరువిడిచి పోవుట: చూ, ప్రవాసము; పుం. 4 బాలుఁడు చూ, శిశువు.
ఈతిక. సం. వి. ఆ. స్త్రీ. సహదేవ * చూ, ముత్తవపులగము.
ఈతిబాధలు అం. అతివృష్టి, అనావృష్టి, మిడతలు, పందికొక్కులు, చిల్కలు, సన్నిహిత రాజులు. (6.)
ఈతిశమనము. సం. వి. అ పుం. ఇనుమద్ది *: చూ, మద్ది.
ఈత్వరి. సం. వి. ఈ. స్త్రీ. కులట: చూ, అం కులాఁడి.
ఈదినము. మి.వి. ఈవేళ: ఈదివము, ఈనాఁడు, ఈపగలు- రూ- ఈపవలు, ఈరోజు, ఈవేళ.
ఈదివము. మి. వి.—పై.—
ఈదృక్షము.సం.విణ.ఇటువంటిది:చూ ఏతాదృశము
ఈదృశము. సం. విణ.—పై.—
ఈదెస. దే. వి: చూ, రూ-ఇద్దెస.
ఈధ్రము. సం. వి. అ. న. అన్నతప్తోదకము, చిట్టుడుకునీరు: చూ, వారుపుకు.
ఈన. దే. వి. చీపురుపుల్ల: చూ, పొరక.
ఈనంజి. దే. వి. కిరసనాయిలు (నూనె), మట్టి నూనె: చూ, తైలము. (విశాఖపట్టణ మండలమున వాడుక.)
ఈనఁగాచి నక్కల పాలుసేయుట. లో. పండించిన పంటను పరులపాలుసేయుట. ఉ. "ఈనఁగాచి పాలమును నక్కలకుఁ బెట్టి నట్లు బాహుబలాధిక్యంబు పేరిమినిఁ గష్టపడి రణంబునం గెలుచుకొన్న రాజ్యంబును ఫలకాలంబున నొరులపాలు సేయ నేల." (నీతిచంద్రిక-సంధి)
ఈనపుడక. ద్వ. వి: చూ, ఈన.
ఈనపుల్ల. ద్వ. వి.—పై.—
ఈనరాశి. ద్వ. వి. పుష్పములుగాపండని వడ్లరాసి: చూ, ధాన్యము
ఈనాఁడు. దే. వి: చూ, ఈదినము.
ఈనిక. దే. వి. (పశ్వాదులు) ప్రసవము: చూ, ఈఁత. 3.
ఈనియ. దే. వి. 1. రూ-ఈనె ఆకులనరము: చూ, పర్ణసిరము; 2. చీపురుపుల్ల: చూ, ఈన. (రూ-ఈనె.)
ఈను. దే. స. క్రి 1 (పశ్వాదులు) ప్రసవించు: చూ, ప్రసవించు; 2. కలిగించు. "ఉ. అనకశంఖదుందుభి మహారవముల్ దశదిక్కులం బ్రతి, ధ్వానములీనఁగా." జై. 2, ఆ. 13: చూ, పుట్టించు.
ఈనె. దే. వి: చూ, రూ-ఈనియ.
ఈనెగాజులు. ద్వ. వి బ. బాలికాక్రీడావిశేషము: చూ, బాలికాక్రీడ.
ఈపగలు. దే. వి. 1: చూ, ఈదినము; 2. ఈవిరోధములు.
ఈపవలు. దే వి. —పై.—
ఈపి. దే. వి. లీఖ, (తలయందుండెడు) అంటుపేను, ఈరు: చూ, యూకము.
ఈపిలేనిచోట గంటువెట్టుట. లో. ఈపురేని చోట గంటుపడునట్లు గోటితో నొక్కుట.
ఈపె. ద్వ. స. ఏ. (ఈ+అప.) రూ- ఈమె: చూ, ఈళె.
ఈప్రక్క. ద్వ. ద్రి: ఇట, ఈవల.
ఈప్స. సం. వి. ఆ. స్త్రీ ఇచ్ఛ: చూ, వాంఛ.

ఈప్సితము. సం. విశే. (అ. ఆ. అ.) కోరఁబడినది: చూ, వాంఛితము

ఈబరి. దే. వి. కొంపచెఱుపు: చూ, నిష్ప్రయోజకుఁడు.

ఈబరిగొట్టు. దే. వి.—పై.—

ఈబిడ. దే. స. ఏ: చూ, ఈపె.(రూ-ఈబిడె.)

ఈమ. సం. వి. ఆ. స్త్రీ పుండు. "ఈమాత్వక్కుండు సర్వప్రణః." 156. హారావళి. చూ, వ్రణము.

ఈమిరి. గే. వి. తడి: చూ, పదను. 2.

ఈము. వై. వి. 1 = హిమమ్. రూ-ఇవము. చూ, హిమము. 1; దే. వి. 2. ఉపసంగము-ఇయ్యము.

ఈమె. ద్వ. స. ఏ. (ఈ + అమ.) 1: చూ, ఈకె. (రూ-ఈపె.); బ. 2. మహతీదమర్థబహువచనము.

ఈయ. వై. వి.= ఈహా. కోరిక: చూ, వాంఛ. (దీనికి ప్రత్యేకప్రయోగము కనఁబడదు.)

ఈయుకొను. ద్వ. స. క్రి. రూ- ఇయ్యకొను: చూ, సమ్మతించు.

ఈయుకోలు. ద్వ. వి. రూ-ఇయ్యకోలు : చూ, సమ్మతి 1.

ఈయుకోలుకాఁడు. ద్వ. వి: చూ, రూ- ఈకోలుకాఁడు.

ఈయుది. దే. స. (ఈ + అది.) 1. ఏతచ్ఛబ్దార్థకము: చూ, రూ-ఇయ్యది; 2 అహమదిదమర్థకప్రథమైకవచనము: (బ. ఈయువి.)

ఈయున. దే. స. ఏ. (ఈ + అన.) చూ, రూ-ఇతఁడు.

ఈయమ. దే. స. ఏ. రూ-ఈయమ్మ: చూ, ఈకె.

ఈయమ్మ. దే. స. ఏ.—పై.—

ఈయువి. వై. స. బ. 1: చూ, రూ-ఇవి; 2: చూ, రూ-ఈయది. 2.

ఈయెడ. దే వి. 1. ఈస్థానము: చూ, ఇందు.3; ద్రి. 2. ఇచ్చోటు: చూ, ఇందు. 3.

ఈయేఁడు. దే వి: చూ, రూ-ఇయ్యేఁడు.

ఈరణము సం. విశే. (అ. ఆ. అ.): చూ, ఇరిణము. (రూ-ఈరిణము.)

ఈరతార. దే వి. తాలుమాలు: చూ, స్వాతంత్ర్యయము

ఈరము. దే. వి. 1 నికుంజము, పొదరిల్లు. "ద్వి బీరముల్ మెచ్చుమీ ఛేదింపరాని, యీరముల్ వొమ్పుచు." రా ఆర. కాం: చూ, గృహము. 1; 2. గుల్మము, తుప్ప: చూ, పొద. 2.

ఈరస. వై. వి. 1.=ఈర్ష్య రూ-ఈరసము. "వ. వెసఖండించు నదల్చుఁ దుంచుఁ జేయుచుఁ వేత్రియుఁ వెసంజేయుని, రసతోనొంచు." రా. యు. కాం: చూ, సూడు. 1; 2. కోపము: చూ, రోషము; 3. పగ: చూ విరోధము 1 (రూ-ఈరసము.)

ఈరసము. వై. వి.=ఈర్ష్య.—పై —(కోపమునకు.—"క. ధీరుఁడు లక్ష్మణుఁడు గృహ, ద్వారంబున నుండఁగనియెఁ దారాసుతుఁడా, తారాసుతునిఁ లక్ష్మణుఁ, డీరసమెసఁగంగఁ జూచి యిట్లనిపలికెన్." రా. కిష్కిం. కాం. 446; పగకు. —"పెక్కండ్రితోడ నీరస, మెక్కతతిన కొనకతతిఁగియున్న పగతుతో, నుక్కాడి." భార. శాం. 3, ఆ.25.)

ఈరసించు. వై. అ. క్రి. 1. అసహనపడు: చూ, సూడుకొను. 2; 2. కోపించు: చూ, రోషించు; 3. పగఁగొను: చూ, విరోధించు.

ఈరాలు. దే. స. (ఈరు + ఆలు.): చూ, రూ-ఇరాలు "క. ఈరాలుకరమంత్రము." వేమన. 465; "క. ఈరాలుకరజపమున." వేమన. 464

ఈరాలు. దే. వి. బ. తుప్ప: చూ, పొద 2.

ఈరిక. దే వి. 1. ఈనిక: చూ, శకలము. 4; 2. మొలక: చూ, మొక్క. 1; 3. చిగురు: చూ, విద్రుమము.

ఈరికలెత్తు. దే. అ. క్రి. అంకురించు : చూ, మొలకెత్తు

ఈరిణము. సం. విణ. (అ. ఆ. న.): చూ, రూ-ఇరిణము,

ఈరితము. సం. విణ. (అ. ఆ. న ) 1 త్రోయఁబడినది: చూ, విద్ధము; 2 చెప్పఁబడినది: చూ, వ్యాఖ్యాతము 2

ఈరు. దే. వి 1: చూ, ఈపి; 2. రూ-ఈరువు. నంజుడు: చూ, మాంసము; స. 3. నీళ్లనుబద్ధము నకు బహువచనరూపము వృత్తియందు అచ్చుపరమగుచో రంటికాదేశము. "ఈరాలు-ఈరేడు." మొ; 4. రూ-ఇరు చూ, రెండు; 5. విణ. అల్పము. "ఈరెండ, ఈరెలుఁగు." (దీని కివ్యస్తముగా ప్రయోగములేదు ) చూ, స్వల్పము. 6 తక్కువైనది: చూ, హీనము. 1.

ఈరుచు. దే. స. క్రి 1 ఈర్పెనతో ఈళ్లను ఈడ్చు: రూ-ఈర్చు; 2 ఆకర్షించు: చూ, రెమ్ము 2

ఈరుడు. సం. వి. అ. పుం. 1. చందురుడు చూ, చంద్రుఁడు; 2. లచ్చిమగఁడు: చూ, విష్ణువు. 1; 3. గర్వమణఁగియుండుట.

ఈరుపెన. దే. వి. శిక్షానికర్షి, ఈళ్ళనీడ్చు దువ్వెన. రూ-ఈర్పెన: చూ, పన్ని. 1.

ఈరువాలు దే. వి. ( ఈరు + పాలు ) వాహ్యాళి, వేడుక గాతిరుగుట : చూ, విహారము. 1.

ఈరువు. దే. వి. 1. రూ-ఈరు: చూ, మాంసము; వా. 2. తగవు. "వాఁడు ఈరువు పెంచి నాడు." (గోదావరీమండలమున వాడుక.)

ఈరు. దే. వి. పంటెను జుట్టి తీసిననూలు: చూ, పోఁగు.1.

ఈరెండ, దే. వి. ( ఈరు + ఎండ ) రూ-నీరెండ. కొంచెపాటియెండ: చూ, వెలుఁగు. 3

ఈరెలుఁగు. దే. వి. (ఈరు + ఎలుఁగు.) హీనస్వరము: చూ, స్వరము. 2

ఈరేడు. దే స. (ఈరు + ఏడు.) : చూ, పదునాలుగు.

ఈరేను. దే స: చూ, పది.

ఈర్తైదు. దే. స.—పై.—

ఈరోషి. ద్వ. వి: చూ, ఈదినము.

ఈర్చు దే. స. క్రి. చూ, రూ- ఈరుచు.

ఈర్పెన. దే. వి: చూ, రూ-ఈరుపెన.

ఈర్మము. సం వి. అ. న. వ్రుండు : చూ, వ్రణము.

ఈర్య. సం. వి ఆ. స్త్రీ. 1. శాస్త్రసమ్మతమగు నడవడి: చూ, చర్య; 2. ధ్యానమౌనాది వ్రతములయందుచాంచల్యములేక స్థిరుఁడైయుండుట: చూ, చర్య; 3. నడచుట నిలుచుట కూర్చుండుట పండుకొనుట మొదలైనవానియందు యతులు సమాధానముఁగలవారై యుండుట: చూ, చర్య.

ఈర్క్ష్య సం. వి. ఆ. స్త్రీ. = ఈరసము: చూ, సూడు. 1.

ఈర్ష్యారువు సం. వి. ఉ. స్త్రీ : రూ- ఇర్ష్యారువు *: చూ, దోస.

ఈర్ష్య సం. వి. ఆ. స్త్రీ.= ఈరసము: చూ, సూడు. 1; అం. 2. హేయగుణములు పదునాలింటిలో నొకటి: చూ, హేయగుణములు.

ఈర్ష్యాలువు. సం. విణ. ఉ. పుం అసహనుఁడు. చూ, సూడుకాఁడు.

ఈర్ష్యాళువు. సం. విణ. ఉ. పుం.—పై.—

ఈలుతాలు. దే. విణ బ. 1. వంకరైనది. "గీ. వంకయైన తలంపెల్ల వసుమతీశ, యరయమృత్యుపదంబగు నార్జవాన్వితంబు బ్రహ్మపదం బింత తథ్యమేల, యీలుతాలుతలంపుల బీలువాలు." భార. అశ్వ. 1, ఆ: చూ, వేల్లితము.2; 2. పరుసందనము "ఎ, గీ. మరలెదుర్కొనఁ

దుతోఁప తెరలెసేన, యపుడు సమ్మెటకోలల సంకులములఁ, జేఱుకోలల వ్రేటుల నీఱతాఱ, యదలుపుల వాకానంబులు చెదరిపఱచె." భార. ద్రో 3, ఆ. (చూ, అఱువుళ్ళు ఇత్యాదిబహు వచనాంతములు వృత్తియందు ఏకవచనాంతము లగును.): చూ, పరుసము.

ఈఱమి. దే. వి. 1. పొదరిల్లు: చూ, గృహము.1; 2. తుప్ప. "వ. పూఁబొదరిండ్ల యీఱమి మ ఱుంగున." కళా. 1, ఆ. 62: చూ, పొద.2; విణ. 3. రూ-ఈఱము. తఱచైనది. "ఈఱమి గాటుక చిమ్మఁగీఁకటుల్." చూ, మొ త్తము. 4.

ఈఱము. దే వి, విణ.—1-2-3.పై.— (తఱచై నదనుటకు.—"ఎ, గీ. ఈఱమగు వెన్నెల లలోనఁదూఱితూఱి" విక్ర. 6, ఆ."గీ. పొద లువేడ్క ల నీఱంపుఁ బొదలుచొచ్చి" షో. 3. ఆ.)

ఈల. దే. వి. 1. సముద్ర ప్రాంతములయందు నేలను అంటిమొలచెడు ఉప్పని సుదిగల యొకవిధమగు కూర: ఈలకూర, ఉప్పుకూర; 2. తస్కర సంకేతధ్వని, ఊల- రూ- ఊళ: చూ, స్వరము. 2; 3. లజ్జ. "సీ. చెలి నేఁచిత నిదిసంతులుగొట్టె మేనక, విడువుమీలయ టంచు నోడిపోయె." స్వా. 3, ఆ. 108: చూ, సిగ్గు; 4. అపదేశము: చూ, వ్యాజము 1; 5. చిమ్మట కూఁత : చూ, స్వరము. 2; 6. గోపకులలోఁగువారి సంకేతధ్వని : చూ, స్వరము. 2. వి, పు. 7, ఆ. 147.

ఈలకఱచు. దే. అ. క్రి. (ప్రాణము) బిగఁ బట్టు. "క. పొడవునకు వెగచి యొప్పటి, పడ మటిదెస నిగిడి పిలుచేఁబఱచినగూడం, గడు రయమునఁ జీనియుంచేక, గడువఁగ లేకీల కఱచి కాకముపాఱెన్." భార. కర్ణ. 2, ఆ: చూ, రూ-ఇలకఱచు.

ఈలకూఁతలు. దే. వి. బ. బాలక్రీడలలోనొకటి. "ఎ, గీ. ఏలపాటలు సరిబేసు లీలకూఁతలు." వి, పు, 7, ఆ. 202: చూ, బాలక్రీడ.

ఈలకూర. దే. వి ఉప్పుకూర: చూ, ఈల. 1, (వా.) "ఈలకూరలో ఉప్పు తక్కువ.".

ఈలకోడి. దే. వి: చూ, రూ-ఇలకోడి.

ఈలగ్రిద్ద. ద్వ. వి. 1. ఒకరకము డేగ: చూ, శ్యేనము; విణ. 2. పిసిని. "ఆ ఏమునలువురం దు సెవ్వాఁడుగాఁజాలు, నిచ్చిపుచ్చుకొన్న యీలగ్రిద్ద, మాకునింపుగావు మానుమీకుద్దు లు, కలహముల మొగంబ కలియుగంబ." హై. 7, ఆ: చూ, లోభి.

ఈలపురుగు. దే. వి. చిమ్మట: చూ, ఈల కోడి.

ఈలకొట్టు. దే. అ. క్రి. శంఖము లోనుగాఁగల వానినూఁదు: చూ, పట్టు. 27.

ఈలవిడుచు దే. అ. క్రి. —పై.—

ఈలవేయు దే. స. క్రి. —పై.—

ఈలాగు. దే. అవ్య. ఏవమర్థకము: చూ, ఏవమ్. 5.

ఈలుగు. దే. అ. క్రి. రూ- ఇలుగు- ఈల్గు- నీలుగు. "క. పవనసుతుచేత నా భూ, ధవుఁ డీలిగనేని." భార. కర్ణ. 2, ఆ: చూ, మర ణించు.

ఈలువు. దే. వి. పతివ్రతాత్వము. "ద్వి. కాల దేశాంతర క్రమమునఁ జెడని, ధూలు వోకుండ మఱువింతియకాక, యొనసిన కో టులు నిండ్లును దొరల్చు, వనితల కెందునా వరణ ముల్ గావు." రా. యు. కాం. "ఇలఁ బతివ్రతలలో నీలువు గలయట్టి తల్లివి." కళా. 4, ఆ: చూ, పాతివ్రత్యము.

ఈలువుటాలు. ద్వ. వి. పతివ్రత: చూ, స్త్రీ.

ఈల్గు. దే. అ. క్రి: చూ, రూ- ఈలుగు.

ఈల్గుట. దే. వి. చావు: చూ, మరణము.

**ఈవ.** దే. వి. రూ- ఈఁగ: చూ, మక్షిక.
**ఈవంక.** దే. వి: చూ, ఇద్దెస.
**ఈవరి.** దే. విణ. (ఈవి + అరి.) ఈగికాఁడు: చూ, దాత.
**ఈవల.** దే. వి. (ఈ + వలను.) 1. ఈవలిదరి: ఇద్దరి, ఇవల-రూ - ఇవ్వల- ఈవల, ఇవతల- రూ-ఇవతలి-ఈతల;(సం.ప.):—అపారము- రూ- అవారము; 2. ఇటుతరువాత: చూ, అపరము. 7; ద్రి. 3: చూ, ఈ ప్రక్క.
**ఈవి.** సం. వి. ఈ. స్త్రీ. 1. కరవాలిక, నిమిచా కత్తి: చూ, రిష్టి. 2; దే. వి (1) రూ- ఈగి: చూ, వితరణము.
**ఈవికాఁడు.** దే. వి. రూ- ఈగికాఁడు చూ, దాత.
**ఈవిల.** సం. వి. అ. స్త్రీ. కరవాలిక, అ ని. చూ, రిష్టి. 2.
**ఈవు** దే. స. 1. నీశబ్దమునకు ప్రథమైకవచనము: చూ, రూ- నీవు; అవ్య. 2. ఒసంగవు: చూ, రూ- ఇయ్యవు.
**ఈవుత.** దే. అవ్య. ఒసంగుఁగాత.
**ఈవులమొదవు.** దే. వి. (దేవలోకమునందలి) కామధేనువు: చూ, ధేనువు.
**ఈవులమ్రాను.** దే. వి. (దేవలోకమునందలి) కల్పవృక్షము. రూ- ఈగిమ్రాను: చూ, వేలుపుఁజెట్టు.
**ఈవులరతనము.** ద్వ. వి. (దేవలోకమునందలి) చింతామణి, కోరిన కోరికలనిచ్చెడు దేవమణి: చూ, రత్నము. 1.
**ఈఁగె.** దే వి. రూ- ఈఁగ: చూ, మక్షిక.
**ఈవేళ.** ద్వ. వి: చూ, ఈదినము.
**ఈవైపు.** ద్వ. వి: చూ, ఇద్దెస.
**ఈశ.** సం. వి. అ. స్త్రీ. నాఁగటిమేఁడికోల రూ-ఈష; చూ, లాంగలము.
**ఈశత్వము.** సం. వి. అ. న: చూ, రూ- ఈశిత్వము.
**ఈశవాచకము.** సం. వి. అ. పుం. దిరిసెనము*: చూ, శిరీషము.
**ఈశాదంతము.** సం వి అ. పుం. ఏనుఁగుదంతము, మహాదంతము: చూ, పల్లు. 1.
**ఈశానము.** సం. వి. అ న. 1. కాంతి: చూ, వెలుతురు 1; అం. 2. శివుని పంచముఖములలో నొకటి: చూ, శివుని పంచముఖములు
**ఈశాని.** సం. వి. ఈ. స్త్రీ. గౌరి: చూ, పార్వతి. 1
**ఈశానుఁడు.** సం. వి. అ. పుం. 1.=ఈసరుఁడు: చూ, శివుఁడు; 2. అష్టదిక్పాలకులలో నొకఁడు: చూ, దిగధిపతులు; 3. నలువ: చూ, బ్రహ్మ. 1. (రూ-ఈశాన్యుఁడు.)
**ఈశాన్యము.** అం. 1. శివాననము లయిదింటిలో నొకటి: చూ, శివాననములు; 2. దిక్కులెనిమిదింటిలో నొకటి: చూ, దిక్కులు; 3. దిశలు పదింటిలో నొకటి చూ, దిశలు.
**ఈశావాశ్యము.** అం. ఉపనిషత్తులు పదింటిలో నొకటి: చూ, ఉపనిషత్తులు.
**ఈశాన్యవర్ష వాయువు.** పా. అక్టోబరు మొదలుజనవరివఱకును ఈశాన్యమునుండి ప్రవహించు వాయువు. (ఈశాన్యమాన్‌సూన్.) చూ, వాయువు.
**ఈశి.** సం. వి. ఈ. స్త్రీ. గౌరి: చూ, పార్వతి. 1.
**ఈశితుఁడు.** సం. విణ. (ఋ. ఈ. ఋ.) అధిపతి చూ, ప్రభువు. 2.
**ఈశిత్వము** సం. వి. అ. న. శివుని అష్టసిద్ధులలో నొకటి. చూ, సిద్ధులు. (విభూతులు. రూ- ఈశత్వము.)
**ఈశుఁడు.** సం. వి. అ. పుం. 1.=ఈసరుఁడు: చూ, శివుఁడు; 2. అధిపతి: చూ, ప్రభువు. 2; 3. ఒకానొకరాజు: చూ, రాజు. 1.

ఈశ్వర. సం. వి. అ. పుం. 1. ప్రభవాది యాబది వత్సరములలో నొకటి: చూ, సంవత్సరములు; అ. స్త్రీ. 2. గౌరి: చూ, పార్వతి. 1.

ఈశ్వరత్వము. సం. వి. అ. న. అనిమిషత్వము: చూ, దైవత్వము.

ఈశ్వరపోతరాజు. శా. పల్లవరాజుల శాసనములలో వారి బిరుదనామములనే వాడి యుండుటచేతను జన్మనామములను వాడి యుండక పోవుటచేతను అనేకులనేక భ్రమల పాలగుచున్నారు. మొదటి పరమేశ్వరవర్మ జన్మనామము ఈశ్వరపోతరాజు. పరమేశ్వరవర్మ యనునది బిరుదునామముగాని జన్మనామము గాదు; రాజరాజనరేంద్రుని పట్టాభిషేక సంచిక.చాళుక్యుల ప్రశంస 88 పుట.

ఈశ్వరప్రియములు. పా. ఒకరకము వడ్లు: చూ, ధాన్యము.

ఈశ్వరవర్మ. శా. క్రీ. శ. 499-500 లో ఈతఁడు మౌఖారివంశమును, మౌఖారిశకమును స్థాపించెను. గుప్తరాజుల యధికారము తగ్గుటచేతనే వీరు క్రొత్తరాజ్యమును శకమును స్థాపింపఁ గలిగిరి. ఈతనికే ఈశానవర్మ యని కూడ నందురు. కళింగదేశ చరిత్ర 485 పుట.

ఈశ్వరవల్లరి. సం. వి. ఈ. స్త్రీ లింగాకారపు దొండ*: చూ, దొండ.

ఈశ్వరార్చనము. అం. నియమములు పదింటిలో నొకటి: చూ, నియమములు.

ఈశ్వరి. సం. వి. ఈ. స్త్రీ. 1. గౌరి: చూ, పార్వతి. 1; 2. ఈసరి*: చూ, నాగదమని. (తెల్ల ఈశ్వరి, నల్ల ఈశ్వరి అని ద్వివిధము. ఇది త్రాఁచుపామును అప్పును.దాని విషమును హరించును. దీని వేరుకషాయము సేవించిన ఋతురక్తము జారీ యగును.)

ఈశ్వరుఁడు. సం. వి. అ. పుం. 1 ఈసుఁడు: చూ, శివుఁడు; 2. మరుఁడు: చూ, మన్మథుఁడు; విణ. 3. అధిపతి: చూ, ప్రభువు. 4. ధనవంతుఁడు: చూ, సంపన్నుఁడు. 5. జీవుఁడు: చూ, హంసుఁడు.

ఈశ్వరేశ్వరి. సం వి. ఈ. స్త్రీ. గౌరి: చూ, పార్వతి. 1.

ఈష. సం. వి. ఆ. స్త్రీ. నాఁగటి మేఁడికోల: చూ, ఈశ.

ఈషణత్రయము. అం. దారేషణము, ధనేషణము, పుత్రేషణము. (క.) (చూ, త్రయము) (ధనేషణము= విత్తేషణము.) "ఆ. ఈషణత్రయంబు నెడపంగ నేరక, మోహజాలిలోన మునిఁగియుండు, జనులకెట్లు మోక్షసౌఖ్యంబుఁగలుగురా, విశ్వ......" వేమన 471.

ఈషత్. సం. అవ్య. కొంచెము: చూ, స్వల్పము.

ఈషత్కరము. సం. వి. అ. న. అల్పము: చూ, స్వల్పము.

ఈషత్పాండువు. సం. వి. ఉ. పుం. ధూసరము, బూడిదరంగు: చూ, వర్ణము 6.

ఈషిక. సం వి. ఆ. స్త్రీ: చూ, దూ-ఇషిక.

ఈషిరుఁడు. సం వి. అ. పుం. అగ్ని: చూ, నిప్పు.

ఈసడము. దే. వి. దూఱు. "నీకింత ఈసడము తగదు.": చూ, నింద. 1.

ఈసడించు. దే. అ. క్రి. 1. అసహ్యపడు. "గీ. అంత నొకనాఁడు నిర్మల స్వాంతమౌని, మాళి భుజియింపఁ బాత్రిలో వ్రేలుదునిసి, పడినమది నీసడింపక కడకుఁదిగిచి, వైచి భుజియించె నప్పతి వ్రతలతల్లి." పాం. 3, ఆ. 46: చూ, రోఁతపడు; 2. కోపించు, "ఉ. ఆ కుచటింగ మంగొని తదంగన యప్పుడు హెచ్చినట్టి స్పర్ధి నువనీసడించుచు." శశా. 3, ఆ. 314: చూ,

రోషించు; స. క్రి. 3. దూఱు. "సీ. పండా
లుఁడని సారెసారెకునన్ను నీవీసడించుట పా
టెరిఁగియే తలంప." హరిశ్చ 4, ఆ 221: చూ,
నిందించు.

ఈసడింపు. దే. వి. 1. దూఱు: చూ, నింద. 1;
2. తిరస్కారము: చూ, వహేలనము; 3. చు
లకఁదనము: చూ, లాఘవము.

ఈసపట్టు. దే. వి. ఒకరకము చేఁప : చూ,
మత్స్యము. 1.

ఈసరి. వై. వి = ఈశ్వరి *: చూ, నాగదమని

ఈసరుఁడు, వై. వి 1 = ఈశ్వరః:చూ,శివుఁడు;
2 దేవుఁడు: చూ, వేలుపు.

ఈసలు వై. వి. వల్మీకమక్షిక: చూ, మక్షిక.
(ఈసుళ్ళు అనివాడుక.)

ఈసు వై. వి. 1. = ఈర్ష్య. ఓర్వలేనితనము:
చూ, సూడు. 1; 2. కోపము. "వ. అంతఁ
బంక్తివదనుండు నిబిడజ్వాలా కరాళంబగు
శూలంబురాఘవునిమీఁద ప్రయోగించిన నతం
డును వడుమనదానిం దునియలుసేసిన నీసునం
బెటిగి." భార. అర. 7, ఆ: చూ, రోషము;
3. పగ. "నాకుపద్రవముఁ బెక్కువిధములఁ
జేసె నీసునన్." భార. సభా. 1, ఆ: చూ,
విరోధము. 1.

ఈసుకాఁడు. వై. విశే.= ఈర్ష్యాళువు : చూ,
సూడుకాఁడు.

ఈహా. సం. వి. ఆ స్త్రీ. 1 = ఇచ్ఛ-ఈయ.
కోరిక: చూ, వాంఛ. 1; 2. కడఁక: చూ,
యత్నము; 3. కిరణము: చూ, మయూఖము.
1; 4. కాంతి: చూ, వెలుతురు. 1.

[illegible]. సం. వి. అ. పుం. 1. తోడేలు:
చూ, వృకము; 2. రూపక నాటక భేదము:చూ,
నాటకము. 1.

ఈహితము. సం. విశే. (అ. ఆ. అ.) కోరఁబడి
నది: చూ, వాంఛితము.

ఈహీ. రూ-ఇహీహీ: చూ, హీహీ. (నిందించు
టయందు.— "శా. తక్కన బలాధీశాఖ్యక్రీ
టుంబు లిం,దెవ్వండెవ్వఁడో మేలెచేటొటుఁగ
రీహీ," కవిక. 2,ఆ.)

ఈళి. సం వి. ఈ. స్త్రీ. వంపుముగత్తి: చూ,
రిష్టి. 2.

ఈళిక సం వి. ఆ. స్త్రీ. 1.—వై.—;2.క త్తి
పీఁట, కూరలు తరుగుటకుఁ బీఁటయందమ
ర్చిన కత్తి: చూ, రిష్టి. 2.

ఈళితము. సం. విశే. (అ. ఆ అ.) ఈడితము,
పొగడఁబడినది: చూ, స్తుతము.

## ఉ.

ఉ. అచ్చులలోని అయిదవ యక్షరము. "సీ.ఆ
దులు పదియాఱునచ్చులు." అప్ప. 2, ఆ. 6.
"క. మొదలనకారాద్యచ్చులు, పదియాఱు."
అప్ప. 2, ఆ. 20: చూ, వర్ణము. 1; సం. వి.
ఉ. పుం. 1. క్షత్రియుఁడు: చూ, రాజు.1;
2. కన్ను: చూ, నేత్రము. 1; 3. హరి:చూ,
విష్ణువు. 1; 4 ముక్కంటి: చూ, శివుఁడు;
5 శివుని కన్ను: చూ, ముక్కంటి తల;
6. ఇంద్రుని ఏనుఁగు: చూ, హస్తి; అవ్య.
7. పిలుచుట: చూ, సంబోధనము;8.కోపము:
చూ, రోషము; 9. అంగీకారార్థకము.చూ,
సమ్మతి. 1; 10. అడుగుట: చూ, ప్రశ్నము;
11 ఊఁకొట్టుట: అ, ఊకృతము; (తె ప)
:—ఊఁకొట్టుట; 12 ముక్కు మూసికొని
నిదానముతోఁజేయు జపము, తపము: చూ,
స్వాధ్యాయము. 8; 13. తిరుగులాడుట:
చూ, విహారము. 1; పా. 14 ఉకారాంత
శబ్దములకు సర్వత్ర వు వర్ణకంబగు. ఉ—
గురువు, శంభువు, సాధువు, జరత్కారువు,
తరువు. ఇట్లు

ఉంకించు. దే. అ. క్రి. కదలఁగు. "గీ. రక్తసంసిక్తమైన ధరాతలమున, నార్త్రిలోరలుచు నార్పులందంద సంధడింప జీవంబు వెడల నుంకింపఁజేస్తు, లొయ్యనొయ్యన యడఁగఁగనున్న యధిపు." భార. సౌ. 1, ఆ: చూ, యత్నించు.

ఉంకింపు. దే. వి. 1. ఆయిత్తము : చూ, యత్నము; 2. ఏపు : చూ, విగ్రంభణము; 3. కుప్పింపు, దాఁటు: చూ, లంఘు.

ఉంకు. దే. వి. 1. అంగీకారము. "క. ఎక్కువకులంబు నతనికి, నిక్కపుటాలైన దాని నీచకులుండుం, కెక్కకబలిమిఁగవిసినఁ, దక్కొనిచంపుట యరాజ ధర్మంబెందున్." విష్ణు. పారి. కాం. 107: చూ, సమ్మతి. 1; అ. క్రి. 2. ఎగురు "గీ నీరముంచిన సౌరకాయ యొగసినట్లు, పేరుకొనిపైచు తెల్లటిచీరవోలె, నుంకుచెందువిధంబున నుత్తరించు, తములపాకు నిక్కడు క్రియదాఁటెనిట్టి" ఉ, హరి. 4, ఆ: చూ, లంఘించు.

ఉంకుటుంగరము. దే. వి. వధూవరులు పెండ్లి చేసికొనుటకు పరస్పరము సమ్మతించి మార్చుకొనెడి యుంగరము: చూ, భగావణము. 2.

ఉంకుడు. దే. వి. కన్యాశుల్కము, అల్లుఁడు కన్యకార్థము మామకిచ్చెడు ద్రవ్యము: చూ, శుల్కము.

ఉంకువ. దే. వి —పై —(రూ ఉంకువు.)

ఉంగ దే. వి. ఉగ్గు, బిడ్డలకుఁ బోసెడు చేను బాలామృదము "క. అంగములు మిగులనలియఁగ, నుంగేయుంగేయటంచు నొక నిమిషమునో, రంగాయ చేయకేడ్చుచు, నంగీకృత బాల్యచేష్ట నతఁడట్లుండక." పర. 1, ఆ: చూ, కంగు.

ఉంగడి. దే. వి. ఒకరకము పశువ్యాధి. రూ- ఉంగిడి: చూ, కడుపూఁద. (నాముసు అముదపాకును మేయుటచేఁ గల్గుగు శెవులు.)

ఉంగరపువేవ్రేలు దే. వి. (ఉంగరము + వ్రేలు.) అనామిక: చూ, వేలు. 1.

ఉంగరము. దే. వి. రూ-ఉంగ్రము: చూ, భూవణము. 2.

ఉంగిడి దే వి: చూ, రూ-ఉంగడి,

ఉంగుటము వై. వి.= అంగుష్ఠః. బొట్టనవ్రేలు. "గీ. మొక్కినిలిచి యతనిముందట మేదినినుంగుటమున వ్రాయుచున్నఁజూచి." నిర్వ. 3, ఆ: చూ, వేలు 2.

ఉంగ్రము. దే వి: చూ, రూ-ఉంగరము.

ఉంచికొను. దే. ప్రే ధరించు: చూ, వహించు.

ఉంచు. దే. ప్రే. 1. ఉండజేయు: చూ, ఇడు. 2. (రూ-ఉనుచు.); స. క్రి. 2. కీలించు: చూ, పెట్టు. 5.

ఉంచుకొను. దే. ప్రే: చూ, ఉంచికొను

ఉంచుట. దే. వి. ధరించుట: చూ, పెట్టుకోలు.

ఉంఛము. సం. వి. అ. న. ధాన్యమేఱుకొని బ్రతుకుట, ఋతము: చూ, బ్రతుకు. 1.

ఉంఛశిలము సం. వి. అ. న. ఉంఛవృత్తి శిలావృత్తి. (శిలోంఛవృత్తి ద్వయజీవనము.)

ఉంట. దే. వి. 1. రూ-ఉండ. "సీ. కలశవారిధి బయల్ నెలసికొమ్మనఁగొట్టనంటి వచ్చినవాఁచుటుంటపుడమి." చంద్రా. 1, అ. 75: చూ, గోళము; 2. ఉండుట; విణ. 3. గుండ్రము: చూ, వర్తులము.

ఉంటగాలము. దే. వి సీసపుగుండు కట్టినదొక దినుసు గాలము, గోరుగాలము: చూ, మత్స్యబంధనము.

ఉండ. దే. వి. 1. మన్నులోనగువానిచేతఁ జేయబడిన గుళిక: చూ, ఉంట. 1; విణ. 2. గుండ్రము: చూ, వర్తులము,

ఉండఁజూచు. దే. అ. క్రి. 1. ఫలపరిమితి నూహించు: చూ, ఊహించు. 2; 2: చూ, పరీక్షించు.

ఉండఁజేయు. దే. స. క్రి. ఉంచు : చూ, ఇడు. 2.

ఉండకట్టు. దే. అ. క్రి. 1. బంతివలెనగు; స.క్రి. 2. బంతివలెచేయు.

ఉండకోల్రివి. దే. వి. 1. సన్యాసులు చేతఁబట్టెడు దండము: చూ, వేత్రము 1; 2. బెత్తపు చెట్టు: చూ, వేత్రము. 2

ఉండవల్లిగుహలు. శా. బెజవాడకు 5-6 మైళ్ళ దూరమున ఉండవల్లిగుహలు కలవు. ఇవి నాలుగు అంతస్తులుగా కొండకు దక్షిణభాగమున దొల్వఁబడినవి. పైఅంతస్తునందు అనంతశయనుని విగ్రహమున్ను, స్తంభములమీఁద రామాయణ, భాగవతాది కథలను సూచించు విగ్రహములున్ను, ప్రక్క గుహలయందు లింగములున్ను గలవు. మఱియు విష్ణుకుండినుల చిక్కళ్ళ, రామతీర్థం శాసనముల శిఖాలయందు కనుఁగొనఁబడినట్టి సింహవిగ్రహములు ఈగుహలస్తంభములమీఁద పెక్కులుగలవు. కలింగ. 471. పొరట.

ఉండసురియ. ద్వ. వి. ఒకానొక ఆయుధము, కటిచిలుకు. "వ. కొండగొఱియల నుండసురియలఁ జెండు బెండాడుచుండ." రా, వి. 3, ఆ. 65: చూ, బాణము. 1.

ఉండి. దే. అ. ప. 1. ఒకప్రత్యయము; అవ్య. 2. మొదలుకొని అనునర్థము దెలుపునది. "క. ఏనొకటి విన్నవించెద, దానవకుల మథన పెద్దనడవున నుండిం,బూని వినిపింపఁగల పని, యౌనో కాదో విచారమది తెలియఁదగుఁజా." (ఉండిజా- యుష్మల్లోపము.) ఉ, హరి. 5, ఆ: చూ, మొదలు 6.

ఉండు. దే. అ. క్రి. 1. కాఁపురించు : చూ, వసించు; 2. మెలఁగు: చూ, వర్తించు; 3. మిగులు: చూ, శేషించు

ఉండుసె దే వి. ఉన్నె-రూ-ఉన్నే.

ఉండువాఁడు. దే. వి. వర్తించువాఁడు : చూ, వర్తిష్ణువు.

ఉండె. దే. వి. ఊరుమూలదేశము.

ఉండ్రి. దే. వి. వరిచేండ్రి *: చూ, విట్టదిరము.

ఉండ్రిన. దే. వి —వై.—(రూ-ఉండ్రెన.)

ఉండ్రము. దే. విశ. 1. గుండ్రము: చూ, వర్తులము; బ, 2 ఉండ్రాలు, మోదకములు: చూ, భక్ష్యము. (విఘ్నేశ్వరునకు ప్రీతి. భాద్రపదశుద్ధ చవితినాఁడు ప్రతియింటను ఉండ్రాళ్ళుచేసి విఘ్నేశ్వరునకుని వేదఁజేయుదురు.) ("ఉండ్రాళ్ళుతిన్నకుక్క కే మూఁడు ముంతలచల్ల.")

ఉండ్రిస. దే. వి: చూ, ఉండ్రి*.

ఉండ్రాలు. దే. వి. బ' చూ, ఉండ్రము. 2.

ఉండ్రాళ్ళతద్దె. దే వి. ఉండ్రములతో పార్వతి క్రీతికై చేసెడి వ్రతము (బాలికలు భాద్రపద బహుళ తదియనాఁడు యావనుఁడగు భర్త రాకకై చేయునోము.): చూ, తద్దె. (బృహత్యమావ్రతము.)

ఉండ్రాళ్ళు. దే. వి. బ: చూ, రూ- ఉండ్రాలు.

ఉండ్రెన. దే. వి. రూ-ఉండ్రిస *.

ఉందురము. సం. వి. అ. పుం. 1. ఎలుక: చూ, మూషికము; 2. పందికొక్కు: చూ, మూషికము.

ఉందురువు. సం. వి. ఉ. పుం.—వై.—

ఉంపడము. దే. వి. 1. గుత్తగా వేశ్యనుంచుకొనుట; 2. (ఉంచుకొనఁబడినది.) పరస్త్రీ: ఉంపుడుకత్తియ-రూ-ఉంపుడుకత్తె.

ఉంపుడుకత్తియ. ద్వ. వి. 1. (ఉంచుకొనఁబడినది) పరస్త్రీ: చూ, ఉంపడము. 2; 2. ఉంచుకొనఁబడిన వేశ్య. (రూ- ఉంపుడుకత్తె.);

3. పనిచేయుట కేర్పాటైన దాసి. (రూ-ఉంపుడుకత్తె.): చూ, దాసి. 1.

ఉంబ. వై. వి.=అమ్మా. గోజాతియఱపు: చూ, స్వరము. 2. (రూ-అంబా)

ఉంబళి దే. విణ పన్నులేనిది. "ఉంబళిగా)వము." మొ॥

ఉంభనము. సం. వి. అ న నిండఁజేయుట.

ఉంభితము. సం. విణ. (అ. ఆ అ.) నింపఁబడినది.

ఉక. సం. వి. ఆ. స్త్రీ. చర్మము:చూ,తోలు.1

ఉకము. సం. వి. అ. పుం 1. పక్షి : చూ, పక్షి; 2. అనుమోదము: చూ, సంతోషము; 3. వికలము: చూ, వైకల్యము.

ఉకారము. (1)ఉకారమునకచ్చు పరంబగునపుడు సంధినిత్యము. ఉదా — రాముఁడు + అతఁడు=రాముఁడతఁడు ; అతఁడు + ఎక్కడ=అతడెక్కడ; ఇతఁడు + ఒక్కఁడు= ఇతఁడొక్కఁడు; ఇంపు + అగు=ఇంపగు; (2) చతుర్థ్యాది విభక్తులయొక్కయు, నన్ను, మమ్ము, నిన్ను, మిమ్ములయొక్కయు, తద్ధర్థక చువర్ణముయొక్కయు. ఉకారమునకు సంధి వికల్పము. ఉదా.—నీకొఱకున్ + ఇచ్చితిని=నీకొఱకిచ్చితిని, నీకొఱకు నిచ్చితిని, నాకున్ + అనుభవము= నాకనుభవము, నాకునసుభవము; రామునియందున్ + ఆసక్తి= రామునియందాసక్తి, రామునియందునాసక్తి; నన్ను + అడిగెన్=నన్నడిగెన్, నన్నునడిగెన్ ; మమ్మున్ + ఎంచెన్=మమ్మెంచెన్, మమ్మునెంచెన్; నిన్నున్ + అడిగెన్= నిన్నడిగెన్, నిన్ను నడిగెన్; మిమ్మున్ + ఊరక=మిమ్మూరక, మిమ్మునూరక; వచ్చుచున్ + ఉన్నాఁడు = వచ్చుచున్నాఁడు, వచ్చుచునున్నాఁడు; (3) ఉదంత తద్ధర్మార్థ విశేషణమున కచ్చు పరంబగునపుడు నుగాగమంబగు. ఉదా.— చేయు + అతఁడు=చేయునతఁడు;చేసెడు + అతఁడు= చేసెడునతఁడు; 4.షష్ఠీ సమాసమందు, ఉకార, ఋకారములకచ్చు పరంబగునపుడు నుగాగమంబగు.ఉదా.-రామునియొక్క + ఆజ్ఞ=రామునాజ్ఞ; విధాతయొక్క + ఆనతి= విధాతృనానతి; (5) సమాసంబుల నుదంతములకును, పుంపువులకును బరుషసరళంబులు పరంబగునపుడు నుగాగమంబగు. ఉదా.—చిగురు + కైదువు=చిగురుంగయిదువు; చిగురుఁగయిదువు, చిగురున్గయిదువు;తలుకుంగజ్జెలు=తలుకున్గజ్జెలు; తలుకుగజ్జెలు, సింగపు + కొదమ = సింగపుంగొదమ సింగపుఁగొదమ, సింగపున్గొదమ, ఉన్నతంపు + గొడుగు=ఉన్నతంపుగొడుగు, ఉన్నతంపున్గొడుగు, ఉన్నతంపుంగొడుగు; (6) కర్మధారయంబులందుకారమునకచ్చు పరంబగునపుడు టుగాగమంబగు ఉదా.—నిగ్గు + అద్దము=నిగుటద్దము, కఱకు + అమ్ము= కఱకుటమ్ము; సరసపు + అలుక=సరసపుటలుక;(Excep-t ,n) కొన్నియెడల ఉకారాంతవ్యతిరిక్త స్థలములయందును, కర్మధారయకాని సమాసములయందును కూడటుగాగమంబు గానంబడుచున్నది. ఉదా.— మిద్దె + ఇల్లు=మిద్దెటిల్లు; పల్లె + ఊరు=పల్లెటూరు; దుక్కి + ఎద్దు=దుక్కిటెద్దు; పడుక + ఇల్లు=పడుకటిల్లు; "పాప జీవరాలి బంగారు పడుకటిల్లు." (విజయవిలాసము.) తేనె + ఈఁగ=తేనెటీఁగ; పక్క + ఎముక= పక్కటెముక; వేలుపు + ఆవు=వేల్పుటావు; మదము + ఏనుఁగ =మదపుటేనుఁగు; (7) కర్మధారయంబునఁ జేర్వాదిశబ్దముల కచ్చు పరంబగునపుడు టుగాగమంబు విభాషనగు, (వికల్పము.)ఉదా — పేరు + ఉరము=పేరుటురము, పేరురము; చిగురు + ఆకు=చిగురు

టాకు, చిగురాకు; పొదరు + ఇల్లు=పొదరు టిల్లు, పొదరిల్లు; N. B.—పొదరు—పొద + రు=పొదరు. (8) సమాసంబున కుఱు, చిఱు, కడు, నడు, నిడు శబ్దముల ఱ, డ లకు అచ్చు పరంబగునపుడు ద్విరుక్తటకారం బగు. ఉదా.— కుఱు + ఉసురు=కుట్టుసురు, చిఱు + ఎలుక=చిట్టెలుక; కడు + ఎదురు=కట్టెదురు; నడు + ఇల్లు=నట్టిల్లు; నిడు + ఊరుపు=నిట్టూరుపు 1, Exception- "కడు నెండ నెక్కనంతకు, నుడుగక యచ్చనుప నడచి యుగాధ్రిటవిలో." (భారతము-అరణ్యపర్వము.) "కడు నధిపుతోడ దొడరి న." (భారతము-సభాపర్వము) "కడు + ఎండ=కడునెండ" అనుచో సమాసముగాదు గావున ద్విరుక్తటకారము రాలేదు "కడునధిక" ఇదియు నటులే. N B—ఓహురా (11) ఇటురమ్మి- ఇత్యాదులయందు ప్లుతము కావున; N.B—అ, ఇ, ఉ, యీమూఁడింటికిఁ దప్పఁ దక్కిన యచ్చులకుఁ దెమఁగులో సంధిలేదు. (చూ, ఉ)

ఉకుఁడు. సం. వి అ పుం. అధముఁడు: చూ, హీనుఁడు.

ఉకుణము. సం. వి అ న నల్లి: చూ, మత్కుణము.

ఉక్క. వై. వి. 1.=ఉల్కా. ఉష్మ: చూ, ఔష్ణ్యము; 2. ధైర్యశాలి: చూ, దిట్టఁడు.

ఉక్కఁబట్టు. దే. స. క్రి. త్యజించు. "క. నీకిష్టం బిది కానీ, నా కాపాపాత్ముఁ జెప్పి నం బదిలత్మల్, లేకున్న విడుతుఁ బ్రాణము, నీకై కూడుక్కఁబట్టి నీలగ్రీవా." కాశీ. 8, ఆ: చూ, విసర్జించు.

ఉక్కడఁగు. దే. అ. క్రి. 1. ఉక్కుచెడు. "గీ. మహీజంబు, లెక్కి రందుఁగొందఱుక్కడంగి." భార. అర. 2, ఆ: ఉక్కఱు, ఉక్కుమడఁగు; 2 చచ్చు: చూ, మరణించు.

ఉక్కడఁచు. దే. ప్రే. చచ్చు: చూ, మరణించు.

ఉక్కడము. వై. విశ. 1.=ఉత్కటః. గొప్పదయినది. "ఉ. ఉక్కడమయిన మంచి వాను వొప్పెడు నా హయరత్న మెక్కినన్." సా. 1, ఆ: చూ, మహితము; వి 2. అధికము, ఎక్కువ: చూ, హెచ్చు. 1.

ఉక్కడీఁడు. వై. విశ. (ఉక్కడము + ఈఁడు) శూరుఁడు: చూ, హంవీరుఁడు. 2.

ఉక్కణము దే. వి. కావలి, "వ. కడిందిమగల్ దగు నుక్కణంబుగా, భయమను పేరులేక నిరపాయముగా విడియించుచుఁ మనః ప్రియమగు భంగి సేన నడిపించె" నిర్వ. 5, ఆ: చూ, రక్షణము.

ఉక్కరి దే. విశ. (ఉక్కు + అరి.): చూ, ఉక్కడీఁడు "సీ. ఉక్కరివై పొంచి నిక్కుచు నొకకోలఁ గూలనేయఁగ నల్ల వాలిగాఁడు" అప్ప. యు. కాం.

ఉక్కఱు. దే. అ. క్రి: చూ, ఉక్కడఁగు. 1. "చ. చిఱునగ వొప్ప గండివము చెచ్చెర సజ్యము చేసి నేనలు, క్కఱ రథసంబుపై నడరఁ గవ్వడి ద్రోణియు నీడఁబోక యుత్తటిఁ దఱుచుంగ." భార. విరా. 5, ఆ.

ఉక్కలుఁడు. వై. విశ. = ఉత్కలః. భారము వహించువాఁడు. "మ. రెండు వే, వెలుఁగుల్ పూనిన కాంచనోన్నతరథం బేపెక్కఁగా నెక్కి యు, క్కలుఁడై యేగ మయుండు సైన్యమున కేకస్వామి యాతండనన్." హరి. పూ 4, ఆ: చూ, నిర్వాహకుఁడు.

ఉక్కళము. వై. వి 1.=ఉపనిష్కరమ్. పురాభిముఖమైన రాజమార్గము: చూ, మార్గము.'; దే. వి. 2. శత్రువు లెత్తివచ్చుటను దెలిసికొనుటకై యుంచు కావలి: చూ, రక్షణము.

ఉక్కళుఁడు. వై. వి. ఆక్షేపించువాఁడు: చూ, వెక్కసి. 1.

ఉక్కిదము. దే. వి. ఎకసకియము: చూ, వంచన.

ఉక్కిరిబిక్కిరి. దే. విశ. ఊపిరి తిరుగనిది రూ- ఉక్కిటిబిక్కిరి.

ఉక్కిఱి. దే వి అనుచ్ఛ్వాసము, ఊపిరి తిరుగకుండుట.

ఉక్కిటిబిక్కిరి. దే వి: చూ, రూ- ఉక్కిరిబిక్కిరి.

ఉక్కిఱుట. దే వి: 1. ఊపిరిపుచ్చుట; 2. ఆయాసపడుట

ఉక్కివము. దే. వి. 1 కపటము, జిత్తు "సీ. గాండీవ మారిగాఁ ల యాయుధంబుల నుక్కివంబున నప్పు డొడిచికొనఁగ, మఱచిన వాఁడయ్యె." భార. అర. 1, ఆ చూ, వ్యాజము 1; 2 ఎకసకియము: చూ, వంచన.

ఉక్కివుఁడు. దే. విశ కపటములవాఁడు. "సీ. కడుఁ గొవ్వి తొల్లి యెప్పుడు నాకు నేఁటేఁటఁ జేయుపూజలు నేడు సేయనొల్ల, నుక్కివుఁడైన దామోదరు కఱపులు విని యొక్క చిడిపిగట్టునకుఁ జేసిరి." హరి. పూ. 7, ఆ చూ, వ్యాధుఁడు. 2.

ఉక్కిస. దే. వి కాసరోగము. "గీ. ఉక్కిస యును దగ్గుఁ బిక్కటిల్లె." భాగ. 6, స్క: చూ, దగ్గు.

ఉక్కీఁడు. దే. విశ. (ఉక్కు + ఈఁడు ) అజ్ఞాని. "ఉక్కీలయి నేర్పులేక తమకించి పయింబడి వొచ్చువారు" నిర్వ. 3, ఆ: చూ, మూర్ఖుఁడు.

ఉక్కు. దే. వి. 1. బీరము. "చ. అని వినిపించి వఱ బల మురాంతకు లుక్కునఁ జొచ్చి యవ్వనం, బునఁ ల దైత్యకోటిఁ బారిద్రొచ్చి కలోకము బాధమానదం, చు నరిశి." వి, పు 7, ఆ. 195: చూ, శౌర్యము. 1; 2. అయస్సారము. "ఆ. ఉక్కు శుద్ధిచేసి యుంచి తినెడు వాఁడు." వేమన. 480: చూ, లోహము.1; 3. చేవ. "క. ఎఱకలుగల కులశైలము, తేఱఁగు మెఱయ రయము నెఱయ దివికి నెగసి బి, ట్టుఱుము జలధరము క్రియ ను, క్కటి తద్వనమెల్ల నదురవనార్చుచుఁ గడిమిన్." భార. అర.6, "క. ఆ; నీయుక్కును బీరముఁ జూచెద." భార. ఆది.6, ఆ; గీ. ఇవ్విధంబునఁ బోరెడు నిందరితనయునుక్కు లావును సంతంత కక్కుడయ్యె." భార. విరా. 5, ఆ: చూ, స్థైర్యము. 1; విశ.

4. కదలనిది: చూ, స్థిరము; అ. క్రి.5. చేచ్చు "ద్వి. ఘోరాహవంబునఁ గుంభకర్ణాది, వీరులు పెక్కండ్రు విమతవిక్రములు, ఉక్కరదఱు విభుండొక్కఁడ చిక్కి, పెక్కటి రఘురాము నితఁడేమి గెలుచు." రా యు. కాం: చూ, మరణించు; 6. నలఁగు. "ద్వి. కరముల రామలక్ష్మణులనిద్దఱును, గరముక్కఁబట్టి రాక్షసుఁ డుక్కుమీఱి." రా. అ. కాం: చూ, సదమదమగు.

ఉక్కుకడ్డీ ద్వ. వి. కరఁగఁబోసిన ఉక్కుకడ్డీ: ఉక్కుకమ్మి, ఉక్కుకోడ, ఉక్కుతునక, ఉక్కుతునియ, ఉక్కుముక్క.

ఉక్కుతీఁగె. ద్వ. వి. వీణలోనగు వానికి వేసెడు (ఉక్కు)తంతి.: చూ, తంతి.

ఉక్కుతునక. ద్వ. వి: చూ, ఉక్కుకడ్డీ.

ఉక్కుతునియ. ద్వ. వి. 1.—పై.—; విశ. 2 శూరుఁడు: చూ, హంవీరుఁడు; 3. ధైర్యశాలి: చూ, దిట్టఁడు.

ఉక్కుతునకలు. జా. బలశాలులు. ఉక్కుముక్కలవలెఁ బెళుకులేక బిగిగలవారు. "గాత్రములాపురిభటు లఖాముణులెక్కటి యుక్కుతునకలు." విజ. 1, ఆ. 76.

ఉక్కుమడఁగు. దే. అ. క్రి. 1: చూ, ఉక్కడఁగు; 2. చచ్చు: చూ, మరణించు. (ప్రే—ఉక్కుమడఁచు.)

ఉక్కుమడఁచు. దే. ప్రే. చచ్చు: చూ, మరణించు.

ఉక్కుముక్కు. దే. వి: చూ, ఉక్కుకడ్డీ

ఉక్కురోసము. దే. వి. 1. అధికగర్వము: చూ, హంకారము; 2. అధికకోపము: చూ, రోషము. (ఉక్రోషము అనివాడుక.)

ఉక్కెక్కు. దే. అ. క్రి. శౌర్యమధికమగు.

ఉక్కెడ. వై. వి. = ఉపకారికా. చీక్కరచేర్చి పొరఁటిన పిండి: చూ, భక్ష్యము.

ఉక్కెఱ. వై. వి.—వై.—

ఉక్త. సం. వి. ఆ. స్త్రీ. ఛందస్సు లిరువది యాఱింటిలో నొకటి: చూ, ఛందస్సులు.

ఉక్తము. సం. విశే. చెప్పఁబడినది: చూ, మాట. 1.

ఉక్తవిషయస్వరూపోత్ప్రేక్ష. సం. వి. ఆ. స్త్రీ. స్వరూపోత్ప్రేక్షా లంకారము: చూ, హేతువు. 2.

ఉక్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. వచనము: చూ, మాట. 1; 2. లచ్చికోడలు: చూ, సరస్వతి; అం. 3. గుణములు ఇరువది మూఁడింటిలో నొకటి: చూ, గుణములు.

ఉక్తుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) చెప్పఁబడినవాఁడు: చూ, కథితుఁడు.

ఉక్థము. సం. వి. అ. న. సామవేదము: చూ, వేదములు (చూ, ఉపవిద్యలు.)

ఉక్థ్యము. సం. వి. అ. న. యాగవిశేషము: చూ, యజ్ఞము.

ఉక్షము. సం. వి. న్. పుం. ఎద్దు: చూ, వృషభము. 1.

ఉష్కాలము. సం. వి. అ. పుం. కోఁతి: చూ, వానరము.

ఉక్షితము. సం. విశే. (అ. ఆ. అ.) 1. చల్లఁబడినది: అవకీర్ణము; 2. తడుపఁబడినది, ఉత్తప్తము: చూ, స్తిమితము 2.

ఉఖ. సం. వి. ఆ. స్త్రీ. 1 కుండ: చూ, భాండము. 3; 2 వంటకుండ: చూ, భాండము 3; 3. సూర్యకిరణము: చూ, మయూఖము. 1; 4. కుంపటి: చూ, పొయ్యి.

ఉఖ్యము. సం. విశే. (అ. ఆ. అ.) పిఠరము, పైఠరము, కుండయందు వండఁబడిన భక్ష్యము. (ఉండ్రాళ్ళు, కుడుములు మొదలగునవి.): చూ, భక్ష్యము.

ఉగము. దే. వి. 1. ఆయుస్సు, జీవితకాలము. "క. ఏనుంగనికర మరయక, భూనిధిఁ గాకిట్టి యెడలఁ బొసఁగునె యేయుం, గానమె కాలనియమ గతితో నావేఁట మునియుగముఁ ద్రుంగించెఁ దుదకన్." రాఘ. 1, ఆ: చూ, వయస్సు. 1; వై. వి. 2. = యుగము. (కృతము, త్రేత, ద్వాపరము, కలి. (4.): చూ, యుగములు.

ఉగాది. దే. వి. చాంద్రాయణ సంవత్సరాది. "ఉగాదిపండుగ."

ఉగాదిపచ్చడి. పా. చాంద్రాయణసంవత్సరాది నాఁడు మామిడికాయముక్కలు, వేపపువ్వు, చెఱుకుముక్కలు చింతపండు పులుసులో కలిపి తినునది. (వా.)

ఉగాదిసంచిక. పా. సంవత్సరాదినాఁడు వెలువడు పత్త్రిక. ఆంధ్రపత్త్రిక, సమదర్శనిలో నగు ఉగాది సంచికలు. (వా.)

ఉగ్గడ. దే. వి. రూ- ఉగ్గడు - ఉగ్గుడు: చూ, మర్యాద.

ఉగ్గడించు. వై. అ. క్రి. 1. మ్రోఁగు. "బంగరుటుందియలుగ్గడింపఁగన్." పాండు. 2, ఆ: చూ, శబ్దించు; స. క్రి. 2 పలుకు. "గీ. అదియుమంగాక జనియించుటాదిగాఁగఁ, బసుల లోనన పెరిగిన పాళసుండు, వావిమాలిన పశు

మార్గ వర్తనంబు, నూనుటరిదియె యిదియేల యుగ్గడింప." హరి. ఉ. 3, అ. "హరివా మాంశములుగ్గడించుచు." లక్ష్మి. 5, ఆ: చూ, వచించు; 3. గొప్పపఱచు: చూ, గౌరవించు.

ఉగ్గడించుట. దే. వి. నాట్యానుగుణశబ్దగుంఫన: ఉగ్గడింపు, ఉగ్గలింపు.

ఉగ్గడింపు. దే. వి 1. —పై—; 2. పొగడ్త: చూ, స్తోత్రము.

ఉగ్గడు. దే. వి: చూ, రూ-ఉగ్గడ

ఉగ్గడువు వై. విశ 1. అధికము, మిక్కిలి "వ. ఏటుగంటియుగ్గడు వగుసెత్తుటనుడిసి క్రిక్కిడు నెత్తుటఁగుంకుమచ్ఛవిం,బడసి." ఉ, హరి. 4. అ: చూ, హేరాళము; 2. శీఘ్రము: చూ, సత్వరము; 3. మిక్కిలి వేఁడిమిగలది. "క. నడురేయితీవ్రభానుఁడు, పుడమి వెలసెనను తలంపుపుట్టించుచు నుగ్గడుఁగు తేజంబున వెలిఁగెడుఁగర్ణుఁడు." భా: చూ, తీవ్రము.

ఉగ్గము. వై. వి. = ఉగ్గ్రాహః. నేయి నూనె పట్టుకొను కలశాదులకు వ్రేలాడునట్ల త్రాటితోఁగట్టెడు ఉగ్గిలి: ఉగ్గిలి; (సం.) :— ఉగ్గ్రాహము.

ఉగ్గలించు. దే. అ. క్రి. నట్టువుఁడు కొలిపించు.

ఉగ్గలింపు. దే వి: చూ, ఉగ్గడించుట.

ఉగ్గించు. దే. స. క్రి. (పడుగుపేకల పోఁగులను) చేర్చు.

ఉగ్గిలి. దే. వి: చూ, ఉగ్గము. "నేతి చెంబునకు ఉగ్గిలికట్టి తెమ్ము."

ఉగ్గు దే. వి. 1. ఉంగ: చూ, కంగు; 2. బట్ట ముడుత: చూ, వలి. 2.

ఉగ్గుడు. దే. వి: చూ, రూ-ఉగ్గడు.

ఉగ్గుపడు. దే. అ. క్రి: చూ, ముడుతపడు.

ఉగ్గుఁబాలతోడ. శా. చిన్నతనమునుండి, పుట్టినప్పటినుండి. "ఉగ్గుబాలతోడనేర్చు." ధర్మజరాజనూయము

ఉగ్గులు. దే. వి శరీరముపైవళులు. "సీ. పేని యుగ్గులుమాన్చి మెదలక చిత్రరూపము భంగిఁ బ్రాత భాతినుండె." సా. 4, అ. (బహువచనరూపము చూపఁబడియె): చూ, వలి. 1.

ఉగ్గులువాఱు. దే. అ. క్రి. నూలిపోఁగు (మెలి పడు.) చూ, వెంటిగొను.

ఉగ్గ్రలి. దే. వి. ఆఁడుది: చూ, స్త్రీ.

ఉగ్ర సం. వి. అ. స్త్రీ. 1. వస *: చూ, విష; 2. పేము*: చూ, వేత్రము; విశ. 3. భయంకరురాలు; అం. 4. శ్రుతులు ఇరువదిరెండింటిలో నొకటి: చూ, శ్రుతులు

ఉగ్రంపశ్యుఁడు. సం. విశ. (అ. ఆ. అ) నాలవ కులమువాఁడు: చూ, శూద్రుఁడు; 2. భయంకరుఁడు చూ, వెఱపరి.

ఉగ్రకాండము. సం వి. అ. పుం కాఁకర *: చూ, వనకారవేల్లము.

ఉగ్రఖేడి శా. (శ్రీయుత రాళ్ళ బండి సుబ్బారావుగారు, ఎం ఏ., ఎల్. టి.) (4) వజ్రహస్తుని కాలమునాటి దారపరాజు శాసనము లో1.(Vide Ep Indica, Vol3,p 221) దాఃముచేయఁబడిన హొస్పండి గ్రామపాలకుని పేరు ఉగ్రఖేడి రాజనియు, అతఁడు కదంబవంశజుఁడనియు తెలుపఁబడినది.శలింగ. 533

ఉగ్రగంధ. సం. వి. ఆ. స్త్రీ. 1 ఒకరకము ఓమము: చూ, యవాని; 2. వస *: చూ, విష; 3. ఛిక్కని *: చూ, చిక్కిక.

ఉగ్రగంధము. సం. వి. అ. పుం. 1. లశునము*: చూ, వెల్లుల్లి; న. 2. ఇంగువ: చూ, హింగువు. 2; 3 ఇంగుద *: చూ, హింగువు. 1.

ఉగ్రత. అం. సంచారీభావములు ముప్పదిమూఁడింటిలో నొకటి: చూ, సంచారీభావములు.

(ఉగ్రత్వము.) "ఓరోరి రావణా! జనకసుతను రామునకొసంగుము. అట్లుగానిచో నీవును, నీలంకయు నస్మత్పాతున్నని బాణాగ్రంబున కశాంశంబునకుంజాలవు."

ఉగ్రము. సం విణ. (అ. ఆ అ.) ఉగ్రభావము, భయమును పుట్టించునది, అంకపాంకములు: చూ, భయంకరము.

ఉగ్రశేఖర. సం. వి. ఆ స్త్రీ. ఆకాశగంగ: చూ, నది.

ఉగ్రసేనుఁడు. శా. పాలక (పాకవాఁడు) దేశమును పరిపాలించినరాజు. సముద్రగుప్తుఁడు ఇతనినిన్ని మఱికొందఱు దక్షిణాపథరాజులను జయించి తిరిగి అనుగ్రహించెనని సముద్రగుప్తుని అలహాబాదు శాసనము. కళింగదేశ చరిత్రను బంధము. 28 పుట.

ఉగ్రసేనజుఁడు. సం వి. అ. పుం. కంసుఁడు: చూ, మాలదేవుఁడు.

ఉగ్రాక్షుఁడు. సం. వి. అ. పుం. వేఁడికంటివేలుపు, ముక్కంటి: చూ, శివుఁడు

ఉగ్రాణము. దే. వి. 1. సామగ్రులుంచెడుగది, కోష్ఠము: చూ, పంటపాల. (ధాన్యాదులు పోయుటకుఁగూడ నుపయోగింతురు.); 2. ధనముంచెడు చోటు: చూ, భాండాగారము.

ఉగ్రుఁడు. సం వి. అ. పుం. 1. వేఁడికంటివేల్పు, ముక్కంటి: చూ, శివుఁడు; 2. శూద్రదానియందు క్షత్రియునికిఁబుట్టి కోశ రక్షణాదులచే బ్రతుకువాఁడు; విణ. 3. భయంకరుఁడు: చూ, వెఱపరి; 4. చెడుమనసు కలవాఁడు. క్రూరుఁడు: చూ, వ్యాధుఁడు. 2; అం. 5. రుద్రులు పదునొకండుగురిలో నొకఁడు: చూ, రుద్రులు.

ఉచకము. సం. వి. అ. పుం. అముదపుఁ జెట్టు. (కన్న-హారుళుగిళ.): చూ, వ్యాడంబకము.

ఉచథ్యుఁడు సం. వి. అ. పుం. ఉచథ్యమహర్షి: చూ, ముని. 1.

ఉచారాజ్యము శా. కళింగదేశ చరిత్ర. (శ్రీయుత నీలకంఠదాస పండితులు. ఎం. ఏ. ఎల్ ఎ.) యువాన్‌చ్వంగు అస్థానమున ఒక స్థూపముండెడిదనియు, అస్థూపముపైనున్న దేదీప్యమానమగు రత్నము నక్షత్రమువలె ఉచారాజ్యమునకు రేవుపట్టణమైన చాత్రము వఱకుఁ గన్పడుచుండెననియు వ్రాసినాఁడు. కళింగ. 268. పొరట

ఉచిఁత. దే. వి. రూ- ఉచ్చిఁత *: చూ, కుండ. 5.

ఉచితజ్ఞత. అం. సుగుణములు యిరువదెనిమిదింటిలో నొకటి: చూ, సుగుణములు.

ఉచితజ్ఞుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఉచితము నెఱిఁగి వాఁడు, ఉచితుఁడు: చూ, సజ్జనుఁడు; 2. పూజింపఁదగినవాఁడు: చూ, పూజితుఁడు. 1.

ఉచితము. సం. విణ. (అ. ఆ అ.) 1. తగినది: చూ, యోగ్యము. 2, 2 ఉంచేఁబడినది: చూ, ఉపహితము; 3. ఎఱుఁగఁబడినది: చూ, సూచితము; 4 కొలఁదియిడఁబడినది: చూ, మితము. 1; 5 తనకుచితమైన ధర్మమును విడువకుండినది, తగినది: చూ, యోగ్యము 2.

ఉచితవంతుఁడు. పా. మంచితెలిసినవాఁడు, జ్ఞాని. "ఆ, ఉచితవంతుఁడైన నుద్యోగపరుఁడున్న, సాగిపారియున్న సమయమునను పరుల కుపకరించి పరగ రక్షించును, విశ్వదాభిరామ వినురవేమ" వేమన. 483.

ఉచితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.): చూ, ఉచితజ్ఞుఁడు.

ఉచ్చ. పా. ర-మేషము; చం-వృషభము; కు-మకరము; గు-కర్కాటము; శు-తుల; బు-కన్య; కు-మీనము; రా-మిథునము; కే-ధనుస్సు.

ఉచ్చండము. సం. విణ (అ. ఆ. అ.) 1. ఆగ్రహముగలది: చూ, రోషము; 2. వేగముగలది: చూ, వేగము. 3

ఉచ్చండిత. అం. భూచారులు పదునాఱుగురిలో నొకటి: చూ, భూచారులు. (పదునాఱుగాని పందొమ్మిదిలేవు.)

ఉచ్చంద్రము. సం. వి. అ. పుం. అద్దమరేయి: చూ, రాత్రి.

ఉచ్చటి. సం. వి. అ. స్త్రీ 1. వట్రువముస్తె, చక్రిల *: చూ, తృణము. 1; 2 గర్వము: చూ, హంకారము; 3. అభ్యాసము: చూ, స్వభావము.

ఉచ్చతమము. పా. శ్రుతిస్థానములు 22 అనఁగా నెదురొమ్ముగుంటకు నూటిగా లోపల వీణాదండము (వెన్నుపూస) అనుపేర్లుగల పృష్ఠాస్థియొక్క ముందటిభాగమున హృదయపద్మమువద్దనుండి కపాలరంధ్రములోపలి దనుకనడ్డముగానున్న నరములు 22వాటిమీఁదనునిచ్చెనమెట్లమీఁదను వలెను మీఁదిమీఁదికి నెక్కిపోవుచును నాదమంతకంతకెచ్చు మొదలిమెట్టు వదలిన తరువాతనుండి ఉచ్చము, ఉచ్చతరము, ఉచ్చతమము ఈచొప్పున నామములఁ బొంగను. వాటిలో హృదయమునంనుండెడి మొదటి యేడుశ్రుతులగుంపు మంద్రస్థాయియనియును, కంఠమునందుండెడి రెండవశ్రుతి సప్తకము మధ్యమస్థాయియనియును, శిరస్సునందుండెడి మూఁడవశ్రుతి సప్తకము తారస్థాయియనియును వాడఁబడుచున్నవి. ప్రతిశ్రుతి సప్తకములోనున్న స్థానములు తప్పకరండాఁ బలుకఁబడెడు నాశ్రుతులకు క్రమముగా షడ్జము, ఋషభము, గాంధారము, మధ్యమము, పంచమము, ధైవతము, నిషాదము అని యేడుపేర్లుగలవు. ఇవియుసప్తస్వరములని ఫించుకొనును: చూ, సప్తస్వరములు.

ఉచ్చతరము. సం. విణ: చూ, ఉచ్చతమము.

ఉచ్చదేవుఁడు. సం. వి. అ. పుం. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1.

ఉచ్చనీచములు. సం. వి. అ. పుం. బ. మంచిచెడ్డలు. "ఉచ్చనీచములు తెలియక మాటలాడకూడదు.": చూ, మేలుగీళ్ళు

ఉచ్చము. సం విణ. (అ. ఆ. అ.) 1. ఎత్తు: చూ, పొడవు. 2; వి. 2. గ్రహగతియొక్క పైభాగము; 3: చూ, ఉచ్చతమము.

ఉచ్చయము. సం. వి. అ. పుం. 1. గుంపు: చూ, సమూహము; 2. ఆఁడుదాని కోకకట్టు అనఁగా నీవి: చూ, పోఁకముడి; 3 ఏనుఁగు బుద్ధిమందముగాఁ బ్రసరించుట.

ఉచ్చరణము. సం. వి. అ. న. ఉచ్చరించుట. రూ-ఉచ్చారణము, ఉల్లేఖము: చూ, మాట.1.

ఉచ్చరించు సం. స. క్రి. చెప్పు: చూ, వచించు:

ఉచ్చరితము. సం. విణ. (అ. ఆ. అ.) ఉచ్చరింపఁబడినది: చూ, వ్యాఖ్యాతము. 2.

ఉచ్చలలాటిక సం. వి. ఆ. స్త్రీ. పెద్ద కనుబొమ్మలుగలది: చూ, మరుండ.

ఉచ్చాటన అం. కళలు అఱువదినాలుగింటిలో నొకటి: చూ, కళలు.

ఉచ్చాటనము. సం. వి. అ. న. 1. పిశాచములను మంత్రశక్తిచేఁ బాఱఁదోలుట; 2. పెళ్ళఁగోఁ బెఱుకుట; అం. 3. షడ్విద్యలలో నొకటి: చూ, విద్యలు. (చూ, ఉపవిద్యలు); 4. ప. రి. హీనతానము లేడింటిలో నొకటి: చూ, ప. రి. హీనతానములు.

ఉచ్చాటనముచేయు. మి. స. క్రి 1. వెడలించు: చూ, వెళ్ళఁగొట్టు.

ఉచ్చారణము. సం. వి. అ. న: చూ, రూ-ఉచ్చరణము.

ఉచ్చారము. సం. వి. అ. పుం. 1. పేఁడ: చూ, పేరిగు; 2. అమేధ్యము: చూ, మలము. 1,

ఉచ్చావచము. సం. విణ. (అ. ఆ. అ) బహు ప్రకారములైన చిత్రములు గలది : చూ, నైకభేదము.

ఉచ్చి. దే. వి. బ్రహ్మరంధ్రము : చూ, మాడపట్టు.

ఉచ్చింగటుఁడు. సం. వి. అ. పుం. 1 తృణగంటము అను చేప: చూ, మత్స్యము. 1; 2. ఆక్రోశి: చూ, రోమణుఁడు.

ఉచ్చింత. దే. వి: చూ, రూ- ఉచిఁతి *: చూ, కుండ. 5.

ఉచ్చింతకాయ. ద్వ. వి విశీర్ణకళలాటువు: చూ, ఉస్తికాయ.

ఉచ్చింతవరుగు. ద్వ. వి. ఎండించిన ఉస్తికాయల సమూహము: చూ, ఉస్తెవరుగు.

ఉచ్చిఁత. దే. వి: చూ, రూ- ఉచ్చింత *. "చెవులకీ తెల్లయుచ్చిఁత కాయలెంతేని." య. 1, ఆ.

ఉచ్చిచ్చిరె దే. వి. కుక్కను పిలుచుటయందగు ధ్వన్యనుకరణము: చూ, హావూహావూ (రూ- ఉచ్చిచ్చిరే.)

ఉచ్చీర్ణము. సం విణ. (అ. ఆ. అ.) అధికముగాఁ జేయఁబడ్డది.

ఉచ్చీయమానము. సం. వి. అ న వృద్ధి చెందుచున్నది.

ఉచ్చూడము. సం. వి. అ. పుం. జెండా వస్త్రమునకు నూర్ధ్వభాగమందలి కుచ్చు.

ఉచ్చూర్ణము. సం. వి. అ. న. అధికముగా పొడియైనది.

ఉచ్చేత్తృ. సం. వి. అ. పుం. చేటుఁ దెచ్చువాఁడు: చూ, నాశకుఁడు.

ఉచ్చేదనము. సం. విణ. (అ. ఆ. అ.) నాశము చేయునది: ఉచ్ఛిన్నము.

ఉచ్చేయము. సం. వి. అ. న. వృద్ధిపొందుటకుఁ దగినది.

ఉచ్చేషము. సం. విణ. (అ. ఆ అ.) మిగిలినది: చూ, శేషము.

ఉచ్చైర్ఘుష్టము. సం వి. అ. న. బెట్టుగాఁ బలుకుట: చూ, బెట్టుసరి.

ఉచ్చైశ్శ్రవము. సం. వి. స్. పుం. ఇంద్రుని గుఱ్ఱము: చూ, హయము.

ఉచీకరించు. దే. అ. క్రి. అనాదరముచే ఉచీ కొట్టును.

ఉచీకొట్టు. దే. వి ఉచీకరించుటయందగు ధ్వన్యనుకరణము: చూ, హావూహావూ.

ఉచ్చ. వై. వి =మూత్రము. నీరుచుట్టు. "క. ఉచ్చెనుఁబుట్టింత నువటు." వేమన. 487; "ఉచ్చెనుఁబుట్టిన తనువిది." వేమన...488-489. 490-491; చూ, మూత్రము.

ఉచ్చబుడ్డ, ద్వ. వి ఉచ్చచేరు తిత్తి: చూ, మూత్రకోశము.

ఉచ్చమల్లి. దే వి. దిసమొల ఆఁడుది, నగ్నిక. "వ. అయ్యవసరంబునఁ గోటవి యనంగ నొక్కయుచ్చమల్లివచ్చి యడ్డుపడిన నానగ్నికం జూచి." ఉ. హరి. 6, ఆ: చూ, స్త్రీ.

ఉచ్చు. దే. వి 1. ఉరి: చూ, వాగుర; అ. క్రి. 2. నాటివెడలు "ఎ. గీ. ఉరమువడిఁ దాఁకి వీఁపునను ఉచ్చిపోయె." భార. భీష్మ. 3, ఆ: చూ; నాటివెడలు.

ఉచ్చాటనము. సం. వి. అ. పుం. అశ్మవి *: చూ, లొద్దుగు

ఉచ్ఛిన్నము. సం. విణ. (అ. ఆ. అ.) 1. నాశముచేయఁబడినది: ఉచ్ఛేదనము; అం. 2. షోడశసంధులు పదునాఱింటిలో నొకటి : చూ, షోడశసంధులు.

ఉచ్ఛిష్టపత్రము. సం. వి. అ. న ఎంగిలి విస్తరి: చూ. పుల్లియ. 2.

ఉచ్ఛిష్టము. సం. విణ. (అ. ఆ. అ.) 1. అంటు:

చూ, ఎంగిలి; 2. అంటరాని వస్తువు : చూ, ఎంగిలి.

**ఉచ్ఛిష్టుఁడు.** సం. విణ. (అ ఆ. అ.) భోజనానంతరము నోటిని చేతులను కడుగుకొనక యశుచిగానుండువాఁడు.

**ఉచ్ఛూనకము.** సం. వి. అ. న. దంతక్షతము లేడింటిలోనొకటి, సంభోగాదులయందుఁ గొఱుకుట: చూ, దంతక్షతములు.

**ఉచ్ఛూనము.** సం. విణ. (అ. ఆ. అ.) దట్టము: చూ. సాంద్రము. 2.

**ఉచ్ఛ్రయము.** సం. వి. అ. పుం. ఉన్నతి: చూ, పొడవు. 2. (చెట్లు మొదలగువాని పొడవు.)

**ఉచ్ఛ్రాయము.** సం. వి. అ పుం.—పై.—

**ఉచ్ఛ్రితము.** సం. వి. అ. పుం. 1 దేవదారువు: చూ, సూక్ష్మదారువు; 2 ధ్వజస్తంభము: చూ, స్తంభము. 1; విణ. 3. పెరిగినది: చూ, వృద్ధము. 4; 4. పొడవైనది: చూ, పొడవు. 2; 5 పుట్టినది, అంకురితము: చూ, సంభూతము; 6. కొల్వివినది: చూ, స్థూలము.2; 7. గుంపుగూడినది: చూ, సమూహము.

**ఉచ్ఛ్వసనము.** సం. వి. అ. న. ఊపిరివిడుచుట: చూ, వాయువు.

**ఉచ్ఛ్వసితము.** సం వి. అ. న. 1.—పై.—; విణ. 2 ఊపిరి వెలికిఁబుచ్చినది.

**ఉచ్ఛ్వాసనిరోధము.** సం. వి. అ న. ఊపిరి. పుచ్చనీక నొప్పించెడి రోగము, ఊపిరికట్టు: చూ, యాతము.

**ఉచ్ఛ్వాసనిశ్వాసలు** పా. ఊపిరిపీల్చుట విడుచుట లోనగునది.

**ఉచ్ఛ్వాసము.** సం. వి. అ. పుం. 1. ఊపిరి విడుచుట, ఉచ్ఛ్వసనము: చూ, వాయువు; 2. ఊఱుట: చూ, ప్రశ్రయము; 3. కటాశాది జలనిర్గమస్థలము: చూ, మరిగొమ్మ; 4. ఆఖ్యాయిక పరిచ్ఛేదము, వాస్తవార్థము గల వార్త చరితాదిగ్రంథము (ఆశ్వాసము, సర్గ. మొ.); గద్యపద్యములుగల చంపూ గ్రంథభాగము: చూ, పరకథ; 5. జీవనము: చూ, బ్రతుకు. 1; 6. ప్రాణవాయువు: చూ, వాయువు; 7. ఎగఊపిరి: చూ, వాయువు.

**ఉచ్ఛ్వాసావరోధము** సం. వి. అ న: చూ, ఉచ్ఛ్వాసనిరోధము

**ఉజ్జయిని.** సం. వి. ఈ స్త్రీ. 1.=ఉజ్జేని, అవంతియను పురము, విక్రమార్కుఁడేలిన పట్టణము : చూ, దేశము; శా. 2. — (27) ఉజ్జేనిలేపిచుకుమారే ఏతాయేవ ఆతాయేని భాసయిన ...; సం. ఉజ్జయినీతోఽపిచ కుమారపితస్త్రై అర్థాయ నిష్క్రమయివ్యతి తాదృశమేవవర్గం న చాతిక్రమిష్యతి త్రీణి వర్షాణి. తెనుఁగు.— ఉజ్జయిని నుండి కూడ రాజకుమారు లందుకొఱకే పైగుణములు కలిగిన యొకనిని పంపుచుందురు. మూఁడేసి సంవత్సరము లతిక్రమింపకుండ నాతఁడిట్లు పంపుచుండును అశోకుని కళింగశాసనములు; కళింగ దేశ : రితాంనుబంధము. 11, 12 పొరటలు;

**ఉజ్జాసనము.** సం. వి. అ. న. చంపుట: చూ, వధము.

**ఉజ్జి.** దే. వి. జంట: చూ, సంగడి. 5; విణ. 2. పోలిక: చూ, సమానము.

**ఉజ్జీవనము** సం. వి. అ. న. 1. జీవనము: చూ, బ్రతుకు. 1; 2. మరల బ్రతుకుట: చూ, పునర్జీవితము.

**ఉజ్జీవించు.** సం. అ. క్రి. జీవించు: చూ, బ్రతుకు 3.

**ఉజ్జృంభణము.** సం. వి. అ. న. ఆవులింత: చూ, పాఫిక.

ఉజ్జృంభితము. సం. వి. అ. న. చేఁత: చూ, పని 2; విణ. 2. విరిసినది: చూ, వ్యాకోచము.

ఉజ్జ్వల. సం. వి. ఆ స్త్రీ. గ్రంథవిశేషము.

ఉజ్జ్వలత. అం. నఖక్షతము లాటిగాటిలో నొకటి: చూ, నఖక్షతములు.

ఉజ్జ్వలత్వము. సం. వి. అ. న: చూ, ఔజ్జ్వల్యము.

ఉజ్జ్వలము. సం, వి అ పుం. 1. శృంగారము: చూ, సౌందర్యము; 2. తెలుపు: చూ, వర్ణము 6, విణ. 3. వెలుఁగునది: చూ, తగశము. 4; 4 స్వచ్ఛమైనది: చూ, ప్రసన్నము. 2; 5 విరియునది: చూ, వ్యాకోచము.

ఉజ్జ్వలుఁడు. సం. విణ (అ ఆ. అ.): చూ, వేడుకకాఁడు.

ఉజ్ఝనము. సం. వి. అ. న = ఉజ్జేఁ. విడిచిపెట్టుట: చూ, విమోచనము

ఉజ్ఝితము. సం. విణ విడిచినది: చూ, సముజ్ఝితము.

ఉజ్జే. దే. వి. అపూర్వార్థము నుత్ప్రేక్షించుట: చూ, తర్కము. 2

ఉజ్జేగము వై. వి. విడుపు: చూ, విమోచనము

ఉజ్జగించు. దే. స. క్రి విడుచు: చూ, విసర్జించు.

ఉజ్జేగింపు. దే వి. విడుపు: చూ, విమోచనము.

ఉజ్జేగిలు. వై. అ. క్రి 1. తొలఁగు. చూ, విరియు. 5; 2. ఇంకు "చెమ్మనీ, రుజ్జేగిలక." స్వా. 5, ఆ. 57: చూ, శోషించు. (రూ-ఉజ్జేగిల్లు —తొలఁగు.— "ముక్తి ద్వాపగము జేగిల్లుతటి." పాండు 3, ఆ.)

ఉజ్జేగొను దే. స. క్రి. (ఉజ్జ + కొను) 1. ఊహించు. "నీ అపకీర్తికోడఁబడు నొగాముతెలుఁగఁడు లజ్జాభిమానంబు లుజ్జేగొనఁడు." రుక్మాం. 5, ఆ. 149: చూ, సందేహించు; అ. క్రి. 2. ఫలపరిమితి నూహించు: చూ, ఊహించు

ఉజ్జేన. వై. వి.=ఉజ్ఝనమ్. విడుపు: చూ, విమోచనము (రూ-ఉజ్జేనము —"గీ అనిశవాసశాలంబు నుజ్జేనమొనర్చి, యక్కుమారుఁడు నేమిరా యనుచునుండె" విక్ర. 3, ఆ. 112.)

ఉజ్జేనసేయు. వై. స. క్రి. (ఉజ్జనము + చేయు.) విడుచు "నీ సంధ్యాభివందన శ్రద్ధ యుజ్జేనసేయు" కాశీ. 4. ఆ. 81: చూ, విసర్జించు

ఉజ్జేని. వై. వి.=ఉజ్జయిని. అవంతి. "మ. తానేగను, జ్జేనికిఁ సమ్మతిఁ బాదుకంబువలనన్ సంతోషితస్వాంతుఁడై." విక్ర. 2, ఆ. 40: చూ, ఉజ్జేయిని.

ఉజ్జాయించు. దే. స. క్రి 1. అనుమానించు: చూ, సందేహించు; 2 ఫలపరిమితినూహించు: చూ, ఊహించు.

ఉజ్జేనకల్లు. ద్వ. వి. అగ్నిపర్వతమునుండి వెడలఁగ్రక్కఁబడిన తాయి: చూ, రాయి.

ఉఞ్ఛవృత్తి పన్నాస శా. సత్యాశ్రయ మహారాజు కుమారుఁడును కీర్తివర్మ పుత్రుఁడునైన ఆదిత్యవర్మ దేవశర్మ అగ్నిశర్మ యను బ్రాహ్మణులకు ముణ్డకల్లు పాల్గొ యను గ్రామములను "ఉఞ్ఛవృత్తిపన్నాస" యను వృత్తిగ నిచ్చెనని తెలుపంబడి యున్నది రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక, 63.

పోరటు.

ఉటంకము దే.వి టూకి: చూ, సంగ్రహము 2.

ఉటంకి. దే. విణ 1. రూ-ఉటంకు, చొరవగలవాఁడు: చూ, సాహసికుఁడు; 2. రూ-ఉటంకు, ధైర్యశాలి: చూ, దిట్టఁడు.

ఉటంకించు దే. స. క్రి. టూకించు: చూ, సంక్షేపించు.

ఉటంకు. దే. విణ: చూ, రూ-ఉటంకి.

ఉటజము. సం. వి. అ పుం. 1. పర్ణశాల: చూ, గృహము.1; 2. ఇల్లు: చూ, గృహము 1.

ఉటము. సం. వి అ. న. ఆకు (కన్న-ఎలె.): చూ, పర్ణము 1. (చూ, ఆకు. 2.)

ఉట్టంకణము. సం. వి అ. న. కిప్పుట: చూ, స్థాపనము.

ఉట్టంకితము. సం విణ. (అ. ఆ అ.) స్థాపింపఁబడినది: చూ, స్థాపితము.

ఉట్టి. దే. వి. 1. వడలు లోనగునవి యుంచుటకై దారములతో -వ్రేలఁగట్టెడి యంత్ర విశేషము, చిక్కము: చూ, శిక్యము 1; 2. కావడిపట్టు. చూ, శిక్యము 2; 3. చింతపండు గుంజును అంటియుండెడు పీఁచు. చూ, చింతఉట్టి.

ఉట్టిఁబెట్టిన గుమ్మడికాయవలె లో. "అమ్మగువ గనుంగొనియెన్, ముమ్మరముగఁ బట్టె నామములు మైనెల్లం, గ్రిమ్మకొన నుట్టిఁబెట్టిన, గుమ్మడికాయయును బోలెఁ గూర్చున్న తఱిన్." వైజయంతీ విలాసము

ఉట్టికట్టుకొని యూఁగులాడుట. జా చెవకుండుట. "ఈలోకములోనె యెల్లకాలము నుట్టిఁ గట్టుకొని యూఁగులాడము." (నీతిచంద్రిక - సంధి.)

ఉట్టిచీల. దే వి. ఇరుప్రక్కలతలయేర్పడిన చీల.

ఉట్టిపడు. దే. అ. క్రి. 1. ఉన్నట్టుండి కలుగు: చూ, పుట్టు. 2; 2. అతిశయించు. "ఆయత బంధుర లంఘనోద్ధతిన్ గూర్చినవేగ ముట్టిపడ." శేష. 2, ఆ: చూ, ముమ్మరించు.

ఉట్టిపడుట. జా. ప్రత్యక్షమగుట, జారిపడుట. "శాంతరసమెల్ల నుట్టిపడఁగ సంగసల పొందు గోసి." విజయవిలాసము; "ఉట్టి పడటు లెండుండి వచ్చెఁగడింది విలుదోయితో రాజవీర యుగము." రామాభ్యుదయము.

ఉట్టియెక్కలేనమ్మ స్వర్గమునకెక్కునా. లో. ఎక్కనే యెక్కలేదు అనిభావము.

ఉట్టు. దే. వి. 1. ఉప్పు పండఁదగిన నేల: చూ, భూమి 1; 2. ఉప్పురాసులుండు చోటు, నట్టు: చూ, భూమి. 1; 3. బాలక్రీడా విశేషము, ఉప్పట్టు: చూ, బాలక్రీడ; అ. క్రి. 4. కాలు. "గీ ఆర్చి నెత్తురుట్ట నమ్మస్తకము పట్టి, కొని యతం డుదాత్తఘోరభంగి, బ్రిమరి పాటికురుస్మసాలకు నగదంబు,నందు త్రైచి యిట్టులనియె నధిప" భార. ద్రో. 5, ఆ. 205; భాగ. కాం. 3, ఆ.21: చూ, స్రవించు.

ఉట్రవడియము. ద్వ వి. 1. ఒకరకము వడియము: చూ, వడియము; 2. ఒకరకము పిండి వంట: చూ, భక్ష్యము

ఉట్లబొద్ది. దే వి. ఒకానొక చెట్టు: చూ, వృక్షము.

ఉఠాణి. దే. విణ. ఉన్నతము, గొప్ప: చూ, పొడవు. 2.

ఉడకఁబెట్టు ద్వ. స. క్రి ఉడుకునట్లు చేయు: చూ, ఉడికించు. 1.

ఉడత. దే వి రూ-ఉడుత: చూ, చిక్రోడము (వీఁపున మూఁడు నిడుపుగీఁతలు గల జంతువు.)

ఉడాములు. వా. దాఁట్లు "నాలుగు ఉడాములు వేసినాఁడు."(గోదావరిజిల్లాలోవాడుక.)

ఉడాయించు. హిం. క్రి. పాఱిపోవు, హరించు, ఎగిరిపోవు.

ఉడాయింపు. వా. పాఱిపోవుట. "వాఁడు కనిపించకుండఁగ ఉడాయించినాఁడు."

ఉడి. దే. వి. పొల్లు: చూ, వ్యర్థము.

ఉడికించు. దే. స. క్రి. 1. (పిండి) ఉడుకునట్లుచేయు: ఉడకఁబెట్టు; 2. బాధపెట్టు: చూ, బాధించు; 3. అవమాన పఱచు: చూ, భంగించు.

ఉడికిలించు. దే. స. క్రి. నొప్పించు: చూ, బాధించు.

ఉడికిల్లు. దే. అ. క్రి. తపించు: చూ, సంతాపించు.

ఉడిగము. దే. వి. రూ-ఊడిగము, పరిచర్య. "మహాస్రగ్ధర. "అత్యర్థులకుంబుత్తెంచె భూనాథుసతియుడిగంబుందోయజాతాక్షి చేతన్" వై. 8, ఆ, 22: చూ, శుశ్రూష.

ఉడిగించు. దే. స. క్రి. అడ్డగించు: చూ, నిరోధించు.

ఉడివోనిపల్కులు. దే. వి. బ. మొదటి మినుకులు: చూ, వేదము.

ఉడివోవు. దే. అ. క్రి. (ఉడిగి + పోవు.) 1 తొలఁగు "క. అడిసిగ్గులు తమకంబులు,నుడివోవఁగఁ గేలికడఁక లాదవఁగ." మార్క. 8, ఆ. 195: చూ, విరియు. 5; 2. ఆఱడిపడు: చూ, వ్యర్థమగు

ఉడుఁబోతు. దే. విణ. (ఉడుగు + పోతు.) ఉడుగువాఁడు: చూ, విరతిశీలుఁడు. (ఉడుకుడుకుఁబోతు లోనగునది.)

ఉడుఁబోతుపిందె. ద్వి. వి. కాపు ఉడిగినపిమ్మట చెట్లయందుకలిగెడు పిందె "చెట్టుచచ్చుకాలమున నుడుఁబోతుపిందెల" ను లోకోక్తి.

ఉడుక. వై. వి.= హుడుక. రూ- ఉడుక్క. చూ, వీణె.

ఉడుకాటము. దే. వి. వంట యగుట, ఉడుకుట: చూ, సూపకారము.

ఉడుకాఁడు. దే. అ. క్రి. తపించు: చూ, సంతాపించు

ఉడుకు. దే. వి. 1. తాపము: చూ, సంతాపము; 2. వంట: చూ, సూపకారము; అ. క్రి. 3. తపించు: చూ, సంతాపించు; 4. (అన్నము) పచనమగు: చూ, వంటయగు.

ఉడుకుఁబోతు. దే. విణ. (ఉడుకు + పోతు.) అసహనుఁడు: చూ, సూపుకాఁడు.

ఉడుకుట. దే. వి. 1: చూ, ఉడుకాటము; 2. తపించుట. చూ, సంతాపము; 3. అపహాస్యమువలనఁ గోపముఁజెందుట; 4. ఎసరు కాఁగుట, అన్నము ఉడుకుటలోనగు ధ్వన్యనుకరణము "తుకతుకమని, కుతకుతమని, తెకతెకమని యుడుకుట." చూ, హాహాకారా.

ఉడుకువ. దే. వి. ఊటలు. "సీ. వాపిరిపాదలెడి వాపుసందడిఁబడి యురియుచు నునికికి నుడుకువయును." భార. విరా. 2, ఆ 315: చూ, పిత్రాంతి. 2.

ఉడుక్క. వై. వి.= హుడుక్క: చూ, రూ- ఉడుక.

ఉడుగర. దే. వి. 1. పొదవగు బట్ట: చూ, వస్త్రము; 2. కానుక "గీ. కడఁకరాసింగము నకుడుగర లొసంగె." అచ్చ. యు, కాం. 55. చూ, లంచము; 3. బహుమానము, ఇనాము "వరాముండతని గాఁగిటంజేర్చి గారవించి యుడుగరలిచ్చి యనిచిన" య. 3, ఆ 27: చూ, మర్యాద.

ఉడుగు. దే. అ. క్రి. 1. కృశించు: చూ, వడియు. 3, 2. చాలు: చూ, పర్యాప్తమగు; 3. రూ-ఉడువు. త్యజించు. "ఉత్పలగంధినన్నుడిగి యొడ్లను బంపుము." భార. విరా 2, ఆ. 93. "క. ఉడుగునె క్రతువులఁ దపముల." వేమన 496: చూ, విసర్జించు

ఉడుగువాఁడు. ద్వి. వి: చూ, ఉడుఁబోతు.

ఉడుత. దే. వి: చూ, రూ- ఉడత. (వీఁపున మూఁడు నిడుపుగీఁతలుగల జంతు విశేషము.)

ఉడుతకునుడుతభక్తి. లో. తనశక్తికి సరిపడినపని భక్తితోఁజేయుట (దీనికి కథకలదు)

ఉడుతచీర. దే. వి. చిత్రవర్ణవస్త్రవిశేషము: చూ, వస్త్రము.

ఉడుతచీరంచు. దే. వి. వస్త్రాంచలవిశేషము: చూ, బద్దె 1.

ఉడుపకుక్క. ద్వ. వి. (ఉడుము + కుక్క.) ఉడుము మొదలగువానిని వేఁటాడెకు శుద్ధికునకము, మొఱసడము. "క. బొగిలములు మొఱసడములు, సాగెఁగలసి చాపముక్తశర గతినందా, బొగిలము లెదిరెఁబందుల,క్రోధాదికము గాలికడచె నితరముల్." స్వా. 4, ఆ 41. (మఱియొకచో చెప్పఁబడినపుడు. "గీ ము న్ను బొగిలములఁగూడి వన్నియట్టి, యుడుపకుక్కలు కుందేళ్ళగుందురువుల, నుడుములఁ గ్రహింపఁ బుట్టల కడలఁబొదల, గిరులసరియలఁ బనివట్టి తిరుగుచోట" స్వా. 4, ఆ. 51): చూ, శునకము

ఉడుపపిల్ల. ద్వ. వి: చూ, గాధేరము

ఉడుపము. సం. వి. అ.న. తెప్పమాగ్రిను, ప్లవము. చూ, దోనె. 1

ఉడుపు. దే. వి 1 ఒకరకము బట్ట చూ, వస్త్రము; పేరి 2. ఉడుగఁజేయు. చూ, నిరోధించు.

ఉడుపుడు. సం. వి. అ. న. 1. చంద్రుఁడు: చూ, చంద్రుఁడు; 2. అంబుభూపణుఁడు: చూ, వరుణుఁడు. 1.

ఉడుపుష్పము. సం. వి. అ. న. 1. అశోకము*: చూ, హేమపుష్పము; 2 తామర*: చూ, పద్మము. 1; 3 దాసనము*: చూ, హాయజీవన మారకము.

ఉడుము. దే. వి. గోధిక: చూ, తేలుమేపరి. (బల్లివంటి రూపముగల ఒక పెద్దజంతువు.) "ఆ ఉడుముతోఁకఁబట్టి యురిదిగాలాగెను." వేమన. 497.

ఉడువు. సం. వి. ఉ. స్త్రీ, న. 1. ఒక నక్షత్రము: చూ, నక్షత్రము. 1, దే స. క్రి. (1) రూ-ఉడుగు. త్యజించు. "ఉ. వింత యొకామశక్తినుడివింపఁగ శక్యమె యెట్టివారికిన్" భార. ఆది. 7, ఆ. 59: చూ, విసర్జించు.

ఉడుసర దే. వి. కాఁచి*: చూ, వాయవి.

ఉడ్కువ దే. వి. ఉడుకు. "వ. వలవదురోయఁ పాండవులవారొక యుడ్కువలేని త్రిమ్మరిటన్, బలమతి వన్యసత్త్వములపాల్పడి చచ్చి నచోటఁ బూరియున్, మొలవదె." భార. విరా. 3, ఆ. 96: చూ, విశ్రాంతి. 2

ఉడ్డ. దే. వి. 1. రూ-ఉడ్డా. రాసి. చూ, రాశి. 1; స. 2. రూ-ఉడ్డా చతుస్సంఖ్య: చూ, నాలుగు.

ఉడ్డకేలుగలాఁడు ద్వ. వి. చతుర్భుజుఁడు: చూ, విష్ణువు. 1. (ఇట్లు ఉడ్డకేలు వేలుపు.)

ఉడ్డమోము వేలుపు. ద్వ వి. నలుమోముదేవర: చూ, బ్రహ్మ. 1.

ఉడ్డా: చూ, రూ-ఉడ్డ.

ఉడ్డాచేయు. దే. స క్రి రాసినుండి గింజ తేలుట.

ఉడ్డాడించు గ్రా. స క్రి. కంగారుపెట్టు: చూ, సంక్షోభించు.

ఉడ్డాడు. దే. అ. క్రి. కలఁగు. "ద్వి. వేగనందునిపల్లె వెఱచి యుడ్డాడ, నలయశక్తి వర్తించుఁడని పల్కు యనుప." భాగ. 10. స్కం: చూ, సంక్షోభించు.

ఉడ్డామరుఁడు. సం. వి. అ పుం. నేరుపరి: చూ, సమర్థుఁడు.

ఉడ్డీనము సం. వి. అ. న. ఎగవు, సెగవు, పైకెగురుట. (పక్షిగతి విశేషము:-ఉడ్డీనము= పైకెగురుట, ప్రడీనము=మొదటిఎగురు, సండీనము=చెట్టు మొదలైనవాని మీఁదికెగురుట, ఉత్క్రమణము=మీఁదికిఁ బోవుట.) చూ, పల్లటీ. 1.

ఉడ్డుకుచు. దే. అ క్రి. ఊపిరి త్రిప్పలేక బాధపడు. "వ. ఉదవాసక్లేశంబున నుడ్డు గుడిచి వెలుపలికిఁ బుటమెగయుచు." పాం డు. 3, ఆ. 150: చూ, సంభ్రమించు. (రూ- ఉడ్డగుడుచు)

ఉడ్డపల్లంచి. ద్వ. వి. బాలికా క్రీడావిశేషము: చూ, బాలికాక్రీడ.

ఉణుజు. దే. వి. ఒకరకము చేఁప: చూ, మత్స్యము. 1.

ఉత్. సం. ఉప. 1. ఉచ్ఛ్రయము=ఇచట 'ఉత్' అనునది ధాత్వర్థమును సమూహము అను నర్థముగా మార్చినది; 2. ఉచ్చారణము= ఇచట ధాత్వర్థమును పలుకుట అను నర్థముగా మార్చినది; 3. ఉచ్ఛిష్టము=ఇచట ధాత్వర్థమును ఎంగిలి యను నర్థమునకు మార్చినది; 4. ఉజ్జీవము=ఇచట వ్యర్థమయినది; 5. ఉల్లాసము=ఇచట ధాత్వర్థమును సంతోషమను నర్థమునకు మార్చినది; 6 ప్రకాశము; 7. ఓంకారము రెండు ధాతువుల నుండియు ఒక ఉపసర్గనుండియు సిద్ధమగుచున్నదని మాండూక్యోపనిషత్కారుల మతము. "అవ" ధాతువు నుండి "అ" "ఉత్" అను ఉపసర్గనుండి "ఉ" "మా" లేక "మీ" ధాతువునుండి "మి" కలసి "ఓమ్" అగుచున్నది. (చూ, ఓమ్.)

ఉతక. దే. వి. ఉత్తరాసి తిరిగాడు కొయ్య. రూ- ఉదక: చూ, జోలుమ్రాను

ఉతము. సం. విశే. (అ. ఆ. అ.) నేయఁబడినది కుట్టఁబడినది. (వస్త్రాదిద.), రూ- ఊతము: చూ, మ్యూతము.

ఉతాహో. సం. అవ్య. 1. అహో: చూ, యద్వా; 2. ప్రశ్నార్థకము: చూ, ప్రశ్నము. 3: చూ, విచారము.

ఉతికించు. దే. స. క్రి. ఉతుకునట్లుఁ జేయు.

ఉతుక. దే. వి. చూ, ఉతక. "ఆ. ఉతుకలోని తలుపునూగించి నెట్టెడి, పదునెత్తింగి లోన బట్టుపట్టు, మతినిఁ గూడిమించి మర్మంబుఁ గానరో, విశ్వ..." వేమన. 508.

ఉతుకు దే. స క్రి. రూ- ఉదుకు: చూ, పులుము. 4.

ఉతుకుట. దే. వి. క్షాళనము, కడుగుట: చూ, ప్రక్షాళనము.

ఉత్కా. సం. వి ఆ. స్త్రీ. సంకేతస్థలమునకు నాయకుఁడు రాకుండుటను చింతించుచున్న నాయిక చూ, స్త్రీ.

ఉత్కంఠ. సం. వి. ఆ స్త్రీ. 1. ఇష్టవస్తు సంప్రాప్తియందలి వేగిరపాటు, తహతహ: చూ, వ్యసనము; 2 జీలుగు *: చూ, సితవీర్య.

ఉత్కంపించు సం. అ. క్రి. ఆకంపించు చూ, వణఁకు. 2.

ఉత్కళికజవిభాష. అం. ద్రావిడి. (చూ, భాష. 1.)

ఉత్కటదంతుఁడు. సం. వి అ. పుం దంతురుఁడు: చూ, మిట్టపండ్లవాఁడు.

ఉత్కటము. సం.వి. అ న 1 లవంగపుపట్ట*: చూ, వరాంగకము; 2. కరాపువు *: చూ, లవంగము; 3. ఏనుఁగుమదము: చూ, మదము. 1; విశే. 4. అధికమైనది: చూ, హెచ్చు. 1; 5 మదించినది: చూ, మదము. 1; 6. తెలికిలినది చూ, ఉత్తానము.

ఉత్కటుఁడు. సం, విశే. (అ. ఆ. అ.) మదించినవాఁడు, ఉన్మత్తుఁడు: చూ, మత్తుఁడు.

ఉత్కము. సం. విశే (అ. ఆ. అ.) ఉత్కంఠ కలది.

ఉత్కరము. సం. వి. అ. పుం. 1. గుంపు: చూ, సమూహము; 2. ప్రోవు: చూ, రాశి. 1.

**ఉత్కర్షము.** సం. వి. అ. పుం 1. మేలు: చూ, శ్రైష్ఠ్యము; 2 అతిశయము: చూ, హెచ్చు 2.

**ఉత్కల.** సం. వి. ఆ. స్త్రీ. జీలుగు *: చూ, స్వర్ణపుష్పి.

**ఉత్కల (ళ)** కైశికీజభాషలు అం ఇవి రెండు.- మాళవ, భిన్నవళిత: చూ, భాష. 1.

**ఉత్కల (ళ) దేశచరిత్ర.** శా. (మ॥ రాళ్లబండి సుబ్బారావుగారు, ఎం. ఏ, ఎల్. టి.) ఋగ్వేద కాలమున నుత్కలనామముండినట్లు తెలియదు కాని రఘువంశకావ్య కాలమున నుత్కలదేశమేర్పడి యుండెను...గంగానది, మహానదుల మధ్యదేశ ముత్కళమనియు పిలువఁబడెను ఉత్కళింగములోని పశ్చిమమున నోడ్రులుండిరి. ఇత్యాదివివరములు. కళింగ దేశచరిత్ర. 557 లు 676. పొరటలు.

**ఉత్కల (ళ) దేశము.** శా. 16. దేవేంద్రవర్మ కంబకాయశాసనము (మ- రా- శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు.) ఈ శాసనమున మూఁడు రాగిరేకులు కలవు...అక్షరములు పొంకముగనుండక కొంకిరిగింతలవలె నుండును భాష సంస్కృతము. భాషయు వ్రాఁతయు కూడ చాల పాడుగానున్నది శాసనభాషలో ప్రాకృతచ్ఛాయ మెండు. దీనిననుసరించి ప్రాయుముగ లేఖకుఁడు ఉత్కలదేశనివాసుఁడై యుండునని యూహింపఁదగును...దానమును గురించి చెప్పఁబడిన పిదప దానమొసంగిన గ్రామమునకు సరిహద్దులు చెప్పఁబడెను. కళింగదేశ చరిత్రానుబంధము. 79 పొరట, (ఇందును గురించి విశేషాంశములు అందు గలవు)

**ఉత్కల (ళ) దేశస్త్రీ** అం. దేశస్త్రీలు యిను పదినలుగురిలో నొకతె: చూ, స్త్రీ.

**ఉత్కలనము.** సం. అ. వి. న. పెండ్లిపేడుక.

**ఉత్కలపతి.** శా. అనంతవర్మ చోడగంగదేవుని కొర్ని శాసనము. (మ. గిడుగు వేంకటసీతాపతిగారు, బి. ఎ, ఎల్. టి) ఈ శాసనము గూడ అయిదురేకులు గలదే...సం. 102 బిభ్రతి పూర్వత్ర స్యాందిశి పూర్వ ముత్కలపతిం రాజ్యే విధాయాద్భుతం పశ్చాత్పశ్చిమ; 103 దిక్తటే విఘటితం వేంగీశ మస్యేబలియోః లక్ష్మీభందన మాలికామివ జయశ్రీ; 104 తోరణ స్తంభ యోర్బద్ధ్వా తిష్ఠ సమిద్ధ కీర్తివిభవ శ్రీగంగచూడామణిః॥ స. తెనుఁగు తర్జుమా.— మొట్టమొదట తూర్పుదిశయందు రాజ్యభ్రష్టుఁడైన ఉత్కలపతిని రాజ్యమందుమరల నిలువఁబెట్టి, పిమ్మటఁ బశ్చిమదిశయందు నిఘటితుఁడైన వేంగిరాజును కూడా ఉన్నట్లే నిలువఁబెట్టి వర్ధిల్లుతూ ఉన్న కీర్తివైభవముగల ఏ శ్రీ గంగచూడామణి జయలక్ష్మియొక్క తోరణ స్తంభముల వలె నున్న ఆ ఇద్దఱి (రాజుల) యొక్క లక్ష్మి నిన్ని భందనమాలికను (మంగళతోరణము) కట్టేటట్లు కట్టెనో; కళింగ. అనుబంధము.78. పుట; 19. నరసింహదేవుని కెండుపట్న తామ్రశాసనము (మ- రా- శ్రీ చిరావూరి ఆత్మారాంగారు బి. యే. బి. ఎల్.) ఈ శాసనమున 7 రేకులు గలవు ..రేకులు, 18¼ అం. పొడవున్ను, 8¾ అం. వెడల్పున్న, 1/5 అంగుళము దళసరియున్ను గల్గియున్నది... ఉత్తరళ దేశాధీశుండును, గంగవంశీయుండు నగు రెండవ నరసింహదేవుఁడు ఈ శాసనమున పేర్కొనఁబడిన ఏడర, లేక ఏడ్గార గ్రామమును, సుశైలగ్రామమును తన 21వ రాజ్యసంవత్సరమున అనఁగా క్రీ. శ. 1295 వ సంవత్సరమున భీమదేవశర్మ యను బ్రాహ్మణునకు చంద్రగ్రహణ కాలమున దానమిచ్చెను. కళింగ. అనుబంధము. 88 పొరట.

ఉత్కలము. అం. ఒకానొక దేశము. చూ, దేశము.

ఉత్కలిక. సం. వి. అ స్త్రీ. 1. తహతహ: చూ, వ్యసనము; 2 అల: చూ, వీచి. 1; 3. పెద్దఅల: చూ, వీచి. 1; 4 మొదుగు మొగ్గ తొడగడము: చూ, అంగారితము. 1; 5. మోదుగు మొగ్గ: చూ. మోదుగు; 6. భ్రూనేత్రాది వికారములచేత ఎక్కుఁగా తెలియఁదగిన మనోవికారము: చూ, హేల.

ఉత్కలితము సం. విణ. (అ. ఆ. అ.) సంకలితమునకు మూలమతీయునది.

ఉత్కలుఁడు. సం. విణ. (అ. ఆ. అ): చూ, ఉత్కలుఁడు.

ఉత్క(ళు)లు. శా. కళింగదేశ చరిత్ర. (మ. రా. శ్రీ బండి సుబ్బారావుగారు. ఎం. ఏ, ఎల్. టి.) క్రీస్తుశకమునకు పూర్వపుచరిత్ర.— మహాభారత భీష్మపర్వమందు ఉత్కళులు పేర్కొనఁబడిరి. కళింగ. 438 పొరట; కళింగనగరము. (శ్రీయుత గాదె నరసింగరావుగారు, బి. ఎ. ఎల్. టి.) రఘువంశము నాల్గవసర్గయందీక్రింది శ్లోకము గలదు.—"సతీర్త్వా కపిశాం సైన్యైః బద్ధద్విరద సేతుభిః ఉత్కలైరదర్శితపథః కలింగాభి ముఖో యయౌ॥ 38.

ఈకపిశానది ప్రస్తుతము మిథునపురం జిల్లాలోని కాశాయియనునది యని కొందఱు చెప్పినారు. ఆకౌశాయినదికి దక్షిణమున నుత్కలమున్నది. ఆఉత్కలులుదారి చూపింపఁగా కళింగమునకు వెళ్ళెను....గాన ఉత్కలమునకు దక్షిణముగా నున్నది కళింగదేశమని చెప్పవచ్చును. ఇత్యాది. కళింగ 177. పొరట.

ఉత్కలిక. పా. మాలికావృత్తములలో నొకవృత్తము. చూ, వృత్తము. 1.

ఉత్కారము. సం. వి. అ. పుం. 1. ధాన్యము పొడవుగా రాసిపోయుట: చూ, నికారము; 2. ధాన్యము మీఁదికి తూర్పెత్తుట, ఎగరఁబోఁత. చూ, నికారము.

ఉత్కారిక. సం. వి ఆ. స్త్రీ. ఉండ్రాళ్ళు, బెల్లకుడుములు మొ. భక్ష్యవిశేషము: చూ, భక్ష్యము.

ఉత్కీర్ణ. అం. ముఖరజ్జువులు పదునాలుగింటిలో నొకటి: చూ, ముఖరజ్జువులు

ఉత్కీర్ణము. సం. విణ. (అ ఆ. అ.) గీఁకఁబడినది: చూ, ఉల్లిఖితము.

ఉత్కుఁడు సం. విణ. (అ ఆ. అ.) 1: చూ, ఆనందుఁడు; 2. ప్రియవస్తువు నెప్పుడు దొరకునో యను త్వరకలవాఁడు: చూ, ఉన్మనుఁడు.

ఉత్కూటము. సం. వి. అ. న. గొడుగు: చూ, ఛత్రము.

ఉత్కృతము. సం విణ. (అ ఆ. అ.) బాహ్యరతికై చేతులు తట్టుట.

ఉత్కృతి సం. వి. ఇ. స్త్రీ. 1: చూ, ఇరువదియాఱు; అం. 2. గతిధ్వనులు తొమ్మిదింటిలో నొకటి: చూ, గతిధ్వనులు; అం. 3. చందస్సు లిఱువదియాఱింటిలో నొకటి: చూ, ఛందస్సులు.

ఉత్కృష్టము. సం. విణ. (అ. ఆ అ.) 1. మేలుచేయు: చూ, శ్రేష్ఠము; అం. 2 గాయకదోషములు పదునాలుగింటిలో నొకటి: చూ, గాయకదోషములు.

ఉత్కోచము. సం. వి. అ. పుం. 1 ఉపధ, కానుక: చూ, లంచము; 2. రూ- ఉత్కోశము, పుష్పాదివికాసము: చూ, వికాసము.

ఉత్కోశము. సం. వి. అ. పుం. 1: చూ, రూ- ఉత్కోచము. 2; 2. కోపము : చూ, కోపము

ఉత్క్రమణము. సం. వి. అ. న మీఁదికిఁబోవుట: చూ, పల్లటి. 1.

ఉత్క్రాంతి. పా. పరిణామవాదమునే ఉత్క్రాంతి వాదమందురు. (చిం వీ. పరిణామవాదము. 5. పొరట )

ఉత్క్రోశము. సం. వి. అ. పుం. 1 కృష్ణలోహితవర్ణము చరణకలహంస, నలుపు ఎఱుపైన ముక్కు కాళ్లుగల అంచ యను పులుఁగు: చూ, పెన్నడపులుఁగు; 2. కాకి: చూ, వాయసము 1; 3 టిట్టిభము: చూ, లకుముకి; 4. గోరువంక: చూ, శారిక. 1; 5. దీర్ఘకోపము: చూ, రోషము; 6 అధికముగా ఏడ్చుట; ఆర్తకంఠధ్వని: చూ, స్వరము. 2

ఉత్క్రౌంచము. సం. వి. అ. న. అధికముగా క్రౌంచములుగల వనము.

ఉత్క్రౌర్యము. సం. వి. అ. న. మిగుల క్రౌర్యముగలది.

ఉత్క్షిప్త అం. ముఖరజ్జువులు పదునాలుగింటిలో నొకటి: చూ, ముఖరజ్జువులు.

ఉత్క్షిప్తము. సం. విణ (అ. ఆ అ.) 1 ఎగజిమ్మఁబడినది: చూ, ఉదంచితము; అం. 2. శిరఃక్రియలు పదునేడింటిలో నొకటి: చూ, శిరఃక్రియలు; 3. శిరోభేదములు తొమ్మిదింటిలో నొకటి: చూ, శిరోభేదములు.

ఉత్క్షేపణము. సం. వి. అ. న. 1. వ్యజనము; చూ, విసనకఱ్ఱ; 2. ముసలము: చూ, రోఁకలి; 3. తర్కశాస్త్రమునందలి పంచవిధకర్మములలో నొకటి: చూ, కర్మములు.

ఉత్క్షేపము. సం. వి. అ. పుం. 1. పైకిపోవఁజిమ్ముట: చూ, ఎగజిమ్ముట; 2. నిద్రలో నులికిపడుట: ఉదరిపాటు, ఉలికిపాటు; అం. 3. భ్రూక్రియలు యేడింటిలో నొకటి: చూ, భ్రూక్రియలు.

ఉత్ఖాతము. సం. వి. అ. న. 1. ఏనుఁగుక్రీడ, గజక్రీడ: చూ, హస్తి; 2. ఇఱుకుపోటు: చూ, స్థలము, 1; విణ. 3. పెల్లగింపఁబడినది: చూ, ఉన్మూలితము.

ఉత్ఖాతదంష్ట్ర భుజగన్యాయము. పా. కోఱలు తీసినపాము పైకి భయంకరముగాఁ గాన్పించుటయేఁగాని కఱవలేదనురీతి.

ఉత్త. దే. విణ. ఉత్తది: చూ, శూన్యము 1. "ఆ. ఉత్తఱిత్తి దీనిపొత్తున జీవుండు." వేమన 498; 499; 500;

ఉత్తండకి. సం. వి ఈ. స్త్రీ. బండిగురివెంద *. చూ, తులాబీజము.

ఉత్తండములు. దే. వి. బ. ఆఁడువారి మెడనగలలో నొకరకపు నగ, రూ-ఉత్తండాలు: చూ, భూషణము. 2.

ఉత్తండాలు. దే. వి. బ.—పై.—

ఉత్తంభనము. సం. వి. అన. 1. నిలుపుట: చూ, నిమ్ము; 2 చూ, పొడిగించుట; 3. అవలంబించుట.

ఉత్తంభించు. సం స. క్రి 1. ఉత్తంభించు: చూ, నిలుపుచేయు; 2. పొడవగునట్టుల జేయు: చూ, పొడిగించు.

ఉత్తంభితము. సం. విణ. (అ. ఆ. అ.) 1 నిలుపఁబడినది; 2 పొడిగింపఁబడినది.

ఉత్తంసము. సం. వి. అ. పుం, న. 1 పూఁగమ్మ, చెవినగ: చూ, భూషణము. 2. 2. సిగబంతి: చూ, భూషణము. 2; 3. కిరీటము, బొమిడికము: చూ, సీసకము. 1.

ఉత్తప్తము. సం వి. అ. న, 1. ఎండినమాంసము: చూ, మాంసము; 2. ఇనుపసలాకయందు గ్రుచ్చి కాల్చెడు మాంసఖండము : చూ, మాంసము; విణ. 3. కదలినది చూ, ఉల్లలితము; 4. కాఁచఁబడినది: చూ, తప్తము 5. తపింపఁజేయఁబడినది : చూ, తప్తము; 6. తడుపఁబడునది, ఉత్క్షిప్తము: చూ, స్తిమితము 2.

ఉత్తమ. సం వి. ఆ. స్త్రీ. 1. మంచి నడవడిక గల ఆఁడుది. ఇల్లువ్రాలు: చూ, స్త్రీ; 2. చిఱుపాల *: చూ, మనుపాల; 3. నేల యుసిరిక *: చూ, భూమ్యామలకి; 4 సమస్త నాయికల వినయమై యాగింతమును జేయున ట్టిదియైనను బిన ప్రియుని విషయమునందు మేలుచేయు నాయిక: చూ, స్త్రీ; విణ. 5. ముఖ్యము: చూ, శ్రేష్ఠ్యము; 6. యోగ్య మైనది: చూ, యోగ్యము. 2; 7 కడపటిది: చూ, పోసి. 2

ఉత్తమకన్య సం. వి. ఆ. స్త్రీ. దుట్టుపు *: చూ, విషాణి.

ఉత్తమక్షేత్రములు. అం. లలాటము, భుజమధ్యము, మధ్యము. (3.)

ఉత్తమగ్రామనివాసము అం. పదములు యెనిమిదింటిలో నొకటి చూ, పదములు.

ఉత్తమపాత్రిలు అం రాజామాత్యాదులు.

ఉత్తమపురుషలు. పా. ని- ను- మి- ము ఉత్తమపురుషలు. "రక్షించితిని, భరింపఁగలను, వండితిమి, అనుచున్నాము.".

ఉత్తమపురుషసర్వనామము పా. నేను: చూ, ఉత్తమము. 4.

ఉత్తమమనువు. అం. మనువులు పదునలుగురిలో నొకఁడు: చూ, మనువులు.

ఉత్తమము. సం. విణ. (అ. ఆ. అ.) 1. శ్రేష్ఠ మైనది: చూ, శ్రేష్ఠ్యము; అం. 2. చుంబనములు పదునైదింటిలో నొకటి: చూ, చుంబనములు; 3. హస్తక్షేత్రములు మూఁడింటిలో నొకటి: చూ, హస్తక్షేత్రములు; 4. పురుషములు మూఁడింటిలో నొకటి: చూ, పురుషములు.

ఉత్తమర్ణుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) అప్పుల వాఁడు: చూ, ఋణదాత.

ఉత్తమవారుణి. సం. వి. ఈ. స్త్రీ. దుట్టుపు. (కన్న-కుసటి, గరిడ.) * : చూ, విషాణి.

ఉత్తమస్త్రీసామాన్య లక్షణములు. పా. శరీరము మొగము తల ఆఁడతనము నిద్ర కొద్దిఁగలిగిన ప్రశస్తములు, బలిసినఁబొడలు, బలిసిన చెక్కులు సమములై తెల్లనగుపలువరుసయును, తామరరేకులఁబోలు కన్నులు, దొండపండు వంటి పెదవి అతిస్థూలము సూక్ష్మముగాని ముక్కు, ఏనుఁగు నడక, కుడిసుడిఁగల బొడ్డు, నునుపగుదేహము, సొగసగురూపము, మెత్తనగు విశాలజఘనము, సుస్వరము, మంచితలవెండ్రుకలు, కరికుంభములవంటి చేనులు, రావిచిగురుఁబోలిన భగము, తాఁబేలు వీఁపువంటి పిఱుదులు నుదురును, ఎఱ్ఱనగు నాలుక, లేడి చేపులు, లేడికన్నులు, కృశమైన కడుపుఁగలుగు మగువ- పుత్రభోగభాగ్య సుఖము లనుభవించును.

ఉత్తమాంగము. సం. వి. అ. న. 1. తల: చూ, శిరము. 1; 2. మగగుఱి: చూ, శిశ్నము; 3. ఆఁడుగుఱి: చూ, భగము. 12; 4. గరుత్మంతుని యిల్లు: చూ, గృహము. 1.

ఉత్తమాంగుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. తగినవాఁడు: చూ, పూజితుఁడు. 1; 2. అభిజాతుఁడు: చూ, సజ్జనుఁడు; 3. శ్రేష్ఠ ముఖముగలవాఁడు: చూ, వరాననుఁడు.

ఉత్తమాంశ. పా. ఏగ్రహంబునకైనను షోడశ వర్గు చేయఁగా మూఁడు వర్గంబులు స్వవర్గంబులు వచ్చెనేని నుత్తమాంశయగును.

ఉత్తమాట. దే. వి. కోహలము, బ కాఱులు. "ఉత్తమాట చెప్పవలదు.": చూ, మాట. 1.

ఉత్తమావర. సం. వి. ఆ. స్త్రీ. త్రిఫలము(కరక తాడి ఉసిరికలు.): చూ, ఫలత్రయము.

ఉత్తమాహము. సం. వి అ. పుం. సుదినము: చూ, వాసరము.

**ఉత్తమ** సం. విణ. (అ. ఇ. ఆ.) తడిసినది: చూ, స్తిమితము. 2.

**ఉత్తముఁడు.** సం. విణ. (అ ఆ. అ.) 1. అభిజాతుఁడు "ఆ. ఉత్తముని కడుపున నొగు జన్మించిన, వాఁడు చెఱుచు వానివంశమెల్ల." వేమన. 505: చూ, సజ్జనుఁడు; 2. అగ్రగణ్యుఁడు: చూ, శ్రేష్ఠుఁడు. 2; అం. 3. చతుర్దశమనువులలో నొకఁడు: చూ, మనువులు.

**ఉత్తర.** సం. వి. ఆ. స్త్రీ. 1. అర్యమ్ణి: చూ, నక్షత్రము. 1, 2. ఉత్తరపుదిక్కు: చూ. దిక్కు. 1; 3. దిక్కులు ఎనిమిదింటిలో నొకటి: చూ, ఉత్తరము. 8; 4 దిశలు నాలుగింటిలో నొకటి: చూ, ఉత్తరము; 5. విరాటుని కూఁతురు: చూ, పుత్రిక. 1; 6 గోస్తనీద్రాక్ష *: చూ, ద్రాక్షపండు; అం. 7. శాస్త్రప్రవర్తకులలో నొకతె చూ, శాస్త్రప్రవర్తకులు.

**ఉత్తరంగము.** సం. వి. అ. న. 1. అడ్డకమ్మి: చూ, లచ్చికమ్మి; విణ. 2. లేచుచున్న అలలు గలది: చూ, వీచి. 1.

**ఉత్తరకళింగము.** దా. (శ్రీమాన్ కిడాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఎ., బి. ఎల్.,) త్రికళింగదేశమును నిర్ణయింపుచు చిలుకూరి వీరభద్రరావుగారు గంగానది మొదలు కటకమువఱకు ఉత్తరకళింగమనియు, కటకము మొదలు మహేంద్రగిరివఱకు మధ్యకళింగమనియు, మహేంద్రగిరి మొదలు గోదావరివఱకు కళింగమనియుఁ దెలిపియున్నారు. ఉత్తరకళింగమే నేటి పరిభాషయందు ఉత్కళ శబ్దమైనదనియు, మధ్యకళింగము కనోఢ్యదేశమనియు, వారి మతము. కళింగదేశచరిత్ర 241. పారటు; (శ్రీయుత రాళ్లబండి సుబ్బారావుగారు, ఎం. ఎ., ఎల్. టి.) "అనంతవర్మ మొదలు, నాల్గవ భానుదేవుని వఱకునుగల 15 రాజులు ఉత్తరకళింగము లేక ఒరిస్సాయందే తమ రాజధానిని స్థిరపఱచుకొనుటచేతను, ఉత్తరమున గంగానది వఱకును, పశ్చిమమున దక్షిణకోసలము వఱకును, తమ రాజ్యమును వ్యాపింపఁజేయుటచేతను విశేషముగా వారి రాజ్యమునందలి ప్రజలోద్ధులై యుండుటచేతను, వారి చరిత్ర వేఱుగా ఉత్కళదేశచరిత్ర లేక ఓఢ్రదేశచరిత్ర అను పేరుతో వ్రాయ నిశ్చయించితిని." కళింగ. 526; "రాజరాజు తిరువాతి యాతని కొడుకు అనంతవర్మ చోడగంగదేవుఁడు శా॥ శ. 999 లో రాజ్యమునకు వచ్చి, 70 సం॥లు పైగా రాజ్యము చేసెను. ఈతఁడే ఉత్తరకళింగము లేక ఓఢ్రదేశమును క్రీ॥ సం॥ 1132 లో జయించెను. గనుక, ఈతనియొక్కయు, ఈతని తర్వాతి రాజులయొక్కయు చరిత్ర "ఉత్తరకళింగ లేక ఓఢ్రదేశచరిత్ర." యను వేఱొక వ్యాసమున తెలుపఁబడును." కళింగ. 536. పాఁట

**ఉత్తరక్రీడ.** అం. జన్యతాళములు తొంబదియాఱింటిలో నొకటి: చూ, జన్యతాళములు.

**ఉత్తరకుమారప్రజ్ఞలు.** లో కొనసాగని మాటలు, డాంబికములుకొట్టుట.

**ఉత్తరకురువు.** సం వి ఉ పుం. భూమియొక్క నవవర్షములు. (చూ, ఇలావృతము): చూ, వర్షములు.

**ఉత్తరకోశము.** సం. వి. అ. పుం. అయోధ్య: చూ, దేశము. (అయోధ్య.—పూర్వచాళుక్యుల చరిత్రము. క్రీస్తుశకము 609 మొదలుకొని 1200 వఱకు. (భావరాజు వేంకటకృష్ణారావుగారు బి. ఎ., బి. ఎల్.) "ఇట్టి గాధ బిల్హణకవి తన విక్రమాంకదేవ చరిత్రమునందు మనోహరముగఁ జొప్పించియున్నాఁడు. "ఒకప్పుడు బ్రహ్మదేవుఁడు ప్రాతఃకాల

కృత్యములు నిర్వర్తించుచుండ నచ్చటికి నిం ద్రుఁడు చేనుదెంచి ప్రపంచమున నేయను ష్యుఁడును యజ్ఞయాగాది క్రతువుల నాచరించి దేవతలకు హవిర్భాగముల నొసంగకుండుటఁజేసి పాపము వర్ధిల్లుచున్నదని మొఱపెట్టుకొనియెనట! అంతట బ్రహ్మదేవుఁ డర్ఘ్యమిచ్చునిమిత్తమై యుదకముపట్టియుండిన తన చులుకము (పుడిసిట) కేసి చూచెనట! అంతటా చులుకమునుండి మహాయోధుఁడొకఁడు జనించి చాళుక్యవంశమునకుఁ గర్త యయ్యెనట!" అతని వంశమునందు కొంత కాలమునకు హారీతుఁడు మానవ్యుఁడు అను నిరువురు మహాయోధులు జన్మించి జగద్విఖ్యాతిఁగాంచిరి. వీరి మొదటి రాజధాని అయోధ్యానగరముగా నుండెనట. ఇది ఉత్తరకోశము.) రాజరాజ నరేంద్ర పట్టాభిషేక సంచిక. 2 పుట.

ఉత్తరక్రియ. సం. వి. ఆ. స్త్రీ. 1. మృతులకుఁ జేసెడి అపరకర్మ, అపరక్రియ: చూ, కర్మములు; 2 తరువాతి చేయు పని.

ఉత్తరక్రీడ. సం. వి. ఆ. స్త్రీ. తాళప్రాణభూతమైన యొకానొకకళ: చూ, తాళము 2.

ఉత్తరక్షణము. పా. తరువాతి సెకను, ముందు సెకను.

ఉత్తరవానియెత్తరగంప. లో. ఉత్తరకార్తెలో వరిలోనగు వ్యవసాయపు పనులు అఖరుగాన పిదప పైరుగింజలులోనగు పి చేల్లుటకు సిద్ధపడుమని భావము.

ఉత్తరడొక్కరము. వై. వి. = ఉత్తరదోకరక, మల్లబంధవిశేషము: చూ, మల్లశాస్త్రము.

ఉత్తరణము. సం. వి. అ. న. దాటుట: చూ, లంఘనము.

ఉత్తరదోకరము. సం. వి. అ. న.= ఉత్తరడొక్కరము. "శ్లో. గ్రీవాయాశ్చ భుజాయాశ్చ ప్రాక్రివాస్రమశేషతి, అన్యాసాన్యా బాధేన కుర్యాదుత్తరదోకరమ్." శవతత్వగత్నాకరము: చూ, మల్లశాస్త్రము.

ఉత్తరధ్రువము. పా. ఉత్తరపుదిక్కును సూచించు గుఱుతు. (నార్తుపోల్.) ఉత్తరమహాసముద్రమునకు పైనగలది.)

ఉత్తరపక్షము. సం. వి. అ. పుం. పట్టినదిలిగిపట్టు నెరవేర్పుట: చూ, సిద్ధాంతము

ఉత్తరప. సం. విశే. ఆ. ఉత్తర పడమరగల యొక్క నడిమిదిక్కు. చూ, వాయువ్యదిక్కు

ఉత్తరప్రత్యుత్తరములు. సం. వి. అ. న. బ. 1. వాగ్వియకర్మ: చూ, కృతి; 2. ఇద్దఱికి వ్రాతమూలమున జరుగు లేఖలు.

ఉత్తరఫల్గుని. సం. వి. ఈ. స్త్రీ. ఉత్తర: చూ, నక్షత్రము 1.

ఉత్తరాభాద్రపద. సం. వి. ఆ. స్త్రీ. అహిర్బుధ్న్య: చూ, నక్షత్రము. 1 (రూ-ఉత్తరాభాద్ర.)

ఉత్తరమహాసముద్రము. పా. మహాసముద్రములయిదింటిలో నొకటి చూ, సముద్రములు.

ఉత్తరమీమాంస. అం. మీమాంసలు రెండింటిలో నొకటి: చూ, మీమాంసలు. (చూ, ఉపవిద్యలు )

ఉత్తరము. సం. వి. అ. న. 1. ఒకానొక అర్థాలంకారము — గూఢోత్తరము. చిత్రోత్తరము అని ద్వివిధము. ఉ.—(1) ప్రబ్బలిపాదయున్న రేవున నదిదాటుము; (2) ప్రశ్నమే యుత్తరమగుట. ఉ.—కేదారపోషణరతాః: చూ, అలంకారము. 3; 2. ప్రత్యుత్తరము: చూ, బదులుమాట; 3. దిక్కులు యెనిమిదింటిలో నొకటి: చూ, దిక్కులు; 4. దిశలు నాలుగింటిలో నొకటి· చూ, దిశలు; 5. ఉత్తరపుదిక్కు: చూ, దిక్కు. 1; విశే. 6. ఉత్తరపుదిక్కుది; 7. మీఁదిది: చూ, మీఁదు. 2, అం. 8. ప్రహారములు ముప్పదిరెండింటిలో నొకటి: చూ, ప్రహారములు; 9. కవిహాస్య

ములగు చతుష్షష్టి తంత్రములలో నొకటి: చూ, తంత్రములు; దే. వి. (1) ఇచ్చిపుచ్చు కోలుపత్రము, ఆకు:చూ, లేఖ. 4. (లెటరు)

ఉత్తరరామచరిత్ర. అం. కావ్యనాటకాదులలో నొకటి. చూ, కావ్యనాటకాదులు.

ఉత్తరలోమము. పా. పైని రోమములు కలది.

ఉత్తరవతి. అం. ముఖరజ్జువులు పదునాలుగింటిలో నొకటి: చూ, ముఖరజ్జువులు.

ఉత్తరవలయము. పా. (ఆర్క్టిక్ సర్కిలు.)

ఉత్తరవారుణి. సం. వి. ఈ. స్త్రీ. జొట్టపు *: చూ, విషాణి.

ఉత్తరవాసము. సం. వి. న. బయిగవాసము. "సీ. చంద్రాతపములోడ సరియైన వెలిపట్టు పుట్ట ముత్తరవాసముగ ధరించి." వై. 8, ఆ. 108; చూ, వస్త్రము.

ఉత్తరసర్కారులు. శా. తూర్పు చాళుక్యరాజ్య విస్తీర్ణము. (క్రీ. శ. 10, 11 శతాబ్దములు.) (శ్రీయుత దేశభట్ల లక్ష్మీనరసింహంగారు. ఎం. ఏ., ఎల్. టి.) ఇక చాళుక్యరాజ్యము పశ్చిమముగా నెంతవఱకు వ్యాపించెనో నిర్ణయింపవలసి యున్నది. ఇప్పటి యుత్తరసర్కారులకు, నిజామురాజ్యమునకు నడుమఁ గల సరిహద్దులే పూర్వచాళుక్య రాజ్యమునకు గూడ కొంచెమెచ్చుతగ్గులతో నుండెనని యూహింపవచ్చును. రాజ. న. ప. సం. 187 పొరటు; (శ్రీయుత రాళ్ళబండి సుబ్బారావు గారు, ఎం. ఏ., ఎల్. టి.) ఉత్తరసర్కారులు ఇంగ్లీషువారి స్వాధీనమైన తరువాత రాజమండ్రి, ఏలూరు, కొండపల్లి, సర్కారులు తత్పూర్వము నైజామువల్ల కౌలుపొంది హుస్సేన్ ఆలీఖాన్ క్రిందనే కౌలు జరుపఁబడెను. ఈ కౌలు 1769 లో ఆఖరుకాఁగానే, కంపెనీవారి స్వంతఅధికారము క్రింద్రనే; సర్కారుల ప్రభుత్వము జరిగెను. తత్పూర్వము గిడ్డంగుల కేజంట్లుగా నుండి వారు ఛీఫులనఁబడిరి. బందరు ఛీఫు క్రిం ఏలూరు, రాజమండ్రి సర్కారులుంచఁబడెను ఇట్లే విశాఖపట్టణములోను, గంజాములోను ఛీఫులుండిరి ఇత్యాది. కళింగ. 670-67 పుటలు.

ఉత్తరసాక్షి. పా. సాక్షులగుటకు సాక్షి, ఆ: త్సమయమున అడ్డుపడు సాక్షి.

ఉత్తరస్ఫురితము. అం. చుంబనములు పదింటిలో నొకటి: చూ, చుంబనములు.

ఉత్తరాంధ్రకవులు. శా. (కళింగదేశపు కతికవాఙ్మయము.) (శ్రీయుత నిడదవోలు వేంకటరమణగారు. బి ఎ.) "ఉ. నన్నయతిక్కనాది కవినాథులు చెప్పిన యట్లు చెప్పలే। కున్నఁ బదుత్తరాంధ్ర కవులారకయుండి రెటోఁచి నట్లని। తోఁచినతబుద్ధిఁ గావ్యములు గొబ్బజ రచింపక యంత్తజ్ఞాన సం। పన్నుల కావ్యముల్ హరిసమర్పణమై చెలువొందు గావుతన్."...యశంబున మించిన కవితల్లజు లుత్తరాంధ్రప్రాంతమగు కళింగదేశమున లేకపోలేదు ఇత్యాది. కళింగ. 127 పుట.

ఉత్తరాగ్ని. అం అగ్నులయిదింటిలో నొకటి: చూ, అగ్నులు.

ఉత్తరాపథ. సం. వి. ఆ. స్త్రీ 1. వస *: చూ, వస; 2. అజాజి *: చూ, జీలకఱ్ఱ (కన్న. జీరిగె.)

ఉత్తరాపథము. శా. [2] శ్రీఖారవేల మహారాజు హాథిగుంఫా శాసనము. 28 పొరటు.

XI.

మండంచ అపరాజనివేశితమ్ పీతుయుగదభ సంగలేన కాసయతి జనసదంభావనమ్ చ తేరసవస సతికంతుభిదతి—తమరదేహ సంఘాతమ్ భారసమెచవసె...హస...కెజ...సవసేహివితాయసతో ఉతరాపథరాజానో

తెనుఁగు తర్జుమా—XI. భాగవేలుఁడు పృథులగార్ధభములఁ బూన్చిన నాఁగలితో చెడ్డరాజులచే నిర్మింపఁబడిన సింహాసనమును దున్నివైచెను నూటపదమూఁడు సంవత్సరములకు పూర్వము లేక నూటపదమూఁడవ సంవత్సరమున చేయఁబడిన తామ్రవిగ్రహముల విరుగఁగొట్టెను. పన్నెండో సంవత్సరమున ఉత్తరాపథ దేశములోని రాజులను సాధించెను. రాజ ప. సం. 23-25. పుటలు.

ఉత్తరాభాద్ర. సం. వి. అ. స్త్రీ: చూ, ఉత్తరభద్రపద.

ఉత్తరాయత. అం. షడ్జగ్రామగత మూర్ఛనలు యేడింటిలో నొకటి: చూ, షడ్జగ్రామగత మూర్ఛనలు.

ఉత్తరాయనము సం వి. అ. పుం. 1. మకర సంక్రాంతి మొదలు ఆఱునెలలు గల కాలము: చూ, అయనము 2, అం. 2. అయనములు రెండింటిలో నొకటి. చూ, అయనము. 2

ఉత్తరాషాఢ. సం. వి. అ. స్త్రీ. 1. ఏవేకంకటిచుక్క: చూ, నక్షత్రము. 1.

ఉత్తరాసంగము సం. వి. అ. పుం. బయిగవాసము: చూ, వస్త్రము.

ఉత్త్రాసి. దే. వి తలుపుక్రింద తిరిగెడు కుబుసము: చూ, త్రోలుమ్రాను.

ఉత్తరించు. సం స. క్రి. 1. దాఁటు : చూ, తరించు; దే. స. క్రి (1) ఖండించు "ఉత్తరించు తములపాకునిక్కడు క్రియ." ఉ, హరి. 4, ఆ. 28; "ద్వి. తలలుత్తరింప." రా. అర. కాం, 181; (2) వస్త్రములోసగు వాని ఛేదించు: చూ, చించు.

ఉత్తరిగ. దే. వి. పరవిశేషము: చూ, భూషణము. 2.

ఉత్తరిగము. వై వి.= ఉత్తరీయము : చూ, వస్త్రము.

ఉత్తరీయము. సం. వి. అ. న. 1. = ఉత్తరిగము: చూ, వస్త్రము; 2. పయ్యెద: చూ, పైఁట; 3. జన్నిదము: చూ, యజ్ఞోపవీతము.

ఉత్తరుఁడు. సం వి. అ. పుం. 1 సామంతుని చేరుననున్న రాజు; 2 విరాటుని కొడుకు: చూ, పుత్రుఁడు. 1; విశ.3 అభిజాతుఁడు: చూ, సజ్జనుఁడు; శా. 4 (యుఁవాన్ చ్వాంగ్.) (భావరాజు వేంకట కృష్ణారావు గారు. బి. ఎ., బి. ఎల్.) దేవబోధి సత్వుఁడశోకప్పుడీ సంఘారామమునందు ఉత్తరుఁడను అర్హతుఁడు నివసించుచుండుననియు, నాతఁడు 'షడభిజ్ఞుఁ' డనియుఁ అష్టవిమోక్షుఁడనియు విని యాతనిఁజూచి యాతని జీవితపద్ధతి నవలంబింపఁగోరెను. ప్రాచీనాంధ్రదేశము 89. పుట, 92 పుటలో,— ఒకవేళ ఉత్తరుఁడీ పెద్దముడిఁరు సంఘారామమున నివసించెనేమో తెలియదు; అం 5. సాక్షులు పద్దెండుగురిలో నొకఁడు: చూ, సాక్షులు; 6.కృత సాక్షులు అయిగురిలో నొకఁడు : చూ, కృతిసాక్షులు

ఉత్తరువు వై. వి. ఆజ్ఞ: చూ, సెలవు (అగ్గు.)

ఉత్తరేణి. దే. వి. అపామార్గము. (కిస్న-ఉత్తరణి.) * చూ, శైఖరికము (వాడుక )

ఉత్తరేను దే వి. 1.—వై.—; 2. పండ్రి*: చూ, విట్ఖదిగము.

ఉత్తరేష్మము సం. వి. అ. పుం. బోయవానిచేత నెడమప్రక్క గాయముచేయఁబడిన జంక: చూ, హరిణము. 1.

ఉత్తరోత్తరము. సం. క్రి. విశ, అ. స. చూ, పైపై.

ఉత్తరోష్ఠము. అం. 1. సాముద్రికశాస్త్రమునందలి లక్షణాంగము లేబదియెనిమిదింటిలో

నొకటి: చూ, లక్షణాంగములు; 2. స్త్రీలక్షణాంగము లేఁబదియెనిమిదింటిలో నొకటి: చూ, స్త్రీ లక్షణాంగములు

**ఉత్తరోష్ఠావర్త.** ౧. అం. చూ, అనుభావర్తములు.

**ఉత్తలపడు.** ద్వ. అ క్రి. (ఉత్తలము + పడు.) 1 త్వరపడు. "వీచీభుజావళి యాలింగనకేళి కుత్తలపడఁగ" హరి పూ. 7, ఆ 112: చూ, సంభ్రమించు; 2 తపించు. "స. అన వినుచుండి లంగు వ్యాగయఁబునఁగాపము నివ్వటిల్ల." 236 (అనిరుద్ధ) "అనుచు నుత్తల పడ నయ్యవసరంబున." భాగ విరా. 5, ఆ. 238. చూ, సంతాపించు; 3 తాలుమాలు పడు. "చ. గ్రహతారకంబులు, త్తలపడఁ జొచ్చె." భో 4, ఆ. 77: చూ, వ్యత్యస్తమగు, 4 కలఁతపడు: చూ, సంక్షోభించు

**ఉత్తలపడుట.** దే వి. 1 తొట్రుపాటు: చూ, సంభ్రమము 1; 2. బెంగ: చూ, దుఃఖము; 3 అధైర్యము: చూ, పిఱికికండ, 4. భయము: చూ, వెఱపు.

**ఉత్తలపాటు.** దే. వి.—పై.—

**ఉత్తలపెట్టు.** దే స. క్రి. (ఉత్తలము + పెట్టు.) 1 త్వరపఱచు; 2. పరితాపపడఁజేయు; 3. వ్యత్యస్తము కావించు 4. కలఁగపఱచు.

**ఉత్తలము** దే వి 1. భయము: చూ, వెఱపు, 2 తొందఱపాటు: చూ, సంభ్రమము; 3. కలఁత. "క. చిత్తంబున బైకొనియెడు, నుత్తలము। నడంచి ముఖపయోరుహమునఁద, లొత్తెడు వెడనవ్వునఁబ్రియు, చిత్తంబగు రాత్రిఁజనియెఁ జెలువ యడవికిన్." భార. ఆర. 7, ఆ 211: చూ, సంతాపము; 4. తాలుమాలు. "శా. అత్తఱిఁ గెంపుమీఱిన ఘనావళి యాకసమెల్లఁ గప్పి క్రొ, న్నెత్తురు నెమ్ములున్ గురిసె నీరధియంతయు ఘూర్ణమానమై, యుత్తలమందెఁ బర్వతము లొక్క మొగిఁ గదలెన్ మహోల్కములన్, మొత్తముగట్టి రాలె బలముల్ వెఱఁగందఁగఁ జేటు తెల్పుచున్" నిర్వ. 2, ఆ. 98: చూ, వ్యత్యయము

**ఉత్తానకరణబంధములు.** అం. గ్రామ్యము, నాగరాఖ్యము, ఉత్ఫుల్లకము, విజృంభితము, ఇంద్రాణికము, ఇంద్రికము, పార్శ్వసంఘటితము, ఉత్తానసంఘటితము, పీడితము, వేష్టితము, బాడబికము, ఉద్భుగ్నకము, ఉరస్ఫుటనము, అర్ధాంగనిపీడితము, జృంభితము, ప్రసారితము, వేణువిదారితము, శూలచితము, కార్కటకము, ప్రేంఖాయితము, పద్మాసనము, అర్ధపద్మాసనము, బంధురితము, నాగపాశము, సంయమనము, కౌర్మికము, పరివర్తనము, నిపీడితము, సమపాదము, త్రివిక్రమము, వ్యోమపదము, స్మరచక్రము, అవిదారితము, సౌమ్యము, ఆజృంభితము, నౌకాఖ్యము, ధనుర్బంధము, కరపాదము, సాచీముఖము అర్ధచంద్రము ఉపాంగము. (41.)

**ఉత్తానకరణము.** అం. బంధంబులైదింటిలో నొకటి (కామినీమణి శయ్యాంతరమున వెల్లవెలుకల పరుండ పురుషుఁడు తత్పాదములు కరంబులం బట్టి కూడుట.): చూ, బంధములు.

**ఉత్తానపత్రికము.** సం. వి. అ. పుం. ఎఱ్ఱాముదము *: చూ, వ్యాడంబకము.

**ఉత్తానపాదజుఁడు.** సం వి. అ. పుం. ధ్రువనక్షత్రము, గ్రహాధారుఁడు, జ్యోతిరక్షుఁడు: చూ, ధ్రువుఁడు. (చూ, నక్షత్రము. 1.)

**ఉత్తానము** స. వి. అ. న. 1. రతిభేదము: చూ, రతిబంధము; విణ. (అ. ఆ. అ.) 2. లోతులేనిది; 3. వెలికిలినది: చూ, ఉత్కటము; అం. 4. హస్తప్రచారములు పదునైదింటిలో నొకటి: చూ, హస్తప్రచారములు.

**ఉత్తానవంచితము.** సం. వి. అ. పుం. 1. చేతుల

జోడించుట: చూ, వ్యంజకము. 1; అం. 2. హస్తపరిచారములు పదునైదింటిలో నొకటి చూ, హస్తపరిచారములు.

ఉత్తానశయుఁడు. సం. వి. అ. పుం. పాలుత్రాగెడి శిశువు, డింభుఁడు: చూ, శిశువు.

ఉత్తానసంఘటితము. అం. ఉత్తానకరణబంధములు నలుబది యొకటింటిలో నొకటి : చూ, ఉత్తానకరణ బంధములు.

ఉత్తానుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) 1 వెల్లకిల పరున్నవాఁడు; 2 నిద్రించుట కెదురు చూచువాఁడు: చూ, సుప్త్యున్ముఖుఁడు.

ఉత్తాపకుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) చూ, దంటించువాఁడు.

ఉత్తార్యము. సం. విశే. (అ. ఆ. అ.) దాఁటఁదగినది: చూ, లంఘు.

ఉత్తాలకము. సం. వి. అ. పుం. ఉకలి *: చూ, లొద్దుగు.

ఉత్తాలము. సం. విశే. (అ. ఆ. అ.) 1. పొడవైనది: చూ, పొడవు. 2; 2. తొట్రుపాటు గలది: చూ, సంభ్రమము. 1; 3 శ్రేష్ఠమైనది: చూ, సుకృతము; 4. విరివియైనది: చూ, విపులము.

ఉత్తాలుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) నేర్పరి: చూ, సమర్థుఁడు.

ఉత్తి. దే. వి. 1 ప్రతినిధి. "చ. తండ్రి ప్రాపములనడంచి సద్గతికిఁ బంపిన క్రిడిబుణంబు సేన తత్సురతలంబునఁ బినుత శౌర్యమును త్తిగఁ బెట్టి తీర్చదన్." వై. 1, ఆ. 95 (ఇది యింకను విచార్యము.): చూ, మాఱు. 1; వై. వి. 2 =యుక్తి, జిత్తు: చూ, యుక్తి.

ఉత్తర్ణము. సం. విశే. (అ. ఆ. అ.) దాఁటఁబడినది: చూ, లంఘు.

ఉత్తు. పా. సూ. 10. ఉత్తునకు సంధి నిత్యము. ప్రథమావిభక్తి, సమాపక క్రియ మొదలగువాని కడపటి ఉకారమున కచ్చు పరంబగునపుడు సంధినిత్యము. ఉ. — రాముఁడు + అతఁడు = రాముఁడతఁడు, రాఁడు + అతఁడు = రాఁడతఁడు కూయుచు + ఉండు = కూయుచుండు; సూ. 11. ప్రథమేతరవిభక్తి, శత్రర్థక చువర్ణంబులంగల ఉత్తునకు సంధి వైకల్పికము. (1) ప్రథమావిభక్తిగాక మిగిలిన విభక్తులయందు 'ఉ' కడపటఁగల ప్రత్యయములు అనఁగా, ను, కొఱకు, కు, అగు, ఇందు, ఎందు, వీనికడపటి ఉకారమునకును ఉ.- నన్నున్ + అడిగె = నన్నడిగె-నన్ను నడిగె. నాకొఱకున్ + ఇచ్చె = నాకొఱకిచ్చె- నాకొఱకునిచ్చె. (II.) శత్రర్థక 'చు' వర్ణకమునందుండు 'ఉ' కారమునకును సంధి వైకల్పికము. శత్రర్థక 'చు' వర్ణము వర్తమానార్థక 'చు'వర్ణమనియుఁ బేరు. ఉ.— పోవుచున్ + ఉన్నాఁడు = పోవుచున్నాఁడు, పోవుచునున్నాఁడు అచ్చుతో అచ్చుకలియునపుడు ఁడుమనున్న ద్రుతంబునకు లోపంబు.

ఉత్తుంగము. సం. విశే. (అ. ఆ. అ.) పొడవైనది: చూ, పొడవు 2.

ఉత్తుండి సం. వి. ఈ. స్త్రీ. కాకతుండి *: చూ, సప్తల.

ఉత్తుండిక. సం. వి. ఆ. స్త్రీ.—వై.—

ఉత్తుఁడు. వై విశే=యుక్తుఁడు. తగినవాఁడు: చూ, సమర్థుఁడు.

ఉత్తుషము. సం. వి అ పుం. పేలాలు: చూ, లాజలు.

ఉత్తేజకము. సం. వి అ. న. తాపజనకము

ఉత్తేజనము. సం. వి. అ. న. 1. గర్జాఫలము: చూ, ప్రేరేచుట; 2: చూ, వాఁడిచేయుట; 3: చూ, నడపుట; 4: చూ, పుచ్చుట.

ఉత్తేజితము. సం. విశే. (అ. ఆ అ.) 1. ప్రేరేపఁబడినది: చూ, ప్రేరితము; 2 వాఁడిచేయఁబడినది: చూ, శాతము. 1; 3. నడుపఁ

బడినది: ఆచరితము; 4 పుచ్ఛించఁబడినది, పంపఁ బడినది.

ఉత్తేలము. సం. వి. అ. న. ఎక్కువనూనెగలది

ఉత్తృష్ణ. సం. వి. ఆ. స్త్రీ. ఎక్కువ ఆస: చూ, వాంఛ

ఉత్థము. సం. విణ. (అ. ఆ అ.) 1. నిలిచినది. స్థిరము; 2 పుట్టినది, అంకురితము : చూ, సంభూతము.

ఉత్థానము. సం. వి అ. న. 1. కూర్చుండిలేచుట: చూ, పొలిందతము; 2 పురుషప్రమాణము; 3. ఆయిత్తము: చూ, యత్నము; 4. అంకణము: చూ, ముంగిలి. 2; 5. జగడము: చూ, యుద్ధము; 6. మలము జారెడి తెగులు: చూ, రోగము; 7. అనుమోదము: చూ, సంతోషము; 8. ముగింపు: చూ, సమాప్తి; 9. సైన్యము: చూ, సేన. 1; 10. నాటకాంగభేదము: చూ, నాటకము. 1; 11 కట్టుట. చూ, బంధము 1; 12. ఛుల్లి: చూ, పొయ్యి; 13. పయనము: చూ, ప్రయాణము; 14. కోరిక: చూ, వాంఛ; 15. వ్యాకరణమునందు పదప్రశ్న; 16. పదార్థము: చూ, వస్తువు; 17. రాజ్యతంత్ర విచారణ: చూ, విచారణ; 18. పుస్తకము: చూ, పాత్రము.

ఉత్థాపకము. సం విణ. (అ ఆ. అ.) లేపునది: చూ, లేపుట.

ఉత్థాపనము. సం. వి. అ. న: చూ, లేపుట

ఉత్థాపితము. సం. విణ. (అ. ఆ. అ.) లేపఁబడినది.

ఉత్థితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. లేచినది: చూ, ప్రోద్యతము; 2. పుట్టినది: చూ, సంభూతము; 3. పెరిగినది: చూ, పృథులము; 4. యత్నించినది, ఉద్యతము, ఉద్యుక్తము: చూ, యత్నము.

ఉత్పంక్తి. సం. వి. ఈ. స్త్రీ. దొంతి: చూ, దొంతర

ఉత్పతనమగు. సం. స. క్రి. ఎగురు: చూ, లంఘించు

ఉత్పతనము. సం. వి. అ. న. 1 పైకి లేచుట, ఉద్వర్తనము: చూ, ఎగయుట; 2. జన్మము చూ, పుట్టుక.

ఉత్పతనశీలుఁడు. సం విణ. (అ ఆ. అ.) ఎగిరెడు స్వభావము కలవాఁడు: చూ, ఎగియువాఁడు.

ఉత్పతము. సం. వి అ. న. పక్షి: చూ, పక్షి.

ఉత్పతిత. సం. విణ. (ఋ. ఈ ఋ.) చూ, ఉత్పతనశీలుఁడు.

ఉత్పతితము. సం విణ. (అ. ఆ అ.) 1 ఎగిసినది: ఉత్థితము; 2. పుట్టినది: చూ, సంభూతము.

ఉత్పతిష్ణువు. సం. విణ. ఉ: చూ, ఉత్పతనశీలుఁడు

ఉత్పత్తి సం వి. ఇ. స్త్రీ. జననము: చూ, పుట్టుక

ఉత్పథము. సం. వి. అ. పుం. ఆకాశమార్గము (లేక) నక్షత్రమార్గము: చూ, కానిత్రోవ.

ఉత్పన్న మందమతిబుద్ధులు. పా. నీటిబుడగల వలె నియమములేక పుట్టుచుండెడి బుద్ధులు

ఉత్పన్నము. సం. విణ. (అ. ఆ. అ.) పుట్టినది: చూ, సంభూతము.

ఉత్పల. సం. వి ఆ. స్త్రీ సుగంధిపాల: చూ, శారిబ.

ఉత్పలపత్త్రము. సం. వి. అ. న. 1. కలువపూరేకు: చూ, కల్వరేకు; బ. 2. పిఱుఁదుల మీఁది నఖక్షతములు. "చ. ఒనరఁగఁ జూడ నింపెసఁగ నుత్పలపత్త్రము లొప్పుచున్నవీ, ఘనతరసైకతంబు పయిఁగంటిరె కిన్నరకాంతు

లారయం, వనుపవలీల నీదునొక యంబుజ పాణికటీ నఖాంశముల్, గనుఁగొని సర్మగర్భములుగా నొకయంగనవల్కె నవ్వుచున్." భాను. 2, ఆ. చూ, నఖక్షతము

ఉత్పలపర్ణకము సం. వి. అ. న. ఖక్షత భేదము. సంభోగక్రియలయందు గోరువంక అనఁగా గిల్లుట. చూ, నఖక్షతము

ఉత్పలపూరక సం. వి. ఆ. స్త్రీ. అడవికాఁకర, వకాకవేల్లకు (కన్న-ఎలెహా, ల.) * చూ, కాఁకర.

ఉత్పలమాల సం. వి. ఆ. స్త్రీ. ఒకానొక వృత్తము. ఇందొక్కొక్క పాదమున భ, ర, న, భ, భ, ర, వ గణములు గలిగి పదియెంట యతిగల ఇరువదవ క్షరములు గలిగి పుట్టిన పద్యము. ఉదా.—"పేరిన నేయిగుద్ధములు - పెద్దగ నూఁగిడకయున్నచాప్రిగా, గాచుసొచ్చి తాగ్రిగి వెస-గంతులు వైచి ముగారిరెంటఁగా, ధాయణిరూఢికెక్కు నవ-తాగ విగాహకు చేలసద్భగన్, భాగలఁబులుగా లయుఁ-గల్కు నుత్పలమాల చెన్నగుర్," చూ, వృత్తము. 1.

ఉత్పలము. సం. వి. అ. న. 1. కువలయము, కలువ *: చూ, పద్మము. 1; 2. నీలోత్పలము, నల్లకలువ *: చూ, పద్మము. 1, 3. చెంగల్వకోష్టు *: చూ, పారిభాద్యము; 4. కాల్చుటకై మాంసమునకు గుచ్చిన ఇనుపకమ్మి; 5. గోమయపిష్టము: చూ, పిడక; 6. శాకకూఁత: చూ, స్వరము. 2; 7. పాతాళము: చూ, లోకము. 1; విశే. 8. మాంసములేనిది.

ఉత్పలశారిబ. సం. వి. ఆ. స్త్రీ. సుగంధిపాల*: చూ, శారిబ.

ఉత్పలి. అం. భాషాంగములు పదునొకటింటిలో నొకటి: చూ, భాషాంగములు. (చూ, భాష. 1.)

ఉత్పశ్యుఁడు. సం. విశే. (అ. ఆ. అ.): చూ, మీఁదు చూచువాఁడు.

ఉత్పాటనము. సం. వి. అ. న. చూ, పెఱుకుట.

ఉత్పాటించు. సం. స. క్రి. పీఁకు చూ, పెఱుకు

ఉత్పాటితము. సం. విశే. (అ. ఆ. అ.) పెఱుకఁబడినది: చూ, ఉన్మూలితము.

ఉత్పాతకాంశము. పా. షష్ఠ్యంశములు అఱువదింటిలో నొకటి: చూ, షష్ఠ్యంశములు

ఉత్పాతము. సం. వి. అ. పుం. 1. దుశ్శకునము, తెలియక వచ్చునది. (అనఁగా ఆబాలవిద్వజ్జన ప్రసిద్ధమైన వస్తురూపమునకంటె భిన్నమైన వస్తురూపము. ఇది త్రివిధము.—దివ్యము, అంతరిక్షము, భౌమము అని.- దివ్యము:— అపూర్వగ్రహనక్షత్రములు పుట్టుట; అంతరిక్షము: —పరివేషము ఇంద్రధనుస్సును కలుగుట, కొఱవియుఁ పిడుగును పడుట; భౌమము—అపూర్వములైన చరాచర వస్తువులు కలుగుట. ఇవి దుఃఖరోగప్రదములు): చూ, అపశకునములు; (చూ, తోఁకచుక్క. ); 2 మాఁణము చూ, మారి; 3. మారితెవులు: చూ, మార.

ఉత్పాత్తు. సం వి. ద్. పుం ఎనిమిది కాళ్ల మెకము చూ, శరభము. 1.

ఉత్పాదకము సం వి అ. పుం. 1.—పై.—; విశే 2. కలిగించునది: చూ, ప్రతిపాదకము 2

ఉత్పాదనము. సం. వి. అ. న. ఉపపాదనము: చూ, పుట్టించుట.

ఉత్పాదశయనము. సం. వి. అ పుం టిట్టిభము: చూ, లకుముకి.

ఉత్పాదిక సం. వి ఆ. స్త్రీ. గళశుండిక, అంగిటిముల్లు: చూ, రోగము. 1.

ఉత్పాదితము. సం. విశే. (అ ఆ. అ.) కలిగింపఁబడినది: చూ, సృష్టము. 1.

ఉత్పాదిల్లు. సం. అ. క్రి. అవతరించు, కలుగు. (ప్రే. ఉత్పాదించు): చూ, పుట్టు. 2.

**ఉత్పాద్యము.** పా. ప్రసంగవశమున వచ్చినది, ప్రాసంగికము. పతాకాప్రకరీ భేదముచేఁ బ్రాసంగికము ద్వివిధము. చూ. వ్యాపికథ పతాక; స్వల్పకాలనివృత్తమవుకథ ప్రకరి. మొత్తముమీఁద వస్తువు ప్రఖ్యాత, ఉత్పాద్య, మిశ్రములను మూఁడుతెఱఁగుల నొప్పుచున్నది పురాణప్రసిద్ధము ప్రఖ్యాతము; కవికల్పిత ముత్పాద్యము; ప్రసిద్ధకథకుఁ గొంత కల్పితము చేర్చుట మిశ్రము.

**ఉత్ఫుల్లము.** సం. విణ. (అ. ఆ. అ.) 1 పవర్గ ప్రథమమధ్యము; 2 వికసించినది, (వికసించిన పుష్పాదులు.): చూ. వ్యాకోచము

**ఉత్పూతము.** సం. విణ. (అ. ఆ. అ.) చక్కఁగా శుద్ధిచేయఁబడినది. చూ. శుద్ధము 3.

**ఉత్ప్రాసము** సం. వి. అ. పుం. మర్మముదాఁకి పొడునాడెడు పరిహాసము, నవ్వులోఁగూడిన పొడుపుమాట: చూ. ఉల్లసము.

**ఉత్ప్రేక్ష.** సం. వి. ఆ. స్త్రీ. ఒకానొక అర్థాలంకారము. అప్రస్తుత వస్తువుయొక్క గుణము, క్రియ మొదలగువాని సంబంధముచేఁ బ్రస్తుత వస్తువును నప్రస్తుతముగా నెంచుట యుత్ప్రేక్షాలంకారము. ఈ యలంకారమునకు ధర్మము, అప్రసిద్ధము. ఉపమానమందుఁ బ్రసిద్ధము. దీనింబట్టియే ఈ రెండలంకారములకును భేదము ఇది వాచ్యమని, గమ్యమని, రెండుతెఱఁగుల నుండును తలంచెద, ఎంచెద, సత్యము, అదియో, అనునట్లు, ఇత్యాదులుత్ప్రేక్షావాచకములు. ఇవి గలిగియున్న యెడల వాచ్యోత్ప్రేక్ష లేనియెడల గమ్యోత్ప్రేక్ష. ఉదా.—ఆనాటి వెన్నెల రామకళ్యాణమహోత్సవ దర్శనసంజాతంబగు జనులయానందక్షీరసాగరమో యనునట్లు విలసిల్లె ఇచట "ఆనంద క్షీరసాగరము" తెల్లనై లోకముమం వ్యాపించుట యప్రసిద్ధము. కావున నుత్ప్రేక్షాలంకారము, ఇచట "క్షీరసాగరమో" అనుచో, "ఓ" అనునది యుత్ప్రేక్షావాచకము. కావున వాచ్యోత్ప్రేక్ష ఉదా-అయ్యవసరంబున యువజనహరిణంబుల వేటాడ శంబరాంతకుండు మంజుల పంజరంబునఁ బెట్టి తెచ్చు కాంచనమయ మాయాకురంగియో యన సుభద్రాభద్రేభగమన మణివికార శిబికారూఢయై వచ్చె. ఇచట మన్మథుఁడు కురంగమును దీసికొనివచ్చుట యప్రసిద్ధముఁ గావున నుత్ప్రేక్షాలంకారము "కురంగియో" యనుచు "ఓ," యనునది యుత్ప్రేక్షావాచకము. ఉదా.—రాముండు వనంబునకేగుచోఁ దద్రథసముద్ధత ధూళిపంపరలు, ఆతనితో నేగు పౌరజనమనంబులు. ఇచట "మనములు" రామునితో నేగుట యప్రసిద్ధములు గావున నుత్ప్రేక్ష. 'మనంబులేమో' అను నుత్ప్రేక్షావాచకము లేనందున నిది గమ్యోత్ప్రేక్ష ఉదాహరణములు.—

1. భూదేవి ధరించిన సముద్రమనెడు యొడ్డాణంబుననుండు రత్నపు మొలకలయున్నట్లు రత్నగోపురంబుల నొప్పు ద్వారక విలసిల్లె, 2. ప్రాగ్దిక్కనునింతి లలాటంబున నొప్పుచున్న సిందూరపుతిలకంబన సూర్యుండుదయించె; 3. అమ్మాయాకురంగము రామునికడకేగి యోరామా! తొల్లి నీచే నిహతమైఁ బడియు మరల గడ్డిఁదినవచ్చితినని చెప్పుచున్నదియో యనఁ దృణాంకురముల మేయసాగెను; 4 అట్టి వర్షాకాలంబునఁ దొలి దొలివానచేఁ బుడమినుండి యావిరి యెండవేఁడిమిఁ బోవ నిట్టూర్పుపోవఁ నెగసె; 5. ఆకాశమను నేనుఁగును సూర్యుఁడను మావటీఁడస్త్రాద్రిపై వలలవైచిన నెతఁగుడిచి క్రిక్కిఁనర రక్తమో యనునట్లు సాంధ్యరాగ మొలసె; 6. సముద్రుండు తన్ను మథింపఁగడఁగు మందరముపైఁ

గోపము చే వీచీబాహువులనడంపఁదొడంగెను; 7 అపుడు ముకుళించుచున్న కలువపొదం జూచి నవ్వుచున్నదో యనఁ బద్మనివికసించె; 8. ఆరాముని కళ్యాణోత్సవముఁ జూచుటకు గగనలక్ష్మి కోటానకోటులు కన్నులందాల్చెనో యన రిక్కలు పెక్కుపిక్కటిల్లె; 9. ఆ రేయిఁ జీఁకటులెల్లవేళల భవిష్యద్రావణ కాంతాదుఃఖపుంజంబులు నాఁ గ్రమ్ముకొనియె. 10. దశరథుఁడట్లు కైకమాటలకు లోనై చింతించుచుండ నిట్టి యధర్మము నవలోకింప సమర్థుఁడుగాక తద్వంశంబునకుం గూటస్థుండగు సహస్రకరుం డస్తాద్రిచాటునకుం జనె; 11. అప్పురిగోపురముల స్వర్గంబునంగల దేవగృహంబులు మనతోఁ దుల్యంబులగునా యని చూడ నిక్కిలుసాచెనో యన మిన్నంటిశిఖరంబులతో నొప్పుచుండెను; 12. ఆరాజు కీర్తి యానెడు స్వర్వాహిని నాగలోకంబునకుంజని యందిఱుకటగుటచే నిలువనెలవలనడమి మగిలివచ్చుచోఁ బొడమిన నీటిబుడగలో యన నప్పురిసౌధంబులుల్లసిల్లె; 13 అవ్వేళ సహస్రభానుండు తన కిరణహస్తంబుల నప్పురిమేడలపైఁ గలుగురతనంబుల నపహరించు తలంపునో యన జాలాంతరాళంబుల, లోనికిం జొనిపె; 14. రిక్కలను దూటులనొప్పు నింగిజల్లెడనుండి జాఱుపిండి యనునట్లు వెన్నెల నలుదెసల నలముకొనియె. (స్వతస్సిద్ధమైన గుణమును హేత్వంతర సంబంధముచేతఁ దాదాత్మ్యము కల్పించుట. ఇందు 56 రకములని మొత్తముమీఁదఁ దొంబదియాఱని చెప్పుదురు. వస్తు, హేతు, ఫలముల భేదముచే నేర్పడుచున్నవి. ఉ॥ నీముఖసామ్యముఁగోరిసుమీ పద్మము నీటనిల్చి తపించుచున్నది.); 2. అనవధానత, ఏమఱుపాటు: చూ, ప్రమాదము; 3. పెచ్చరికలేమి. (ఉత్ప్రేక్షము)

ఉత్ప్రేక్షించు. సం. స. క్రి. ఉత్ప్రేక్ష కలుగఁ జెప్పు.

ఉత్ఫుల్లకము. సం. వి. అ. న. 1. ఒకానొక రతిబంధము. చూ, రతిబంధము, అం. 2 ఉత్తానకరణబంధములు పలుబది యొకటింటిలో నొకటి: చూ, ఉత్తానకరణ బంధములు. (ఉత్ఫుల్లము)

ఉత్ఫుల్లము. సం. విణ. (అ. ఆ అ.) 1: చూ, రూ-ఉత్ఫుల్లకము. 1; 2. బలిసినది: చూ, స్థూలము. 1; 3. సంగీత గమక భేదము: చూ, స్వరము. 2; 4. అతిశయమైనది: చూ, పేరాశము; అం. 5. ఉత్తానకరణబంధములు పలుబది యొకటింటిలో నొకటి: చూ, ఉత్తానకరణ బంధములు. (రూ-ఉత్ఫుల్లకము.)

ఉత్వసంధి. పా సంధిదోషములు పదునాలుగింటిలో నొకటి ఉ. రాముఁడు + అనుబాలకుఁడు. దీనిని రాముఁడనుబాలకుఁడని వ్రాయవలయునే కాని రాముఁడు అనుబాలకుఁడని కాని, రాముఁడు యనుబాలకుఁడని కాని వ్రాయరాదు చూడు. సంధి సూ. 10. అట్లులయ్యు నన్యదేశపదముల యదార్థస్వరూపముఁ దెలుపవలసినచోటుల సంధి కలుపక వ్రాయవచ్చును ఉదా — "గ్రీన్‌లాండ్." అను దేశమనియు గ్రీన్‌లాండను దేశమనియు వ్రాయవచ్చును గాని గ్రీన్‌లాండుయను దేశమని వ్రాయరాదు. ఇట్టులే "రాబర్ట్స్" అనువాఁడు "క్రికెట్" అనునాటలోనైనవి. సంధి. సూ. 84. చొప్పున గ్రీన్‌లాండ్డని వ్రాయరాదు. తెనుఁగున నను స్వరమునకు ద్విత్వము పరముగ నుండదు. అంమ్మ, అంన్న, తెండ్లి, కంన్నులోనయినవి యసాధువులు. అన్యదేశ్య శబ్దముల కడపటిహల్లునకు ననుకరణము పరమైనప్పుడు ద్విత్వమిడకుండుటచే కొన్నియెడల శ్రీవ్యము, కాసబియాంక-క్రిస్ యానిటి, అబ్బె

యిట్టిశబ్దముల కచ్చు పరమైనప్పుడు యడాగమము వచ్చుటే బాగు.

ఉత్సంగము. సం. వి. అ. పుం. 1. ఒడి, తొడ పైభాగము: చూ, క్రోడము; 2. ఊరువు, తొడ: చూ, సక్థి; 3 అభినయహస్త విశేషము. వేళ్ళు సాచిపెట్టిన రెండుచేతులను మనికట్లయందుఁగూర్చి యోమ్ముగఁ బట్టినది చూ, వ్యంజకము. 1; 4. సంయుతహస్తములు ముప్పది రెండింటిలో నొకటి: చూ, సంయుతహస్తములు.

ఉత్సన్నము. సం. విణ. (అ. ఆ అ) 1. పెల్లగింపఁబడినది: చూ, ఉన్మూలితము; 2. పైకెత్తఁబడినది: చూ, ఉత్సాదితము.

ఉత్సము. సం. వి. అ. పుం. 1 కొండయూట: చూ, సెలయూట; 2 = ఉచ్చే: చూ, మూత్రము.

ఉత్సర్గము. సం. వి. అ. ఉ. పుం 1. త్యాగము: చూ, వితరణము; 2. విడుపు: చూ, విమోచనము; 3. కీడు: చూ, విపత్తు; 4 న్యాయము, పాడి: చూ, సత్యము 1; 5 పోలిక: చూ, సమానము; 6. నిడుపు: చూ, పొడవు. 2; అం. 7. దానపంచకములో నొకటి: చూ, దానపంచకము.

ఉత్సర్జనము. సం. వి. అ. న. 1. త్యాగము: చూ, వితరణము; 2. విడుపు. చూ, విమోచనము; 3. నిడుపు: చూ, పొడవు. 3.

ఉత్సర్జించు. సం. స. క్రి. త్యజించు: చూ, విసర్జించు.

ఉత్సర్జితము. సం. విణ. (అ. ఆ. అ.) విడువఁబడినది: చూ, హీనము. 3.

ఉత్సవము. సం వి. అ. పుం. 1 వివాహము, సంక్రాంతి, జాతరలోనగు పండుగలు: చూ, పండుగ. 2; 2. కోరికలు కొనసాగుట: చూ, సిద్ధి. 1; 3. గర్వము: చూ, హంకారము; 4. కోపము: చూ, రోషము; అం. 5. జన్యతాళములు తొంబదియాఱింటిలో నొకటి చూ, జన్యతాళములు.

ఉత్సహించు. సం. అ. క్రి అఁగవిఁచు: చూ, యత్నించు.

ఉత్సాదనము సం వి. అ. న. 1. నూనె జిడ్డును పోఁగొట్టెడి వస్తువు. చూ, నలుఁగుఁబిండి; 2 పొతుపుమాట: చూ, మాట 1; 3 పెల్లగించుట అగలుచుట; 4 వ్రాయుట: చూ, వ్రాఁత; 5: చూ, పైకెత్తుట; 6. పెండ్లి: చూ, వివాహము; 7. తిరీటము *: చూ, లొద్దుగు.

ఉత్సాదించు. సం. స. క్రి. 1. పెల్లగించు: చూ, భేదిల్లు; 2. పైకెత్తు: చూ, మీఁదికెత్తు

ఉత్సాదితము. సం విణ. (అ. ఆ. అ) 1. నలుఁగుపెట్టఁబడినది; 2 పెల్లగింపఁబడినది చూ, ఉన్మూలితము, 3. పైకెత్తఁబడినది: ఉత్సన్నము, ఉత్సాదితము, ఉన్నమితము.

ఉత్సారణము. సం వి అ. న. 1. కదలిక: చూ, చలనము. 1; 2. కదలించుట —పై.—

ఉత్సారించు సం. స. క్రి. ఆదరించు: చూ, కదలుచు

ఉత్సారితము. సం విణ. (అ. ఆ. అ.) కదలింపఁబడినది: చూ, ప్రేంఖితము

ఉత్సాహ. పా. ఒకానొక వృత్తము. ఇంగొక్కొ–క్క– పాదమునందేడు సూర్యగణములును నొకగురువును గలిగి యైదవగణాద్యక్షరము యతిగాఁగల వృత్తము. "శ్రీమనోహరుండు సకల-సేవ్యమానుఁడీశుఁడో.") : చూ, వృత్తము. 1 (ఉత్సాహము)

ఉత్సాహజ సం. వి ఆ. స్త్రీ మూఁడు శక్తులచేఁబుట్టిన మంచి పరాక్రమముతోఁగూడుకొనిన ఉత్సాహశక్తి. (శక్తులు=ప్రభుమంత్రోత్సాహములు.)

ఉత్సాహము. సం. వి. అ. పుం. 1. గొప్పపని చేయుటకై యుద్యోగము: చూ, యత్నము; 2. అభీశువు, పగ్గము: చూ, సూత్రము. 1; 3. పుష్టి: చూ, మంగళసూత్రము; 4. అనుమోదము: చూ, సంతోషము, 5. వీరరసము యొక్క స్థాయీభావము; రసస్థాయీభావములు తొమ్మిదింటిలో నొకటి: చూ, రసస్థాయీ భావములు; 6. శక్తులు మూఁడింటిలో నొకటి: చూ, శక్తులు; (ఉత్సాహశక్తి); 7 : చూ, ఉత్సాహ

ఉత్సాహవర్ధనము. సం. వి అ. పుం. వీరరసము: చూ, ఉత్సాహము 5.

ఉత్సాహశక్తి. అం 1 శక్తిత్రయములో నొకటి చూ, త్రయము; 2. విగ్రహము లిరువదింటిలో నొకటి: చూ, విగ్రహములు

ఉత్సాహసిద్ధి. అం. సిద్ధిత్రయములో నొకటి: చూ, త్రయము.

ఉత్సాహించు. సం. అ. క్రి. అంగవించు "శా. మరుత్పౌత్రింబోల్చి హుతాశునిలఁ గుశుఁడుత్సాహించె సోదర్యుతోన్." జై. 6, ఆ. 146· చూ, యత్నించు.

ఉత్సిక్తము. సం. విణ (అ. ఆ అ.) 1 అతిశయించినది: చూ, పేరోశము; 2. గర్వించినది: చూ, బిఱ్ఱు 9; 3. పొంగినది; 4 ప్రోక్షింపఁబడినది: చూ, ప్రోక్షితము. 1.

ఉత్సిక్తుఁడు. సం. విణ (అ. ఆ. అ.) అహంకారి: చూ, పొగరుఁబోతు

ఉత్సుకత్వము. సం. వి. అ న. 1. ప్రియస్మరణాదులచేఁ గాలవిళంబము నోర్వలేమి, తన యిష్టవస్తు ప్రాప్తియందలి కాలవిళంబము నోర్వఁజాలక తహతహపడుట: (చూ, అ. (4) అర్థము.): చూ, ఔత్సుక్యము, 2 వ్యభిచారీభావ భేదముల ముప్పదిమూఁడింటిలో నొకటి, (చూ, రసములు.): చూ, సంచారీ భావములు. "శరయుత్సానమందు వచ్చిపోయినది మొదలాయను రామలక్ష్మణులు లంకకెప్పు డరుదెంతురు? రావణుంబరిమార్చుట యెప్పుడు? నానుప్రియుని యాననంబెప్పుడు విలోకించెదనని గడియలు వెడలించుచుండె."

ఉత్సుకము. పా ఒకానొక వృత్తము. ఇందొక్కొక్క పాదమునందు రెండు భగణములు నొక రగణము గలిగి తొమ్మిదవ ఛందస్సునందుఁ బుట్టిన వృత్తము. ఉదా.—"వాసవముఖ్యసుర స్తుతా, దాసమనోంబుజ షట్పదా, వాసిన భోగములొంగఁగన్, భాసిలునుత్సుక వృత్తముల్."

ఉత్సుకుఁడు. సం విణ. (అ ఆ అ) ఇష్టమైన కార్యమునందు ఉద్యోగించినవాఁడు.

ఉత్సృష్టము. సం. విణ. (అ.ఆ.అ.) 1. ఇయ్యఁబడినది: చూ, దత్తము; 2. విడువఁబడినది: చూ, హీనము. 3.

ఉత్సేకము సం. వి. అ పుం. 1. అతిశయము: చూ, హెచ్చు. 2, 2. గర్వము: చూ, అహంకారము; 3. అనుమోదము: చూ, సంతోషము; 4. నీళ్లు చిలుకరించుట: చూ, ప్రోక్షణము.

ఉత్సేకించు. సం. అ. క్రి 1 అతిశయించు: చూ, ముమ్మరించు; 2 గర్వించు: చూ, అహంకరించు; 3 సంతోషించు: చూ, సంతోషించు; స. క్రి. 4 చల్లు: చూ, ప్రోక్షించు.

ఉత్సేధము సం. వి. అ. న. 1. అంగము: చూ, శరీరము; పుం,న. 2. దీర్ఘము: చూ, పొడవు.2.

ఉదంకము. సం. వి.అ. పుం. 1. కుతపము: చూ, సిద్దె; 2. నీరులేనిది.

ఉదంకుఁడు. సం వి. అ. పుం. ఉదంకుఁడను ముని: చూ, ముని. 1.

ఉదంచనము. సం. వి. అ. న. 1. శరావము,

మూఁకుడు: చూ, పాత్రము. 6; 2. సైకి వైచుట.

ఉదంచితము. సం. విణ. (అ. అ. అ.) విజృంభించినది: చూ, వానీతము. 1; 2. సైకి వైనఁబడినది: ఉత్క్షిప్తము;

ఉదంతము. సం. వి అ. పుం తొల్లింటికథ, అట్టుపుట్టానవాలు: చూ, సమాచారము. 2.

ఉదంతిక సం వి.అ. స్త్రీ. తనివి: చూ, తృప్తి.

ఉదంతుఁడు. సం. వి అ పుం. 1. అభిజాతుఁడు, మంచివాఁడు: చూ, సజ్జనుఁడు; 2. ఆపణికుఁడు: చూ, వణిజుఁడు.

ఉదక. దే. వి. రూ-ఉతక: చూ, జోలుపూస

ఉదకము. సం వి. అ. న 1. జలము: చూ, నీరు. 1; 2 అష్టాపది *: చూ, మల్లె 1, 3. కలువ: చూ, పద్మము. 1; 4. యోని మూలము: చూ, భగము 12; అం 5. పంచామృతములలో నొకటి: చూ, పంచామృతములు.

ఉదకసాత్. సం. అవ్య అంతా జలమవుచున్నది: ఉదకి.

ఉదకి. సం. అవ్య. 1 —వై.—; ఈ. స్త్రీ. 2. బచ్చెలి (కస్న-బసళె) *. చూ, బచ్చెలి.

ఉదకీర్యము. సం. వి. అ పుం కానుగు,కరంజము*: చూ, కాదఘ్నము.

ఉదక్తము. సం. విణ. (అ. అ. అ.) చేదఁబడినది.

ఉదక్య. సం. వి. అ. స్త్రీ. ఋతుమతి: చూ, రజస్వల (చూ, ఋతుమతి.)

ఉదగ్రదంతుఁడు. సం వి. న్. పుం. దంతురుఁడు: చూ, మిడిపండ్లవాఁడు.

ఉదగ్రము సం విణ. (అ. అ. అ.) 1. పొడవైనది: చూ, పొడవు. 2; 2. భయంకరమైనది: చూ, భయంకరము,

ఉదగ్భవుఁడు. సం విణ. (అ. అ. అ.) ఉత్తరదిక్కునఁ బుట్టినవాఁడు.

ఉదజని పా. (హైడ్రొజను.)దాని సజ్జీకరణము: ఇది ప్రాణవాయువుతోఁ గూడి నీటియందు దొరకును. ఇది అసంయోగస్థితియందు అతిస్వల్పముగ దొరకును. సంయోగస్థితియందు జలమునందును, ఆమ్లములయందును, వృక్షములయందును, జంతువులందును గలదు.దీనిని నీటి నుండి సులభముగ విడదీయవచ్చును. (1) జలమునందు విద్యుచ్ఛక్తి ప్రవాహమును పంపిన యెడల ప్రాణవాయువు, ఉదజనియు, వేరువేరుగా వచ్చును. (2) జలమునందు సోడియపు ముక్కను వైచినయెడల, నది జలముపైఁద నీటుఁటూ పరుగెత్తుచు, జలమునందలి ప్రాణవాయువుతో గలసి, సోడియామ్లజనిదమై, తరువాత జలముతో సంయోగమును పొంది, సోడియక్షారమగును. అప్పుడు, జలము నుండి విడదీయఁబడిన ఉదజని సైకివచ్చును. సోడియము సదా కదలుచుండుటచేత అట్లు వచ్చు ఉదజనిని ప్రోగుజేయుట కష్టమయినను, సోడియమును ఒకచోట నుండునట్లుచేసి నీరు నింపిన పాత్రను దానిమీఁద బోర్లించిన యెడల, ఆపాత్ర నిండుగా ఉదజనిని నింపవచ్చును.సోడియమును పాదరసముతో మిశ్రము చేసి, దానిని యీ కార్యమున కుపయోగింతురు. (3) ఆమ్లములనుండి యుదజనిని వేరుఁజేయు విధమే శ్రేష్ఠతరము.

ఉదజము. సం. వి. అ. పుం. 1. పసులఁదోలుట; విణ 2. నీటఁబుట్టినది.

ఉదధి. సం. వి ఇ. పుం. 1. కడలి: చూ, సముద్రము; 2. మేఘము: చూ, మేఘము. 3. ...యమగఁడు:చూ, సూర్యుఁడు.

ఉదధికమి. సం. వి. ఈ. స్త్రీ. తెల్లఆగిసె *: చూ, శుకనాశము.

ఉదధిమలము. సం. వి. అ. పుం. సముద్రపు

నురుగు (కన్న- సముద్రిదనోర.) *: చూ, సాగరఫేనిలము.

ఉదధీరము సం. వి. అ న లోహవిశేషము, వంగము, తగరము: చూ, లోహము. 1.

ఉదన్యా. సం. వి. ఆ స్త్రీ. దప్పిక: చూ, పిపాస.

ఉదన్వంతము. సం. వి. త్ పుం. కడలి: చూ, సముద్రము.

ఉదపక్వము. సం. వి. అ. పుం. వానెనకుడుము: చూ, భక్ష్యము.

ఉదపానము. సం. వి. అ. పుం, ‑. నూపము. చూ, నుయ్యి.

ఉదబంధని. సం. వి. ఈ. స్త్రీ.పాతాళగరుడ*: చూ, వత్సాదని

ఉదయగిరి, శా. (మ. రా. శ్రీ. మల్లంపల్లి సోమశేఖర శర్మగారు.) రేచర్ల గుసకుల బ్రిహ్మానియైన రాజనాయకుడిట్లు కీర్తింపఁబడి యున్నాఁడు. "కులతిలకుఁడు వసుధామగ । జలధిసుధాకరుఁడ శేషజనమితరితుం । డలఘుఁడు రిపుతరుదావా । నలుఁడనఁగాఁ బర ౭ రాజనాయకుఁడుర్విన్." ఈతని విజయములు పైనుడివిన శాసనమున ఇట్లు వర్ణితములైనవి. "బొక్కారలోని వీరభటావలి వధించిగోధుమ తాలితలచెంచి ఉదగిరి సాధించిపడిరాయ, నింద్రోలి దక్షారామ భీమేశ్వర దేవరకక్షయ, దీపంబులు నిల్పె........" బొక్కారఅను పది గంజాంజిల్లా అస్కా తాలూకాలోని బొక్కారయని శాసనపరిష్కర్తలు వ్రాసియున్నారు వారు ఉదయగిరి రూపాంతరముగనున్న ఉదగిరిని నెల్లూరు మండలములోని ఉదయగిరిగ గుర్తించియున్నారు. కాని యది పొరపాటుగునేమో ? ఇదికూడ విశాఖపట్టణమండలములోనిది గాని, గంజాం మండలములోనిది గాని యగునని నాయూహ. ఉత్తరమున కళింగజైత్రయాత్రకువెళ్ళి బొక్కారను, ఉదయగిరిని జయించి తిరిగి ద్రాక్షారామమువచ్చి. భీమేశ్వరునికి అక్షయదీపంబులు నిల్పి, రాజనాయకుఁడు పిదప ఓరుగంటికి మరలిపోయెననుటయే సమంజసముగఁ గన్పట్టుచున్నది కళింగ. 381. పుటలు; (శ్రీయుత రాళ్ళ బండి సుబ్బారావు గారు ఎం. ఎ ఎల్. టి ) నైసర్గికస్వరూపము. ఈతూర్పు కనుమలయందు 1000 మొ 5000 అడుగులు ఎత్తువఱకుగల మహేంద్రగిరి, మలయగిరి, ఖండగిరి, ఉదయగిరి మొదలుగాగల గిరిశిఖరములున్న......లోయలున్న గలవు. కళింగ. 10. పుటలు,(మ. రా. శ్రీ. కుందూరి ఈశ్వరదత్తుగారు. బి. యె.) "సీ ఉదయాద్రి వేగ నసహ్యగతి సాధించె ‑ వినుకొండమాట మాత్రి నెపురించె......" కళింగ. 367 పుటలు; క్రీ.శ 1514 సంవత్సరాంతమునశ్రీకృష్ణదేవరాయలు నెల్లూరుజిల్లాలోని ఉదయగిరికోటను పట్టుకొనెను. ఉదయగిరి కళింగరాజ్యములోనిది...ఉదయగిరికోటను బట్టుకొని...కట్టించెను. ఉదయగిరి కోటను సాధించినతరువాత శ్రీకృష్ణరాయలు తిరుపతికిఁబోయి తనయిష్టదైవమైన శ్రీవేంకటేశ్వరుని దర్శించి యద్దేవునకుఁ గనకాభిషేకముఁ గావించి 30,000 మాడలును, బంగారునగలు కంకణములును కానుకగా సమర్పించెను. కళింగ. 364. పుటలు; (శ్రీమాన్ కిళాంబి రాఘవాచార్యులుగారు. ఎం. ఎ, బి. ఎల్.) ఉదయగిరియందలి జైనరాజగు ఖరవేల మహామేఘవాహనుని ప్రాకృతశాసనమున నందరాజులు త్రవ్వించిన కాలువలను ఖరవేలుఁడు మరమ్మతు చేయించినటుల వ్రాయఁబడియున్నది: కళింగ 244. పుటలు; (శ్రీయుత రాళ్ళబండి సుబ్బారావు

గారు ఎం. ఎ. ఎల్. టి.) బుద్ధుడుపదేశించిన స్థలములందు 10 అశోకస్తంభములుండెను. దేశముయొక్క నైఋతి దిక్కున నొక కొండమీఁద పుష్పగిరి మఠమొకటుండెను..... ఈకొండ ఉదయగిరిఖండగిరి కొండ కావచ్చును. కళింగ. 508. పుటలు; గజపతుల రాజ్యము ఉదయగిరివఱకు వ్యాపించి యుండెననియు, తెలుపఁబడినది. కళింగ. 652. పుటలు.

**ఉదయగిరిగుహలు.** శా. (శ్రీయుత రాళ్ళ బండి సుబ్బారావుగారు. ఎం. ఎ., ఎల్. టి.) ఈ ఉదయగిరి ఖండగిరి గుహలు గుహాలయములు, గుహాశిల్పములు, శాసనములు జైనమతమును కళింగమున క్రీ. పూ. నాల్గవ శతాబ్దమునుండి క్రీ. శ. 14 శతాబ్దమువఱకు ప్రబలియుండెనని నిదర్శనమిచ్చుచున్నవి. కళింగ 456 పుట.

**ఉదయత్రయము.** అం. ఇదియె త్రివర్గము.— క్షయము, స్థానము, వృద్ధి. (3). (చూ, త్రయము.)

**ఉదయనుఁడు.** శా. 1. నాగార్జునుని గ్రంథములలో 'సుహృల్లేఖ' యను పద్యకావ్యము కడు మనోహరమును సుప్రసిద్ధమునై యున్నది. ఈ కావ్యమును తనపోషకుఁడును శాతవాహనవంశీయుఁడునగు ఉదయనునికొఱకు నాగార్జునుఁడు రచించెనని టిబెటు చరిత్రకారుఁడైన తారానాథుఁడు తెలుపుచున్నాఁడు. భా. వెం. కృ. ప్రాచీనాంధ్రదేశము. 47 పుట; టిబెటు దేశ గ్రంథములందు నాగార్జునునికి మిత్రుఁడైన శాతవాహనుఁడు అంతివాహనుఁడనియు ఉదయనుఁడనియు జేత్రియనుఁడనియు వివిధములుగఁ జెప్పఁబడియున్నాఁడు......భా. వెం. కృ. ప్రాచీనాంధ్రదేశము. 52 పుట; సం. వి. అ. పుం. 2. వత్సరాజు: చూ, రాజు 1; 3. అగస్త్యుఁడు: చూ, ముని. 1.

**ఉదయమార్తాండరసము.** పా. శుద్ధిచేసినవి— 1 తు-నాభి, 3 తు-నేపాళములు, 4 తు-ఇంగిలీకము, 2 తు-పొంగించిన వెలిగారము ఈ వస్తువులు కల్వమునవైచి మూఁడు దినములు నిమ్మపండ్ల రసమునను, మూఁడుదినములు అల్లపురసమునను లెస్సగా మర్దించినయెడల మైనపక్వమగును దీనిని గాజుసీసాలోఁ బెట్టి సెనగగింజంత మాత్ర తీసికొని పొంగించిన అల్లపురసము అనుపానముతో కలిపి తెల్లవారుజామున పుచ్చుకొనిన విరేచనములు అగును. మజ్జిగ అన్నము తినిన విరేచనములు కట్టును.

**ఉదయము.** సం. వి. అ. పుం. 1. ఉదయపర్వతము: చూ, పర్వతము; 2. జననము: చూ, పుట్టుక; 3. దీర్ఘము: చూ, పొడవు. 2; 4. ఔన్నత్యము, ఎత్తు: చూ, పొడవు. 2; 5. సుగంధి: చూ, సుగంధము; 6. కషాయము: చూ, రసము. 5, 7. అతిశయము: చూ, హెచ్చు. 2, 8. తొలుసంజ: చూ, సూర్యోదయము; అం. 9. కాలములు మూఁడింటిలో నొకటి: చూ, కాలములు. (చూ, త్రయము)

**ఉదయాదిత్యుఁడు.** శా. 16 దేవేంద్రవర్మ కంబకాయ శాసనము. (మ. రా. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు) ఈశాసనమున మూఁడు రాగిరేకులు గలవు.... కళింగనగరము రాజధానిగా పరిపాలించుచుండిన గంగాన్వయకులతిలకుఁడగు శ్రీ దేవేంద్రవర్మ "దంతిపురము"న నుండఁగా ఆ రాజుయొక్క విజయరాజ్యము "సకాబ్దసహస్రమేక సతత్రియాధిక" మని చెప్పఁబడ్డ కాలమున ఆ రాజుయొక్క మహామండలికుఁడును, కదంబకుల తిలకుఁడును అగు శ్రీధర్మఖేడి పుత్రుఁడు మహామండలికుఁడైన ఉదయాదిత్యుఁడు "కేపనిజ" గ్రామమును "అదాటుభట"ప్రవేశ్యముగను, ఆచంద్రార్కస్థాయిగాను ఉదకపూర్వకముగ దానముచేసి

అందొక భాగమును వృద్ధపుత్రుఁడైన రేవన నాయకుని కుమారుఁడు నారాయణనాయకుని కిని, ఇంకొక భాగమును "అయితయసోను యాదు" [?] "ఈజస" కునికి నొసంగెను. ఇదియే శాసనభావమునుబట్టి నే గ్రహముచేసికొఁగలిగిన విషయము. కళింగదేశ చరిత్రానుబంధము 79.పుట; (శ్రీయుత రాళ్లబండి సుబ్బారావు గారు. ఎం. ఎ, ఎల్.టి.) ఉదయాదిత్యుఁడు శక. సం॥ 1103 శక క్రీస్తు సం॥ 1181 నాటి వాఁడు. కళింగ 533 పుట.

ఉదయాద్రి. సం. వి. ఇ. పుం. తూరుపుఁగొండ. "క. ఉదయాద్రికిఁ బైనుండెకు, సదయుని మదినిల్పి చూడ శక్యముగాఁగాఁ, గుదురుపడు జ్ఞప్తినిలిపిన." వేమన. 515: చూ, పర్వతము.

ఉదయించు. సం. అ. క్రి 1 జ్ఞప్తికివచ్చు: చూ, స్ఫురించు. 2; 2. జన్మించు: చూ, పుట్టు. 2; 3. సూర్యోదయమగు

ఉదరంభరి. సం. విశే. ఇ. ఆత్మంభరి: చూ, పొట్టకూటివాఁడు.

ఉదరకోశులు. పా (మార్సుపైయులు.), ఏక ద్వారులు (మానోట్రిమ్సు) అను జీవులనుండి పుట్టినవి. వీనినుండియే కోఁతులుపుట్టినవి కంగారుమృగము, ఒపోసము వీనిపోలిన జంతువులు. ఈ ఉదరకోశులయొక్క క్రిందిదవుడల శిలామయరూపములు త్రియాశికపొర యందు దొరికినవి. (చిం.దీ. పరిణామవాదము. 4. పొరట.)

ఉదరత్రాణము. సం. వి. అ. న. కవచభేదము: చూ, బొందడము.

ఉదరథి. సం. వి. ఇ. పుం. 1 కడలి: చూ, సముద్రము; 2. పోయమగఁడు: చూ, సూర్యుఁడు.

ఉదరము. సం. వి. అ. న. 1. కడుపు, పొట్ట: చూ, భ్రూణము. 1; 2. గర్భము, పిండము తోఁగూడిన కడుపు: చూ, భ్రూణము. 1; 3. జేగడము: చూ, యుద్ధము.

ఉదరాగ్ని. అం. చతుర్విధాగ్నులలో నొకటి: (చూ, అగ్నులు): చూ, చతుష్టయము.

ఉదరామయము. సం. వి. అ పుం. ఆమరోగము: చూ, రోగము. 1.

ఉదరావర్తము. సం. వి. అ. పుం. అత్తమామలను జంపెడి లక్షణములుగల కన్యకయొక్క గుఱుతు, మామను చంపుదాని కుండునట్టి గుఱుతు: చూ, లక్షణము. 1.

ఉదరావర్తి. అం. అశుభావర్తములలో నొకటి: చూ, అశుభావర్తములు.

ఉదరిపడు. ద్వ. అ. క్రి. ఉలికిపడు. "గీ. ఉదరిపడి మేలుకని కన్నులువిద విచ్చి." హరి. ఉ. 7, ఆ. 98: చూ, బెణఁకు 2.

ఉదరిపాటు. ద్వ. వి. 1. ఉస్సట్టుండి. "ద్వి. ఉదరిపాటునఁ దదంకోపరినుండి." విష్ణు. పూ. 1. ఆ: చూ, దబ్బాటు; 2: చూ, ఉలికిపాటు. "ఎ. గీ. అతని యాకారముగాంచి యదరి బెదరి, చెదరిపదములు తడఁబడనుదరిపాటు, గదుర." ఉ, రా. 3, ఆ 347.

ఉదరు. దే. అ. క్రి. అదరు. "సీ. ఉదరి క్రేళ్లుటికెడు నగ్రికేసరులతో బిలగతాహులు కింక వెలికినెగయ." హరి. పూ. 7, ఆ. 177: చూ, చలించు.

ఉదర్కము. సం. వి. అ. పుం. 1. భవిష్యత్కాలము: చూ, రాఁగలకతి; 2. భవిష్యత్ఫలము: చూ, రాఁగలపంట; 3. ఉమ్మెత్తమొల్లు: చూ, మదనకంటకము; 4. ఉమ్మెత్త (కన్ను-ఉమ్మెత్త.) *: చూ, హాలాపుష్పము.

ఉదర్చి. సం. వి. స్. పుం. 1. అగ్ని: చూ, నిప్పు; 2. ఉదర్చి యను దేవత; విశే. 3. విశేషకాంతిగలది: చూ, విరాజమానము; 4. వైశేగయామంతులుగలది.

ఉదర్ధి. సం. వి. ఇ. పుం. ఎద్దు: చూ, వృషభము. 1.

ఉదవసితము. సం. వి. అ. న. ఇల్లు: చూ, గృహము. 1.

ఉదశ్విత్తు. సం. వి. త్. న రూ-ఉదస్విత్తు. సగమునీళ్లు చేర్చిన మజ్జిగ: చూ, మజ్జిగ.

ఉదస్తము. సం. విణ. (అ. ఆ. అ.) ఎత్తఁబడ్డది: ఉత్క్షిప్తము, ఉద్యతము, ఉద్ఘూర్ణము.

ఉదస్తుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) తొలఁగింపఁబడినవాఁడు: చూ, విసర్జనీయుఁడు.

ఉదస్విత్తు. సం. వి. త్ న: చూ, రూ-ఉదశ్విత్తు.

ఉదాకరము. సం వి. అ. పుం. కడలి: చూ, సముద్రము.

ఉదాత్తము. సం. వి. అ. పుం. 1.ఊర్ధ్వస్వరము, తాల్వోష్ఠాది సంయోగమువలన నూర్ధ్వభాగమునందుచ్చరించు అచ్చు, వేదమునందలి స్వరవిశేషము: (చూ, అనుదాత్తము. 2): చూ, స్వరము. 2; 2. త్రిస్వరము (ఉదాత్త, అనుదాత్త, స్వరితము) లలో నొకటి, వేదస్వరములు మూఁడింటిలో నొకటి: (చూ, త్రయము): చూ, వేదస్వరములు; 3. ఉదాత్తాలంకారము. అన్యోపలక్షణశ్లాఘ్యచరిత్రవర్ణనము. ఉదా.—శివార్జునులు పోరాడిన కానసమిదే సుమీ.": చూ, అలంకారము. 3; విణ. 4. మనోహరమైనది: చూ, హృద్యము; 5. అధికమైనది: చూ, హేరాళము; 6. ఇష్టము: చూ, హృద్యము.

ఉదాత్తుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. అధికుఁడు: చూ, హేమాహేములు; 2. పురుషార్థములయందు దధికేచ్ఛగలవాఁడు: చూ, ఉదీర్ణుఁడు; 3 దయగలవాఁడు చూ, దయాళువు; 4. ఇచ్చువాఁడు: చూ, దాత; 5. అలంకృతుఁడు: చూ, భూషితుఁడు.

ఉదానము. సం. వి. అ పుం. 1. పంచప్రాణములలో నొకటియగు కంఠమునందుండునట్టి వాయువు: (చూ, పంచకము): చూ, వాయువు, 2. ప్రాణము లయిదింటిలో నొకటి: చూ, ప్రాణములు; 3. పాము, ఆదిశేషుని వనమఁగు: చూ, సర్పము; 4. నాభి: చూ, బొడ్డు; 5. ఉదానమను ఏనుఁగు: చూ, హస్తి; 6. నమ్మిక: చూ, విశ్వాసము; 7. కడుపునందలి సుడి, ఉదరావర్తము: చూ, లక్షణము. 1.

ఉదారత్వము. సం. వి. అ. న. ఔదార్యము: చూ, మహాత్వము.

ఉదారము. సం. వి. అ. పుం. 1. ఊఁదగలను వడ్లు చూ, ధాన్యము; 2 తఱి: చూ, సమయము. 1; విణ 3 అధికమైనది: చూ, హేరాళము.

ఉదారుఁడు. సం. విణ. (అ. ఆ అ) 1. ఈవిచేతప్రసిద్ధుఁడు, వదాన్యుఁడు, ఇచ్చువాఁడు: చూ, దాత; 2. అధికుఁడు: చూ, హేమాహేములు; 3. మంచివాఁడు: చూ, సజ్జనుఁడు; 4. పురుషార్థములయందధికేచ్ఛగలవాఁడు: చూ, ఉదీర్ణుఁడు; 5. కుటిలముగాక చక్కనైన మనస్సుగలవాఁడు: చూ, సరళుఁడు; 6. బలిమికాఁడు: చూ, లావరి.

ఉదాసము. సం. వి. అ. పుం. ఆసక్తి: చూ, వాంఛ.

ఉదాసించు. సం స. క్రి. అనాదరించు: చూ, తిరస్కరించు.

ఉదాసీనుఁడు. సం. వి. అ. పుం. 1. దండెత్తిపోవువానికి మిత్రుఁడగు వాని దేశమునకు నావలిదేశపు రాజు ఉదాసీనుఁడు అనఁగా శత్రుమిత్రదేశములకు మీఁద నుపకారాపకారములు చేయక యూరకుండువాఁడు; విణ. 2. ఉదాసీనపు మాటలు ఆడువాఁడు, ఎదుటి వానిలోపములనుగ్గడించి సిగ్గును పొం

దుకటులఁ జేయువాఁడు: చూ, తగులని వాఁడు; అం. 8 ద్వాదశ రాజమండలములో నొకఁడు: చూ, ద్వాదశరాజమండలము.

ఉదాస్థితము. సం. వి. అ. పుం. నిశ్చయము: చూ, నిశ్చయము.

ఉదాస్థితుఁడు. సం. వి. అ. పుం. 1. ద్వారపాలకుఁడు: చూ, రక్షకుఁడు; 2. స్వకర్మమును వదలిన ముని: చూ, ముని 1; 3. చారుఁడు: చూ, వేగువాఁడు; 4. అధిపతి: చూ, ప్రభువు. 2; 5 కొట్టఁబడినవాఁడు: చూ, సమాహతుఁడు.

ఉదాహరణము. సం. వి. అ. న. రూ- ఉదాహరము. చెప్పెడియర్థమునకు సరిపోవునట్లు ఎత్తి చూపెడి అర్థాంతరము, తెలిపెడి. చూ, నిదర్శనము. 1. (ఇక్జాంపుల్)

ఉదాహరము. సం. వి. అ. పుం. —పై.— (రూ-ఉదాహారము.)

ఉదాహరించు. సం. స. క్రి. ఉదాహరణపఱచు: చూ, దృష్టాంతీకరించు.

ఉదాహారము. సం. వి. అ. పుం: చూ, రూ- ఉదాహరము.

ఉదాహృతము. సం. విణ. (అ. ఆ. అ.) ఉదహరింపఁబడినది.

ఉదితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. చెప్పఁబడినది: చూ, వ్యాఖ్యాతము. 2; 2 పుట్టినది: చూ, సంభూతము.

ఉదితుఁడు. సం. విణ. (అ ఆ. అ.) అభ్యుదితుఁడు: చూ, పుట్టినవాఁడు

ఉదియ. పై. వి.=ఉద్యోగ. రూ-ఉద్దియ. "మ ప్రీద్వదనోత్తుక దివికెత్తుఁగిట్టి యుదియక బట్టుక బడందోఁచు బల్విడిఁదోఁచుక రథిరంబుఁబిల్పుఁబెలుచన్ వీక్షించుఁ గ్రోధంబుసన్." రా. అర. 2, ఆ.134: చూ, యత్నము.

ఉదియగొను. ద్వ. అ. క్రి. (ఉదియ + కొను) ఆరంభించు "సీ. ఒండొరు నొప్పింపనుద్యోగక సైన్యంగవోదవు నదల్పులనుదియ గొనుచు" రా. అర. 2, ఆ. 138: చూ, యత్నించు.

ఉదిరి దే వి. 1. అపరంజి. "ఉదిరియంబరము వాఁడు." చంద్రా. 1, ఆ. 70; రామా. 7, ఆ, 180: చూ, లోహము. 1; విణ. 2. చేవగలది: చూ, స్థైర్యము; 3. తపింపఁజేయఁబడినది "సీ. ఇది కోలమెఱుఁగు గాదుదిరి బంగారంపుఁ బసిమి గ్రిమ్మెడు పచ్చపట్టుగాని." పాండు. 4, ఆ. 31: చూ, తప్తము.

ఉదిరిగొను దే అ.క్రి.(ఉదిరి + కొను.)తపించు. "వ ఇట్లు హృదయంబునం గదిరిన మదనానలంబుచే నుదిరిగొని యాసుదతి చిత్రరేఖ కిట్లనియె." ఉ, హరి. 5, ఆ. 102. (రూ-ఉదిలగొను): చూ, సంతాపించు.

ఉదిల. దే. వి. 1 పరితాపము: చూ, సంతాపము; 2. భయము: చూ, వెఱపు.

ఉదిలకొను దే అ. క్రి. పరితపించు. "వ. ఇట్లు మదనాగ్ని నుదిలకొని యగ్నిదేవుం డక్కాంతతో నేకాంతంబున నిట్లనియె." భార. అను. 1, ఆ. 49: చూ, సంతాపించు. (రూ-ఉదిలగొను.)

ఉదిలగొను. దే అ. క్రి.—పై.—

ఉదిష్టము. అం. ప్రస్తారములు పదింటిలో నొకటి: చూ, ప్రస్తారములు

ఉదీచి. సం. వి. ఈ. స్త్రీ. ఉత్తరపుదిక్కు: చూ, దిక్కు. 1.

ఉదీచీనము. సం. వి. అ. న. ఉత్తరపుదిక్కునఁ బుట్టినది. (వ్యతి.—అవాచీనము)

ఉదీచీనుఁడు. సం. వి. అ. పుం. ఉత్తరపుదిక్కునఁ బుట్టినవాఁడు.

ఉదీచ్యము. సం వి. అ. న. 1. కురువేరు *: చూ, హ్రీబేరము; పుం. 2. శరావతీనదియొల్లగాఁగల (వాయవ్య) పశ్చిమోత్తరముల

మధ్యదేశము: చూ, దేశము; విశే. 3. ఉత్తర ప్రదిక్కు—ది.

ఉదీచ్యవృత్తి. పా. వైతాళీయజాతివృత్తములలో నొకటి. ఇది దక్షిణాంతిక ఛాయనే నడుచును: చూ, వృత్తము. 1. (చూ, వైతాళీయము.)

ఉదీచ్యుఁడు. సం. వి. అ. పుం. 1. ఉత్తరదేశస్థుఁడు; 2. పండితుఁడు: చూ, విద్వాంసుఁడు; 3. అగ్రగణ్యుఁడు: చూ, శ్రేష్ఠుఁడు.

ఉదీర్ణము. సం. విశే. (అ. ఆ. అ.) గొప్పది, హెచ్చు: చూ, హేరాళము.

ఉదీర్ణుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) పురుషార్థములయం దధికేచ్ఛగలవాఁడు: ఉదాత్తుఁడు, ఉదారుఁడు, ఉదీర్ణుఁడు, ఉద్యతుఁడు.

ఉదుంబరపర్ణి. సం. వి. ఈ. స్త్రీ. దంతి *. చూ, ముకూలకము.

ఉదుంబరము. సం. వి. అ. న. 1. రాగి: చూ, లోహము. 1; పుం. 2 అంజూరు *: చూ, మేడి; 3. పూలగురివెంద *: చూ, గురివెంద; 4. గడప: చూ, దేహళి; 5. ఒక విధమగు వానప్రస్థాశ్రమము: చూ, వానప్రస్థము; 6. కుష్ఠభేదము: చూ, మండలము. 3, అం. 7. తతవాద్యములు యిరువదింటిలో నొకటి: చూ, తతవాద్యములు.

ఉదుంబరావతి. సం. వి. ఈ. స్త్రీ. 1. కాలభేదము: చూ, సమయము. 1; 2. ఉదుంబరావతీనది: చూ, నది; 3. జీన్నము: చూ, యజ్ఞము; 4. కాఁపురములేనియింటు మొలచిన తీఁగె: చూ, వృక్షము.

ఉదుంబరుఁడు. సం. వి. అ. పుం. అఁడంగి. చూ, షాబిదల్లుఁడు.

ఉదుకు. దే. స. క్రి: చూ, రూ—ఉడుకు.

ఉదుటు. దే. వి. అదుగుటు: చూ, ప్రశ్నము.

ఉద్దుటు. దే. వి. 1. గర్వము. "చ. మూర్ఖతోలంగినఁగన్నువిచ్చిపే, వుదుటునలేచె లక్ష్మణసహోదరుఁడు." ఉ, రా. 7, ఆ. 187: చూ, హంకారము; 2. చేవ: చూ, స్థైర్యము; 3. అందము: చూ, సౌందర్యము; 4. అతిశయము: చూ, హెచ్చు. 2; విశే. 5. గర్వించునది: చూ, బిఱ్ఱు. 4.

ఉదురు. సం. వి. ఉ. పుం. 1. ఎలుక: చూ, మూషికము; దే. వి. (1) భయము. "చ. చెదరక యుత్తులద్దనుజశేఖరు బిట్టెదిరించి... మహోదగుం, డుదురున నొక్క ఘోరగదయా నిక్పతాంతుని లీలనుగ్రఁడై." ఉ, రా. 3, ఆ. 14: చూ, వెఱపు. (ఉదురుమిడుకు ఇత్యాదిపదప్రయోగమువలన నిది ప్రయోగవిరళముగా నుండినను వ్రాయఁబడియెను)

ఉదురుమిడుకు. దే. విశే. 1. అహంకారి: చూ, పొగరుఁబోతు; 2 అవినీతుఁడు: చూ, సముద్ధతుఁడు.

ఉదూఖలము సం. వి. అ. న. 1. ఉలూఖలము: చూ, ఱోలు. 1; 2. గుగ్గిలము *: చూ, గుగ్గులువు.

ఉదూఢము. సం. విశే. (అ. ఆ. అ.) 1 పెండ్లియయినది: చూ, ఊఢ. 2; 2. బలిసినది: చూ, స్థూలము. 2; 3. వహింపఁబడినది: చూ, వాహితము.

ఉదూఢుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) పెండ్లిచేసికొనినవాఁడు: చూ, ఊఢుఁడు.

ఉద్గతము. సం. విశే. (అ. ఆ. అ.) 1. భేదించుకొని వెలికుబికినది: చూ, కందళితము; అం. 2. విపరీతకరణబంధములు నాలుగింటిలో నొకటి: చూ, విపరీతకరణబంధములు. (చూ, బంధములు.)

ఉద్గతి. సం. వి. ఇ. స్త్రీ. 1. పక్షిగతి, ఎగుపు: చూ, పల్లటీ. 1; 2. జననము. "జగదుద్గతికిని బీజము." ఆము. 3, ఆ: చూ, పుట్టుక.

ఉద్గమనీయము. సం. వి. అ. న. 1. ఉదికిన బట్టలజోడు. (కొందఱిది త్రిలింగమనియు దీని కర్థము ఉదికినదోవతి అనియు సహేతుకముగఁ జెప్పుచున్నారు.): చూ, వస్త్రయుగ్మము; విణ. 2. ఎగయఁదగినది.

ఉద్గమము. సం వి.అ. పుం. 1. పక్షిగతి, ఎగుపు: చూ, పల్లటీ. 1; 2. ప్రయత్నము: చూ, యత్నము; 3. జననము: చూ, పుట్టుక.

ఉద్గమించు సం. అ. క్రి. 1. పైకిలేచు: చూ, లేఁగు; 2. పల్లటీల్వైచు: చూ, లంఘించు

ఉద్గరణము సం. వి. అ. న. 1 క్రక్కుడు: చూ, వాంతి; 2. ఉద్గారము: చూ, త్రేనుపు.

ఉద్గాఢము. సం. క్రి. విణ, అ. న. 1. అతిశయము: చూ, హెచ్చు. 2; విణ. 2. అధికము: చూ, హేరాళము.

ఉద్గాత. సం. వి. ఋ. పుం 1. యజ్ఞమునందు సామవేదతంత్రము నడపువాఁడు: చూ. ఋత్విజుఁడు. 1; 2. సామవేదముఁ దెలిసిన ఋత్విజుఁడు: చూ, ఋత్విజుఁడు. 1; అం. 3. ఋత్విజులు పదునాలుగురిలో నొకఁడు: చూ, ఋత్విజుఁడు. 1.

ఉద్గారము. సం. వి. అ పుం. 1. క్రక్కుడు: చూ, వాంతి; 2. త్రేఁపు: చూ, త్రేనుపు.

ఉద్గారించు. సం అ. క్రి. త్రేఁచు: చూ, త్రేనుచు.

ఉద్గాహితము. సం. విణ. (అ.ఆ.అ.) 1. చెప్పఁబడినది చూ, వ్యాఖ్యాతము. 2; 2. కట్టఁబడినది: చూ, సందానితము. 1; 3. స్వీకరింపఁబడినది: చూ, గృహ్యము.

ఉద్గిరి. సం. వి. ఇ. స్త్రీ. నిగరణము: చూ, మ్రింగుడు.

ఉద్గీరము. అం. అవరోహివర్ణగతాలంకారములు పండ్రెండింటిలో నొకటి: చూ, అలంకారము. 3.

ఉద్గీతి. షా. ఒకానొకపద్యము. ఇందు మొదటి రెండు పాదములు చపలకందము ఛాయను కడమ పాదములు పథ్యాకందము ఛాయను నడచును: చూ, కందము. 3. (చూ, వృత్తము. 1.) అప్పు. 4, ఆ. 348.

ఉద్గీథము. సం. వి అ. పుం 1. సామవేదము: చూ, వేదము; 2 సామవేదముయొక్క భాగము: చూ, వేదము; 3. సామవేదములోని ప్రణవము: చూ, వేదము. ఓ3మ్, ఓమ్, ఓం. దీనికి ప్రణవమనియు, ఓంకారమనియు, ఉద్గీథమనియు, ఏకాక్షరమనియు, తారకమనియు, శబ్దబ్రహ్మమనియు నామాంతరములు గలవు. "ఓమిత్యే తదక్షరముద్గీథముపాసీత । ఓమితిహ్యుద్గాయతి తస్యోపవ్యాఖ్యానమ్." ఛాందోగ్యోపనిషత్. ౧. ౧. ౧. "నక్షరతి నసంచలతి నవినశ్యతి ఇత్యక్షరంబ్రహ్మ; యంసామగాః ఉచ్చైర్గాయంతిసః తంఉద్గీథమ్, ఉద్గీథశబ్దవాచ్యమ్." చలింపనిదియు వినాశముఁ జెందనిదియునైనది. అక్షరాఖ్యమైన బ్రహ్మము. దీనిని సామగానముచేయువారు ఉచ్చస్వరముతో గానము చేయుచున్నారో అదే ఉద్గీథము, లేక, ఉద్గీథనామముగలది. "అథఖలుయ ఉద్గీథః సప్రణవోయః ప్రణవః సఉద్గీథ ఇత్యసౌవా ఆదిత్య ఉద్గీథ ఏషప్రణవ ఓమితిహ్యేషస్వరన్నేతి." ఛాం. ౧. ౫. ౧. సుప్రసిద్ధమగు (సామవేదులయొక్క) ఉద్గీథమే(ఋగ్వేదులయొక్క ప్రణవము, లేక, ఓంకారము. ఈప్రణవమే ఉద్గీథము (అనఁగా ఇవి రెండును సమానార్థకములు.) ఈఉద్గీథమే ఆదిత్యుఁడు, అనఁగా అవినాశియగు నఖండేశ్వరుఁడు. ఏలనన ఇవి (ఉద్గీథప్రణవములు) ఓంకార వాచ్యుఁడగు బ్రహ్మమును గానముచేయుచు వానితోనే

సంబంధముఁ గలిగియున్నది; 4. సామగానము: చూ, స్వరము. 2; 5. గుడాగము : చూ, గృహము. 1; 6 అంబుదము: చూ, మేఘము.1; 7. దండు విడియుచోటు: చూ, శిబిరము

ఉద్గీథుఁడు. సం. వి. అ. పుం. 1. చెందురుఁడు: చూ, చంద్రుఁడు; 2. ఒకానొక ఋత్విజుఁడు. చూ, ఋత్విజుఁడు. 1.

ఉద్గిరణము. సం. వి. అ. న. ఉద్గిర : చూ, మ్రింగుడు.

ఉద్గీర్ణము. సం. విశే. (అ. ఆ. అ.) 1. క్రక్కఁబడినది: చూ, వాంతము. 2, 2 అగోపీవర్ణగతాలంకారములు పండ్రెండింటిలో నొకటి: చూ, అగోపీవర్ణ తాలంకారములు (చూ, అలంకారము. 3.)

ఉద్గూర్ణము. సం. విశే. (అ. ఆ. అ.) పైకెత్తఁబడినది, పొడవుగా నెత్తఁబడిన శస్త్రాదులు: చూ, ఉదస్తము.

ఉద్గ్రావము. సం. వి. అ. పుం పాటిపోవుట.

ఉద్గ్రాహము. సం. వి అ. పుం. 1.ఎగఁబట్టుట: చూ, శ్వాసము; 2 ఉగ్గిలి: చూ, ఉగ్గము; 3 ఎగరవేసిపట్టుట; 4. చెంబుమీఁదిఅంచును బట్టుట.

ఉద్గ్రాహితము. సం. విశే. (అ. ఆ. అ.) 1 ఉపన్యాసము చేయఁబడ్డది: చూ, వ్యాఖ్యాతము.2; 2. కట్టఁబడినది: చూ, సందానితము. 1; 3. గ్రహింపఁబడినది: చూ, పృజ్యము.

ఉద్గ్రీవము, అం. స్థితకరణబంధములు యెనిమిదింటిలో నొకటి: చూ, స్థితకరణబంధములు. (చూ. బంధములు.)

ఉద్గ్రీవుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) 1 పైకెత్తఁబడిన మెడగలవాఁడు: చూ, ఉన్ముఖుఁడు; 2. గర్వముగలవాఁడు: చూ, పొగరుఁబోతు.

ఉద్ఘటనము. సం. వి. అ. న. 1. ఏతము: చూ, తలము, 2; 2. నూతిరాట్నము: చూ, గిలక.

ఉద్ఘటితము. సం. వి. అ. న. సంభోగక్రియాభేదము: చూ, రతిబంధము

ఉద్ఘట్టము. సం వి. అ. పుం. 1. తాళప్రాణకళాభేదము: చూ, తాళము. 2; 2. తాళకళలయిగింటిలో నొకటి: చూ, తాళము. 2.

ఉద్ఘట్టితము. అం. 1. చరణక్రియలు ఆఱింటిలో నొకటి. చూ. చరణక్రియలు; 2. కరణములు నూటయెనిమిదింటిలో నొకటి: చూ, కరణములు.

ఉద్ఘనము. సం. వి. అ. పుం. 1. చెక్కడుమానికి ఊఁతగా క్రిందనుంచుకొనెడి బల్లలోనగునది: చూ, దాఁగలి. 1, 2. కాఁచి సాఁగఁగొట్టుఁ ఇనుము బంగారులోనగు వానికి ఊఁతగా క్రిందనుంచెడు ఇనుపముద్దలోనగునది చూ, దాఁగలి, 3.

ఉద్ఘము. సం. వి. అ. పుం. 1. ఇది వృత్తియందు ఉత్తరపదమై శ్రేష్ఠతను తెలుపును. "గవోద్ఘము" మొ; 2 అగ్ని: చూ, నిప్పు; 3.అఱచేయి: చూ, హస్తము; 4 దేహమునందలి గాలి: చూ, వాయువు.

ఉద్ఘాటనము. సం. వి. అ. న. 1. ఏతము: చూ, తలము 2; 2. నూతిరాట్నము: చూ, గిలక, 3. తెఱచుట; అవ్య. (అప.) 4. తెఱచుట.

ఉద్ఘాటించు. సం. స. క్రి. అగలు, వ్రచ్చు చూ, భేదిల్లు. 2.

ఉద్ఘాటితజ్ఞ. సం. వి. ఆ. స్త్రీ. ప్రజ్ఞ : చూ, సామర్థ్యము. 1.

ఉద్ఘాటితము. సం. విశే. (అ. ఆ. అ.) ఉగ్గడింపఁబడినది: చూ, వ్యాఖ్యాతము. 2; 2. భేదింపఁబడినది: చూ, భేదితము.

ఉద్ఘాతము. సం వి. అ. పుం. 1. ఇనుపగుదియ: చూ, ముద్గరము; 2. కాలి తొట్రుపాటు: చూ, కాలు జాఱుట; 3. దెబ్బ: చూ, మొత్తు.1. 4 ప్రారంభము, కడఁక: చూ, యత్నము

5. కథావిభాగము: చూ, నాటకము. 1; 6. అభ్యాదానము: చూ, యత్నము; 7. వాయుభక్షణాభ్యాస యోగము, వాయువును నిలిపెడుయోగము, రేచక పూరక కుంభకములు, కుంభకాదిత్రయము. (చూ, త్రయము.); శస్త్రము, బరిగోల: చూ, బాణము 1; విశే. 9. ఉన్నతమైనది: చూ, పొడవు. 2.

ఉద్ఘుష్టము సం. విశే. (అ. ఆ అ.) ఉద్ఘోషింపఁబడినది.

ఉద్ఘోషము. సం. వి. అ. పుం. ఆర్తకంఠధ్వని, మొఱ: చూ, స్వరము. 2.

ఉద్ఘోషించు. సం. అ. క్రి. చూ, మొఱ్ఱపెట్టు.

ఉద్ద. దే. ఉప. మిక్కిలి (ఉద్దవడి, ఉద్దపిడి ఇత్యాదులు): చూ, మిగుల.

ఉద్దండము. సం విశే. (అ ఆ. అ.) 1. పొడవైనది: చూ, పొడవు. 2; 2. ఎక్కువైనది: చూ, హేరాళము.

ఉద్దండపాలము సం వి. అ. పుం. 1. ఒకరకము సర్పము: చూ, సర్పము; 2. ఒకానొక జేప: చూ, మత్స్యము. 1.

ఉద్దండించు. సం. అ. క్రి. 1 చూ, ఎక్కుడగు, 2. ఈడు: చూ, పొడవగు.

ఉద్దంతురము. సం వి అ. పుం. 1. ఉన్నతము: చూ, పొడవు 2; 2. మిట్టపండ్లది; 3. భయంకరము, నవరసములలో నొకటి: చూ, రసములు.

ఉద్దంతురుఁడు. సం. వి. అ. పుం. 1. ఉత్కటదంతుఁడు: చూ, మిట్టపండ్లవాఁడు; 2 పొడవైనవాఁడు: చూ, పొడగరి; 3: చూ, కరాళుఁడు.

ఉద్దంశము. సం వి. అ. పుం. నల్లి: చూ, మత్కుణము.

ఉద్దనవు. దే. వి. 1. కుదువ: చూ, తాకట్టు; 2. వడ్డిలేని యప్పు: ఉద్దర, ఉద్దరవు; (సం. ప.) :—ఉద్ధారము.

ఉద్దము. దే. వి. రూ-బ ఉద్దాలు. ఒకరకము పాదరక్షలు: చూ, పాదుక.

ఉద్దర. దే.వి. 1. కుదువ: చూ, తాకట్టు; 2. వడ్డిలేని యప్పు: చూ, ఉద్దనవు. 2.

ఉద్దరి ద్వ. వి. (ఉద్ద + దరి.) 1. వాటమై మిక్కిలి పొడవైన గట్టు, నదిలో దిగుటకు సనువుకాని దరి; 2 మనుష్యునికిఅందనిలోఁతు: చూ, లోఁతు. 2.

ఉద్దరువు. వై. వి 1 = ఉద్ధారః అధి: చూ, తాకట్టు, 2. నెలలోనగునవి యుంచి తీసికొనెడి వడ్డిలేని యప్పు: చూ, ఉద్దనవు. 2

ఉద్దవడి. దే. వి 1. శీఘ్రము. "ఉ. ఓమనుజేంద్ర నీవెనుక నుద్దవడింబఱతెంచుదాన నీ, వామహనీయవేగమున కంకిలిసేయక తూఁగనోపిన్, గామితసిద్ధినొందు." భో. 7, ఆ: చూ, వేగము; 2. క్రమము: చూ, విధము. 1.

ఉద్దపిడి. దే. వి. 1 శీఘ్రము "క. విడువిడు తురగముఁ బట్టక, విడువక మాఁగ్కన్నసుద్దవిడిఁబ్రాణంబుల్, విడిపించి కానిపోఁగఁ, విడువఁడకర్ణసుతుఁడనఁబ్రవీరుఁడునగుచున్." జై. 5, ఆ. 14: చూ, వేగము; 2. క్రమము: చూ, విధము. 1.

ఉద్దానము. సం. వి. అ. పుం. 1. నిబంధనము: చూ, సమ్మెట; 2. అనుబంధము: చూ, బంధము 1; 3. స్మరణము తప్పుట: చూ, విస్మృతి.

ఉద్దామము. సం. వి. అ. న. 1. అధికము: చూ, హెచ్చు 1; విశే. 2. అడ్డములేనిది: చూ, నిరర్గళము.

ఉద్దాముఁడు. సం. వి. అ. పుం. 1. నీటిఱేఁడు: చూ, వరుణుఁడు. 1; విశే. 2: చూ, కట్టులేనివాఁడు; 3. అడ్డపాటులేనివాఁడు: చూ, స్వతంత్రుఁడు,

**ఉద్దాలకము.** సం. వి. అ. పుం. 1. జొన్నలలో భేదము, రక్తఘూర్ణము: చూ, ధాన్యము; 2. వ్రీహి భేదము: చూ, ధాన్యము; 3. అక్షోటము*: చూ, కొండగోనుఁగు, కొండగోనుఁగు పువ్వు (అని కొందఱు.); 4. ఒకమణి: చూ, రత్నము. 1.

**ఉద్దాలకుఁడు.** సం. వి. అ. పుం. ఉద్దాలకుఁడను ముని: చూ, ముని. 1.

**ఉద్దాలము.** సం. వి. అ. పుం. 1 విరిగి *: చూ, శ్లేష్మాతకము; 2. గుగ్గిలము *: చూ, గుగ్గులువు.

**ఉద్దాలు.** దే. వి బ. రూ-ఏ-ఉద్దము. చెప్పులు. "ఎ, గీ పాదములఁగిఱ్ఱు కిఱ్ఱని పలుకుచుండు, కుచ్చుటుద్దాలుఁ జేపట్టుఁ గోలయమర." హంస. 3, ఆ. 90: చూ, పాదుక.

**ఉద్ది.** దే వి. 1. ఉజ్జీ, జేత: చూ, సంగడి 5; 2. గూడలులోనగు వానితోఁజల్లు నీళ్ళుపారెడు కాలువ మొదట పచ్చిక పెళ్ళలు మొదలగు వానిచే నేర్పఱుపఁబడిన మిఱ్ఱు; 3 ఒకరకము సస్యము: చూ, సస్యము. 1; 4. ఒకరకము ధాన్యము: చూ, ఉద్దులు; వై. వి. 5.=వృద్ధి. పెంపు "ఉబ్బిపారలెడు మున్నీటి యుద్దివోలె." అచ్చ: చూ, హెచ్చు. 2; విణ. ఏ. 6. పోలిక: చూ, సమానము. 2.

**ఉద్దించు.** దే. స. క్రి. 1. జతపఱచు. "వ. మన మిద్దఱమునుద్దించుకొని కటార్లసాక్కి-టికయ్యం బుగావించుచు శౌర్యంబుకొలఁది నెఱపుదము." కళా. 3, ఆ. 93: చూ, సమపఱచు; 2 పోలు. "సీ. ఉదయాద్రితటమును నుద్దించునురమునఁగౌస్తుభంబునుదివాకరుఁడుదోఁప." ఉ, హరి. 2, ఆ. 146: చూ, సరిపోలు.

**ఉద్దికాఁడు.** దే. వి. 1. రూ-ఉద్దీఁడు, జతయైనవాఁడు, భాస్వంతుని యుద్దికాఁడు." భల్లా. 5, ఆ: చూ, సమానుఁడు; 2. చెలికాఁడు. "ఎద్దులత్తడి జోదునుద్దికాఁడు." అచ్చ. అర, కాం. 59: చూ, స్నేహితుఁడు. 1; 3. నేర్పరి. రూ-ఉద్దీఁడు: చూ, సమర్థుఁడు.

**ఉద్దితము.** సం. విణ. (అ. ఆ. అ) కట్టఁబడినది: చూ, సందానితము. 1.

**ఉద్దినము** సం. వి. అ. న. పట్టుపగలు, కుతపము: చూ, పగలు.

**ఉద్దియ.** వై. వి 1.=ఉద్యోగః అయితము: చూ, యత్నము; 2. పోలిక: చూ. సమానము. 2

**ఉద్దియసేయు.** వై. అ. క్రి. (ఉద్దియ + చేయు.) తలపెట్టు. "ఉ. నిద్దురమేలుకొమ్మురజనీవర వంశ వతంస కుంకుమంబద్దిన భంగిమింటునదె యామినిచెల్లెలు కాల్యసంధ్య రా,నుద్దియ సేయుచున్నయది యున్నమయూఖసుత ప్రసూతికిన్, బ్రొద్దులు చొచ్చియున్న యవి పూర్వదిశా సరసీరుహాక్షికిన్." వై. 3, ఆ. 17: చూ, యత్నించు.

**ఉద్దిష్టము.** సం. విణ. (అ. ఆ. అ. 1. ఉద్దేశింపఁబడినది: చూ, సంకేతము; 2. ప్రత్యయములలో నొకటి. ఈవృత్తమెన్నవ ఛందంబునం దెన్నవ దనఁజెప్పుట. వృత్తాక్షరములెన్నో యన్నవఛందంబు. వృత్తాక్షరములను గురులఘువులు చేసికొని వానిక్రింద 1, 2, 4, 8 అని రెట్టించి వ్రాయుచు లఘువుల క్రింది యంకెలనుగూడి యంకొకటి చేర్చిన నన్నవ సమవృత్తమగును: చూ, ప్రత్యయములు; అం. 3. ప్రస్తారప్రత్యయ ప్రాణములు పందొమ్మిదింటిలో నొకటి: చూ, ప్రస్తారప్రత్యయ ప్రాణములు.

**ఉద్దీఁడు.** దే. వి: చూ, రూ-ఉద్దికాఁడు. (చెలికాడు అనుటకు.—"సీ పిల్లదీపాడుచుఁ జెనోగునుద్దీలచే గుద్దులఁబడి కంది కుందితిరంతి." శేష. 3, ఆ.)

ఉద్దీక్షణము. సం. వి. అ. పుం తాలప్రాణ భూతమైన కళావిశేషము: చూ, తాళము.2.

ఉద్దీపకము. సం. వి అ. పుం. 1. కొండచీమ, వజ్రిహేతువు: చూ, పిపీలిక; 2. చెట్టున తెట్టెఁ బెట్టు నల్లచీమ, అస్థ్యపదేపికః చూ, పిపీలిక; విశే. 3. వెలిగించునది.

ఉద్దీపనము. సం. వి. అ. న. 1. కాంతి: చూ, వెలుతురు. 1; 2 విభావభేదము (ఆలంబన గుణాదికము)

ఉద్దీపనవిభావము అం. విభావములు రెండింటిలో నొకటి: చూ, విభావములు (వయసు అలంకారము మొదలగునది యుద్దీపనవిభావము=రసము నుద్వేగింపఁ జేయునది.) (ఉదా — ఆహా! ఆమేను, ఆవయసు, ఆ టెక్కు, ఆటక్కు, ఎవ్వని మనసుఁ గరంచదు! ఇది యుద్దీపనవిభావము. ఉద్దీపనమునందు మన్మథ చంద్ర మలయానిలాదులు తటస్థములని మఱియొక సంజ్ఞను బొందియుండును. (ఉదా.— ఓమరుఁడా యగ్నికిఁ గాలితోడైనట్లు నీకు నీ చంద్రవసంత శుకపికాదు లెట్లు తోడయ్యెను): చూ, ఉద్దీపనము. 2. (చూ, ఆలంబనవిభావము.)

ఉద్దీపితము. సం. విశే. (అ. ఆ. అ.) వెలిఁగింపఁ బడినది: చూ, ప్రకాశితము.

ఉద్దులు. దే. వి. బ. ఏ- ఉద్ది. ఒకరకము వడ్లు: చూ, ధాన్యము.

ఉద్దూమణము. సం. వి. అ. న పెండ్లి మొదలయిన ఉత్సవము: చూ, పండుగ. 2.

ఉద్దేశపాదపము. సం. వి. అ. పుం. చైత్యము*: చూ, రచ్చ. 7.

ఉద్దేశము. సం. వి. అ. పుం. 1. తలఁపు: చూ, విషయము. 4; ప్రా. 2. సంకల్పము. (ఇక్ష్వాకుదే.); 3. ప్రేరక హేతువు. (కూటీపు.)

ఉద్దేశించు. సం. స. క్రి. గుఱించు: చూ, విషయీకరించు.

ఉద్దేశ్యము. సం. విశే. (అ. ఆ. అ.) గుఱింపఁ దగినది, విషయీకరింపఁదగినది.

ఉద్దేహిక. సం. వి అ. స్త్రీ. అంగిటిముల్లు, కొండనాలుక: చూ, రోగము 1.

ఉద్ద్యోతించు సం. అ క్రి. వెలుఁగు: చూ, ప్రకాశించు. 1.

ఉద్ద్రావము. సం. వి. అ. పుం. యుద్ధమువలనఁ బాఱుట: చూ, పలాయనము.

ఉద్ధృతము. సం. విశే. (అ. ఆ. అ.) ఊడఁబోయినది, వెనుదీసినది, అపక్రమించినది.

ఉద్ధడ. అం. మల్లశాస్త్రమునందలి విసరులు పదునాలుగింటిలో నొకటి: చూ, విసరులు.

ఉద్ధతత్వము. సం విశే (అ. ఆ. అ) ఔద్ధత్యము: చూ, హెచ్చు. 2.

ఉద్ధతము. సం. విశే. (అ. ఆ. అ.) 1. గర్వించినది: చూ, ఉద్వృత్తము; అం. 2. శిరస్సు మొదలుకొని పాదపర్యంతమునైన అంగోపాంగ ప్రత్యంగములయొక్క క్రియాభేదములలో శాస్త్రప్రకారము గూడిన నృత్యనాట్యభేదములు. సాధారణముగాఁ దాండవమును లాస్యమునని రెండు భేదములు గలిగి తరువాత మార్గము, కుండలి, ఉద్ధతము, విలాసము, దేశియ్యము, బహురూపమునని యాఱు భేదములై తరువాత శారదము, శుద్ధపద్ధతి, బహురూపము, దండలాసకము, ప్రేంకణపద్ధతి, పేరణపద్ధతి, కుండలీనృత్యము, భాండికము, రాసక్రీడ, హల్లీషకము, చిత్రపద్ధతి, దేశ్యపద్ధతి, చర్చరి, కందుకనృత్యము, చారీనృత్యము, కోలాటము నని పదియాఱు ప్రకారములుగ నెంచఁబడుచున్నది. ఆయాదేశస్థుల మనస్సుల రుచివాసనలు విచిత్రములగుటచే వారికిఁ బ్రీతిఁబుట్టించుటకై సాధారణ నాట్యమే

హస్తములయందు ఖడ్గము, కందుకము, వస్త్రము, దండము, చామరము, పుష్పమాలిక, వీణ మొదలగు శుభవస్తువులను ధరించుటచే తను చారీమండల స్థానకములను పాదముల యొక్క గంతుల భేదములచేత ననేక భేదములుఁ గలదియై వాడఁబడుచున్నది ఈ పాదక్రియలే తెలుఁగువాడుకలో సాధారణముగ అడుగులు, అడపలు, గంతులనియును, విశేషముగానైన కుప్పెలు, పేరెములు, అల్లులు, మొగ్గలు, మొలుములు మొదలుగ వాడఁబడుచున్నవి. ఇదియంతయు భావాధ్యాయ ప్రమేయము. చూ, వ్యంజకము 1; (చూ, నాటకము. పాదక్రియలు.) పా 3. ఒకానొకవృత్తము. ఇందు మొదటిపాదంబునందు స, జ, య లును, రెండవపాదమున న, స, , గురువులును, మూఁడవపాదమున భ, న, జ గురువులును, నాల్గవపాదమున స, జ, స, స గణములును గలిగి ఒకటి, రెండు, మూఁడు, నాలుగు పాదములయందుఁ గ్రమముగా ఆఱు, ఏడు, ఎనిమిది, తొమ్మిది స్థానముల యతి గల వృత్తము. అప్ప 4, ఆ. 257. పుటః చూ, వృత్తము. 1

ఉద్ధతి. సం. వి ఇ. స్త్రీ. ఉద్వృత్తి, గర్వము: చూ, హంకారము.

ఉద్ధతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. గర్వించినవాఁడు: చూ, పొగరుఁబోతు. 2. ఓర్వఁగూడని స్వభావముగలవాఁడు: చూ, పొగరుఁబోతు.

ఉద్ధరణము సం. వి. అ, న. 1 పెకలించుట; 2. పైకి లేవనెత్తుట. మీఁదికెత్తుట: ఉద్ధారము, ఉద్ధృతి; 3. వాంతియొత్తిన యన్నము: ఉద్ధృతము; 4. భుక్తోజ్ఝితము: చూ, ఎంగిలి; పా. 5. పునరుద్ధారణము. (రిక్లమేషను.)

ఉద్ధరణి. సం. వి. ఇ. స్త్రీ. 1. ఆచమనము, అర్ఘ్యప్రదానము, తర్పణము మొదలగువానియందు పుడిసిట జలముపోసికొని మంత్రపూర్వకముఁ బుచ్చుకొనుట విడుచుట మొదలగువాని కుపయోగించు లోహసాధన వస్తువు; 2 ఏతాము: చూ, తలము; 3 గిలక, లోతుగల బావులనుండి నీరుతోడుటకు కిరుప్రక్కల గుంజలునాటి అడ్డవాసమువేసి గాని నడుమ త్రాటినీడ్చుటకు కేర్పఱచిన కప్పివంటి సాధనము: చూ, ఏలను. (రూ-ఉద్ధరిణి.)

ఉద్ధరింపు. సం. స. క్రి 1. పెల్లగింపు: చూ, పెరికించు, 2 చూ, మీఁదికెత్తు. "ఆ ఉద్ధరింపఁగలుగు సుగ్రముండు." వేమన. 517.

ఉద్ధరిణి. సం.వి ఇ. స్త్రీ: చూ, రూ-ఉద్ధరణి.

ఉద్ధర్త. సం. విణ. (ఋ. ఈ. ఋ.) ఉద్ధరించువాఁడు. ఉద్ధారకుఁడు.

ఉద్ధర్షము సం. వి అ పుం. 1. పెండ్లి మొదలగు ఉత్సవము: చూ, పండుగ. 2, 2. మిగుల సంతోషము: చూ, సంతోషము.

ఉద్ధర్షితము. సం వి, అ. న గగుర్పాటు: చూ, రోమాంచము.

ఉద్ధవము. సం. వి. అ. పుం చూ, ఉద్ధర్షము. 1-2; 3. యజ్ఞవహ్ని: చూ, నిప్పు.

ఉద్ధవుఁడు. సం. వి. అ. పుం. ఒక యాదవుఁడు. కృష్ణునిమంత్రి, కృష్ణునిభక్తుఁడు.

ఉద్ధసము. సం. వి. అ. న. పొలసు: చూ, మాంసము

ఉద్ధానము. సం వి. అ. న. 1. అధిశ్రయణి: చూ, పొయ్యి; విణ. 2. భేదించుకొని వెలికుబికినది: చూ, సంభూతము.

ఉద్ధారకంటకము. సం వి. అ. న. ద్వారమునందుంచు లాటీకఱ్ఱ: చూ, పరిఘము. 9.

ఉద్ధారకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) చూ, ఉద్ధర్త.

ఉద్ధారణము. సం. వి. అ. న. ఉద్ధరించుట.

**ఉద్గారము.** సం. వి. అ. పుం. 1. =ఉద్గసవు. "తదవృద్ధిక ముద్ధారః." వైజయంతి: చూ. తాకట్టు; 2 ఋణము: చూ, బాక. 2, 3. వడ్డిలేని అప్పు: చూ, ఉద్దరవు. 2; 4. పైకెత్తుట, లేవనెత్తుట: చూ, ఉద్ధరణము. 2; 5. బంధము మొదలయిన వాటిని యే ర్పఱచుట; 6. యంత్రముచేయు రీతి.

**ఉద్ధితకరణబంధము.** అం. జానుపూర్వకము, సింహావిక్రమము, కీర్తిబంధము. గ్నావలము, పార్శ్వవేష్టితము, ధృతాఖ్యము (6) (చూ, బంధములు.)

**ఉద్ధితకరణము.** అం. చిలుకలకొలికి నిలిచియున్న ప్పుడు స్తంభకుడ్యకుసూలాగు లానికగానుంచి పురుషుఁడు కూడుట (చూ, బంధములు.)

**ఉద్ధితము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. నెరిగిన చూ, సుర 3; 2. పుట్టినది: చూ, సంభూతము; 3. లేచినది: చూ, ప్రోన్యస్తము.

**ఉద్ధురము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. బరువైనది: చూ, భారము. 1; 2. దట్టమైనది: చూ, సాంద్రము 2, 3 నిలుకడైనది: చూ, స్థిరము.

**ఉద్ధూతము.** సం. విణ. (అ. ఆ. అ.) మీఁదికి కదలింపఁబడినది.

**ఉద్ధూళనము.** సం. వి. అ. న. భస్మము పూసుకొనుట

**ఉద్ధృత.** అం. ముఖగజ్జెవులు పదునాలుగింటిలో నొకటి: చూ, ముఖగజ్జెవులు.

**ఉద్ధృతము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. పయికెత్తఁబడినది: చూ, సముదక్తము; 2. చేయఁబడినది. ఆహితము: చూ, కృతము, 3. వాంతియొత్తిన అన్నము అనఁగా అనుభవించి విడువఁబడినది: చూ, ఉద్ధరణము 3; 4. తూనిక అయినది; అం. 5. నృత్తహస్తములు యిరువది తొమ్మిదింటిలో నొకటి: చూ, నృత్తహస్తములు

**ఉద్ధృతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. గర్వము: చూ, అహంకారము; 2. ఒకానొక ఛందస్సు. (రూ- ఉత్కృతి అని తోఁచెడిని.): చూ, ఛందస్సులు; 3. పైకెత్తుట: చూ, ఉద్ధరణము 2.

**ఉద్ధృతుఁడు** సం. వి. అ. పుం. 1. పాలివేఁగ విధమును సామంతులవలన విని దానియనుభ వాగులెత్తిఁగి యూపాలి మేఁగ నేర్పాటు చేసిన వాఁడు; విణ. 2. పైకెత్తఁబడినవాఁడు.

**ఉద్ధ్మాతము.** సం. వి. అ. న. చీకిగ్గాఁగా నుతికఁ బడినది.

**ఉద్ఘృష్టితము.** సం. విణ. (అ. ఆ. అ.) నెల్లగింపఁ బడ్డది: చూ, ఉన్మాలితము

**ఉద్బుద్ధము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. తలఁపునకు వచ్చినది: చూ, స్మృతము; 2. మేలుకొన్నది నిద్రము; 3 వికసించినది: చూ, ప్రబోధము.

**ఉద్బుద్ధితము** సం. విణ. (అ. ఆ. అ.) సంభోగ భేదము: చూ, గతిబంధము.

**ఉద్బోధకుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) 1. తలఁపునకుఁ దెచ్చువాఁడు: చూ, వికాసవంతుఁడు, 2: చూ, మేలుకొలుపువాఁడు.

**ఉద్బోధనము.** సం. వి. అ. న. తలఁపునకుఁ దెచ్చుట.

**ఉద్బోధము.** సం. వి. అ. పుం. 1. తలఁపు: చూ, విషయము. 4; 2. మేలుకొనియుండుట: చూ, మేలుకోలు; 3. తెలివి: చూ, వికాసము. (చూ, బుద్ధి)

**ఉద్భగ్నకము.** అం. ఉత్తానకరణ బంధములు నలుబదియొకటింటిలో నొకటి చూ, ఉత్తానకరణబంధములు.

**ఉద్భగ్నము** సం. వి. అ. న. ఒకానొక రతి బంధము: చూ, గతిబంధము.

**ఉద్భటము** సం. వి. అ. పుం. 1. కమఠము: చూ, తాఁబేలు; విణ. 2. అధికము: చూ, మీఁరాళము.

ఉద్భటుఁడు. సం. వి. అ. పుం. 1. ప్రాయమగఁడు: చూ, సూర్యుఁడు; విణ. 2 అధికుఁడు: చూ, న్యాయాధిపతి; 3. నేర్పరి: చూ, సమర్థుఁడు.

ఉద్భవము. సం. వి. అ. పుం. జననము: చూ, పుట్టుక.

ఉద్భవించు. సం. అ. క్రి. జనించు : చూ, పుట్టు. 2.

ఉద్భాసితము. సం. విణ. (అ. ఆ అ.) వెలిఁగింపఁబడినది: చూ, ప్రకాశితము.

ఉద్భిజ్జము. సం. విణ. (అ. ఆ. అ.) భూమిని భేదించుకొని పుట్టినది, తరుగుల్మాది *: చూ, మొక్క. 1. (చూ, సంభూతము.)

ఉద్భిజ్జములు. అం. సృష్టిభేదములు నాలుగింటిలో నొకటి: చూ, సృష్టిభేదములు.

ఉద్భిత్తు. సం. విణ. ద్. 1: చూ, ఉద్భిజ్జము; అం 2. నిహీనతానములేడింటిలో నొకటి: చూ, నిహీనతానములు.

ఉద్భిదము. సం. విణ: చూ, ఉద్భిజ్జము.

ఉద్భిన్నము. సం విణ. (అ. ఆ అ.) వికసినది: చూ, వ్యాకోచము.

ఉద్భూతము. సం. విణ. (అ. ఆ అ.) 1. పుట్టినది: చూ, సంభూతము; 2 పొడవైనది: చూ, పొడవు. 2.

ఉద్భాషితము. అం. సంచారివర్ణగతాలంకారములు యిరువదియైదింటిలో నొకటి : చూ, సంచారివర్ణగతాలంకారములు. (చూ, అలంకారము. 3.)

ఉద్భేదము. సం. వి. అ. పుం. 1. ఎగజిమ్ముట; 2. జననము: చూ, పుట్టుక.

ఉద్భ్రమము. సం. వి. అ. పుం. 1. ఉద్వేగము: చూ, ఉబ్బించుట; 2. ఊర్ధ్వభాగమున కదలించుట: ఉద్వేగము; 3. అవ్యవస్థితచిత్తత: ఉద్వేగము; 4. ఉద్వేగము: చూ, చమత్కారము; అం. 5. నవరసములలో నొకటియగు అద్భుతరసము: చూ, రసములు (చూ, అద్భుతము. 2.)

ఉద్భ్రముఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ఆశ్చర్యరసముగలవాఁడు.

ఉద్భ్రాంతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. తిరుగుడు పడినది: ఆఘూర్ణితము, ఆవృత్తము; అం. 2. ప్రచారములు ముప్పది రెండింటిలో నొకటి: చూ, ప్రచారములు.

ఉద్యతము. సం. విణ. (అ. ఆ. అ ) 1. ఉత్థితము, యత్నించినది: చూ, యత్నము; 2. పైకెత్తఁబడినది: చూ, ఉద్ఘూర్ణము.

ఉద్యతుఁడు సం. విణ. (అ. ఆ. అ.) పురుషార్థముల యందధికేచ్ఛగలవాఁడు: చూ, ఉదీర్ణుఁడు.

ఉద్యతి. సం. వి. ఇ స్త్రీ. కడఁక: చూ, యత్నము.

ఉద్యమము. సం. వి. అ. పుం. 1 —పై—; విణ. 2. ఎత్తఁబడ్డది: చూ, ఉద్ఘూర్ణము; పా. 3 (మోమెంటు.); 4. (ట్రియల్.)

ఉద్యమించు. సం. అ. క్రి కడఁగు : చూ, యత్నించు.

ఉద్యానము. సం. వి. అ. న. 1. అందఱు పోదగిన రాజుతోఁట: చూ, వనము. 2; 2. మనుష్యులు వేసి పెంచినతోఁట: చూ, వనము. 1; 3. పని: చూ, ప్రయోజనము. 1; 4. వెడలుట: చూ, నిస్సరణము.

ఉద్యాపనము. సం. వి. అ న. అపకర్షణము. "వ్రతోద్యాపనము.": చూ, వెడలఁబాటు.

ఉద్యుక్తము. సం విణ. (అ. ఆ. అ.) ఉద్యోగించినది: చూ, యత్నము

ఉద్యోగ. అం. భారతపర్వములు పదునెనిమిదింటిలో నొకటి. "క. విదితంబై యుద్యోగము, మొదలుగఁ బయుకొఁడు పర్వములు రెంతయు

నోత్పిదమై యేనవపర్వం, బిదినానుద్యోగపర్వ మిమ్మగుసభలక్.": చూ, భారతపర్వములు.

ఉద్యోగపదము. అం. పదములు యెనిమిదింటిలో నొకటి: చూ, పదములు. (ఏనుఁగున కుఁబుట్టు మదములు రెునిమిదింటిలోనొకటి.)

ఉద్యోగము. సం వి. అ. పుం. 1. కడఁక: చూ, యత్నము; 2. పదవి: చూ, హోదా. (యంప్లోయిమెంటు.)

ఉద్యోగవర్గము. పా. సిబ్బంది.(ఎస్టాబ్లిష్‌మెంటు.) (సర్విసెస్.)

ఉద్యోగవిధి. అం. కామందకప్రకరణములు యిరువదింటిలో నొకటి: చూ, కామందకము. (అంగదేశాధిపతియగు పరిషఁడను రాజుకాలములో కామందకుఁడను ఋషి వేయి శ్లోకములకు లోపులో కామందకమను దండనీతిశాస్త్రమును సూత్రించెను. ఈ గ్రంథమున నందు ప్రకరణములు యిరువదిలోనగు విశేషంబులుఁ గలవు.)

ఉద్యోగశాల. పా. కచ్చేరి (ఆఫీసు ]

ఉద్యోగస్థుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) ఉద్యోగము గలవాఁడు: ఉద్యోగి. (ఆఫీసరు )

ఉద్యోగి. సం. విశే. (న్. ఈ. న్ )—పై —

ఉద్యోగించు. సం. అ. క్రి. కడఁగు : చూ, యత్నించు.

ఉద్యోగులు పా. నిర్వాహకులు. (ఫంక్షనరీస్.)

ఉద్యోగేతరులు. పా. అనుద్యోగులు (నన్ ఆఫీషియల్.)

ఉద్యోతకేశరి. శా. ఒరిస్సాదేశ ప్రాచీన కళింగదేశములోని భువనేశ్వరమునకునాలుగుమైళ్ళ పడమటి దిక్కుగా ఖండగిరి గలదు. అందు ఖారవేలుని హాస్తిగుంఫ శాసనముగల గుహ మిక్కిలి ప్రశస్తమైనది...... క్రి. శ. 11 వ శతాబ్దమున ఒరిస్సా దేశమును పాలించిన ఉద్యోతకేశరి చక్రవర్తి శాసనము ఇందు గలదు. (కళింగ. 458. పొరట.) ......ఇట్లే ఈఖండగిరియందలి నవముని గుహాయందును రెండు శాసనములుగలవు. ఒకదానిని బట్టి ఈగిరియందలి దేవళము ఉద్యోతకేశరియొక్క 18 వ, రాజ్యసంవత్సరమున కట్టఁబడినట్లు తెలియును. కళింగ. 456. పొరట.

ఉద్యోతించు. సం అ. క్రి. వెలుఁగు : చూ, ప్రకాశించు. 1.

ఉద్యోతితము. సం విశే. (అ. ఆ. అ.) వెలిఁగింపఁబడినది: చూ, ప్రకాశితము.

ఉద్రంగము. సం. వి. అ. పుం. 1. అంతరమున నిలుచు వస్తువు; 2 త్రంగ: చూ. ప్రతిమార్గకము; పా. 3. భూమి ప న్ను. (ల్యాండు టేక్సు.)

ఉద్రధము. సం. వి. అ. పుం. 1. కుక్క: చూ, శునకము; 2 కుక్కుటము: చూ, క్రుంజు.

ఉద్రము. సం. వి అ. పుం. రూ- ఉధ్రము, జలబిడాలము, నీరుపిల్లి· చూ, మత్స్యము. 1.

ఉద్రిక్తము. సం. విశే. (అ. ఆ. అ.) ఉద్రేకించినది: చూ, హసితము. 1.

ఉద్రేకకారణము పా. ప్రేరేపకము. (యుగ్రిస్టింటు కాజ్.)

ఉద్రేకము. సం. వి. అ. పుం. 1. విజృంభించుట చూ, విజృంభణము; 2. అతిశయము: చూ, హెచ్చు 2.

ఉద్రేకించు. సం. అ. క్రి. 1. జృంభించు: చూ, విజృంభించు; 2. అతిశయించు: చూ, ముమ్మరించు.

ఉద్వర్తనము. సం వి. అ. న. 1. ఉత్పతనము: చూ, ఎగయుట; 2. నూనెజిడ్డును పోఁగొట్టెడి వస్తువు: చూ, నలుఁగుబిండి; 3. ఉపద్రవము: చూ, విపత్తు; విశే. 4. అతిక్రమించిన నడతఁ గలది.

ఉద్వర్తితము. అం. ఊరూక్రియలు అయిదింటిలో నొకటి: చూ, ఊరూక్రియలు.

ఉద్వర్షనము సం. వి. అ. న. లోలోన నవ్వు: చూ, హాస్యము 1.

ఉద్వహ. సం. వి. ఆ. స్త్రీ. కూఁతురు: చూ, పుత్రిక. 1.

ఉద్వాసము. సం. వి. అ. న. ఎగఁబట్టుట, ఎగ ఊపిరి: చూ, శ్వాసము.

ఉద్వహించు. సం. స. క్రి. 1. ఎగఁబట్టు: చూ, ఎత్తిపెట్టు; 2. మోయు: చూ, వహించు

ఉద్వహుఁడు. సం. వి. అ. పుం. 1. కొడుకు చూ, పుత్రుఁడు. 1; విణ. 2. పైకెత్తువాఁడు.

ఉద్వాంతము. సం. వి. అ. పుం. 1. మదములేని యేనుఁగు: చూ, హస్తి; విణ. 2. క్రక్కఁబడినది: చూ, ఉద్గీర్ణము; 3. భేదించుకొని వెలికుఱికినది: చూ, సంఘాతము.

ఉద్వాసనము. సం. వి. అ. న. 1 విడుపు: చూ, విమోచనము; 2. చంపుట: చూ, వధము; అం. 3. ఉపచారములు పదునాఱింటిలో నొకటి: చూ, ఉపచారములు.

ఉద్వాహా. సం. వి. ఆ. స్త్రీ. గజ్జెవు: చూ, మూత్రము. 1.

ఉద్వాహనము. సం. వి. అ. న. 1. పెండ్లియాడుట; 2. పెండ్లి: చూ, వివాహము; 3 ఉత్కంఠ: చూ, తహతహ; 4. రెండుమారులు దున్నిన నేల: చూ, భూమి. 1

ఉద్వాహము. సం. వి. అ. పుం. 1. పెండ్లి: చూ, వివాహము; అం. 2. ముఖక్రియలాఱింటిలో నొకటి: చూ, ముఖక్రియలు.

ఉద్వాహితము. అం. 1. వక్షఃక్రియ లయిదింటిలో నొకటి: చూ, వక్షఃక్రియలు; 2. కటిక్రియ లయిదింటిలో నొకటి: చూ, కటిక్రియలు; 3. జంఘాక్రియ లయిదింటిలో నొకటి: చూ, జంఘాక్రియలు; 4. ఆరోహివర్ణగతాలంకారములు పండ్రెండింటిలో నొకటి: చూ, ఆరోహివర్ణగతాలంకారములు. (చూ, అలంకారము. 3); 5. అవరోహివర్ణగతాలంకారములు పండ్రెండింటిలో నొకటి: చూ, అవరోహివర్ణగతాలంకారములు. (చూ, అలంకారము 3.); 6. సంచారివర్ణగతాలంకారములు యిరువదియైదింటిలో నొకటి: చూ, సంచారివర్ణగతాలంకారములు. (చూ, అలంకారము 3.); 7. శిరోభేదములు తొమ్మిదింటిలో నొకటి: చూ, శిరోభేదములు.

ఉద్వాహిని సం. వి. ఈ. స్త్రీ. త్రాడు: చూ, రజ్జువు.

ఉద్విగ్నము సం. విణ. (అ. ఆ. అ.) 1. వ్యథపడినది; 2 వెఱపునొందినది చూ, భీతము.

ఉద్విపిత. అం. దూతీచతుష్టయములోని రెండవదానిలోని యెనిమిదింటిలో నొకటి: చూ, దూతీచతుష్టయము.

ఉద్వీక్షణము. సం. వి. అ. న. మీఁదుచూచుట.

ఉద్వీక్షించు. సం. స. క్రి. చూచు: చూ, వీక్షించు.

ఉద్వృత్త. అం. ఆకాశచారులు పదియాఱింటిలో నొకటి: చూ, ఆకాశచారులు

ఉద్వృత్తము. సం. విణ. (అ. ఆ. అ.) 1 గర్వించినది: చూ, దిట్ట. 4; అం. 2. కరణములు నూటయెనిమిదింటిలో నొకటి: చూ, కరణములు.

ఉద్వృత్తి. సం. వి. ఇ. స్త్రీ. గర్వము: చూ, అహంకారము.

ఉద్వృత్తుఁడు, సం. వి. అ. పుం. దుర్జనుఁడు: చూ, వ్యాధుఁడు. 2.

ఉద్వేగజనకము. సం. వి. అ. పుం. నేరవెంద *: చూ, రాజవృక్షము.

ఉద్వేగము. సం. వి. అ. న. 1. పయనము: చూ, ప్రయాణము; పుం. 2. ఉబ్బించుట: ఉద్భ

మము; 3. ఊర్ధ్వభాగమును కదలించుట: ఉద్భ్రమము; 4. అవ్యవస్థితచిత్తత: ఉద్భ్రమము 5 ఉద్భ్రమము: చూ, ఏమత్కారము; 6. భయము: చూ, వెఱపు, 7. చింత చూ, దుఃఖము; 8. శోకసందు చూ, శోకము; పుం. 9 నెరవంజి * చూ, నగవెండ.

ఉద్వేగిల్లు. సం. అ. క్రి. భీతిల్లు: చూ, భయపడు.

ఉద్వేగుఁడు. సం. వి. అ పుం. 1. నెమ్మదిగాఁ బోవువాఁడు, 2. ఉన్నతుఁడు.

ఉద్వేజకము. సం వి. అ పుం చూ, ఉద్వేజకము. *

ఉద్వేజనము. సం విశే. (అ. ఆ. అ.) 1 భయము చూ, వెఱపు,2 కలఁత చూ, క్షోభము.1.

ఉద్వేగితము. సం. విశే (అ. ఆ. అ.) 1 వెఱపింపఁబడినది, 2. కలఁతపెట్టఁబడినది చూ, మలినము. 3

ఉద్వేలము. సం. విశే. (అ. ఆ అ) అతిశయము చూ, హెచ్చు 2.

ఉద్వేష్టనము. సం. వి. అ. న. చుట్టుకొనుట: చూ, వ్యాపనము.

ఉద్వేష్టితము సం విశే. (అ. ఆ. అ ) 1.చుట్టుకొనఁబడినది: చూ, వ్యావృత్తము. 1; అం. 2. హస్తక్రియాభేదములలోని బాహుప్రచారములు పదింటిలో నొకటి: చూ, బాహుప్రచారములు; 3 హస్తకరణములు నాలుగింటిలో నొకటి చూ, హస్తకరణములు; 4.హస్తప్రాణములు పంద్రెండింటిలోనొకటి: చూ, హస్తప్రాణములు.

ఉద్ధారణశక్తత. పా. (లిమిట్సు ఆఫ్ పెర్ఫెక్టు రికవరీ.)

ఉధ్మానము. సం. వి. అ. న. అధిశ్రయిణి: చూ, పొయ్యి.

ఉధ్రిచామరకము. సం. వి. అ. పుం మాలవాని కంటె కడపటిజాతి.

ఉధ్రిము. సం వి అ.పుం: చూ,రూ-ఉద్రము.

ఉధ్మానము. సం వి అ. న: చూ, ఉధ్మానము.

ఉనికి దే వి. 1. ఉండుట. "క. వేల్పులకు తెఱఁగున నాయలకు, మంత్రాదక యునికిలెస్స" భా. విరా. 1, అ. 128: చూ, స్థితి 2; 2 నిలుకడ. "నిర్వికారవృత్తి నున్న యునికికి." భా ఆది. 3, అ 180. చూ, స్థితి. 3; 3 చోటు, స్థితి: చూ, స్థానము 1; 4 పద్మాసనములలో నొకటి (చూ, ఆసనము.)

ఉనికిపట్టు దే. వి. ఇల్లు: చూ, గ్రామము 1

ఉనుకువ. దే.వి. ఉనికి, చోటు:చూ, స్థానము.1.

ఉనుచు. దే. క్రి. 1. ఉండఁజేయు: చూ, ఇడు. 2, 2 అద్దించు: చూ, రంగువేయు.

ఉన్నట్టివాఁడు. దే. వి. ఉన్నటువంటివాఁడు: చూ, పృష్టితుఁడు.

ఉన్నట్టుండి. దే. క్రి విశే: చూ, డబ్బాటు.

ఉన్నత అం. వీధి (అశ్వసంచార మార్గములు) తొమ్మిదింటిలో నొకటి: చూ, అశ్వసంచార మార్గము.

ఉన్నతత్వము. సం. వి. అ. న చూ, ఔన్నత్యము: చూ, పొడవు. 2.

ఉన్నతన్యాయస్థానము. పా. హైకోర్టు.

ఉన్నతన్యాయాధిపతి. పా. హైకోర్టుజడ్జి,న్యాయమూర్తి, ప్రాడ్వివాకుఁడు.

ఉన్నతబాహుమూలము సం. వి. అ. న. అదృష్టశాలి లక్షణము; చూ, లక్షణము. 1.

ఉన్నతము. సం. వి. అ. పుం. 1. కొండచిలువ: చూ, సర్పము; విశే. 2. పొడవైనది: చూ, పొడవు. 2.

ఉన్నతశాసనసభ. పా. శిష్టసభ, విద్యాధికుల సభ, విశ్వవిద్యాలయశాసనసభ. (సెనేట్)

ఉన్నతానతము సం. విశే. (అ. ఆ. అ) వంగినది: చూ, బంధూరము.

ఉన్నతి. సం. వి. ఇ. స్త్రీ. 1. పొడుగు: చూ, పొడవు. 2; 2. గరుడునిభార్య: చూ, భార్య; 3. పరిపూర్ణత్వము; 4 అతిశయము: చూ, హెచ్చు. 3.

ఉన్నతీశుఁడు సం. వి. అ. పుం. గరుత్మంతుఁడు: చూ, హరివాహనుఁడు

ఉన్నమనము. సం వి. అ న. పైకెత్తుట: ఉన్నయము-రూ-ఉన్నాయము; (తె. ప)· — ఎత్తుట.

ఉన్నమితము సం విశే. (అ. ఆ అ.) పైకెత్తఁబడినది, ఉత్పన్నము: చూ, ఉత్పాదితము.

ఉన్నము. సం. విశే (అ. ఆ. అ.) తడిసినది: చూ, క్లేదము.

ఉన్నయము. సం వి. అ. పుం: చూ, ఉన్నమనము. (రూ-ఉన్నాయము.)

ఉన్నరూపు. ద్వ. వి. నిజము: చూ, సత్యము. 1.

ఉన్నవాఁడు దే.విశే. 1. అన్యుఁడు. "మ. అతివాసిద్ధమువాటి బాలకునకీ యాకార మీ వర్ణమీ, గతి...వీఁ,డతఁడే కాఁడగు నున్నవారలకు." భాగ. 10, స్కం. ఉ. 34: చూ, పరాయివాఁడు; 2: చూ, ఉన్నట్టివాఁడు. "ఆ. ఉన్నవారలెవరొ చిన్నవారెవ్వరో." వేమన. 523.

ఉన్నాయము. సం. వి. అ పుం: చూ, రూ-ఉన్నయము.

ఉన్నాహము. సం. వి. అ. న. పులియఁబెట్టిన కదుగునీరు: చూ, శుక్తము. 1.

ఉన్ని. దే. వి. గొఱ్ఱె లోనగువాని బొచ్చు: చూ, కెందుర్రిక. 1.

ఉన్నిద్రము. సం. వి. అ. న. 1. గగురుపాటు: చూ, రోమాంచము; విశే. 2. మేలుకొన్నది: ఉద్బుద్ధము; 3. వికసించినది: చూ, వ్యాకోచము.

ఉన్నీఁడు. సం. వి. అ. పుం. పైకెత్తిసికొనిపోవువాఁడు.

ఉన్నీపము. సం. విశే. (అ. ఆ. అ) మిక్కిలి కడపచెట్లు గలది

ఉన్నీరదము. సం. విశే. (అ. ఆ. అ.) మిక్కిలి మేఘములు గలది

ఉన్నీలము. సం. విశే. (అ.ఆ. అ) అధికముగా నల్లనిది.

ఉన్నీవి. సం. వి. ఈ. స్త్రీ. ఉద్గతమైన నీవిబంధముగల యాఁడుది: చూ, స్త్రీ.

ఉన్నుఁడు. సం. విశే. (అ. ఆ అ.) దయగలవాఁడు: చూ, దయాళువు.

ఉన్నుతము. సం వి అ. న. మిక్కిలి స్తోత్రముచేయఁబడ్డది.

ఉన్నున్నము సం. విశే (అ. ఆ అ) మిక్కిలి త్రోయఁబడ్డది

ఉన్నూతము. సం. విశే. (అ. ఆ. అ.) మిక్కిలి క్రొత్తదైనది: ఉన్నూత్నము.

ఉన్నూత్నము సం. విశే. (అ. ఆ. అ.) —పై.—.

ఉన్నె. పా. ఉండునె. (రూ-ఉన్నే.)

ఉన్నేత. సం. వి. ఋ. పుం. పదియాఱుగురు ఋత్విజులు యాజకులు వీరలలో నొకఁడు: చూ, ఋత్విజుఁడు. 1.

ఉన్నేయపరిశోన్నేత్తరము సం. వి. అ.న. ఉన్నేయపరిశోన్నేత్తరాలంకారము: చూ, హేతువు. 2. (చూ, అలంకారము. 8.)

ఉన్మంథనము. సం. వి. అ. న. 1. కదలించుట: చూ, చలనము. 1; 2. చంపుట: చూ, వధము.

ఉన్మంథము. సం. వి. అ. న. 1. చంపుట: చూ, కదనము; 2. చిలుకుట: చూ, మథనము.

ఉన్మంథితము. సం. విణ. (అ. ఆ. అ.) కదలింపఁబడినది: చూ, ప్రేంఖితము.

ఉన్మత్తము. సం. వి. అ. పుం. 1.=ఉమ్మెత్త* చూ, హాలాపుష్పము; 2 పుష్పవృక్ష విశేషము: చూ, వృక్షము; విణ 3 వెఱ్ఱిది: చూ, వెఱ్ఱి. 1.

ఉన్మత్తుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1: చూ, వెఱ్ఱివాఁడు; 2. నలువ: చూ, బ్రహ్మ. 1

ఉన్మగితుఁడు. సం. విణ. (అ ఆ అ.): చూ, వెఱ్ఱివాఁడు.

ఉన్మదిష్ణువు. సం. విణ ఉ.—పై.—

ఉన్మనుఁడు. సం విణ. స. 1. ప్రియాసక్తువు యెప్పుడుదర్శకునో యను త్వరకలవాఁడు: చూ, ఉత్కుఁడు. 2; 2 మదించినవాఁడు: చూ, మత్తుఁడు.

ఉన్మాథము. సం వి అ. పుం. 1. తమిరము, స్పర్శముఁదలియని స్పర్శము చూ, తమ్మెర, 2. గాలము చూ, మత్స్యబంధనము; 3. చంపుట చూ, వధము; 4. కూటయంత్రము చూ, బోను

ఉన్మాథుఁడు. సం. వి. అ. పుం. మరణింపఁజేయువాఁడు: చూ, మారకుఁడు.

ఉన్మాదకుఁడు. సం. విణ. (అ ఈ. అ.): చూ, వెఱ్ఱివాఁడు

ఉన్మాదనము. సం. వి. అ. పుం. మన్మథుని యొక్క బాణము: చూ, బాణము. 1.

ఉన్మాదము సం. వి. అ. పుం. 1 = ఉమాదము: చూ, వెఱ్ఱి. 1; (ప్రియవియోగ విభవభ్రంశాదులచే చేతనాచేతనములయందుసమానముగా బ్రవర్తించుట.); 2. అధిక చప్పుడు: చూ, స్వరము. 2; 3. వ్యభిచారభావభేదము. (సంచారీభావభేదము. (భ్రమము) సంచారీభావములు ముప్పది మూఁడింటిలో నొకటి. ఉదా.- "ఓరసాలమా! నాపై దయగలిగె నేని సీత యేతోవ నేఁగెంచెనో యానతిమ్ము."; చూ, సంచారీభావములు; అం. 4. శృంగారచేష్టలు పదునెనిమిదింటిలో నొకటి: చూ, శృంగారచేష్టలు, 5. అవస్థలు పండ్రెండింటిలోనొకటి: చూ, ద్వాదశావస్థలు.

ఉన్మాదవంతుఁడు. సం. విణ: చూ, ఉన్మత్తుఁడు.

ఉన్మాదవతుఁడు సం. విణ. రూ.—పై.—

ఉన్మానము సం. వి. అ. న. తులామానము: చూ, తూనికె.

ఉన్మార్గము. సం. వి. అ. పుం. 1. చెడునడత; చూ, తప్పునడత; 2. తప్పుత్రోవ: చూ, పెడదారి.

ఉన్మితము. సం. విణ. (అ. ఆ. అ.) కొలువఁబడినది: చూ, వనిత. 5.

ఉన్మిషితము. సం. విణ. (అ. ఆ. అ.) విరిసినది: చూ, వ్యాకోచము.

ఉన్మీలనము సం. వి. అ. న. విరియుట, వికసించుట: చూ, వికాసము. (చూ, బుద్ధి.)

ఉన్మీలితము సం. విణ. (అ. ఆ. అ.) 1. విరిసినది. చూ, వ్యాకోచము; 2. ఉన్మీలితాలంకారము:చూ, హేతువు.2; అం.3. దృష్టిక్రియలు పదునెనిమిదింటిలో నొకటి: చూ, దృష్టిక్రియలు; 4. అర్థాలంకారములు నూటింటిలో నొకటి. ఉపమానోపమేయములకు భేదవిస్ఫురణంబుఁ జూపుట. ఉ. నీకీర్తికిరవైన హిమవన్నగమును దేవతలు మంచువలనఁ గనిపెట్టుచున్నారు: చూ, అలంకారము. 3.

ఉన్మీషితము. సం. విణ. (అ. ఆ అ.): చూ, రూ-ఉన్మిషితము.

ఉన్ముక్తకము. సం. వి. అ. పుం. శిరస్నాతము, పాదములదాఁకనుండెడు అంగి: చూ, వస్త్రము.

ఉన్ముఖత. పా. ప్రవృత్తి. (టెండెన్సీ.)

ఉన్ముఖము. సం. విణ. (అ. ఆ. అ.) మీఁదు మాచునది.

ఉన్ముఖుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) మీఁదు చూచువాఁడు: చూ, ఉద్గ్రీవుఁడు. 1.

ఉన్ముద్రము. సం. విణ. (అ ఆ. అ.): చూ, ఉన్మిషితము.

ఉన్మూలము. సం. విణ.(అ. ఆ. అ.)1.వేరు తెగినది, 2. అడుగుతోఁజెడినది.

ఉన్మూలించు. సం. స. క్రి. పెల్లగించు: చూ, భేదిల్లు. 1.

ఉన్మూలితమగు. మి. అ.క్రి. పెల్లగిల్లు.—పై.—

ఉన్మూలితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. వేరు తెగింపఁబడినది, పెల్లగింపఁబడినది: ఉత్ఖాతము, ఉత్పాటితము, ఉద్బృహితము, ఉత్పన్నము, ఉత్పాదితము, ఉన్మూలితము; 2 అడుగుతోఁ జెఱుపఁబడినది.

ఉన్మేషము. సం వి అ. పుం. 1. తెలివి: చూ, వికాసము. (చూ, బుద్ధి.); 2. కను ఱెప్పలు విచ్చుట; 3. పుష్పాది వికాసము: చూ, వికాసము; అం. 4. పుటక్రియలు తొమ్మిదింటిలో నొకటి: చూ, పుటక్రియలు.

ఉప. సం. ఉపసర్గము. 1. ఉపగూహము = ఇచట 'ఉప' అనునది ధాత్వర్థమును ఆలింగనముగా మార్చినది; 2 ఉపయమము=ఇచట ధాత్వర్థమును వివాహార్థము కలదానినిఁగా మార్చినది; 3. ఉపమ= ఇచట ధాత్వర్థమును బోలికగా మార్చినది; 4. ఉపమాత= ఇచట మాతృశబ్దముతో సమసించి దగ్గఱయనునర్థము కలదియైనది; 5. ఉపప్లవము= ఇచట ధాత్వర్థమును ఉపద్రవమను నర్థమునకు మార్చినది. సం. అవ్య 6. తక్కువ: చూ, వెలితి. 2; 7. దగ్గఱ: చూ, సమీపము; 8. ఆరంభము: చూ, యత్నము; 9 ఆచార్యుని క్రియ; 10. ఎక్కువ: చూ, హెచ్చు. 1; 11. రీతి: చూ, విధము; 12. చెప్పఁగూడనిది చేయుట; 13 గొల్లవేసము; 14. చెడుగును తలఁచుట: చూ, పశ్చాత్తాపము.

ఉపకంఠము. సం. వి. అ న. 1. దగ్గఱ: చూ, సమీపము; 2. గ్రామముచేరువనేల, ఉపశల్యము: చూ, భూమి. 1; విణ. 3. సమీపించినది: చూ, సమీపము

ఉపకరణము. సం వి. అ. న. కొఱముట్టు: చూ, పనిముట్టు.

ఉపకరించు సం. అ. క్రి. ఉపయుక్తమగు: చూ, సరిపడు.

ఉపకర్త. సం విణ. (ఋ. ఈ. ఋ.) ఉపకారి: చూ, శుభంకరుఁడు.

ఉపకారము. సం. వి. అ పుం. 1. ఉపకృతి: చూ, మేలు. 12; 2. గుంపు: చూ, సమూహము; 3. చెదరిన పువ్వులోనగునది: చూ, ప్రకరము

ఉపకారవేతనము పా. పింఛను (పెన్షన్.)

ఉపకారి. సం. విణ (న్. ఈ. న్.): చూ, ఉపకర్త "క. ఉపకారికి నుపకారము...... యపకారికి నుపకారము, కృపతోఁ జేయుట రూ శస్త్రకృత్యము వేమా." వేమన. 525.

ఉపకారిక. సం. వి. ఆ. స్త్రీ. 1. ఉపకారము చేసెడు స్త్రీ: చూ, స్త్రీ; 2.= ఉప్పరిగ· రాజసదనము, మేడ: చూ, గృహము. 1; 3 శిబిరము, గుడారము: చూ, గృహము. 1; 4. చక్కెరచేర్చి పొరటినపిండి, అక్ష్య: చూ, భక్ష్యము; 5. ఒకానొక బంక.

ఉపకార్య. సం. వి. ఆ. స్త్రీ. 1. రాజసదనము, మేడ: చూ, గృహము 1; 2. రాజుల విడిది యిల్లు, ఉపణర్య: చూ, గృహము. 1; విణ. 3. ఉపకరింపఁదగినది, ఉపకారమును పొందఁదగినది, శుభమైనది: చూ, మేలు. 15.

ఉపకార్యదర్శి. పా. అనుగత కార్యదర్శి, కార్యదర్శి క్రిందియధికారి. (అండర్ సెక్రెటరీ)

ఉపకుంచిక. సం. వి ఆ. స్త్రీ: చూ, ఉపకుంభిక. 1-2

ఉపకుంభము. సం. వి. అ. న. 1. కుంభలగ్నము యొక్క సమీపము; అవ్య. 2. కుంభసమీపమందు.

ఉపకుంభిక. సం. వి. ఆ. స్త్రీ. 1. సన్నయేలకి*: చూ, పత్రిల; 2. కారవి, సోపు, నల్లజీలకఱ్ఱ *: చూ, జీలకఱ్ఱ. (ఉపకుంచిక అని శబ్దరత్నాకరము, ఉపకుంభికి అని సర్వశబ్దసంబోధని.)

ఉపకుర్వాణుఁడు. సం. వి. అ పుం ఒకానొక బ్రహ్మచారి: చూ, వటువు.

ఉపకుల్య సం. వి. ఆ. స్త్రీ పిప్పలితీఁగె *: చూ, పిప్పలి 1.

ఉపకృతము సం. వి. అ న. 1. ప్రయోజనము: చూ, పని. 2; విశే. 2 ఉపకరింపఁబడినది.

ఉపకృతి. సం. వి. ఇ. స్త్రీ. ఉపకారము: చూ, మేలు. 12

ఉపక్రమము. సం. వి. అ పుం. 1. ఉపాయము నెఱిఁగి ప్రారంభించుట: చూ, యత్నము; 2. రోగమునకుఁ జేయు ప్రతిక్రియ: చూ, ప్రతిక్రియ. 1; 3. గురుముఖమున ఆనుపూర్విగ వేదముఁ జదువుట; అధీతి, అధ్యయనము; 4. మంత్రులలోనగువారిఁ బరీక్షించుట: చూ, పరిక్రమము. 2; 5. విక్రమము, బలిమి: చూ, శక్తి. 1; 6 ప్రారంభము: చూ, యత్నము. (తెలివితోఁ జేసిన తొలియారంభము, పనికి మొదలుఁబెట్టుట), 7. తంత్రము, ఎత్తుగడ: చూ, ఉపాయము; (ఉపక్రమము, పరిక్రమము క్రియకు మొదట దొరఁకొనుట పేళ్ళు. అధ్యయనమునకు ప్రణవోచ్చారణము. వంటకు పొయి యలుకుట మొదలైనవి.)

ఉపక్రమించు. సం. అ. క్రి, స. క్రి. ప్రారంభించు. "పౌరాణికుఁడు కథనుపక్రమించెను." "అధ్వరకర్మముపక్రమించె." రా. 4, ఆ: చూ, యత్నించు.

ఉపక్రియలు. పా. "ఉండు, కలుగు, పడు, కొను" 1. వర్తమానార్థమందు 'ఉండు' వచ్చును. వర్తమానార్థమనఁగా జరుగుచున్న కాలము. ఉదా.—చేయుచున్నాఁడు. ఇచట ఉన్నాఁడు అనునది యుండుధాతువు; 2. భవిష్యదర్థమందు 'కలుగు' వచ్చును. (భవిష్యదర్థకమనఁగా రాఁబోవుకాలము) ఉదా.—చూడఁగలఁడు. ఇచటఁగలఁడు. అనునది కలుగు ధాతువు. (మరియొకవిధమున,) ఏకవచనమునఁ గొన్ని క్రియల భావవ్యతిరేకరూపములు రెండుమాత్రము తుమున్నర్థముల చివరఁ జేరును. ఉ. వలయు-వలదు, పోలు-పోలదు, కూడు- కూడదు, తగు- తగదు, సాగు-సాగదు. "చేయవలయు- చేయవలదు." మొ. ఇవి ఉపక్రియలు.

ఉపక్రోశము. సం. వి. అ పుం. దూఱు: చూ, నింద 1.

ఉపగణములు. పా. రెండక్షరములవి.—(4) గగ, గల, లగ, లల; నాలుగక్షరములవి. —(10) తగము, తలము, నగము, నలము, భగురు, భలము, రగము, రలము, మలఘు, సలము; ఐదక్షరములవి.—(7) నగలము, నగగము, నలలము, నలగము, సలలము, సలగము, సగలము.

ఉపగతము. సం. విశే. (అ ఆ. అ.) అంగీకరింపఁబడినది: చూ, స్వీకృతము.

ఉపగతి. సం. వి. ఇ. స్త్రీ. అదనము: చూ, లాభము. 1.

ఉపగమము. సం. వి. అ. పుం. 1. అంగీకారము: చూ, సమ్మతి. 1; 2. సమీపించుట: చూ, సమీపము.

ఉపగీతి. పా. ఒకానొక పద్యము, ఇది చపలాకం

దముచాయను నడచును. (చూ, కందము.) చూ, వృత్తము. 1.

ఉపగుఁడు. సం. వి. ఉ. పుం. ఒకానొక పురుషుఁడు.

ఉపగూఢము. సం. విశ. (అ. ఆ. అ) 1. కౌఁగిలింపఁబడినది: ఆలింగితము, ఆశ్లిష్టము; 2 దాఁచఁబడినది: చూ, గూఢము.

ఉపగూహనము. సం. వి. అ.న. 1 ఆలింగనము: చూ, కౌఁగిలి; 2: చూ, దాఁచుట.

ఉపగ్రహము. సం. వి. అ పుం. 1. అనుకూలపడుట, పొత్తు: చూ, స్నేహము. 1; 2.మిక్కిలివృద్ధి: చూ, సమృద్ధి; 3. చెఱ: చూ, బంధనాలయము; 4 కారాగృహాశిక్ష ననుభవించుట: చూ, బంది; 5 సూర్యాదిగ్రహణము: చూ, గ్రహణము. 1; అం. 6. షోడశసంధులలో నొకటి: చూ, షోడశసంధులు.

ఉపగ్రహుఁడు. సం వి. అ. పుం చెఱఁబడ్డవాఁడు: చూ, బందెకాఁడు.

ఉపగ్రాహ్యము. సం. వి. అ. న. కానుక: చూ, లంచము.

ఉపఘాటకము. సం. వి. అ న. సంభోగక్రియా భేదము: చూ, రతిబంధము.

ఉపఘాతిని. సం. వి. ఈ. స్త్రీ. ఆఁబోతు త్రొక్కుటవలన నీచుకొనిన యావు: చూ, ధేనువు.

ఉపఘ్నము. సం. వి. అ. పుం. తీఁగయల్లుటకు సమీపమున నిడు కొయ్యలోనగునది: చూ, ప్రాఁకు.

ఉపచయము సం. వి. అ. పుం. 1. ఉన్నతి: చూ, పొడవు. 2; 2 అతిశయము: చూ హెచ్చు. 2.

ఉపచయములు. పా. జన్మలగ్నమునకు 3-6-10-11 రాసులు ఉపచయములు.

ఉపచరము. సం. వి. అ. పుం. 1, గోమహిష్యాది పరిథమగర్భము: చూ, పరిజనము. 1; 2. చూలగునట్టికాలము, చూలు: చూ, పరిజనము 2; 3. ఎద్దు వెదగొనడము.

ఉపచరించు సం. స. క్రి. 1. గౌరవించు: చూ, సన్మానించు; 2 కొలుచు: చూ, సేవించు.

ఉపచరితుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) సేవింపఁబడినవాఁడు చూ, సేవితుఁడు

ఉపచాయ. పా. (పెనుంబ్రా)

ఉపచాయ్యము. సం. వి. అ పుం. 1. దయనాగ్నియందు ఉపయోగింపఁదగిన పేరు సరిచాయ్యము, సమూహ్యము; 2. గార్హపత్యము కానలేని కోరికఁగల వానిచేతఁ జేయఁబడునట్టి యొక యాగము: చూ, యజ్ఞము.

ఉపచారగృహీతము. సం. వి. అ. పుం. వంచిమాటలచేత పళసఱచుకొన్న బలము.

ఉపచారగృహీతుఁడు. సం. వి. అ. పుం మంచిమాటచేత దండును దెచ్చినవాఁడు, స్వపక్షమువారేడ్వురిలో నొకఁడు: (చూ, అహిభయము.) చూ, స్వపక్షములవారు.

ఉపచారము. సం. వి. అ. పుం. 1. మరియాద: చూ, మర్యాద; 2. కొలువు: చూ, శుశ్రూష. 2; 3. తనపని చేకూర్చుకొనుటకై యొకనికి రహస్యముగానిచ్చు ధనము, ఆమిషము: చూ, లంచము; 4. అలవాటు: చూ, స్వభావము; 5. వసంతఋతువు, వసంతము, చిగిరించేకాలము: చూ, మాసద్వయము.

ఉపచారములు. అం. 1. పదునారు.—ఆవాహనము, ఆసనము, పాద్యము, అర్ఘ్యము, ఆచమనీయము, స్నానము, వస్త్రము, యజ్ఞోపవీతము, గంధము, పుష్పము, ధూపము, దీపము. నైవేద్యము, తాంబూలము, నమస్కారము, ఉద్వాసనము; 2. అయిదు.—స్నానము, పూజ, నైవేద్యము, ప్రదక్షిణము, నమస్కారము.

**ఉపచారుఁడు.** సం. వి. అ. పుం. గరుత్మం తుఁడు: చూ, హరివాహనుఁడు.

**ఉపచితము.** సం. విశే. (అ. ఆ. అ.) 1 కాలినది; 2. అలకడము (సున్నముచేత పెరిగిన గోడ మొదలైనది): చూ, నిదిగ్ధము; 3 కూడఁ బెట్టినది: చూ, నిదిగ్ధము. 4. వర్ధిల్లినది: చూ, పృథులము.

**ఉపచిత్ర.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఎలుకజీడి *: చూ, భల్లాతకి; పా. 2. ఒక కానోకవృత్తము ఇందు ఒకటి మూఁడు పాదములయందు మూఁడు సగణములును, యొక భగణంబును, రెండు నాలుగు పాదంబులందు గ, భ, భ, గగములు యుండి తొమ్మిదింట యతులు గల వృత్తము. అప్ప. 4, ఆ. 253 పుట చూ, వృత్తము. 1.

**ఉపజలము.** సం. వి అ. పుం. కమ్మనీరు: చూ, నీరు. 1.

**ఉపజాతి.** పా. ఒక కానోకవృత్తము. ఇందు బేసి పాదంబులు ఇంద్రవజ్రచ్ఛాయను, సరిపాదములు ఉపేంద్రవజ్రచ్ఛాయను నడచును. దీనికే "విశి" యని కూడ నందురు. తద్విశేషములు:—వ్యత్యస్తోపజాతి.—ఇందు బేసిపాదములు ఉపేంద్రవజ్రచ్ఛాయను, సరిపాదములు ఇంద్రవజ్రచ్ఛాయను నడచును; సమోపజాతి.—మొదటి రెండుపాదములు ఇంద్రవజ్రచ్ఛాయను, 3-4 పాదములు ఉపేంద్రవజ్రచ్ఛాయను నడచును; వ్యత్యస్తసమోపజాతి.—ఇది యుపేంద్రవజ్రచ్ఛాయను మొదటి రెండుపాదములున్ను ఇంద్రవజ్రచ్ఛాయను కడమరెండుపాదములున్ను నడచును; వైపరీత్యోపజాతి.—ఇది ఇంద్రవజ్రచ్ఛాయను మొదటిచరణమున్ను కడమ మూఁడుపాదములు ఉపేంద్రవజ్రచ్ఛాయను నడచును: చూ, వృత్తము. 1.

**ఉపజాతులు.** పా. గీతములుతొమ్మిది, సీసములేదు. (కొందఱు చంపకోత్పల శార్దూలమత్తేభములు జాతులనియు, కందగీతసీసములుపజాతులనియు, తక్కినవి వృత్తములనియు వాడుచున్నారు.)

**ఉపజాపకుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) భేదమును పుట్టించువాఁడు

**ఉపజాపము.** సం. వి. అ. పుం. 1. భేదము: చూ, వేఱుపాటు. 1; అం. 2 రాజుల యొక్క మాఁడవయుపాయము: చూ, ఉపాయములు.

**ఉపజిహ్విక.** సం. వి. ఆ స్త్రీ. 1 కొండనాలుక: చూ, కొండ్రనాలుక. 1; 2. చెట్లను తొల్చి పెట్టెడు నల్లచీమ: చూ, పిపీలిక.

**ఉపజీవి.** సం. విశే. (న్. ఈ. న్) ఒకరి ననుసరించి జీవించువాఁడు: చూ, జీవకుఁడు. 2.

**ఉపజీవించు.** సం స. క్రి. ఒకరిని అనుసరించి జీవించు: చూ, జీవించు.

**ఉపజీవిక.** సం. వి. ఆ. స్త్రీ ఒకరిని ఆశ్రయించి జీవించుట: చూ, బ్రదుకు. 1.

**ఉపజ్ఞ.** సం వి. ఆ. స్త్రీ ఉపదేశములేక తనంతట మొట్టమొదట పుట్టెడు జ్ఞానము. (వాల్మీకియొక్క శ్లోకనిర్మాణ జ్ఞానమువంటిది.): చూ, బుద్ధి

**ఉపణార్య.** సం వి ఆ. స్త్రీ. 1. రాజుల విడిది యిల్లు: చూ గృహము 1; 2. డేరా: చూ, గృహము. 1.

**ఉపతప్త.** సం. వి. ఋ. పుం. తపింపఁజేయు రోగము: చూ, రోగము. 1.

**ఉపతాపము.** సం వి. అ. పుం. 1. కలఁత. క్షోభము: చూ, సంతాపము; 2. తపింపఁజేయు రోగము: చూ, రోగము. 1; 3. తొందఱ: చూ, సంభ్రమము 1.

**ఉపతాయి.** దే. వి. మల్లవిజ్ఞానము. "ఉపతాయిలోఁ దన కోదవెడు తోరహత్తము చూపి." భార. విరా. 2, ఆ. 15: చూ, మల్లశాస్త్రము

ఉపత్యక. సం వి. అ. స్త్రీ. కొండచేరువ నేల: చూ, భూమి. 1.

ఉపత్తు. సం.వి. ద. స్త్రీ. ఇడుమ: చూ, విపత్తు.

ఉపద. సం. వి అ. స్త్రీ. కానుక: చూ, లంచము.

ఉపదంశము. సం. వి. అ. పుం 1. ఊరుగాయ: చూ, గుచిగాయ; 2 కల్లుద్రాగునపుడు నంజుకొనుగొట్టె మాంసాగులు; 3. మేఢ్రరోగము, కొఱుకురోగము. కొఱుకు, కొఱుకు పుండు: చూ, సవాయి. 1; 4. సమస్టిల, ఏఱువంగి *: చూ, వం.

ఉపదగ్ధకుఁడు. సం. వి. అ. పుం. తప్పునడవళ చూచుకొనువాఁడు.

ఉపదశకము. సం. విణ. (అ. ఆ. అ.) పదింటి సంఖ్యగలది: (చూ, అదూరదశకము.)

ఉపదానము. సం వి. అ న. 1. అరణము, వివాహకాలమందు అల్లునకును ఆఁడుబిడ్డకును మామగారిచే నీయఁబడు ధనాదికము: చూ, వారణము; 2. కానుక: చూ, లంచము.

ఉపదిష్టము. సం. విణ. (అ. ఆ. అ.) ఉపదేశింపఁబడినది: అదిష్టము.

ఉపదూషితము సం. విణ (అ. ఆ. అ.) 1 ఆసన్నమరణము, సన్నిహితమగణము; చూ, మరణము; 2. నిందింపఁబడనిది, నిందకానిది: చూ, అజస్యము. 2

ఉపదూషితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) దాపించిన చౌర్యఁగలవాఁడు; 2. నిందింపఁబడ్డ వాఁడు; చూ, వ్యాధుఁడు. 2.

ఉపదేశకుఁడు సం. విణ (అ. ఆ. అ) ఉపదేశించువాఁడు: చూ, బోధకుఁడు. 2.

ఉపదేశకులు. అం. వర్ణమాల (అక్షరముల) నభ్యాసముచేసినవారు, ఉపనయనకాలమందు గాయత్రిని ఉపదేశించినవారు, వేదాధ్యయనముఁ జేయించినవారు, శాస్త్రాభ్యాసముఁ జేయించినవారు, పురాణేతిహాసాదులను తెలియఁజేసినవారు, శైవవైష్ణవమత సాంప్రదాయములను బోధించినవారు, టక్కుటమారగజకర్ణగోకర్ణ-ఇంద్రజాలమహేంద్రజాలాది విద్యల నుపదేశించినవారు. (8)

ఉపదేశము. సం వి అ. పుం. 1 మంచిమాట: చూ, హితవచనము; 2. బోధించుట: చూ, బోధనము

ఉపదేశించు. సం. స. క్రి ఉపదేశముచేయు: చూ, పన్ను. 9.

ఉపదేష్ట. సం. విణ (ఋ. ఈ. ఋ.): చూ, ఉపదేశకుఁడు.

ఉపదేహిక సం వి అ. స్త్రీ. చెదపురుగు చూ, పిపీలిక.

ఉపద్రవము. సం. వి. అ పుం. విప్లవము, హావడి: చూ, విపత్తు.

ఉపద్రష్టములు. పా. అనుగతోత్పత్తులు.(బ్రైన్ పోడక్ట్సు.)

ఉపద్రష్ట. సం. వి. ఋ. పుం. కార్యముల విచారించుకొనువాఁడు.

ఉపధ. సం. వి. అ స్త్రీ. 1. ధర్మార్థకామముల చేత మంత్రి లోనగువారి చిత్తమును పరీక్షించుట: చూ, పరిక్రమము 2; 2. తలగడ: చూ, లోదు; అం. 3. అశ్వశాస్త్రమునందలి (పీఠిలో)గతివిశేషములు తొమ్మిదింటిలో నొకటి చూ, గతివిశేషములు; పా. 4. (వ్యాకరణమున) కడపటి యక్షరమునకు ముందటి యక్షరము ఉపధయనఁబడును ఉ.— పీచి-సంచి పీనిలోని తుదివర్ణము ఇకారము దానివెనుక నున్నది చకారము. అది ఉపధ యనఁబడును. (మ॥ నూ॥ గారి ఆంధ్రభాషానుశాసనము.)

ఉపధర్మము. సం.వి. అ. పుం. పాషండధర్మము.

ఉపధాచేదిలు. పా. బహువచనప్రత్యయము పరమగునపుడు ఇకారాంతశబ్దముల ఉపధాచేది

లు దంత్యములగును. ఈసూత్రము అచ్ఛికములకు తత్సమములకుఁ గూడఁ జెల్లును, ఉ.—సంౘి + లు=సంౘులు. ఇకారము ఉకారమైనది, ౘకారము ౘకారమైనది. ఇట్లే జోౙి + లు=జోౙులు, ఇట్టి వాచ్ఛికములు. వీౘి + లు=వీౘులు. రాౙి + లు=రాౙులు. ఇట్టివి తత్సమములు. (మ॥ సూ॥ గారి ఆంధ్రభాషానుశాసనము.)

ఉపధాతువు. పా. నిర్ధాతువు. (నాన్ మెటల్.)

ఉపధానము. సం. వి. అ. న. 1 తలగడ: చూ, గోను; 2. చెలిమి: చూ, స్నేహము. 1; 3 విషము: చూ, విసము. 1.

ఉపధావించు. సం. అ. క్రి. పరుగిడు: చూ, పరుగెత్తు.

ఉపధి. సం. వి. ఇ. పుం. 1. రూ-ఉపాధి పరద్రోహార్థమొకటి యుద్దేశించినట్లు తెలిపి యొకటిసేయుట: చూ, వ్యాజము. 1; 2. అక్షాగ్రకీలము: చూ, బండికన్ను.

ఉపధూపితము. సం. వి. అ. పుం. 1. సమీపించిన యస్తమయము: చూ, అస్తమనము; విశే. 2 చావుసమీపించినది; 3. పొగ వేయఁబడినది.

ఉపధూపితుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) 1. ఆసన్నమరణము గలవాఁడు; 2 పీడింపఁబడినవాఁడు, ఉపసర్తుఁడు: చూ, వ్యసనార్తుఁడు.

ఉపధ్మానీయము. పా. పకారమునకు వెనుక అర్ధవిసర్గమువలెనుండు వర్ణము ఉపధ్మానీయమనఁబడును. ఉ.—పయఃపానము. (మ. సూ. ఆంధ్రభాషానుశాసనము)

ఉపనక్తము. సం. వి. అ. పుం. చెప్పుతట్టు *: చూ, చర్మారము.

ఉపనతము. సం. విశే. (అ. ఆ. అ.) కదిసినది: చూ, ప్రాప్తము 1.

ఉపనయనకాలమందు గాయత్రిని ఉపదేశించినవారు అం. అష్టగురువులలో నొకరు: చూ, ఉపదేశకులు.

ఉపనయనదానము. అం. షోడశమహాదానములలో నొకటి: చూ, షోడశమహాదానములు.

ఉపనయనపద్ధతి. పా. "సీ. గర్భాష్టమాదిగాఁగను షోడశాబ్దాంత ముపనయనము బ్రాహ్మణోత్తములకుఁ, బదునొకండాది యిర్వదిరెండు తుదగాఁగ నుపనయనము క్షత్రియులకు నెల్లఁ, బండ్రెండు మొదలు నిర్వది నాల్గు తుదగాఁగ వడుగు చేయఁగఁదగు వైశ్యులకును, నంతలో వడుగు చేయక తక్కెరేనియుఁ బతితుఁడౌనటమీఁద బ్రాహ్మణుండు॥ గీ. అష్టమైకాదశ ద్వాదశాబ్దములకు నుపనయనములు చేయుట యుక్తమంబు, చేయఁ జొప్పడకుండెనే నెప్పినేండ్ల, మానగాఁజేయుటది కొంత మగ్యమంబు॥ క మూరెడు పొడుగు విప్రుఁడు,భూగమణుఁడు వటము ఖదిరమును వైశ్యుఁడు నెం,పారఁగ రావియు మేడియు, గాగవమున దండములుగఁ గైకొనవలయున్॥ క. చిక్కని చిక్కని నున్నని, సురిక్కని తోలూడ్వఁ బడనివల్లి సెగలచే, నొక్కఁబడని దండంబులు, తక్కక యుపనయనవేళఁ గాల్పఁగ వలయున్॥ క తల మదురు ముక్కుతుదయగు, కొలఁదింగాళ్ళకును నిల్పి కొల్చినదండంబులు విప్రరాజ వైశ్యులు, తలకొని వర్ణాశ్రమమున ధరియింపఁదగున్." విజ్ఞా. ఆచా. 18, 21-23

ఉపనయనము. సం. వి. అ. న. 1. ఒంటిజందెము వేసికొనుటకుఁ జేయు పండుగ, రూ-ఉపనయము-ఉపనాయము (ఉపనయనముహూర్తకాలము.—తిథులు.—2, 3, 5, 7, 10,13; వారములు —బు, గు, శు, సో; నక్షత్రములు.—అశ్వి, అనూ, రే, మృ, స్వా, రో, ఉత్తరాత్రయం, పున, పుష్య, శ్రవణత్రి

ణుం; లగ్నములు.— వృష, మి, కర్క, క, తు, కుం, మీ; విశేషములు.— శుక్లపక్షము, అష్టమశుద్ధి మీనచైత్రం శు.): చూ, వడుగు; (చూ, కాలామృతము. ద్వితీయబిందువు. 25 ల. 87.) అం 2 షమునాలుకర్మములలో నొకటి: చూ, కర్మములు.

ఉపనయము. సం. వి అ. న.—పై.—

ఉపనాయము. సం. వి. అ. న.—పై.—

ఉపనాయకులు. అం. నలుగురు — దక్షిణుఁడు, అనుకూలుఁడు, ధృష్టుఁడు, శఠుఁడు. (చూ, పతులు.)

ఉపనాహము. సం వి. అ. పుం. 1 వీణెలోన గువాని తంతిచుట్టెడు బిరడ: చూ, బిరడ. 1, 2. పుంటిమీఁదపూసెడు మందు: చూ, మందు. 1; 3. జలదారి: చూ, తూము 2; 4. పుండు: చూ, వ్రణము; 5. తామరతూడు: చూ, బిసము. 1; 6. గ్రాసము: చూ, ముద్ద. 2.

ఉపనిధి సం. వి. ఇ. పుం. చెప్పక చూపక యుంచిన ఇల్లడ: చూ, వండిక.

ఉపనిబంధన పా. చూ, ఉపనిధి.

ఉపనియోజన. పా. (ప్రయోలక్షణ) నైమిత్తికముగా జరుగుచున్నది, (అనుబంధనియోజన.)

ఉపనివేశము. పా. (డొమినియను) అధినివేశము, అధినివేశరాజ్యము.

ఉపనిషత్తు. సం. వి. ద. స్త్రీ. 1. వేదాంతము, ధర్మము: చూ, వేదాంతము; 2 వేదోక్తవిధి చూ, ధర్మము; 3. ఏకాంతము: చూ, రహస్యము. 1.

ఉపనిషత్తులు. అం. ఈశావాస్యము, తలవకారము, కఠవల్లి, ప్రశ్న, ముండకము, మాండూక్యము, భృగువల్లి, ఐతరేయము, ఛాందోగ్యము, బృహదారణ్యకము. (10)

ఉపనిష్క్రమము. సం వి అ. న.= ఉత్క్రమము. రూ-ఉపనిష్కరము. అభిముఖమైన రాజమార్గము: చూ, మార్గము. 1.

ఉపనిష్క్రమము. సం. వి. అ. న.= ఉత్క్రమము —పై.—

ఉపనీతుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) 1. వడుగైనవాఁడు: చూ, వటుఁడు; 2. సమీపమునకు తేఁబడినవాఁడు.

ఉపన్యసించు. సం. స క్రి. 1. ఉండఁజేయు, ఉనుచు. "వ. పురుషోత్తమునందుఁ జిత్తంబుపన్యసించి" భాగ. 2, స్కం: చూ, ఇడు 2; 2. ఉపన్యాసముచేయు.

ఉపన్యాసము. సం. వి అ. పుం. 1. ఏదేనియొక విషయముసెత్తి విస్తరించిచెప్పుట, ఉదా చూ, వాఙ్ముఖము; 2: చూ, ఉదాహరణము; 3. షోడశసంధులలో నొకటి: చూ, షోడశసంధులు.

ఉపపట్టణము. సం వి. అ. న. 1. శాఖానగరము, పేట చూ, దేశము; 2 పట్టణమునకు దగ్గఱయూరు: చూ, దేశము.

ఉపపతి సం. వి. ఇ. పుం. 1. జారుఁడు: చూ, అంకుమగఁడు, 2. నాయకులు ముగ్గురిలో నొకఁడు: చూ, నాయకులు. (శృంగారరసమందలి ముఖ్యుఁడైన యొకానొక నాయకుఁడు.)

ఉపపత్తి. సం. వి ఇ. స్త్రీ. 1. భాగ్యము: చూ, సంపత్తి. 1; 2 అలవాటు: చూ, స్వభావము; 3. మంచి, చూ, యోగ్యత; 4. కారణము: చూ, హేతువు; 5: చూ, ఉదాహరణము; 6. జన్మము: చూ, పుట్టుక; 7. కత: చూ, సమాచారము. 2; 8. రతి: చూ, సంయోగము; 9 కూడిక: చూ, సంయోగము.

ఉపపదము. పా. 1. ఆరూఢము తొమ్మిది విధములు. అందు ఉపపదము తొమ్మిదవది: చూ,

ఆరూఢము, 2 చిత్రబంధములు రెండింటిలో నొకటి. చూ, చిత్రబంధములు

**ఉపపన్నము.** సం. విణ. (అ. ఆ. ఆ.) 1. ఉపపత్తికలది; 2. పొందఁబడ్డది: చూ, ప్రాప్తము. 1; 3. పుట్టినది: చూ, సంభూతము; 4 పూర్ణమయినది: చూ, వర్ధితము. 3.

**ఉపపరిచ్ఛేదము.** పా. (క్లాజు) వాక్యభాగము ఉపస్కంధము.

**ఉపపటిక్రియ** పా. (ప్రెయింసడ్ స్ట్రీ) ఒకదానికితోడుగానుండు పరిక్రియ.(అనుగత పరిక్రియ)

**ఉపపాదకము.** సం విణ. (అ. ఆ. అ.) కలిగించునది: చూ, ప్రతిపాదకము.

**ఉపపాదనము** సం. వి. అ. న. కలిగించుట: చూ, పుట్టించుట.

**ఉపపురాణములు.** అం. సనత్కుమారీయము, నారసింహీయము, స్కాందము, శివధర్మము, దౌర్వాసము, నారదీయము, కాపిలము, మానవము, ఔశనము, బ్రహ్మాండము, వారుణము, కాళీపురాణము, లైంగము, సాంబము, సౌరము, పారాశర్యము, మారీచము, భార్గవము (18)

**ఉపపుష్పిక.** సం. వి. ఆ స్త్రీ. ఆవలింత చూ, హాఫిక.

**ఉపప్రదానము.** సం. వి అ. న కానుక: చూ, లంచము.

**ఉపప్లవము** సం. వి అ. పుం. 1 అంజన్యము: చూ, తోఁకచుక్క; 2. ఉపద్రవము: చూ, విపత్తు; 3 కేతువు: చూ, రాహువు 2, 4. రాహుగ్రహము చూ, రాహువు. 2; 5. సూర్యచంద్రగ్రహణములు: చూ, గ్రహణము. 1; విణ. 6. తెలియకవచ్చునది. (ఉత్పాతము); పా. 7. రాజకీయోపద్రవము. (ఇన్సర్షన్.)

**ఉపప్లుతము.** సం. విణ. (అ. ఆ. అ.) వ్యసనము గలది, వ్యసనవతి.

**ఉపప్లుతుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) వ్యసనవంతుఁడు: చూ, వ్యసనార్తుఁడు.

**ఉపబర్హము.** సం వి. అ. పుం తలగడ: చూ, లోడు.

**ఉపబృంహణము.** సం. వి. అ. న. చక్కఁగా పెరుగుట: చూ, సంవృద్ధి.

**ఉపబృంహితము** సం. విణ.(అ ఆ. అ.)చక్కఁగా పెరిగినది: చూ, సంవర్ధితము

**ఉపభుక్తము.** సం విణ. (అ. ఆ అ.) అనుభవింపఁబడినది: చూ, భుక్తము.

**ఉపభృత్తు.** సం వి. త్. స్త్రీ 1. హోమార్థమైన మిళ్ళివంటి యజ్ఞోపకరణ విశేషము: చూ, స్రువము; 2. కిరీటము: చూ, సీసకము. 1; 3. ఉపసమూలము: చూ, యోనిమూలము; 4. బ. చేనుమొన: చూ, చన్ను. 1.

**ఉపభోగము** సం. వి. అ. పుం. 1. అనుభవము: చూ, భుక్తి, 2; పా. 2 (మిసపోప్రిప్రియేషన్ అఫ్ వాల్యుయేబుల్స్)

**ఉపభోగ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) అనుభవింపఁదగినది: చూ, భోగ్యము. 3.

**ఉపమ,** సం వి. ఆ. స్త్రీ. 1. ఒక అర్థాలంకారము. (రూ-ఉపమానము): చూ, అలంకారము. 3; సమస్తాలంకారములకు నుపమ పూర్ణాదిగానున్నది. దానినుండియే సమస్తాలంకారములను బుట్టినవి. రెండు పదార్థములయందు వర్ణ్యావర్ణ్యములందు మనోహరమగు సామ్యమును స్పష్టముగాఁ జెప్పఁబడియుండె నేని యుపమయగును. 1. ఉపమానము, 2. ఉపమేయము, 3 ఉపమావాచకము, 4. సాధారణధర్మము; అని నాలుగవయవములు కలవు. ఉదా.— రాముని కీర్తి వెన్నెల వెల్లనై లోకమున వ్యాపించియున్నది. ఒకదానితో నొకటి పోలికగల రెండు వస్తువులలో గొప్పదియగు నప్రస్తుత వస్తువు ఉపమానము, అది యిందు వెన్నెల,

అది తెలుపుచేత గొప్పదియుఁ బ్రిస్తుతము వర్ణించఁబడనిదియునై యున్నది కావున నుపమానము. (ఉపమాన=పోలిక; ఉపమేయ=పోల్చఁబడునది, ఉపమావాచక=వలె ప్రభృతులు; సాధారణధర్మ (గుణ) ములు కలది పూర్ణోపమ, ఇందులో నేవేని దక్కువైన లుప్తోపమ, మొత్తమున నెనిమిది విధములు. పూర్ణోపమ.-ఉ.-నీకీర్తిహంసాంగనవలె స్వర్గంగం దేలుచుండె; లుప్తోపమ.—ఉ.-నీమోము సోమునింబోలు.); 2 పోలిక: చూ, సామ్యము; 3.పోల్పఁదగినచంద్రాది:చూ, ఉపమానము; విశ. 4. ఉత్తరపదమైనచో సమాసము: నిభము, సంకాశము, నీకాశము, ప్రతీకాశము, ఉపమ (చంద్రనిభ, లక్ష్మీసంకాశ, పద్మినీకాశం, సూర్యప్రతీకాశః, పిష్టూపమః అని సమాసశబ్దములు ఉత్తరపదములు కానప్పుడు సదృశవాచకములు. నిభాదులైతే ఉత్తరపదములైనప్పుడే సదృశవాచకములని భేదము) చూ, ఉపమానము; వై. వి 5, అనువు. "గీ. నృపవధూటిని వధియింప నుపమయొకటి, యాత్మలోపల రోచించి యద్భుతముగ" "గీ. తత్క్షణంబ యొక్కతిస్కరుఁ గల్పించి, యార్యవినుతశీలయైనయట్టి, జనవరేణ్య దేవి సమయింపఁదగు నుపాయంబు గఱపి యరుగుమనినవాఁడు." హరిశ్చ. 5, ఆ. 110; వి. పు 7, ఆ. 8: చూ, ఉపాయము; వా 6. గోధుమనూకలోఁ జేసిన పిండివంటి భక్ష్యము: (రూ-ఉప్మా.) చూ, భక్ష్యము.

ఉపమరి. వై. విశ. ఉపాయశాలి. "క. ఉపమరివై సత్యంబును, నెపములులేకుండనెంచు నెరజాణుఁడవై" వేమన. 527: చూ. సమర్థుఁడు.

ఉపమాత. సం వి బు. స్త్రీ 1. పాలిచ్చి పెంచు (దాది) తల్లి; చూ, దాది; విశ 2. ఉపమానము చెప్పువాఁడు.

ఉపమానచింతామణి. సం. గంగేశోపాధ్యాయుని విరచితము: చూ, కావ్యనాటకములు.

ఉపమానపూర్వపదకర్మధారయ సమాసము. వా. ఉపమానము పూర్వపదముగనున్న నుపమానపూర్వపదము. ఏవస్తువును గుఱించి మనము మాటలాడుచున్నామో యది యుపమేయము వాఁడు తియ్యగ మాటలాడినప్పుడు ఆమాటలను గుఱించి చెప్పుటలోఁ దేనెమాటలు అనినచో 'మాటలు' ఉపమేయము తేనె యుపమానము. అనఁగా మాటలు తేనెవలెఁ దియ్యగానున్నవని యర్థము. తేనవంటి మాటలు అని విగ్రహము ఇచ్చుట నుపమానమైన తేనె యను మాట ముందుగానుండుటచే 'తేనెమాటలు' ఉపమానపూర్వపద కర్మధారయము. ఇట్లు చిగురుఁగేలు-పూవుఁబోఁడి. ఇత్యాదులందు త్తరపదంబు ప్రధానమని యెఱుంగునది. (కర్మధారయ సమాసనిరూపణంబు లేడింటిలో నొకటి. "కౌముదీవిశదం భాతియా వాణీ రతిసుందరీ, లతాతన్వీ పరా దద్యాత్ ద్రాక్షామధురాంగిరమ్." కౌముదీవవిశద—కౌముదీవిశదా, రతిరివసుందరీ —రతిసుందరీ, లతేవతన్వీ—లతాతన్వీ, ద్రాక్షేవమధురా—ద్రాక్షామధురా, ఘనఇవశ్యామః—ఘనశ్యామః ఇత్యేవమాదయః) చూ, కర్మధారయము.

ఉపమానము. సం. వి అ.న. 1. ఒకానొక అర్థాలంకారము: చూ, ఉపమ. 1; 2. పోలిక: చూ, సామ్యము; 3. పోల్పఁదగిన చంద్రాది: చూ, ఉపమ. 3; 4: చూ, ఉపమ. 4; అం 5. ప్రత్యక్షాదిప్రమాణములలో నొకటి: చూ, ప్రత్యక్షాది ప్రమాణములు; 6 తార్కికప్రమాణములు నాలుగింటిలో నొకటి: చూ, తార్కికప్రమాణములు; (అర్థాలంకారమునకు :— ఉదా.—మిత్రమా! నేడు నీరాక యిష్టదేవతాదర్శనంబు లభించినట్లును, పర్వదినంబు

చేకూరినట్లును, చిరకాలకాంక్షితంబగు నర్థంబు సిద్ధించినట్లును, నష్టద్రవ్యము తిరుగ లభించిన యానందంబునను మనంబునకత్యానందంబు సంధిం చుచుండె.)

ఉపమానలుప్త. సం. వి. ఆ. స్త్రీ. లుప్తోపమాలంకారము (చూ, ఉపమ 1.): చూ, హేతువు 2; (చూ, అలంకారము. 8 )

ఉపమానోత్తరపదకర్మధారయము. పా. ఉపమానము త్తరపదముగాఁ గలది యుపమానోత్తరపద కర్మధారయము. ఉ -ముఖపద్మము. ఇచ్చట నుపమానమైన పద్మము రెండవపదముగా నున్నది. ఇట్లు మోముఁదమ్మి దీనినే యుపమితసమాసమందురు. సింహము-శార్దూలము-నాగము-వ్యాఘ్రము-పుంగవము-ఋక్షము-ఋషభము-కుంజరము-చంద్రుఁడు ఇత్యాదులు ఉత్తరపదము లైనపుడు శ్రేష్ఠార్థమును దెలుపును. పురుష సింహము-మునికుంజరుఁడు ఇత్యాది. ఇందు సామాన్యధర్మము చెప్పరాదు. (కర్మధారయ సమాసనిరూపణంబు లేడింటిలో నొకటి. "రామోఽయం పురుషవ్యాఘ్రస్సంవృతః కపికుంజరైః, హనిష్యతి బలాద్యుద్ధే రావణం రాక్షసర్షభమ్." పురుషో వ్యాఘ్ర ఇవ-పురుషవ్యాఘ్రః, కపయః కుంజరా ఇవ-కపికుంజరాః, రాక్షసః ఋషభ ఇవ-రాక్షసర్షభః, కవిర్వారాహ ఇవ కవివరాహః ఇత్యేవమాదయః.): చూ, కర్మధారయము

ఉపమావాచకము పా. ఉపమను జెప్పు శబ్దముపమావాచకము. అది యిందు "వలె"యై యున్నది. అది కీర్తికిని వెన్నెలకును సామ్యమును జెప్పుచున్నది గావున నుపమావాచకము. ఇట్లు పోలె, వంటి, తుల, ఉద్ది, ఈడు, సరి, జత, సమానము, తుల్యము, సదృశము, నిభము, సంకాశము, నీకాశము, మిత్రము, బంధువు, చుట్టము మొదలగునవియు నుపమావాచకములే. (సూ. 49. ఉపమానంబులనే కంబులగుచో నుపమావాచకంబు కడదాని కొక్కటియ కొన్నియెడలఁ గననగు. ఉ. శారగగనీరదము చంద్రబింబము కర్పూరమువలెనీయ శస్సు ధవళము.)

ఉపమించు. సం. స. క్రి. పోలఁజేయు: చూ, పోలుచు.

ఉపమితము. సం. విణ. (అ. ఆ. అ.) పోల్పఁబడినది

ఉపమితి. సం. వి. ఇ. స్త్రీ. పోలిక: చూ, సామ్యము.

ఉపమేయము సం. వి. అ న. 1 ప్రకృతము వర్ణించువస్తువు. పోలికగల రెండువస్తువులలోఁ గొంచెము తక్కువదై ప్రస్తుతము వర్ణింపఁబడుచున్నది యుపమేయము. అది యిందుఁ గీర్తియైయున్నది అది తెలుపుచే వెన్నెలకంటెఁ దక్కువదైనదియుఁ బ్రస్తుతము వర్ణింపఁబడుచున్నదియును గావున నుపమేయము; (వ్యా. సూ. 45. ఉపమేయము ప్రథమాంతమగునపుడు "అట్లు" పరంబైనచో నుపమానంబులగు నామతదస్మద్యుష్మదాత్మార్థములకు షష్ఠియగు. తదర్థకము — దానియట్లు, దీనియట్లు వానియట్లు; అస్మదర్థకము — నాయట్లు, మాయట్లు; యుష్మదర్థకము.—నీయట్లు, మీయట్లు; ఆత్మార్థకము.—తనయట్లు, తమయట్లు ఇట్లు కరణిమాదుక్కలును గ్రహించునది; సూ. 48. ఉపమేయము ద్వితీయాద్యంతమగునపుడు పోలె ప్రభృతులు పరంబులగుచో నుపమానంబులకు నుపమేయ విభక్తులయగు. ఉ. మమ్ము భీరులఁబోలె వెఱపించెదవులో నైనవి )

ఉపమేయోపమ. సం, వి. ఆ. స్త్రీ. ఒక యర్థాలంకారము (చూ, అలంకారము. 8.): చూ, హేతువు. 2. ఉపమానోపమేయములు రెం

డును ఒకదానికొకటి యుపమానములైన యెడల నుపమేయోపమ. ఉదా.—రామునికి సముద్రుఁడే సాటి, సముద్రునికి రాముఁడే సాటి; ధర్మమర్థమువలె, అర్థము ధర్మమువలె నీయందున్నవి.

**ఉపయమము.** సం. వి.అ. పుం. 1. పెండ్లి: చూ, వివాహము; 2. యముని సమీపము: ఉపయామము.

**ఉపయాచితకము.** సం. వి. అ. న. అభీష్టసిద్ధికై దేవతలకీఁబడు ద్రవ్యము: చూ, మ్రొక్కుబడి

**ఉపయామము.** సం. వి. అ. పుం: చూ, ఉపయమము.

**ఉపయుక్తమగు.** మి. అ.క్రి: చూ, పొందుపడు.

**ఉపయుక్తము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఒదవుబడియైనది; 2. సమృద్ధమైనది, పెరిగినది: చూ, పృథులము.

**ఉపయోగము.** సం. వి. అ. పుం. 1. ఒదవుబడి: చూ, సమృద్ధి; 2. వ్యా. సూ 11. ఉపయోగంబునం దాఖ్యాతకుఁ దృతీయావలసలగు. ఉ.—మామగవారు ద్రోణాచార్యుచే విద్య నభ్యసించిరి కుశలవులు వాల్మీకులతో రామాయణముఁ బఠించిరి. వానివలననే విద్య గ్రహించితి. ఆఖ్యాత=నియమముతో విద్య నేర్పువాఁడు; ఉపయోగము=నియమముతో విద్య గ్రహించుట.

**ఉపయోగించు.** సం. అ. క్రి. 1. ఒదువు: చూ, సమృద్ధమగు; 2: చూ, పొందుపడు.

**ఉపర.** సం. వి. ఆ. స్త్రీ. నూలుకుండెనుంచెడు నాడా: చూ, నాడె

**ఉపరంధ్రము.** సం. వి. అ. న. మృగముల వెనుక కాలి మూలమునకును ప్రక్కకును నడిమి చోటు: చూ, తొలకు.

**ఉపరక్తుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. రాహువుచే పట్టఁబడినవాఁడు. (చంద్రుఁడు లేక సూర్యుఁడు.); 2. జూదము మొదలైన వ్యసనములచేత తొందరఁబడ్డవాఁడ : చూ, వ్యసనార్తుఁడు.

**ఉపరక్షణము.** సం వి. అ. న. 1. బత్తములవారు సందడిలేక తొలఁగించుట చూ, సజ్జనము; 2. శిబిరరక్షణార్థమై చుట్టును పెట్టిన వెలుఁగు లోనగునది: చూ, సజ్జనము.

**ఉపరతము** సం, విణ (అ. ఆ. అ.) ఉడిగినది

**ఉపరతి.** సం వి. ఇ. స్త్రీ 1. ఊరట: చూ, విశ్రాంతి; 2: చూ, పురుషాయితము; అం తే శమంమలాటింటిలో నొకటి: చూ, శమాదులు.

**ఉపరథ్య.** సం. వి. ఆ. స్త్రీ. పసులులోనగువాని రాకపోకలచేత నేర్పడిన ఊరిముందటి దారి: చూ, మార్గము. 1

**ఉపరమము.** సం. వి. అ. పుం రూ—ఉపరామము. ఉడుకువ: చూ, విశ్రాంతి.

**ఉపరాగము.** సం. వి. అ పుం. 1. రాహువు సూర్యచంద్రులను పట్టుట: చూ, గ్రహణము. 1; 2: చూ, గ్రహకల్లోలము; విణ. 3 ధర్మముకానిది: అధర్మము, అన్యాయము, అపన్యాయము; (తె. ప):—అన్నెము, అపపాడి, అవనాయము; వి. 4. వ్యసనము: చూ, దుఃఖము.

**ఉపరామ.** సం. అవ్య. రాముని సమీపమున.

**ఉపరామము** సం. వి. అ. పుం: చూ, ఉపరమము.

**ఉపరి.** సం. అవ్య. మీఁదివైపు: చూ, మీఁదు. 2

**ఉపరిక్షేత్రము** పా. ధరాతలము (సూపర్ ఫిసియస్ )

**ఉపరిభాగము.** పా. (సర్ఫేస్.)

**ఉపరివైశాల్యము.** పా.(సూపర్ ఫిజికల్ ఏరియా, అప్పర్ యేరియా.)

**ఉపరిష్టాత్తు.** సం. అవ్య. మీఁదివైపు: చూ, మీఁదు. 2.

ఉపరుద్ధము. సం. విశే. (అ. ఆ. అ) అడ్డగింపఁబడినది: చూ, రుద్ధము. 1.

ఉపరోధము. సం. వి. అ. పుం. అడ్డగింత: చూ, నిరోధము 1.

ఉపరోధించు. సం. స. క్రి. అడ్డగించు, చూ, నిరోధించు

ఉపర్యభియోగము. వ్యా. (అప్పీలు) పైయధికారికి విన్నపము.

ఉపల. సం వి. ఆ. స్త్రీ. 1. కల్వపుగుండు: చూ, పొత్రము. 1; 2. నూరెడుగుండ్రాయి: చూ, పొత్రము. 2; 3. గుండ్రాయి: చూ, మెటియ.

ఉపలంభము. సం. వి. అ. పుం 1. కుడుపు: చూ, భుక్తి 2; 2. జ్ఞానము: చూ, బుద్ధి.

ఉపలక్షణము. సం. వి. అ. న. ఒకటి నుద్దేశించి చెప్పఁబడి సామాన్యధర్మముచే తదితరస్థలముల యందును ప్రవర్తించుట.

ఉపలనాడి. సం. వి. ఈ. స్త్రీ. గరిండము: చూ, పిడక.

ఉపలభ. సం. వి. ఆ. స్త్రీ. మతి: చూ, బుద్ధి

ఉపలబ్ధము. సం. విశే. (అ. ఆ. అ.) 1. పొందఁబడినది: చూ, ప్రాప్తము 1; 2. తెలియఁబడినది: చూ, వ్యక్తము. 2.

ఉపలబ్ధార్థ. సం. వి. ఆ. స్త్రీ. ఏయుపాయము చేతనైనను ఎఱుఁగఁబడిన అర్థముఁగలది: చూ, పరికథ.

ఉపలబ్ధి. సం వి. ఇ. స్త్రీ. 1. జ్ఞానము: చూ, బుద్ధి; 2. పొందు: చూ, స్నేహము. 1

ఉపలము. సం. వి. అ. పుం. 1. శిల: చూ, రాయి; 2. మణి: చూ, రత్నము. 1; 3. కల్వపుగుండు: చూ, పొత్రము. 1; 4. నూరెడుగుండ్రాయి: చూ, పొత్రము. 2; 5. గుండ్రాయి: చూ, మెటియ.

ఉపలసంప్రకీర్ణ. అం. అశ్వసంచారమార్గములలో నొకటి: చూ, అశ్వసంచారమార్గములు.

ఉపలాలనము సం వి. అ. న: చూ, బుజ్జగింత. 1

ఉపలాలించు సం. స క్రి: చూ, బుజ్జగించు.

ఉపలాలితము. సం. విశే. (అ. ఆ. అ.) బుజ్జగింపఁబడినది.

ఉపలాస్యము అం. నాటికలు పదునెనిమిదింటిలో నొకటి, ఒకటంకము. కథ ప్రసిద్ధము, శృంగార హాస్య కరుణశోకములు ముఖ్యములు, కీర్తనలుండును: చూ, నాటికలు.

ఉపలింగము. సం. వి. అ. న. దేశోపద్రవము: చూ, విపత్తు.

ఉపలిప్తము. సం. విశే (అ. ఆ. అ.) అలుకఁబడినది.

ఉపలేపకధాతువు. వ్యా (ఎపితెలియమ్)

ఉపలేపనము. సం. వి. అ. న. అలుకుట: చూ, గోముఖము.

ఉపలోలకము. అం. అలంకారము లేడింటిలో నొకటి: చూ, అలంకారము. 3.

ఉపవడము. దే. వి. రూ-ఉప్పవడము: చూ, మేలుకోలు.

ఉపవనము. సం. వి. అ. న 1. మనుష్యులు వేసి పెంచినతోఁట: చూ, వనము. 2; 2. ఇంటితోఁట: చూ, వనము. 2.

ఉపవర్గము. సం వి. అ. పుం. 1. మారితెవులు: చూ, మారి; 2 ఉపద్రవము: చూ, విపత్తు.

ఉపవర్ణము. సం. వి. అ. పుం నాలుగు వర్ణముల యొక్క యనులోమజాతి.

ఉపవర్తనము. సం. వి. అ. న 1. విలాతి; అనేక పట్టణములుగల గొప్ప భూభాగము: చూ, దేశము; 2. ఇరువదిగ్రామములు చేరిన భూభాగము: చూ, దేశము.

**ఉపవర్షుఁడు.** సం. వి. అ. పుం. కృతకోటి, హల భృతుఁడు: చూ, ముని. 1.

**ఉపవసథము.** సం. వి. అ. పుం. గ్రామము: చూ, దేశము.

**ఉపవసించు.** సం. అ. క్రి. 1. వ్రతాదులయందు పస్తుండు. "ఆ ఉపవసించు మండి యోగి నీళ్ల మునిఁగియుఁ, గూడుపండి వేల్పుఁగుడువుమను చు, గానినోరుగొట్టి తామె తిందురుగా, విశ్వ." వేమన. 583; 2. జ్వరాదులచే లంకణముచేయు: చూ, పస్తుండు.

**ఉపవస్తము.** సం. వి. అ. పుం, న. 1 వ్రతాదులలో అన్నముఁ జేయుటకుపవాసము: చూ, లంకణము; 2. జ్వరాదులచేతనుండెడి యుపవాసము: చూ, లంకణము.

**ఉపవాక్యము.** పా. 1. వాక్యములయందింటిలో నొకటి: చూ, వాక్యములు; 2. కర్తగాఁగాని, కర్మగాఁగాని వాడఁబడువాక్యముపవాక్యము. ఉ.—నీవేమిచేసితివో నాకుఁ దెలియదు—ఆడితివని వింటిని.

**ఉపవాటిక** సం వి అ. స్త్రీ. 1. మంత్రుల గృహములోఁజేరిన తోఁట: చూ, వనము. 2; 2. వేశ్యాగృహారామము చూ, వనము. 2; (ఉగ్ర వాటిక. శబ్దార్థకల్పతరువు.)

**ఉపవాయువులు** అం నాగము, కూర్మము, కృకరము, దేవదత్తము, ధనంజయము. (5): చూ, వాయువు.

**ఉపవాసము.** సం. వి అ. పుం, న: చూ, ఉపవస్తము. "క. భూసురులకు నృపులకు నుప, వాసముదగుఁగాని యన్యవర్ణులకుఁ దపో, సక్తి గలిగి పెద్దయు, దోషంబని విందుధర్మధు ర్యస్వాంతా." భార. అను. 4, అ. 143.

**ఉపవాహ్యము.** సం. వి. అ. పుం. ఔపవాహ్య ము, రాజెక్కెడి యేనుఁగు: చూ, హస్తి.

**ఉపవింశము.** సం. విణ. (అ. ఆ. అ.) ఇరువదింటి సంఖ్యగలది.

**ఉపవిద్యలు.** అం. 1. శిక్ష.— పుస్తకవాచకము (గ్రంథము చదువుట.). శుకశారికా ప్రలాప ము (చిలుకలకు గోరువంకలకు మాటలు నేర్పు ట.); 2.వ్యాకరణము.-దేశభాషా విజ్ఞానము. (స్వదేశభాషను దెలియుట.) అవాంతరము లు —అక్షరలక్షణము, లేఖనము; 3. నిరు క్తము —వైనాయికి జ్ఞానము. (అమరము,అను శేషము, విశ్వము, విశ్వప్రకాశము, శబ్దార్ణ వము, శబ్దచింతామణిచంద్రిక, యాదవము, వై జయంతి, హలాయుధము, వైజయంతి, ద్విరూప కోశము, సరస్వతీవిలాసము, విశేషామృతము మొదలగునవి తెలియుట.); 4. నాట్యవిషయము, (1) నాట్యశాస్త్రము. (క్షేత్రము, బీజము, అంకము, భిన్నములని యనేకభేదములుఁ గల వు.) ఇందుకుఁ బ్రధానగ్రంథములు లీలా వతి, విమలవతి; (2.) వాస్తుశాస్త్రము — గృహములు, సౌధములు, దేవాలయములు నిర్మించుటకు యుక్తాయుక్తములుఁ దెలియఁ జేయునది. అవాంతరము శిల్పవాస్తు (ఇంటి లో నేదిక్కున నేశిల్పములుఁగలిగినది తెలియఁ జేయునది.) ఈవాస్తు కాలామృతము, మ హాగర్గమార్కండేయము మొదలగు గ్రంథము లు వివరింపఁబడి యుండియుఁ బ్రత్యేక గ్రంథ ము ను గల్గియుండెను; (3)శకునశాస్త్రము.— (ముందనుభవమగు శుభాశుభ లక్షణములఁ దెలుపునది.) తిర్యగ్జంతువుల నడకలవలనను, శుభాశుభవస్తువు లెదురు కొనుటవలనను సుఖ దుఃఖము లెఱిఁగించునది;(4)స్వరశాస్త్రము.- కుడియెడమ ముక్కురంధ్రముల వెడలు వా యువు సూర్యచంద్రుల స్వరములను పేరుఁ జెంది సకల శుభాశుభములను లోకవ్యవహార ములను జీవితకాలమును దెలియఁజేయునది.

ఈశాస్త్రము ప్రత్యక్షప్రమాణము; (5)ప్రశ్న శాస్త్రము.—పోయిన వస్తువులను గూర్చియును,ముందుగలుగు లాభనష్టములను గురించియును, కాలఫలములఁగూర్చియు నడుగఁ జెప్పఁదగినది అవాంతరములు, ముష్టిప్రశ్నము, నష్టప్రశ్నము; 5 కల్పము.—కల్పించునది వేదములోఁ జెప్పఁబడియున్న దర్శపూర్ణమాసాది యాగములలోఁజేరియున్న క్రియలకు దేనితర్వాత నేదియో అనుసను బోధంచెడిదియనుట. ఈకల్పము సూత్రములు నాలుగువేదములకును వానిలోఁ జేరిన ప్రతిశాఖకును ఒక్కొక్క గ్రంథముచొప్పున పుట్టియున్నట్టు కన్పట్టుచున్నవి; 6. ఛందస్సు.—కవిత్వగణన (అను, గద్య, బంధ, చిత్రకవిత్వములు.); 7. ఋగ్వేదము.—దీనిచేత దేవతలు స్తుతిచేయఁబడుదురు, 8. ఋగ్వేదోపవేదము (ఆయుర్వేదము.)— ఈశాస్త్రము మొదట క్షీరసముద్రమును దేవాసురులు మథించినప్పుడు వారికి నమృతము నిచ్చుటకై విష్ణువు క్షీరసముద్రపు ధన్వ, అంగా తెయాండు, తర, తేని. ఒరుడు ధన్వంతరి యనిపించుకొని. దేవ వైద్యునిచేత రచియింపఁబడినది;— (1)ధాతు రసవాదము.—(కొండను నులఁ బుట్టిన యభ్రకము, తాళకము, శిలాజిత్తు, హరితాళము, మణిశిల, మైలతుత్తము మొదలయిన వాని యొక్కయు, పాదరసము, గంధకము మొదలగు రసములయొక్కయు గుణములనుదెలుపునది.); (2.) అంజనవిద్య. (ఒకవిధమగు కాటుక నఱచేతికివ్రాసి యందువలనఁ బోయిన ధనమును, దొంగలను, నిక్షేపములను దెలియఁదగినది ); (3) వశ్యౌషధప్రయోగము.—స్త్రీపురుషులొకరి కొకరు వశులగుటకుఁ దగు ఔషధ ప్రయోగము దెలిపెడిది.); (4) పాకశాస్త్రము — ఇందు సలక్షీమపాకములు ప్రసిద్ధములు సమస్తరోగంబులకు ఔషధంబులేకయే భక్ష్యపదార్థముల యందుప్పు పసుపు కారము మొదలగు వస్తువులు సూక్ష్మాధిక్యప్రయోగము వలన నౌషధసమానములై యారోగ్యకరములగుచుండును. రోగనిదానము చేయఁజాలి వివిధవస్తుగుణములెఱింగి వంటచేసి భుజించుటవలన నది బహురుచ్యమై పథ్యమై యౌషధప్రాయమై యారోగ్యప్రదమగును. సూద శాస్త్రము.— "శ్లో॥ అర్ధాఢకం రుచిరపర్యుషితస్య దధ్నః ఖండాన్ని షోడశ పలాని శశిప్రభస్య। సర్పిః పలం మధు పలం మరిచం ద్వికర్షం శుంఠ్యాః పలార్ధమపి చార్ధపలం త్రుటీశ్చ॥ శ్లక్ష్ణే పటే లలనయా మృదుపాణిఘృష్టా కర్పూరగంధి సురభీకృత కుంభసంస్థా। దివ్యావృకోదర కృతా సరసా రసాలా సాలా చాస్వాదితా భగవతా మధుసూదనేన." శే 2 పెట్టిపెరుగు, తు 4 నెయ్యి, తు4 తేనె, తు 2 మిరియాలు, తు 2 శొంఠి, యీవస్తువులు నారి వస్త్రములితముచేసి పెరుగు బాగా మర్దించి ఏలకులు పచ్చకర్పూరము ఖండశర్కర కలిపి పుచ్చుకొనేది. (5) దోహదశాస్త్రము —(వృక్షలతాగులకాలములయందు పుష్పించి ఫలించుటకుఁ జేయు క్రియ.) గాడిమాదివృక్షదోహదము.—దాడిమి, వెలఁగ, నారికేళము, పనస, మాతులుంగము, బీజపూరము, నారింజ, అరఁటి, ద్రాక్ష, మామిడి, లేఁతమామిడి, సంపెంగ, పున్నాగ, గిరిమల్లిక, వకుళ, దాసన, రేఁగు, తిందుకము, చింత, జాజి, మల్లె, కరవీరము, గోరింట, మాధవీలత. చిక్కుడుతీఁగె, పొట్లతీఁగ, బీరతీఁగె, కాఁకరతీఁగ, కూశ్మాండము; (ఈ పదములకడ వాని వివరములు చూచుకొనవలయును.); 9. యజుర్వేదము.— (దీనిచేత దేవతలు పూజింపఁబడుదురు.) (1) కామశా

స్త్రము.—మనస్సు మొదలగు నింద్రియముల చేత కోరఁబడిన విషయానుభవసుఖమును గోరుట ఇది మన్మథదైవత్యమై ధర్మార్థముల కంటె నిహపరలోక సుఖసాధకమై మోక్షకరంబై యుండును. "శ్లో. బలంబలవతాంబాహం కామరాగ వివర్జితమ్। ధర్మావిరుద్ధో భూతేషు కామోస్మి భరతర్షభ." అని భగవద్గీతయందు సప్తమాధ్యాయమున ౧౧వ శ్లోకము; 10. యజుర్వేదోపవేదము. (అర్థవేదము.—(1) స్వర్ణరత్నాది పరీక్ష బంగారమువన్నె లెక్కించి వెల నిర్ణయించుట. వజ్రము, పద్మరాగము, మరకతము, గోమేధికము, వైడూర్యము, పుష్యరాగము, మౌక్తికము, ప్రవాళము, నీలము ఈనవరత్నములకుఁ గలుగు జన్మస్థానములు, జాతులు, గ్రహములు, దోషము లెక్కించుచుఁ దత్తద్రత్నధారణమునఁ గలుగు ఫలాఫలములఁ దెలుపునది; (2) ద్యూతము, ప్రాణిద్యూతము, అప్రాణిద్యూతము అని ద్వివిధము. ప్రాణిద్యూతము = పొట్టేళ్లు, కోళ్లు, డేలు, పికిలిపిట్టలు, పావురములు, కౌజులు, గుఱ్ఱములు మొదలగు తిర్యగ్జంతువుల పందెమిడి పోరాడించుట. అప్రాణిద్యూతము=పాగటాలు, చతురంగము, గంజీఫా, ఇస్పేటు, పచ్చీసు మొదలగు పందియమిడి యాడునాటలు. ఇందు కోళ్ళు మొదలగువాని పందియములకు వన్నెలు, తిథివార నక్షత్రాదు లెక్కించు కుక్కుటశాస్త్రాది గ్రంథములు గలవు; (3) కృషి.—భూమిని దున్ని పైరుపెట్టుటకు నిర్ణయసింధువు, సస్యానందము. కొట్టుమత సిద్ధాంతము మొదలగు గ్రంథములు గలవు. వానియందు వర్షలక్షణాదులుఁ దెలుపఁబడియున్నవి; (4) వాణిజ్యము.—వ్యవహారముఁ జేయునప్పుడు ధాన్యాదులఁ గొనుకాలము, విక్రయకాలము, లాభవిధి, విక్రయనిషేధ వస్తువివరణములఁ దెలుపునది; (5) గోశాస్త్రము.—సహదేవకల్పిత గ్రంథమొకటి కలదు. అందు గోవుల వర్ణములు, సుళ్ళు, శుభలక్షణములు వానివలనఁ గలుగు ఫలములును, పశువ్యాధులును, తదుపశమనౌషధాదు లెక్కించునది; (6) భూపరీక్ష.—ఏభూమి నేపైరు బాగుగ ఫలించు విధమును, తియ్యనీరు లభించు చోటెఱుఁగు రీతియును, యెద్దిప్రజలకు సుఖకరమగునదియును, రేవడ, ఇసుక, చౌడు, పాటిభూమి, ఎఱ్ఱభూమి, గులకఱాతిభూముల లక్షణము లెక్కించునది; (7) సూచీవానకర్మ. (సూదులచేతఁ గుట్టుపని విశేషములు.); 11. అథర్వణవేదము.—(ఋగ్యజుస్సామ వేదములను బొందక ప్రత్యేకముగా శ్యేనయాగము మొదలైన ఆభిచారికకర్మలనఁగా శత్రుసంహారము ప్రయోజనముగాఁగల జపహోమాదులను వాటిని విధించుచుండను అందుల అథర్వణభద్రకాళి మొదలైన యుగ్రదేవతల ప్రార్థనలు బహుఋక్కులయందుఁ గలిగియుండును ఆ మంత్రములకు ఆకర్షణము, స్తంభనము, మారణము, మోహనము, వశీకరణము, ఉచ్చాటనము అనెడు షట్ప్రయోగములు మొనలైనవాటిని బోధించుటకై దూర్వాస కల్పసూత్రము మొదలైనవి కలవు. అది యావత్తు మంత్రశాస్త్రము.=ఆగమశాస్త్ర మనిపించుకొనును.)—(1) ఆగమములు. 28.—కామికాగమము. యోగము, చింత్యము, కారణము, అజితము, దీప్తము, సూక్ష్మము, సహస్రము, అంశుమత్తు, సుప్రభేదము, విజయము, నిశ్వాసము, స్వాయంభువము, అనలము, వీరము, రౌరవము, విమలము, చంద్రజ్ఞానము, బింబము, తంత్రము, ప్రోద్గీతము, లలితము, సిద్ధము, సంతానము, సర్వోక్తము, పారమేశ్వ

నము, కిరణము, వాతూలము. ఈ గ్రంథముల యందనేక మంత్రయంత్రతంత్ర ప్రయోగాగములఁ దెలియఁజేయును; (2) ఐంద్రజాలికము.—(లేనిది యున్నట్లును, ఉన్నది లేనట్లును, చూచువారికన్నులకు భ్రమ గొల్పించునది) అవాంతరములు మహేంద్రజాలము; [illegible]కర్ణము, గోకర్ణము, గారడీ, కనుకట్టు, హస్తలాఘవాదులు; (3) ప్రయోగము.—ఆకర్షణము, స్తంభనము, మారణము, మోహనము, వశీకరణము, ఉచ్చాటనములను నానావిధములగు మంత్రప్రయోగములఁ దెలుపునది; మంత్రశక్తిచే జలము, అగ్ని, వాయువు, వాక్కు, దృష్టి, శుక్లము, ధూమము, ఖడ్గము మొదలగు వానిని స్తంభింపఁజేయు విధమె తెలిగించునది, 12 ధనుర్వేదము.—(అథర్వవేదోపవేదము.)- ధనుః (అంబులపొదలుగలవారిచేతఁ గొనఁబడెడి సాధనము) (విల్లు మొదలగువానియొక్క వేదము అనఁగ ధారణము, గ్రహణము, ఆకర్షణము, బాణసంధానము, బాణవిసర్జనము మొదలగు క్రియలను బోధించునది.) (1) మల్లశాస్త్రము — ఈ శాస్త్ర విషయగ్రంథములంతరించినను కొన్ని విషయములు లోకానుచారంబుగా నున్న వాని నీ నిఘంటు రాజమందుఁ జూపఁబడియె. (12 దండలు, 12 గతులు, 12 పరువళ్ళు, 12 మొనలు, 12 కాయమానములు, 14 విసరులు, 16 ఉపవీతములు, 32 విన్నాణములు, 32 ప్రచారములు, 3 నణుకులు మొదలగునవి); (2) గజశాస్త్రము.—గజములను గూర్చి మృగచర్మీయము, రాజపుత్రీయమను గ్రంథములయందు వివరింపఁబడి యున్నది. గజములు —భద్రము, మందము, మృగము అని త్రివిధము. గభీర వేది యని భద్రమున నొకలక్షణముఁ గానంబడియెడి. అల్లసాని పెద్దనగారి భద్రేభ శతకమున గానవచ్చెడి; (3) వ్యూహశాస్త్రము —కామందకమునఁ జెప్పినరీతి నిందు వివరింపఁబడియె.—ప్రకృతివ్యూహములు 4, దండవ్యూహములు 17, భోగవ్యూహములు 5, మండల వ్యూహములు 2, అసంహతవ్యూహములు 6, ప్రధానవ్యూహములు 6, గురుమతమున వ్యూహాంగములు 7, శుక్రమతమున వ్యూహాంగములు 5; (4) అశ్వహృదయ పరిజ్ఞానము, సారథిరథికులయొక్క యుత్సాహము; (చూ, అశ్వహృదయ పరిజ్ఞానము.); 13. సామవేదము.—(ఋక్కులలో మొదటి వానినందుకొని వైదికములైన సప్తస్వరములతో పాడినది ఉద్గానము=అదే సామమనిపించుకొనును. ఋగ్వేదకాలమున శాళ్వలాయన కల్పసూత్రము ప్రసిద్ధము. సామవేదమునకు ఛాందోగ్యకల్పసూత్రము ప్రసిద్ధము; (పాపమును నశింపఁ జేయునది); 14 గాంధర్వవేదము.—(సామవేదోపవేదము) గం=గానమును, ధర్వ=ధరించినవారో (విశ్వావసుఁడు మొదలగు దేవయోనిజాతివిశేషము) గంధర్వుల సంబంధియైనది గాంధర్వము. (నృత్త, గీత, వాద్యములనఁబడు తౌర్యత్రిక నైపుణీరూపమగు విద్య.) దానినిదెలుపు శాస్త్రము గాంధర్వవేదము. ఇదే సంగీతశాస్త్రము, నాట్యశాస్త్రము, భరతశాస్త్రమని వాడఁబడును. ఈవిద్యయు సర్వవిద్యేశ్వరుఁడగు శివునివలనఁ బ్రకాశించినది భావ, రాగ, తాళములని సంక్షేపముగ మూఁడైయున్నవి. ఆమూఁటిలో భావము అభినయమని వ్యంజకమని యనిపించుకొనును. భావము. (గేయప్రబంధరూపమైన వాక్యములయొక్క తాత్పర్యము.) అదె అభి-ఎదుటను, నయము- పొందించుట. అనఁగఁ జూచు శ్రోతలకు వినిపింపఁబడు ప్రబంధార్థమును నేత్రహస్తాదులచేత

సూచించుట. ఇదే అభినీయమానుఁడగు రామాది కథానాయకుని తాత్పర్యమును వ్యంజించెడిది (సభాసదులకుఁ దోపఁజేసెడిది) కాన వ్యంజకమనిపించుకొనినది. ఈఅభినయము ఆంగికము, వాచికము, ఆహార్యము, సాత్త్వికమని నాల్గువిధములు. ఈయభినయము పదార్థము నభినయించిన నాట్యమనియును, వాక్యార్థము నభినయించిన నృత్యమనియును అర్థమునను సరింపక మనోహరమైన తాళప్రుజతులతోఁగూడిన స్వరప్రుజతుల ననుసరించి యడుగులు వేసెడి గాత్రవిక్షేపమాత్రము నృత్తమనియును వ్యవహరింపఁబడును. ఈనృత్తము పురుషుఁడు కఠినప్రయోగము గలుగునట్లుగ నాడెడిదైన తాండవమనియును, స్త్రీసుకుమారముగఁబ్రయోగములుగ నాడిన దైన లాస్యమనియుఁ జెప్పఁబడును. ఈయాటలకన్నిటికిఁ గర్తలగునటిగాని, నటుఁడుగాని యాడుటను గుఱించి కదలింపవలసిన శిరఃప్రభృతి పాదపర్యంతావయవములక్రియలు ప్రత్యవయవమునకు వేర్వేరై యున్నవి వానిలో నాట్యోపయోగములైన యంగములు 19, శిరఃక్రియలు 17, దృష్టిక్రియలు 18, రసదృష్టులు 8, రసస్థాయీభావమునఁబుట్టిన దృష్టులు 8, సంచారీభావమునఁ బుట్టిన దృష్టులు 20, తారాక్రియలు 9, పుటక్రియలు 9, భ్రూక్రియలు 7, నాసికాక్రియలు 6, గండక్రియలు 6, అధరము 6, చిబుకము 8, ముఖక్రియలు 6, కంఠక్రియలు 4; హస్తక్రియాభేదములు:—బాహుప్రచారములు 10, హస్తక్రియలు 20, హస్తప్రచారములు 15, హస్తకరణములు 4, హస్తక్షేత్రములు 3, ఉత్తమక్షేత్రములు 3, మధ్యమక్షేత్రములు 5, అధమక్షేత్రములు6; మతాంతరము:—హస్తక్షేత్రములు 13, అసంయుతహస్తములు45, సంయుతహస్తములు 32, నృత్తహస్తములు 29, హస్తప్రాణములు 12, వక్షఃక్రియలు 5, జఠరక్రియలు 3, పార్శ్వక్రియలు 5, కటిక్రియలు 5, ఊరూక్రియలు 5, జంఘాక్రియలు 5, చరణక్రియలు 6, స్థానకములు 30, పుంస్థానకములు 6, స్త్రీస్థానకములు 3, ఏకవింశతిస్థానకములు 21, భూచారులు16 ఆకాశచారులు16, భౌమమండలములు 10, ఆకాశమండలములు 10, కరణములు 108 మున్నగునవి వాడఁబడుచున్నవి; ఇది నందికేశ్వరవిరచితమగు భరతార్ణవాది గ్రంథములలో లక్షణ వినియోగములతో వివరింపఁబడి యున్నది.

దీనిఁదెలిసి నటించెడువాఁడు నటుఁడు. వానికి అభినయింపఁదగినవి పంచభావములతోఁగూడిన రసములు.—వీటి భేదములను లక్షణములను, శృంగారతిలకము, రసకలిక, రసమాలిక, రసపదఘుటిక మొదలగు గ్రంథములలో వివరింపఁబడి యున్నది. ఈ గ్రంథములు రూపకములు, కావ్యములు అని రెండువిధములు. రూపకములు —యథాయోగ్యముగా ముఖప్రతిముఖాది పంచసంధులు కలవి. వీటిలో స్త్రీలుగాని క్షుద్రజాతిపురుషులుగాని మాటలాడినపుడెల్ల మధ్యమధ్య ప్రాకృతభాష వాడలును ఈ రూపకములు పదియును రూపకముకడఁజూచునది. మఱియు కావ్యములు 2, సాహిత్యకావ్యములు 2, రీతులు 4, వృత్తులు 4, గుణములు 23, పాకములు 4, శబ్దాలంకారములు 39, అర్థాలంకారములు 100, రసవదలంకారములు 18, రసస్థాయీభావములు 9, సంచారీభావములు 33, శృంగారచేష్టలు 18, ద్వాదశావస్థలు 12, విప్రలంభము 4, అర్థాంతరసంక్రమితవాచ్యములు 2, అత్యంతతిరస్కృతవాచ్యములు2, అభిధామూలధ్వనులు 3, సంలక్ష్యక్రమవ్యంగ్యము 3; శబ్దశక్తిమూలానురణనరూపవ్యంగ్యము 4, అర్థశక్తి

మాలానురణనరూపవ్యంగ్యము 3, ఉభయశక్తి మూలానురణనరూపవ్యంగ్యము 1, ధ్వనిభేదములు 1326 ను సంకరములతోఁ గూడిన 5304 వీటితోఁగూడిన కావ్యముఁగూడ ధ్వనియనిపించుకొనును. ఇదే యుత్తమకావ్యము, ధ్వని ముఖ్యముగాలేని కావ్యము మధ్యమమును గుణీభూతవ్యంగ్యము ననిపించుకొనును. ధ్వని స్ఫుటముగాఁ దోఁచఁబడనిది యధమకావ్యమును చిత్రము ననిపించుకొనును. కావ్యమంతయు ధ్వనిమయము. గోవర్ధనాచార్యుఁడు చేసిన "ఆర్యాసప్తశతి, అమ్రుక కావ్యము" మొదలైనవి అరుదుగాని తక్కినవి తఱచుగా నారీతినుండవు. మఱియు కావ్యనాటకములు పెక్కులు గలవు. ఇక రాగాధ్యాయమును తెలిసికొనవలెను. రాగజ్ఞానమును గుఱించి యాపేక్షితములయిన అష్టాదశపదార్థములలో నాదము 2, శ్రుతులు 22, స్వరము 7, స్థాయి 3, గ్రామము 3, షడ్జగ్రామగత మూర్ఛనలు 7, మధ్యమగ్రామగత మూర్ఛనలు 7, గాంధారగ్రామగతమూర్ఛనలు 7, అందు తానముల వివరము షడ్జమధ్యమగ్రామములలోఁ జెప్పఁబడిన మూర్ఛనాసప్తకద్వయములో ప్రత్యేకమతాంతరభేదములు నాలుగు గలవు. వాటిచేత నొక్కొక్కసప్తకి మిరువదెనిమిది భేదములుగానైనది అవాంతర భేదములు 4, తానములు 8, శుద్ధతానములు 28, సహీనతానములు 7, రిహీనతానములు 7, పహీనతానములు 7, నిహీనతానములు 7; కూటతానములు 28:—రహీనతానములు 7, రిహీనతానములు 7, గహీనతానములు 7, మహీనతానములు 7; సర్వతానములు 28:—స-మ-హీనతానములు 7, ప-రి-హీనతానములు 7, రి-ధ-హీనతానములు 7, ని-గ-హీనతానములు 7; వర్ణచతుష్కము, అలంకారములు 63:—స్థాయీవర్ణగతాలంకారములు 7, ఆరోహివర్ణగతాలంకారములు 12, అవరోహివర్ణగతాలంకారములు 12, సంచారీవర్ణగతాలంకారములు 25, అలంకారములు 7; గమకములు 15; అంశములు :— శుద్ధజాతులు 7, జాతులు 11, సప్తస్వరయుక్తరాగములు, షట్స్వరయుక్తరాగములు, పంచస్వరయుక్త రాగములు, చతుస్స్వరయుక్తరాగములు, త్రిస్వరయుక్తరాగములు, ద్విస్వరయుక్త రాగములు, ఏకస్వరయుక్తరాగములు; మఱియు రాగాంగములు 13; భాషలు :— సౌవీరజభాషలు 4, కకుభజభాషలు 7, టక్కజభాషలు 21, పంచమజభాషలు 10, భిన్నపంచమజభాషలు 4, ఉత్కలకైశికజభాషలు 2, హిందోళజభాషలు 9, భోటజభాష 1, మాళవకైశికజభాషలు 13, గాంధారపంచమజభాష 1, భిన్నషడ్జజభాషలు 17, వేసరషాడవజభాషలు 2, మాళవపంచమజభాషలు 8, తానజభాష 1, పంచమషాడవజభాషలు 3; సౌవీరాది 15 జనకరాగములయందుఁ బుట్టిన భాషారాగములు:— భాషాంగములు 11; విభాషలు 20:—కకుభజవిభాషలు 3, టక్కజవిభాషలు 4, పంచమజవిభాషలు 2, భిన్నపంచమజవిభాష 1, ఉత్కలకైశికజవిభాష 1, మాళవకైశికజవిభాషలు 2, భిన్నషడ్జజవిభాషలు 4, వేసరషాడవజవిభాషలు 2, పంచమషాడవజవిభాష 1; అంతరభాషలు 4:—కకుభజభాషాంతరభాష 1, పంచమషాడవజాంతరభాషలు 3; ఉపాంగములు 4; వరాట్యుపాంగములు 6; తుండ్యుపాంగములు 2; గూర్జర్యుపాంగములు 4; వేళావళ్యుపాంగములు 4; క్రియాంగములు 12; మఱియు సామకృతి, గాడకృతి, దేవకృతి, నాదము మొదలు క్రియాంగము పర్యంతమునైన యష్టాదశపదార్థ

ములను సంగీతరత్నాకరము మొదలగు గ్రంథములలోఁ జెప్పఁబడియున్న ప్రకారముగ నుద్దేశలక్షణ వినియోగములను సద్గురుముఖమువలన సంప్రదాయపూర్వకముగఁ జదువుకొని వాటిని నిండా అభ్యసించి సాధించి జితశ్రముఁడై సందష్టోద్ఘృష్ట మొదలుకొని సానునాసికత్వ పర్యంతములైన నిరువదిమూఁడు గాయకత్వ దోషములలో నేదోషమును జెందక రూక్షత్వము మొదలుగాఁగల కంఠధ్వనిదోషములు లేక సుగుణములు యిరువదెనిమిది మొదలగునవి కలిగియున్న గాయకోత్తముఁడు తాళవర్జిములు మొదలగు దోషములు లేక ప్రభుసభయందు సభాసదుల శ్లాఘనార్థముగఁ బాడవలసినరీతిని యీలాటి విధములుగ వినికిఁ జేసిన శాస్త్రపండితుఁ డనఁబడును. ఇక తాళాధ్యాయము చూతము. — తాళము అనఁగ తలనక్రియ (అనఁగా నృత్తగీతముల యొక్క అనుద్రుతాది ప్రమాణసహితమైన పదకవితా దళావృత్తకాలమును అవాప, నిష్క్రామాది క్రియలచేతఁ గొలిచి సరిపెట్టి నిలుపుట. తాళశబ్దమునకు మంత్రశాస్త్రీయవ్యుత్పత్తులు రెండు. ఎట్లనిన, తా=తాండవము, ల=లాస్యము. తాండవలాస్యములు గలసి తాళమనిపించుకొనినది. రెండవవ్యుత్పత్తి:— తా అనఁగాఁ దాండవాభిమాని దేవతయును తారకుఁడును నైన శివుఁడు. ల-అనఁగా లాస్యాభిమానిదేవతయగు లకులాశక్తి, శివశక్తుల సామరస్యాత్మకరూపమే తాళమనుట. మఱియొకపక్షము — తాళమనఁగా నఱచేయి. తాళములయొక్క క్రియ గనుక తాళమనఁగా నెడమ యఱచెయ్యియందుఁగాని దానితోఁ బట్టుకొనఁబడిన కాంస్యతాళమునందుఁ గాని కుడి యఱచెయ్యిగాని దానితోఁ బుచ్చుకొనఁబడిన కాంస్యతాళముగానిఁ బ్రసరించి పుట్టిన ఘాతజధ్వని యనుట. తేలిన ఫలితమేమనఁగా ఘాతజ ధ్వనులతోను, తన్మధ్యస్థములయిన విరామకాలములతోనయిన నృత్యగీత వాద్య కాలపరిచ్ఛేదనమే తాళశబ్దార్థము. ఇట్టి తాళమునకు ప్రాణములు 10:— కాలప్రాణములు 12, మార్గప్రాణము 6, నిశ్శబ్దక్రియలు 4, సశబ్దక్రియలు 4, దేశీయక్రియలు 8, అంగప్రాణము 6 గ్రహప్రాణము 4, జాతిక్రియ 5, ముఖ్యకళాప్రాణము 5:- ఈయైదింటియందే 96 తాళములుపుట్టి 101 తాళములయ్యెను. జన్యతాళములు 96, లయప్రాణములు 3, యతిప్రాణము 6, ప్రస్తారప్రత్యయప్రాణము 19, సూడకము (సూళాదిసప్తతాళములు) 7, వాద్యములు 4, తతవాద్యములు 20, అవనద్ధవాద్యములు 18, సుషిరవాద్యములు 10, ఘనవాద్యము 6. పం: మహావాద్యములు 5. ఈతాళప్రాణదశకము మొదలయిన పదార్థముల భేదములును, వానిలక్షణ వినియోగములను తాళాధ్యాయమునందును, దద్వ్యాఖ్యానగ్రంథములయందును జూచి దెలిసికొనఁదగినది. ఇక నాటకపరీక్షసేయుదము.— త్రేతాయుగమున జరిగిన శ్రీరామచరిత్రము నారదోపదేశముచేత జాగరూకుఁడైన వాల్మీకి మహాముని బ్రహ్మాజ్ఞచేత గాయత్రీవర్ణసంపుటితముగా నిరువదినాలుగు వేలతోఁ గూడి సప్తకాండఘటితమైన రామాయణకావ్యమును రచించి కవితా సంప్రదాయప్రవర్తకుఁడగుటయేకాక శ్రీరాములసభలో నాయాదికావ్యమును తచ్ఛిష్యులును, శ్రీరాములకుమారులును నగు కుశలవులును కుశలవులచేత రాగతాళాన్వితముగ నభినయింపఁజేసెను. వాల్మీకులవారు కావ్యసంప్రదాయముఁ బ్రవర్తింపఁజేసినదేకాక నాటకసంప్రదాయమును గుఱించి సంస్కృతభాషా విశారదులైన షట్ప్రాకృత

భాషలకు ననుశాసనముఁ జేసియున్నారు. నీయాఱుభాషలకు నొక్కటియగు వ్యాకరణమైన వాల్మీకిసూత్రములకుఁ ద్రివిక్రమాచార్యవార్త్తికమును, హేమచంద్ర పక్కియను భాష్యమును, అధోక్షజపక్కికయను వ్యాఖ్యానము ఇవిగాక ఎలకూచిబాల సరస్వతి షడ్భాషావివరము, చెఱుకూరి వెంకటశాస్త్రులుచేసిన 'షడ్భాషాచంద్రిక' వరరుచిరచించిన 'ప్రాకృతప్రకాశము' యనెడి సూత్రగ్రంథమునకు భామహుఁడురచించిన 'మనోరమ' యను వృత్తియున్నగునవి గలవు. ఈప్రాకృతవ్యాకరణములచేత సంస్కరింపఁబడు ప్రాకృతభాషలలో నడుమనడుమను మిశ్రితమవుటచేతను నాటకములు వ్యామిశ్రములనఁబడినవి. ఇట్టి కావ్యములు, నాటకములు, హిమవత్సేతుమధ్యమునందుండెడి భారతవర్షములో యుధిష్ఠిరశకము మొదలు వర్తమానశాలివాహనశకమువఱకు నసంఖ్యముగాఁ బుట్టియుండెను. 15. మీమాంస.—మీమాంస అనఁగా విచారణ. దానిఁజెప్పెడు శాస్త్రముకూడ మీమాంసయనఁబడును ఆశాస్త్రము సకలవేదములయొక్క తాత్పర్యార్థములను విచారణాపూర్వకముగ నిశ్చయించుటయందు తాత్పర్యముగలది. (1) యోగశాస్త్రము, (2) సాంఖ్యము, (3) వేదాంతశాస్త్రము, (4) అలంకారశాస్త్రము, (5) అణిమాదిసిద్ధులు, (6) అదృశ్యము, (7) పరకాయప్రవేశము, (8) ఆకాశగమనము మున్నగునవి. 16. న్యాయశాస్త్రము.—న్యాయమనఁగా దృష్టాంతము. దానివలనఁ దెలియఁబడని గవయాదిపదార్థములను తెలియఁబడిన గోవు మొదలగు పదార్థములను జూపి వీటివంటివే గవయాది పదార్థములని చెప్పి తెలుపవచ్చును గనుక ప్రమాణము మొదలైన షోడశపదార్థములయందొకటి యగు దృష్టాంతపదార్థమునకు నామమైన న్యాయశబ్దముతో శాస్త్రమునకుఁ బేరేర్పఱుపఁబడినది. ఈన్యాయముయొక్క బలముచేతనే పంచావయవవాక్యములుగల యనుమానప్రమాణము ప్రకాశించును. దానిచేత మనకదృశ్యములైన ఆకాశాది బ్రహ్మాంతపదార్థములను సాధించుట, ఈశాస్త్రమే తర్కశాస్త్రమనియును, ప్రమాణశాస్త్రమనియును, వైశేషికశాస్త్రమనియును చెప్పఁబడును. ఈశాస్త్రము ప్రమాణాది షోడశపదార్థములకు గుఱుతులఁ దెలుపును 17. పురాణము.—దేవతలు, మునులు, రాజర్షులు మొదలగు మహాత్ముల పుణ్యచరిత్రల స్వర్గాదిఫలములను వినిపించుచు వాటిమూలమున వినువారికి పుణ్యమునందభిరుచి పుట్టించుచు, రాక్షసులు మొదలగు దురాత్ముల పాపచరిత్రల వినువారికి నరకాదిఫలములను వినిపించుచు వాటిమూలమున పాపకర్మములయందు పరిత్యాగబుద్ధిని పుట్టించుటయు ననెడిది విశేషము, అందుకై అష్టాదశమహాపురాణాదులు పుట్టినవి నారాయణునియందు నిష్ఠ కలది శ్రీభాగవతము. భగవతియనఁగ పరాశక్తియందు నిష్ఠకలది దేవీభాగవతము. ఈరెండుగ్రంథములకును స్కంధములు 12 శ్లోకములు 18,000 అను ఆచారాలు సరిగనున్నది. ఇత్యాది విశేషములాయాపదములకడఁ జూచునది. 18. ధర్మశాస్త్రము.—ధర్మమనఁగా యజమానుని మనస్సహితాత్మయందు సంస్కారరూపముగ ధరింపఁబడు గుణమనుట. దానికి సాధనముగ శ్రుతిస్మృతులచేత విధింపఁబడిన క్రియకూడ ధర్మమనఁబడును అట్టి ధర్మము సంధ్యావందనము మొదలుకొని అశ్వమేధపర్యంతమును నిత్యనైమిత్తిక కామ్యములనెడు త్రివిధకర్మములుగ వేదముచేతనే విధింపఁబడియుండఁగ వేరేధర్మశాస్త్రములనిపించుకొనఁ

బడెడి యష్టాదశస్మృతి సంహితలు, ఉపస్మృతులు మొదలైనవిఁ బుట్టినవి:— ప్రతిస్మృతి యందును ఆచార, వ్యవహార, ప్రాయశ్చిత్త కాండములుండును. (1) సాముద్రికము.— ఇందు లక్షణాలంకములు 58:—ఆయాపదములకడఁజూడవలెను; మహావిద్యలు 18; ఉపవిద్యలు 46 ను గూడి చతుష్షష్టివిద్యలయ్యె.

ఉపవిధి. పా. (వై-లా) ఒక ప్రభుత్వశాఖగాని పట్టుపరికారము అధికారములు పొందిన సంఘముగాని కంపెనీవారుగాని తమవ్యవహార నిర్వహణముకొఱకు చేసికొను నిబంధనలు. (ఉపనిబంధన.)

ఉపవిభక్తులు. వా.1 విభక్తిచేరునప్పు ప్రత్యయములుఉపవిభక్తులు. ఉ —టి-ంటి-తి-ఇ-ప-ఁప. మొ॥ వి; 2 ఔపవిభక్తికములు అనౌపవిభక్తికములు అని అచ్చతెనుఁగు శబ్దములు రెండువిధములు. ఉపవిభక్తులు వచ్చునవి ఔపవిభక్తికములు. తక్కినవి అనౌపవిభక్తికములు; 3. నామముల చివరనున్న రు-డు-లు-ల్లు-ను-న్ను-యి- మొదలగువానికి ఉపవిభక్తులు వచ్చును. ఉ.— ఏఱు- ఏటిని; నోరు-నోటిని; కాడు-కాటిచేన్; అలు-అలికిన్; విల్లు-వింటితోన్; చేను-చేని; కన్ను-కంటిన్; తాయి-తాతియందున్; అనుము-అనుప; వేము-వేప మొ॥వి.

ఉపవిష. సం. వి. అ స్త్రీ. ఎట్టుఅతివస * చూ, విష.

ఉపవిష్టుఁడు. సం. విణ. (అ. ఆ. అ.)కూర్చున్నవాఁడు: ఆసీనుఁడు, ఆసేదివంతుఁడు; (తె ప.):—కూరుచున్నవాఁడు- రూ-కూర్చున్నవాఁడు. తద్వి—ద్గుఱ కూర్చున్నవాఁడు:— (సం ప.):—ఉపోపవిష్టుఁడు.

ఉపవీతము సం. వి అ న. 1. ఎడమ భుజము మీఁదుగా కుడిపార్శ్వమున వ్రేలెడు జందెము: చూ, యజ్ఞోపవీతము; 2 ఉత్తరీయము: చూ, వస్త్రము.

ఉపవీతములు. అం మల్లశాస్త్రము లోనివి.— దండనిలుకడ, కదలునిలుకడ, కదలుమెలకువ, విదళింపునిలుకడ, దిశావదిశలు, హస్తపుపారువు, దేహపుపారువు,నయపుపారువు,పాదపుపారువు, పీవ, రాకడ, ఏకసర, వైసర, ఝుంపు, ఫిక్కా, కరలాఘవము (16.)

ఉపస్పంతము. పా. పుష్పవృంతము. (పెడికల్.)

ఉపవేదచతుష్టయము అం. ఆయుర్వేదము, అర్థవేదము, ధనుర్వేదము, గాంధర్వవేదము.(4.) మహావిద్యలు పదునెనిమిదింటిలోనివి. (4) చూ, మహావిద్యలు. (చూ, ఉపవిద్యలు.)

ఉపవేశకాలము అం. శిక్షా కాలములు పండ్రెండింటిలో నొకటి: చూ, శిక్షా కాలములు.

ఉపవేశము సం. వి అ. పుం. కూర్చుండుట చూ, స్థితి. 2.

ఉపశమము. సం వి. అ. పుం. 1. అడఁగుట చూ, ఉపశాంతి; 2. ఓర్పు:చూ, శాంతము.1

ఉపశమించు. సం. అ. క్రి. 1. అడఁగారు: చూ. సుఖిక్క. 4; 2. ఓర్చు చూ, సుఖిక్క. 9.

ఉపశమిల్లు. సం అ. క్రి.—వై.—

ఉపశయము. సం. వి. అ. పుం. వలయొద్ద యొచెంత తాను దాఁగియుండుటకై త్రవ్విన పల్లము: చూ, మాటు. 3.

ఉపశల్యము. సం వి. అ. న. గ్రామము చేరు నేల, ఉపకంఠము: చూ, భూమి. 1.

ఉపశాంతి. సం. వి. ఇ. స్త్రీ. 1. అడఁగుట చూ, ఉపశమము. 1; 2 ఓర్పు: చూ, శాంతము. 1.

ఉపశాఖ సం. వి. ఆ. స్త్రీ. పిల్లకొమ్మ, ఉపకాండము, చీఁగునట్టి లేఁతకొమ్మ, రెమ్మ: చూ, శాఖ. 1. (సెకండరీ బ్రాంచ్

(ఇట్లు ఉపధనుస్సు = సెకండరీబో; ఉపశీవస్థానము = సెకండరీ న్యూక్లెస్; ఉపవృంతము సెకండరీ పెడంకిల్ లోనగు పారిభాషికములు.)

ఉపశాయము సం. వి. అ పుం. 1. కావలివారు వరుసక్రమమున నుండుట: చూ, విశయము; 2. బంధుత్వక్రమము: చూ, వరుస.

ఉపశోభితము. సం. విణ (అ. ఆ అ.) ప్రకాశించినది: చూ, ప్రకాశితము.

ఉపశ్రుతము. సం. విణ. (అ ఆ. అ.) సమ్మతింపఁబడినది: చూ, స్వీకృతము

ఉపశ్రుతి. సం వి. ఇ. స్త్రీ. 1. తను భాషణమప్పుడు దబ్బాటుగఁ గలిగెడి శుభాశుభసూచకమగు అన్యసంభాషణ శ్రవణము: చూ, వినికిడి; 2. ఒడఁబాటు: చూ, సమ్మతి. 1.

ఉపశ్వాసము. పా. అంతఃప్రచాలనము (ఇన్స్పిరేషన్.)

ఉపష్టువు. సం. విణ. (అ. ఆ. అ.) ఎడమది: చూ, సవ్యము. 1

ఉపసంపన్నము. సం విణ (అ.ఆ.అ) 1. యజ్ఞార్థము చంపఁబడినది (పశ్వాది): చూ, ప్రోక్షితము; 2 నీళ్లుపోసి వండిన యన్నాదులు.

ఉపసంవ్యానము. సం వి. అ. న. అధోవస్త్రము, కట్టుకొనెడు బట్ట: చూ, వస్త్రము.

ఉపసంహరించు. సం. స. క్రి. 1. క్రమ్మఱుచు: చూ, మరలించు; 2. చంపు: చూ, సంహరించు.

ఉపసంహారము సం. వి. అ. పుం. 1. అప్రవృత్తి: చూ, మరలఁబాటు; 2 చంపుట: చూ, వధము.

ఉపసంహారవాక్యము. పా. ముఖ్యాంశములతోఁ గూడి ఫలితార్థమును చివరఁజెప్పునది.

ఉపసంహృతి. పా నాట్యముయొక్క యయిదవసంధి (విమర్శమునకు సావమర్శమనియు, నిర్వహణమునకుఁ బ్రోహములేక ఉపసంహృతియనియు నామాంతరములున్నవి.)

ఉపసభాపతి. పా. (వైస్ ప్రెసిడెంటు) ఉపాధ్యక్షుఁడు.

ఉపసగము. సం. వి. అ. పుం: చూ, ఉపచగము.

ఉపసర్గము. సం. వి. అ. పుం. 1 (క్రియాయోగములు) ప్రాది. తెలుఁగుశబ్దముల కుపసర్గములు లేవు. ఉపసర్గములు సంస్కృతశబ్దములకుఁ దఱచుగా ననుసంధింపఁబడుటచేత వానియుపయోగము క్లుప్తముగా వివరింపఁబడును.— సంస్కృతమునందు ధాతువులకును, మఱికొన్ని శబ్దములకును బూర్వమందుఁ బ్రయోగింపఁబడుచు ఆధాతుశబ్దముల అర్థములకుఁ గొన్నిచోట్ల నుత్కర్షము, కొన్నిచోట్ల నపకర్షము, కొన్నిచోట్లవానియర్థములకు వేఱర్థమును గలిగించుచు, కొన్నిచోట్ల తామే నిరర్థకమగుచు పాదపూరణమాత్ర ప్రయోజనముగలవియై నిపాతలనియు, ధాతువులోఁ గలసినప్పుడు ఉపసర్గము, గతిఅని పేరులుగల ప్రాదులుగలవు. ప్రాదులు 22.—ప్ర, పరా, అప, అవ, సం, అను, నిర్, నిస్, ఆ, దుర్, దుస్, అధి, అపి, వి, ని, అతి, సు, అభి, ఉప, పరి, ప్రతి, ఉత్.

ప్రవర్షణము
అతివర్షణము
సువర్షణము
సంవర్షణము
అధివర్షణము
పరివర్షణము
ఉద్వర్షణము
} ఉత్కర్ష.

అవవర్షణము
అపవర్షణము
వివర్షణము
నిర్వర్షణము
నివర్షణము
} అపకర్ష.

పరావర్షణము=ఎదురువాన.

అనువర్షణము=అనుసరించి వర్షించుట.

అవర్షణము=అంతట వర్షించుట లేక కొంచెము వర్షించుట
దుర్వర్షణము=దుష్టముగా (వర్షించుట.)
అవివర్షణము=నిర్గకము.
ఉపవర్షణము=సమీపమందు వర్షించుట మొ.

N. B.—ఇవి యీ యర్థములయందు సామాన్యముగాఁ బ్రవర్తించుచుండును; 2 ఎఱుపు: చూ, వర్ణము. 6; 3. తెలియకవచ్చు కీడు లోనగునది: చూ, తోఁకచుక్క; 4. అడ్డగింపు: చూ, నిరోధము. 1; 5. ఇగురు, చిగురు: చూ, విగుర్చుము, 6. మారి తెవులు: చూ, మారి.

ఉపసర్జనము సం విణ. (అ ఆ అ.) 1 ప్రధానముకానిది: చూ, అప్రధానము; 2. తరువాతది, ముఖ్యముగానిది (వస్తువు.): చూ, అప్రాగ్ర్యము.

ఉపసర్పణము సం. వి. అ. న ఆశ్రయము: చూ, ప్రాప్తి 2.

ఉపసర్పించు. సం. స. క్రి. ఆశ్రయించు: చూ, ప్రాపుగొను.

ఉపసర్య. సం. వి. ఆ. స్త్రీ. కట్టుటకు నీడు వచ్చిన (తొలిమారి) యావు: చూ, ధేనువు.

ఉపసూర్యకము సం.వి అ. న. సూర్యునిచుట్టును గుడికట్టుట: చూ, పరివేషము.

ఉపసృష్టకము. సం. వి అ. న. స్త్రీపురుషుల కలయిక: చూ, సంయోగము.

ఉపసేదివంతుఁడు. సం. వి. స్. పుం. విద్యకొఱకు దగ్గఱఁజేరి సేవచేయుచు శిక్షఁ పఁబడువాఁడు: చూ, శిష్యుఁడు.

ఉపస్కంధము. పా: చూ, ఉపపరిచ్ఛేదము.

ఉపస్కరము. సం. వి. అ. పుం: చూ, సంబారము.

ఉపస్కృతము. సం. విణ. (అ. ఆ. అ.): చూ, అలంకృతము.

ఉపసృతము అం. కరణములు నూటయెనిమిదింటిలో నొకటి: చూ, కరణములు.

ఉపస్థ. సం. వి. ఆ. స్త్రీ. 1. నేత్రాదిదశేంద్రియములలో నొకటి: చూ, హృషీకము; 2. జనేంద్రియము, ఆఁడుగుఱి: చూ, భగము. 12; విణ. 3, పరస్వరము సమీపమున నుండునది, 4. మగగుఱి: చూ, శిశ్నము; 5. తొడ పై భాగము: చూ, ఒడి 2; 6. ఊరువు: చూ, తొడ; 7. అరసంజె: చూ, సాయంకాలము, 8. గుదము: చూ, ముడ్డి; అం. 9. కర్మేంద్రియములయిదింటిలో నొకటి: చూ, ఇంద్రియములు; 10. ద్వారములు నాలుగింటిలో నొకటి చూ, ద్వారములు.

ఉపస్థమూలము. పా. గౌరానిమూలము.

ఉపస్థానము సం వి. అ. న. 1. కూడిక: చూ, సంయోగము; 2. కొలువు: చూ, శుశ్రూష.

ఉపస్థానవరాటి. అం. వరాట్యుపాంగము లాఱింటిలో నొకటి: చూ, వరాట్యుపాంగములు. (చూ, అంగము. 9.)

ఉపస్థితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. చేరినది: చూ, ఆక్తము. 1; పా. 2 ఒకానొక వృత్తము. ఇందొక్కొక్కపాదమున త, జ, జ, గ, గ ములు గలిగి ఎనిమిదవయింట యతిగల పదునొకండవ ఛందస్సునం దుద్భవించిన వృత్తము. ఉదా — "భక్తుల్దారిమీఁదను, పస్థితంబా, సక్తిస్వీరతుల్కరి, సంఖ్యసాగన్, నూతుల్గాని చెప్పెడు, చోఁదజాగా, యుక్తంబగుచుండెలు, వొందుచుండుక."; 3. ఒకానొక వృత్తము. శిఖండి విరుతము (స్త్రీ.) ఇందొక్కొక్క పాదమున జ, స, త, స, గ, గ ములు గలిగి ఏడవయింట యతిగల పదునొకండవ ఛందస్సునందుఁ బుట్టిన వృత్తము. ఉదా.—ఉపస్థితమునం, దొప్పారుచుండుక్, దపస్వివిరతు, ల్దాకంజకారం, బుప్పై ఘతగణం·

బుల్గవ్వయంబుగ్, గపిధ్వజసఖా, కామ ఫలీశా."

**ఉపస్థితి.** సం. వి. ఇ. స్త్రీ. 1. చేరిక: చూ, సంయోగము; 2 చూ, తోడుచుట

**ఉపస్థితుఁడు** సం. వి. అ. పుం. తలవాకిటనుండు పారావాఁడు: చూ, ప్రతిహారుఁడు.

**ఉపస్థోయగ్మజ్ఞాతంతువు.** పా. (సర్వ్ గేనికో-సుప్రిరల్.)

**ఉపస్పర్శనము.** సం. వి. అ. న. 1. ఆచమనము: చూ, శుద్ధాచమనము; 2. సోఁకు: చూ, స్పర్శము. 1; 3. స్నానము: చూ, స్నానము. 1.

**ఉపస్పర్శము.** సం. వి. అ. పుం.— పై —

**ఉపస్పృష్టము.** సం. విణ. (అ. ఆ. అ.) స్పృశింపఁబడినది: చూ, స్పృష్టము

**ఉపహతము.** సం. విణ. (అ. ఆ. అ) 1. ఉపద్రవమునొందినది; 2. నాశమునొందినది: చూ, పరిమృతము.

**ఉపహతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. ఉపద్రవము: చూ, విపత్తు; 2. చేటు: చూ, యత్తు.

**ఉపహసితము.** సం. వి. అ. న. చిఱునవ్వు: చూ, హాస్యము 1

**ఉపహారగృహము.** పా. ఫలహారశాల

**ఉపహారము.** సం. వి. అ. పుం. 1. కానుక: చూ, లంచము; అం. 2. షోడశసంధులలో నొకటి: చూ, షోడశసంధులు; 3. పూజాద్రవ్యము లెనిమిదింటిలో నొకటి: చూ, అర్చన.

**ఉపహారాదులు.** పా. "క. ఉపహారసమర్పకుఁడగు, సుపురుషగృహదైవతములు శుభములఁ గూర్చుగ్, నృపవరతత్కర్మరహితుఁ, గృపలేక నితాంతవిఫల కృత్యుంజేయుగ్. ఆ రక్తమాంస సహిత భక్తపిండములను, ల్లసిత లోహితాక్తలాజములను, సురను బలియొసర్ప నురగయక్షాసుర, ప్రముఖభూతములు శుభంబులొసఁగు. క. సౌమ్యాసౌమ్యబలులువిను, సౌమ్యాసౌమ్య ప్రకార జనకృత్యంబుల్, సౌమ్యస్ఫోత్తమయయ్యో, కామ్యముఁ దత్ర ప్రపూజ్య కరణింజేయున్." భాగ. అను. 4, ఆ. 5, 6, 7. (వర్ణన)

**ఉపహితము.** సం. విణ. (అ. ఆ. అ) ఉంచఁబడినది: చూ, వ్యూఢము. 2.

**ఉపహ్వరము** సం. వి. అ. న. 1. ఏకాంతము: చూ, రహస్యము; 2 దగ్గఱ: చూ, సమీపము.

**ఉపాంసమ్.** అవ్య. అహర్ముఖము: చూ, వేగుఁగను.

**ఉపాంగచతుష్టయము.** పా: చూ, ఉపాంగము. 5.

**ఉపాంగము.** సం. వి. అ. పుం. 1 సుతిపోఁకడు తిత్తి, సంగీతాంగము: చూ, సుతి; విణ. 2 చేర్పఁబడినది: అనుబంధము; అం. 3 ఉత్తానకరణబంధములు నలుబదియొకటింటిలో నొకటి: చూ, ఉత్తానకరణబంధములు; 4. రాగజ్ఞానాపేక్షితములైన యష్టాదశపదార్థములలో నొకటి: చూ, అష్టాదశపదార్థములు; 5. విద్యలు పదునెనిమిది.— అందు ఉపాంగములు 4 — మీమాంస, న్యాయశాస్త్రము, పురాణము, ధర్మశాస్త్రము (స్మృతి.) వీనికి వేదోపాంగములని, ఉపాంగచతుష్టయమనిఁ గూడ పేళ్లు గలవు: చూ, విద్యలు; 6. (రాగోపాంగములు.) ద్రావిడి, ఘూర్జరి, వరాటి, మలహారి: చూ, భాష. 1; (చూ, అంగము 9.)

**ఉపాంతఘాతిక.** సం. వి. ఇ. పుం. ఏకాంతమును బయలుపఱచువాఁడు: చూ, కీనాశుఁడు.

**ఉపాంతము.** సం. వి. అ. పుం. 1 దగ్గఱ: చూ, సమీపము; 2. కోణము: చూ, విదిక్కు; విణ. 3. సమీపించినది: చూ, సమీపము.

**ఉపాంత్యకణము.** పా. (సబ్ యే పికల్ సెల్.)

**ఉపాంశు.** సం. అవ్య. ఏకాంతము. "గంజాలవా

లుపాంశువ భుజించునధముల" అము. 4, అ. । చూ, రహస్యము.

**ఉపాంశువు.** సం. వి. ఉ. పుం. 1 జపభేదము: చూ, మంత్రము. 1; 2. ఒకరకము నీరు: చూ, నీరు 1.

**ఉపాకరణము.** సం వి. అ. న. సంస్కారపూర్వకముగా వేదమును గ్రహించుట, వడుగయిన పిదప వేదాధ్యయనముచేయు శ్రావణశుద్ధ పౌర్ణమినాటి కర్మము: ఉపాకర్మము

**ఉపాకర్మము.** సం. వి క్. న.—పై—

**ఉపాకృతము.** సం. వి. అ. పుం. 1. యజ్ఞమునందు అభిమంత్రించి చంపఁబడిన పశువు: చూ, ధేనువు; 2 యజ్ఞమునందు బలియిచ్చుటకు మంత్రించఁబడిన పశువు: చూ, ధేనువు; 3. ఉపద్రవము: చూ, విపత్తు.

**ఉపాక్షము.** సం. విశ (అ. ఆ. అ.) చక్షురాదీంద్రియ గోచరమైనది చూ, వెల్లడి.

**ఉపాక్షారము.** సం. వి. అ. న. చౌటియుప్పు: చూ, లవణము. 1.

**ఉపాఖ్యానము.** సం. వి. అ. న. 1. ఇతిహాసము, తొల్లింటికథ: చూ, సమాచారము 2; 2. కథలోని కథ. "నలోపాఖ్యానము."

**ఉపాగతము.** సం. విశ. (అ. ఆ. అ) 1. పొందఁబడినది: చూ, వ్యాప్తము 3; 2. వచ్చినది: చూ, ఏతము.

**ఉపాగురువు.** సం. వి. అ. పుం. హిమాలయపర్వతము: చూ, పర్వతము.

**ఉపాత్తము.** సం. విశ. (అ. ఆ. అ.) 1. పొందఁబడినది: చూ, ప్రాప్తము. 1; 2. అపహరింపఁబడినది: చూ, హృతము.

**ఉపాత్యయము.** సం. వి. అ. పుం. మీఱుట: చూ, పర్యయము.

**ఉపాదానము.** సం. వి. అ. న. 1. ప్రకృతి, ఇంద్రియములను లోఁబఱచుకొనుట: చూ, మాయ; 2. కారణము: చూ, హేతువు. 1; 3. పుచ్చుకొనుట: చూ, అందుకోలు. 1; వా. 4. ఆయవారము: చూ, యాచన.

**ఉపాదేయము.** సం. విశ. (అ. ఆ. అ.) పొందఁదగినది, ఆదేయము: చూ, ప్రాప్యము.

**ఉపాధానము.** సం వి. అ.న. 1. ఉంచుట: చూ, పెట్టుకోలు; 2. తాలుపు: చూ, ధరణము. 1; 3. కప్పుట: చూ, స్థాపనము; 4. ముఖ్యకారణము. చూ, హేతువు. 1

**ఉపాధి.** సం. వి. ఇ పుం. 1. కుటుంబమునందు మిక్కిలి యాసగలవాఁడు: చూ, లబ్ధుఁడు 2; 2. యు.-ఉపధి. అపదేశము: చూ, వ్యాజము 1; 3 ధర్మమును చింతించుట : చూ, ధర్మచింత; 4 గుణవాచకశబ్దము: చూ, విశేషణము

**ఉపాధ్యక్షుఁడు.** పా. 1. (వైసుచైర్మన్.) పురపాలక సంఘముయొక్క అధ్యక్షుని క్రింది యుద్యోగి; 2 (వైసుప్రెసిడెంటు.) ఉపసభాపతి.

**ఉపాధ్యాయ** సం. వి. ఆ. స్త్రీ. 1. ఉపాధ్యాయత్వముచేసెడు ఆఁడుది; (చూ, స్త్రీ:)చూ, పంతులమ్మ; 2. పాఠశాస్త్రము సంగీతశాస్త్రము మొదలయినవానిని నేర్పువాని యొక్క భార్య: చూ, భార్య; 3. బడిపంతులుభార్య: చూ, భార్య.

**ఉపాధ్యాయత్వము.** సం. వి. అ. న. ఆచార్యకము. చూ, ఒజ్జేనము.

**ఉపాధ్యాయాని.** సం. వి. ఈ స్త్రీ: చూ, ఉపాధ్యాయ.

**ఉపాధ్యాయి.** సం. వి. ఈ. స్త్రీ: చూ, యా.-ఉపాధ్యాయ.

**ఉపాధ్యాయిని.** సం. వి. ఈ. స్త్రీ: చూ, ఉపాధ్యాయ.

ఉపాధ్యాయుఁడు. సం. వి. అ. పుం 1 వేదముఁజదివించువాఁడు: చూ, గణి; 2. గురువు, చదువుచెప్పువాఁడు: చూ, పంతులు. 1.

ఉపానహము. సం. వి. హ్. స్త్రీ. 1. చెప్పులు: చూ, పాదుక; పుం. 2. అంసపాది *: చూ, హంసపాది.

ఉపామ్లజనిదములు. పా. (నాన్ మెటల్ కాక్సైడ్సు.)

ఉపాయనము. సం. వి. అ. న. కానుక: చూ, లంచము.

ఉపాయము. సం. వి. అ. పుం. 1. ఎత్తుగడ: చూ, వెరవు; 2 పొందు: చూ, స్నేహము 1.

ఉపాయములు. అం. 1 సామము, దానము, భేదము, దండము. (4); 2. అంగపంచకములోనొకటి: చూ, అంగపంచకము; 3 సామము, భేదము, దానము, నతి, ఉపేక్ష, రసాంతరము. (6); 4. సామము, దానము, భేదము, దండము, మాయ, ఉపేక్ష, ఇంద్రజాలము (7)

ఉపాయశాలి. సం. వి. ఇ. పుం. ఉపమరి: చూ, సమర్థుఁడు.

ఉపారము. వై. వి.=ఉపహార. 1. కానుక: చూ, లంచము: 2. వ్రతాదులయందును దేవతలపండుగులయందును సంతుష్టికై పెట్టినది. (నైవేద్యపదార్థము.) "ఉపారముమీఁది కుడుము"

ఉపార్జనము. సం. వి. అ. న. గడన: చూ, సంపాదనము.

ఉపార్జించు. సం. స. క్రి. గడించు: చూ, సంపాదించు.

ఉపార్జితము. సం. విశే. (అ. ఆ. అ.) గడింపఁబడినది: చూ, సంపాదితము.

ఉపాలంభము. సం. వి. అ. పుం. 1. మర్మము దూఱిపాఱనాడుట: చూ, ఉల్లుంఠనము; పా. 2. నిరాకరణము, తిరస్కారము. (రిఫ్యూజల్.)

ఉపాలంభించు సం స. క్రి. మర్మము దూఱి పాఱనాడు: చూ, ఉల్లసమాడు.

ఉపాలబ్ధము. సం. విశే. (అ. ఆ. అ.) మర్మము దూఱిపాఱనాడఁబడినది.

ఉపావృతము. సం. విశే. (అ ఆ. అ) అనాదరణము: చూ, ఉపేక్షితము.

ఉపావృత్తము. సం. విశే. (అ. ఆ. అ.) (పలుమాఱు నేల పొర్లాడినది.) అశ్వము : చూ, హయము

ఉపాశ్రయము. సం. వి. అ. పుం. 1. దగ్గఱ: చూ, సమీపము; 2. ఆసరా: చూ, ప్రాపు.2; న. 3. మదపుటేనుఁగు: చూ, హస్తి; 4 కటకఁగాలు: చూ, మత్తాలంబము.

ఉపాశ్రితము. సం. విశే. (అ. ఆ. అ.) ఆశ్రయింపఁబడినది: చూ, సంశ్రితము.

ఉపాసంగము. సం. వి. అ. పుం తూణీరము: చూ, బాణము. 1.

ఉపాసకుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) కొలువుకాఁడు: చూ, సేవకుఁడు. 1.

ఉపాసన. సం. వి. ఆ. స్త్రీ, అ. న. కొలువు: చూ, శుశ్రూష.

ఉపాసనము. సం. వి. అ. న. 1. కొలువు: చూ, శుశ్రూష; 2 విలువిద్య నేర్చుట: చూ, శరాభ్యాసము; 3. ఆసనము: చూ, పీఁట; 4. బాధ: చూ, విపత్తు.

ఉపాసనసమయము. పా. గ్రహసమయములు యిరువదియేడింటిలో నొకటి. ఫలము=దుఃఖము: చూ, గ్రహసమయములు.

ఉపాసము. వై. వి =ఉపవాసము. "క. దిన మొక్కొక్కటి యొక్కఁగ, వనజాక్షుండు పవసించి వత్సర మెల్లం, జనఁగా నొక్కొక యది యొక్క నుపాసంబుండియకవకర్మము నడపుదు." ఉ. హరి. 2, ఆ. 166 : చూ, ఉపవస్తము.

**ఉపాసించు.** సం స. క్రి కొలుచు : చూ, సేవించు

**ఉపాసిత.** సం. విశే. (ఋ. ఈ. ఋ.) ఉపాసించువాఁడు.

**ఉపాసితుఁడు.** సం. విశే. (అ. ఆ అ.) ఉపచరితుఁడు: చూ, సేవితుఁడు.

**ఉపాసీనుఁడు.** సం విశే. (అ. ఆ. అ.) సమీపమందుఁ గూర్చున్నవాఁడు.

**ఉపాస్తి.** సం. వి ఇ. స్త్రీ కొలువు : చూ, శుశ్రూష.

**ఉపాస్యుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ఉపాసింపఁదగినవాఁడు: చూ, సేవ్యుఁడు.

**ఉపాహితము.** సం.వి.అ. పుం. 1. నిప్పురగిలించిన పిడకల వరుస: చూ, తోఁకచిచ్చు; 2. అంజన్యము: చూ, తోఁకచుక్క; విశే 3. మఱియొక పదార్థముతోఁ గూర్పఁబడినది: చూ, సంయోజితము; 4. ఆరోపింపఁబడినది చూ. విషయి. 4.

**ఉపాప్తము.** సం. విశే. (అ. ఆ. అ ) 1. పొందఁబడినది: చూ, వ్యాప్తము. 3; 2 పట్టఁబడినది.

**ఉపేంద్రవజ్ర.** పా. ఒకానొక వృత్తము. ఇందొక్కొక్క పాదమునందు జ, త, ?, గ, గ, ములు గలిగి, ఎనిమిదవయింట యతిగల పదునొకండవ ఛందస్సునందుఁ బుట్టిన వృత్తము. ఉదా.—కుపాచరారు జ్జత - జల్లగింబున్, బ్రిభ్రాక్షమై దంతివి-రామ మొప్పన్, ద్విపాధిపత్రాత్రిత ను-తింపఁజేరై, యుపేంద్ర వజ్రజ్వల-యు స్ఫరిలిక్.”గ: చూ. వృత్తము. 1.

**ఉపేంద్రుఁడు.** సం. వి. అ. పుం, లచ్చిమగఁడు: చూ, విష్ణువు. 1.

**ఉపేక్ష.** సం. వి. ఆ. స్త్రీ 1. అశ్రద్ధ: చూ, మందెమేలము. 2; అం. 2. సప్తోపాయములలో నొకటి: చూ, ఉపాయములు; 3 ఉపాయములాతింటిలో నొకటి: చూ, ఉపాయములు; (నాయకుఁడు నాయికయొక్క కోపమును పోఁగొట్టునప్పు డుపయోగించునది.)

**ఉపేక్షకుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ఉపేక్షించువాఁడు: చూ, కన్నడీఁడు

**ఉపేక్షము.** అం. యానపంచకములో నొకటి: చూ, యానపంచకము

**ఉపేక్షించు.** సం స. క్రి. అశ్రద్ధచేయు: చూ, కన్నడించు.

**ఉపేక్షితము.** సం. విశే. (అ. ఆ. అ.) అనాదరణ చేయఁబడ్డది: అనాదరణము, ఉపావృతము.

**ఉపేక్షితుఁడు.** సం విశే. (అ. ఆ. అ.): చూ, ఒప్పరికింపఁబడనివాఁడు.

**ఉపేక్ష్యము** సం. విశే. (అ. ఆ అ.) ఆదరింపఁగూడనిది.

**ఉపేక్ష్యయానము** అం. యానములయిదింటిలో నొకటి: చూ, యానములు.

**ఉపేక్ష్యాసనము.** అం నేనే శత్రువులను సంహరింపఁగలనను తలంపుతో దేశకాలాదులను పరిశీలింపక కదలిపోవుట. ఆసనము లయిదింటిలో నొకటి: చూ, ఆసనము. 4.

**ఉపేత.** సం విశే. (ఋ. ఈ. ఋ.) 1. ఉపాయశాలి: చూ, సమర్థుఁడు; 2. సమీపించువాఁడు.

**ఉపేతము** సం విశే. (అ. ఆ. అ ) కూడుకొన్నది: చూ, సంయుక్తము.

**ఉపేత్య.** సం. అవ్య. 1. వచ్చి; 2. చెంది.

**ఉపోఢము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. చెంతనున్నది చూ, నికటస్థము; 2. ఉన్నరూపు: చూ, సత్యము 1; 3. వివాహమైనది; 4. మొలిచినది, కందళితము: చూ, సంభూతము; 5. గట్టియైనది: చూ, వృత్తము. 6.

ఉపోఢుఁడు. సం. విణ. (అ. ఆ అ.) అంస లుఁడు: చూ, లావరి.

ఉపోదక సం. వి. ఆ. స్త్రీ. ఉపోదకి *: చూ, బచ్చలి.

ఉపోదకి. సం. వి. ఈ. స్త్రీ.—పై.—

ఉపోదిక. సం. వి. ఆ స్త్రీ.—పై.—

ఉపోద్ఘాతము. సం. వి. అ. పుం 1. చెప్పెడి యర్థమునకు సరి తాఁకునట్లు యెత్తిమాటాడెడి అర్థాంతరము' చూ, నిదర్శనము. 1; 2 వాక్యారంభము: చూ, వాఙ్ముఖము; 3. అనుక్రమణిక: చూ, విషయసూచిక.

ఉపోపవిష్టుఁడు. సం. వి. అ. పుం. దగ్గఱ కూర్చున్నవాఁడు: చూ, ఉపవిష్టుఁడు.

ఉపోషణము. సం. వి. అ. న: చూ, ఉపవస్తము 1-2.

ఉపోషితుఁడు సం. విణ (అ. ఆ, అ.): చూ, పస్తున్నవాఁడు.

ఉపోష్య. సం. అవ్య ఉపవాసముండి

ఉపోష్యము. సం. విణ (అ. ఆ. అ.) పస్తుండఁ దగినది.

ఉప్తకృష్టము. సం. విణ. (అ. ఆ అ.) దున్ని విత్తులువేసిన పొలము: చూ, భూమి. 1.

ఉప్తము. సం. వి. అ. న. 1. కుంకుమము, నుదుట ధరించు రాగిద్రవ్యవిశేషము: చూ, సిందూరము. 1; విణ. 2. విత్తఁబడినది(నేల.): చూ, భూమి 1. (చూ, వాపితము. 2.)

ఉప్తి. సం. వి. ఇ. స్త్రీ. బీజావాపము: చూ, వెద 2.

ఉప్పుఁజప్పుఁగాఁజూచుట. జా. మంచిచెడ్డలఁజూచుట. "క. ఒకతెవలె నాడియాడిం, చుకొనుటనే యిరుగుపొరుగు జూచెనొకో యయ. ప్పుఁజప్పుఁగానను జూ, చుక నడుమఁగవలెఁ గులీన శుకసల్లాపల్." నిరంకుశో పాఖ్యానము.

ఉప్పట్టి దే వి. రూ-ఉప్పట్టు: చూ, బాలక్రీడ.

ఉప్పట్టు. దే. వి.—పై — (రూ-ఉప్పుబట్టు.)

ఉప్పత. దే వి. ఓర్వలేనితనముచేత డీలపోసి కొనుట: చూ, రవ్వ. 1.

ఉప్పతి పై. వి.=ఉత్పత్తి: చూ, పుట్టుక.

ఉప్పతించు. పై. అ. క్రి. ఓర్వలేనితనముచేత ఆడిపోసికొను. "ఉప్పతించినాఁడు సురసుర నెనేమో " క్షేత్రయ: చూ, విలపించు.

ఉప్పతిల్లు. పై అ. క్రి 1. జనించు: చూ, పుట్టు. 2; 2. అతిశయించు: చూ, ముమ్మరించు.

ఉప్పఁదనము. దే. విణ లవణధర్మము: చూ, కటువు.

ఉప్పన దే. వి. 1. ఉప్పు, నీళ్ళవరుగు: చూ, లవణము. 1; 2. లవణధర్మము: చూ, కటువు; 3. చవుటినేల· చూ, భూమి. 1.

ఉప్పనఁబట్టెలు. దే. వి. బ. ఉప్పుఁబట్టు. "సీ. పడఁతినీచూపులుప్పనఁ బట్టెలాడించి చెలులు వక్త్రములఁబూజింతుఁ గాక." ఉ, హరి. 5, ఆ 141: చూ, బాలక్రీడ.

ఉప్పగ దే. వి. 1. మట్టితవ్వి బ్రదికెడుజాతి. "ఉప్పగవాఁడు." "ఉప్పగది."; 2. మట్టి త్రవ్వి బ్రదికెడువాఁడు: చూ, ఖనకుఁడు; 3. ఉప్పగవాని పెండ్లాము: ఉప్పగది.

ఉప్పగది. దే. వి: చూ, ఉప్పర. 3.

ఉప్పగపల్లిశాసనము. శా శకవర్షము ౧౧౦౮ కి తరువాత ద్రాక్షారామమునఁ గానవచ్చు మొదటికాకతీయ శాసనము శకము ౧౧౩౪ నాటిది ఇది "కాకతిరాజ్యసముద్ధరుఁ" డని బిరుదందిన రేచర్ల రుద్రిరెడ్డి సామంతుఁడు రాజనాయకునిది. ఇందువలన రాజనాయకుని సైన్యాధిపత్యమున కాకతీయ వాహిని కళింగ ప్రాంతములను జయించినట్లు తేలుచున్నది. గణపతిదేవుని ఉప్పరపల్లి శాసనము(Hyde-

rabad Archacological Series No 3, P 16) కూడ నైవిషయమును ధ్రువపఱచుచున్నది. అందు రేచర్ల రుద్రునకు బ్రధానియై రాజనాయకుఁడిట్లు కీర్తింపఁబడి యున్నాఁడు. "క. కులతిలకుఁడు వసుధావర। జలధిసుధాకరుఁడ శేషజననుత చరితుం। డలఘుఁడు రిపుతరుదావా। నలుఁడనఁగాఁ బరగె రాజనాయకుఁ డుర్విన్" ఈతని విజయములు పైనుడివిన శాసనమున ఇట్లు వర్ణితములైనవి. "బొక్కరలోని వీరభటావలి వధించి గోధుమ, ఱాతి తలదెంచి ఉదగిరిసాధించి పడిశాయ, నిందోలి దక్షారామ భీమేశ్వర దేవరకతయ దీపంబులునిల్పె..." శిలా. 381. పుట.

ఉప్పరము. వై. వి. 1 =అభ్రిమ్: చూ, మిన్ను; 2. ఊర్ధ్వభాగము. "దోమతెర లుప్పరమెత్తిరి." ఆము. 5, ఆ. 104; "నక్తంచరిమింటి కుప్పరముగా నెసదాఁటి." జై. 5, ఆ. 139; వృత్తి యందంత్యవర్ణలోపము. "ఉ. రథం, బుప్పరవీధిఁ దోలుకొని యుగ్రగతిం బఱతెంచి తాఁకినన్." భాగ. విరా. 3, ఆ. 177; చూ, మీఁదు. 2.

ఉప్పరివాఁడు. దే. వి: చూ, ఉప్పర. 2

ఉప్పరవీది. ద్వ. వి. మిన్ను: చూ, మిన్ను.

ఉప్పరించు. దే. స. క్రి. మల్లయుద్ధ క్రియా విశేషము. "వ. మడమల మెడమలిచియు నలంచియుఁ, బిక్కల మొక్కలంబునఁ జెప్పరించియు నుప్పరించియు." ఉ, హరి. 6, ఆ 108. రూ-ఉప్పళించు.

ఉప్పరింత. దే. వి. అగ్నిభాస *: చూ, మానేరు. (రూ-ఉప్పిరింత)

ఉప్పరిగ. వై. వి.=ఉపకారిక. మిద్దమీఁది కట్టడము: చూ, గృహము. 1. (రూ-ఉప్పరిగె.)

ఉప్పలవాయి. దే, వి. బొటన జుట్టనవ్రేళ్ళ నడుము "గీ అంగుళాగ్రముల్ చిటికెనలందు మొదలు, లఘు దేవర్షి తీర్థము లనఁగఁబరఁగు, వరుసవలకేలి యుప్పలవాయి పైత్ర్య, కంపు తీర్థంబు తర్పణకార్యమునకు." భార. అను. 4, ఆ, 113.

ఉప్పలి దే. వి. ఆపద చూ, విపత్తు.

ఉప్పవడము. దే, వి. రూ- ఉపవడము. "సీ భూనాయకుండును భోజనోత్తరమునఁ బవళించియంత నుప్పవడమగుచు." పర. 3, ఆ. 56 చూ, మేలుకోలు.

ఉప్పళము. దే. వి. (ఉప్పు + అలము.) 1.ఉప్పు పంట పెట్టెడు నేల: చూ, భూమి. 1; 2.ఉప్పు రాసులుండుచోటు: చూ, భూమి. 1.

ఉప్పళించు. దే. స. క్రి: చూ, రూ-ఉప్పరించు. "ఎ, గీ. కాలిదెసఁ జొరవచ్చుట గానిపించు, మడుగుసీసాఁబట్టియు నుప్పళించి, పోవని మ్చ." భార. విరా. 2. ఆ. 16.

ఉప్పి. దే. వి. కుండలి * (కన్న-కరిఉప్పిగడ.): చూ, లవణి. (నల్లఉప్పిఅని కొందఱు.)

ఉప్పిఁడి. దే. విశే. (ఉప్పు + ఇండి) ఉప్పులేనిది చూ, చేప్పిడి; కాశీ. 2, ఆ. 83.

ఉప్పిరింత దే. వి: చూ, రూ-ఉప్పరింత. *.

ఉప్పిళ్ళు. దే. వి. పక్వచ్ఛదవ్రీహితండులములు, ఉప్పుడు: చూ, బియ్యము.

ఉప్పు. దే. వి. 1. నీళ్ళవరుగు: చూ, లవణము. (సోడియంక్లోరైడ్) "ఆ. ఉప్పు చింతపండు లూరిలోనుండఁగాఁ, గఱవదేలవచ్చెఁ గాఁపులార." వేమన. 586; స. క్రి 2. ఆవిరిపోక యుడికించు: చూ, ఆలించు.

ఉప్పుకండ. దే. వి. ఉప్పుచేమిరి యొండఁబెట్టిన మాంసము: చూ, మాంసము. (రూ- ఉప్పుఁగండ.)

ఉప్పుఁగడలి. దే. వి. (ఉప్పు + కడలి.) లవణ సముద్రము: చూ, సముద్రము.

ఉప్పుఁగాయ. దే. వి.(ఉప్పు + కాయ.) ఊరుఁగాయ "మ కప్పురపుందోయము మీఁగడల్ పెరుగులుప్పుఁగాయలుఁ ముమ్మగాఁ, బరిగ్రాగ్ణంబుగ నారగించిరి." అని. 1, ఆ 105: చూ, రుచిఁగాయ.

ఉప్పుఁగుండము. దే. వి. (ఉప్పు + కుండము.) బాలక్రీడలలో నొకటి: చూ, బాలక్రీడ.

ఉప్పుఁజేఁప. దే.వి. (ఉప్పు + చేఁప.) ఉప్పు వేసి ఎండఁబెట్టిన చేఁప: చూ, మత్స్యము.1.

ఉప్పుఁబట్టు. దే. వి: చూ, రూ-ఉప్పట్టు.

ఉప్పుఁబట్టి. దే. వి. (ఉప్పు + పట్టి.) తఃంతటి ఉప్పుపండెడు నేల: చూ, భూమి. 1.

ఉప్పుఁబిండి ద్వ. వి : చూ, ఉప్పుడుపిండి (వాడుక.)

ఉప్పుకూర దే. వి: చూ, ఈల, ఈలకూర *.

ఉప్పుడు. దే. వి. ఉప్పుడుబియ్యము : చూ, బియ్యము.

ఉప్పుడుపిండి. ద్వ. వి. 1. వరిగోధుమలోనగు పిండితోఁజేసిన భక్ష్యము' చూ, భక్ష్యము; (వైధవ్యమునొందిన శూద్రులు రాత్రులందు ఫలహారముగానుపయోగింతురు.)

ఉప్పుతోఁదొమ్మిది. జా. సమస్తము."ఉప్పుతోఁ దొమ్మిదియును బెట్టి కృపణరక్షణము గావించునే గుణసముద్రు." రామాభ్యుదయము.

ఉప్పునీరు. ద్వ. వి. క్షారోదకము: చూ, నీరు.1

ఉప్పుపత్రిలేదు. వా. 1. నూటు మంతిలేదు; 2. చదువు సంధ్యలేదు. (గోదావరిమండల ప్రాంతమున వాడుక.)

ఉప్పుమన్ను. దే.వి. క్షారమృత్తిక: చూ, భూమి.1.

ఉప్పులేక ముప్పందుము తాగుట జా. తనకాధారము లేకపోయినను గొప్పపనులకుఁ బ్రయత్నించుట, బడాయి గొట్టుకు, దంబములు గొట్టుట. "ఉప్పులేక ముప్పందుము తాగుచు గద్దెశాంకములు చాలదిద్దగలరే." ధర్మరాజయనూయము.

ఉప్పులేనికూర. జా. చప్పిడికూర. "ఉప్పులేని కూర యొప్పదురుచులకుఁ, బప్పులేని తిండి ఫలములేదు। అప్పులేనివాఁడె యధికసంపన్నుఁడు." వేమ. 589.

ఉప్పువాము. దే. వి. ఉప్పుపంట పైరుసెట్టెడు చోటు: చూ, భూమి. 1.

ఉప్పెన. వై. వి. 1. సముద్రోల్బణము: చూ, పొంగు. 3; 2 వరావళి. "ఉ. వ్యారుప్పెన మోహార్ణవల సముద్గతిఁగట్టుచు ధర్మవార్తల" శివ. ఉ. 2, ఆ: చూ, విజృంభణము.

ఉప్పొంగు. దే అ. క్రి. (ఉబ్బ + పొంగు.) 1. మిక్కిలి యుబుకు, అతిశయించు : చూ, ముమ్మరించు; 2. మిక్కిలి సంతోషించు: చూ, సంతోషించు, 3 చెంగలించు: చూ, విజృంభించు.

ఉబలాటము. దే. వి. 1. ఉత్కంఠ: చూ. తహతహ; 2. ప్రాలి: చూ, దయ; 3. మిక్కిలి కోరిక: చూ, వాంఛ.

ఉబుకు. దే వి. 1 ఉప్పెన: చూ, పొంగు. 3; అ. క్రి. 2. అతిశయించు, పొంగు: చూ, ముమ్మరించు.

ఉబుకుట. వా. (డిలపేమక్.)

ఉబుసు. దే. వి. 1. పనిలేనికాలము. "వ. ఇవ్విధంబున గలభాషిణిగాన విద్యాకౌశలంబున నలని యుబుసుఁబుచ్చె." కళా. 3, ఆ. 4: చూ, రూ-ఊసు; 2. తొల్లింటికత. వృత్తాంతము. "ఉ. ఇంచినప్రొద్దు పోకడకు నెవ్వరితో నుబుసేమి చెప్పుదుక్." విక్ర 6, ఆ. 38: చూ, సమాచారము. 2.

ఉబుసుపోక. వా. పనిలేకపోవుట: ఊర్పోక, ఊసుపోక.

ఉబ్బు. వై. వి.= ఊష్మము: చూ, ఔష్మ్యము

ఉబ్బకము. వై. వి. 1. అతిశయము : చూ, హెచ్చు 2; 2. ఉత్సాహము. "చ. వలఁబడి చిక్కఁబొంద వలపుచ్చక పోవుటయొండెఁగాక పక్షులు వలగొంచు భారమునకుం దమకింపక యుబ్బకింపునన్, వలగొని పోఱి గెల్లు." పంచత. 2, ఆ. 11: చూ, యత్నము; 3. ఆనందము: చూ, సంతోషము

ఉబ్బతిల్లు. వై. అ. క్రి. రూ-ఉప్పతిల్లు: చూ, ముమ్మరించు

ఉబ్బనీరు. వై.వి. రూ-ఉమ్మనీరు. ప్రసవజలము: చూ, నీరు 1.

ఉబ్బరపోవు. ద్వ. అ. క్రి. (ఉమ్మరము + పోవు.) చేష్టలుడిగి యేమితోఁచక అట్టె నిలుచు. "చ. ధరణిపుఁ డడ్డమై గనుడుఁదగ్భుజదండము దాఁకిమిట్టి బి, ట్టురవడిఁ జెండు క్రమ్మఱిన నుబ్బరపోయిరి భూమినీ జనుల్." వై. 3, ఆ 95: చూ, వెఱఁగుపడు.

ఉబ్బరము. వై. వి. 1 అజీర్తి చూ, రోగము. 1; 2. నీరుకట్టురోగములు: చూ, మూత్రకృచ్ఛ్రము. (మూత్రద్వారమందు తాయి పెరగడము); 3. కడుపు పొంగరించుట: చూ, పొంగరింపు; 4.=ఉల్బణమ్. అతిశయము. "ప్రత్తి సంపత్తియు బొబ్బర యుబ్బరఁబును." భీ. 3, ఆ. 57: చూ, హెచ్చు. 2.

ఉబ్బరించు. వై.అ. క్రి. 1. అజీర్తిచేయు,ఉబ్బు: చూ,పొంగు,9; 2.అతిశయించు. "ద్వి ఉబ్బు నూర్పులతోడ నొక కొంతసేపు, ఉబ్బరింపక పట్టి యూరకుండుచును." రా. యు, కాం 339. (ఇక్కడ ఉబ్బరింపక అనఁగా మీఱక అని యర్థము.): చూ, ముమ్మరించు.

ఉబ్బలి దే. వి. 1 రూ-ఉమ్మలి "పన్నిటివాఁక యుబ్బలిక." రసి. 6, ఆ. 45: చూ, బురద; 2. కర్దమము ✱: చూ, మధుఖర్జూరిక.

ఉబ్బసము వై వి. 1.=ఉచ్ఛ్వాసః, పొడిదగ్గు: చూ, దగ్గు; 2 ఊర్ధ్వశ్వాసరోగము: చూ, ఊర్ధ్వశ్వాస.

ఉబ్బాహిక. పా. ఊరీసభ, ప్రమాణపురుష గణము,

ఉబ్బించుట. దే. వి. ఉద్వేగము చూ, ఉద్రేకము. 1.

ఉబ్బు. వై వి. 1. అనురాగము: చూ, సంతోషము, 2. కడుపుబ్బుట, అజీర్తి: చూ, రోగము. 1; 3. కడుపు పొంగరింపు: చూ, పొంగరింపు; వై. అ. క్రి. 4. అధిక్యమగు: చూ, ముమ్మరించు; 5. అజీర్తిచేయు: చూ, పొంగు. 9; 6. పొటమరించు "ద్వి. ఇదియేమి మునినాథ యీ తటాకమున, నుదకంబులో ఘోషముబ్బుచున్నదియదు" రా. అర, కాం 150: చూ, లేచు; 7. ఆనందించు: చూ, సంతోషించు; 8. కండపట్టు: చూ, బలియు; పా 9. బల్బ (ధర్మామేటరుయొక్క-బల్బు.)

ఉభయకర్తృక ప్రార్థనము. పా. 1. దీనియందు బహువచనము మాత్రమే గలదు దానికిఁ గ్రియచివర (దము) వచ్చును. ఉదా —వండుదము, వరింపుదము, వరింతము మొ॥; 2 ఉభయులు కలసి (నేను నీవు లేక మేము మీరు) ప్రార్థించుట

ఉభయద్యువు సం. అవ్య. రెండు దినములు: ఉభయేద్యువు.

ఉభయనాయకుఁడు. అం. నాయకత్రయములో నొకఁడు: చూ, నాయకత్రయము.

ఉభయపదార్థ ప్రధానము. పా. అనేక సుబంతములు సముచ్చయార్థంబుఁగలవై సమసించిన ద్వంద్వసమాసమగు: చూ, ద్వంద్వసమాసము (సూ. 7.)

ఉభయపార్శ్వములు. అం. హస్తక్షేత్రములు పదుమూఁడింటిలో నొకటి: చూ, హస్తక్షేత్రములు.

**ఉభయప్రాచీతటి.** శా. [2] శ్రీఖారవేల మహారాజు హాథిగుంఫా శాసనము. ఈ శాసనము ఒరిస్సాలోని పూరీజిల్లాలో, భువనేశ్వరమునకు మూఁడుమైళ్లు దూరములోనున్న ఉదయగిరి కొండలలోని భాగమైన ఖండగిరి కొండలలో, కృత్రిమగుహాలో చెక్కఁబడి యున్నది. ఇది 1825 లో మొదట స్టర్లింగ్ అనువారిచే గనిపెట్టఁబడినది. భగవాన్‌లాల్ ఇంద్రాజీగారికే విద్వాంసుల కుపయోగకరముగురీతిని 1885 సంవత్సరమున ప్రచురింపఁబడినది. దీనిని దర్మలాను కాశీప్రసాద జయస్వాలుగారును ఆర్, డి. బెనర్జిగారును జాగ్రతగా పరిశీలించి బీహారు రిసర్చి సొసయిటీవారి పత్రికయందు పాఠాంతరములతోను సవ్యాఖ్యాముగాను ప్రకటించినారు. ఈక్రిందిమూలమును తెలుఁగుచేతయు జయస్వాములుగారిని అనుసరించినవి అయియున్నవి. మొత్తము 17 కలవు, అందు 10 వది.—"ఉభయప్రాచీతటే రాజసంనివాసమ్ మహావిజయ ప్రాసాదమ్ కారయతి ... ప్రుసచమనోరధాని ఉపలభతా." తెనుఁగు.—"ఉభయప్రాచీ నదీతటమున మహావిజయ ప్రాసాదమును ముప్పైయెనిమిది లక్షల సువర్ణములతో నిర్మించెను. పదోరాజ్యవత్సరమున దండ, సంధి సామోపాయములతో సేనలను భరతవర్షమునకుఁ బంపెను. మనోరధసిద్ధినిఁ బొందెను." కళింగ అనుబంధము. 23-25 పొరటలు.

**ఉభయప్రార్థనము** పా: చూ, ఉభయకర్తృకప్రార్థనము.

**ఉభయము.** సం. స. ద్వి. 1. రెండవయవములు గలది; 2 గుడి పౌరుపత్తికాఁడును లోకులును జేరి చేయు నుత్సవము; పా. 3 కొన్ని యర్థములయందు అచ్చతెనుఁగును కొన్ని యర్థములయందు సంస్కృతమునైన పదము. (చూ, శబ్దరత్నాకరము సంజ్ఞావివరణపట్టిక.)

**ఉభయములు.** పా. ఒక ప్రాణినిగాని, ఒక వస్తువునుగాని చెప్పునదేకవచనము. అనేక ప్రాణులను గాని, అనేక వస్తువులను గాని చెప్పునది బహువచనము. ఇవిగాక తక్కినవి యుభయములు. మిగిలినను-చేతను మొదలగు విభక్తులు ఏకవచనములు బహువచనములు గూడనగును. ఉదా.—సీతను-సీతలను, రాముని చేతన్-రాముల చేతన్, నీకొఱకున్-మీకొఱకున్, నావలనన్-మావలనన్, వానికిన్-వారికిన్, ఇంటియందు-ఇండ్లయందు మొ॥ (మ॥ సూ॥ ఆంధ్రభాషావాగను శాసనము.)

**ఉభయయతులు.** పా. భీమన పది, అనంతుఁ డిరువది, మల్లొక్కరిరువదేడు ననిరి, తుదకప్పకవి యతులు నాల్గువిధములు. స్వరయతులు, వ్యంజనయతులు, ఉభయయతులు, ప్రాసయతులు నని. స్వరయతులు 7, వ్యంజనయతులు 21, ఉభయయతులు 12, ప్రాసయతి 1= మొత్తము 41. వీనికి వేర్వేరఁ బేరులున్నవి: చూ, యతులు

**ఉభయేద్యుపు** సం అవ్య: చూ, ఉభయద్యుపు.

**ఉభయశక్తిమూలము** అం. వ్యంజనములు మూఁడింటిలో నొకటి: చూ, వ్యంజనములు.

**ఉభయాలంకారము** సం వి. అ పుం. అలంకారములు మూఁడింటిలో నొకటి (1. శబ్దాలంకారము, 2. అర్థాలంకారము, 3. ఉభయాలంకారము.): చూ, అలంకారము. 3.

**ఉమ.** సం. వి. ఆ. స్త్రీ. 1. గౌరి: చూ, పార్వతి. 1; 2 నూనె యగిసెవిత్తులు: చూ, లాలని; 3. నూనెయగిసె*: చూ, శుకనాసము 1; 4. కాంతి: చూ, వెలుతురు. 1; 5 అనుజ్ఞ: చూ, సెలవు; 6. పసుపు: చూ, వర్ణము. 6; 7. అసము: చూ, యశస్సు.

**ఉమక.** దే.వి. రూ-ఉముక-ఊక: చూ, తుసము.

**ఉమాకటము.** సం. వి. అ పుం. 1. అవిసెవిత్తుల నూగు; 2. గడ్డిగలిగిన పొల్లుధాన్యము: చూ, బూగర. 1; 3 ఇంటివాసములకుఁబట్టు బూసి: చూ, బూగర. 2

**ఉమాదము.** వై.వి.=ఉన్మాదః రూ-ఉన్మాదము: చూ, వెఱ్ఱి. 1.

**ఉమాపతి.** సం. వి. ఇ. పుం. ముక్కంటి: చూ, శివుఁడు.

**ఉమాపిత.** సం. వి. ఋ. పుం. హిమాలయము చూ, పర్వతము

**ఉమాప్రియము.** సం. వి. అ. పుం. మొగులు కడిమి *: చూ, నీపము.

**ఉమాప్రియుఁడు.** సం. వి. అ. పుం. చూ, ఉమాపతి.

**ఉమామృతము.** సం. వి. అ పుం: చూ, కొండ గోనుగు *.

**ఉమావర్మ.** శా. బృహత్ప్రోష్ఠశాసనము. (Ep. Ind. Vol. XIII. No. 2) ఇందు విజయరాజ్య సంవత్సరములుఁ జెప్పలేదు. గాని కళింగరాజని చెప్పియున్నది. దీని తారీఖు (పంక్తి 15) సంవత్ 30 మార్గశిరవదది 20 అనియున్నది. అనఁగా మార్గశిర బ 5 యని. ఇది క్రీ. శ. 379 అక్టోబరు ది 31 సోమవారము. కళింగ. 312 పొగట.

**ఉమాసుతుఁడు.** సం. వి. అ. పుం. 1. గణపతి, ఇద్దరు తల్లుల ముద్దుబిడ్డఁడు: చూ, వినాయకుఁడు. 1; 2. కుమారస్వామి, సుబ్రహ్మణ్యేశ్వరుఁడు: చూ, స్కందుఁడు.

**ఉమి.** వై. వి. = ఊర్మి. రూ-ఉమ్మి: చూ, గల్యము.

**ఉమియు.** వై. స. క్రి. ఉమ్మివేయు: చూ, ఊసాడుచు.

**ఉముకనిప్పు.** ద్వ. వి. తుషానలము: చూ, నిప్పు.

**ఉమేదువారీ.** వా. పనినిచేయక చేయుకట్టు పెత్తనము. "ఉమేదువారీపద్దు." (గోదావరీమండలమున కట్టు పెత్తనమనియు, విశాఖమండలమున దుడ్డు పెత్తనమనియు వాడుక.)

**ఉమేదువారు.** వా. ఉద్యోగమునకై కనిపెట్టుకొనియుండువారు.

**ఉమేడితుఁడు.** సం. వి. అ పుం. పార్వతిచేత స్తోత్రము చేయఁబడ్డవాఁడు.

**ఉమేశుఁడు.** సం. వి. అ. పుం. ఉమాపతి: చూ, శివుఁడు.

**ఉమోద్భవుఁడు.** సం. వి. అ. పుం. చూ, ఉమాసుతుఁడు. (ఇట్లు ఉమోదితము, ఉమోదంతము ఉమోదయము, ఉమోద్భిన్నుఁడు, ఉమోజ్జీవితుఁడు, ఉమోత్తారకుఁడు, ఉమోద్వాసితుఁడు, ఉమౌజ్జ్వల్యము, ఉమౌదార్యము, ఉమౌపమ్యము, ఉమౌచిత్యము, ఉమౌన్నత్యము. ఇత్యాదు లూహ్యంబులు.)

**ఉమ్మ.** వై. వి. 1=ఉష్మః చూ, రూ-ఉబ్బ; 2. ఏడుపు: చూ, దుఃఖము

**ఉమ్మగిలు.** వై. అ. క్రి. 1. ఆవిరిచే నుడుకు: చూ, వంటయగు. (రూ-ఉమ్మగిల్లు); 2. ఆవిరిచే మడికి: పదార్థముయొక్క వేడిమి కొంతవఱకు చల్లారు: అఁపటిల్లు, రూ-ఉమ్మగిల్లు.

**ఉమ్మగిల్లు.** వై. అ. క్రి —రూ-వై.—

**ఉమ్మడి.** దే. వి. 1. అవిభక్తత. "ఉ. ఉమ్మడి సొమ్ముగానఁ దనరొయాపినయంతయు నన్నివంకలన్, నెమ్మదిఁ బాలుఁజేల్లుచును." భో. 6, అ. 187: చూ, పొత్తు. 3; 2. నిత్యభుఁగట్టడ. "సీ. శ్రీరంగవిభుఁ బ్రతిష్ఠించి యర్వదివేల మాడలద్దేవు నుమ్మడికి నొసఁగె." వై. 1, అ. 32 కీతిక ద్రి. 3. ఏకకాలమున. "గీ. గాటముగఁబర్వి యుమ్మడిఁ గాడుటయును." రవి. 8, అ. 75. (ఇక్కడ పూర్వకవి ప్రయోగములయందొక్క శబ్దపూర్వ

కముగానే కానఁబడుచున్నది. "పెక్కుబలంబులొక్కుమ్మడిఁదోఁచి" భార. ద్రో. 2, ఆ. 55 చూ, యుగపత్.

ఉమ్మడికొనుగోలు. పా. సమష్టి క్రయము. (జాయింటు పర్చేస్.)

ఉమ్మడిపూచీ. పా సమష్టిబాధ్యత. (జాయింటు రెస్పాన్సిబిలిటీ )

ఉమ్మడిపెట్టుబడిసంఘము. పా. జాయింటు స్టాకు కంపెనీ.

ఉమ్మడివేరము. అం. వివాదములు పదునెనిమిదింటిలో నొకటి: చూ, వివాదములు

ఉమ్మడిహక్కుదారుఁడు. పా. సహాధికారి (జాయింటు ప్రొప్రయిటరు.)

ఉమ్మరము. వై. వి. = ఊష్మః: చూ, రూ- ఉమ్మ. 1.

ఉమ్మరించు. దే. అ. క్రి రూ-ఉమ్మలించు: చూ, దుఃఖించు.

ఉమ్మనీరు వై. వి: చూ, రూ-ఉబ్బనీరు.

ఉమ్మలిక. వై. వి.= ఊష్మః: చూ. ఔష్ణ్యము.

ఉమ్మలము. దే. వి. ఏడుపు: చూ, దుఃఖము.

ఉమ్మలి దే. వి: చూ, రూ-ఉబ్బలి "వ. కమ్మకస్తురి యుమ్మలింబడి." కా. 6, ఆ. 224

ఉమ్మలించు. దే. అ. క్రి. 1. వగచు. రూ- ఉమ్మలికించు. "గీ దివంబునకుఁబోవ, నుత్సహించె నమ్మునిమది నుమ్మలింప." భార. కల్యా. 2, ఆ. 213: చూ, దుఃఖించు; 2. ఏడుచు, రూ-ఉమ్మలికించు. "దీనతకోర్వలేక యుమ్మలించెదక." భార. సౌ. 1, ఆ. 217: చూ, రోదించు; స. క్రి. 3. చుట్టు: చూ, వేష్టించు.

ఉమ్మలింపు. దే. వి. 1. ఊష్మము: చూ, ఉమ్మరము; 2. వగ: చూ, దుఃఖము

ఉమ్మలిక. దే వి. 1. రూ-ఉమ్మలికము, వగ. "క. ఇమ్మహిఁ రొల్లనునీవది, యుమ్మలికకుఁ జాలనొచ్చె." భార. ఉద్యో. 1, ఆ. 107: చూ, దుఃఖము; 2. ఊష్మము: చూ, ఉమ్మరము.

ఉమ్మలికము. దే. వి.—వై.—(దుఃఖ(శోక)మునకు.—"ఉ. ఎప్డు వేగునం,చుమ్మలికంబుతో సరసులొక్కటఁ గన్నులనీరు నించె." షో. 8, ఆ; భార విరా. 1, ఆ. 91.)

ఉమ్మలికించు. దే. అ. క్రి. 1. వగచు, రూ- ఉమ్మలించు: చూ, దుఃఖించు; 2. ఏడుచు. రూ- ఉమ్మలించు. "చ. మేనిలో నుసిచిన వాఁడఁ బ్రాణములనుమ్మలికింపకుఁ డించుకేని యుక." భాగ. భీష్మ. 3, ఆ. 415 చూ, రోదించు

ఉమ్మాదము. వై. వి.=ఉన్మాదః. రూ- ఉమాదము: చూ, వెఱ్ఱి. 1.

ఉమ్మాయముత్తియము. ద్వ. వి. క్షుద్రమౌక్తికము, అణిపూస: చూ, రత్నము. 1.

ఉమ్మారావులు. వా. రాజకీయోద్యోగులు:రూ- ఉమ్రావులు.

ఉమ్మి. వై వి = ఊర్మి. రూ- ఉమి : చూ, గల్యము.

ఉమ్మినీటిగ్రంథులు. పా. లాలాగ్రంథులు. ( సెలివరిగ్లాండ్సు )

ఉమ్మినీరు. ద్వ. వి. నాలుకనుండిఁబుట్టుచొంగ: చూ, లాల. (ఇది నోటియందుఁబెట్టుకొనిన అన్నాదులను తడుపును. ఇది జీర్ణరసములలో మొదటిది.) (సెవైవా.)

ఉమ్మెత. వై. వి.=ఉన్మత్తః. రూ-ఉమ్మెత్త*: చూ, హాలాపుష్పము. (దీనియాకుల పొగను పీల్చిన ఉబ్బసపుదగ్గు తగ్గును. తెల్ల ఉమ్మెత్త కంటిపాపను వృద్ధిచేయును. ఎట్రోపిన్ అనే యింగ్లీషు మందుకు బదులుగా తెలుఁగువైద్యులచే నిది కంటివ్యాధులలో నుపయోగింపఁబడును. ఇది విషముగాన జాగ్రత్తగా వాడవలెను.) (దీని

ఊడుపుమడి. ద్వ. వి. కేదారము: చూ, భూమి. 1.

ఊడెము. దే. వి. రూ-ఊడియము: చూ, కుకూ్రవ.

ఊడ్చు. దే. స. క్రి: చూ, రూ-ఊడుచు.

ఊడ్పు. దే. వి. చూ, రూ-ఊడుపు.

ఊఢ. సం. వి. అ. స్త్రీ. 1. పెండ్లాము: చూ, భార్య; విణ. 2. పెండ్లాడినది: చూ, ఉదూఢము

ఊఢము. సం. విణ. (అ. ఆ. అ.) పొందఁబడ్డది: చూ, ప్రాప్తము. 1

ఊఢుఁడు. సం. వి. అ. పుం. 1 మూఁడు: చూ, మూర్ఖుఁడు; 2 పెండ్లియైనవాఁడు, ఉదూఢుఁడు: చూ, వివాహితుఁడు.

ఊతకట్టి. ద్వ. వి. ఆనుగుకట్టి. "ఆ. ఊతకట్టిఁ బట్టి యరిది గాఁ బోవచ్చు" వేమన. 557.

ఊతము. సం. విణ. (అ. ఆ. అ.) కుట్టఁబడినది (వస్త్రాది): చూ, రూ-ఉతము.

ఊతి. సం. వి. ఇ. స్త్రీ. 1. కుట్టు: చూ, స్యూతి. 1; 2. కావలి: చూ, రక్షణము, 3. ఒకానొక దేవత: చూ, మహాలక్ష్మి. 3; 4. ఒకానొక ధ్వని: చూ, స్వరము. 2.

ఊతిభము. సం. వి. అ. పుం. చకోరము: చూ, వెన్నెలపులుఁగు.

ఊదర. వై. వి.=ఉదారః. ఒకరకము గడ్డి: చూ, తృణము. 1.

ఊదరలు. వై. వి. బ. ఒకరకము వడ్లు: చూ, ధాన్యము.

ఊదా. గే. వి. (వైలెట్.) వన్నె భేదము: చూ, వర్ణము. 6.

ఊదాకిరణము. వి.పా. అతినీలలోహితకిరణము (అల్ట్రా వైలెట్ రే)

ఊదారంగు. ద్వ. వి: చూ, ఊదా.

ఊదాసిరా. ద్వ. వి. (వైలెట్ యింక్.) నల్లగ నుండు నొకరకము సిరా: చూ, సిరా.

ఊధము. సం. వి. స్. న. (పాలచేత తడుపునది.) (ఆవు మొదలగువాని పాల) పొదుఁగు, ఆపీనము: చూ, పొదుఁగు.

ఊధస్యము. సం. వి. అ. న. క్షీరము: చూ, పాలు. 1.

ఊనత్రయ నిర్ణయము. పా. మృతదినమునకు పండ్రెండవ దివసంబున ఊనమాసిక మవశ్యముగఁ జేయవలయుననియు, ఆదినమునఁ జేయుట కనుపపత్తి సంభవించిన ఇరువది దినములకుపైన పదిదినములలో శుద్ధిగల యొక్క వేసిదినంబునఁ జేయవచ్చుననియు, ఆఱవ మాసమున ఇరువదిదినము మొదలు ఇరువదియైదు దినములలోపల శుద్ధిగల యొక దినంబున ఊనషాణ్మాసికంబును, పండ్రెండవ మాసంబున ఇరువది దినములకుపైన నొకశుద్ధి యుక్తదినంబున ఊనాబ్దిక మాసికంబును జేయవలయును. కాలా. సప్త. 310.

ఊనత్రియ నిషిద్ధకాలము. పా. నందతిథులును, అమావాస్యయును, ఉభయపక్ష చతుర్దశీ తిథులును, శుక్ర శనివారంబులును, కృ-పూ-ష-పూ-షా-పూ-భా-మూ-ద్విపాత్త్రిపాన్నక్షత్రంబులును, చెప్పఁబోయ్యెడి త్రిపుష్కరదినంబులు నివి ఊనమాసికంబులకు నిషిద్ధంబులనియు, అనుపపత్తిచేత నిలిచియున్న మాసికమును పైమాసికములోఁ జేర్చి చేయవచ్చుననియు ఊనత్రైపక్షికమాసికములట్లుఁ జేయఁగూడదనియును జెప్పఁబడెను. కాలా. సప్త. 311.

ఊనము. సం. వి. అ. న. 1. ఒకలెక్కలో నొకలెక్క తీసివేయడము: చూ, రహితము; 2. (యుద్ధ) ప్రయత్నము: చూ, యత్నము; 3. అర: చూ, సగము; విణ. 4. కొంచెమైనది, తక్కువైనది: చూ, హీనము. 1; 5. కొంతయు.

**ఊనషోడశము.** పా. పదునాఱింటికిఁ దక్కువ.

**ఊనిక.** దే. వి. 1. ఆశ్రయము: చూ, ప్రాపు. 2; 2. దిటవు, బలిమి: చూ, శక్తి. 1.

**ఊను.** దే. స. క్రి. 1. తాలుచు; భార. ఉద్యో. 3, ఆ. 281: చూ, వహించు; 2. అవలంబించు. "తే. వారిమాలిన పశుమార్గవర్తనంబు, నూనుటరిదియె యిదియేల యుగ్గడింప." హరి. ఉ. 3, ఆ. 102: చూ, ప్రాపుగొను; 3. పొందు. "క. హీనప్రజ్ఞుఁడ కార్యము లైనవిచేసి తుదివగచు నతులప్రజ్ఞా, సానుమదారూఢుఁడు వగ, నూనఁడుదురితిమనువజీతి కోడకయునికిఁ." భార. శాం. 3, ఆ. 352: చూ, ప్రాపించు; 4 మోయు. "సీ. నవరత్న కలితభూషలయు మెప్పించు వైఖరి మణీచత్రంబు భరతుఁడూన." హ వ. 1, ఆ 25: చూ, వహించు; 5. (తోలును) మత్తపఱచు: చూ, మత్తపఱచు.

**ఊప.** దే వి అడవిలోని చెట్లగుంపు (అప్ర.): చూ, వృక్షము.

**ఊపిరి.** దే. వి. 1, రూ-ఊర్పు. "తే. ఊపిరున్నంతవఱకును గాఁపురంబు." వేమన. 561, "తే. ఊపిరున్నయపుడె యుపదేశమందుము" వేమన 562· చూ, శ్వాసము. (చూ, వాయువు.); 2. ఉచ్ఛ్వాసనిశ్వాసములు "ఊపిరి లోనికిలాగుచు." వేమన 560(చూ, వాయువు.)

**ఊపిరికట్టు.** ద్వ. వి. ఊపిరిపుచ్చనీక నొప్పించెడి రోగము: చూ, యాశము.

**ఊపిరితిత్తులు.** పా. శ్వాసమండలము:— ఊపిరితిత్తులు రెండు, వాయునాళములు, ఊపిరితిత్తులతో సంబంధించిన రక్తనాళములు. మలినరక్తమును దెచ్చి శుద్ధరక్తమును దీసికొని పోవునవి; ఇంకను ఉచ్ఛ్వాసనిశ్వాసములు జరుగుటకు వలయు కండరాదుల సంపత్తి; ఇవి అన్నియు శ్వాసమండలమునందలి విభాగములు. ముక్కుగుండ పీల్చినగాలి సప్తపథలోనికిఁబోయి, అచటనుండి స్వరపేటికను జొచ్చి, దానినుండి గాలిగొట్టమున ప్రవేశించును. ఈగాలిగొట్టము రెండుగాచీలి రెండు ఊపిరితిత్తులలో ప్రవేశించును, ఈగొట్టములు తిరిగి అసంఖ్యాకములగు కేశనాళములుగా చీలును. ఈ కేశనాళముల కొనలు చిన్న చిన్న సంచులవలె నుండును. శ్వాసకోశమును చెట్టురెమ్మ కంటియుండు పూగుత్తిగాఁగాని లేక ద్రాక్షపండ్ల గుత్తివంటి పండ్లగుత్తిగాఁగాని భావించుకొనిన దానిస్వరూపము బోధపడఁగలదు వాయునాళములయందలి లోపలి తడిచర్మమునీఁద రోమములవంటి దారములు గల కణములుండును. ఈరోమములు యెప్పుడును బయటికి అనఁగా గొంతువైపునకు ఆడుచుండుటవలన అందులో యేర్పడిన శ్లేష్మము గొంతులోనికివచ్చి కూడుచుండును. అక్కడనుండి మనము దగ్గి ఉమ్మివేయుచుందుము. శ్వాసక్రియ రెండుభాగములు:— ఉచ్ఛ్వాస నిశ్వాసములు; గాలిని విడుచుట, పీల్చుట. ప్రాణవాయువును పీల్చి, బొగ్గుపులుసు వాయువును విడుతుము అందులకు ఊపిరితిత్తులు యెప్పుడును కత్తిరితిత్తివలె సంకోచవ్యాకోచములఁ జెందుచుండును. నిమిషమునకు 18 సారులు మనము సాధారణముగా శ్వాసించుచుందుము. అనఁగా ఒక్కసారి శ్వాసించుటకు నాలుగు హృదయావర్తముల కాలము పట్టునని తెలియునది. మనము మెమ్మదిగా శ్వాసించునపుడు సుమారు 30 ఘనఅంగుళముల గాలిని పీల్చుదుము; అంతే పరిమాణము గల గాలిని విడుతుము. ఇఁకను ఊపిరితిత్తులలో 100 ఘన అంగుళల గాలి నిలువయుండును. దీనిని గూడ ప్రయాసవలన ప్రాణాయామ సమయమందు రేచింపఁ గల్గుదుము.

మనము యెంతరేచించినను యింకను 100 ఘన అంగుళాల గాలి తిత్తులలో దాఁగియుండును. దీనిని యేవిధముననను మనము బహిష్కరింపలేము. గాలిని మనము ఎంతచక్కఁగా రేచింపఁగల్గుదుమో, అంత శ్వాసశక్తి మనకుఁ గలదని చెప్పవచ్చును. (లంగ్సు.)

ఊపిరితీయుట పా. ఇందుకు చాల కండరశక్తి అవసరము. మధ్యతెర ముడుచుకొని వదును జెందును. అప్పుడు గర్భకుహరము సందలి యంగములన్నియు క్రిందికి ఒత్తఁబడును. అట్లు ఒత్తఁబడినప్పుడు పొట్టయొక్క ముందు భాగము ఉబ్బును. ప్రక్కయెముకలు, భుజము, ఉరపుటెముక అన్నియు పైకిలేచి తిత్తులు వ్యాకోచముఁజెందును. (చెట్లు జంతువుల వలె ఊపిరిపీల్చును. ఆకులే వాని ఊపిరితిత్తులు.): (చూ, ఆకు. 2.)

ఊపిరిధ్వనులు. పా ఉచ్ఛ్వాస నిశ్శ్వాసములు జరుగునప్పుడు ధ్వనులు గల్గును. వానిని మనము రొమ్ముమీఁద చెవిపెట్టి వినవచ్చును. ఈ ధ్వనుల స్వరూపమునుబట్టి శ్వాసమండలారోగ్యమును వైద్యులు (స్టెతెస్కోప్.) హృదయశోధినిగుండ నిర్ణయించఁ గలుగుదురు. శ్వాసక్రియను నడుపు నాడీగ్రంథి (శ్వాస నాడీగ్రంథి) వెన్నెపాములో నుండును. రక్తము మాలిన్యముఁ జెందినప్పుడు ఆగ్రంథి చేఱుకుఁజెందును. హృదయగ్రంథిఁ గూడ నప్పుడే చేఱుకుఁజెంది, రక్తనిర్మలినీ కరణమునకుఁ బూనుకొనును. రక్తము శుద్ధిగానుండి బహిష్కారపదార్థములు తక్కువగా నున్నప్పుడు ఈగ్రంథులు స్వస్థతఁజెందును. దేహపరిశ్రమ కాలమందు యివి చేఱుకుగా నుండుట యవసరము. నిద్రాకాలమందు ప్రాణవాయువు నెమ్మదిగా స్వీకరింపఁబడుటచే శ్వాస ఉద్రేకముగా నాడనవసరముండదు

ఊపిరివిడుచుట పా. ఇందుకు కండరశక్తి అంతగా అవసరములేదు. వ్యాకోచముఁజెందిన భాగములన్నియు తమంతట తామే యథాస్థితిఁ జెందుటచేత, తిత్తులుగూడ తను మొదటి స్థితికివచ్చి నిశ్వ్వాసము జరుగును. కాని తుమ్మునప్పుడును దగ్గునప్పుడును గర్భకండరములు చేదుకొని, మధ్యతెరను పైకెత్తి ప్రక్కయెముకలను క్రిందికి లాగుటచేత బలముగా నిశ్వాసముజరుగును నిట్టూర్పుఁగూడ నిట్టిదే శ్వాసక్రియ జరుగుటకు గర్భకుహర కండరములు పనిచేయవలసి యుండును గాన వాని నాటంకపఱచునట్టి బిగుతు పటకాలు మొండైన నడికట్లు అన్నియు అనారోగ్యకరములు గాన, వాని నుపయోగింపకూడదు.

ఊపు పా (స్వింగ్.)

ఊబ, దే వి. 1. నపుంసకుఁడు: చూ, సావిదల్లుఁడు; 2. నపుంసకత్వము: చూ, షండత్వము

ఊబవాఁడు. దే. వి. 1 నపుంసకుఁడు: చూ, సాకుదల్లుఁడు; 2. ఊబశేరి.

ఊబి. దే. వి. అడుసు: చూ, బురద.

ఊషము. సం. వి. అ. న. 1. ఒకానొక దేశము: చూ, దేశము; పుం 2. ఆకాశము: చూ, విన్ను; 3. త్రోపు: చూ, నిషేధము.

ఊయల. ద్వ. వి డోలిక. రూ-ఊయాల: చూ, పాలకి

ఊయాల. ద్వ. వి.—పై —(రూ-ఊయల)

ఊయెల. ద్వ. వి.—పై.—(రూ-ఊయేల.)

ఊయేల. ద్వ. వి —పై —(రూ-ఊయెల.)

ఊరఁగంద. ద్వ. వి. (ఊర + కంద.) పాటిదొడ్లలో పైరుచేసెడు కంద *: చూ, కంద. (కాంతి.—పులుసు, బెల్లము; కూరల కుపయోగింతురు)

ఊరఁబంది. దే. వి. (ఊరన్ + పంది.) 1. గ్రామసూకరము: చూ, సూకరము; 2. బలిసినవానిని హేళనముచేయునపుడు వాడెడు శబ్దము. "నీవు ఊరఁబందివలె నున్నావు" (గోదావరి లోనగు మండలములలో వాడుక.)

ఊరఁబిచ్చిక. దే. వి. (ఊరన్ + పిచ్చిక.) ఇండ్లపట్టునఁ దిరిగాడు ఒకరకము పిట్ట, చటకము: చూ, పిచ్చుక. (వీర్యవృద్ధికరమగు లేహ్యములలో దీనిమాంసము కలియును.)

ఊరఁబోవు. దే. అ. క్రి. (ఊరన్ + పోవు.) క్షయించు, తగ్గు. "సీ. తలపోఁత లలకు వెగ్గలమయ్యె భావంబునాఁటఁ బోరిఁబోరి నూరఁబోవ." హరి. ఉ 7, ఆ 193: చూ, సుక్కు. 9.

ఊరక. దే. అవ్య. 1 ఏదేని యొకటిలేక యను నర్థమును దెలిపెడి "రిత్తబవరంబున నాఁడి చావు పావనిట్లూరక యుంటమేలె." భార. ఉద్యో. 3, ఆ 268. (ఇక్కడ ఊరక యనఁగాఁ బ్రయత్నములేక యని యర్థము.) "ద్వి. రాముఁడు నన్నునూరక యేల చంపు." రా కిష్కింధ, కాం. 211. (ఇక్కడ ఊరకయనఁగాఁ గారణములేకయని యర్థము. ఇట్లు తక్కినచోట్లను సందర్భానుసారముగా అర్థమునూహింపవలయును.) . (రూ-ఉరక.) : చూ, మిన్నక; హా. 2. ఊరక, మిన్నక తూష్ణీమర్థకములు.

ఊరగోఁగు. దే. వి. (ఊరన్ + గోఁగు.): చూ, తీష్ణ *: చూ, కొండగోనుగు.

ఊరజోగి. ద్వి. వి. (ఊరన్ + జోగి.) బిచ్చపుజోగి: చూ, యాచకుఁడు.

ఊరట. దే. వి అవరతి. రూ- ఊఱట: చూ, విశ్రాంతి 2.

ఊరణాక్షము సం. వి. అ. పుం. తగిరిస*: చూ, ప్రపున్నాటము.

ఊరపేరఁబిలుచుట. జా. ఊరిలో పేరుపెట్టి పిలిచినను దొరకఁడు. "ఊరిలో నేలేనపుడు వానికిని బొత్తిగా నాకరములేదు".

ఊరబీర. దే. వి. (ఊరన్ + బీర.) ఘోషకము, ఆవడ *: చూ, బీర. 2

ఊరరి సం. వి. ఈ. స్త్రీ. 1. వెడల్పు: చూ, వెడలుపు; అవ్య. 2. అంగీకారార్థకము: చూ, సమ్మతము (చూ, ఊరీ)

ఊరవ్యుఁడు సం. వి. అ. పుం. కోమటి, బ్రహ్మదేవుని తొడలవలన బుట్టినవాఁడు: చూ, వైశ్యుఁడు.

ఊరాఱుచు. ద్వి. స. క్రి (ఊరుపు + ఆఱుచు.) రూ-ఊరార్చు, ఊఱడించు చూ, ఓదారుచు

ఊరార్చు. ద్వి. స క్రి.—వై.—"క. ఊరార్చి యింక నుచితాచారంబుల నడపుటయ యిష్టఁగృత్యము." భార. మా. 1, ఆ. 203; భాగ. విరా. 2, ఆ 128.

ఊరి: చూ, రూ-ఊరరి.

ఊరిపైనూరుబడ్డను గరణముపైఁగాసుపడదు. లో "ఉదా.—ఊరిపైనూరు బడినను గరణముపైఁ గాసైనఁ బడదను వడువుఁజేలు పైడైనమికేమి" ధర్మజరాజసూయము.

ఊరీకృతము. సం. విశ. (అ. ఆ. అ.) రూ-ఉరీకృతము అంగీకరింపఁబడినది: చూ, స్వీకృతము; 2. విరివియైనది: చూ, వ్యాపము 4.

ఊరు. దే. వి. 1. గ్రామము, గామము: చూ, దేశము; 2. ఆణియము. "రాజొక్కఁడూర లేఁడు." సా. 2, ఆ; 3 తనదేశముకాని పైదేశము. "ఊరికిఁబంచివచ్చితివో యొజ్జేను." శశాం 3, అ. 7; హరి. ఉ. 10, ఆ 383: చూ, దేశాంతరము; 4 ఏఁడికోలలేని నాఁగలి: చూ, నాఁగలి (చూ, ఇనుపనాఁగలి, అరక, లాంగలము, ఆవిరి నాఁగళ్ళు.); అ. క్రి. 5. లోపలనుండి జలాదికము వెలికిఁదాఁచు

"నీళ్లూరెను.": చూ, స్రవించు; 6 ఊరిన ఊటచే నాను,ద్రవ ద్రవ్యముసోఁకున బహుకాలముండు. "నిమ్మకాయ ఊరెను.": చూ, నాను; 7. తడిగలదియగు. "నోరూరుచున్నది": చూ, ఆర్ద్రింబగు; 8. జన్మించు "అసలూరఁగా" క్షేత్రియ: చూ, పుట్టు 2. (ప్రే ఊరించు)

ఊరుఁగాయ. దే వి. (ఊరు + కాయ) ఉపదంశము, అన్నములో నంచుకొను ఉప్పుఁగాయ: చూ, రుచిఁగాయ.

ఊరుఁబిండి. ద్వ. వి. (ఊరు + పిండి.) 1. పులుచిగా నూరిన పుల్లఊరుఁబిండి, పచ్చడి: చూ, భక్ష్యము; 2. తెలికఁబిండి మజ్జిగలో నానఁబెట్టి చేయునది (ఊరుఁబిండి వడియములు.) చూ, భక్ష్యము.

ఊరుకొను. దే స. క్రి. ఆఘ్రాణించు, రూ- మూరుకొను "క. ఈనీతిఁబొదల మెదలుచు, నాకీతిలకంబు మేనిమచ్చికయిచ్చెన్, గోకనదసహకారక, కోరకము మూరుకొని వడినిగుడన్ ?మకించెన్." వసు. 3, ఆ. 119: చూ. మూర్కొను.

ఊరుఘట్టనము. సం. వి. అ న. ఒకానొక రతిబంధము: చూ, రతిబంధము

ఊరుచు. వై. స. క్రి. 1.=ఊర్చు ఊపిరివిడుచు. (రూ-ఊర్చు.); 2 గంధపుచెక్క లోనగు వానితో అరుగఁదీయఁగా వచ్చిన గంధము లోనగుదానిని చేతితో ఎత్తు: రూ-ఊర్చు, ఎత్తు.

ఊరుజాఁడు. సం. వి. అ. పుం: చూ, ఊరవ్యుఁడు.

ఊరుపర్వము సం వి. ద్వి. న. జానువు, తొడలయొక్క కనుపు: చూ, మోఁకాలు.

ఊరుపీడితము. సం. వి. అ. న: చూ, ఊరుఘట్టనము.

ఊరుపు. వై. వి. 1. రూ-ఊర్పు, ఊపిరి. చూ, శ్వాసము; 2. రూ-ఊర్పు. ఉష్ణము: చూ, వేఁడిమి; 3 రూ-ఊర్పు,బజ్జి: చూ, భక్ష్యము.

ఊసరి చూ, ఊరరి

ఊరులు. అం. 1. స్త్రీసాముద్రిక శాస్త్రము నందలి లక్షణాంగము లేఁబదియెనిమిదింటిలో పదిరెండవది. ఊరులు (తొడలు.) అరఁటిచెట్లవలెను పెదచెయ్యివలెను ఏనుఁగుతొండమువలెను నుండి రోమములులేకున్న పూజ్యురాలగు. సన్నములై రోమసహితములయిన విధవయగు: చూ, స్త్రీలక్షణాంగములు; 2. పురుషసాముద్రిక శాస్త్రమునందలి లక్షణాంగములు యేఁబదియెనిమిదింటిలో పదిరెండవది. ఊరులు (తొడలు) పొడవులై మాంసయుక్తములై లావులై రోమరహితములై శల్యములు కానరాకున్న దేశాధిపతియగు: చూ, లక్షణాంగములు.

ఊరువు. సం. వి. ఉ. పుం. 1. ఉత్సంగము, తొడ: చూ, సక్థి. (ఉపమితి బహువ్రీహిసమాసమందు ఈశబ్దము దీర్ఘాంతముగా నుండును.); ఊ స్త్రీ. 2. ఒకానొక నక్షత్రస్థానము: చూ, నక్షత్రము.

ఊరువేష్టితము. సం.వి.అ.న: చూ, ఊరుఘట్టనము.

ఊరుస్తంభ సం. వి. ఆ. స్త్రీ. అరఁటి*: చూ, రంభ 2.

ఊరుస్తంభము. సం. వి. అ. పుం. ఒకానొక రోగము: చూ, రోగము 1.

ఊరూఢము. సం. విశే. (అ. ఆ. అ.) తొడల చేత వహింపఁబడినది.

ఊరూత్థుఁడు. సం. వి. అ. పుం: చూ, ఊరవ్యుఁడు.

ఊరూపగూహనము. సం. వి. అ. న. ఒకవిధమగు కౌఁగిలింత: చూ, కౌఁగిలి.

ఊరూపవిష్టుఁడు. సం. వి. అ. పుం. తొడలలోఁ గూర్చున్నవాఁడు.

ఊరేగింపు. దే. వి. ఏగుపెండ్లి: చూ, మెఱవణి.

ఊరేగు. దే. అ. క్రి. (ఊరు + ఏగు) మెఱవడి పోవు. "పాలకిమీఁద దంపతు లూరేగిరి.": చూ, మెఱవణిపోవు.

ఊర్క్. సం. వి. జ్. స్త్రీ. బలిమి: చూ, శక్తి. 1.

ఊర్చు. వై. స. క్రి: చూ, రూ-ఊరుచు.

ఊర్జకము. సం వి. అ. పుం అటికము, క్రీవల్లి*: చూ, బకపుష్పము.

ఊర్జము. సం. వి. అ పుం. 1. కార్తికమాసము: (చూ, బహులము): చూ, మాసము. 1; 2. ఉత్సాహము, పూనిక: చూ, యత్నము; 3. బలము: చూ, శక్తి. 1; 4. ఊపిరి వెలికిఁ బుచ్చుట: చూ, శ్వాసము.

ఊర్జస్వలుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) 1. మిక్కిలి యుత్సాహముగలవాఁడు, ఆనందుఁడు: చూ, వ్యాపృతుఁడు; 2. మిక్కిలి బలముగలవాఁడు: చూ, లావరి.

ఊర్జస్వి. సం. విశే. (న్. ఈ. న్.)—పై—; 3. ఒకానొక యలంకారము: చూ, హేతువు 2.

ఊర్జితము. సం. విశే (అ. ఆ. అ.) దృఢము, గట్టి చేవ: చూ, స్థైర్యము. 1.

ఊర్ణ. సం. వి. ఆ. స్త్రీ 1 గొఱ్ఱె కుందేలు యెలిక మొదలైనవాని రోమము: చూ, వెండ్రుక. 1; 2. సన్నని నూలుపోఁగు: చూ, పోఁగు. 1; 3 కనుబొమ్మల నడుమసుడి (ఇది మహాపురుషలక్షణము.): చూ, లక్షణము. 1; (చూ, సుడి. 1.)

ఊర్ణనాభము. సం. వి. అ. పుం. 1. లూత: చూ, సాలెపురుగు; 2. అయిదు వ్రేళ్ళను గొంచెముగా వంచి కొనలఁ గూడకపట్టిన యొకానొక అభినయహస్తము: చూ, వ్యంజకము. 1.

ఊర్ణనాభి. సం. వి. ఇ. పుం. లూత: చూ, సాలెపురుగు.

ఊర్ణము సం. వి. అ. పుం. గొఱ్ఱె: చూ, మేషము. 1.

ఊర్ణాయువు. సం. వి. ఉ. పుం. 1.—పై.— 2. గొఱ్ఱె తుప్పటికంబళి: చూ, రల్లకము 3. లూత: చూ, సాలెపురుగు.

ఊర్ణవాభి. సం వి. ఇ. పుం. లూత: చూ, సాలెపురుగు.

ఊర్ధ్వగుఁడు. సం. వి. అ. పుం 1. రక్కసుఁడు: చూ, రాక్షసుఁడు. 1; 2. బంటు: చూ హంవీరుఁడు. 2.

ఊర్ధ్వంధముఁడు. సం వి. అ పుం. ఊర్ధ్వస్థుఁడు: చూ, నిలుచున్నవాఁడు.

ఊర్ధ్వఅంసపృష్ఠీయ వాయువు. పా. (మసిల్ సూప్రాస్పైనేటస్.)

ఊర్ధ్వకంటక. సం. వి. ఆ స్త్రీ. పిన్నపీఁచరి *: చూ, శతమూలి.

ఊర్ధ్వకము. సం. వి. అ. పుం. యవమధ్యమవంటి నడుముగల మర్దలము: చూ, మృదగము. 1. (చూ, పీఠా.)

ఊర్ధ్వకంఠి. సం. వి. ఈ. స్త్రీ పెద్దపిల్లిపీఁచర *: చూ, శతమూలి.

ఊర్ధ్వకేశము సం. వి. అ. పుం. విధవా లక్షణము: చూ, లక్షణము. 1.

ఊర్ధ్వగతరక్తపిత్తము. పా. దగ్గులో రక్తము పడుట (హిమాప్టిసిస్.)

ఊర్ధ్వగము. సం. వి. అ. న. ఒకానొక సంగమము: చూ, సంయోగము.

ఊర్ధ్వజానువు. సం. విశే. ఉ. 1. పొడుగమోఁకాళ్లవాఁడు: ఊర్ధ్వజ్ఞుఁడు; (తె. ప): కొంగ కాళ్ళవాఁడు, గెడ కాళ్ళవాఁడు 2: చూ, లేచినవాఁడు.

ఊర్ధ్వజ్ఞుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) -పై-

ఊర్ధ్వతంతువులు. పా. (ఎయిర్ ఎల్ హైఫియా)

ఊర్ధ్వతిర్యక్ స్నాయువు. పా. (మసెల్ సుపీరియర్ ఆబ్లిక్.)

ఊర్ధ్వదేవుఁడు. సం. వి. అ. పుం. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1.

ఊర్ధ్వనఖము. సం. వి. అ. పుం. దాసీలక్షణము: చూ, లక్షణము. 1.

ఊర్ధ్వనాసిక. సం. వి. ఆ. స్త్రీ.—పై.—

ఊర్ధ్వపాతనము. పా. (సబ్లిమేషన్.)

ఊర్ధ్వపాదము. సం. వి. అ. పుం. మీఁగండ్ల మెకము: చూ, శరభము. 1.

ఊర్ధ్వపుండ్రధారణము. పా. "క. విను మూర్ధ్వపుండ్రధారణ, మొనరించినయట్టి భూసురోత్తముఁడు జగం, బున నెల్లఁ బూజ్యుఁడై తుది, ననుపమ సురయానమెక్కి- హరిపురి కరుగున్." "క. తిరుమణి వెట్టిన సద్విజ. వరుఁ జూచిన నణఁగుఁ బాప - వర్గంబెల్లం, గర మర్థిఁ జేరి మ్రొక్కినఁ, బరికింపఁగ సకల దాన - ఫలములఁ బొందున్." పద్మపురాణము. 5, ఆ; "క. ఏజాతివారలైనను, భూజనములు నుదుట భూతిఁ - బూసిన మాత్రం, దేజమున సర్వమానవ, పూజితులై శివపదంబుఁ బొందుదురనఘా." బ్రహ్మోత్తర ఖండము. 5, ఆ.

ఊర్ధ్వపుండ్రము. సం. వి. అ. పుం. ఒకానొక బొట్టు: చూ, బొట్టు. 1.

ఊర్ధ్వబిందువు. పా. (జెనిత్.)

ఊర్ధ్వబృహత్సిర. పా. (సుపీరియర్ వీనాకావా.)

ఊర్ధ్వము. సం. విశే. (అ. ఆ. అ.) 1. పొడవైనది: చూ, పొడవు. 2; 2. మీఁదికెత్తఁబడినది: చూ, సముదక్తము; 3. మీఁదిది: చూ, మీఁదు. 2; అ. న. 4. ఆకాశము: చూ, మిన్ను.

ఊర్ధ్వమూలము. సం. వి. అ. పుం. ఒకరకము గడ్డి: చూ, తృణము. 1.

ఊర్ధ్వరేతసుఁడు. సం. వి. స. పుం. 1. ఋషి: చూ, ముని. 1; 2. ముక్కంటి: చూ, శివుఁడు.

ఊర్ధ్వలింగుఁడు. సం. వి. అ. పుం ముక్కంటి: చూ, శివుఁడు.

ఊర్ధ్వలోకము. సం. వి అ. పుం. వేల్పుటింటి. "ఆ. ఊర్ధ్వలోకమందు నుచితక్రమంబున, గూప మేమిలేక యూర్ధ్వనుండఁ, బరమయోగి చూచుఁ బరమాత్ముఁడితఁడని, విశ్వ... వేమ." వేమన. 565: చూ, స్వర్గము.

ఊర్ధ్వలోకములు. అం. భూలోకము, భువర్లోకము, సువర్లోకము, మహర్లోకము, జనలోకము, తపోలోకము, సత్యలోకము. (7)

ఊర్ధ్వలోచనము సం. వి. అ. పుం. మీఁగండ్ల మెకము: చూ, శరభము. 1.

ఊర్ధ్వవృత్తము. పా. శ్వాసకోశములు రెండును దాదాపుగా హృదయకుహరమునంత వ్యాక్రమించుకొని యుండును. హృదయము శ్వాసకోశములచే నించుమించుగా చుట్టఁబడియున్నది. ఈరెంటిలో కుడిపుపుసము మూఁడు వృత్తములను గలదిగానున్నది. అవి వరుసగా ఊర్ధ్వవృత్తము, మధ్యవృత్తము, అధోవృత్తము అనఁబడును.

ఊర్ధ్వశీలము. సం. వి. అ. పుం. అగ్ని: చూ, నిప్పు.

ఊర్ధ్వశ్వాస. సం. వి. ఆ. స్త్రీ. ఎగఊపిరి: చూ, శ్వాసము.

ఊర్ధ్వశ్వాసము. సం. వి. అ. పుం.—పై.—

ఊర్ధ్వస్థితి. సం. వి. ఇ. స్త్రీ. మెడకు పైనుండు సుడి, పురుషికము: చూ, సుడి. 1.

ఊర్ధ్వస్థుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) ఊర్ధ్వంధముఁడు: చూ, నిలుచున్నవాఁడు.

ఊర్ధ్వాసిత. సం. వి. అ. స్త్రీ. పటోలిక *: చూ, పొట్ల.

ఊర్పు: చూ, రూ-ఊరుపు.

ఊర్పుచ్చు. ద్వ. స. క్రి. ఊపిరి వెడలఁజేయు

ఊర్పోక. ద్వ. వి. (ఊర్పు + పోక.) ఊసుపోక. "సీ. ఘనునొద్దనుండియుఁ దన కాసపడియె నేఁబొలఁతుకకు దియనూర్పోక కూర్మి." కవిక. 4, ఆ. 121: చూ, ఊబుసుపోక.

ఊర్పోవు. ద్వ. అ. క్రి. (ఊర్పు + పోవు) ఊపిరి వెడలు. "శా. ఆదైతేయ వీరుల్ దిశా, సర్వద్దీప్త జటానటాలపటు శస్త్రఁవాతముల్ పొంద్రమై, యూర్పోకుండఁగ నించినన్ మురహారుండుద్దాము కోపాగ్నియై." నిర్వ. 3, ఆ. 17. (ప్రే. ఊర్పుచ్చు. "శా. కంపం బొందె......నిశాచరప్రభుఁడు వార్ధిస్వామి యూర్పుచ్చె." శేష. 5, ఆ.)

ఊర్మి. సం. వి. ఇ. పుం, స్త్రీ 1. అల: చూ, వీచి. 1; 2. పెద్దఅల: చూ, వీచి 1; 3.తహతిహ: చూ, సంభ్రమము 1; 4.నొప్పి,బాధ: చూ, దుఃఖము; 5. క్రమపద్ధతి, ఓఘము: చూ, పరంపర; 6. (వస్త్రము) ముడుత: చూ, వళి. 2; 7. (కడుపు మొదలయిన వానియందుండు) మూఁడుముడుతలు: చూ, వళి. 2; 8. జ్యోతి: చూ, వెలుతురు. 1; 9. అంపాచారము: చూ, ప్రవాహము. 1; 10. వక్రము: చూ, వంకర; స్త్రీ. 11.=ఉమ్మి: చూ, గల్యము.

ఊర్మిక. సం. వి. అ. స్త్రీ. 1. అల: చూ, వీచి.1; 2. ఉంగరము: చూ, భూషణము. 2; 3. (వస్త్రము) ముడుత: చూ, వళి. 2; 4. (కోశకుచ్ఛృష్ట్యు.) ముడుత: చూ, వళి. 2; 5. చిటికెనవేప్రిలు. (వేళ్ళమీఁద కరుడువలె నుండునది.); (వ్యా, పిల్లవేప్రిలు.): చూ, వేలు.2; 6 తుమ్మెదల ఝుంకారము, ఊం: చూ, స్వరము. 2.

ఊర్మిమత్తు సం. విణ త్. వంకరైనది: చూ, వంకర.

ఊర్మిమాలి. సం. వి. న్. పుం. కడలి: చూ, సముద్రము.

ఊర్మిళ. సం. వి. ఆ. స్త్రీ. 1. జనక మహారాజు కూఁతురు: చూ, పుత్రిక. 1; 2. మగని నెడఁబాసిన పతివ్రత: చూ, స్త్రీ; 3. లక్ష్మణుని భార్య: చూ, భార్య.

ఊర్ములు. అం. క్షుత్తు, తృష్ణ, శోకము, మోహము, జర, మరణము. (6)

ఊర్వర. సం వి. ఆ. స్త్రీ. అన్ని పయిరులచేత నిండిననేల: చూ, భూమి. 1.

ఊర్వశి. సం. వి. ఈ. స్త్రీ. ఒకానొక అప్సర స్త్రీ: "సీ పదునాల్గుజాతుల త్రిదశాంగనలయందుఁ బేరు పెంపునుగల నీరజాక్షి, నీరజనాభుని యూరుకాండంబున నుద్భవంబందిన యుజ్జ్వలాంగి, యంభోనిధానంబు నాపోశనముఁగొన్న కలశసంభవుఁగన్న కంబుకంఠి,వసుధయందుఁ బురూరవశ్చక్రవర్తికిఁ బ్రాణవల్లభ యైనఁ బద్మనయన. గీ. కట్టిలోడిపూసి కైసేసి కాతుకమునఁ,గొసదిగఁగ నీలిపుట్టంబుమునుఁగు వెట్టి, గాజులెగద్రోసి చేప్పుడుగాకయుండ, వచ్చెనూర్వశి యద్దునావాసమునకు." హర. 7, ఆ. 119; "సీ. రంభకు...... ద్రిభువనముల, నూర్వశి కాంతకును సాటి యువిదగలదె." షట్చక్రవర్తి చరిత్ర. 6, ఆ. 180; "సీ. చరణ మంజీరపుంజరవప్రమాణంబు భ్రశే భగతి విలంబనము దెలుప,...... మోహన మంత్ర దేవతయనంగఁ, జనియెనూర్వశి సుర రాజ సన్నిధికిని." ప్ర. 4, ఆ: చూ, వేలుపులు. 2. (రూ-ఊర్వసి.)

ఊర్వశీపురూరవులు. పా. "సీ. ఉచ్ఛిష్టమున కోర్చి యుండుమన్నను నాజ్ఞదాటనిజేనం టు దానఁగాను, పంచబాణునికేళిఁ బగలుగాంక్షించుచుఁ దమకింపసరుదెంచు దానఁగాను. బహుమాన మెనయంగఁ బల్కి పిల్వంపక కాని యేనరుదెంచు దానఁగాను, నగ్నుండవగుచు ముందఱవచ్చినిల్చిన దర్శించియుండెడి దానఁ గాను గీ. కన్నబిడ్డలవలెఁ బెంచుకొన్నయట్టి, తగరు లెడఁబాయ నోర్చెడు దానఁగాను, గానసీమేర నిలుపంగఁ గలిగితేని, నీకులోన య్యెదను ధారుణీతలేశ." పట్టుకిప్రకి చరిత్ర. పూరూ. 6, ఆ. 124. (వర్ణన.)

ఊర్వశీవల్లభుఁడు. సం. వి. అ. పుం. పురూరవుఁడు, ఐలుఁడు, బౌధుఁడు: చూ, రాజు 1.

ఊర్వారుకము. సం. వి. అ. న. వాలుకము *: చూ, బుడమ. (రూ-ఉర్వారుకము.)

ఊఱట. దే. వి. 1. విరామము, తెఱపి. "సీ. కోలుమసంగెడి కోర్కుల వెనువెంటఁ బాఱుచు ననికికి నూఱటయును." భార. విరా. 2, ఆ. 815: చూ, విశ్రాంతి. 2; 2. ఆశ్వాసము, ఊఱడించుట. "ఉ. అంతలు నేసి పోనడిచి యక్కట సంజయుచేతఁ జెప్పిపుత్తెంచుకొ యిట్టియూఱట మదిం బ్రియమందె యుధిష్ఠిరుండు." భార. ఉద్యో. 3, ఆ. 101; భార. విరా. 3, ఆ. 68: చూ, ప్రశ్రయము; విణ. 3. సహాయము. "ఎ, గీ. మందడీలకెల్ల నూఱటయగు మ వర్తిల్లనేర్తు" భార. విరా. 1, ఆ. 95: చూ, వెంబడి.

ఊఱడించు. దే. స. క్రి. ఆశ్వాసించు: చూ, ఓదార్చుఁ

ఊఱడింపఁబడినవాఁడు. దే. వి. ఆశ్వాసింపఁబడిన వాఁడు: చూ, అనునీతుఁడు.

ఊఱడిల్లు. దే. అ. క్రి. అడఁగారు : చూ, క్రిక్క. 4.

ఊఱడు. దే. అ. క్రి.—పై.—"క. కొఱడవిఁ బఱచుమృగములు, నూఱడకవఁగించి." భార. ఆది. 4, ఆ. 19.

ఊఱబీఱ. దే. వి. ఒకరకము బీఱ *: చూ, బీఱ 2.

ఊఱు. దే. స. క్రి. ఉద్గిరించు. "ఉ. వేళ్లొకవంకఁగొండగుహ వేళ్ళముగాఁగ నులూకభర్త తన్నూఱిన యంతలేసి బలియుర్గిల వాఁడుపమర్దనాముఁడా, యీఱమునందురేలు తమ యిచ్చలమేసి దినంబులాగునాక్, దూఱి వసించుచుండి." పంచ. నా. 3, ఆ. 9: చూ, సరిసోలు.

ఊల. దే. వి. 1. రూ-ఊళ. నక్కకూఁత: చూ, స్వరము. 2; 2. రూ-ఊళ. ఈల, తిన్కగ సంకేతధ్వని: చూ, స్వరము. 2.

ఊలమాలగుడుచు. దే. అ. క్రి. (ఊలమాల + గుడుచు.) తహతహపడు. "ద్వి. చిడిముడిఁ బొందుచు సిగమిట్టి మిట్టిపడఁగఁ బల్కులు తొట్రుపడ నూలమాల, గుడుచుచు." నవ. 3, భా: చూ, సంభ్రమించు.

ఊలిక. సం. వి. ఆ. స్త్రీ. ప్రశోలిక, చాతా: చూ, పాలకి.

ఊలుకము. సం. వి. అ. పుం. చిఱుతూర *: చూ, ఖండీరము. 2.

ఊలుకొను. దే. స. క్రి. అంగీకరించు : చూ, సమ్మతించు. (రూ-ఊల్కొను.)

ఊవాడు. దే. అ. క్రి. (ఊవి + ఆడు.): రూ-ఊగాడు. "క. అలరుంబోఁడులలోపల, నలరుంబోఁడుములు నీకు నగ్గలమగుచునాక్, దల పూవాడక యుండుము, తలపూవుధరించి వికచతామరసాక్షి." పా. 1, ఆ. 64: చూ, వ్రేలాడు.

ఊవు. దే అ. క్రి. 1.—పై.—; 2. చలించు: చూ, సలించు. (రూ-ఊఁగు.)

ఊషమంజరము. సం. వి. అ. న. పఱ్ఱఉప్పు: చూ, లవణము. 1.

ఊషక్షారము. సం. వి. అ. న. చౌటియుప్పు: చూ, లవణము 1.

ఊషణ. సం. వి. ఆ. స్త్రీ. పిప్పలితీఁగె, అమృత *: చూ, పిప్పలి. 1.

ఊషణము. సం. వి. అ. న: చూ, రూ- ఉష ణము.

ఊషము. సం. వి. అ. పుం. 1. అహార్ముఖము: చూ, వేగుజాము; 2. చవుటినేల (విత్తనము నుజెఱుచునది.): చూ, భూమి. 1.

ఊషరబీజన్యాయము. పా. చేవుటినేలలో విత్తన ము పెట్టిన రీతి. (నిరుపయోగము.)

ఊషరము. సం. విణ. (అ. ఆ. అ.) 1. చేవుటి నేల: చూ, భూమి. 1; 2. చౌటియుప్పు: చూ, లవణము. 1; 3. చేవుటిది. (నేల.)

ఊషవంతము. సం. విణ. త్. చేవుటినేల: చూ, భూమి. 1.

ఊషరవృష్టిన్యాయము. పా. చౌటినేల వర్షముఁ గురిసినరీతి. (బూడిదెలోఁబోసిన పన్నీరు.)

ఊష్మకము. సం. వి. అ. పుం. గ్రీష్మఋతువు, వేసఁగి. (దుఃఖపెట్టునది.): చూ, మాసద్వయ ము; 2. ఊష్మము, ఆవిరి: చూ, ఔష్ణ్యము.

ఊష్మము. సం. వి. న్. పుం. 1. ఊష్మకము, ఆవిరి: చూ, ఔష్ణ్యము; 2. గ్రీష్మఋతువు, వేసఁగి: చూ, మాసద్వయము; 3. గర్వము: చూ, హంకారము; 4. కన్నీరు: చూ, రోదనము; 5. ఎండ: చూ, వెలుఁగు. 3.

ఊష్మములు. పా. శ-ష-స-హ లు. (స్పర్శ ములు 25, అంతస్థములు 4, ఊష్మములు 4, క్ష 1. ఈ 34-లో పరుషములు 5, సరళ ములు 5. ఈ 10 యక్షరములు పోను మిగి లిన 24 యక్షరములకు "స్థిరము" లనిపేరు. 'స' కారముస్థిరములలోఁ జేరినను దానికి ద్రుత మని మఱియొక పేరును గలదు.) (చూ, అంత స్థములు.)

ఊష్మలము. సం. విణ. (అ. ఆ. అ.) ఉష్మ గలది. భార. శాం. 1, ఆ. 47-81: చూ, మిడి. 4.

ఊష్మలుఁడు. సం. వి. అ. పుం. 1. సూత్థా నుఁడు, శేర్పరి: చూ, సమర్థుఁడు; 2. శరీ రము దాఁచని బంటు, ఉష్ణుఁడు: చూ, భటుఁడు. 1.

ఊష్మాగమము. సం. వి. అ. పుం. గ్రీష్మఋతువు. (దీనియందు ఊష్మముయొక్క రాకగలదు.): చూ, మాసద్వయము.

ఊష్మోపగమము సం. వి. అ పుం.—పై.—

ఊసర. వై. వి.=ఊషరః. (చేవుటిది.) నేల: చూ, భూమి. 1. (రూ-ఊసరము )

ఊసరము వై. వి. 1=ఊషరః—పై.—; దే. విణ. 2. కృశించినది: చూ, సొరవు.

ఊసరవెల్లి. దే. వి. బింబకము, మూఁడువన్నెలు గల తొండ. "ఎ, గీ. వేగనేకెంచి యూసర వెల్లితొండ, పాదమూలనుండి తలదాఁకఁ బ్రాఁకనేని, నతఁడు షణ్మాసములఁజూచు యముని మొగము." కాశీ. 5, ఆ. 261: చూ, సరటము.

ఊసరిల్లి. దే. వి —పై.— "ఆ. ఊసరిల్లి పిచ్చి యూపమున రసమును, జేర్చి నూరి సతులు చెలువముగను, వశ్యమనుచు మగని వరియించి పెట్టంగ, రోగమమరినిల్లు రూఢి వేమ." వేమన 575.

ఊసరిల్లు. దే. అ. క్రి. కృశించు: చూ, సొట సొటవోవు.

ఊసివాసము వై. వి =ఉచ్ఛ్వాసః. ఊర్ధ్వశ్వా: చూ, నూడు. 1.

ఊసు. దే. వి 1 పనిలేనికాలము: చూ, రూ- ఊబుసు. 1; 2. వృత్తాంతము, రూ-ఊబుసు,

"కి. జనపతికినింక నేనే, మని చెప్పిన నేమి యగును నది గడచనెపై, నను నూసుపోక వెండియు, ననియెద నొకమాట రఘువరానుజ నీతోఁ" నిర్వ. 9, ఆ. 26: చూ, సమాచారము. 2.

ఊసుపోక. ద్వ. వి: చూ, రూ-ఊబుసుపోక.

ఊహ. సం. వి. ఆ. స్త్రీ. అపోహమును బోఁగొట్టెడి బుద్ధి, వితర్కము, అనుమానము: చూ, యోచన. (హైపోతెసిస్.)

ఊహని. సం. వి. ఈ. స్త్రీ. చీఁపురు: చూ, సమ్మార్జని.

ఊహాపోహాలు సం. వి. అ. పుం. ఆవశ్యకమైన దానిని తెచ్చుకొని అనావశ్యకమును వదలుట. "నీ యూహాపోహాలకు నేను సంతసించితిని."

ఊహము. సం. వి. అ. పుం. 1 అపూర్వార్థము నుత్ప్రేక్షించుట: చూ, తర్కము. 2; 2 లేని మాటలు కొన్నింటినిఁ దెచ్చుకొనుట: చూ, హంసపాదము; 3 ఊహ: చూ, యోచన.

ఊహాసముద్రము పా. యోచన యను సాగరము. (దరిలేనిది)

ఊహించు. సం. స. క్రి. 1 ఆలోచించు: చూ, యోచించు; 2. ఫలపరిమితి నూహించు, అర్థించు: చూ, తోఁచు. 4.

ఊళ. దే. వి. నక్కకూఁత: చూ, రూ-ఊల.

ఊళమొకము. ద్వ. వి. జంబుకము: చూ, నక్క.

## ఋ.

ఋ. ఆంధ్రభాషకుఁగల వర్ణంబు లేఁబదియాఱు. అందు అచ్చులు పందొమ్మిది ఆ అచ్చుల లోనిది యేడవ యక్కరము; సంస్కృతంబునకు వర్ణంబులేఁబది. అందు అచ్చులు పదునాఱు. ఆ అచ్చులలోనిది యేడవ యక్కరము; (వర్ణంబులు=అక్షరములు; ఏఁబది=ఐదు పదులు.); సం. వి. ఋ. పుం. 1. ఏనుఁగు: చూ, హస్తి; 2. కొండ: చూ, పర్వతము; 3 మతి: చూ, బుద్ధి; 4. దేవుఁడు: చూ, వేలుపు; 5. పగవాఁడు: చూ, శత్రువు. 1; 6. ఊహ: చూ, యోచన; 7. కాంతియు: చూ, రంధ్రము. 1; 8 ఆకసము: చూ, విన్ను; 9 దేవతల తల్లి: చూ, దేవమాత 10. ఏఱు: చూ, నది; 11. కల్లు: చూ సుధ. 1; 12. మఱఁది అనఁగా మగని తమ్ముఁడు, దేవరుఁడు: చూ, మఱఁది; 13 అలవాటు: చూ, స్వభావము; అవ్య 14. వాక్యమును తెలుపును, కర్తకర్మక్రియాసంబంధము గలమాటను తెలుపును: చూ, వ్యాఖ్యాతము. 2; 15. పరస్పర సంభాషణమును తెలుపును, గుసగుస, ముచ్చటలాడుటను తెలుపును: చూ, సల్లాపము; 16. గర్హణము, ఏవగింపును తెలుపును. చూ, నింద. 1; అం. 17. మూర్ధన్యములు తొమ్మిదింటిలో నొకటి: చూ, మూర్ధన్యములు. (ఋ, ౠ, ట, ఠ, డ, ఢ, ణ, ర, ష.); పా. 18. ఋ (ృ) రు (ు) గల శబ్దములు.—"ఋ" వర్ణమును "రు" వర్ణముగాను "వట్రువసుడి"ని "కొమ్ము త్రావడి" గాను వ్రాయుట తప్పు. ఉదా.—ఋక్కు. ఋక్థము, ఋక్షగంధ...ఋష్యప్రోక్త ఇత్యాదులు. (సంస్కృతశబ్దములలో శబ్దాదినుండు హల్లులపై నీక్రింద నుదహరించిన శబ్దములం దప్ప, ఋకారము (ృ) లేని, రేఫఉకారము (కొమ్ము త్రాగ) లుండవు. తెనుఁగు నందు ఋకారమును, ఋకార చిహ్నమగు (ృ) వట్రువసుడి లేవు. ఉదా.—క్రుక్షా, క్రుష్టము (మొత్తపెట్టఁబడినది), క్రుధ, క్రుద్ధుఁడు, క్రూరుఁడు, గ్రుక్క, త్రుటి ఇత్యాదులు; శబ్దాదిని హల్లులపై ఋకారములు వచ్చు (ృ) కొన్ని శబ్దములు.—కృష్ణుఁడు, కృష, కృపణము,

హృషీకేశుఁడు ఇత్యాదులు; శబ్దమధ్యాంతములయందు వచ్చు ఋకారరేఫ ఉకారముల వివరణము.—శిగ్రు, విశ్రుత, శిశ్రూష, శత్రువు, వట్రువ ఇత్యాదులు; ఈ క్రింది నొక్కి పలుకరాదు.—అద్రుచెక్, విద్రుచెక్, చిద్రుపలు ఇత్యాదులు; రేఫ ఉకారము లంత మందుగలఁ శబ్దములు ఋహాదర్శకమందు కారమును పొందును. అట్టిచోట్ల రేఫఉకారములు వ్రాయవలయుననుట గుణింతముగా నుంచుకొనవలెను ఉదా.—ఇంద్రుఁడు, చంద్రుని, విప్రునిచేతఁ, మిత్రుని కొఱకు, నమ్రునివలనఁ; శమ్రునియందుఁ, దీప్రునకు.

N. B.—ఋకారము, రేఫ ఉకారములు సంకరమయిన యెడల శబ్దస్వరూపమునకు లోపమే కాక యతిప్రాసములయందు విరోధము గూడఁగలుగును. కావున వీనిం దెలియుట యావశ్యకము; 19: చూ, ఋూ. 22; 20. పదాద్యంబులు, ఋ ౡ వర్ణంబులు, రలతుల్యంబులు.—మాటకు మొదటనుండు ఋ వర్ణము రకారముతోను, ౡ వర్ణము లకారముతోను సమానములు. అనఁగా ఋ ౡ అచ్చులైనను అచ్చులకుఁ బరములైనప్పు డచ్చులవలె సంధి లోనగు కార్యములు జరుపరాదనియు హల్లులైన ర ల-ఋ పరమైనప్పుడెట్టి కార్యము జరుపఁబడునో యట్టులే జరుపఁబడుననియు నర్థము. (ప్రకీర్ణ. ౧. సూ.); ఉదా -అతఁడు ఋషి. సంధి. సూ. ౧౦ ప్రకారమిటు సంధి గలియదు; ఆ ఋషి. సంధి. సూ. ౧౬ ప్రకారము యడాగమము లేదు వచ్చె ఋషి. సంధి. సూ. ౨౯ ప్రకారము ద్రుతమునకు లోపము; వచ్చెన్ ఋషి. సంధి. సూ. ౩౪ ప్రకారము సంశ్లేషము వచ్చెన్నృషి; వచ్చెను ఋషి. సంధి. సూ. ౩౪ ప్రకారము స్వత్వము; 21. ఉజ్జులలోనిదియొకటి (ఉజ్జులు.—ఉ-ఋ-ౡ-ఏ-ఓ.); 22 అక్కులలోనిది యొకటి (అక్కులు.—అ-ఇ-ఉ-ఋ ౡ.); 23. ఇక్కులలో నొకటి. (ఇక్కులు.—ఇ-ఉ-ఋ-ౡ)

ఋకారాంతము పా. (సూ. 37.) ఋకారాంతంబు లదంతంబులు స్త్రీసమంబులు నగు. ఉదా.—పిత, మాత, స్వస, నప్త, హోత, పోత, ఉద్గాత, భ్రాత, జామాత, కర్త, భర్త, హర్త, గంత, హంత, నియంత మొదలైనవి. ఇవియన్నియు ఋకారాంతములు పితృ-మాతృ అని యిట్లు రూపములు గలవి. ఇవి అదంతములు స్త్రీసమములునగు.

ఋక్కు. సం. వి. జ. స్త్రీ. 1. ఋగ్వేదము. చతుర్వేదములలో నొకటి: "ఆ. ఋగ్యజుస్సులెఱిఁగి రాగ్యతలేకున్న, విప్రుఁడైన నెట్లు విహితుఁడగును." వేమన. 576: చూ, వేదము; 2 వేదభాగము: చూ, వేదము; 3. వేదాదివిద్యలు పదునెనిమిదింటిలో నొకటి. చూ, విద్యలు.

ఋక్కులు, పా. ఋ-ౡ. (ఋక్కులకు హ్రస్వఋక్కులు పరమైనప్పుడు పూర్వపరస్థానంబుల హ్రస్వఋక్కులు వైకల్పికముగ నగు.)

ఋక్థము. సం. వి. అ. న. 1. ధనము: చూ, విత్తము.1; 2. బంగారము: చూ, లోహము.1.

ఋక్షగంధ. సం. వి అ. స్త్రీ. బొద్ది *: చూ, వృద్ధదారకము. (ఎలుఁగువలె క్రిములను ఛేదించునది.)

ఋక్షగంధిక. క్షీరవిదారి * (ఎలుఁగుగొడ్డువలె క్రూరములైన శైత్యాదిరోగములఁ జెఱచునది. పాలుగల నేలగుమ్ముడు.): చూ, భూమికర్కారువు.

ఋక్షపర్వతము. సం. వి. అ. పుం. ఋక్షమను పేరుగల కొండ: చూ, పర్వతము.

ఋక్షభుఁడు. సం. వి. అ. పుం. ఇంద్రుఁడు: చూ, వేలుపుఱేఁడు.

ఋక్షము. సం. వి. అ న. 1. ఋక్కు. (చీఁకటిని బోఁగొట్టునది, సంచరించునది): చూ, నక్షత్రము. 1; 2. జ్యోతిష్కుల యొక్క శాస్త్రము (ఈ జ్యోతిషము నాలుగులక్షల గ్రంథమని వాడుకకలదు.): చూ, జోస్యము; పుం. 3. భల్లూకము: చూ, ఎలుఁగుబంటి; 4: చూ, ఋక్షపర్వతము; 5. దుండిగము *: చూ, శోణకము; విశ. 6. గ్రువ్వఁబడినది చూ, స్థాపితము. 1.

ఋక్షరజుఁడు. సం. వి. అ. పుం. వాలిసుగ్రీవుల తండ్రి.

ఋక్షరము. సం. వి. అ న. జలధార: చూ, నీటిచాలు.

ఋక్షరాజు. సం. వి. అ. పుం. జాంబవంతుఁడు; చూ, జాంబవుఁడు.

ఋక్షరుఁడు. సం. వి. అ. పుం. ఋత్విజుఁడు, యజ్ఞము చేయించువాఁడు: చూ, యజ్ఞకర్త.

ఋక్షాద్యంతము. పా. జననకాలమున కేనక్షత్ర మగునో యదియు జన్మఋక్షమనఁబడును ఏనక్షత్రమైనను ప్రవేశించినది మొదలు తరువాత నక్షత్రప్రవేశము వఱకు నైనకాలమునకు ఋక్షాద్యంతమని పేరు. ఋక్షాద్యంత మెప్పుడును గ 66-40 కన్న హెచ్చియుండదు. గ 55-50 కన్న తగ్గియుండదు. ఉదాహరణము. ఒక బాలకునికి జన్మనక్షత్రము ఉత్తర- జన్మనక్షత్రమునకుఁ బూర్వనక్షత్రము పుబ్బ- జన్మనక్షత్రమునకుఁ బూర్వనక్షత్రమైన పుబ్బ ఆరంభమైన గ. 39 వి. 32 లుండెను. ఉత్తరానక్షత్రము మఱునాఁడు కూడ గ. 37 వి. 2 లుండెను. జన్మనక్షత్రమునకుఁ బూర్వనక్షత్రగడియలను 60 లోనుంచి

| | గ. వి. |
|---|---|
| తీసివేయవలెను గనుక | 60- 0 |
| పూర్వనక్షత్ర ఘడియలు | 39-32 |
| | 20-28 దీనితో |
| జన్మనక్షత్రగడియలును గలుపవలెను గనుక | 20-28 |
| జన్మనక్షత్రగడియలు | 37- 2 |
| ఇది యుత్తరానక్షత్ర ఋక్షాద్యంతము. | 57-30 |

ఒక నక్షత్రమునకు పాదములు నాలుగు, ఋక్షాద్యంతమును నాలుగుచే భాగించిన యెడల పాదప్రమాణము తెలియును. (చూ, అహఃప్రమాణము.)

ఋగధ్యయనము. పా. ఋగ్వేదాధ్యయనము చేయుట.

ఋగామ్నాయము. సం. వి. అ. పుం. ఋగ్వేదము: చూ, వేదము.

ఋగి. సం. వి. ఈ స్త్రీ. కటుమరలు (చెక్కిళ్ల క్రిందిభాగము ఋగి, మీఁదిభాగము వెనుకటిభాగము హనువు అనఁబడును, నేత్రముల క్రిందిభాగము.): చూ, పార్శ్వము 2

ఋగీడితుఁడు. సం. వి. అ. పుం. ఋగ్వేదము చేత స్తోత్రము చేయఁబడ్డవాఁడు.

ఋగుక్తము. సం. విశ. (అ. ఆ అ.) ఋగ్వేదమునందు చెప్పఁబడినది.

ఋగ్వేదము. సం. వి. అ. పుం. 1. చతుర్వేదములలో నొకటి: చూ, వేదము; శా. 2. (శ్రీయుత కట్టమంచి రామలింగారెడ్డిగారు. ఎం.ఏ. (కాంటబ్.) "అసలు వేదమైన ఋగ్వేదమును, దానిననుసరించి కల్పింపఁబడిన తక్కిన మూఁటిని జనులకు కనఁబఱచుట పాతకము కదా! పాతకముకాకున్నను లాభకరము కానే

రదు. ఋగ్వేదమును వివక్షతతోఁ జదివినవారు వర్ణధర్మముల నంగీకరింతురనుట నిశ్చితార్థము కాదు. కావున పంచమవేదమే ప్రయోజనకారియైన కృతి. దానిని మొట్టమొదట తెనిఁగించిరి." (మొదలగునది. ముందు వెనుకలుఁ బరిశీలింపుడు.) రాజ. న. ప. సం. 201. (చూ, ఋక్కు.)

ఋఙ్మంత్రము. సం. వి. అ. పుం. ఋగ్వేదమంత్రము: చూ, మంత్రము 1.

ఋఙ్మాహాత్మ్యము. సం వి. అ. న. ఋగ్వేదము యొక్క మహాత్మ్యము.

ఋచ. సం. వి. ఆ. స్త్రీ ఋగ్వేదము (దేవతలు దీనిచేత స్తోత్రము చేయఁబడుదురు చూ, వేదము.

ఋచీషము. సం. వి. అ. న. బూరెలమూఁకుడు. రూ-ఋజీషము. (అపూపములు మున్నగునవి గలిగించునది.): చూ, పాత్రము. 6.

ఋచ్ఛర. సం వి ఆ. స్త్రీ. భోగముదాన: చూ, వేశ్య.

ఋజ. సం. వి. ఆ. స్త్రీ: చూ, ఋచ.

ఋజీ. సం. వి. ఈ. స్త్రీ.—వై.—

ఋజీషము. సం. వి. అ న. 1: చూ, రూ-ఋచీషము; 2. ఒకానొక నరకము: చూ, నరకములు.

ఋజుకాయుఁడు. సం. వి. అ. పుం. కశ్యపఋషి: చూ, ముని. 1.

ఋజుపంక్తి. పా. (స్ట్రెయిట్ లైన్.): చూ, ఋజురేఖ.

ఋజురేఖ. పా. ఒక రేఖ వంకరలేకుండా మొదటనుండి చివరవఱకు తిన్నఁగా నున్నయెడల దానిని ఋజురేఖ అందురు.(స్ట్రెయిట్ లైన్.) ఇది రేఖలు రెండింటిలోనొకటి. మఱియొకటి వక్రరేఖ.

ఋజురేఖలు. పా. ఇవి సమానాంతరసరళరేఖలు. (పేరలెల్ స్ట్రెయిట్ లైన్సు.) ఇవి రెండుగాని హెచ్చుగా గానియుండవచ్చును. రెండు ఋజురేఖలు ఒకేదిక్కును చూపుచున్నట్టయిన అవి సమానాంతర సరళరేఖలు. వీనిని యెంత దూరము యెటువైపునకుపొడిగించినను కలుసుకొనవు.

ఋజురోహితము. సం. వి. అ. న. ఇంద్రుని వజ్రాయుధము: చూ, బాణము. 1.

ఋజువు సం. విశ ఉ. చక్కనైనది: చూ, ప్రగుణము

ఋజుస్ఫురికామ్లము. పా. (ఆర్థోఫాస్ఫరిక్ ఆసిడ్.) ఒకయణువు స్ఫురత్పంచామ్లజనిదము (ఫాస్ఫరస్ పెన్టాక్సైడ్.) మూఁడణువుల నీటితోఁ గలసినప్పుడు ఋజుస్ఫురికామ్లము ఏర్పడును.

ఋజుస్ఫురితములు. పా. ఋజుస్ఫురికామ్లము నుండి కలిగిన లవణములకు ఋజుస్ఫురితములు (ఆర్థోఫాస్ఫేట్సు) అనిపేరు.

ఋజ్రిగాయనము. సం. వి. అ. న. 1. గంధర్వగానము: చూ, స్వరము, 2.

ఋజ్రుఁడు. సం. వి. అ. పుం. ఇంటికాఁపు: చూ, యజమానుఁడు. (చూ, ఇంటికాఁపు.)

ఋజ్ఞాసనము. సం, వి. అ పుం. మేఁక: చూ, మేషము. 1.

ఋణగ్రస్తుఁడు. సం విశే. (అ. ఆ. అ.) ఋణి, అప్పు పుచ్చుకొన్నవాఁడు: చూ, ధనగ్రాహకుఁడు.

ఋణత్రిగంధికు. పా. దేవఋణము, పితృఋణము, మనుష్యఋణము. (చూ, త్రయము.)

ఋణదాత. సం. విశే. (ఋ. ఈ. ఋ.) అప్పు యిచ్చినవాఁడు: చూ, ఉత్తమర్ణుఁడు; (తె. ప):—అప్పిచ్చినవాఁడు, అప్పులవాఁడు.

ఋణధ్రువీకరణములు. పా. (కతోడికన్.)

ఋణధ్రువము. పా. (నెగటివుపోల్, కతోడ్.)

ఋణపడు. మి. అ. క్రి. అప్పుపడు: చూ, బాకీపడు.

ఋణపత్రము. పా. అప్పు తెచ్చుకొనువాఁడు అప్పు యిచ్చువానికి వ్రాసియిచ్చుదస్తావేజు. "సీ. సంవత్సరంబుమాసము పక్షమును తిథి వారంబు దేశంబువ్రాసి మఱియు, జనకపూర్వంబుగా ధనికునామము వ్రాసి పిమ్మట ఋణికుని పేరు వ్రాసి, యాతనిచే నితండింతర్థమీ వడ్డిఁప్పుగాఁగొనెనని యగసివ్రాసి, యీయర్థమెఱుఁగుదు మిట్టివారలమని వరుసతో సాక్షుల వ్రాయఁజెప్పి, గీ. కోరియిబ్బంగి నాడఁబడఁగొంటినియిట్లుబ్రీతిఁగొన్నా తనిని వ్రాలుఁ బెట్టఁబనిచి, వ్రాసినాతండు తుదిఁ దనవ్రాలుఁ బెట్ట, నర్మఁగి లపత్రమిది యందుఁ వ్రాగరకులు." విజ్ఞా. వ్యవ. 109.

ఋణమత్కుణుఁడు. సం. వి. అ. పుం. పూటకాఁపు: చూ, లగ్నకుఁడు.

ఋణమార్గణుఁడు. సం. వి. అ పుం.—పై—

ఋణమిచ్చు. మి. అ. క్రి. చూ, బదులిచ్చు.

ఋణము. సం. వి. అ. న. 1. అప్పు, పర్యుదంచనము. (కాలాంతరమునఁ బొందఁబడునది.): చూ, బాకీ. 2; (వర్ణన) "గీ అప్పుఁగొనువేళ నధికసౌఖ్యమగుఁ దీర్చునట్టి తఱిఁ బ్రాణసంకటమైతన్చు, ఋణముగలవారు జననమరణములందు, నేనిఁబూనరు సుఖమించుకైననధిప॥ క. అప్పుగొని పప్పుగూడును, గొప్పగ భుజియించుకన్నఁ గూరదినుటమేలొప్పగు నుపవాసమయిన, నొప్పగుదినపంచకమున కొకపర్దిన్నక॥ గీ. ఋణము కష్టదమగునది యిక్కడక్కడనఁగవలదెట కేఁగిన నదటికరుగు,దెంచి బాధించుఁగావున దీనిశత్రుడు, విడిచియయుండుము శుభములు వడయుదీవు॥ క. అప్పిచ్చినవానికిన,య్యప్పుగొనిన వానికిని సుఖాయాసంబుల్, బొప్పదు నెచ్చటికేఁగిన, దప్పవుగాన ఋణముఁగొనఁ దగదార్యులకున్॥ ఉ. కొన్న ఋణంబుదీర్ప కరుగుం ధరపై ఋణదాతకేన యం,డన్నరుఁ డాత్మజాతుఁడయి యాలయి యెద్దయి దాసియట్లుఁడై, యెన్నఁటికప్పుదీర్చుకొను నేఁగును సద్గతికాత్మఋణంబు నం,దన్ని భవంబులన్ లఘుతరాయువు నొందును బుట్టికట్టుచున్." శేమధ. అ, కు. 4, అ. 80. పొరటు; 2. ఒకలెక్కలో మఱియొకలెక్క తీసివేయడము: చూ, రహితము; 3. ధాన్యాదులఅప్పు: చూ, ఎరవు. 2; అం 4. పాశములు తొమ్మిదింటిలో నొకటి: చూ, పాశములు.

ఋణములు. పా: చూ, ఋణత్రయము

ఋణమోక్షము. సం. వి అ. న. అప్పువిడుదల: చూ, విగణనము.

ఋణవిద్యుత్తు. పా. (నెగటివు యెలెక్ట్రిసిటీ.) గాజును పట్టులో తోమినప్పుడు పుట్టువిద్యుత్తువంటి విద్యుత్తునకు ధనవిద్యుత్తు (పాజిటివు ఎలెక్ట్రిసిటీ.) అనియు, లక్కను ఫ్లానలుగుడ్డతో తోమినప్పుడు పుట్టు విద్యుత్తువంటి విద్యుత్తునకు ఋణవిద్యుత్తు అనియు పేర్లు. (చూ, ఎలెక్ట్రిసిటీ-విద్యుత్తు.)

ఋణవిముక్తి. సం. వి. ఇ. స్త్రీ.—పై.—

ఋణార్థము. సం. వి. అ. న. అప్పుతీర్చుటకై తీసిన అప్పు.

ఋణి. సం. విణ. (పు. ఈ. న్.) అప్పులవాఁడు: చూ, ధనగ్రాహకుఁడు.

ఋణికుఁడు. సం. విణ. (అ. ఆ. అ.)—పై.—

ఋతధాముఁడు. సం. వి. అ. పుం. వెన్నుఁడు: చూ, విష్ణువు 1.

ఋతము. సం. వి. అ. న. 1. ఉంఛము: చూ, బ్రతుకు. 1; 2. జలము: చూ, నీరు.1; విణ. 3. సత్యమైనది (మాట.): చూ, సత్యము. 5.

"ఆ. ఋతమనృతమెఱుంగ నెవ్వరితరముకు." వేమన. 579; 4. పూజింపఁబడినది: చూ, సమ్మానితము; 5 ప్రకాశమొందినది: చూ, ప్రకాశితము.

ఋతి సం. వి. ఇ. స్త్రీ. 1. త్రోవ : చూ, మార్గము. 1; 2. జుగుప్స చూ, రోఁత 2; 3. పగ: చూ, విరోధము. 1; 4. జీగడము: చూ, యుద్ధము; 5. మేలు: చూ, శుభము.1; 6. నడక: చూ, ప్రయాణము.

ఋతీయ. సం వి. ఆ. స్త్రీ. జుగుప్స: చూ, రోఁత 2.

ఋతుదినములనిర్ణయమునుగర్భాధానకాల నిర్ణయమును. పా. స్త్రీలకు రజోదర్శనదినము మొదలు పదునాఱురాత్రులు ఋతుకాలము. పుత్రసంతానమును గోరినవారికి పదునాఱురాత్రులలో సమదివసంబుల ఋతుస్నానాదులచేఁ బరిశుద్ధురాలును, ఋతునియమాదులచేతఁ గృశించిన దేహముగలదియును, తనకత్యంత ప్రియురాలునగు నిల్లాలిం గలయవలయు. మఱియు బురుషరాసులగు మేషమిథున సింహ తులాధనుః కుంభషడ్వర్గులయందైనను, పురుషగ్రహరాసులైన మేషసింహ వృశ్చిక ధనుర్మీనముల షడ్వర్గులయందైన నీరాసులఁ బురుషగ్రహములఁ గూడియుండినను, చూడఁబడినను బృహస్పతిలగ్నపంచమనవమస్థానములయందుండఁగాను గర్భాధానముచేసినఁ బుత్రుండుఁ గలుగుననియు, స్త్రీరాసులైన వృషభకర్కాటక కన్యావృశ్చిక మకరమీన రాసులయందైనను, స్త్రీగ్రహరాసులైన వృషభ కర్కాటక తులారాసుల షడ్వర్గయందైనను,లగ్నము స్త్రీగ్రహములచేఁ జూడఁబడియైనను, స్త్రీగ్రహములతోఁగూడి యైనయుండఁగాను, లగ్న పంచమ నవమస్థానంబులయందు బృహస్పతి లేకయుండఁగాను గర్భాధానము చేయగాఁ బుత్రికఁ గలుగుననియు తాత్పర్యము. ఇది యునుంగాక యీపదునాఱుదినములలో నాదిని నాలుగురాత్రులును పదునొకండవ పదుమూఁడవరాత్రులును,నీయాఱురాత్రులునింద్యములనియును నితరములగు పదిరాత్రులుత్తమంబులనియుఁ గొందఱి యభిప్రాయము. కాలా. ప్రథమబిం. పు. 13. శ్లో.

ఋతుమతి. సం వి. ఈ. స్త్రీ ముట్టుది.(ఋతువు దీనికిఁగలదు.): చూ, రజస్వల "చ. ఋతుమతియైన కాంత మది నెమ్మియుఁ గోపము లేక శాంతయై, కుతుకమునొద నేమియును గోరక నాథుని మీఁదికూర్మిచే, సతతము భోజనాదులను సంతసమందుచు నిర్మలాత్మయై, యతిముద మొప్పగాఁదగు గహస్యనివాసమునందు నెయ్యెడన్॥ క. బాలిక ఋతువగు తిథికిని, నాలవదివసమున మజ్జనముగాఁగఁదగుజ్, దాలిమిమీఱఁగ నత్తఱి, వాలుగనభ్యంజనాది వైభవలీలన్॥ ఉ. ఆలతాంగియత్తఱి సమంచిత నవ్యతరాంబ రావళుల్, తాలిమి తోడఁగట్టుకొని ధన్యత మేలి విభూషణావళుల్, చాలధరించి నాథుని దెసందగనిల్చి మనోనురాగిరై, మేలి .....ప్రసంగముల మేలములాడఁగ నొప్పునయ్యెడన్." విజ్ఞాన ప్రదీపిక. 3, ఆ. "సీ. మునుదాను కడకుఁబోయిన దినంబాదిగా, దెచ్చుక దినమును దినము లెన్న । మధురముల్ ప్రియమైన మానిభోజన వేళ, సారెకు, నావపచ్చళ్ళు మెసవు । దురమున నొకపువ్వు దురుము నెచ్చెలిరొూర్తు, తెఱ వపువ్వవతివైతి వనభ్రమయు......"గీ. చెలి నికాకున్నదగచు నవ్వునరుహాక్షి, యంతనెల లైన ఋతువైన యాత్మజయును, తానుమూన్నాళ్ళు మూఁడేండ్లుగాను గడచి, నాలవ దినంబునందు స్నానములుచేసి." దశావతార చరిత్ర. 5, ఆ. (వర్ణన.)

ఋతుమతియగు. మి. అ. క్రి. రజస్వలయగు: చూ, సమర్తాడు.

ఋతువు. సం. వి. ఉ. పుం. 1. రెండునెలలు: చూ, మాసద్వయము; 2. ఆర్తవము: చూ, ముట్టు. 1; 3. ప్రకాశము:చూ, వెలుతురు.1; 4 ఇరులుగొంగ:చూ, సూర్యుడు; 5 చిలుక: చూ, శుకము; స. 6. ఆఱు: చూ,మత్కుణము.

ఋతువులు. పా. వసంతము, గ్రీష్మము, వర్షము, శరత్తు, హేమంతము,శిశిరము. (6.) (1. వసంతఋతువు=రెండునెలలకాలము మన్మథవసంతులు నివసింతురు. పుష్పములకు కాలము దీని యందు జనులు సుఖముగ నుందురు; 2. గ్రీష్మ ఋతువు=తపింపజేయునది.దీనియందు జనము దహింపఁ బడును. జలమును గ్రహించునది; 3 వర్ష ఋతువు = మేఘములు వర్షించును; 4. శరదృతువు=మనోహరమైన వెన్నెలగలది. అదునును బోఁగొట్టును; 5. హేమంత ఋతువు=చలి జనులను హింసించునది; 6. శిశిరఋతువు=శీతము దేహము నల్పముగఁ జేయునది.)

ఋతువృత్తి. సం. వి. ఇ. స్త్రీ. ఏఁడాది: చూ, సంవత్సరము.

ఋతూత్సవము. పా. ఆర్తవ మహోత్సవము పేరటాండ్రతో జేయు భోజనాదిబంతుల సంబరము.

ఋత్విజుఁడు, సం. వి. జ్. పుం. 1. యజ్ఞకర్త చేత ధనముఁబుచ్చుకొని యజ్ఞముచేయించువాఁడు. (పదియార్వురు ఋత్విజులు యాజకులు :— అచ్ఛావాకుఁడు, అధ్వర్యుఁడు, అగ్నీధ్రుఁడు, ఉద్గాత, ఉన్నేత, గ్రావస్తుఁడు, నేష్టుఁడు, పోతుఁడు, ప్రతిప్రస్థాతుఁడు, ప్రతిహర్తుఁడు, ప్రస్తోతుఁడు,బ్రహ్మ, బ్రాహ్మణాచ్ఛంసుఁడు, మైత్రావరుణుఁడు, సుబ్రహ్మణ్యుఁడు, హోత-యా-హోత్రి.); 2 ఆదేష్ట, అధ్వర (యజ్ఞము) తంత్రము నుపదేశించువాఁడు: చూ, యజ్ఞకర్త.

ఋత్విజులు. పా: చూ, ఋత్విజుఁడు. 1.

ఋద్ధము. సం. విశ. (అ. ఆ అ) 1. నుటిచినది (ధాన్యము.): చూ, ధాన్యము; 2. సాధింపఁబడినది: చూ, సంపన్నము. 3; 3. పెరిగినది: చూ, సుర. 3

ఋద్ధి. సం వి. ఇ స్త్రీ. 1. గంధద్రవ్యము * (ఇదియొక మూలిక. ఇది దొరకదు. దీనిని వృద్ధి అందురు. కాని రెంటికి కొంచెము భేద ముగలదు. ప్రతి.—1. ముత్తవ పులగము, 2. నేలతాడి.): చూ, వృద్ధి. 8; 2. గౌరి: చూ, పార్వతి. 1; 3. నిండియుండుట: చూ, సమృద్ధి.

ఋనామ. సం వి. ఆ. స్త్రీ. దేవతల తల్లి:చూ, దేవమాత.

ఋభుక్షుఁడు. సం. వి. న్. పుం. ఇంద్రుఁడు. (దేవతలఁ బనులయందుఁ బ్రేరేపించువాఁడు.): చూ, వేలుపు ఱేఁడు.

ఋభువు. సం. వి. ఉ. పుం. 1. దేవుఁడు.(సత్యముతోఁ బుట్టినవారు. అదితిదేవికలన జనించినవారు): చూ, వేలుపు; 2.ఒకానొక బ్రహ్మవేత్తయైనఋషి: చూ, ముని. 1.

ఋశము. సం. వి. అ. పుం. 1. గడ్డి: చూ, తృణము. 1; 2. అవధి, ఎల్ల: చూ, సీమ. 1.

ఋశ్య. సం. వి. ఆ. స్త్రీ. అజహ *: చూ, దూలగొండి.

ఋశ్యకేతువు. సం. వి. ఉ. పుం. 1. అనిరుద్ధుఁడు, శ్రీకృష్ణునిమనుమఁడు, మన్మథునికొడుకు, చూ, విశ్వకేతువు; 2. మరుఁడు: చూ, మన్మథుఁడు.

ఋశ్యప్రోక్త. సం. వి. ఆ. స్త్రీ. 1. అజహ *. (మృగములచేతఁ జూపఁబడునది.) యా-ఋష్యప్రోక్త: చూ, దూలగొండి; 2. యా- ఋష్య

ప్రోక్త, పిల్లపీఁచర *. (వ్యాఘ్రికత్రి పులగుటవలన మృగములచేత నాశ్రయింపఁబడునది): చూ, శతమూలి; 3. రూ- ఋష్యప్రోక్త, చిట్టాముదము *:చూ, వ్యాడంబకము.

ఋశ్యము. సం. వి. అ. పుం. రూ- ఋష్యము. మనుఁబోతు. (వనమును బొందునది, గుఱ్ఱము వంటి రూపమును మూఁడు కొమ్ములును గల మృగము.): చూ, ముక్కొమ్ము మెకము.

ఋశ్యశృంగుఁడు. సం. వి. అ. పుం. విభాండ ముని కొడుకు, రూ- ఋష్యశృంగుఁడు: చూ, ముని. 1.

ఋషభకము. సం. వి. అ. పుం. కకుభము *: చూ, వృషనామకము. (ఇది దొరుకదు) (వెల్లుల్లిగడ్డల పోలియుండునట.)

ఋషభము. సం. వి. అ. పుం. 1. ఎద్దు, (ఆవును గూర్చి పోవునది.): చూ, వృషభము. 1; 2. ఒకానొకమూలిక *: చూ, వృక్షము; 3. తిరుమల వేంకటాచలము, విష్ణుక్షేత్రము, వేంకటాచలము, వృషభము, తిరుపతి, తిరుమల. (చిత్తూరు మండలములోనితిరుపతియనఁబడు గొప్పపుణ్యక్షేత్రము. దీనిచెంతనే అలివేలమంగాపురమను గొప్ప పుణ్యక్షేత్రము కలదు.): చూ, పర్వతము; 4. కర్ణరంధ్రము: చూ, చెవిగూబ; 5. సప్తస్వరములలో నొకటి (వృషభస్వరమువంటి స్వరముఁ బలుకునది)· చూ, స్వరము.2; 6. వృషభుఁడను కోఁతి: చూ, వానరము; 7. మదపుటేనుఁగు: చూ, హస్తి; 8. వరాహపుచ్ఛము:చూ, పందితోఁక. (అడవి పందితోఁకఅని శబ్దార్థకల్పతరువు.); 9. శ్రేష్ఠవాచకము; 10. వృషభరాశి: చూ, వృషభము. (చూ, రాశి.)

ఋషభశ్రేణి. సం. వి. ఇ. స్త్రీ. తంగేడు *: చూ, హేమపుష్పకము.

ఋషభి. సం. వి. ఈ. స్త్రీ. 1. నరుని ఆకారముగల ఆఁడుది· చూ, స్త్రీ; 2 అజహా *: చూ, దూలగొండి; 3. పోటు, మగకొమ్ములు మీసములుగల ఆఁడుది, మాచకమ్మ, మాసకమ్మ: చూ, స్త్రీ; 4. రూ-వృషభి. విధవ, ముండ: చూ, స్త్రీ; 5. పిన్నదూల గోవెల*: చూ, దూలగోవెల; 6. కులట· చూ, అంకులాఁడి.

ఋషభుఁడు. సం. వి. అ. పుం. 1. ఒకానొక ముని: చూ, ముని. 1; 2. ఉత్తరపదమైనచో శ్రేష్ఠుఁడు: చూ, శ్రేష్ఠుఁడు. 2.

ఋషి. సం. వి. ఇ. పుం. 1. సన్యాసి· చూ, ముని. 1; 2. వ్యాసులు మొదలైనవారు:చూ, ముని 1; (చూ, ఋషిశ్రేష్ఠులు.) 3. ఋషి మతప్రవర్తకుఁడు (జ్ఞానముయొక్క పారమును బొందినవాఁడు.): చూ, ముని. 1; 4. దేవుఁడు. చూ, వేలుపు; 5. జ్ఞానాధికుఁడు: చూ, విద్వాంసుఁడు; 6. అంగమైలవాఁడు: చూ, దిగంబరుఁడు; 7. ప్రాఁజదువులు : చూ, వేదము; 8 కిరణము· చూ, మయూఖము.1; అం.9. గతిభేదములు తొమ్మిదింటిలో నొకటి· చూ, గతిభేదములు.

ఋషిఋణము. అం. ఋణములు మూఁడింటిలో నొకటి: చూ, ఋణత్రియము·

ఋషికుల్య. సం. వి. ఆ. స్త్రీ. 1. ఋషికుల్య యను నది: చూ, నది; 2. ఏఱు: చూ, నది.

ఋషిచాంద్రాయణము. సం. వి. అ. న. ఒకానొక చాంద్రాయణము: చూ, చాంద్రాయణము

ఋషిశస్త్రము. సం. వి. అ. న. దర్భగడ్డి, కుశ*: చూ, తృణము 1.

ఋషిశుశ్రూష. పా "సీ. స్నానంబుగావించి చనుదెంచునంతలో, జపవేదిఁదగురీతిఁ జక్కఁజేయు । జపనివృత్తియొనరించిచాలించునంతలోఁ,

జక్కఁగా దేవపూజకు నమర్చు। దేవపూజ యొనర్చి తిలకించునంతలో, షడ్రసాపూర్ణ భోజనము పెట్టు। భోజనంబై కరంబులు కడుగునంతలోఁ, బర్ణాజినములచేఁ బాన్పొనర్చుఁ॥ తే. పాన్పుపైఁ జేరునంతలో బడలికని మృదంబునఁ దలంచి తాలవృంతకులవిసరి, తొడలపై నంఘ్రులుంచి యొత్తుమి ననేక, సేవలొనరించుఁ దపసి కచ్చిగురుఁబోఁడి." ఉత్తరరామాయణము. 1. ఆ, 89.

ఋషిశ్రవ సం. వి ఆ. స్త్రీ. ఎలుకచెవి *: చూ, భల్లాతికి.

ఋషిశ్రేష్ఠులు పా. "సీ. వ్యాసభరద్వాజ వాల్మీకిగౌతమకాశ్యపజాబాలి కణ్వ పులహ, యాజ్ఞవల్క్యాత్రి రైభ్యాంగిరో భృగుపరాశరధూమ్రగాలవశంఖలిఖిత, హరితసంవర్తక హాయశిరశ్శౌనక భద్రకక్షీవద్విభాండకోగ్ర, బకదాల్భ్యకౌశికాపస్తంబ మాండవ్యసుకణ సోమశమందపాల గీ. కథకలాపరోహిత కామకాయనాది, మునులు చిరతపోనిర్మల మూర్తులాధ్యుఁ, లరుగుదెంచి కాంచిరి పరమాత్మసంభవు, నాదిదేవునచ్యుతుఁ గృష్ణునధిక భక్తి." హరి. ఉ. 5, ఆ; "సీ. మౌద్గల్య మాతంగ మౌంజాయనమరీచి మైత్రేయ మాండవ్య మందపాల, కపిలకశ్యపకౌత్స కామందకగాల్వాత్రి కౌశిక కౌండిన్య కలహభోజ, వాత్స్యాయన వ్యాసవాల్మీకి వరతంతు వాలఖిల్య వశిష్ఠ వామదేవ, శరభంగ శుకశక్తి శార్ఙ్గ శారద్వత శౌనకశాండిల్య శాలిహోత్రి గీ. జడభరత జహ్నుజాబాలి జామదగ్న్య, పులహపిప్పలపర్వత పుండరీక గార్గ్యగౌతమ గాలవగణక ముఖ్యు, లైన యాసంయమీశ్వరు లర్థిఁగొలువ." విశ్రి. 2, ఆ, 25; "సీ. శాండిల్య మౌద్గల్య మాండవ్యకశ్యప, వ్యాఘ్రపాత్రి కౌండిన్య వాలఖిల్య। హారీతపిప్పలరైభ్యవరతంతు గాలవ, బకదాల్భ్య గౌతమ శుకవసిష్ఠ। కౌశికచ్యవన మార్కండేయ నారద, జమదగ్ని భృగుపరాశర శమీక। కణ్వ జాబాలి సాంఖ్యాయన వాల్మీకి, కపిలభరద్వాజ కలశజన్మ॥ గీ. శృంగి తృణబిందు భరత మతంగశక్తి, గర్గ శ్రీవత్సమునివరుల్ ఘనత మెఱయ। నగసభాసీనులై వినువారలకును, వినులవాగ్భంగిఁ గర్ణామృతములు గాఁగ." రుక్మాం. 1 ఆ, 51, సప్తఋషులు.—"గీ. కశ్యపాత్రి విశ్వామిత్ర గౌతములును, వినుభరద్వాజ జమదగ్నులును వశిష్ఠుఁడును జగంబులనెల్లఁ బేర్కొనిన ఋషులు, వారి సప్తర్షి గణమండ్రు కౌరవేంద్ర." భాగ. ఆది. 2, ఆ. 208: "ఆ. ఋషులు గానుపింత్రు హీనుల యట్టుల, వారిబోధ పెద్ద మేరువంత, లోనమున్న యట్టి జ్ఞానంబు మహిమరా." వేమన. 583. (చూ, మహర్షులు.) చూ, ముని 1. (చూ, ఋషి.)

ఋషీతకము, సం. వి. అ. పుం ధ్వాంక్షము, తెల్లకాకి: చూ, వాయసము. 1.

ఋష్టి. సం. వి ఇ. పుం. కత్తి చూ, రిష్టి. 2.

ఋష్యప్రోక్త. సం. వి. అ స్త్రీ: చూ, రూ- ఋశ్యప్రోక్త *.

ఋష్యము. సం. వి అ. పుం: చూ, రూ- ఋశ్యము.

ఋష్యమూకము. సం. వి. అ. పుం. ఋష్యమూకపర్వతము. "ఉ. రామలక్ష్మణుల్ గనుంగొనిరి రత్నగుహాగమమాణ దివ్యసా। రీకముఁ ఋష్యరేణుక పరిష్కృత కుంజలసన్మృగేశ్వరా। నీకము శృంగసంగళిత నిర్ఝరలోకము భర్మగండక। స్తోకముసానుజాల పరిశోభన దీకము ఋష్యమూకముఁ." పద్మ. 8, ఆ. 184: చూ, పర్వతము.

ఋష్యశృంగుఁడు. సం. వి. అ. పుం. విభాండ ముని కొడుకు (రూ-ఋశ్యశృంగుఁడు.): చూ, ముని. 1.

## ౠ.

ౠ. ఆంధ్రభాషకు గల వర్ణంబులేఁబదియాఱు. అందు అచ్చులు పందొమ్మిది. ఆయచ్చులలో నిది యెనిమిదవ యక్కరము; సంస్కృతమునకు వర్ణంబులేఁబది. అందు అచ్చులు పదునాఱు. ఆయచ్చులలోనిది యెనిమిదవ యక్కరము; సం. వి. ౠ పుం. (ౠః, రౌ, రః, ఇత్యాదిరూపకమ్. కృశబ్దవత్.) 1. చిఱుగము, తలపెండ్రుక: చూ, పెండ్రుక. 1; 2. సర్పదృష్టి, పాముయొక్క కన్ను (పాముయొక్క కంటిచూపు అని కొందఱు); 3: చూ, బీదతనము; 4: చూ, బీదవాఁడు; 5. బంగారము: చూ, లోహము. 1; 6. మంచు: చూ, హిమము. 1; 7. తామర*: చూ, పద్మము 1; 8. జేజేలపాలెము: చూ, స్వర్గము; 9 ధనము: చూ, విత్తము. 1; 10 తొడవు: చూ, భూషణము. 2; 11 జంబువు *. చూ, నేరేడు; 12. మూఁపు: చూ, స్కంధము. 1; 13. ముక్కంటి: చూ, శివుఁడు; 14. రక్కసుఁడు: చూ, రాక్షసుఁడు. 1; స్త్రీ. 15. దేవతలతల్లి: చూ, దేవమాత; అవ్య. 16 వాక్యమును దెలుపును; కర్తకర్మక్రియా సంబంధముగల మాటను తెలుపును: చూ, వ్యాఖ్యాతము. 2; 17. రక్షణమును తెలుపును: చూ, రక్షణము; 18. నిందను తెలుపును: చూ. నింద. 1; 19 భయమును దెలుపును: చూ, వెఱపు; అం. 20. మూర్ధన్యములు తొమ్మిదింటిలో నొకటి: చూ, మూర్ధన్యములు; పా. 21. ఋ ౠ ఌ ౡ విసర్గ వర్గయుక్ జ ఞ శ ష లు తత్సమాన్యదేశ్యానుకరణంబులఁగూడి యాంధ్రభాషయందొచ్చు.- వర్గయుక్కులనఁగా ఖఘ ఛఝ ఠఢ థధ ఫభ లు. ఈ యక్షరములు ఋౠ ఌౡ ఙఞ శ షః లనుజేరి 19 అక్షరములును తత్సమపదంబులును, అన్యదేశ్యపదంబులును, ధ్వన్యనుకరణపదంబులును గలసి యాంధ్రభాషాపదంబులుగ వాడంబడెనని యర్థము. ధ్వన్యనుకరణమనఁగా నేధ్వని యెట్లు వినవచ్చునో యట్లె వ్రాయుట ధ్వని పెద్దదియు పరుషమునైనపుడు ఒత్తక్షరములును సౌమ్యమ్ముగు నైనపుడు ఒత్తులులేని యక్షరములు వ్రాయఁబడును. ఉదా.—ఋషి-పిత్రాణము. కష్ట్రము-ఌకారము, విఃభేదము. ఖట్వాంగము, ఘంటుభాగము. ఝంకారముకతుఁడు-దృఢము-వ్యథ- బాధ- కఫము - భేదము - శార్ఙ్గము. (బాలవ్యాకరణంబున జకారము తత్సమముఁ గలసి యాంధ్రంబున నొచ్చినందునకు పక్తి యుదాహరణముగ నీయఁబడినది. సంస్కృతి సంయుక్తాక్షరంబులనను నాసికంబులున్నచో నాయను నాసికములకు మాఱు పూర్ణానుస్వారమే వ్రాయుట మహాకవి సంప్రదాయము పూర్ణబిందు ప్రాసముగనన్నయ్య "నిండుమనంబు" అనుపద్యములో 'నిండు' 'అఖండల' యను శబ్దములు ప్రాసస్థానములఁగూర్చెను. సింహంబాఁకటితో ననుపద్యములలోఁ దిక్కన మాతం 'గ' యని ప్రాసముఁగూర్చెను. ఈనియమమే యందఱుకవులయందు నియతంబుగాఁ గానరయ్యెడి. ఏతద్భిన్నంబోకఁడైనలక్ష్యంబు గానరాదు మహాకవి సంప్రదాయమిట్లుండ నొక పంక్తినిమాత్రము అంకితముచరె పంక్తి యని వ్రాయరామికిఁ గారణము విచార్యము) ప్రజ్ఞ. కళ - వండుఁడు. ఇవి తత్సమ పదములు. తపర-కావు అన్యదేశములు. పిరంగి

'ఢా' మ్మనియెను. నగారా 'భా' మ్మనియెను. ఇవి ధ్వన్యను కరణపదములు (చూ, ఋ.)

## ౡ.

ౡ ఆంధ్రభాషకు వర్ణంబులేఁబదియాఱు. అందు అచ్చులు పందొమ్మిది. ఆ అచ్చులలోనిది తొమ్మిదవ యక్షరము; సంస్కృతమునకు వర్ణంబులేఁబది అందు అచ్చులు పదునాఱు ఆఅచ్చులలోనిది తొమ్మిదవ యక్షరము సం. వి. ౡ. పుం. (ఆ అలౌ అలః ఇత్యాది రూపకమ్ గమ్లిశబ్దవత్.) 1 ముక్కంటి: చూ, శివుఁడు; 2. ఏనుఁగుపల్లు: చూ, నాగదంతము; 3. ఎండ్రకాయ: చూ, పీత; 4. కోఁతి: చూ, వానరము; 5. కపిదంతము: చూ, కోఁతి కోర;6 జేజేలపట్టు: చూ, స్వర్గము; స్త్రీ. 7. దేవతల తల్లి: చూ, దేవమాత, పుం 8. చనిపోయిన మనుమఁడు గలవాఁడు; 9. రొమ్ము: చూ, వక్షము; 10. గంధాదులచేతఁ బూయఁబడిన మేనుకలవాఁడు: చూ, లిప్తగాత్రుఁడు; 11. గంధాదులచేతఁ బూయఁబడిన శరీరము చూ, శరీరము; 12 శాపాకుట: చూ, రక్షణము; పా. 13: చూ, ఋ 20; పా 14: చూ, ౠ. 22; 15. ఋక్కులలోనిది రెండవది: చూ, ఋక్కులు; 16. ఇక్కులలోనిదినాలుగవది.(ఇక్కులు.-ఇ-ఉ-ఋ-ౡ.); 17. అక్కులలోని యయిదవది. (అక్కులు.- అ-ఇ-ఉ-ఋ-ౡ.); 18. ఉజ్ఝులలోనిది మూఁడవది. (ఉజ్ఝులు.- ఉ-ఋ-ౡ-ఏ-ఓ.)

## ౣ.

ౣ. ఆంధ్రభాషకు వర్ణంబు లేఁబదియాఱు. అందు అచ్చులు పందొమ్మిది. ఆ అచ్చులలోనిది పదవ యక్షరము; సంస్కృతమునకు వర్ణంబులేఁబది. అందు అచ్చులు పదునాఱు ఆ అచ్చులలోనిది పదవయక్షరము; సం. వి. ౣ. పుం. (ౣః కాలః.) 1. ఊసరవెల్లి,బింబకము: చూ, సరటము; 2. కొండ: చూ, పర్వతము; 3. మేను: చూ, శరీరము; 4. అతిప్రతాతి. చూ, శుభంకరుఁడు, 5 దేవుఁడు: చూ, వేలుపు; 6 వాహ్యాళి: చూ, విహారము. 1; 7. కిన్నె: చూ, నేత్రము. 1; 8. ఎముక: చూ, శల్యము. 1; స్త్రీ 9.క్రొవత్తిల్లి: చూ, నాగమాత. 2; 10. అఁడుది: చూ, స్త్రీ; 11. తల్లి: చూ, మాత 1; పా. 12: చూ, ౠ. 22.

## ఎ.

ఎ. ఆంధ్రభాషకు వర్ణంబులేఁబదియాఱు.అందు అచ్చులు పందొమ్మిది ఆ అచ్చులలోనిది పదునొకండవ యక్షరము; తెనుఁగునకు వర్ణములు ముప్పదియేను. అందు అచ్చులు పదునాలుగు. ఆ అచ్చులలోనిది యేడవయక్షరము; దే. అవ్య. 1. రూ- ఏ. ప్రశ్నమును దెలుపును. "మాతామహులుండైన మనకూరుఁడున్నాఁడె." భాగ. 1, స్కం. 347: చూ, ప్రశ్నము; 2. రూ- ఏ వ్యతిరేకమును దెలుపును "ఉ. నీమగఁడంత యెక్కడి మనీషులు ధరాసురులింతటక్కటే." భార. అర. 5, ఆ. 16: చూ, వేలుపాటు; 3. అఁడుదగుటను దెలుపును. "రావే సుందరియేమె బోటివినవే." భాగ. 10, స్కం. పూ. 772. "సీ. కుసుగుంపులిడకేగు కొన్న యంగడిలోన మాఱుబేరములేలె మంజువాణి." వంద్రాం. 6, ఆ. 185: చూ,రూ-ఏ; 4. రూ-ఏ. మెచ్చుకొనుటను తెలుపును. "సతిజనమిట్టిదె యోజగంబులకా." భార. విరా. 1, ఆ. 295:

చూ, సెబాసు; వై. అవ్య 5. ఆ, రూ- ఏ మతియొకదాని లేమిని తెలుపును. "నన్నెదను జుంజేసితేముగుద." కళా. 3, ఆ. 251: చూ, కాకేమి; 6. మతియొకదాని కలిమిని దెలుపును. "క. దుర్యోధన నీ,దర్పోగ్రలమె పాండవేయుల దౌర్బల్యమువాయు." (ఇక్కడనీదోర్బలమె- నీదోర్బలమొకటి మాత్రమా అని యర్థము. ఇట్టి తరస్థలములయందు నెఱుంగునది.) భార. ఉద్యో. 3, ఆ. 328: చూ, కాకేమి; 7. చేపుటను వెలిపెడి. "హాయఁడ వెచిల్క" భాగ. ఆర. 5, ఆ. 280; "ఆల్లవెయర్జునధ్వజ విహారముగానఁగ నయ్యెడన్" భార కర్ణ. 2, ఆ. 120; "క. ఇదియొక పిన్నవాఁడడరియె క్కడు మూఁకలఁగ్రిందఁ దోలెడున్." భార. ద్రో. 2, ఆ. 11; "ఇదవియద్వ్యాహీని యిదెమణికర్ణిక." కాశీ. 5, ఆ. 177; "అవె యివె పెన్బొగల్ సెగసె" రా. సుం, కాం. 477; వాఁడెభృంగీశుఁడు." కాశీ. 5, ఆ. 177; "వీఁడెకృష్ణుఁడు" హరి. ఉ. 2, ఆ. 136; "క. వీరెవసువులు." భార, ఉద్యో. 4, ఆ. 352: చూ, రూ- ఏ; 8. అ, తనంతట అను నర్థమును తెలుపును. "నేనడుగలేదు వాఁడెవచ్చి యిచ్చిపోయెను." (వా): చూ, ఏ; 9. ఎక్కువ తక్కువలను దెలుపును "ఉ. వంశమెల్లఁ బ్రాతమ్మగు నీదుచర్యనని ధాతప దంతియె యానతిచ్చె స్వప్నమ్మునవచ్చి." కళా. 4, ఆ. 126; "వాఁడెచేయలేక పోయె నేనేమి చేయుదువా." (వా): చూ, రూ- ఏ; 10. ప్రార్థించుటను తెలుపును. రూ-ఏ: చూ, స్తోత్రము. పా. 11. వర్ణములలోనిది యొకటి. (ఎ-ఏ ఒ-ఓ లకు వర్ణములని పేరు.) చూ. వర్ణములు; 12. ఆంధ్రవర్ణములకుఁ జెప్పునప్పుడు ఎ ఒ, చే- జే చేర్పవలయును; అవ్య. 1. 3. ఏవార్థకములలోనొకటి. (ఏవార్థకములు —అ-ఆ-ఎ-ఏ.); 14. ప్రార్థనార్థకముమీఁద వచ్చు వానిలోనొకటి. (ప్రార్థనార్థకముమీఁద వచ్చునవి.— ఇ- ఈ- ఎ- ఏ- ఒ- ఓ అనునవి. ఉదా.— చూడుమి, వండుమీ, వండవె, వండవే, చూడవొ, చూడవో అనునవియు.) 15. ఇ- ఈ- ఎ- ఏ లంగూడిన చే జే లు తాలవ్యంబులు వానిలోనిదియొకటి: చూ, తాలవ్యములు.

ఎంక్రోచిమెంటు. ఆం. స్థలమును ఆక్రమించుకొనుట, అతిక్రమణము.

ఎంక్వైరీ. ఆం. దర్యాప్తు, వ్యవహారదర్శనము.

ఎంగిలి. దే. వి. ఉచ్ఛిష్టము; భార అను. 1, ఆ. 285; దశ. 9, ఆ, 8; "ఆ. ఎంగిలెంగిలనుచు నీనాటిలోడనే। వేదములను జదువు వెఱ్ఱులార। యెంచిచూడనదియె యెంగిలిగాదకో" వేమన. 596; "ఆ ఎంగి లెంగిలందురిల వేదశాస్త్రముల్, చేదువుఁట్టి విప్రజనములెల్ల, నెంగిలవుట యెఱుఁగి రెంగి లేకుడుతురో" వేమన. 595; "ఆ. ఎంగిలఁ తవట్టి హితవుగానెంచక" వేమన. 594; "ఆ. ఎట్టిమంత్రమైన నెంగిలిగాకుండ" వేమన. 608: చూ, భుక్తోఝ్ఝితము.

ఎంగిలికాయ. ద్వ. వి. పనికిమాలినవాఁడు: చూ, నిష్ప్రయోజకుఁడు.

ఎంగిలిచేయి కాకికి విదల్పనివాఁడు. లో. ఉదా. "సీ. కసరియెంగిలిచేతఁ గాకి నేయనివాఁడు, సత తాన్న దానప్రశస్తుఁడయ్యె, బ్రహ్మకల్పము దాక బ్రతుకాసగడకట్టు కాఁడస్థిరముగ విశ్వ ముదలంచె" పాండు. 4, ఆ. 210.

ఎంగిలియగు. ద్వ. అ. క్రి: చూ, అంటగు. 2.

ఎంగిలివాఁడు. ద్వ. వి. 1: చూ, ఉచ్ఛిష్టుఁడు, 2. కక్కుఱితికాఁడు: చూ, లోభి; 3. ముండలమారి: విటుఁడు.

ఎంగుస. ద్వ. వి. (ఏను + కుంచెము.) అయిదు కుంచములు: రూ- ఏగుస.

ఎంగెప. దే. వి. ఒకరకము అడవిమొక్క *: చూ, వృక్షము.*

ఎంచు. దే.స.క్రి. 1. గణించు: చూ, లెక్కించు; 2. ఎన్ను, తలఁచు; "ఆ. ఎంచి యంచి పూజ లెన్ని సేయఁగ నేమి, భక్తిలేని పూజ ఫలములేదు, కన్నపూజ సేయు కారణ మెఱుఁగుడీ, విశ్వ... వేమ." వేమన. 604: చూ, సూచించు; 3. దూఱు: చూ, నిందించు; 4. ఆక్షేపించు. "ఉ. వింతలు భూమి నేయయినవింటివె పౌరులు నన్నుఁ గూర్చి నిం, దింతురొ యెంతురో." హ, రా 6, ఆ 193' చూ, వెక్కిరించు; 5 స్తోత్రముచేయు ప్రశంసించు, పొగడు. "మ ఫలభుక్షుల్ హతశేషులెల్లఁజని చెప్పన్ జచ్చెనే లంకకున్, గల సేనాధిపుఁ డింద్రవహ్ని ముఖదిక్పాల ప్రధాహారిణోన్ఁ, తులచే నంచుఁ బ్రహస్తునెంచి" రామా. 8, ఆ. 60: చూ, స్తుతించు.

ఎంజినీరింగు. ఆం. యంత్రసాధకశాస్త్రము.

ఎంజోయిమెంటు. ఆం. అనుభవము

ఎంటర్ప్రనార్. ఆం. అనుసంధాయకుఁడు.

ఎంటర్ప్రయిజ్. ఆం. కార్యసాహసము.

ఎంటిటి. ఆం. సత్వము.

ఎంటొమాలజీ. ఆం. కీటకశాస్త్రము.

ఎంట్రికాయ. ద్వ. వి. కర్కటకము: చూ, పీత.

ఎంట్రెన్స. ఆం ప్రవేశము.

ఎంట్రెన్సఫీ. ఆం. ప్రవేశకట్నము.

ఎంట్రస్టు. ఆం. ఒకని పరముచేయు.

ఎంట్రీ. ఆం. నమోదుచేయుట.

ఎంట్రుక. దే. వి. 1: చూ, ఎంట్రికాయ. (రూ—ఎండ్రిక.): చూ, పీత; వా. 2. రోమము: చూ, వెండ్రుక (వకారమును సరిగ పలుకలేని హీనజాతుల వాడుక. వెంకి-ఎంకి, వెంటు-ఎంటు, వెంటి-ఎంటి, వెండి-ఎండి, వెండ్రుక-ఎండ్రుక, వెంబడి-ఎంబడి, వెచ్చ-ఎచ్చ, వెట్టి-ఎట్టి, వెడలుపు-ఎడలుపు, వెద-ఎద, వెనుక-ఎనక, వెన్నముద్ద-ఎన్నముద్ద, వెఱ్ఱి-ఎఱ్ఱి, వెల-ఎల, వెల్ల-ఎల్ల, వెళ్లు-ఎళ్లు ఇత్యాదులు భద్రాచలము, రంప, చోడవరములలో హెచ్చుగ వినఁబడును )

ఎండ. దే. వి. 1 ఆతపము "ఆ. ఎండ నీడచేంద మెఱుఁగనేర్చిన గోరగి, యందు నెల్లకాల మర్వ్యమీఁదఁ, దిండిపోతువలె మె తెలియంగ జ్ఞానంబు." వేమన. 619: చూ, వెలుఁగు. 3. (ఎకారము పలికిన నీచమనితలఁచి హీన జాతులవారు పట్టుపట్టి ఇట్టి పదములను వకారముగపూర్చుట మేలనితలఁచి—ఎండ-వెండ, ఎగతాళి-వెగతాళి, ఎచేటు-వచేటు, ఎత్తు-వెత్తు, ఎద్దు-వెద్దు, ఎఱుక-వెఱుక, ఎలక-వెలక అని భద్రాచలము, రంప, చోడవరము ప్రాంతములలో హెచ్చుగ పలుకుదురు ) 2. ఉష్ణము చూ, వేఁడిమి.

ఎండఁగట్టు దే స. క్రి (ఎండన్ + కట్టు.) ఆఱగట్టు. "ముంగిట గుడ్డను ఎండఁగట్టుము." చూ, ఎండవేయు.

ఎండఁగొట్టు. దే స. క్రి. (ఎండన్ + కొట్టు.): చూ, ఎండఁజేయు. "నీళ్లుచల్లక ఆపైరును ఎండఁగొట్టినాఁడు."

ఎండఁజేయు. దే. స. క్రి. (ఎండన్ + చేయు.)

—పై.—

ఎండఁబెట్టు. దే. స. క్రి (ఎండన్ + పెట్టు.): చూ, ఎండవేయు. "వరుగు లెండఁబెట్టుము."

ఎండకన్ను. జా. కష్టములు. "ఎండకన్నును నీడ కన్నెఱుఁగకున్న పుట్టుభోగికి." సారంగధర చరిత్ర.

ఎండకారు. ద్వ. వి. గ్రీష్మఋతువు: చూ, మాసద్వయము.

**ఎండచేటుపుట్టువు.** ద్వ. వి. గొడుగు: చూ, ఛత్రము.

**ఎండదొర.** ద్వ. వి సూర్యుఁడు. "గీ. విపుల ఖర కర ధీతి నవ్విపినసీమ, యండగాని యెండదొరం బోరితరయంబిలుచు, వీంక ఘూక మహోర్భటుల్ వెలయంజేను, కైనం దూఱంగరాని యతశ్కానధిప." శేష. 2, ఆ. (ఇట్లు ఎండ ఱేఁడు లోనగునవి.): చూ, సూర్యుఁడు.

**ఎండమఱువు.** ద్వ.వి: చూ, ఎండచేటుపుట్టువు.

**ఎండమావులు** దే. వి. బ. మిట్టమధ్యాహ్న వేళ బయళ్లయందు నీటివలెం దోంచెడి సూర్యకిరణములు. మరీచిక. "తే. ఎండమావులుచాఁప్వగు నీజగంబు, లండు బరమాత్మయందును దండి గాను." వేమన. 621: చూ, మృగతృష్ణ. (మైరేజి.)

**ఎండవేయు.** దే. స. క్రి. 1: చూ, ఎండఁబెట్టు: 2. (బట్ట) ఆఱవేయు: ఆఱఁగట్టు, ఆఱవేయు, ఎండఁగట్టు.

**ఎండాకు.** దే. వి. (ఎండు + ఆకు) ఎండిపోయిన ఆకు: చూ, సారుగాకు.

**ఎండార్సరు.** ఆం. అన్యపరము చేయువాఁడు.

**ఎండార్సీ.** ఆం. పత్రము వెనుకపీఠీన వ్రాయంబడిన పేరునామాదారు; పత్రము పుచ్చుకొనువాఁడు.

**ఎండార్సుమెంటు.** ఆం. పత్రము వెనుకపీఠీన వ్రాయు వ్రాఁత లేక పత్రముపైన వ్రాయు లిఖితసూచన; బరాతములు ప్రోనోట్లు మున్నగునవి ఇతరులపరముగా వసూలిమ్మని వ్రాయు "వినిమయసూచన." బరాతపువ్రాఁత; బదలాయింపు సూచన.

**ఎండు.** దే. అ. క్రి. 1. తడియాఱు. "తడిగుడ్డ యెండెను." "పచ్చని యాకు యెండెను." "నీళ్ళచెఱువు యెండెను." చూ, మిడుకు. 2. తపించు. "ఎండలో యెండుచున్నాఁడు.": చూ, సంతాపించు; 3. అడుగంటు. "అది అన్నము లేక ఎండుచున్నది.": చూ, శోషించు.

**ఎండుకాయలు.** పా. చిక్కుడు, ఉలవ, పిల్లిపీంచర, బెండ, బీర, ప్రత్తి, ఆముదము మొ॥ కాయలు యెండినప్పుడనేక విధములుగాఁ జీలుచున్నవి. ఉలవ మొ॥ కాయధాన్యములలో గది యొక్కటేయుండుటను బట్టి నిలువుగా చీలి రెండు బ్రద్దలగుచున్నవి. వీటికి ద్వివిదారణపుటక ఫలమనిపేరు. లెగుమ్ (జెస్లేరు) మొదలైనవి ఒక్కగదిని కలిగియుండి యొకవైపున పగులును. అట్టివానికి ఏకవిదారణ పుటకఫలములనిపేరు. ఫాలికల్ (బెండకాయ) వంటి వనేకగదులను గలిగి యనేకవిధములుగా పగులును. వాటికి బహువిదారణ పుటకఫలములనిపేరు (చూ, ఏకవిదారణ పుటకఫలము, ద్వివిదారణ పుటకఫలము, బహువిదారణ పుటకఫలము.)

**ఎండుగడ్డి.** దే. వి. పచ్చిలేకుండఁగ ఆరినగడ్డి: చూ, వట్టిగడ్డి (వ్యతి-పచ్చిగడ్డి.)

**ఎండుగులు.** దే. వి. ఎండఁబోసిన ధాన్యము. రూ- ఎండువులు. "చ. కలమపు టెండుగుల్ ద్రవిడకన్యలు ముంగిటఁగాచుకుండి." ఆము. 1, ఆ. 75: చూ, ధాన్యము.

**ఎండుతెవులు.** దే. వి. బ. దేహములోని మాంసాదులు తగ్గి కృశించెడి రోగము : చూ, రోగము. 1.

**ఎండుపూఁదట్టు.** దే. వి. (ఎండు + తట్టు.) ప్రసేకము, ఏదేని యెండఁబెట్టుటకు కెదురుబ్రద్దలులోనగు వానిచేత నల్లినతట్టు, దాఁగర: చూ, స్యోనము.

**ఎండువులు.** దే. వి. బ: చూ, రూ-ఎండుగులు.

ఎండోకార్డియమ్. ఆం. గుండెకాయ లోపలి పొర.

ఎండోకార్పు. ఆం. టెంక.

ఎండోడెరమ్. ఆం. అంతశ్చర్మము.

ఎండోడెర్మిస్. ఆం. —పై—

ఎండోమెంటు. ఆం. దేవాదాయము, ధర్మాదాయము, ధర్మార్పణము.

ఎండోమెంటు పాలసీ. ఆం. కొన్నాళ్ళవఱకు మాత్రమె పీమియముల కిస్తీలను చెల్లించేవలసిన పద్ధతిగల భీమాపట్టా. నిర్ణీత కాలమైన తరువాత పటాదాఖలా మొత్తము తీసికొనవచ్చును. లేక వడ్డీకి నిలవ యుంచేవచ్చును.

ఎండోమెంటుబోర్డు. ఆం. దేవాదాయపు ఆఫీసు.

ఎండోస్కోప్. ఆం. మూత్రకోశాది పరీక్షా సాధనము.

ఎండోస్పెరమ్. ఆం. అంకురచ్ఛదము.

ఎండ్రకాయ. దే. వి. కర్కటకము. "గీ. ఎండ్రయన నెండ్రికయనంగ నెండ్రకాయ, యనఁగఁ గర్కటాభిధ యలరుచుండు." ఆం.భా.ప్ర. వారి 160: చూ, పీత.

ఎండ్రి. వై. వి.—పై.—

ఎండ్రిక. వై. వి.—పై.—

ఎండ్రిమెక్కుమెకము. ద్వి. వి. జంబుకము: చూ, నక్క.

ఎండ్రిమేఁతరి. ద్వి వి.—పై.—

ఎంత. ద్వి. స. (ఏ + అంత.) 1. ఏకొలఁది. "ఎంతకాలము."; 2. ఏయుద్దేశ్యపు కొలఁది. "గీ. ఇతనిఁజూచి మీకు నెంతమోహముగల, దంతకంటె మాకునధికమైన, మోహరసము మీరి పొంచియున్నది" వి, పు. 7, ఆ. 100 (చూ, ఇంత.) (యును, ఏని, ఓ అనునవి వెనుకఁజేరునపుడు దీనికి అంత్యముఅను నర్థము కలుగుచున్నది. యువర్ణమునకు వికల్పముగ లోపమగు. "సీ. ఎంతయునుసంయమునంతుడు సహా దేవుఁడధ్యాత్మ విద్యానారాధ్యుడెంత, ననఘుం డుధాముండు." భార. సభా. 2, ఆ. 283. మొ. "నీకంతే నితఁడాప్తుఁడో" కళా. 3, ఆ. 33 "ఎంతో సంతోసంబున."); అవ్య. 3. ఏవదర్థకము, ఎంతపర్యంతము: ఎంతదనుక- రూ- ఎందాఁక.

ఎంతయూఁదినను సోలనిండదు. లో. కష్టమంతయు వ్యర్థము.

ఎంథిమెమ్. ఆం (తర్కశాస్త్రములో) పూర్వ సిద్ధాంతములు రెండింటిలో నొకటి చెప్పకుండుట.

ఎందనుక. ద్వి. ద్రి. (ఎంత + దనుక.) రూ-ఎందాఁక

ఎందఱు. ద్వి. స. (ఎంత + వాఁడు.) (ఎంత శబ్దమునకు మహన్మహత్వర్థక బహువచనరూపము.) ఎంతసంఖ్యగలవారు (దీనికి ఏను శబ్దము వెనుకఁజేరునపుడు అనేకులనెడి యర్థముకలుగుచున్నది. "క. కడకంటఁగరుడ నోడమఁగఁ, బడతులు తన్నందఱొనిఁ బరివేష్టింపన్." పీర. 2, ఆ. 190. ఇకారము లోపింపఁగా ఎందఱేన్. "వాఁగడి కత్తె లెందఱేఁగోరి భజింప." కళా. 2, ఆ. 69; "క.ఎందఱు కాంతలఁగాంచిన, నెందఱుముద్దియల రొదుటుపెసఁగంగనిన." వేమన. 689.

ఎందాఁక. ద్వి. ద్రి. (ఎంత + దనుక.): చూ, రూ- ఎందనుక. "క ఎందాఁక మనసునిల్పిన, నందాఁకనుఁ బూర్ణసుఖమె." వేమన. 641.

ఎందు. దే. ద్రి. ఎక్కడ: చూ, యత్ర. 1.

ఎందులకు. దే. ద్రి. 1. ఎచ్చోటికి. "క. ఎందుం డిరేమిపనికై యెందులకేగెదవు." భార.శాం. 3, ఆ. 79: చూ, యత్ర. 1; 2. దేనికి. "వ. ఇదియేమి యెందులకుంబోయెదవు." భార. అర. 2, ఆ. 57: చూ, దేనికి.

ఎందువలన. దే. క్రి. కారణము, యతః: చూ, హేతువు. (రూ-ఎందువల్ల)
ఎంటీరియస్. అం. తేజోమండలము.
ఎంపిరికల్ ఫార్ములా. అం. పామరసూత్రము.
ఎంబన్న. దే. విణ. (ఎంబె + అన్న.) అంబేద: చూ, నిప్ప్రయోజకుఁడు.
ఎంబార్గో. అం. దిగుమతినిషేధము.
ఎంబాసిడర్. అం. రాయబారి, దూత.
ఎంబెరుమతము. పా. ఒకానొక వైష్ణవమతము. "ఆ. ఎంబెరుమతమందు సెనఁగి మాంసముఁ దిని." వేమన. 673.
ఎంబెటికము. దే. వి. తత్వజ్ఞాన దుఃఖేర్ష్యాదుల చేతఁ గలిగెడు హేయత్వబుద్ధి. రూ- ఎబ్బెరికము: చూ, రోఁత. 2.
ఎంబెటికి. దే వి.—పై.—
ఎంబ్రియో. అం. (గర్భశయందలి) పిండము, అంకురము.
ఎంబ్రియాలజీ. అం. పిండోత్పత్తి. వృద్ధులశాస్త్రము.
ఎఁడు. దే. అవ. పరిమాణార్థకము. "క. నీనుడువులకే నడుగెం,డైనను దాఁటునని సత్యమాడెను." రుక్మాం. 5, ఆ. 91.
ఎఁబెట్టు. దే. వి. ఎడఁబెట్టు. బారిముద్ర: చూ, లోహము. 1.
ఎకతాళి. దే. వి. రూ-ఎగతాళి: చూ, పరిహాసము.
ఎకదొట్టు. దే. అ. క్రి. అతిశయించు. "నిట్టూర్పగదొట్టక." ఆము. 5, ఆ చూ, మున్మిచెంచు.
ఎకనమిక్ క్రైసిస్సు. అం. ఆర్థికోత్పాతము.
ఎకనమిక్ గూడ్సు అం. ఆస్తి, సొత్తు.
ఎకనమిక్ లా. అం. ఆర్థికన్యాయము.
ఎకనమిక్ నేషనల్ లైఫ్. అం. జాతీయార్థిక జీవనము.
ఎకనమిక్సు. అం. అర్థశాస్త్రము, ఆర్థికశాస్త్రము
ఎకరము. దే. వి. భూమిని కొలుచుటకు చైను ఉపయోగింపఁబడును. ఒకచైను నూఱు సమభాగములుగ భాగింపఁబడును. అట్టి ఒక్కొక్క భాగమునకు లింకుఅని పేరు. (1) 22=1 చైను; 100 లింకులు= 1 చైను; 220 గ. లేక 10 చైనులు= 1 ఫర్లాంగు; 1760 గ. లేక 80 చైనులు= 1 మైలు; (2) 144 చ. అం= 1 చ. అడుగు; 9 చ. అ= 1 చ. గ; 30 1/4 చ గ= 1 చ. పోలు; 40 చ. పో = 1 రూడ్డు; 4 రూడ్లు లేక 4,840 చ గ= 1 ఎకరము. (3) 22 × 22= 484 చ. గ=1 చ. చైను; 10 చ. చై= 1 ఎకరము; 640 ఎ= 1 చ. మైలు; 1 చ. చైను= 100 × 100= చ. లింకులు; 10 చ. చైన్లు= (10 × 100 × 100) చ. లింకులు= 100,000 చ లింకులు (పదిమంచేములు= 1 ఎకరము; 1/8 పుట్టి= ఎకరము.). ఎకరా
ఎకరా. దే. వి 1. —పై.—(వా); 2. నగరతల వాకిలి చావడి: చూ, హజారము; 3.ఏనుఁగును గట్టు పెంగసాల. "మహాసృద్ధిర, ఎకరాలకో మందువాసాహిణముల గల భద్రోభసందోహవాహా; శ్రీకరంబుంగొంచుఁ దత్త్రప్తభుపులు వనుపన్" స్వా. 1, ఆ. 40: చూ, సజ్జారము.
ఎకరారు. దే. వి. ఒప్పుకొనుట, ఒప్పుదల."వాని బాకీని యిచ్చెదనని వాయెదుట యొకరారు అయినాఁడు.": చూ, సమ్మతి. 1.
ఎకసకియము. దే. వి. 1. రూ- ఎకసకెము, హాసము: చూ, వంచన; 2. రూ- ఎకసకెము, వికటపుమాట, వేళంకోళము. కాశీ. 2, ఆ 146: చూ, పరిహాసము; 3. రూ-ఎకసకెము. అవమానము:చూ, బన్నము. 2; విణ. 4. రూ-ఎకసకెము. వికటము, మిక్కిలి వంకరదైనది

(మాట): చూ, వంకర; 5. రూ- ఎకసకెము. ఎగతాళియైనది: చూ, పరిహాసము.

ఎకసకెము. దే. వి. —పై.— (రూ-ఎకసక్కెము.) (వికటమునకు.— "సీ. జడలల్లి చొల్లి యంబిడి యకసకెముగా బాలేందుకళలంబు పదిలపఱచు" కాశీ. 2, ఆ. 146.)

ఎక్కసక్కెయము. దే. వి.—పై.—(రూ-ఎకసక్కెము.)

ఎకసక్కెము. దే. వి: చూ, రూ- ఎకసక్కెయము—పై.— (వంచన —"ద్వి. అకటా! తెక్కి జిక్కినటుల మాటాడి, యెకసక్కెము యొనర్చి యిచేటునిల్వకయె, యిపుడొగి జనియె నయ్యిందీవరాక్షి." విష్ణు. ఉ. 4, ఆ, వికటపుమాట.—"గీ. జముని వాలికతో నెకసక్కెమాడఁ, దచుకపడు కొత్తపైఁడి మోళము కటారి." సై. 6, ఆ. 94, అవమానము — "చ. మునిపతివచ్చి భ్రావోసఁగి మోదముతోడ భవత్ప్రియాంగనన్, వినుతి యొనర్పఁగావిని నవీనుల మాచేవిగాని మాటలన్, వినవలెనె గదా యిపుడునీవిటువచ్చుట పారిజాతవాసనఁ బ్రకటించినావు నెకసక్కెము చేయనకాదె చెప్పుమా. క. మానంబె తోడవుసతులకు ... మానరహితమయిన బ్రదుకుమానిని కేలా." పా. 1, ఆ. 128; విణ. వికటము.— "ఉ. చేక్కరవంటి రాజయొక సక్కెమదేమని కూర్చుకొంటి వ్యక్కక్క." విజ. 6, ఆ. 45. (దీనికిని రూపాంతరములకును పరిహాస మర్థమని కొందఱు చెప్పుచున్నందున నటులఁజూపఁబడియెను. కాని కవుల ప్రయోగసరణిని బట్టి అదినిర్ధారణ చేయఁగూడలేదు.)

ఎకసెకియము. దే. వి. —పై— (రూ- ఎకసెకెము.)

ఎకసెకెము. దే. వి. —పై.—(రూ- ఎకసెక్కెము.)

ఎకసెక్కెయము. దే. వి.—పై.— (రూ- ఎకసెక్కెము)

ఎకసెక్కెము దే వి. రూ- ఎకసెక్కెయము. —పై.—(వికటపుమాట.— "చ. బొమలెగపైచి కన్గొనుచుఁ బొందుగఁ గన్గొనిపేరు గుప్పిచ్చి కొంచెముగ హసించి యొక్కయొక సెక్కెమటాడి యయారనీకు గంధముకదు నందహానని ముదంబునఁక్కిలి గింటియిట్లు నె, య్యమెసఁగఁ బల్కరించెనలినాక్షుల నందఱి నన్నిభంగులన్." వసు. 1, ఆ. 62)

ఎకాడమీ ఆం. పరిషత్తు.

ఎకానమీ. ఆం. మితవ్యయము, పొదుపు

ఎకాయకీ హిం. క్రి. విణ. ఎక్కడను నిలువకనే (అతివేగముగా.) "ఎకాయకీని వచ్చినాను." తెనుఁగున గోదావరీమండలమున వాడెదరు.)

ఎకిమీఁడు. దే వి. అధిపతి: చూ, ప్రభువు 2.

ఎకిరింత. దే. వి. 1. రూ-ఎక్కిరింత, ఎక్కఁదగిన యేనుఁగులోనగునది. "సీ. రేవెలుంగును దాల్చు దేవేరియగు దుర్గ కెకిరింతయై మించు మెకముదక్క." రామా. 3, ఆ. 58: చూ, వాహనము; 2 రూ- ఎక్కిరింత, ఎగతాళి: చూ, పరిహాసము.

ఎక్కటి. దే వి. 1. శూరుఁడు, ఉక్కుతునియ: చూ, హంవీరుఁడు 2; విణ. 2.=ఏకాకి. అసహాయుఁడు. "ఉ. భీముఁడా, నెక్కటి దాఁకెదిక్కరిసహింపక సింహముదాఁకినట్టులు." భార. అర. 4, ఆ. 12: చూ, ఒంటరీఁడు 3; స. ఏ. 3 = ఏకః ఒకటి. "సీ. రేవెలుంగును దాల్చు దేవేరియగు దుర్గ కెకిరింతయై మించు మెకముదక్క. లక్ష్మీ. 2, ఆ. 8: చూ, వంచి; వి 4. అసహాయము. ఎక్కటికయ్యము." సౌ; భాగ. ఉద్యో. 2, ఆ. 52: చూ, ఒక్కుమ్మడివతనము.

ఎక్కటికయ్యము. ద్వ. వి. ద్వంద్వయుద్ధము, దండపోరు: చూ, యుద్ధము.

ఎక్కటిబవరము. ద్వ. వి. అసహాయయుద్ధము, ఒంటిపోట్లాట: చూ, యుద్ధము.

ఎక్కటీఁడు. వై. వి. అసహాయుఁడైన బంటు. "సీ. ఇగురుకైతవపుటెక్కటీలకు గుజ్జప అత్రు మామిడి కట్టఁబడిగఁజేసి." చంద్రా. 4, ఆ. 84: చూ, ఒంటరీఁడు. 2. (స్వార్థమున ఈఁడు.)

ఎక్కడ. దే. వి. ఏ. (ఏ + కడ.) 1 ఏచోటు: చూ, యత్ర. 1. (అక్కడ, ఇక్కడ, ఎక్కడ శబ్దముల కడపటువృత్తియందు ఇకారము వచ్చుటచేత అవి వేఱువేఱుశబ్దములుగా గ్రహింపఁబడియెను. ఎక్కడివార్త ఇక్కడివార్త, అక్కడివార్త. మొ.)

ఎక్కము. దే. వి. 1. మడికిఁజొట్టు నేర్పఱచిన చిన్నకట్ట, గనిమ: చూ, సేతువు. 1; వై. స. ఏ. 2. ఒకటి: చూ, వంది.

ఎక్కములు. వై. స. బ. రూ- ఎక్కాలు. (పెంచెకు లెక్కసంబంధమయినదియు, భాగహార సంబంధమైనదియు ఎక్కమనిపించుకొనును. ఎక్కములో సంబంధములేని మానము సృష్టియందులేదు.): చూ, గుణకహారపథకము.

ఎక్కలి. దే. వి. ప్రవాహవేగముచే కొట్టుకొని వచ్చి కమ్ముకొనిన యిసుక: చూ, మేట

ఎక్కసకియము. దే వి: చూ, రూ-ఎక్కసక్కెము. (రూ-ఎకసకియము.)

ఎక్కసకెము. దే. వి -వై -(రూ -ఎకసక్కెము )

ఎక్కసక్కియము. దే. వి — వై —(రూ-ఎకసక్కెము.)

ఎక్కసక్కెము. దే. వి.—వై.—(రూ-ఎకసకెము.) (వికటపుమాట —"సీ. నిక్కపీనుల తోడ, ఎక్కసక్కెములాడఁ కరణినున్నవి [illegible] ఘనఘనములు." [illegible]

ఎక్కసెకియము. దే వి —వై—(రూ-ఎక్కసెకము.)

ఎక్కసెకము. దే. వి. —వై— (రూ-ఎక్కసెక్కెము.)

ఎక్కసెక్కియము. దే. వి. -వై.- (రూ. ఎక్కసెక్కెము.)

ఎక్కసెక్కెము. దే. వి.—వై —(రూ-ఎక్కసెక్కియము.)

ఎక్కాడు. దే. స. క్రి. (ఎక్కు + ఆడు.) పురికొలుపు. "ఎ, గీ. పులిపేదవడినఁ బసుల, వాండ్రె యెక్కాడిరనుకత వచ్చెనాకు." ఉ, హరి. 4, ఆ. 108: చూ, ప్రేరేపించు.

ఎక్కిడు. దే. స. క్రి నారిగలదానిగాఁజేయు. "చ. కడువడి సత్యసేన తురగంబులఁగూల్చి శరాసనంబుఁ జ, క్కడిచిన నొండు తేరికి రయంబు మెయింజని యన్యచాపమె, క్కుడుటయు నక్కుమారుని శితేషు యుగంబున నొంచినొంచె" భార. కల్య. 1, ఆ. 140: చూ, మోపెట్టు.

ఎక్కిరింత. దే. వి: చూ, రూ-ఎకిరింత

ఎక్కిరింతమేకము. ద్వ. వి. కోఁతి: చూ, వానరము.

ఎక్కిలి. వై. వి.=హిక్క. దప్పి మొదలగువానిచేఁ గలుగు తేవులు: చూ, హిక్క. 1.

ఎక్కు. దే. వి. వింటినారి. "చ. దైవమే, మనఁగల దట్లకోకయని యాత్మ నలందురి మంద చేష్టఁడై. వ. ఎక్కుడించినఁ బాండవాగ్రజుండు." భార. విరా. 1, ఆ. 169: చూ, మౌర్వి. 1; ఆ. క్రి. 2. అతిశయించు. "ఉ. ఎక్కలుసించి కంతమున కేతులు వాపి శరంబువ్రచ్చి పే, రుక్కునఁ గ్రొంచ చందమగు కొద్దుగలంగఁగఁజేసి భీష్ముఁడే, దిక్కునఁదానయై దిశలు దీటుకొనన్ శరకోటి [illegible]

సేయఁగఁ గ్రీడి కృష్ణునితోన్." భార. భీష్మ. 2, ఆ. 80: చూ, ముమ్మరించు; 3. ఇష్టమగు. "వ. అధ్వరకర్మము లెల్లనీదు నెమ్మనమున కెక్కఁ జేయుదుము." భార. అశ్వ. 3, ఆ. 218: చూ, సంధించు. 2; 4. జేతపడు, "క. దిన మొక్కొక్కటి యెక్కఁగ, వనజాక్షుం డుపవసించి వత్సరమెల్లం, జనఁగా నొక్కొక్కయది యెక్కనుపాసంబుండి యశేషకర్మము నడపున్." ఉ, హరి. 2, ఆ. 166: చూ, సిద్ధించు; 5. తీఁగెపాఁకు: చూ, పాఁకు. 31, స. క్రి. 6 అధిరోహించు, అమ్ముతో జరగు: చూ, పాఁకు 4.

ఎక్కుడగు. దే. అ. క్రి: చూ, ఉద్దండించు. 1.

ఎక్కుడించు. దే. స. క్రి. హెచ్చునటులఁ జేయు. "గీ. వర్ణములు నాశ్రమంబులు వసుమతీశ, కలియుగంబునఁ గత్తరఁగలసిపోవుఁ గాన ధర్మంబు రూపయి కానరాదొ, కింత కలిగిన నది ఫలం బెక్కుడించు." హరి. ఉ. 9, ఆ. 87: చూ, హెచ్చించు.

ఎక్కుడు. దే వి. 1. ఎక్కుటింత (ఎక్కఁదగిన యేనుఁగు లోనగునది.) "ఎక్కుడివారొకో గరుడుఁడెక్కుడు గాఁ గలవాఁడు." ఉ, హరి. 6, ఆ. 31: చూ, వాహనము; 2. ఆరోహణము. "ద్వి. మెలఁతకు నెక్కుడల్లన నేర్పుచు." రా. అర, కాం. 180: చూ, పాఁకుడు. 1; 3. వింటినారి. "అతఁడొండొక బాణాసన మెక్కుడుపెట్టి." విక్రి 6, ఆ. 27: చూ, మౌర్వి. 1; 4. అతిశయము: చూ, హెచ్చు. 1; విణ 4. ఉత్కృష్టము. "వీరపో యెక్కుడు వారు లోకులకు." ఉ, హరి. 6. ఆ. 37: చూ, శ్రైష్ఠ్యము; 5. అధికము. "రూపెక్కుడు." "ఎక్కుడువేగము.": చూ, హేరాళము.

ఎక్కుడుఁదీఁగె ద్వ. వి. జ్యోతిష్మతి, అగ్నిభాస *: చూ, మానేరు.

ఎక్కుడుపెట్టు దే. స. క్రి. నారిగలదానిగాఁ జేయు. "అతఁడొండొక బాణాసన మెక్కుడు పెట్టి." విక్రి. 6, ఆ. 27: చూ, మోపెట్టు.

ఎక్కుడుమెకము. ద్వ. వి. ఏనుఁగు చూ, హస్తి.

ఎక్కుపెట్టు. దే. స. క్రి. రూ-ఎక్కువెట్టు. "తే. ఒక్క విల్లెక్కువెట్టంగ నుఱక వెసఁ, ఖండిపటుమార్గణంబులఁ గడఁగి యేయ నతఁడు మిసిమింతుఁడును గామి కల్లనవ్వి, పఱపెఁ దన యమ్ములతనిపై ఫల్గుణుండు." భార భీష్మ. 3, ఆ. 398; వ. ఇవ్విధంబున సన్నద్ధుండై... గాండీవంబుఁ బుచ్చికొని యెక్కువెట్టి ముష్టి నలవరించి గుణధ్వని సేసిన." భాగ. విరా: 4. ఆ. 168 చూ, మోపెట్టు.

ఎక్కులు. దే. వి. డీకు: చూ, ప్రేరేపణ

ఎక్కులుపెట్టు. దే స. క్రి. ఎక్కాడు. "ఉ. ఎగ్గులుచూపి చంపుమని యెక్కులు పెట్టినవారి పల్కులే, లగ్గుగ నాత్మలోపలఁ దలంచి వివేకములేకయుట్టి నీ, కగ్గలమైన దండమనయంబునఁ జేసితి." దశ. 8, ఆ. 46: చూ, ప్రేరేపించు.

ఎక్కువ. దే. వి. 1. అధిక్యము, అతిశయము. "క. అనుపమతత్పురనారీ, జనులకు నచ్చేరల కంగ సౌందర్యమునం, గనఁబడ దెక్కువ తక్కువ, కనుఱెప్పల యందకాని గణుతింపంగన్." కవిక. 1, ఆ: చూ, హెచ్చు: 1; విణ. 2. అధికము. "ఉ. నీమగఁడంతయెక్కుడె మనీషులఁభూసురులింత తక్కువే." "ఎక్కుడ" అనిపాఠాంతరము; "వ. ఇది మనము నెఱుహాంబు సంగానమినొండె వారు లోభంబున వచ్చుటకొండెనగుంగావున నెక్కువ దక్షిణలు నిరూపించి భీష్ములం దీని నిశ్చయింపవలయు." భార.

విరా. 4, ఆ. 185: చూ, హేరాళము; 3. ఉత్కృష్టము: చూ, శ్రేష్ఠము.

ఎక్కువెట్టు. దే స. క్రి: చూ, రూ-ఎక్కుపెట్టు.

ఎక్కుడువాఁడు. దే. వి. ఆరోహకుఁడు: చూ, ప్రాఁకెడువాఁడు.

ఎక్ఛేంజి. ఆం. మారకము; వినిమయము; పరివర్తనము; వివిధదేశముల ద్రవ్యముల మారకము; మారకపుబజారు

ఎక్ఛేంజిఏబిలిటీ. ఆం వినిమయసాధ్యత.

ఎక్ఛేంజిగుడ్సు. ఆం. అపమిత్యకములు. ఒక వస్తువుమయిచ్చి దానికిమారుగా పుచ్చుకొన్న మఱియొక వస్తువు.

ఎక్ఛేంజిరేటు. ఆం. మారకపుధర.

ఎక్ఛేంజిస్టాండర్డు. ఆం. మారకపుప్రమాణము.

ఎక్సరుసైజు. ఆం. శరీరవ్యాయామము.

ఎక్స్ఛెకరు. ఆం. ప్రభుత్వకోశము, బొక్కసము.

ఎక్సైజు. ఆం. అబ్కారీ, తీరువ. సుంకము, పన్ను.

ఎక్స్టీరియర్. ఆం. బహిర్భాగము.

ఎక్స్ కమ్యూనికేషన్. ఆం. ఆంక్ష.

ఎక్స్పార్టీ. ఆం. పరోక్షముగా.

ఎక్స్పెన్సెస్. ఆం. ఖర్చులు.

ఎక్స్పెరిమెంటు. ఆం. తార్కాణము చూపుట; నూతనప్రయత్నము.

ఎక్స్ప్రెస్. ఆం. మెయిలుతో సమముగఁ బోవు పొగబండి.

ఎక్స్ప్లనేషన్. ఆం సమాధానము.

ఎక్స్హాలంటోజి. ఆం. పరలోకశాస్త్రము; ప్రళయశాస్త్రము.

ఎక్స్పల్షన్. ఆ. నిషేధము, అపకారము.

ఎగ. దే. దే. అవ. ఎగువశబ్దమునకు వృత్తియందు ఆదేశముగా వచ్చిన రూపము. (చూ, దిగ.) వృత్తియందిది అర్థభేదము నిచ్చుచున్నది. ఎగఁగొట్టు, ఎగఁగ్రోలు, ఎగఁజిల్లు, ఎగఁజిమ్ము, ఎగఁజేపు, ఎగఁదన్ను, ఎగఁబట్టు. ఎగఁబాఱు, ఎగఁబోఁత, ఎగఁబోయు, ఎగఁబ్రాఁకు, ఎగదువ్వు, ఎగనూఁదు. ఎగనెత్తు, ఎగరోఁజు, ఎగవిడుచు, ఎగవేయు, ఎగవైచు ఇత్యాదులు )

ఎగఊపిరి. ద్వ. వి. ఉచ్ఛ్వాసము: చూ, శ్వాసము (చూ, వాయువు.) (చూ, ఊపిరి.)

ఎగఁగొట్టు. దే. స. క్రి. ఎగురఁజేయు. "సీ. వీచి తన్నెగఁగొట్టు వెక్కసంబగు సుడిగాలి రక్కసుమీఁదలాగియూఁగి." పను. 1, ఆ. 32: ఎగురఁజేయు.

ఎగఁగ్రోలు. దే. స క్రి. పీల్చు. "క. బలిమి నొక్కటి నోరన్, సలిలంబెగఁగ్రోలుచుండఁ జనిరాచెలువల్, నలువురుఁదద్వదనములో, పలికాసలిలంబు వెంటఁ బార్థివతిలకా." కాశీ 6, ఆ. 109: చూ, పీలుచు.

ఎగఁజిల్లు. దే స క్రి. మీఁదికిఁజిల్లు. "చ. నెలఁతలు బంతిగట్టుకొని నీరెగఁజల్లఁ దదీయ మంజులాం, జలికలితోదకంబెగయు జాడ నతింపఁగనయ్యె." వసు. 3, ఆ 151: పైకిఁజల్లు

ఎగఁజిమ్ముట. దే. వి. చూ, ఉత్క్షేపము. 2 —

ఎగఁజేపు. దే. అ. క్రి పొదుగునందలి పాలు పైకితెచ్చు, క్రిందకు పడకుండునట్లుఁ జేయు. "ఆవు ఎగఁజేపినది."

ఎగఁదన్ను. దే. అ. క్రి. ఎగువకుఁదన్ను. "పాఁడి యావు ఎగఁదన్నినది."

ఎగఁబట్టు. దే. స. క్రి. ఎత్తిపట్టు. "చ. శలముల నెత్తరాక యధికంబుగ వ్రేఁగయియున్న దేవుఁగ్రి, మ్మఱఁ బెనుఁగొంగిటం బెనఁచి మాటికిమాటికిఁ బట్టిరెత్తిరన్, బరువయితోఁచె నంతనెగఁబట్ట సమర్థుఁడుఁగాక" శివ. 5, ఆ: చూ, ఎత్తిపెట్టు.

ఎగఁబాఱు. దే. అ. క్రి. ఎగువకుఁబాఱు.

ఎగఁబోఁత. దే. వి. 1. ఎగువకు వ్యాపించుట. "వానికిచెమట ఎగఁబోఁత దిగఁబోఁతలుగా నున్నది."; 2. దుర్బోధనచేయుట

ఎగఁబోయు. దే. అ. క్రి. 1. దుర్బోధఁజేయు. "చ. దయఁగృప పర్వ పుత్రియుడఁ దద్దయు నుంచి యయాతిభార్గవ, ప్రియసుత నాదరింపక చరింపయదుండది చూచి తల్లి కం, తయునెఁబోసి గోదమెదఁ దాల్కొనఁజేసిన." ఉ, రా. 6, ఆ. 397; స క్రి 2 చూడగా తెలియఁజేయు. "సీ. మధుసదంబెగఁబోసె మాకందమాలికా క్రీడానుషంగి భృంగీగణంబు." స్వా. 6, ఆ. 29: చూ, సూచించు

ఎగఁబ్రాఁకు దే. అ క్రి. పైకిఁబ్రాఁకు. "ద్వి. అచేలంబుపైకి గుండనకి చెట్టనక, కిచకిచధ్వనులతోఁ గిచకొట్టుకొనుచు, నెగఁబ్రాఁకి యెక్కుచో." రా. కిష్కిం, కాం. 199: చూ, మీఁదికిఁబ్రాఁకు.

ఎగఊపిరి. దే వి. ఊర్ధ్వశ్వాసము: చూ, శ్వాసము.

ఎగచు. దే, ప్రే. ఎగయఁజేయు. "ఆ. వీరసేన సుతుఁడు వీరుండుహంసల, నడబెడంగుఁజూచి నగుచువాని, నెగచియెగచి యందునెగయకుండఁ ద్రొక్కి, హంసఁబట్టుకొనియె నతిరయమున." భార. అర. 2, ఆ. 12: చూ, ఎగయు. (ఇది పొగచువంటిది) రూ- ఎగుచు - ఎవుచు; 2. తఱుము. "విహంగగమనుం డెగవక." నిర్వ. 8, ఆ. 83. (కొన్నియెడల ధాతువునకు ప్రేరణమునందర్థభేదమును కలుగుచున్నది: చూ, కావించు.) "సీ. బలముఁగడిమి,నెగచె." భార. భీష్మ. 3, ఆ. 86: చూ, కంబడించు.

ఎగతాళి. దే. వి. రూ- ఎకతాళి. "ఎగతాళి మాటలాడకుము.": చూ, పరిహాసము.

ఎగదిగ. దే. ద్వి. రూ-ఎగాదిగ. ఎగువదిగువలుగా. "ఎ, గీ ఏగి తనకూఁతు సింగారమెల్లఁ బెక్కు, మాఱులెగదిగఁ గ్రొంగంటఁ బాఱఁ జూచి." కళా. 7, ఆ. 67: చూ, పైకి క్రిందికి.

ఎగఁదీసిన బ్రహ్మహత్య దిగఁదీసిన గోహత్య. లో. పైకిలాగిన బ్రాహ్మణునిఁజంపినపాపము క్రిందకులాగిన గోవును జంపినపాపము(ముందుకుఁబోయిననుయ్యి, వెనుకకుఁబోయిన గొయ్యివంటిది గరళకంఠునిపగిది అని భావము.)

ఎగదువ్వు దే. స. క్రి. మీఁదికిదువ్వు. "సీ. డిగ జాలు ముంగురులెగదువ్వు కైతవంబున నెమ్మొగంబుపై మోముఁజేర్చి." కవి. 3, ఆ: చూ, పైకిదువ్వు.

ఎగనూఁదు దే. స. క్రి. 1 మీఁదికి ఊదు: చూ, పైకినూఁదు; 2. అనాదరించు. "సీ. గాంధర్వగమకరేఖఁ బరాహతముచేసె వాంశికవంశికా వైభవంబు, వాంశికవంశికా వైభవంబెగనూఁదెఁ దాళికాధర కరతాళగరిమ." వసు. 5, ఆ. 79: చూ, తిరస్కరించు.

ఎగనెత్తు. దే. స. క్రి. పైకెత్తు. "మగుడఁ దన్నేదుచు నెగనెత్తిపట్టఁగా." కళా. 7, ఆ. 165: చూ, మీఁదికెత్తు

ఎగపు. దే. వి. 1. గర్వము: చూ, హంకారము; 2. మండిపడుట. "ద్వి. బాగుమీఱిన నాగబందపుమొగపు, తీఁగదానికిఁగల్గదీఱడె యొగపు." భాగ. 10, స్కం: చూ, రూ-నెగపు; 3. పక్షిగతి. రూ-ఎగుపు: చూ, పల్లటీ. 1.

ఎగయు. దే. అ. క్రి. 1. ఉత్పతనమగు, ఎగురు: చూ, లంఘించు; 2. పైకిలేచు. "క. మను మసకనయ్యె దిక్కులు, పసి క్రేపుఁదలంచి తిరుగఁబడె గూళ్ళకు కకుం, తసమాజము కలకలములె, గసె వెడవెడకన్ను మొగిచెఁ గమలవనంబుల్." జై. 2, ఆ. 101: చూ, రేఁగు.

ఎగయుట. దే.వి. ఉద్వర్తనము: చూ, ఎగురుట.

ఎగయువాఁడు. దే.వి: చూ, రూ-ఎగియువాఁడు.

ఎగఁబోఁత. ద్వ వి. వరికుప్ప నూర్చిన పిదప ప్రోగుచేసిన మండెలోని ధాన్యము చేటలతో నెత్తి గాలివీచునపుడు క్రిందికి వంపుగా దిగ విడుచుట: చూ, తూర్పెత్తు. (గాలిలేనపుడైనను ఎగఁబోయఁగలుగుయంత్రములు కొన్ని గలవు. ఈయంత్రము రమారమి రు120-0-0లు వెలకు దొరకును. దీనితో నలుగురు మనుష్యులు దినమునకు అనఁగా 8 గంటలలో 1200 మొదలు 1500 కుంచముల ధాన్యము వఱకు నెగఁబోయఁగలరు పునాసపంటలు నూర్చినపుడు పయరగాలి అంతగా నుండదు కావున వాని నెగఁబోయుటకిది యవసరము వాన కురియుచున్నను దీనిలోకి సాలలోనుంచి యచ్చట ధాన్యము నెగఁబోయవచ్చును. ఇందుండు జల్లెడలు ధాన్యమునుండి రాళ్లు యిసుక మొదలగువానిని విడఁదీసి శుభ్రము చేయును.)

ఎగరొప్పు. ద్వ. వి. రూ-ఎగరోఁజు: చూ, నిట్టూర్పు. (చూ, వాయువు.)

ఎగరోఁజు. ద్వ. వి. -వై.- "వాఁడు ఎగరోఁజు దిగరోఁజులుగా పరుగెత్తుచున్నాఁడు."

ఎగలాగడికత్తె. పా. (కేపిలరీ ఎట్రాక్షన్.)

ఎగవిడుచు. దే. స. క్రి. ఊరకవిడుచు. "తెక తేరగ నీకాగవిడిచిపోయెదను." కళా. 3, అ. 191.

ఎగవు. దే. వి: చూ, రూ-ఎగపు. 3.

ఎగవేయు. దే. స. క్రి. 1. అపహరించు: చూ, దొంగిలించు; 2. చేసినది లేదని సాధించు. "ద్వి. ఎంతైనఁజేసి తా నెగవేయఁగలుగు." పా. 7, ఆ.

ఎగవైచు. దే. స. క్రి. ఎగురవైచు. "వైలము లెత్తి కందుకము పేందముగా నెగవైచి." రామా 5, అ 291.

ఎగసన. దే ద్రి ఎగువగా. "సీ తుదివ్రేలనెగసనఁ దోఁచిన పుదియబొట్టురు ఫాలపట్టిక నుల్లసిల్ల." రా అర. 2, అ. 82

ఎగసిపడు. ద్వ అ. క్రి. 1. ఎగిరిపడు, ఉంకు: చూ, లంఘించు; 2. గర్వించు: చూ, హుంకరించు; 3. జ్వలించు: చూ, మండు. 1.

ఎగసిపాటు ద్వ. వి. 1. ఉంకింపు. "క. భసలమనీకింత యెగసిపాటేమిటికిక్." రసి. 4, అ. 171: చూ, విజృంభణము; 2. గరువము. "క. భసలమనీకింత యెగసిపాటేమిటికిన్." రసి 4, అ.171: చూ, హుంకారము; 3.జ్వలించుట: చూ, మండిపాటు.

ఎగసిల్లు. దే. అ. క్రి. ఉత్పతనమగు: చూ, లంఘించు. (అ ప్ర)

ఎగాదిగ. దే ద్రి. ఎగువదిగువలుగా. "ఉ కాంచి సుమాలి వెండియు నెగాదిగఁజూచి" ఉ, రా. 2, అ. 116: చూ, రూ-ఎగదిగ.

ఎగియువాఁడు. దే.వి. పైకిలేచువాఁడు: రూ-ఎగయువాఁడు: (సం. ప.):—ఉత్పతనశీలుఁడు, ఉత్పతిత, ఉత్పతిష్ణువు.

ఎగు. దే. విణ. వృత్తియందు ఎగువ శబ్దమునకును ఎగురుశబ్దమునకును అంత్యవర్ణము లోపింపఁగా మిగిలినరూపము. "ఎగుబుజేములు, ఎగుబోద." వెం

ఎగుచు. దే. ప్రే. 1. ఎగయఁజేయు: చూ, ఎగచు. 1; 2. తఱుము. "క. ఆమ్మెయిని నోడితానుం, దమ్ముఁడు హతశేషమైన దానవబలముల్, గ్రమ్మఱి తనవచ్చిన మా, ర్గమ్మునఁ బాఱెను విహంగమనుం డెగుచన్." నిర్వ. 3, అ 88: చూ, వెంబడించు.

ఎగుడు. దే.విణ. ఎత్తుగానున్నది: చూ, పొడవు.2

ఎగుడుదిగుడు. దే. విణ. 1. సమముకానిది. "ఎగుడుదిగుడు నేల.": చూ, విషమము; 2. యుక్తియుక్తములేనిది (సంభాషణము.) "ఎగుడుదిగుడుమాటలు.": చూ, దూఁకుడు.

ఎగుదల. ద్వ. వి. 1. ఊర్ధ్వభాగము: చూ, మీఁదు. 2; 2. అధి' చూ, తాకట్టు; 3. అధికము' చూ, హెచ్చు. 1.

ఎగురు. దే. వి. పక్షిగతి: చూ, రూ-ఎగ్రు. 3

ఎగుపులు. దే. వి బ. మరణకాలమందు వచ్చెడి ఊర్ధ్వశ్వాసలు.

ఎగుబుజేము. ద్వ వి ఎత్తైన బుజేము. "ఎ, గీ. పాలుపుమీఱుచు నెగుబుజేంబులును దారు, జేమలి మూఁపురములతోడ నమరు మల్ల, రంభ్రటాఁబోతులును బోలెఁబెంపుమీఱ జెట్టుచనదెంచి రాస్పృశసేవకోటికు" పర 3, ఆ. 48 (వ్యతి-దిగుబుజేము.)

ఎగుబోద. ద్వ. వి. రెక్కలుమొలచి యెగిరెడు వయసువచ్చిన పక్షిపిల్ల: చూ, పక్షి.

ఎగుమతి. దే. వి. ఓడకు సరకులెక్కించుట. (ఎక్సుపోర్టు)

ఎగుమతిదారుఁడు. దే. వి 1. ఓడకు సరకులెక్కించువాఁడు. (ఎక్సుపోర్టరు.); వా. 2. పొట్టనిండుగ మెక్కువాఁడు.

ఎగురు. దే. అ. క్రి. ఉంకు: చూ, లంఘించు.

ఎగురుట. దే. వి. పైకుబుకుట, భూమినివదలి పైకెగయుట: ఎగయుట: (సం. వ):—ఉత్పతనము, ఉద్వర్తనము. (చూ, లంఘు.)

ఎగురులాడు. దే. అ. క్రి. ఉంకు: చూ, లంఘించు.

ఎగువ, దే. వి. 1. ఊర్ధ్వభాగము. "ఆ. ఎగువ దిగువఁజూడ కేపొద్దుమదిలోన." వేమన. 597: చూ, మీఁదు. 2; 2. ఆధిక్యము. "క. తగవా మగవారికినిటు, మగువలయందెగువఁ గాఫ." రామా. 5, ఆ. 148: చూ, హెచ్చు. 1; విణ. 3 ఉన్నతము: చూ, పొడవు. 2.(వృత్తియందు అంత్యవర్ణలోపము)

ఎగ్గడ. దే. దక్రి. రూ-ఎక్కడ: చూ, యుక్తి. 1.

ఎగ్గడము. దే. వి. దట్టము: చూ, సాంద్రము. 2.

ఎగ్గడి. వై. వి. = పేడః. కొజ్జ చూ, పోవిదల్లుఁడు.

ఎగ్గడికత్తె. వై. వి. అంతఃపురకావలి కత్తె. (స్వార్థమునకత్తె.): చూ, రూ- హెగ్గడికత్తె

ఎగ్గడీఁడు. వై. వి. 1.=పేడః. అంగశాల: చూ, ఎగ్గడి.

ఎగ్గతము. వై. వి. 1 = ఏకాంతమ్. ఇద్దఱకంటె నెక్కువమందిలేనిది. "ఎ, గీ. ఎగ్గతంబునఁ దానుగారగ్గిఁ గాలె, నటె."(ఇకక్కడ ఒక్కఁడె లేక ఒక్కతెఅని భావము) భార. ఆశ్రి. 2, ఆ. 168. "ఎ, గీ. అయ్యర్వ్యయతఁ డెగ్గతంపుఁజోటు, పరయదిక్కువ్వరుమ లేవి యట్టితెగుట, నొందఁగలవాఁడుగాఁ బల్కు." భాగ. వశా. 1, ఆ. 157: చూ, రహస్యము. 1; 2 =ఏకాంతమ్. నిరాధారత్వము: చూ, దిక్కుమాలినతనము.

ఎగ్గాడు. దే. స. క్రి. (ఎగ్గు + ఆడు.) దూషించు. "శా. తోడంబుట్టిన వానిభంగమునకుఁ దుఃఖించి మాకృష్ణు నెగ్గాడంజాడకుమమ్మ." భాగ. 10, స్కం. పూ. 1778: చూ, నిందించు.

ఎగ్గించు. దే. స. క్రి అనాదరించు. భాగ. 10, స్కం. పూ. 1778. చూ, తిరస్కరించు.

ఎగ్గు. దే. వి. 1. కీడు. "ఉ. అగ్గి సొరందలంచు నటులర్జును నెక్కటిదాఁకఁ గోర నీ, కగ్గిది మానుమీపలుకు లెవ్వరుఁజెప్పఁగ వేరుమాప ఆశ్రమ్రగ్గఁగఁగాల మయ్యెనొకో." భార. కర్ణ. 2, ఆ. 86: చూ, హాని. 2; 2. అపకారము. "వ. ఇట్లు దుర్యోధనుండు భీమునకుఁ దనచేసిన రొంగ్గలెల్లను గృతఘ్నునకుం జేసిన లగ్గులం

నుంబోలె నిష్ఫలంబులైన సిగ్గువడి" భార. ఆది. 5, ఆ. 180; "బ్రాహ్మణ పీమలకెగ్గు సేయు." భో 3, ఆ. 187: చూ, హాని 2; 3. కీడుమాట. "ఎగ్గు నారుకతి పేరెసఁగుచుండు" ఆం, భా ప్రి. వాక్య. 117: చూ, రుకతి; 4. అపరాధము, తప్పు. "శా. ఏలా యింత వృథాభిమానము క్రియాహీనుండవై సావిధం, బాలోకింపక యెగ్గుచేసితివి."భో. 3, ఆ. 114: చూ, నేరము; 5. దోషము. "నను నెగ్గులు పట్టకుండినఁ బొందొనరుచ్." భార. కర్ణ. 1, ఆ. "ఆ. ఎగ్గుసిగ్గులేని దేకమై తోఁపఁగా." వేమన. 599: చూ, పాపము; 6. అనాదరము. "శ. ఏలా షట్పదయెగ్గు మావలననీకగ్గింపఁగా నేటికిన్." భాగ. 10, స్కం. పూ. 1460: చూ, వహేలనము.

ఎగ్గుర్తు. దే. వి (ఎగుక + గుఱుతు.) రూ-ఎగ్గుఱుతు. విషయసంగ్రహము, గ్రంథము మొదటవ్రాసెడు దాని పుట్టు పూర్వోత్తరము: చూ, పీఠిక.

ఎగ్గుఱుతు. దే. వి. —పై.— "ఎగ్గుఱుతు లెక్క."

ఎగ్గులాడు. దే. స. క్రి. (ఎగ్గులు + ఆడు.) దూషించు: చూ, నిందించు.

ఎగ్గులు దే. వి. బ. దూషణము. "చ. ఇతనికి నన్ను నిట్టుఱక యెగ్గులుపల్కఁగఁ బోలుఁగాక యు,ద్ధతమతి నన్యులీతని విధంబునఁబల్కఁ మదీయచాప ని,గ్గత చటులోగ్ర మార్గణనికాయ పయోధిమునుంగక." భార. సభా. 2, ఆ. 61: చూ, నింద. 1.

ఎగ్గడ. దే. ద్రి. రూ- ఎగ్గడ: చూ, యత్రి. 1

ఎగ్జాస్టమన్‌పంప్, ఆం. నిష్పీడనయంత్రము.

ఎగ్జిక్యూషన్. ఆం తీర్పునములజరుపుట, జరుపుట; ఊరిదీయుట.

ఎగ్జిక్యూటివు. ఆం. కార్యనిర్వాహక వర్గము.

ఎగ్జిక్యూటివుకౌన్సిలు. ఆం. పరిపాలకసంఘము.

ఎగ్జిక్యూటివు యింజనీయరు. ఆం. కార్యనిర్వాహణాధికారి.

ఎగ్జిక్యూటరు. ఆం. మరణశాసనములోని షరతులను నిర్వహించుటకు నియమింపఁబడిన ధర్మకర్త.

ఎగ్జెమ్షన్ ఆం. విముక్తత.

ఎగ్జిబిషన్. ఆం. ప్రదర్శనము.

ఎగ్జిబిట్ మార్కు. ఆం. నిదర్శన పత్రిచిహ్నము.

ఎచ్చరిలు. దే. అ. క్రి. రూ-ఎచ్చర్లు. పెరుఁగు "గీ. ఏయుపాయంబుచేనైన నెచ్చరిలఁగ, నీకకాక్షసకులము రమేశ్వరుండు, తునుమునను కంకరయొక్కటి మనమునందు, నున్నయది దీనికద్దిరా యుక్తియింక." కళా. 6, ఆ. 32: చూ, వర్ధిల్లు.

ఎచ్చర్లు. దే. అ. క్రి.—పై.—"గీ. నృపులకపులసమగ నిష్ఠుగత్వంబుల, నొచ్చి చరమదశకు వచ్చిదనుజు, లెపుడు ప్రొద్దుగ్రుంకు నెపుడు మాకెచ్చర్లఁ, గలుగుననుచుఁ బోరు సలుపుచుండ." రామా. 3, ఆ 6.

ఎచ్చాఱు. దే. అ. క్రి. 1.—పై.—"చ. మఱుసటినాటి వేకువ నమాత్యుఁడు మేల్కని వంక మంతయుఁజ్, జెఱచిరి కూఁతుగుంగొఱుకుఁజేకొని ముందఱఁ జంద్రిహాసుఁడె,చ్చితినఁ బ్రిమాదమొానుచు." జై. 8, ఆ. 93; 2. బాగుపడు. "చ. బుద్ధిహీనునకు నెంతయు బుద్ధులు చెప్పనేని యె, చ్చిఱఁడొక వానరంబునకుఁ జెప్పిన సూచిముఖంబు చాడ్పునన్." పంచ. నా. 1, ఆ 502: చూ, సరిపడు. 2.

ఎచట. దే. ద్రి. 1. రూ-ఎచటు:చూ,యత్రి 1; వి 2 ఏస్థానము, ఏస్థలము. "ఆ. ఎచటఁ జాడ్కనిలిచి యెంతగఁజూచిన." వేమన. 602; "ఆ. ఎచటునుంచివచ్చు నెచటికిఁదాఁబోవు." వేమన. 603: రూ- ఎచటు- ఎచో

టు- ఎచోటు- ఎచ్చటు- ఎచ్చోట-ఎచ్చో టు- ఎచ్చో- ఎచ్చోటు- ఎచ్చోటు; ఎట- రూ-ఎటు- ఎటులు.

ఎచేటు.—పై —

ఎచేరించు. దే. స. క్రి. రూ- ఎచ్చేరించు. "ద్వి. సచరించిమాయలు పన్ని భూపాలు, నెచేరించి కోయింప నెట్లాడెమనకు" నవ. 8, ఘా (ఇది ఇంకను విచార్యము): చూ, రూ- హె చ్చేరించు.

ఎచోట: చూ, రూ- ఎచేట 1, 2.

ఎచోటు.—పై.—

ఎచోటు.—పై.—

ఎచ్చేట.—పై.—

ఎచ్చేటు.—పై.—

ఎచ్చేరము దే. వి. అవధానము. "వ మఱియు నయ్యాప్సర లెచ్చేరంబులంగచ్చు వదలి." కవిక. 6, ఆ. 94: చూ, హెచ్చేరిక.

ఎచ్చేరించు. దే స. క్రి: చూ, రూ- హెచ్చే రించు. (రూ-ఎచేరించు.)

ఎచ్చేరింత దే. వి. ఎచ్చేరిక. "ఉ. వింతకవుంగి లింతల నవీన గళధ్వని యెచ్చేరింతలన్." పాం. చా. 3, ఆ. 59: చూ, హెచ్చేరిక.

ఎచ్చేరిక. దే. వి. 1.—పై.— "చ. మరలంగఁ బట్టంగట్టంగ సమస్తమరుద్గవి నన్నుఁగూర్చి యెచ్చేరిక ధరింపఁబోలు నన కాతముఖాంకుశ పాతముల్ వికస్వరరుచిగాల్చి." పాండు. 2, ఆ. 97; 2. ఆచేతి: చూ, సూచన. 1 (రూ-హెచ్చేరిక.)

ఎచ్చేరికపడు. దే. అ. క్రి. అవధరించు: చూ, హెచ్చేరికపడు.

ఎచ్చేరికించు దే స క్రి. ఎచ్చేరికచేయు. "ఉ క, న్నిచ్చేలువచ్చు చేడియల నెచ్చేరికించుచు ధూర్తకోటితో, మచ్చేరికించుచున్." విక్రి. 8, ఆ. 8: చూ, హెచ్చరించు.

ఎచ్చు. దే. వి. 1. ఆధిక్యము, అతిశయము: చూ, రూ-హెచ్చు 1; విశ. 2. అధికము, అధిక మైనది రూ- హెచ్చు. "ఆ. ఎచ్చుకులము కొంది యెన్నాళ్ళు బ్రదికిన" వేమన. 605: చూ, హేరాళము; అ. క్రి. 3. అధికమగు: చూ, రూ- హెచ్చు 3.

ఎచ్చుట. దే. వి: చూ, ఇంచుట.

ఎచ్చుతగ్గు. ద్వ విశ. ఎగుడుదిగుడు: చూ, విషమము.

ఎచ్చోట: చూ, రూ-ఎచేట. 1, 2.

ఎచ్చోటు.—పై.—(ఏ + చోటు.)

ఎచ్చో. —పై.—

ఎచ్చోట. —పై.—

ఎచ్చోటు. —పై.—(ఏ + చోటు.)

ఎజ్జ. దే. వి. రూ-అజ్జ, అదను. "సీ. అదనుతఱి తవన పాదను పాటితఱి యెజ్జనఁ గాలసంజ్ఞ." ఆం పదా సుర. 47: చూ, సమయము. 1.

ఎట: చూ, ఎచట. 1. 2; (వి. ప్ర. ఏస్థానము.— "వ. అనిన నిచ్చనుప యెటంబోయెదువని యడి గినఁ జేదిపతియైన సుబాహు పురంబునకుం బోయెదుననిచెప్పెన." భార.అర 2, ఆ. 108)

ఎటవారె. దే. వి. అందుగు *: చూ, సల్లకి.

ఎటామటీ.వా.వ్యతిరేకము. "ఎటామటీమాటలు."

ఎటు. దే. వి. 1 ఏస్థానము: చూ, ఎచేట 2; అవ్య. 2 రూ- ఎట్లు. "ఎటాడుకొన్నను౦ జెల్లంగదమ్మనీకు." కళా. 1, ఆ. 59: చూ, ఏడీ.

ఎటులు చూ, ఎచేట. 1. 2;(అవ్యయుక్త -"ఉ. దిగ్గిమ్మరుచున్న వారి ము, న్నెటులట్ల నీవరసి యిచ్చేమెయింబని గొమ్మ నెమ్మితోన్." భార. విరా. 1, ఆ: 272: చూ, ఏడీ.)

ఎటువంటి దే విశ చూ, ఏలాటి. "నారెటు వంటి పెద్దవారు." కళా. 3, ఆ. 82.

ఎటువంటివాఁడు. ద్వ. విశే. స్వభావాదులలో నెట్టి మనుష్యుఁడు, కీదృశుఁడు: చూ, కీదృశుఁడు.

ఎటువలె. దే. క్రి. ఏప్రకారముగా. "ఎటువలె భీతి నీకొదవె." సకల. 9, ఆ: చూ, ఏదీ.

ఎట్టకునేని. దే. అవ్య. దీర్ఘకాలమున, అతిప్రయాసమున. రూ-ఎట్టకేని. "కాంత నీకు వేల్పెక్కిన భంగినుండి ధృతినెట్టకు నేనియుఁబూని." రా. అ, కాం. 147: చూ. చిరాత్.

ఎట్టకేని. దే. అవ్య. —పై.— "గీ ఇట్టులరియాడు చిత్తంబు నెట్టకేని, నాథు చెప్పఁ ధర్మంబునకుఁ జొరంగ, నూలుకొల్పి." భాగ. అను. 1, ఆ. 78

ఎట్టకేలకు. దే. క్రి.—పై.—"ఎట్టకేలకు నసుఁ జేర్చునప్పుడు బలంబులతో గురురాజునూడ" భాగ. విరా. 5, ఆ. 386; "క. ఇంటికెట్టకేలకుఁ జనియెన్." జై 8, ఆ. 78

ఎట్టటు. దే. అవ్య. (ఎట్టు + అటు + అ.) ఏలాగున నయిన. "క. ముదమొదవఁగ సుతుఁ డెట్టటు, బ్రదికినఁజాలునని చనియె." పర. 2, ఆ. 192; "క. పడఁతి యెట్టటు ప్రాణము, విడికిటఁబెట్టుకొని నేఁడు ప్రియుతో నీవె, ప్పుడుబలెఁ బలుకక యుంచుక, తడవుండుము మాకుఁగాను దాలిమితోడన్." కళా. 7, ఆ: ఎట్టయిన-రూ-ఎట్టైన

ఎట్టపోగు. ద్వ. వి. దండు. "చ విరహిప్రకరంబు నొంప దు, ష్కృగతి నెట్టపోగుసఁగఁ గైకొని వచ్చినరీతివచ్చెఁ గ్రొ, వ్విరి రవదువ్వ చాల్గొని దివిన్ మలయానిలవాత పోతముల్." చంద్రా. 4, ఆ. 90: చూ, సేన. 1.

ఎట్టయిన. దే. అవ్య. రూ-ఎట్టైన: చూ, ఎట్టటు.

ఎట్టయెదురు. దే. వి. ఏ. (ఎదురు + ఎదురు.) 1: చూ, చెక్కనియెదురు; పా. 2. సూ 65. ఆమ్రేడితంబు పరంబగునపుడు కడాదులఁ దొలియచ్చుమీఁది వర్ణంబులకెల్ల నదంతమగు ద్విరుక్తటకారంబగు. "ఎదురు + ఎదురు= ఎట్టయెదురు, చివర + చివర = చిట్టచివర, కొన + కొన=కొట్టకొన, తుట్టతుద, తెట్టతెన్ను, తెట్టతెరువు, నట్టనడుము, పట్టపగలు, పిట్టపిడుగు, బట్టబయలు, మొట్టమొదలు, మిట్టమిఱ్ఱు ఇత్యాదులు కడాదులు. (తొలుత + తొలుత=తొలుదొ, త యగునే కాని తొట్టతొలుత కాదు. ఇట్లే తొలితొలి, మిఱుమిఱు మిడిమిడి లోనైనవి. తుట్టంతుద (భా॥—. ప్రాచీనప్రయోగము. నిట్టనిలువు— ఇందు 'ని ' శబ్దంబు. మట్టమధ్యాహ్నమను చోఁ దాలిశబ్దము మట్టము మధ్యాహ్నము + మధ్యాహ్నము= మట్టమధ్యాహ్నమని కాలేదు. "ఎర్వురువినినను దీనికి, నెవ్వెదురని యెఱుఁగఁ దకట వాయెదురెవ్వరలో' అని తిక్కన." ద్విత్వటకారము లేకుండఁ బ్రయోగించెను. రావు-త్రోవులఁగడ వర్ణంబు లోపించు— రావు + రావు = రారావు; త్రోవు + త్రోవు=త్రోదోవు. ఇత్యాది.

ఎట్టి. దే. విశే. ఎటువంటి. "ఆ ఎట్టిజీవికైన నిలఁగొంత భ్రాంతియె." వేమన. 607: చూ, ఏలాటి.

ఎట్టిఁడు. దే. విశే. (ఎట్టి + వాఁడు.) ఎటువంటి వాఁడు. "ఎట్టిఁడు నానిజేశుఁడు." రా.సుం, కాం. 285: చూ, బ ఎట్టిరు.

ఎట్టిరు దే. విశే. బ.—పై.—

ఎట్టు. దే. విశే. 1. ఎట్టి: చూ, ఏలాటి; అవ్య. 2. ఏప్రకారము. రూ-ఎట్లు: చూ, ఏదీ.

ఎట్టులు దే. అవ్య. రూ-ఎటులు: చూ, ఏదీ.

ఎట్టువోలె. దే. క్రి —పై.—

ఎట్టూ. దే. క్రి. ప్రశ్నమును దెలుపును. "ఎట్టూ, యిట్టుగునయ్యా పల్కదయకేశ." అము. 6

ఆ. 50. (ఆమ్రేడితమందు ఎట్టెటూ-రూ-ఎట్టెట్టూ): చూ, ప్రశ్నము.

ఎట్టెటూ. దే. అవ్య -ప్రై.- (రూ-ఎట్టెటూ.) "అనుటయు నెట్టెటూ తెలుపుమయ్యా హంత్తా" కళా. 7, ఆ, 82.

ఎట్టెట్టూ దే అవ్య. —ప్రై.— "శా. ఎట్టెట్టూ విన్నమైతిమింక నొకమాటేర్పాటుగాఁ జెప్పుమా." కాశీ. 7, ఆ. 107.

ఎట్టైన. దే. అవ్య: చూ, రూ-ఎట్టయిన.

ఎట్లు. దే. అవ్య ఏప్రకారము. "క. అమరవరులందుఁ బురుషో, త్తముఁడెట్లు విశేషుఁడట్లు ధరణింగల తీ, ర్థములందును బుష్కర తీ, ర్థము కరము విశేషమభిమతార్థప్రదమై" భాగ అర. 2, ఆ. 248. చూ, ఏపీ. (రూ-ఎటులు)

ఎడ వై. వి. 1= హృత్. గుండె, రూ-ఎద. "యెడఁబొలివోని వేడుకల యేడ్తెఱసొంపున." నిర్వ 8, ఆ. 73: చూ, హృదయము 2. దే. వి. 2. తానము, చోటు "ఆ ఏలవృద్ధరాజు లెడసేసిరో పార్థ,లరుగునెడకు మనము నరిగి" భార. ఆది. 6, ఆ 148: చూ, స్థానము. 1; 3 అవకాశము. "ఉ. నిచ్చలు నిచ్చలోఁబొదలు నీపితృభక్తికి జ్ఞానశక్తికిన్, మెచ్చితివచ్చితిన్ గరమునియ్యెడ నియ్యెడ యేలవేఁడు కొ,మ్మిచ్చెదఁజెచ్చెరన్ వలయు నీప్సితముల్." పాండు. 2, ఆ. 53 చూ, సందు. 6; 4. దూరము. "క. కడునెడ గావుననదియు, క్కడ వినఁబడదేమొ." కళా. 4, ఆ. 16: చూ, విప్రకృష్టము; 5. గడువు. "ఇప్పుడెడయిచ్చుట యుక్తముగాదు." భార. ఉద్యో. 1, ఆ. 165: చూ, మితి; 6. భేదము. "క. ఎడరెుతిఁగియుఁ దమలోపల, నెడయెుఱుఁగక ధర్మపథసమేత స్థితికిన్, నడిమింటి వారలైరా, నడిమింటిరవిన్ హసించునవ్యాప్రిభలన్." రాఘ. 8, ఆ. 155: చూ, వేఱుపాటు 1; 7. అడ్డము. "క నాకొంతయుఁ బ్రియశిష్యుండీ కపివరుఁ డితనిపనికి నెడకాకుండన్, బోకయుంచితమను కరణి వి,భాకరుఁడపుడపర శిఖరిపైకరుగుటయున్." రా. సుం, కాం 74: చూ, నిరోధము; 8. పాడి, వ్యవహారము. "శ. ఎనిమిదియేఁడులు శిశువగు, నెనిమిదియేఁడులట బాలుఁడెడయెఱుఁగఁడుగా,వున బాలుఁడెన్ని భంగుల, జనకునిబుణము రువఁ జనదు ననుసటమీఁదన్." "గర్భస్థైస్సదృశో జ్ఞేయ అష్టమాద్వత్సరాచ్ఛిశుః, బాల ఆషోడశాద్వర్షాత్ పౌగండశ్చేతి శబ్ద్యతే, పరతో వ్యవహారజ్ఞః స్వతంత్రః పితురావృతః." విజ్ఞా. వ్య. కాం 83: చూ, సత్యము. 1; 9. శత్రువులతోఁడి పొందు, సంధి. "ద్వి. ఎడమాటలాడి యీయిన వంకఁజేరఁ, గడు హనుమంతుంపు గలిగనేనీకు." రా. కిష్కిం, కాం 216 పొరటు: చూ, సాప్తపదీనము; 10. దేవతానైవేద్యవస్తువు చూ, నైవేద్యము; విశే. 11. ఎలప్రాయముగలది "ఎడదూడ, ఎడపడ్డ." మొ; ద్రి. 12 నడుమ. "ఎ, గీ. అంత నాభీష్ముఁడెడఁదునుమాడె నధిప." భార. భీష్మ 3, ఆ. 284. (ఆమ్రేడితమందు ఎడనెడ.): చూ, మధ్యము. 2

ఎడఁజెండు. దే అ, క్రి. మూర్ఛిల్లు: చూ, సొమ్మసిల్లు.

ఎడఁద. వై వి. 1.=హృత్. గుండె. రూ-ఎడ్డ. "భీష్ముఁ డర్థరథుఁజేసి యెడందఁగలంచె." భార. శాంతి. 1, ఆ, 85; "ఆ. అశ్వమేధము నకు సర్చితంబైన యీ, యశ్వరాజు నిట్టులపహరించి, మ్రుచ్చుగొంటి యీ సముద్రదేశంబున, నోటు మొదఁదలేక యున్నవాఁడు." భార. అర. 3, ఆ. 68: చూ, హృదయము. 2; 2. రూ-ఎడ్డ, లోము: చూ, వక్షము.

ఎడఁబాటు. దే. వి. ఎడయిక. "సీ. సాదరంబుగ రఘుస్వామివెంటనె లక్ష్మణుం డెడఁబాటు లేకుండు సేవ్య, సేవక భావంబుచెన్నొంద." అధ్యా. బాల, కాం. 119: చూ, విరహము.

ఎడఁబాపు. దే. ప్రే. అపనయించు: చూ, విసర్జించు.

ఎడఁబాయు. దే. అ. క్రి. (ఎడ + పాయు) 1. భేదమగు: చూ, వేఱుపడు; స. క్రి. 2. త్యజించు: చూ, విసర్జించు.

ఎడఁబాయుట. దే.వి.1 ఊరువిడిచిపోవుట,ఈతి: చూ, ప్రవాసము; 2. (పక్కనుండి) తొలఁగుట; 3. (పడకనుండి) ఒత్తగిల్లుట; 4. (తల్లి దండ్రులనుండి) తొలఁగుట; 5 (దంపతులు) ఒకరినొకరు అంటకుండఁగ తొలఁగుట; 6. (ఇద్దఱి మనస్సులు) కలియకుండుట. ఇత్యాదులూహ్యంబులు.

ఎడఁబెట్టు. దే. వి. బంగారుహాళెము, దీనార భేదము. "సీ ఎడఁబెట్టుసంగను నెరుసనా బారిముద్ర యన దీనారభేదములు చెలఁగు" ఆం, భా, ద్వి. పై. 274: చూ, లోహము. 1.

ఎడకట్టు. దే. అ. క్రి. 1. ఆఱిసపుండు మరల చీముపట్టు: చీముపట్టు; స. క్రి 2. జత చేయు "సీ. ఇంద్రనీలములతో నెడకట్టి గ్రుచ్చిన రమణీయ తారహారము ధరించి." కాశీ.7, ఆ. 5: చూ, సంధించు. 3.

ఎడకడ. దే. వి. అన్యము: చూ, పరాయి.

ఎడకడవాఁడు. ద్వ. వి. అన్యుఁడు: చూ, పరాయివాఁడు.

ఎడకత్తియ. ద్వ. వి. రూ-ఎడకత్తె. అభ్యండి: చూ, కంభళి.

ఎడకత్తె. ద్వ. వి.—పై.—

ఎడకాఁడు. దే. వి. కార్పువాఁడు: చూ, దూతుఁడు.

ఎడకారు. ద్వ. వి. మాఘమాసము మొదలు జ్యేష్ఠమాసము లోపల పండించెడు పంట దాళువా, పిక్కారు, శిశిరఋతువు మొదలు కొని నీరాసరానుపండెడు పల్లపుపంట. (శర దృతువు మొదలుకొని నీరాసరానుపండెడు పల్లపుపంట అని కొన్నిప్రాంతముల వాడుక): చూ, రెండవపంట.

ఎడగడ్డ. ద్వ. వి ఒడ్డు: చూ, తీరము.

ఎడగిలు. దే అ. క్రి. రూ-ఎడగిల్లు. అపసరిల్లు: చూ, విరియు. 5.

ఎడగిల్లు. దే అ. క్రి. —పై.—

ఎడతాఁకు దే. అ. క్రి. చేరు. "వ. అంతట వారలు దిగ్వ్యాపనకుం బ్రతిపనంబు నెడతాఁకం గడఁగినం దనమనంబున." పర 5, ఆ, "సీ. తనభూమి వదలక ధనవంతులగువారి యిండ్లకు నెడతాఁకు చెల్లప్రొద్దుఁ, జేరి మిథ్యానమస్కారముల్ సేయుచుఁ బ్రియములు నయములు పెక్కుచూపి" హరిశ్చ. 4, ఆ. 121: చూ, సమీపించు.

ఎడతీయు. దే. అ. క్రి. ఎడతెగు: చూ, ఎడపడు.

ఎడతెగక. దే వి. అదేపనిగ, ఖాళీలేకుండఁగ, విరామములేకుండఁగ, అతిముతి: చూ, సతతము 2.

ఎడతెగు. దే. అ. క్రి. 1: చూ, ఎడతీయు; 2. తెగనుండి వేఱుపడు. "క. ఒక్కొకరి నాథుఁడెడతెగి,చిక్కక" భాగ.8, స్కం. 37: చూ, విడువడు.

ఎడతెఱపి. దే. వి. రూ-ఎడతెర్పి. "తిరుణాళ్లకు జనులు ఎడతెఱిపిలే. వాపుమిన్నా" చూ, సందు. 6.

ఎడతెర్పి. దే. వి. —పై.— "చ. ఇద్దెసవచ్చెనేని యు, త్తెఱఁగయిపోయెయుంచు నెడతెర్పిగఁ గొందఱు పోయవాఱఁగక." భార. విరా. 5, ఆ. 61.

ఎడత్రెచ్చు. దే అ క్రి. ఎడతెగు. "క సెనఁ కుచ యొక త్రెవ్వక పదు, నెనిమిది దివసములు సెల్లె." భార. కల్యా. 1, ఆ. 348: చూ, ఎడపకు.

ఎడతోవకాఁపరి ద్వ. వి. [illegible] చూ, ముచ్చు. 1.

ఎడదవ్వు. దే. వి. అతిదూరము. "ఎ, గీ. విశ్వ సౌర్య యాగ తెచ్చినయట్టుల యధివసించె, గాశికాపురి కడదవ్వు గెలుగుడవి." కాశీ.7, ఆ. 197: చూ, విప్రకృష్టము.

ఎడనీరు. ద్వ. వి. 1 ఎడనీటికాయ. "సీ ఎడనీగటంటఁగుఁ దచ్చలాటువు." ఆం, భా. ద్వి. వ. 79: రూ-ఎలనీరు-ఎళనీరు (పండనికాయ, నీరు సమృద్ధిగాఁ గల పచ్చికాయ.): చూ, ముక్కుటెపడు; 2. లేఁత టెంకాయలోని తియ్యనీరు. "సీ ఎడనీటి బొండ్లాల వడువున మెడడెల్ల జుట్టిపైచిన గొల్లు పుట్లిగములు." ఆము. 6, ఆ 17: రూ ఎలనీరు-ఎళనీరు.

ఎడపక. దే. అవ్య. ఎడతెగని క్రియ; "క. ఎడపక క్రతువులఁ దపములు" వేమన 614: చూ, సతతము. 2.

ఎడపకు. ద్వ.అ.క్రి. 1.ఎడతెగు." క. ఎడఁబడక యహోరాత్రిలు, వడిఁగొని చదివింప నిట్లు వలయునె శిష్యుల్, గడునిద్రలేమి నెంతయు, జడమతులై చదువుదప్పఁ జదువుచునుండఁగ్." భార. ఆర, 3, ఆ. 268: ఎడతీయు, ఎడతెగు, ఎడత్రెచ్చు; 2 ఉపవసించు. "క. కుడిచినతఁడరుదకుండిన, నెడపడిన యతండ యచ్చుటెతిఁగి నృపతియా, కుడిచినతనిఁ గనినప్పుడు, ఎడపడి నాతనికి రెట్టి యిప్పింపఁదగున్." సం. "ప్రతిభూర్దాపితో యత్తు ప్రకాశం ధనిసాంధనమ్, ద్విగుణం ప్రతిగాలవ్య మృణికైస్తస్యతద్భవేత్" విజ్ఞా. వ్య, కాం. 88: చూ, పస్తుండు

ఎడపదడప దే అవ్య. (వా) దభాదభాలను. "గీ ఎడపదడప ననూధిపుఁ డెపటనుండుఁ, గానరాఁడని గృహభర్త కాంత నడుగ." కాశీ. 4, ఆ 85: అనుపదము, అప్పుడప్పుడు.

ఎడపు దే ప్రే, ఎడయఁజేయు. "క. జనవినుత యగ్నిహోత్రం, బును సంతానమును వేదములునెడపంగాఁ జేసదు త్రిభువంశజులకు, సనిరి మహాధర్మనిపుణులైన మునీంద్రుల్." భార. ఆది. 4, ఆ 182: చూ, విసర్జించు.

ఎడపెట్టు. దే. స. క్రి. 1. తొలఁగించు. "గీ. ఎఱుఁగుమతఁడు నిన్ను నెడపెట్టి పలికిన వాఁడు." భార. ద్రోణ. 1, ఆ. 116: చూ, విసర్జించు; 2. మాఱువడ్డించుకొనుటకై యన్నమును దగ్గఱ యెత్తియుంచు: చూ, మాఱుంచు.

ఎడపోవు. దే. అ. క్రి దౌత్యముచేయు, సంధికై పోవు.

ఎడమ. దే వి డాపల. "ఎడమకాలు-ఎడమచేయి" మొ. "తే. ఎడమకుడినాడుల నడుమ నీడ్చుగాలి." వేమన. 615 (వృత్తియందు అంత్యవర్ణలోపము. "ఎడకన్ను-ఎడవంక మొ.) చూ, సవ్యము. 1.

ఎడమగు. దే. అ. క్రి. భేదమగు: చూ, వేఱుపడు.

ఎడమడుగు దే. వి. 1. రూ-ఎడమడువు, తాఱుమాఱు: చూ, వ్యత్యయము; 2. రూ-ఎడమడువు. అరమర. "క. ఉడుగుడుగు మోహాస్త్రము, విడువకుమను నెలుఁగుతోడ వేగంబున న, య్యెడకేగుదెంచి నారదుఁ, డెడమడుగి చుకయులేక యిట్లను నాతోన్." భార. ఉద్యో. 4, ఆ. 349: చూ, వేఱుపాటు; విణ. 3. తాఱుమారైనది. "ఎ, గీ. వడుగు

చందంబు తన కెడమడుగుగాక, కొమరుగా నేగ నెలకట్టిగుజ్జువేల్పు" పారి. ఉ. 10, ఆ. 248: చూ, వ్యత్యయము.

**ఎడమడుగుపయ్యడి** అం. 1. విసరులు పదునాలుగింటిలో నొకటి: చూ, విసరులు; 2 పగవళ్లు పండ్రెండింటిలో నొకటి: చూ, పగవళ్లు.

**ఎడమకుప్పు.** దే వి: చూ, రూ-ఎడమడుగు 1-2-8.

**ఎడము.** దే. వి, 1. చోటు. "అతిథులకు నెడమిచ్చి." భార అశ్వ 2, ఆ 170· చూ, స్థానము. 1; 2. అవకాశము "నాకు నాహారనిద్రల కెడములేదు." భార. అర. 5, ఆ: చూ, సందు. 6.

**ఎడయిక.** దే. వి. ఎడఁబాటు: చూ, విరహము.

**ఎడయు.** దే. అ. క్రి. 1. ఉజ్జగిల్లు. "క. ఏవురు పతులందు ధర్మువెడయకయుండుకా." భార. ఆది. 7, ఆ 264: చూ, విరియు. 5; స క్రి. 2 త్యజించు: చూ, విసర్జించు

**ఎడరు.** దే. వి. 1. అడ్డపాటు. చూ, వ్యవధానము. 3; 2, ఆపద "గీ. వలదు శంకింప నిందునివలనఁ బుట్టు, నెడరువొందక యుండంగఁ గాదుకునోపి, నంత గావుము కావంగనైన చావు, నపుడు నన్నుఁ దలంపు మేనది మరల్తు." భార. శాంతి. 1, ఆ. 260: చూ, విపత్తు; 3. మధ్యకాలము: "గీ. అప్పాఱుండ నలి, నెత్తుకొనిపోవ నిందందు నెడరువేచె." పాండు.3, ఆ.72: చూ, సందు; 4. చెఱుపు. "చ. ఎవ్విడికిరిగాక యయ్యోడరు రాచకొమరుల కొద్దనట్టిదే." భార. ఉద్యో. 1, ఆ. 348: చూ, హాని. 2; 5. ఎడారి, చెట్లుచేమలు లేని విశాలప్రనిర్జనభూమి. "వ.ఎడరునం జలిపం బిడిడియొదమనియు." ఆము. 4, ఆ. 58.(కొన్ని ప్రతులయందు ఎడవున అని పాఠమున్నది.): చూ, భూమి. 1; 6. వగ: చూ, దుఃఖము; 7 జేడుపు. "వలదు శంకింపవలదు నిందునివలనఁ బుట్టునెడరువొందక." భార. శాం. 1, ఆ. 260: చూ, వెఱపు; అ. క్రి 8. భగ్నమగు. "చ. తడయక ఘోరదర్శన సుదర్శన పావకుచే దహింపఁగాఁ, బడి పరమేశ్వరోగ్రశర పావకదగ్ధపురత్రియాభమై, యెడరి ధరిత్రి మీఁదఁబడియెకా జెడెసౌంభకమంత సాల్వుఁడుకా, బడియెమదీయచక్రి పటుపాతరయంబున రెండువ్రయ్యలై." భార. అర. 1, ఆ. 198: చూ, ముక్కలుపోవు. 1.

**ఎడలు** దే. అ. క్రి. 1. పగులు, చీలు. "క. వురువంశమెడల వచ్చిన." భార. స్త్రీ.2, ఆ.111: చూ, భేదిల్లు; 2 గచ్చువిచ్చగు. "చ. అః విని...నుపన్యసింపవే. 448. వ. అనిదివ్యం... డిట్లనియె. గీ. వినుమహింస...మనసు క్రొవ్వు ఖండింపఁగా మోద, మెసఁగు సుజనసంధి యెడలదందు." భార. అర. 7, ఆ. 448: చూ, వైకల్యమగు; స. క్రి. 3. విడుచు. "క. వందురవగిలకా దేహము, పొందెడలఁగఁ జూచునన్నుఁబొడఁగని దివిఁదా, నెందులకేగుచునోగిరి. నందనదిగివచ్చికరుణ నాకిట్లనియెన్." "మ. అతిసౌందర్యనికాంత మీతనుపలభ్యం బిట్లు...దగునె." స్వా. 6, ఆ. 55: చూ, విసర్జించు.

**ఎడవల.** దే వి. ఒకరకము వల: చూ, వల. 1.

**ఏడవాఁడు.** దే. పు. అమ్యఁడు: చూ, పరాయి వాఁడు.

**ఎడవు** దే. విణ దూరము. "తే. పాలిగాలి వీచెఁ దెరువు, నెడవముచు జాలిగొని పంకయించు వేళ." ఆము. 6, ఆ. 18: చూ, విప్రకృష్టము

**ఎడపాల.** ద్వ. వి. ప్రత్యేకమైనగది: చూ, గృహము, 1.

**ఎడాటము.** దే. వి. 1. తలఁపు. "సీ. నెపకేమి

యునులేక నీ యెడాటమ్మునఁ బాడెఁదప్పఁడు గదా భైరవుండు." భీ. 2, అ. 88: చూ, విషయము. 4; 2. ఆట: నృత్యము. (పైయుదాహరణమే.)

ఎడారి. దే. వి. 1. అడవి: చూ, విపినము; 2. రూ-ఎడారు: చూ, భూమి. 1

ఎడారిమొక్కలు. వా. (డిజర్టుప్లాంట్సు. ఇం) నీరులేని ఎడారులలో పెరుగు మొక్కలు. నాగజెముడు:—ఇది ద్వివిధము. ఒకటి వెడల్పు మట్టలుగల బ్రహ్మజెముడు. రెండవది సన్నముగా పొడవుగా పెరుగును. ఇది తెల్లని పూవులు రాత్రియందు పూచును; బ్రహ్మజెముడు పచ్చనిపూవులు పూచి, ఎఱ్ఱనిపండ్లు పండును ఈపండ్లు కాకులకు యిష్టము ఈ పండ్లరంగు ఎఱ్ఱసిరాచేయుదురు. రంగులుగా నుపయోగింతురు. జిగటవిరేచనముల కీపండ్లు మంచి మందు. ముండ్లుతీసిన మట్టలుడికించి కట్టిన కీళ్ళనొప్పులు తప్పక కుదురును. పశువులకుఁ గూడ నాహారము; నాగజెముడు పాలవలన కురుపులు సెగగడ్డలు చితుకును, నల్లేరు కూడ నిట్టిదే. త్రిధార-ద్విధార గూడఁ గలదు; మఱియు కలబంద, కిత్తనార నిట్టివే, తాటిచెట్టు కూడ ఇసుకయెడారులలో పెరుగు వృక్షమే. ఎన్ని గాలివానలకైనను లక్ష్యముచేయదు. చెట్లలో తాళవృక్షము కిరీటాధిపతి.

ఎడారు. దే వి: చూ, రూ-ఎడారి.

ఎడారె. ద్వ. వి. (ఎడ+ఆరె) చెప్పులు కుట్టు చిన్న సూది: చూ, చర్మభేదిక.

ఎడిటరు. ఆం. సంపాదకుఁడు, పత్త్రికాధిపతి, గ్రంథపరిశోధకుఁడు.

ఎడిషన్. ఆం. కూడిక. ప్లస్.(+) సంకలనము.

ఎడు. దే. అప కొలఁదిని దలిపెడి: చూ, ఏసి.

ఎడ్డ. వై. వి, 1.=వ్యాళ్. రూ-ఎడఁద-ఎడ్ద. "క. చెడిపోకుఁడు సంసారము కడతేర్పఁడు శౌరి చరణకమలము లెడ్డం, బడికొనుఁడూరక కాలము, కడపకుఁడు వివేకబుద్ధిఁ గడఁగుడు నడవఁగ." లక్ష్మ. 4, అ. 74· చూ, హృదయము 2; 2 ఆత్మ, రూ-ఎడఁద-ఎడ్ద: చూ, వక్షము.

ఎడ్డమి దే. వి. ఆపద. "ఉ. ఎడ్డమిరైన యప్పటికి నెవ్వరుఁజేరరు." వి, పు. 5, అ. 102: చూ, విపత్తు.

ఎడ్డము దే. వి. అడ్డంకి. "ఉ ఏడుదినంబులన్నమున కెడ్డముపుట్టిన యంతమాత్రిలో, నేడుచుచున్నవాఁడవు మునీశ్వర." భీ. 2, అ 116: చూ, నిరోధము. 1.

ఎడ్డిగజ్జెడి ద్వ. వి. కల్లుత్రాగు బొల్లిపాయ. చూ, బొల్లిపాయ.

ఎడ్డియ. వై. విశ.= పేదః. రూ- ఎడ్డ- ఎడ్డఁడు: చూ, మూర్ఖుఁడు.

ఎడ్డ. వై. విశ.= పేదః.—వై.—"ఆ. ఎడ్డఁ దెల్పవచ్చు నేఁడాదికైనను, మూనిఁ దెల్పవచ్చు మాసమునను, మొప్పెఁ దెల్పరాదు ముప్పదేండ్లకునైన." వేమన. 616.

ఎడ్డఁడు. వై. విశ. —వై.—"పిసాసియయకంటె గరాకుఁగూడు నీ,రెడ్డఁడు." శుక. 1, అ. 442.

ఎడ్డితనము. వై. వి. తెలివిలేమి: చూ, మఱపు 2.

ఎడ్డెన. దే. వి. భోజనపాత్రము నుంచుకొనెడి ఉన్నతపీఠము. "సీ. వెండియెడ్డెనలపై వెలచి తెచ్చిన పైఁడిపళ్ళెంబులాయిత పఱచువారు." వై. 6, అ. 108; "గీ. పసిఁడియెడ్డెనలను మించు పద్మరాగ, భాజనంబులకడ్డించు బహుపదార్థ, వితతులమరాము మేరు సంగతసహస్రి, కరుసఁబొదివిన చిత్రమేఘములకరణి." వై. 8 అ. 202: చూ, పీఁట.

ఎడ్డమనిన తెడ్డమనువాఁడు. లో. చెప్పినమాట వినకపోవుటయేగాక ఎదురుచెప్పువాఁడు.

ఎడ్ద. శై. వి.= హృత్: చూ, రూ-ఎడఁద.

ఎడ్యుకేషన్. ఆం. ఉద్ధారము.

ఎడ్యుకేషనిస్టు. ఆం. విద్యాప్రబోధకుఁడు.

ఎడ్లగుంపు. ద్వి. వి కదుపు, ఉక్షముల సమూహము: చూ, వృషభము. 1.

ఎడ్లు. దే. వి. బ. ఏ- ఎద్దు= బ- ఎద్దు. "చ. అనుటయు నాతఁడిట్లనియె నాఆడి విప్రులకేల యశ్వముల్, ఘనతర సత్త్వమూర్తులనఁగాదగు నెడ్లను కెంటినిచ్చెదన్." భార. అర. 4 ఆ 349: చూ, వృషభము. 1.

ఎడ్వర్డుఅల్బర్టు. శా. శైలోద్భవ వంశచరిత్ర(శ్రీలక్ష్మీనారాయణదేవుగారు.) కొన్ని సం॥ లకు పూర్వము సోమేశ్వరమందిరముయొక్క శిఖరము విరిగిపోవుటచే దాని నొకానొక శిల్పికారుఁడు బాగుచేయునపుడు నతనికి మూఁడు తామ్రఫలకములు దొరికెను. అందులో రెంటినాతఁడు పాడుచేసెను మిగిలిన దాతనివద్దనున్నట్లు తెలిసికొని క్రీ॥ శ॥ 1917 వ సంవత్సరమున నేమాఫలకమును సంపాదించితిమి. దానినిఁ జూడఁగా మొట్టదిమూఁడవది నశించునట్లు స్పష్టము. ఆఫలకమును నేము విహారము— ఒరిశా గవర్నరుగారగు సర్. ఎడ్వర్డు అల్బర్టుగెయిట్, కే. సి. యస్. ఐ సి. ఐ., ఐ. సి. యస్ గారికి సమర్పించితిమి. వారందుల విధ్యమును మహామహోపాధ్యాయులగు పండిత హరప్రసాదశాస్త్రి ఎమ్ ఎ., సి. ఐ గారిద్వారా పరిశీలనచేయించి విహారము—ఒరిశా రిసర్చిసొసయిటీవారి జర్నలుయొక్క నాల్గవభాగము రెండవసంఖ్యలో ప్రాటుపల్లోప రాజకుమారుఁడగు మధ్యమరాజుగారి చెక్కలిశాసనమను పేరునదానినిఁ బ్రచురింపఁజేసిరి. కలింగ 280 పౌరట.(అందుల పరంపరేతిహాసము మిందుఁగానగును)

ఎడ్వరుటయిజుమెంటు. పా. ప్రకటన, వెల్లడి, పల్లికేషను.

ఎడ్వర్డుదికన్ఫెసరు. శా. రాజరాజు (శ్రీయుత గౌరవనీయులగు న్యాయమూర్తి వేపా రామేశంగారు బి యె. బి, యల్.) తెలుఁగుదేశమున జనసామాన్యముచే రాజరాజనరేంద్రుఁడని పిలువఁబడుచున్న రాజరాజునరేంద్ర చాళుక్యాన్వయ సంజాతుఁడు......మనరాజరాజు చారిత్రమును దెలిసికొనుటకు నాతని కాలపు శాసనములును, నన్నయవిరచితమైన యాంధ్రమహాభారతమును ఆధారములగుచున్నవి. ఆమహారాజు కాలమునాటివి ద్రాక్షారామ దేవాలయమున రెండు మూఁడు శిలాశాసనములు గలవు......రాజరాజు నలుబదియొక్క సంవత్సరములు నిష్కంటకముగ ఒరిపాలన మొనర్చియుండునప్పటికి నాతనిగురించి విశేషచరిత్రాంశము లెవ్వియుఁ దెలియరాకుండుటెంతయు సంతాపకరము. మఱియు నింగ్లాండు దేశముఁ బరిపాలించుచు నీతనికి సమకాలీనుఁడైన ఎడ్వర్డు దికన్ఫెసరు రాజునుగూర్చి తెలియుచున్న చారిత్రక విశేషములతో నీతనికాలపు చరిత్రాంశములను పోలిచి చూచినయెడల. మన రాజరాజునుగూర్చియెక్కువసంగతులు తెలియరామి మఱింత సంతాపహేతువగుచుండును...... రాజరాజునకు నన్నయభట్టారకునిచే బిరుదువాచకముగ వాడఁబడిన రాజరాజ నరేంద్రపదము మాంధాత పురాధీశ్వరునకు గూడ నుండుట చేతను, రాజమహేంద్రవరమున బహుళః సారంగధరుని కథవంటిది జరిగియుండుటచేతను జనులు (కులోత్తుంగుని) రాజేంద్ర చోళుని మాట మఱచి సారంగధరుని కథ రాజరాజు

నకు ముడిపెట్టి, దక్షిణదేశపు నాటకరంగమం దలి సారంగధరుని దివ్యచారిత్రమును ప్రతిప్ర దర్శనములందు గాంచి యాశుత్రికణములను రా ల్చుచున్నారేకాని, యందలి యథార్థమును విమర్శింపకున్నారు. ఏది యెట్లుజరిగియుండి నను సారంగధరుని కథ రాజమహేంద్రవర మునకు ముడి బెట్టఁబడినంతవఱకు జరిత్రాధా రముగాని, బ్రమాణముగాని లేక యున్నదను మాట నిక్క—ము. కళింగ. 182 మొ॥ 184 పొరటలు.

ఎడ్వర్డు పట్టాభిషేకము. పా. "సీ. ఎవనివిభుత్వ మందెల్లదేశంబుల నగియసౌఖ్యంబుగా నరుగ వచ్చు, నెవ్వానియధికృతి నెఁటివార్తలనైన సులభంబుగా వేగఁ దెలియవచ్చు, నేవానియే ల్బడి నెందుఁజూచినఁగాని కడునబ్రగు పనుల్ గనఁ వచ్చు, నేనిపాలనమునం బట్టి ఘోపథమేని బలుబీదలకునైనఁ బడయవచ్చు. గీ. నట్టినీదైన గౌరతనం బవనిలోన, ననుపమాన ప్రసిద్ధిచే నలరుఁగాన, బూర్వరాజన్యులు ను నినుఁబోలఁగలరె, సద్గుణస్ఫూర్తి యెడ్వర్డు చక్రవర్తి॥ సీ. సౌజన్యనిధియైన శాక్సికోబర్గు సత్ప్రభువణి యెవనిపితామహుండు, మానిత ప్రాభవుఁడైన కెంటుప్రభుగ్రామణి యెవని మాతామహుండు, ప్రాంచద్యశుండైన యాల్బ ర్టునామక ప్రభుకులమౌళి యెవ్వానితండ్రి, విమలగుణశ్రేణి విక్టోరియారాణి దీనకల్పక వల్లి యేనితల్లి. గీ. యట్టి నీకట్టిభువన విఖ్యాత మైన, ప్రాజ్యతరపూజ్య సామ్రాజ్య వైభ వంబుఁ గలుగుటెంతయు నుచితంబుగాదె తలఁప, సద్గుణస్ఫూర్తి యెడ్వర్డు చక్రవర్తి॥ సీ. అర్థాంగలక్ష్మియై యనుగతి మెలఁగునీ పట్టంపుదేవి పార్వ్వమునఁనిలువ, నాత్మస్వరూ పుఁడై యలరునీకొమరుండు తనరాణితోడఁ జెంతనువసింపఁ, గొదువమంత్రులతోడఁ గుడి భుజంబగుముఖ్య మంత్రికట్టెదుటన మ్రొక్క హింప, నాజ్ఞాకరుల్ బహిఃప్రాణంబులగు సైన్యనాయకుల్ కలగొని పాయకుండ॥ గీ. మూర్తులూనిన మీగుణంబులనఁ బెక్కు, దీవు లందలి నృపులు సేవావసరము, గోర నోలగ మున్న మీ సౌఖుఁజూడ, సంతసమొసంగు నెడ్వర్డు చక్రవర్తి." (వర్ణన.)

ఎడ్వైన్సిమస్‌బక్సు. పా. అంటుమొక్కలు

ఎతఁడు. దే స. ఏ. 1. రూ—ఏతఁడు, ఏపురుషుఁ డు: చూ, వేఁడు; 2. రూ—ఏతఁడు, ఏపురు షుఁడు: చూ, వేఁడు; 3. రూ—ఏతఁడు, ఎ వ్వఁడును: చూ, వేఁడు.

ఎతిఅనిన ప్రతియనువాఁడు. లో. చెప్పినమాట వినకపోవుటయేగాక యెదురు చెప్పువాఁడు. (ఇష్టికొమ్మఅనిన పత్తిరాట్నమనువాఁడు.)

ఎతిక్సు. ఆం నీతిశాస్త్రము.

ఎతిమోలజీ. ఆం. 1. మానవజాతి శాస్త్రము; 2. శబ్దవ్యుత్పత్తిశాస్త్రము.

ఎతుబరికాఁడు ద్వ. వి. చోరుఁడు. రూ- ఎత్తు బరికాఁడు: చూ, ముచ్చు. 1.

ఎతుబారీ. వా. ధారాళము (గోదావరీమండల మున వాడుక.)

ఎతుబారీమాట వా. ధారాళమైన మాట.

ఎతుబారివాఁడు వా. ఆదాయవ్యయముల యో చింపక ధారాళముగా ధర్మముచేయువాఁడు

ఎత్తడితత్తడి. వా. అననుకూలము.

ఎత్తనగోల. దే వి 1 గోనెలెత్తి ఎద్దమీఁద వేయుటకు సాధనమైనకఱ్ఱ. "సీ. తనరుగోణ్యు ద్ధారిదండాఖ్య యెత్తనగోల వాఁట్టెనగోల యనఁగ." ఆం, భా ద్వి పై. 267: చూ, బట్టెనగోల; 2. ఊఁతగా ఆనించినకోల, ఆను కఱ్ఱ: చూ, పట్టుఁగొమ్మ.

ఎత్తనగోలు. దే. వి. 1. ఆరంభము: చూ, మొ దలు; 2. ప్రారంభము: చూ, యత్నము.

ఎత్తరము. దే. విశే. రూ-ఎత్తరవు, ఉన్నతము. "సీ. ఇలఁజుట్టువడా తుండములమించి పూ ర్వాంగ మెత్తరంబై పిఱుంద త్తమిల్ల." స్వా. 5, ఆ. 98: చూ, పొడవు 2

ఎత్తరవు. దే. విశే. —పై.—

ఎత్తలి. దే. వి. కొలిముట్టు: చూ, పనిముట్టు.

ఎత్తికొను. దే. అ. క్రి. 1. పూను. "గీ. ఎట్టి కష్టుఁడైన నిట్టి పాపము సేయ నెత్తికొనునె ధరణి నీవుదక్క." భాగ. ఆర. 6, ఆ. 252 చూ, యత్నించు; స క్రి. 2 అపహరించు, మోసపుచ్చి తీసికొనిపోవు. "భగాసుర కాంతి నెత్తికొనిపోవుట దోసముయామినీశ" వి, పు. 6, ఆ. 89: చూ, దొంగిలించు, 3. మోయు: చూ, వహించు; 4. ఉద్ధరించు, పైకెత్తు. "క. ఇపుడా నన్నెత్తికొనక, గృపపుట్టుట సీకు" రామా. 7, ఆ. 81 (మూఁడవ యర్థమునకు విదియె.): చూ, మీఁదికెత్తు.

ఎత్తికోలు. దే. వి. 1. ప్రయత్నము "క. తగ తగమప్రజలఁ దునిమెదు, నరునప్పటి యెత్తికోలునకు సుర విద్యా, ధర ఖేచరులును భీతిన్, బొరసిరి." భార. విరా. 5 ఆ. 64: చూ, యత్నము; 2. మనోవ్యాపారము, ఎన్నిక. "క. పదివేలఁ జంపఁగానో, పుదునే నను నెత్తికోలుపుట్టినయది" భార. ఉద్యో. 4, ఆ. 409: చూ, సంకల్పము; 3 పట్టుదల. "వ. ఎప్పుడేని మీరలడ్డమాడుదు రప్పుడ శపింతునిట్టిద నాయెత్తికోలు." భా. అను.2, ఆ. 331: చూ, ప్రతిజ్ఞ. 1.

ఎత్తికోళ్లుమొత్తికోళ్లు. వా. చెఱుపు "వ్యాపారములన్ని విధములను ఎత్తికోళ్లుమొత్తికోళ్లుగా గాన్నున్నది."

ఎత్తిపట్టు. దే. స. క్రి: చూ, ఎగఁబట్టు.

ఎత్తిపొడుచు. దే. స. క్రి. దోషములెత్తిచెప్పి మర్మము దూఱనాడు: చూ, దెప్పిపొడుచు.

ఎత్తిపొడుపు. దే. వి. 1. దోషములెత్తిచెప్పి మర్మము దూఱనాడుట: చూ, సోల్లుంఠనము; 2 పరిహాసముతోఁగూడిన మాట, ఆచ్ఛురితకము: చూ, హాస్యము. 1.

ఎత్తిపోఁత వా. శవమును కాల్చిన భస్మాదులను సంచయనానంతరమున ఎత్తి నీటఁబోయు కర్మ: చూ, సంచయనము. 1.

ఎత్తిలి. దే. అవ్య. బిగ్గరగా. "ఎత్తిలి కావుకావు గనియేడ్చి." హరి పూ. 5, ఆ 1. 51; శివరా. 2. ఆ. 54. చూ, బిగ్గర. (రూ-ఒత్తిలి.)

ఎత్తివేఁత దే. వి. కొట్టివేఁత, తీసివేఁత: చూ, వ్యవకలనము. (మైనస్.—.)

ఎత్తివేయు. దే. స. క్రి. 1. తగ్గించివేయు. "వానిపేరెత్తివేయుము": చూ, తీసివేయు; 2. అలక్ష్యముచేయు. "నన్నెత్తివేసి మాటాడెను" చూ, తిరస్కరించు.

ఎత్తు. దే వి. 1. వయ్యము. "తే. గీ. తగుఁబిశాచాఖ్య బూచిబూతము కొఱవి, దాలుపులు సోఁకులెత్తులు దయ్యము నె, గడలు గాలి పిశాసముల్ గాములనఁగ." ఆం, పదా. సుర. 39: చూ భూతము; వై. వి 2.=యుక్తి. జిత్తు: చూ, యుక్తి; 3.=యుక్తి, ఉపాయము, ఎత్తుగడ. "గీ. ఇంతవట్టును నాపాల నిచఃటఁగూడె, నేమిసేయుదుఁ బనికిఁ బైయెత్తుఁ దోఁచ, దనుచుఁ జింతాపరంపరాత్యంత దంతు, రాంతరంగంబుతో నుండె నవ్విభుండు." రామా. 7, ఆ. 48: చూ, వెరవు; 4 =యత్నము. పూనిక. "చ. విలసిత మోహదాహకరివేదన పొమ్మని యెత్తుపెట్టఁగా." హంస. 1, ఆ.114: చూ, యత్నము; 5. పూలదండ; చూ, భూషణము. 2; 6. చదరంగపుఎత్తు. "ఎత్తుపై యెత్తువేసి భోసి రాజు ఆటకట్టుజివాన్నఁడు."

చూ, కాఁపు; 7. ఉన్నతి. "ఉ. తమ్ములకెల్లఁ బెద్దయగు తామర సోదర నాభికా సరో, జమ్మది విశ్వముల్ విధివశమ్మునఁ గాని సృజింపఁ జాలదీ, తమ్ముల యెత్తు చిత్రి కితమ్ము" వసు 5, ఆ 102: చూ, పొడవు. 2; 8. ¼ మణుగు=పాతిక మణుగు-రెండువీసెలు. "చింతపండు ఎత్తు తూఁగాయిమ్ము". చూ, తిక్క; 9 ఉన్మాదము. "సీ తోలునడు వోధ్యుని దులఁదూచి యూతని యెత్తైనయొద్దిక తెల్లఁదాఁచి." విజ్ఞా. వ్య, కాం. 117 చూ, తూనిక; బ. 10. వలపుకత్తె వలచినవానికిచ్చు ధనము. "సీ. పద్మాస్యపురి ననుభవమునకీవరె త్తులువెట్టు దనఁగ రావల సి నిటకుఁ, దెలుపుమా." ఆము. 2, ఆ 21: చూ, ఎదురు (బ. ఎత్తులు); విశ. 11 ఉన్నతము. "సీ. జౌదల కుపధానమగు సొంపుసేవింపఁ గుడికగంబెత్తుగానిడి చెలఁగి." శేష. 4, ఆ: చూ, పొడవు. 2; అ. క్రి. 12. జనించు. "క. కౌరవులు సేయునవమతి, కారణముగఁ గోపమెత్తు" భార. శాంతి. 1, ఆ. 18: చూ, పుట్టు. 2; 13. నిర్గమించు, బయలుదేఱు "వ ఎత్తెడుచోట్లనువిడిదలలయందునులోనుగా నిస్సాణాదులైన యుద్భట చిహ్నంబులు ప్రకటింపక." భార. విరా. 3, ఆ 182: చూ, వెళ్లు 3; స. క్రి. 14 అపహరించు. "ఆసొమ్ము వాఁడే ఎత్తినాఁడు.": చూ, దొంగిలించు; 15. యుద్ధమునకు ప్రయత్నించు. "గీ. అనికి వ్వరిఁగాని యతండు, కౌరవులమీఁద నెత్తిరాగ డేఁగువాఁడు." భార. ఉద్యో. 2, ఆ. 168: చూ, దండెత్తు; 16. ఉద్ధరించు. "చెలిపాప్రణమెత్తుటసదె." హరి. ఉ. 7, ఆ: చూ, మీఁదికెత్తు; 17. గ్రహించు, కైకొను. "నీవా పుస్తకము నెత్తితివా.": చూ, పుచ్చుకొను; 18. వెలకుఁదీయు. "ఈబండిని ఏలములో నేను ఎత్తితిని": చూ, విలుచు; 19. (నల్లునకునీరు) పాటించు. "సీ. నీరెత్తువేళల నీరెత్తుఁగా దు పాదునకుఁ గాలువలు పొందుగనమర్చి." కళా. 4, ఆ. 76: చూ, పాటించు; 20 భాషించు. "అక్కడ యీమాట యెత్తకుము.": చూ, వచించు; 21. మోయు. "వాఁడు మంచి సేరెత్తెను": చూ, వహించు; 22. ఎత్తి నకలు వ్రాయు. "ఇది మఱియొక గ్రంథమునుండి యెత్తి వ్రాసితిని." : చూ, సంగ్రహించు; 23. (సానమీఁద గంధము)ఊర్చు: చూ, ఊరుచు. 2; (24. మాట్లాడ యత్నించు: చూ, నోరెత్తు; 25. పరు(త్తుటకుయత్నించు చూ, పరు(త్తు, 26. బిచ్చమెత్తుటకు యత్నించు: చూ, బిచ్చమెత్తు; 27. నేలపైగింజలొక్కొక్కటి పైకియేఱు చూ, ఏఱు; 28. అల్లరి పుట్టు: చూ, గోలెత్తు; 29. నొప్పిపుట్టు: చూ, నొప్పియెత్తు మున్నగునవి సందర్భానుసారముగ నూహింపఁదగును.)

ఎత్తుడ. దే. వి. 1. ఉపాయము: చూ, వెరవు; 2. కడఁక: చూ, యత్నము.

ఎత్తుగడ్డలు. ద్వ. వి బ. ఎత్తుడు పొయ్యిగడ్డలు, పొయ్యి పొక్కిళ్ళు (వా): చూ, పొయ్యి.

ఎత్తుగీతి. మి. పా. గీతి: చూ, తేఁటగీతి. చూ, వృత్తము. 1.

ఎత్తుగున్న. ద్వ. వి లేఁత యేనుఁగుపిల్ల. "ఎ, గీ. అంటి మదపుటేనుంగుల కమరకరటి, యెత్తుగున్న" చంద్రా. 1, ఆ. 48: చూ, హస్తి.

ఎత్తుట. దే. వి. పైకెత్తుట. (సం. ప):—ఉన్నమనము-ఊ- ఉన్నయము-ఉన్నాయము.

ఎత్తుదెంచు. దే. అ. క్రి. (ఎత్తు + తెంచు.) దండెత్తివచ్చు. "అ. కాలయవనుఁడనఁగఁ గాలకల్పుఁడు కఱుత్రిఁ, దేచిమధురమీఁద నెత్తుదేర." హరి. ఉ. 2, ఆ. 107. (ఏఁగుదేర అని పాఠాంతరము.): చూ, ఎత్తు. 15.

ఎత్తుపడు. ద్వ. అ. క్రి. ఓపికలేనిదగు. "గీ. బెం డగిలెడు వాఁగనెత్తుపడియె ననుటలగు." ఆం, భా. తృ, స్కం. 96; "ఆవు ఎత్తుపడి యీనలే కున్నది.": చూ, వలియు. (రూ-ఎత్తువడు.)

ఎత్తుపెట్టు. గే. స. క్రి. పురికొలుపు. "చ. విలసిత మోహదాహపరివేదన షొమ్మని యెత్తుపెట్టఁగా." హంస. 1, ఆ. 114: చూ, ప్రేరేపించు.

ఎత్తుపైయెత్తు. పా. యుక్తిపైయుక్తి.

ఎత్తుబరికాఁడు. దే. వి: చూ, రూ-ఎతుబరికాఁడు.

ఎత్తుబిడ్డ. ద్వ. వి. తల్లిలేని లోటులేక పెంచిన బిడ్డ: చూ, శిశువు.

ఎత్తుభారము. మి. విశ. పాడు: చూ, శూన్యము

ఎత్తుబాయి. దే. వి. రెండువీసెల తూనికతెలుపు కట్టె.

ఎత్తులకొకమీఁడు ద్వ. వి. భూతేశుఁడు: చూ, శివుఁడు. (ఇట్లు ఎత్తులవేలుపు. మొ.)

ఎత్తులమారి. ద్వ. వి. తంత్రిగొట్టు, తంత్రములు పన్నువాఁడు

ఎత్తులు. పా. బ. తంత్రములు. "ఎత్తులు పెట్టకుము."

ఎత్తువచ్చు. దే. అ. క్రి. సమానమగు. "వ అత్యు విద్యా నైపుణ్యముగల భూపకుమారులతోఁ బనులకాఁపరులెత్తువత్తురేయని క్రొవ్వు న నవ్వుచుంబలికిన." భాగ. 10, స్కం. ఉ. 800: చూ, సరిపోవు. 1.

ఎత్తువడు. ద్వ. అ. క్రి. 1: చూ, రూ- ఎత్తుపడు. "సీ. ఎత్తువడ్డ మహాకుభృత్తుల నతులిత ధృతిఁజెరిఁగొనని ధీరభటులు." వసు. 2, ఆ. 152; 2. చెడు. "వానిపేరు యెత్తువడె.": చూ, నశించు.

ఎత్తువేయు. దే. స. క్రి. 1. తూనికవేయు: చూ, తూఁచు; 2. (చదరంగమున) ఎత్తువేయు. "ఎత్తువేసి ఆటకట్టినాడు."

ఎత్తువోవు. దే.అ.క్రి. (ఎత్తు + పోవు.) 1. చెడు: "గీ. కలచిగుదుఁబోఁడిరై యుల్లసిలనోఁకర్చి, యెత్తువోయిన గొతము నిల్లునిలిపె." రామా. 4, ఆ. 57: చూ, నశించు; 2 క్షీణించు, తగ్గు. "క. అవియును నొకటికొకటి కై, నొక్కవోక పెనఁగిననుఁగని మధుత్రిపురహరుల్, సన గణతో మగుడంగాఁ, దివిచర ఖేచరగణంబు దివిరి నుతింపన్." ఉ, హరి. 6, ఆ 160 చూ, సుక్కు. 9.

ఎత్తెల. దే వి. చేఁపలఁబట్టు అడ్డువల. "క. వెవుర నూఁడులనెత్తెలఁ, గగముల మత్స్యములఁ బట్టి దుసంతోషము౦, బోఁగయుమఁ గ్రాల్గం గుర్పన్వఁగఁ గగమూహించి నుదిఁ బ్రొత్తకా లఘుఁడనుక్." భార. శాంతి 3, ఆ. 193. చూ, వల. 1.

ఎత్తెసరు. దే. వి: చూ, రూ-అత్తెసరు.(వాడుక) "స్వయంపాకస్థులు యెత్తెసల్లు వేయుచున్నారు."

ఎద. దే. వి. 1 పశుఋతువు. "వ ఎదపదనుం బొదలు పెట్టలకుం జుట్టంబులై." స్వా 4, ఆ. 87 చూ, రేతస్సు. 1; వై. వి. 2.=హృత్, గుండె; అచ్చ. సుం, కాం. 12: చూ, హృదయము. 2; 3. భయము. "సీ. ఎద డింది వదమొంది గదనొంది రొదఁజెంది పొద సంది పెదపంది పెదుకునొక్కఁడు." చంద్రా 2, ఆ: చూ, వెఱపు; 4. ఱొమ్ము: చూ, వక్షము.

ఎదఁగందు. ద్వ. వి: కందుగల దుండగీఁడు, చందమామ. "సీ. చలువలదొరచెందు జాబిల్లి యెదఁగందు కలువలవిందు పాల్కడలికందు, వెనకయ్య పగవాఁడు వెన్నెలతోఁడు..." ఆం, పదా. సుర 38: చూ, చంద్రుఁడు.

ఎదచోలి. ద్వ. వి. గాలి "చ. చిలుకలమేఁత మబ్బుపగ బింక హుయాదణిగాలి...సోఁకద

చాలిగాడ్పుకర్వలి వినుకందుగాడుప వాయు వెసంగును." ఆం, పదా. సుర. 85: చూ, దవాయువు

ఎపదిలము. ద్వ. వి అవధానము. "తే,గీ. హెచ్చరిక హెచ్చరింపనయెద పదిలము, ప్రాశికిపోణిమి యెప్పరికనంగ నవ, ధానముగు." ఆం, పదా. గుణ. 12: చూ, హెచ్చరిక.

ఎదపుట్టులు ద్వ. వి. బ. చన్ను. "క. పెనుగుబ్బచన్నుపాలిం, డ్లనడక్ చాఁచి యెదపుట్టులఁ కుచములకాక్ " ఆం, పదా 2, స 77: చూ, స్తనము.

ఎదపుచ్చెలసామి. ద్వ వి శ్రీమన్నారాయణుఁడు శ్రీవత్సమను పుట్టుమచ్చల దేవుఁడు, వెన్నుఁడు: చూ, విష్ణువు. 1.

ఎదవడు. వై. అ. క్రి (ఎద + పడు.) అదలు, భయపడు. "క. ఆవ్వేళ దివ్యబాణము, నన్నియముఁ బనిసేయకున్న నెదవడి యదిలోఁ, దెవ్వడి కవ్వడి చూలఁగ, నవ్వడుఁ జితాంగదుండు యుండెఁ గ్లనియెన్ " జై. 7, ఆ 42: చూ, వెఱచు.

ఎదావు దే. వి. (ఎద + ఆవు.) సంజ్ఞ. (గర్భము దీనియందు ధరింపఁబడును. ఎదయై యాఁబోతుచేత వెంటాడఁబడిన యావు.) రూ-పెదావు: చూ, ఏనువు.

ఎది. దే. స. ఏశబ్దమునకు అమహదర్థక ప్రథమైక వచనము. "ఏయూఁడుది, ఏపక్వాది, ఏజడ వస్తువు.": రూ-ఎద్ది-ఎయ్యది-ఏది-ఏదీ-ఏయది, ఏమి

ఎదిరి. దే. వి. 1. పగతుఁడు: చూ, శత్రువు. 1; 2. అభియానము, జయమునకయి ఎదురుకొని పోవుట: చూ, తలపాటు. 2.

ఎదిరించు. దే. స. క్రి. ఎదురుకొను: చూ, ప్రతిఘటించు.



ఎదిరింపు. దే. వి. అభియానము, జయమునకయి ఎదురుకొనిపోవుట: చూ, తలపాటు. 2

ఎదిరికొనుట. దే. వి. —పై.—

ఎదిరికోలు. దే. వి. —పై.— "సీ. ఎదురు, కొనుట యెదురేఁగుట యెదిరికోలనంగ, నభిగమన మొప్పు." ఆం, భా. ద్వి, కాం. 178.

ఎదిరిదగ్గాస్తుదార్లు. పా. కొంటరు పిటీషనర్లు.

ఎదిరపార్టీవారు. పా. —పై.—

ఎదిరిపిటీషనర్లు. పా. —పై.—

ఎదిర్కొనుట. దే. వి: చూ, రూ-ఎదిరికొనుట.

ఎదుగు. వై. వి. 1, అధికము. "సీ ఎచ్చు హెచ్చు పెల్లఁదనము హెచ్చు మిగిలి, మిక్కిలి యెక్కువ మెండగ్గలము పెచ్చు నగునాఁగ నధికంబుదోఁచుచుండు" ఆం, భా. తృ, కాం 24: చూ, హెచ్చు. 1; వై అ. క్రి. 2. పెరుగు. "ఎదుగుబొదుగు యెన్నటికిని కాన్పింపదు.": చూ, వర్ధిల్లు

ఎదుగుడు. వై. వి. అధికము: చూ, హెచ్చు. 1.

ఎదుట దే. దక్రి. పురోర్థకము: చూ, మ్రోల.

ఎదుటివాఁడు. ద్వ. వి. అభిముఖుఁడు: చూ, సమ్ముఖుఁడు.

ఎదురగు. దే. అ. క్రి. అభిముఖమగు: చూ, మోహరించు. 1.

ఎదురాడు. దే. అ. క్రి. (ఎదురు + ఆడు ) వ్యతిరేకముగా సంభాషించు, మాటాడు, మాఱు పలుకు: చూ, వచించు.

ఎదురీదు. జా. ఎదురుగానీదు. "నీటికియెదురీదు."

ఎదురు. దే. వి 1 ముందు. "క. ఒకమరికిరీటి కట్టెదిరికినతిముఖుఁబోయి శేని రెండవమాటి, య్యాకొనుట కోర్వఁగ వేరయి, రొకట్ఁ గురురాజుసేన యోధులలోనన్." భార. విరా. 5, ఆ. 55: చూ, ముందఱ. 1; 2. రూ-ఎదిరి. పగతుఁడు. "క. దుర్ముఖ, వికర్ణ, కర్ణాది యోధవీరులకదు రే." భార. విరా. 4, ఆ.

చూ, శత్రువు. 1; 3. వలపుకత్తె వలచినవాని కిచ్చు ధనము. "ఇంటిలోనున్న వస్తువు లెదురు వెట్టి." హంస. 2, ఆ. 112: చూ, ఎత్తు. 11; 4 ఎదుటివాఁడు. "ఎదురోర్వవలయు." భార. కర్ణ. 1, ఆ. 313: చూ, సమ్ముఖుఁడు; విశే. 5. అన్యుఁడు. "క. పదపడి దుస్తరమగు నీ, పదమూఁడవయేఁడు గడవఁబడుట యరిది త, మ్మెదురెఱుఁగమికై యాపద, లొదవిన సైరించి రట్టి యునికియుఁగలదే." భార. ఉద్యో. 1, ఆ 9: చూ, పరాయివాఁడు; స. క్రి. 6. ఎదిరించు: చూ, ప్రతిఘటించు; పా. 7. ప్రత్యభియోగము. (కవుంటరు.), దావా; 8. శకునము. "నంబి నీ కెదురుగా రాకుండుటయే ఉపకారమన్నాఁడట.".

ఎదురుకట్టుల. దే. ద్రి. రూ-ఎగురుకట్ల. ఎదుటి ప్రదేశమున. "క. అల్లంత నెదురుకట్టుల, నుల్లమలరఁగాఁచి." భో. 5, ఆ. 216: చూ, మ్రోల.

ఎదురుకట్ల. దే. ద్రి. —పై.— "గీ. గొల్లపడుచులు చని గుంపుగూడి చూడ, జోలు దామెన త్రాడును లీలతోడ, నీడ్చికొనివచ్చి తమయింటి యెదురుకట్లఁ, దసరు ధవళార్జునంబులఁ దగులఁబెట్టి." వి, పు. 7, ఆ 137.

ఎదురుకుత్తుక. దే. వి. అంకిళ్ళుపట్టుకొనెడి యొక తెవులు: చూ, రోగము. 1.

ఎదురుకొనిలేచుట. దే. వి. ఇంటికి వచ్చిన పెద్దలకుఁ జేయుమర్యాద: (సం. ప):—అభ్యాగమము, అభ్యుత్థానము.

ఎదురుకొను. దే. అ. క్రి. 1. రూ-ఎదుర్కొను. అభిముఖమగు: చూ, మోహరించు. 1; స. క్రి. 2. రూ-ఎదుర్కొను, ఎదిరించు "వాఁడు నన్నెదురుకొని నిలువనేరఁడు.": చూ, ప్రతిఘటించు.

ఎదురుకొనుట. దే. వి. రూ-ఎదుర్కొనుట. అభిగమము: చూ, తలపోటు. 2.

ఎదురుకోలు. దే. వి. 1 —పై.—, 2. వివాహమునఁ బడుచు యింటివారు వరుని కెదురుగాఁ బోవుట. —పై.—; 3. పూజ్యులు వచ్చునపుడు ఎదురుగాఁబోవుట. —పై.— (రూ-ఎదుర్కోలు.)

ఎదురుగడ. దే వి. (ఎదురు + కడ.) సమానాకృతిక భాగము, ప్రతిరూపము, మాఱువ్రాసిన యొడంబడికలోనఁగునది. "ఎదురుఁగడ యొడంబడిక, ఎదురుఁగడ లెక్క." మెం. (కవుంటరుపార్టు)

ఎదురుగాలి. ద్వ వి. గోగంధనము : చూ, వాయువు.

ఎదురుచు దే అ. క్రి 1. రూ- ఎదుర్చు-ఎదుర్చు. అనుకూలము కానిదగు: చూ, ప్రతికూలమగు; 2 రూ-ఎదుర్చు- ఎదుర్చు. ఎదిరించు: చూ, ప్రతిఘటించు.

ఎదురుచుక్క. ద్వ. విశే. 1. అశుభప్రదము, అనిష్టము, కానిది, కూడనిది. (చుక్క అనఁగా శుక్రుఁడు శుక్రుఁడెదురగుట యనిష్టప్రదము గనుక లక్షణచే నీయర్థమువచ్చినది.) జా. 2. చుక్క యెదురు, విరోధము. "ఒరయిక గానెదురుచుక్కయును గాకున్నఁ." రామా.

ఎదురుచూచు. దే. స. క్రి. వేచు: చూ, ప్రతీక్షించు.

ఎదురుతంటసము. పా. పితూరీదారునకు వేయు జరిమానా.

ఎదురుపడు. ద్వ. అ. క్రి. 1. రూ- ఎదుర్పడు. ఎదురుగావచ్చు. "దారిలో వాఁడెదురుపడెను.": చూ, మోహరించు. 1; 2. రూ- ఎదుర్పడు. ఎదురుతిరుగు. "వాఁడు వ్యాజ్యములో యెదురుపడి పనిచేసినాఁడు.": చూ, ప్రతిఘటించు.

ఎదురుపాటు. ద్వ. వి. రూ-ఎదుర్పాటు. ఎదురుపడుట: చూ, తలపాటు. 2.

ఎదురుప్రతి. పా. ఎదురుబడి ప్రతి, సమావాక్యతిక భాగము, ప్రతిరూపము (కౌంటరుపార్టు.)

ఎదురుబడి. ద్వ. వి. 1: చూ, ఎదురుపాటు; 2. ఎదురుగనుంచబడిన పాఠశాల. (రైవల్ స్కూల్.)

ఎదురుబడిప్రతి. పా: చూ, ఎదురుప్రతి.

ఎదురుబిడి. పా ఎదురుగ (కక్షచే) మాట్లాడుట. "వాఁడు ఎదురుబిడిగ మాటలాడెను." (గోదావరీమండలమున వాడుక.)

ఎదురుబిడివాఁడు. పా చెప్పినమాటకు అడ్డుచెప్పువాఁడు

ఎదురుబిడివాదము. పా. 1 చెప్పినది సబబుఅయినను యెదుటివాఁడు అడ్డుచెప్పుటయే ప్రధానముగాఁగల వాదము; 2. ఒకవకీలు చెప్పినదానిని ఖండించుచు ఎదుటివకీలు చెప్పెడి సమాధానము. (ఆర్గ్యుమెంటు.)

ఎదురుమ్రోల. ద్వ వి: చూ, ఎదురుబడి

ఎదురుమ్రోయు. ద్వ. అ క్రి. ప్రతిధ్వనించు: చూ, మాఱుమ్రోయు.

ఎదురురొమ్ము. ద్వ. వి.ఱొమ్మునడిమిభాగము: చూ, వక్షము.

ఎదురెక్కు. ద్వ. స. క్రి. 1. (నీటికి) ఎదురుగాబోవు "తియ్యనీటికి చేప ఎదురెక్కు."; 2. తిరుగఁబడు "వ్యవహారము ఎదురెక్కినది: చూ, పల్లటిల్లు

ఎదురెత్తు. జా. అడ్డు, పైఎత్తువేయుట "అల దైవంబిత్తరిమనకెదురెత్తువేయుచున్నది."ధర్మజ.

ఎదురేగు. దే. అ. క్రి. (ఎదురు + ఏగు.) ఎదురగు, ఎదురుగాఁబోవు:చూ, మోహరించు.1.

ఎదురేగుట. దే. వి. 1. అభిగమము: చూ, తలపాటు. 2; 2. ఎదురుసన్నాహము, పెండ్లి నాలుగునాటిరేయి దొంగవేలిమి (శేషహోమము) ముందు తెల్లవారుజామున జరుపు ఊరేగింపుటుత్సవము.

ఎదురొత్తు. దే. అ. క్రి. (ఎదురు + ఒత్తు.) రతియందలి చేష్ట: చూ, మాఱొత్తు. (చూ, రతిబంధము.)

ఎదురొత్తులు. దే. వి. బ. (ఎదురు + ఒత్తులు.) రతియందు పురుషుఁడొత్తినపుడు స్త్రీ మరల నొత్తుట: చూ, మాఱొత్తులు. (చూ, రతిబంధము.)

ఎదుర్కొను. దే. అ. క్రి, స. క్రి: చూ, రూ-ఎదురుకొను

ఎదుర్కొనుట. దే. వి:చూ, రూ-ఎదురుకొనుట.

ఎదుర్కోలు. దే వి చూ, రూ- ఎదురుకోలు. "సీ. తనచక్రమునకు నాతిని దివ్యతేజంబు గురుభావమున నెదుర్కోలుసేయ." కళా. 2, అ 32.

ఎదుర్చు. దే. అ. క్రి. 1: చూ, రూ-ఎదురుచు. 1; స. క్రి. 2: చూ, రూ- ఎదురుచు. 2. "ఉ. తమ్ములు వీఁగినం బతి యుదగ్రతభీమునెదిర్చి యార్చుచున్," భార. భీష్మ. 2, అ. 232.

ఎదుర్పడు. దే. అ, క్రి: చూ, రూ-ఎదురుపడు. (ఎదురుతిరుగు.—"చ. యవన జరాసుతాదులకు నాజి నెదుర్పడలేక" భాగ.3, స్కం.92.)

ఎదుర్పాటు. ద్వ వి: చూ, రూ-ఎదురుపాటు.

ఎదురొమ్ము. అం. కళాస్థానములు పదునాఱింటిలో నొకటి: చూ, కళాస్థానములు.

ఎదురొమ్ముకుంపటి. జా. గుండెలబరువు. అనివార్యమయిన కష్టమును గలిగించు వస్తువు. "పతికెదురొమ్ము కుంపటిగఁ బాల్పడకుండని లక్ష్మి." శ్రీనివాసవిలాసము.

ఎద్దడి. దే. వి. 1. దారిద్ర్యము: చూ, బీదతనము; విణ. 2. దరిద్రము: చూ, బీదతనము; 3.వట్టి.

ఎనమనూఱు. దే. స. (ఎనిమిది + నూఱు.) ఎనిమిది నూఱులు: రూ- ఎనమన్నూఱు (సం. ప్ర.— అష్టశతము.

ఎనమన్నూఱు. దే. స. —పై.—

ఎనభయి. వా. స. చూ, ఎనఁబది. (రూ- ఎనభై.)

ఎనయిక. దే. వి. 1. కూడిక. "క. వినుఁడీ తగు సంబంధపు, టెనయికగని మోచి తెచ్చి యిచ్చ నసరె చుల్కానీరులు." ఆము 6, ఆ. 119: చూ, సంయోగము; 2. పోలిక: చూ, సమానము

ఎనయు. దే. అ. క్రి. 1 అనుకూలమగు. "ఉత్పల్లలోచనుఁడా కృష్ణునిమూర్తితో నెనయునీసన్మూర్తి." హరి. ఉ. 5, ఆ. 176: చూ, సరిపోవు 1. స. క్రి. 2. పొందు "ఉ. గనగన నెల్లప్రొద్దుఁగొని కాలెడు వేఁడిమిఁజేయ్పకర్తవే, నెనయనుదగ్గఱన్ సయిఁపక" హరి. పూ 1, ఆ 170: చూ, ప్రాప్తించు; 3. అంగీకరించు. "చ. ఎనయుదనీవు పౌరుషవిహీనుఁడవద్దివిజేంద్రనందనున్." భార. కర్ణ. 2, ఆ. 28. చూ, సమ్మతించు.

ఎనర్జీ. ఆం. శక్తి.

ఎనలాజికల్ స్కూల్. ఆం. సారూప్యపంథ.

ఎనామలు. ఆం. పింగాణి, మలాము.

ఎనాలొజి. ఆం. పోలిక.

ఎనాలిసిస్. ఆం. విభజనము, అన్వయము, పృథక్కరణము.

ఎనాటమీ. ఆం. శారీరనిర్మాణ శాస్త్రము, శరీర వ్యవచ్ఛేద శాస్త్రము.

ఎనార్కి. ఆం. అరాజకము, అనాయకత్వము.

ఎని. ద్వ. స. ఏ. 1 (ఎంతశబ్దమునకు అమహదర్థక బహువచనాదేశము. హల్లు పరమగుచో నిత్యలోపము వికల్పముగనగు.) ఎంతసంఖ్య కలవి: చూ, రూ- ఎన్ని; 2. అన్నియు, ఎన్ని గలవో అన్నియును: చూ. రూ- ఎన్ని.

ఎనిక. దే. వి. 1. నాలుగుపోఁగుల నూలుదారము: రూ- ఎనికె; 2 రూ- ఎనికె, ఎన్నిక, గణనము. "క. తనకంటె నధికుఁ బగసతి, నెనిక మిగులఁ దిట్టుచేసి నేఁబడిపణముల్, తనకంటె హీనుఁడిట్టినఁదనకుఁ బండ్రెండునగయు దండువులుగున్" సభా. ప్రా, కాం. 45: చూ, సంకల్పము.

ఎనికె. దే. వి. రూ—పై.—

ఎనిమిదడుగులమెకము. ద్వ. వి. దచ్చియడుగుల మెకము: చూ, శరభము. 1.

ఎనిమిదవది. దే. వి. 1. జ్యోతిష.— ఆయుస్థానము: (సం. ప్ర.— అష్టమము; 2. ఎనిమిదవయంకెకు గుఱుతు: చూ, అష్టము. 2.

ఎనిమిది. దే. స. 1. రూ- ఎన్మిది "ఆ. ఎనిమిదక్షరముల నేర్పడ నెఱిఁగియు, వినియుఁగనఁగ రాక వెలయువానిఁ, దనువునందుఁ దెలియఁద త్వాత్ముఁడగునురా." వేమన 658: చూ, దచ్చి.

ఎనిమిదికాళ్ళచిక్కు. ద్వ. వి. అజైకపాత్తు, పూర్వభద్రపదానక్షత్రము: చూ, నక్షత్రము 1.

ఎనిమిదికాళ్లంక్కనెల. ద్వ. వి. భాద్రపద మాసము: చూ, మాసము 1.

ఎనిమిది యక్కరములు. పా 1. (సూర్యుని) అష్టాక్షరి; 2. య ర ల వ మ ద న స.

ఎనియు. దే. అ. క్రి. కలిసికొను "పప్పు బాగుగా ఎనిసినది": చూ, సంకరమగు

ఎనీమా. ఆం. వస్తి, వస్తికర్మ, పిచికారి (క్లిస్టర్.)

ఎనీస్తెటిక్కు. ఆం. క్లోరోఫారము.

ఎనుచు. దే. క్రి. ఎనియఁజేయు, ఎనుపు: చూ, కలియఁబెట్టు.

ఎనుపతేలు. ద్వ. వి (ఎనుము + తేలు.) నల్లతేలు. చూ, వృశ్చికము. 1.

ఎనుపదూడ. దే. వి. గేదెదూడ: చూ, కయూహము.

ఎనుపకాఁకాలు. ద్వ. వి. ఒకానొకచెట్టు: చూ, వృక్షము.

ఎనుపసరము. ద్వ. వి. (ఎనుము + పసరము.) బర్రె: చూ, మహిషి.

ఎనుపు. దే. క్రి. ఎనియఁజేయు "పప్పులో ఉప్పువేసి ఎనుపుము.": చూ, రూ- ఎనుచు.

ఎనుపుడు. దే. వి. ఎనుచుట. "పప్పులో ఉప్పు వేసి ఎనుపుడు."

ఎనుపెంటి. ద్వ. వి. (ఎనుము + పెంటి.) గేదె: చూ, మహిషి.

ఎనుపోతు. ద్వ. వి. (ఎనుము + పోతు.) దున్న: చూ, మహిషము.

ఎనుబండ్రు. ద్వ. స. ఎనుబదిమంది. (ఎనుబదికి మహన్మహత్యర్థకరూపము)

ఎనుబదవది. ద్వ. విణ: చూ, అశీతితమము.

ఎనుబది. ద్వ. స. (ఎనిమిది + పది) ఎనిమిది పదులు: చూ, అశీతి. (80.)

ఎనుబదినాలుగు లక్షలు. పా. స. 84,00,000. "క. ఎనుబదినాలుగు లక్షల, తనఁబరఁగిన జీవరాసులందును మునుఁదా, జనియించు విధముఁదెలిపిన, మనుజుఁడెపో దారిగాంచు మహిలో వేమా." వేమన. 671. (వందలస్థానము, వేలస్థానము, లక్షలస్థానము కుడినుండి ఎడమవైపునకు లెక్కించి తెలిసికొనవలెను.)

ఎనుము. త్రై. వి. రూ-ఎనుమ్మ. బర్రె: చూ, మహిషి. (వృత్తియందు అంత్యవర్ణలోపము. "ఎనుపెంటి, ఎనుపోతు" మొ.)

ఎనెమ్మ. దే. వి. పురిటిపురుగు: రూ- ఎన్నెమ- ఎన్నెమ్మ.

ఎన్నఁడు. దే. వి. ఏ. (ఏ + నాఁడు.) 1. ఏ కాలము "అతఁడెన్నఁడు వచ్చును,": ఎపుడు- రూ - ఎప్పుడు - ఎప్డు; 2. ఎప్పుడు. "ఆ, గీ. భూతములుగ్రాలు నెన్నఁడేఁ బుట్టి నిండ్లనపుడు వారణాసీక్షేత్ర మైదుకోసు, లంతమేర యుపద్రవంబందకుండు." కాశీ. 2, ఆ. 51. (ఎన్నఁడేని యనుచో ఏని శబ్దము వాక్యాలంకారార్థము.): ఎపుడు-రూ-ఎప్పుడు-ఎప్డు; 3. ఎల్లప్పుడు. (ఇది యీ యర్థమందు ద్రుతాంతము): ఎపుడు-రూ-ఎప్పుడు-ఎప్డు; (సం. ప్ర)—కర్హి.

ఎన్నాళ్లు. దే. వి. బ. (ఎన్ని + నాళ్లు.) ఎన్ని దినములు "క. ఎన్నాళ్లుబ్రదికి భువిలోఁ, గన్నుల వలపుననుజిక్కి కామాతురుఁడై, యున్నను జచ్చినఁబోకచే, తన్నెఱుఁగని యీఁగ సచ్చు తగబడి వేమా." వేమన. 657.

ఎన్ని. ద్వ. స. ఏ. 1 (ఎంతశబ్దమునకు అమహదర్థక బహువచనాదేశము) ఎంతసంఖ్యకలవి. "ఆ. ఎన్నిమతములైన నేమంత్రమైనను, సత్యమింతలేక జాడవిడదు, సత్యముగలదేని సకలలోకద్విజుఁడగు" వేమన 667: చూ, రూ-ఎని; 2 అన్నియు, ఎన్నిగలవో అన్నియు: "ఆ. ఎన్నితనువులైన మృతికి సద్దముగావు." "ఆ. ఎన్నితపములేడ్చి యెన్నినోములనోచి, యెంతకష్టపడిన నేమిలేదు, గురునిబోధలేక దొరకదెందును ముక్తి." "తే. ఎన్నిదినములు బ్రదికిన నేమిఫలము." వేమన. 660. 661-662; "ఉ. ఏకపుఁబ్రోకయైన కృతులెన్నియు నేర్పననేర్పరించి." (ఇది యువర్ణాంతమైనప్పుడే యీ యర్థము కలదిగాఁ గానఁబడియెడిని.) భో. 1, ఆ. 7: చూ, రూ-ఎని. (చూ, ఎవ్వఁడు. దీనికి ఏని శబ్దము వెనుకఁ జేరునపుడు అనేకము అనెడి యర్థము కలుగుచున్నది. "ఏను గయ్యపుకతనంబు లెన్నియేనిగంటిని." భాగ. ఉద్యో. 3, ఆ. 41: చూ, ఇన్ని.)

ఎన్నిక. దే. వి. 1: చూ, రూ-ఎనిక. పా. 2. ప్రతినిధుల నెన్నుకొనుట. (ఎలెక్టు, ఎలెక్షను.)

ఎన్నికచేయు. ద్వ. స. క్రి. లెక్కపెట్టు: చూ, లెక్కించు.

ఎన్నికదారులు. పా. నియోజకులు (ఎలెక్టర్సు.)

ఎన్నికపెట్టు. ద్వ. స. క్రి: చూ, లెక్కించు.

ఎన్నికఫిర్కా. పా. నియోజకమండలము. (కాన్‌స్టిట్యూయెన్సీ)

ఎన్నికయిడు. ద్వ. స. క్రి: చూ, ఎన్నికచేయు

ఎన్నికల అధికారి. పా. (ఎలెక్షన్ ఆఫీసరు) ఎన్నికల వ్యవహర్త.

ఎన్నికవర్గము. పా. నియోజకవర్గము. (ఎలెక్టొరేట్.)

ఎన్నిగుండెలు గలవు. జా. ఎంతధైర్యముండెను. "ఎవఁడు నేతలంక జేరికి నెన్నిగుండియలు గలవు నాదుప్రియను జేర." కళాపూర్ణోదయము.

ఎన్ను. దే. వి. 1. వరియెన్ను మొ: చూ, వెన్ను; స. క్రి. 2. ఆక్షేపించు, ఎంచు. "సీ. చంద్రచంద్రాతప చందనశారదా శారదాంభోద కేసరుల నెన్ని." గసి. 1, ఆ. 54: చూ, నిందించు; 3. గణించు, లెక్కపెట్టు: చూ, లెక్కించు.

ఎన్నుకోను. పా (ఎలెక్షన్) ఎన్నిక.

ఎన్నువ దే. వి ఆఁడువారేఘ్నపుడు అనుభవము నెంచియెంచి పాటగాఁడాడెడు వచ్చినవారి చారిత్రము.

ఎన్నెము. దే. వి. కురిటిపురుగు: చూ, రూ-ఎనెము.

ఎన్నెమ్మ. దే. వి —పై.— (ఇందుకొక కథ కలదు.)

ఎన్బది. ద్వ. స: చూ, రూ-ఎనుబది.

ఎన్మందుము. ద్వ వి: చూ, రూ-ఎనమందుము.

ఎన్మిది. దే. స: చూ, రూ-ఎనిమిది.

ఎన్ము. దే. వి: చూ, రూ-ఎనుము.

ఎన్యూయిటీ. ఆం. వార్షికము, వర్షాశనము.

ఎపుడు. ద్వ. వి. ఏ: చూ, ఎన్నఁడు. (రూ- ఎప్డు.)

ఎపోకార్పస్ ఓవరీ. ఆం. విభక్తాండాశయము.

ఎపోకార్పస్ పిస్టిల్. ఆం. విభక్తపిండాశయము

ఎప్పటి. దే. అవ్య. పునరర్థకము. అప్పటి. "క. ఇవ్విధమునఁ బురమంతయు, నివ్వల నవ్వలను దేఁగి యెప్పటికాలన్, అవ్వంగ బెగడి రయమున, నవ్వనచరమేగ దట్టమగు కానలకున్." భో. 5, ఆ 255: చూ, వెండియు.

ఎప్పుడు. ద్వ. వి. ఏ: చూ, ఎన్నఁడు. (ఏ కాలము —ఏమఱకుండు నె నిజకృత్యము నెప్పుడును." భార. సభా. 1 ఆ; ఎల్లప్పుడు.— "రేయిపగలు నిద్రియు నెప్పుడెఱుఁగక" భాగ. అర. 3, ఆ; "ఎప్పుడుఁదప్పుడు వెదకెడు" సుమతిశతకము; "ఉ. ఎప్పులు జూచిన," వేమన. 672.

ఎప్పెండిక్సు ఆం. ఉనుకపుచ్ఛము- క్రిముకము. (వెర్మిఫారమ్=క్రిముక-క్రిముకము.)

ఎపాక్సిమేషన్. ఆం: చూ, అదూరదశకము, ఉజ్జాయింపు, రమారమి, మదింపు లెక్క.

ఎబెట్టు. దే. వి. జుగుప్స. రూ-ఎబ్బెట్టు: చూ, రోఁత. 2.

ఎబ్డామెన్. ఆం, పొత్తికడుపు.

ఎబ్డామినల్ కేవిటీ. ఆం. గర్భకుహరము, ఉదరగుహ.

ఎబ్బెట్టు. దే. వి. 1: చూ, రూ-ఎబెట్టు "వాని బాధచూడ ఎబ్బెట్టయ్యె;" 2. మిక్కిలి రోఁత, ఏవ్కు: చూ, రోఁత 2; విశే. 3. అంది ఎక్కువైనది, ఉదాత్తమైనది. (వాడుక.)

ఎబ్బెర. దే. వి. ఒకానొకపిట్ట: చూ, పక్కి.

ఎబ్బెరాపి. ద్వ. వి. రోఁతకలవాఁడు (లేక)రోఁత కలది.

ఎబ్బెరికము. దే. వి. అసహ్యము: చూ, గోత.2. (రూ-ఎబ్బెటికము)

ఎబ్బెటికము. దే. వి. —వై.— "సీ. తొడ మీఁదనిడుకొని దోషాచరాగ్రిణి యెత్తుకచని లంక నేఁడుగాల, మంచిన యిల్లాలినించుక కొంచకమరలఁ దాఁగొనివచ్చి మరులువోఁచ్చి, యెబ్బెటికములేక యేలుచునున్నాఁడు." ఉ రా. 6, ఆ. 200

ఎబ్బే. వా రోఁతగల పలుకు, అనిష్టపు సమాధానము, పెదవివిరుపు. (అబ్బే అని కూడ వాడుదురు.)

ఎబ్సల్యూట్ టెంపరేచరు. ఆం తారతమ్యరహితోష్ణత.

ఎబ్సల్యూట్ జీరో. ఆం. నిమ్నస్థితి.

ఎబ్సల్యూట్ టరమ్సు. ఆం. అసంబంధపదములు

ఎబ్సల్యూట్ యక్సుప్రెషన్. ఆం. నిజవ్యాకోచము

ఎబ్సల్యూట్ స్కేల్. ఆం. తారతమ్యరహితమానము, నిస్తర, నిస్తరాధారమానము.

ఎబ్సెన్. ఆం. కుఱుపు.

ఎబ్సిక్సస్. ఆం. ప్రథమభుజ; కోటిభుజః కోభుజ; మట్టపుభుజము.

ఎబోర్షన్. ఆం. గర్భస్రావము.

ఎబ్రేషన్. ఆం. (చర్మము) గీసుకొనిపోవుట.

ఎమర్జంటు. ఆం, అత్యవసరము.

ఎమాల్గమేషన్. ఆం, రెండుమూఁడు వ్యాపార సంఘముల కలయిక, సమ్మేళనము.

ఎమిక దే. వి. రూ-ఎముక: చూ, శల్యము. 1.

ఎమిడిక. దే. వి. కడుపులోఁ గలుగు పాము వంటి క్రిమి, ఏలికపాము: చూ, సర్పము.

ఎముక. దే. వి. రూ-ఎమ్మక: చూ, శల్యము.1.

ఎముకకీలు. ద్వ. వి. అస్థిసంధి. (జాయంటు.): చూ. మాటు.

ఎముకలగూఁడు ద్వ. వి. కంకాళము, అస్థిపంజరము. (స్కెలిటన్): చూ, శల్యము. 1. అస్థిపంజరము మూఁడుధాతువులచే నిర్మితమైనది. అస్థులు శరీరమును నిలుపు రాటలులేక చేట్రిము. ఈఅస్థులే కండరములను పనిచేయించు దండములు (లీవర్సు) ఉపాస్థి ఎముకల కొనలయందలి మెత్తలుగానుండి చలనమునకు సహకారియగును. ఎముకలు వంగవలసిన చోటులయందు మెత్తఁదనమును వహింపవలసి యుండుటచే ఉపాస్థి అట్టిచోటులను అవసరము (ప్రక్కయెముకల కొనలయందు ఉపాస్థి అవసరము. బంధకములు కండరములను ఎముకలకు అతుకుచోట్లను, ఎముకలనెముకలకు కలుపుచోటులను త్రాళ్ళ(టెండన్సు)వలె సమరియుండును. ఇందలి భాగములు.–1.కపాలము లేకపుర్రె ఇందు 28 బిళ్ళఎముకలు గలవు. అందులో కొన్ని మిక్కిలి వంకరలు గలవి; 2. మెడకంబ ఇందు ముందు రెండు పొడవైన కంటిఎముకలును, వెనుక రెండు భుజపు బిళ్ళలును గలవు; 3. భుజపుటెముక లేక భుజాస్థి; 4. ప్రక్కఎముకలు. ఇవి మొత్తము 12 జతలు. అందులో 10 జతలు మాత్రమే ముందుఱొమ్ము ఎముకతో కలిసి, తక్కిన 2 జతలును వెన్నెముకనుచేరి, ముందుఱొమ్ముతో కలియక పొట్టిగా వ్రేలాడుచుండును; 5. తుంటిఎముక. తుంటికంటెలో నొకటి. మిగిలినవి రెండును త్రికాస్థి, త్రోటిక; 6. తొడయెముక, ఊర్ధ్వాస్థి; 7. కాలిఎముకలు రెండు. బయటిది జానుక. లోనిది జంఘిక; 8. పాదములోని ఎముకలు 26. (ఇందులో చీలమండలో 7; పాదాంగుళ్యాధారాస్థులు 5; పాదాంగుళ్యాస్థులు 14); 9. హస్తములోని ఎముకలు 27. (మణికట్టులో 8; కరాంగుళ్యాధారాస్థులు 5; కరాం

గుల్ఫాస్థులు 14 ); 10. తుంటికీలు; 11 చేతి ఎముకలు. 2. బయటిది మణిబంధాధారాస్థి, లోనిది కూర్పరాస్థి; 12. వెన్నెము 33 పూసలు; 13. గోష్ఠుఎముక; 14 భుజపుకీలు; 15. 32 పండ్లు. (ఇవి ఎముకలుకావు.); 16. మోఁకాటిచిప్ప. (ఈ ఎముకలగూఁడు లోపలిభాగములకు బలమునిచ్చి, రక్షక కుడ్యములవలె లోపలి సున్నితాంగముల సంరక్షించును ) (ఎముకలయొక్క శాస్త్రపరిభాషా పదములు.— అస్థి-ఎముక; చూడావయాస్థి; దంతచూడాస్థి; అస్థిపిండము; జతుకాశరీరము; పాణికూర్పాస్థి; అనుత్రికాస్థి; ఘనకారఅస్థి-ఘనాస్థి; త్రికోణిప్రాయకూర్చాస్థి-కోణాస్థి; బాహ్యకోణకాస్థి; అంతఃకోణకాస్థి; మధ్యకోణకాస్థి; అగ్రికపాలాస్థి; ప్రగండాస్థి (ప్రకోష్ఠాస్థి కాదు); కంఠికాస్థి; కుకుందరాస్థి; అశ్రిపీఠాస్థి; పశ్చిమకపాలాస్థి=(శిరఃపృష్ఠాస్థి) శ్రోణిఫలకాస్థి; మధ్యమాటాస్థి; పార్శ్వకపాటాస్థి; శల్యాస్థి (నూదిఎముక.); వర్తులాకార (వర్తులక) అస్థి; భగాస్థి; భగపీఠము-లింగపీఠము; ఉత్తరశృంగము; ఆధారశృంగము; జతూకాస్థి; శంఖవక్రము; శంఖాస్థి; కపాలచక్రికాస్థి. ఇత్యాది. )

ఎముకలవట్టు. దే. విశ. 1. రోగముచే చిక్కినవాఁడు: చూ, బక్కవాఁడు; 2 బక్కటిల్లినది: చూ, బక్క.

ఎముకలసౌన. పా మూలంగ (మేరోవ్.)

ఎమెందుమెంటు. ఆం. సవరణ, ప్రతిసూచన.

ఎమెరాల్డు. ఆం. మరకతము, పచ్చ.

ఎమ్మిక. దే. వి. పొత్తు చూ, స్నేహము. 1.

ఎమ్ము. దే. వి. అస్థి: చూ, శల్యము. 1.

ఎమ్ముక. దే. వి. —పై.— (రూ- ఎముక.)

ఎమ్మూట. ద్వ. వి. (ఎమ్ము + ఊట.) ఎముకల లోని క్రొవ్వు. "సెలవైన యెమ్మూట నె య్యగాఁగ" కవిక. 2, ఆ. 196. (ఎయ్యూట పాఠభేదము ) చూ, మూలగ.

ఎమ్మె. దే వి 1. మనోహరత్వము. "బాలిల్లి యెమ్మెవిడంబింప నెమ్మోగంబు," చంద్రా 3, ఆ 6: చూ, సౌందర్యము; 2. యౌవనాదుల వలన గలుగు గర్వచేష్ట. "ఒకనాఁడు వేలుపుటొడయఁ డెమ్మెనుఁగోరి." అచ్చ. బాల, కాం. 120; పాపం. 3, ఆ, 55: చూ, విలాసము.

ఎమ్మెకాఁడు. దే. విశ. అందగాఁడు: చూ, సౌందర్యవంతుఁడు.

ఎమ్మెలాఁడి. దే. వి. (ఎమ్మెలు + ఆఁడి.) విలాసిని: చూ, స్త్రీ.

ఎమ్యుల్షన్. ఆం, ఔషధరసాయనము; క్షీరరూపౌషధము.

ఎయిదు. దే. స. క్రి. 1. రూ- ఎద్దు. అనుగమించు. "ఆ.ఇట్లు కలచుటయును నెంతయు గయమున, నమ్మృగంబు వెనుక నరిగియరిగి, యెయిదలేక ధారుణీశుండు సారథిఁ,బదలితేరు వేగపఱుపుమనియె." భార. అర. 4, ఆ. 337: చూ, వెంబడించు; 2. రూ-ఎద్దు. పొందు. "ఎఱిఁగి పిలుపనిన వెఱఁబ్రెకులులుదు సాలు వనుగాక నొడిసినభంగిన్, వెఱచఱవంబోదు పుదుఁ బత్తిపఱిసేయుదు నీదుపూన్కి పారం బెయిదన్." భార. విరా. 2, ఆ 282: చూ, ప్రాపించు.

ఎయోర్టా. ఆం. బృహద్ధమని. (అయోర్టా.) పెద్దదగు శుద్ధరక్తనాళము. (ఇది గుండెనుండి బయలుదేరును.)

ఎద్దు. దే స. క్రి: చూ, రూ- ఎయిదు. (వెంబడించు.— "చ. సచివులఁ జూచి యిప్పుడ వెసఁ జన మెద్దుకొక్కినం బకుపరిచయము దప్పిపోవు." (వేఁగకపాఠాంతరము.) భార.

విరా. 3, ఆ. 141; పొందు.— "సీ. కోర్కు లుగడఁగూడుకొని పాఁపమిద్దంగఁ జిత్తంబు లూఱటఁ జిగురులొత్తఁ." భార. విరా. 5, ఆ. 402 )

ఎయిర్. ఆం. గాలి: చూ, వాయువు. (గాలికి సంబంధించిన శాస్త్రపరిభాషా పదములు.— సంపూరక వాయువు- ఊపిరితిత్తులలోనిగాలి- బయటనుండి లోపలికి పీల్చుకొను గాలి; అవశిష్ట వాయువు- ఊపిరి బయటికి విడిచిన తరువాత లోపల మిగిలినగాలి; పరిశిష్టవాయువు- బయటికి విడువబడఁగలగాలి; వాయుశ్వాసములగు ప్రాణులు; వాయుగోళములు; వాయున్యాకర్షణయంత్రము-వాతరేచకము- దేనిలోనుండిగాని గాలిని పీల్చివేసి ఉత్తదిగా చేయుటకుఁగాని హెచ్చుగాలిని నింపుటకుగాని ఉపయోగించు యంత్రము; మఱియు - వాయుస్నానము; వాయుశయ్య; వాయుకోశము; వాతాప్తి; వాయుకోష్ఠము; వాయుసంపీడన (సంకోచన) యంత్రము; గాలిదిండు; వాయుచలనయంత్రము; వాయుస్వచ్ఛకరణ యంత్రము; వాయుకొలిమి - బట్టీ; వాయువిహీనత- వాయురహిత; వాయుమార్గము- శ్వాసనాళిక; వాతాకర్షక యంత్రము- వాతరేచకము; వాయుకోశము; వాతనిరోధక- వాతాగమ్య; వాయువ్యవకాశములు; వాయునాళము. ఇత్యాది.)

ఎయిర్‌వేస్. ఆం. వాయుపథములు; వాయుమార్గములు.

ఎయ్యది. దే. స. (ఏ + అది.) ఏ శబ్దమునకు అనువాదర్థక ప్రథమైకవచనము. "చ. ఏమిటికిం గడంగి యెయ్యదిదోరఁ గొంటి మేలనుచు నబ్బఁడిద్దఱఁ జంచలాత్ములన్, సదృశులనెన్నఁ గూర్చి జీవనంబునఁనంచు." శకు. 3, ఆ. 193: చూ, రూ- ఏది.

ఎయ్యెడ దే. క్రి. ఎక్కడ: చూ, యత్ర 1.

ఎర. దే. వి. 1. రూ- ఎఱ. తిండి. "చ. ఫలములు దళంబులుం దోడిమఁ గాయలు రాలినవ నీఁ గొంచు నాఁకలికారఁజేసి." భార. అను. 5, ఆ. 55: చూ, పాపాటు; 2. పాలి "క. అప్పాంచాలోత్తరు నొక నారసమునకును, నెఱసేసె" భార. శల్య 1, ఆ. 214: చూ, బలి; 3 వగ. "చ. ఎరనొకడుండుభంబను నహింగని." భార. ఆది. 1, ఆ. 153: చూ, దుఃఖము.

ఎరఁగు. దే అ. క్రి. 1. డిగ్గు. "గీ. అవనికొఱఁగి పోయి యతని వేఁడె." భార. విరా 3, ఆ. 218: చూ, దిగు. 4; 2. రూ- ఎఱఁగు. నమస్కరించు. "గీ. ఎట్టిరాజులును మహీసు గోత్రము లెన్నఁదగు దెంచు నప్పుడధికభక్తి, నెరఁగి ప్రియమువలికి తెరువిత్తురు." భార. ఆది. 7, ఆ. 112: చూ, మ్రొక్కు.

ఎరఁగుడు. దే. వి. రూ- ఎఱఁగుడు. దండము: చూ, నమస్కారము.

ఎరఁగుడుకాఁడు. ద్వ వి. అభిపన్నుఁడు: చూ, శరణీయుఁడు.

ఎరగలి. దే. వి. రూ- ఎరవలి. దావము, మ్రాను ఒకటితో నొకటి ఒరసికొనఁగా పుట్టి అడవిని దహించెడి అగ్ని: చూ, నిప్పు.

ఎరగొను. దే. స. క్రి. (ఎర + కొను.) 1. కబళించు. "క. ఉరగము నెరగొను గరుఁడుని, వెరవున నప్పుడతఁడు గగనవీథికి దాఁటెన్." ఉ, హరి. 5, ఆ. 261: చూ, మ్రింగు; అ. క్రి. 2. నివ్వెఱపడు. "వ. మృణాళంబు లాహారంబులుగ మెసంగి యెరగొని సుఖించు రాజహంసంబులుంగల పులినస్థలంబులవలనను." హై. 2, ఆ: చూ, విస్మృతిపొందు.

ఎరచిల్లపురుగు. ద్వ. వి. క్షుద్రజలచరము: చూ, మత్స్యము. 1.

ఎరవలి. దే. వి: చూ, రూ-ఎరగలి.

ఎరవు. దే వి. 1. రూ-ఎరువు. చేబదులు, ఒకటి రెండు దినములు వాడుకొనుటకై యడిగి తెచ్చుకొనెడిసొమ్ము: చూ, బాకీ. 2; 2 రూ- ఎరువు. ధాన్యాదుల ఋణము: చూ, బాకీ. 2; 3. భేదము. "క. గురుభీష్మాదుల మనములు విరము నకుంబోరకయుండ దుర్యోధనుఁ డాతురుఁడై యొడఁబఱపఁగ నిప్పురుషున కెరవైనటిచ్చేరదు బలమెల్లన్." భార. ఉద్యో 1, ఆ. 58 చూ, వేఱుపాటు. 1; విణ. 4. అన్యము "వ. ఎరవుగఁ జూడసాగె వారిజేక్షణ పిన్నటనాటనుండియున్." వసు. 3, ఆ. 102. చూ, పరాయి.

ఎరిత్మెటికల్ టరం ఆం. పదము; ధనము.

ఎరిత్మెటికల్ ప్రోగ్రెషన్. ఆం. అంక శ్రేణి.

ఎరిత్మెటికల్ ఫస్టుటరం ఆం. అంకగణిత సంబంధమైన ఆదిపదము.

ఎరిత్మెటికల్ మిడిల్ టరం. ఆం. అంకగణిత సంబంధమైన మధ్యపదము

ఎరిత్మెటికల్ లాస్టుటరం. ఆం. అంకగణిత సంబంధమైన అంత్యపదము.

ఎరిత్మెటిక్కు. ఆం అంకగణితము.(అరిత్మెటిక్కు.)

ఎరియు. దే. అ. క్రి. 1. జ్వలించు. "క. గురుకర్ణుల యస్త్రాగ్నుల, నెరిసినయది," భార. కల్య. 2, ఆ. 337: చూ, మండు; 2 ఉత్తలపడు. "క. సుకుమారుఁడతఁడు గోపాలక వృత్తి వహించి యడవులం గ్రుమ్మరుచు, న్నీకి వాకటాదు పగవారికినైనను నకట మనమెరియదే వగలన్." భాగ. విరా 2, ఆ 210; "క. పరులధనమునకు విద్యాపరిణతికిం దేజమునకు బలమునకు మనం బెరియఁగ నపహ్యాపడు నస్వస్థరుఁడు దెవులులేని వేదనంబడునధిపా," భార. ఉద్యో. 2, ఆ. 58

ఎరివి. దే వి. రూ-ఎరువు. పాంశువు, పైరు బలమునకై పెక్కునట్ట్లు ప్రోగుచేసిపెట్టిన అవు మేఁకలోనగు పశువుల పేడలోనగునది: చూ, పిడక. (మెన్యూర్)

ఎరువంటి. దే. వి. గంటుబారంగి, పంజె *: చూ, బారంగి

ఎరువాటు. దే వి. (ఎరువు + వాటు.) ఎరువు వైచుట "సీ. పిరము కప్రిపుదుమ్ము మరువంపుఁ బాదుల కెరువాటువైచిన యింపు సొంపు," రా, వి. 8, ఆ. 81.

ఎరువు. దే. వి. 1. చేబదులు: చూ, రూ- ఎరవు 1; 2. ధాన్యాదుల ఋణము: చూ, రూ- ఎరవు. 2; 3. పాంశువు: చూ, ఎరివి. (మెన్యూర్.)

ఎరువులవర్గీకరణము. పా. ఇవి స్వాభావికములు, కల్పితములు అనిగాని; సాధారణములు, ప్రత్యేకములు అనిగాని; సేంద్రియములు, నిరింద్రియములు అనిగాని మూఁడువిధములుగా విభాగింపవచ్చును. పశువులపెంట, కంపలిరొట్ట, యెముకలు స్వాభావికములు; సురేకారము, కల్యాదిస్ఫురితము, అమ్మోనియా గంధకితము కల్పితములు; ఉద్భిజ్జములు తీసికొను నాహారద్రవ్యములలో కొంచె మించు మించు అన్నిటిని నేలకుఁ జేర్చు ఎరువులు సామాన్యములు; అందొకటి రెంటిమాత్రమే జేర్చునవి ప్రత్యేకములు; వృక్షజంతు సంబంధమైనవి సేంద్రియములు; ఖనిజసంబంధమైనవి నిరింద్రియములు.

ఎరువులు. పా. జంతుజములు, వృక్షజములు, ఖనిజములు అని త్రివిధము. (ఇందు పెక్కు విశేషాంశములు కలవు.)

ఎరుసు. వై. వి. 1.= ఈర్ష్య. ఓరువలేనితనము. "గీ. వారిలోన నగ్రవసజాక్షి చల్లాంబ, మఱియుఁ జెన్నపాలఁతి మల్లికాంబ, సవతు లెరుసులేక సతతంబు మెలఁగుచు, సవతులేకయుండ్రు సమ్మదమున." రాజ. 1, ఆ. 64. చూ, ఈడు. 1; దే వి. 2. దీవాగము, బారిముద్ర, ఎఁబెట్టు, ఎడఁబెట్టు: చూ, లోహము. 1.

ఎర్కింగుఐపీసు. ఆం. అతిశీతకటకము. (ఐసీస్.)

ఎరేటెడ్డువాటర్సు ఆం. వాయుమిశ్రిత పానీయములు; సోడాపానీయములు.

ఎర్కు. దే వి. రూ- ఎఱుకు. కిరాతుఁడు. "శాలెర్కు చందంబునఁజ." హరి, పూ. 9, ఆ 191: చూ, వ్యాధుఁడు. 1.

ఎర్గు. దే. స. క్రి: చూ, ఎఱుఁగు.

ఎర్బియమ్. ఆం. అర్వము.

ఎఱ. వై వి 1. రూ- ఎఱ్ఱ. గండూపదము, కించులికము, వానపాము: చూ, సర్పము; 2. రూ- ఎర. తిండి: చూ, సాపాటు; విణ 3. రూ- ఎఱ్ఱ. ఎఱ్ఱనైనది "ఉ. నెత్తుటఁదోఁగి నేల యెఱ్ఱిగి తెఱంగున నుండె." భార. ద్రోణ 2, ఆ. 127: చూ, వర్ణము. 6.

ఎఱఁగు. దే. వి. 1. రూ- ఎరఁగు. నమస్కరించు. "సీ. తండ్రికి కేలుమ్రొక్కి యాచార్యవిప్రులకు వరుస, మఱి మ్రొక్కనదివీరికెఱఁగుట తక్క దేవార్చనంబునకు మున్నమ్యాకడకుఁ, జనఁగాదు." భార. అను. 4, ఆ. 105: చూ, మ్రొక్కు; అ. క్రి. 2. దిగు. అవతరించు. "క. ఎఱఁగిన యొప్పెను వ్రేగున, విఱుగుటయును." భార. అను. 1, ఆ. 287: చూ, పుట్టు. 2.

ఎఱఁగుడు. దే. వి: చూ, రూ-ఎరఁగుడు.

ఎఱక. దే. వి. 1. ఈఁక, పక్షము. "క. ఎఱకలుగల కులశైలము, తెఱఁగు మెఱయు." భార. అర, 6, ఆ. 145: చూ, ఱెక్క. 1; 2. ఎముక. "సీ. బొమికలు, నెఱకెమ్మికయును నొగడ నస్థ్యభిధానమగు." ఆం భా. ద్వి. మ. 133: చూ, కల్యము 1; 3. భుజము. "ద్వి చంద్రహాసంబెత్తి జానకిన్ వేయ, నింద్రారి గమకింప నెఱకలువట్టె." రా. సుం, కాం: చూ, స్కంధము. 1.

ఎఱగఁడు. ద్వ. వి. (ఎఱ+కందు) లేఁతబిడ్డ. హరి. పూ. 5, ఆ. 107: చూ. శిశువు.

ఎఱకన్ను. ద్వ. వి (ఎఱ+కన్ను.) శివునియొక్క అగ్ని నేత్రమనఁబడు మూఁడవకన్ను. ద్వా. 7, ఆ: చూ, నేత్రము 1.

ఎఱగొను. ద్వ అ. క్రి. (ఎఱ+కొను) కోపగించు. "ద్వి ఎఱిఁగియు విమఱిట్టులేల క్రోలెదవు, ఎఱగొన్న వెనుఁబాము నేలత్రొక్కెదవు." రా. అర, కాం; "ఏపటియుండు నేయెఱగొంటఁగాఁగ." రా. యు, కాం: చూ, రోషించు.

ఎఱచి. దే. వి. పొలసు. క. ఉఱవగు నారికె పంటులు, గోటియలపొడియును దఱచగు మురువులకుం, దెఱవలు సుట్టములయ్యెద, రెఱచియుఁ భుజియింతుర్ద్రి నెల్లజనంబుల్." భార. అర. 4, ఆ. 295: చూ, మాంసము.

ఎఱచిదిండు. దే. వి. (ఎఱచి+తిఁడి.) 1. పొలసుదిండి, రక్కసుఁడు: చూ, రాక్షసుఁడు; 2. క్రవ్యాదుఁడు: చూ, మాంసభక్షకుఁడు.

ఎఱచిపిడుక. దే. వి చోరపుష్పి, కట్లా: చూ, కంకిని.

ఎఱడాలు. దే. వి. ఒకరకము వడ్లు: చూ, ధాన్యము.

ఎఱపటికము దే. వి. అనంగీకారము: చూ, అసమ్మతి.

ఎఱబఱికము. దే. వి. అసహ్యము. "చ. అఱమఱయేల నేనిలుచు నాశ్రమదేశము నీదికాని నీ, కెఱబఱికంబులేక యుఁక నిచ్చటునున్న తపస్వి

కాంతలం, దఱి నుచితోపచారము లొనర్పఁ గలారు వివేకశాలినుల్, మఱియొకట తెల్వి దైవగతి మాన్పఁగ నెవ్వరికైన శక్యమే." ఈ, రా. 6, ఆ. 112: చూ, రోఁత. 2.

ఎఱమంట. ద్వ. వి. ప్రకాశించుచున్న ఎఱ్ఱని మంట.

ఎఱయుట. దే. వి. అంతట నిండ వ్యాపించుట. "సీ. ఎఱయుట యనఁగను బరఁగుఁ బ్రసరణాఖ్య." అం. భా. ద్వి. తు. 230: చూ, ప్రసరణి.

ఎఱసంజె. వై. వి. 1. తొలుసంజె. "సీ. ఎఱసంజె కెంజాయ కెదురుమొగ్గగములై కనుపట్టు వల్కలాగ్రములు దూల" రామా. 5, ఆ. 114; "సీ. చిగురాకు కెఱసంజె జిగికిఁ బాండుర కోరకములు భాసుర తారకములు గాఁగ." కవి. 2, ఆ: చూ, సూర్యోదయము; 2. అసుర సంజె: చూ, సాయంకాలము.

ఎఱికత. దే. వి. ఈఁకుణిక: చూ, సోదెకత్తె. (రూ-ఎఱుకత.)

ఎఱిఁగించు. దే. స. క్రి: తెలియఁజేయు: చూ, బోధించు.

ఎఱుంగమి. దే. వి తెలివిలేనితనము: చూ, మఱపు. 2.

ఎఱుఁగు. దే. స. క్రి రూ-ఎర్గు. చూ, తెలియు.

ఎఱుఁగుట. దే. వి తెలియుట, కలన: చూ, విదితము. 1.

ఎఱుక. దే. వి. 1. జ్ఞానము, తెలివి "క. ఎఱుక గలవారి చరితలఁ గఱచుచు సజ్జనుల గోష్ఠిఁ గదలక ధర్మం, బెఱుఁగుచు నెఱిఁగినదానిని, మఱవక నుష్ఠించునది సమంజసబుద్ధిన్" భార. ఆది. 8, ఆ. 203; "క. చదివిన యెఱుకులకు సరియె చదువనియెఱుకుల్." లక్ష్మి. 4, ఆ. 105: చూ, బుద్ధి; 2 గుఱుతు. "సీ. ఇటు నేల జేజేలకఱుకైన చెంగావిసుదసంజ దగు కొండఁజూచివాఁడ" కా. 5, ఆ: చూ, లక్షణము. 1; 3. పరిచయము, ఎఱిఁగియుండుట. "ఎఱుక పెఱికెకు ధనము." శు. 1, ఆ; "ఎఱుకపిడికెకు ధనము." (అని కొందఱు): చూ, సంస్తవము; 4. రాఁగల మేలుకీడులను గూర్చి చేయుప్రశ్నము, రంగము. "గీ. భూతి దాఁచి పసుపుఁబూసి త్రిశూలహ, స్తంబు దాఁచి చేత సజ్జముదర, వెలఁది మేనఁగల్గు నీసందు వెలఁదిద్రై, యెఱుకయెఱుకయనుచు నేగుదెంచె" వీర 2, ఆ చూ, సోదె; 5. జ్యోతిషము. "గీ. రాజునకుఁ గీడుపుట్టెడు రాజ్యమడఁగు, ననుచు నెఱుకచెప్పెడు జ్యోతిషాధములను, గుడుపుకోలకు విప్రాకృతిఁ గొన్న శూద్రుఁ, బణసహస్రదండము గొనఁ బాడిగలదు" విజ్ఞా. ప్రా, కాం. 137: చూ, జోస్యము; 6. అభిధాయకము, తెలియఁజేయుట "ఆ. ఎఱుకలేని దొరల నెవ్వాడు కొలిచిన, బ్రదుకలేదు వట్టిభ్రాంతిగాని, గొడ్డుటావుపాలు గోకిన చేపునా." వేమన. 691: చూ, సూచకము. 6; 7. వర్ణన.- "సీ. రాజేంద్ర వినుమనఃప్రాణంబు లాత్మగా, దిన్నిటినెఱిఁగెడి యెఱుకయాత్మ, పుత్రమిత్ర కళత్ర ధామాద్యములాత్మగా దిన్నిటినెఱిఁగెడి యెఱుకయాత్మ, తాపత్రయంబులు తలఁపులు నాత్మగా దిన్నిటి నెఱిఁగెడి యెఱుకయాత్మ, యష్టాంగయోగాదినిష్ఠలు నాత్మగా దిన్నిటి నెఱిఁగెడి యెఱుకయాత్మ॥ ఆ. యట్టియాత్మ నీవు యఖిలంబులును నీవు, నీవు నేనటన్న భావమీవు. గాన నేయలేము కైవల్యపదమార్గ, మేనటుంచుఁ దలఁచు నెఱుకనీవు." శ్రీరామ స్తవరాజము. 8, ఆ.

ఎఱుకచెప్పుట. పా. వర్ణన.—"సీ. సరసవతీదేవి సనుప్రులదొరరేణుకాపరంజోతి యాకాసవాణి, వేఁడివెల్గులసామి వెన్నెలరాజ ముక్కన్నుల

దేవర కాశీనాథ, పిరికొండమల్లేశ శ్రీకూర్మ నాయక, మాపాలిరంగ హనుమంతరాయ, శ్రీరామదేవతా శ్రీవేంకటేశ్వర యల్లోకమాత ముమ్మాలసత్తి॥ గీ. సీతమాదేవి మాపాలి సిరులతల్లి,వమ్మ కొల్లాపురీదేవి యాదిలచ్మి, మీఁగలందఱుఁదోడయి మించిమంచి, నాకు దయసేయుఁడిపుడు భావముననుండి॥ గీ॥ సకల భాగ్యశాలివనీవు సన్నుతాంగి, గరిమనీసాటి సకలలోకములయందు, సూడఁగాలేదు నినుఁ గొల్వఁ బాడిపంట, సొమ్ముసోబనములు గల్గు సుమ్మతల్లి" వేంకటేశ్వరవిలాసము.

ఎఱుకచేయు. ద్వ. స. క్రి. ఆవేదించు, తెలియఁజేయు. "లోనికెఱుకచేసి." భార. శాంతి. 6, ఆ: చూ, సూచించు. 2.

ఎఱుకత దే. వి. (ఎఱుక + త.) చూ, రూ-ఎఱికెత "క. కడకంటఁ గరుణవాడమఁగఁ, బడఁతులు తన్నొందఁజేని పరివేష్టింపన్, మృదుసతి యా యెఱుకతతో, నడిగిన కృత్యంబుఁ జెప్పనగు మతిగలవే." వీర. 2, ఆ.

ఎఱుకపడు. ద్వ. అ. క్రి. తెలియు. "క. కడు నలుకయుఁ గూర్మియు నే, గ్నడ నెఱఁగించు నది వాని ఫలకాలమునన్, బిసుగును గాఢ్వను జనులకుఁ, బడుటయు వీచుటయు నెఱుక పడియెడు భంగిన్" భార. ఆది 6, ఆ 114; భార. ఆది. 2, ఆ 135: చూ, విదితమగు

ఎఱుకపిడికెడుధనము. జా. పరిచయము; దాఁచుకొనిన సొమ్ము. ఉదా.—"భాగ్యసఖుఁడైన యాదవపుంగవుండు, మిమ్ముఁ జూడఁగన్న పిదపెల్ల మిన్నకొసఁగు, నెఱుకపిడికెడు ధనమన్న గుఱుతుమాట, తథ్యమోఁగాద యెందైన దానవేంద్రి" (కుచేలోపాఖ్యానము.)

ఎఱుకవాఁడు. ద్వ. వి. 1. బోయవాఁడు, కిరాతుఁడు: చూ, వ్యాధుఁడు. 1; 2. చదువులయ్య: చూ, విద్వాంసుఁడు. (రూ-ఎఱ్క.)

ఎఱుకసాని. ద్వ. వి దైవజ్ఞ, ఎఱుకత. "చ. అవపుఁడు నెందఁజేని కమలాక్షులు వేగమపాతి వీధికిన్, జని గిరిజాత యా యెఱుకసాని వినుం బిలువంగఁబంచె" వీర, 2, ఆ: చూ, సోదకత్తె; వర్ణన —"సీ. సవగనిపనివన్నె జవికె పిక్కటిలంగఁ గులుకు పాలుబ్బుగుబ్బలు చెలంగ, ముంజేతులను ముఖాంబుజమున నొక వింతపొలుపుదెల్పెడు పచ్చబొట్టు లెసఁగ, గురుమాఁపు పయ్యెంట చెఱఁగులోనిడుకొన్న ముద్దుఁబల్కుల చిన్నిబుడతఁడమరఁ, దగతరంబులనుండి తనయింట వెలయు పుత్తడపైఁడి బుట్టి మస్తమున వెలుఁగ॥ గీ. బొమలనందున నామంబు భూతిపూఁత, నెన్నొసటఁ బుక్కిటు విడెంబు గన్నుఁగొనలఁ, గాటుకరహింపవచ్చె యా క్ష్మాతిలేంద్రు, వగణములకోరగా ప్రోక్కి చక్కనిల్చి." శుక. 1, ఆ.

ఎఱుకు దే. వి. చూ, రూ-ఎఱ్క. "క. ఎఱుకనియెఱుఁగక నీకున్, మఱకువ నెదిరితిని దీనిమఱవుఁ ము" (కిరాతార్జునీయ సంవాదఘట్టము) భార. అర. 1, ఆ 326; "చ. ఎఱుకుకులంబునందు జనియించితి ధర్మువులెల్ల నిమ్మగా, నెఱిఁగెదు." (ధర్మవ్యాధకౌశిక సంవాదఘట్టము.) భార. అర. 5, ఆ 134.

ఎఱుకువ. దే. వి. జ్ఞానము, తెలివి: చూ, బుద్ధి.

ఎఱుపు. వై. వి. ఎఱ్ఱన: చూ, వర్ణము. 6

ఎఱుపుడవులు. వా. మిక్కిలి ఎఱుపు. (కొద్దియెఱుపు అని కొందఱు.)

ఎఱుపులు. వై. వి. బ. 1. అగ్ని. "సీ. అంగారములు మల్లెలింగలెఱుపులునై దారకలు నిప్పులనఁగనొప్పు." అం, పదా. సుర. 31: చూ, నిప్పు; అం. 2. రంగులు నాలుగింటిలోనొకటి: చూ, రంగులు; పా. 3. చీట్లాటలో డైమాను అరఖు ముక్కలు(వాడుకయందలి గుఱుతు);

4. కండ్లకలకయందలి దోషములచే కలిగిన రంగు లోనగునది; 5. అక్షుళ్లు, అటిక్ డాలు సన్నఅక్కుళ్లు, తూప్పుఅక్కుళ్లు, ఎఱ్ఱబుడ ములు మున్నగువాని గుఱుతు.

ఎఱ్ఱ వై. వి. 1.=అరుణ. రూ-ఎఱ. ఎఱుపు "ద్వి కొనకినులను నెఱ్ఱ ఘోరమై పర్వ" రా. సుం, కాం; భార. అశ్వ 4, ఆ 8; "ఎఱ్ఱ కన్నులకుదెచ్చి." (ఇక్కడ ఎఱ్ఱ కర్మ ము) రం. యు, కాం చూ, వర్ణము. 6; 2. రూ-ఎఱ, గంహోపదము చూ, సర్పము; 3. నెత్తురు: చూ, రక్తము. 1; గుణ. 4. ఎఱ్ఱ నైనది. "కసునెఱ్ఱలయ్యెదిశలు" భాగ. అశ. 8, ఆ; "అ. ఎఱ్ఱదాని ముఖమునే ప్రొద్దుమా చిన, బమ్మకైన బుట్టు రిమ్మతెగులు, ఇట్టి నవ్వే నేని బట్టదా భూతిమై" వేమన. 695: చూ, వర్ణము. 6. (ఎఱ్ఱ అను విశేషణము ముందుగల సంజ్ఞావాచకములు ప్రత్యేకముగా వ్రాయఁబడియె.)

ఎఱ్ఱఅగిసె. ద్వ వి. సద్రిపర్ణిక (కన్న- కెంప గసె.) *: చూ, శుకనాసము.

ఎఱ్ఱఅతివస. ద్వ. వి శ్వేతరక్తవిష * (కన్న- కెంపు అతిబీజె.): చూ, విష.

ఎఱ్ఱఉత్తరేణి. ద్వ. వి. రక్తభిది *: చూ, శైఖ రికము

ఎఱ్ఱకంబళి. ద్వ. వి. ఆస్తగణము చూ, రల్లకము.

ఎఱ్ఱకణములు. పా. (రెడ్ కార్పసెల్స్) రక్తము ను సూక్ష్మదర్శినితో తిలకించిన ఒక ద్రవప దార్థమునందు ఎఱ్ఱకణములును, తెల్లకణములు ను తేలియాడుచున్నట్లు కనఁబడును. నూది మొన నంటుకొను రక్తబిందువునందు పదిలక్షల యెఱ్ఱకణములుండునని చెప్పిన నవి యెంత సూక్ష్మములో యూహించుకొనవలసినదే. అరఁటిదూట బిళ్లల దొంతరులవలె యెముకల లోని మూలుగునందు జన్మించి రక్తములోనికి చొచ్చి ప్రాణవాయువును గ్రోలుచు వయ సు విహరించి మిక్కిలి యెఱ్ఱనగుచు ముసలి వైనపిమ్మట గొంగవర్ణముఁ జెంది కాలేయములో నాశనమందును. కాలేయము వాని కశ్మశాన వాటిక.

ఎఱ్ఱకసింద. ద్వ. వి. అంకసేలి *: చూ, మ్రాని పసుపు.

ఎఱ్ఱకాంచనము. ద్వ. వి. కాంచనము *: చూ, దేవకాంచనము

ఎఱ్ఱకానుగు ద్వ. వి అంగారమంజరి *: చూ, కానుగు

ఎఱ్ఱకార్పుస్కార్. పా. (కోగ్ )

ఎఱ్ఱకిత్తలి. ద్వ. వి. పారేవతము * (కన్న-కిత్తళి): చూ, కర్కాగాంకము.

ఎఱ్ఱగంధము ద్వ. వి. కుచందనము: చూ, సుగం ధము.

ఎఱ్ఱగడ్డ. ద్వ. వి. 1. నీరుల్లి * : చూ, పలాం డువు; 2. పొరలుపొరలుగా వచ్చెడు ఒకర కము దురుపు, నెత్తురుగడ్డ: చూ, వ్రణము 1.

ఎఱ్ఱగన్నేరు. ద్వ. వి. చండకము *:చూ, హయ మారకము.

ఎఱ్ఱగరువు. ద్వ. వి. ఎఱ్ఱమన్నుగలనేల : చూ, భూమి 1.

ఎఱ్ఱగలిజేరు. ద్వ. వి. వర్షాభువు *. (కన్న-కెంపు కొమ్మె.): చూ, వర్షకేతువు.

ఎఱ్ఱగలువ. ద్వ. వి. చెంగలువ, హల్లకము *: చూ, పద్మము. 1. (ఋతురక్తస్రావమును, రక్తకుసుమ కట్టును. మేహశాంతిచేయును.)

ఎఱ్ఱగిసె ద్వ. వి. లాలసి. రూ- ఎఱ్ఱఅగిసె *: చూ, శుకనాసము.

ఎఱ్ఱగురిజ. ద్వ. వి. కృష్ణల, గురిజ*: చూ, తులా బీజము.

ఎఱ్ఱగొల్ల. ద్వ. వి. ఒకరకము గొల్లవాఁడు: చూ, మహాశూద్రుఁడు.

ఎఱ్ఱగోరంట. ద్వ. వి. ఎఱ్ఱపూవుల పెద్దగోరంట, కొమ్మి, కురవకము *: చూ, గోరంట.

ఎఱ్ఱగోఁగు. ద్వ. వి: చూ, రక్తపీలువు *.

ఎఱ్ఱచిత్రమూలము. మి. వి. రక్తచిత్రమూలము *: చూ, వహ్నిసంజ్ఞకము.

ఎఱ్ఱచీమ. ద్వ. వి. తైలపిపీలిక: చూ, పిపీలిక.

ఎఱ్ఱచెన్నంగి. ద్వ. వి. అగ్నిశిఖ *: చూ, నారికేళము.

ఎఱ్ఱచేమంతి. ద్వ. వి. రక్తసేమంతిక *: చూ, సేమంతిక.

ఎఱ్ఱచందనము. ద్వ. వి. రక్తచందనము *: చూ, రాజార్హము.

ఎఱ్ఱజిల్లేడు. ద్వ. వి. రక్తార్కము *: చూ, జిల్లేడు.

ఎఱ్ఱజెట్టి. ద్వ. వి. ఆధాతువు: చూ, జెట్టి.

ఎఱ్ఱతామర. ద్వ. వి. రక్తాంబుజము, కెందామర*: చూ, పద్మము. 1.

ఎఱ్ఱతుమ్మెద. ద్వ. వి. గండోలి. చూ, భ్రమరము.

ఎఱ్ఱతెగడ. ద్వ. వి. కాకనాసిక, కాకిదొండ *: చూ, దొండ.

ఎఱ్ఱతేలు. ద్వ. వి. ఒకరకము తేలు: చూ, వృశ్చికము. 1.

ఎఱ్ఱతొళసి. ద్వ. వి. రక్తతులసి *: చూ, తులసి.

ఎఱ్ఱతోలు. ద్వ. వి. ఎఱ్ఱనిచర్మము. "ఎఱ్ఱతోలు దానిని పెండ్లియాడెదను." (వా) (ఎఱ్ఱతోలు=ఎఱ్ఱని శరీరచ్ఛాయ అని భావము.): చూ, ఎఱ్ఱ. 4.

ఎఱ్ఱన. వై. వి. 1.=అరుణ. ఎఱుపు: చూ, వర్ణము. 6; విశే. 2. ఎఱ్ఱనిది. "క. పుష్పానీకమ్ములరయ నెఱ్ఱన." రా. యు, కాం. 1606; "ఆ. ఎఱ్ఱ వాఁడు దాని నేపారఁ జూచిన, వేకిపుట్టిచాల వెఱ్ఱిపట్టుఁ, బల్లుఁ దెరచినగినఁ బట్టుఁ బెన్భూతంబు." వేమన. 696: చూ, వర్ణము. 6.

ఎఱ్ఱనగునాలుక. పా. పుత్రభోగభాగ్య సుఖము లనుభవించు స్త్రీ లక్షణము: చూ, ఉత్తమ స్త్రీ సామాన్యలక్షణములు.

ఎఱ్ఱనిజిగి. ద్వ. వి. అరుణాభము: చూ, రక్తి కాంతి.

ఎఱ్ఱనివేలుపు. ద్వ. వి. 1. జ్వలనుఁడు, అగ్ని: చూ, నిప్పు; 2 వినుకెంపు: చూ, సూర్యుఁడు.

ఎఱ్ఱనేలలు పా (రెడ్ సోయిల్స్.)

ఎఱ్ఱపగడ ద్వ. వి ఆఖువిషఘ్ని *: చూ, దేవతాళము.

ఎఱ్ఱపుటము. ద్వ. వి. ఒకరకము కుష్ఠరోగము: చూ, మండలము. 3.

ఎఱ్ఱపూల పెద్దగోరంట. ద్వ. వి. రక్తమహాసహా*: చూ, గోరంట.

ఎఱ్ఱపోతమ్మ. ద్వ. వి. ఒకానొక గ్రామదేవత: చూ, మహాలక్ష్మి. 3.

ఎఱ్ఱప్రత్తి. ద్వ. వి. రక్తకార్పాసము*: చూ, ప్రత్తి.

ఎఱ్ఱబుడమలు. ద్వ. వి. రక్తధాన్యము: చూ, ధాన్యము.

ఎఱ్ఱమద్ది. ద్వ. వి. ఏఱుమద్ది* (కన్న-కెంపుమత్తి.): చూ, మద్ది.

ఎఱ్ఱమన్ను. ద్వ. వి. శోణమృత్తిక, ఎఱ్ఱగరువు: చూ, భూమి. 1.

ఎఱ్ఱమల్లె. ద్వ. వి. ముచుండ*: చూ, మల్లె. 1.

ఎఱ్ఱమారెమ్మ ద్వ. వి. ఒకానొక గ్రామదేవత: చూ, మహాలక్ష్మి 3.

ఎఱ్ఱమిరప. ద్వ. వి. ఒకరకము పొడుగుమిరప * (లంకలపట్టున పెరుగును.): చూ, మిరప. (కారముతక్కువ.)

ఎఱ్ఱమిర్చి. ద్వ. వి. —పై.—

ఎఱ్ఱమీను. ద్వ. వి రోహితము: చూ, మత్స్యము. 1.

ఎఱ్ఱము. దే. వి. కంపతోడుగు, అలవ: చూ, ప్రాచీనము. 1.

ఎఱ్ఱమునుఁగ. ద్వ. వి. మధుశిగ్రువు, ఎఱ్ఱపువ్వుల మునుఁగ *: చూ, శిగ్రువు. 1.

ఎఱ్ఱయుల్లి. ద్వ. వి నీరుల్లి* చూ, పలాండువు.

ఎఱ్ఱరాజనాలు ద్వ. వి. శాలిధాన్యము. (కెన్న-కెంపురాజన.): చూ, ధాన్యము.

ఎఱ్ఱలిట్మసు. పా. (రెడ్ లిట్మస్)

ఎఱ్ఱలొద్దుగు. ద్వ వి. పట్టికాఖ్యము*: చూ, లొద్దుగు.

ఎఱ్ఱవస. ద్వ. వి. రక్తవ *: చూ, వస.

ఎఱ్ఱవాఱు. ద్వ అ. క్రి (ఎఱ్ఱ + వాఱు) 1. ఎఱ్ఱనగు. "గీ. మోముఁ గన్నులు నెఱ్ఱ, వాఱె మిగుల శోకపైకములకు." ఆము. 5, ఆ. 127: చూ, పల్లటిల్లు; 2. కోపించు, కసలు "గీ. కుటిలమగు నీకటాక్షంబు కువలయాక్షి యించుకించుక నామీఁద నెఱ్ఱవాఱె, నిగిడి పరలినభావంబు నిజముదెలిసె శ్రవణకూప నిపాతైకశంకఁ జూపె." నై. 8, ఆ. 45: చూ, రోషించు.

ఎఱ్ఱవాలుఁడు ద్వ. వి. జ్యోతిష్మతి *:

ఎఱ్ఱాకులతోఁటకూర. ద్వ. వి. రాగిణి, తైలపాయిక *: చూ, మారిషము.

ఎఱ్ఱాప్రెగ్గడ. పా 1. ఇతఁడు ప్రబంధ పరమేశ్వరుఁడను బిరుదువహించిన దొడ్డకవి. ఈతఁడు భారతారణ్య పర్వశేషమును దెనిఁగించి, భారతశేషమగు హరివంశమును దెనిఁగించి పిమ్మట లక్ష్మీనృసింహావతారమను నొక కావ్యము వ్రాసెను దీనికి అహోబలమాహాత్మ్యమని నామాంతరము. ప్రబంధ పరమేశ్వరుఁడను బిరుదనామముతో నీతఁడారణ్యపర్వశేషమును వ్రాసినట్లక్కడక్కడఁ జెప్పఁబడియున్నది. అదియిప్పుడట్లు కనఁబడునదికాదు. భారతమున నన్నయభట్టారకుని కవిత్వమున నాంధ్రపదంబులు గొన్ని సంస్కృత పదంబులు మెండు. తిక్కనసోమయాజి కవిత్వమున సంస్కృతపదంబులు గొన్ని యాంధ్రపదంబులు మెండు. ఎఱ్ఱాప్రెగ్గడకవిత్వమున సంస్కృతాంధ్రపదములు రెండును మణిసరంబు గ్రుచ్చినట్లు సమముగా నుండును. ఈమూఁటికినిఁ బాకభేదంబును గలదు వీరికవిత్వములు సర్వవిధంబులచేతను శ్లాఘనీయములనుట విశేషముకాదు "క. భాగవతముఁ దెలుఁగుఁ జేసిన, ధీరాత్ముఁ బోతన్నయార్యుఁ దిక్కనమఖిసం,భారు హాభవనిభు నెఱ్ఱ సుధీరత్నము నాత్మలో నుతింతు న్భక్తిన్." రామేశ్వరమాహాత్మ్యము. 1, ఆ 12: చూ, త్రయము. (ఎఱ్ఱ, ఎఱ్ఱన, ఎఱ్ఱన్న అనియు వాడెదరు.); 2. కవులు ముగ్గురిలో నొకఁడు: చూ, కవులు. (శ్రీరాజరాజనరేంద్ర వర్ధంతిమహోత్సవ సందర్భమున అధ్యక్షులగు శ్రీయుత కట్టమంచి రామలింగారెడ్డిగారివలన రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక 196 పుట మొదలు 216 పుటలవఱకు గల భాగమునందు నన్నయభట్టారకుఁడు, తిక్కన సోమయాజి, ఎఱ్ఱాప్రెగ్గడ వీరి మువ్వురియొక్క పాండిత్యాదులు చక్కఁగ విమర్శింపఁబడినవి.)

ఎఱ్ఱాముదము. ద్వ. వి. హస్తిపర్ణి *: చూ, వ్యాడంబకము.

ఎల. దే విశే. 1. యౌవనముగలది "క. ఎల ప్రాయమిచ్చితిని నీ, కలఘురతియిచ్చెదను మదాత్మజనుల్లం, బలరఁగఁ బెండిలికమ్మని, పలికి మఱియు నాతపస్విపతి యిట్లనియెన్." దీనితరువాత —"క. సజ్జనమతినీ, వనమానము దక్కుము యా, వనమును గైకొనుము కన్య వరియింపుతగన్" భార. అశ్వ. 3, ఆ. 76: చూ, పడుచుది; 2. కొద్ది. "ఎలనగవు.": చూ, స్వల్పము; 3. ఏదేని యొక కార్యమును కనిగాని వినిగాని తెలిసినవాఁడు, సాక్షి. "గీ. ఎమ్మెకాఁడయ్యె దొలఁగాఁగఁ బెండిలి,

దైన చెలినిడించి యాకట రొయింటి, వేగఁ దగునె." అచ్చ. అ, కాఁ. 70: చూ, సాక్షి; క్రి. విశే. 4. స్వల్పముగా. "ఎలనగుచున్." "ఎల నాచున్.": చూ, స్వల్పము.

ఎలక. దే. వి. రూ-ఎలుక: చూ. మూషికము (ప్రయోగముంగానము. వాడుక.)

ఎలకజీడికూర. ద్వ. వి. ఒకరకము శాకము * (బలమునిచ్చును )

ఎలకూచిబాలసరస్వతి. పు, 1 16 శతాబ్ది, భర్తృహరి సుభాషితము కర్త; 2. ఆంధ్రశబ్ద చింతామణికర్త. (అప్పకవికి పూర్వము సుమారు ఏఁబదివత్సరములవాఁడు.) రాజ.ప్ర. సం. 158 పారట.

ఎలగోలచేఁపు. ద్వ. వి: చూ, మొదటిచేఁపు.

ఎలగోలు. దే. వి 1. మొదట పటపటమని వచ్చు వాన. "సీ. పుష్కలావర్తగాంభోధర వారితంబులెలగోలు వర్షించు నెన్నఁడేని." కాశీ 2, ఆ. 51: చూ, వాన. 1; 2. గుంపున పుట్టిన పెద్దమ్రోఁత, కలకలము: "చ.అం, చేలరొయెలగోలు." వసు. 2, ఆ. 114: చూ, స్వరము. 2; 3. ముందునడచుట. "చ. కులగిరి రాజనందనుఁడు గూరిమి నా భువనాభినందితన్, దలఁపఁ దలంపులోపల నెదర్పకకే తన వల్గనంబులం, చేలరొయెలగోలు నంబుజవిశాల శిలీముఖ తాండవంబులు, త్వల దళమండలాగ్రములు వైకొనునెట్టివొ తత్ప్రభావముల్." వసు. 2, ఆ. 114; 4 మొదటిగాలి వీచుట. "గీ. దవులజల్లని తూఱినంతకమునుపటి, జల్లనీరూనివచ్చు నజ్జల్లు మొదలి, గాలి రొయెలగోలుచేఁ గొమ్మకదలిజల్లు, తలపడకమున్నె వంగుళ్లఁ దడిపెఁదరులు." ఆము. 4, ఆ. 130. (ఇక్కడ మొదలుశబ్దమునకు పూర్వమర్థము.); విశే. 5. మొదటిది. వ. ఒండొరువుల మఱుపెట్టిచూచు నెలగోలుచూపుల నితరేతర ధైర్యంబులు గంటివడ." పా. 2, ఆ. 58: చూ, మొదలు 4; 6. ముందునడచునది." "అమ్మరు నెలగోలుపాఁటలు." పా. 3, ఆ. 51.

ఎలగోలుజల్లు. ద్వ. వి. మొదట పటపటమని వచ్చువాన: చూ, వాన 1

ఎలదోఁట. దే. వి ఆరామము. "వ. అంత నమ్మహామునీంద్రుని యాజ్ఞానుసారంబునఁ దద్విమానంబు కలభాషిణి విహరించుచున్న యెలదోఁటలోనికిడిగియె " కళా. 1, ఆ. 62: చూ, వనము. 2.

ఎలనవ్వు. ద్వ. వి. స్మితము, చిఱునవ్వు : చూ, హాస్యము. 1.

ఎలనాఁగ. దే వి. 1. ఆఁడుది : చూ, స్త్రీ; 2. యౌవనముఁగల యాఁడుది. "ఉ. ఆయెలనాఁగ భర్త గడునాఁకటఁ దూలుచువచ్చె వచ్చినం,దోయ జనేత్రి సంభ్రమముతోఁదగు పీఠమువెట్టి పాద్యముం,బాయక మజ్జనక్రియయుభక్తి నొనర్చి ప్రియోక్తులొప్పఁగా, నాయనఁ బ్రీతుఁజేసె రుచిరాన్నరసంబుల నింతి చెచ్చెరన్." భార. అర. 5, ఆ. 10: చూ, స్త్రీ.

ఎలనీరు. ద్వ. వి: చూ, రూ- ఎడనీరు. (లేఁత టెంకాయలోని తియ్యనీరు.— "ద్వి. ఎలనీటితోఁ బ్రవహించెనందొకటి." రా. అ, కాం.)

ఎలమఁచిలి. గ్రా. (కళింగము: ఎలమంచిలి -మహారాజశ్రీ గొబ్బూరు వెంకటానంద రాఘవరావుగారు. బి. ఏ., బి. యల్.) ఎలమంచిలిని గుఱించి వీరుచేసిన విమర్శనము అమూల్యమైనది. ఇందు కళింగమను పేరువచ్చుటకు కారణము; బోధాయనుఁడు : కళింగము; పరశురాముఁడు: కళింగము; మహాభారతము: కళింగప్రశంస; మెగాస్థనీసు : కళింగ

ము; పేరియష్; అశోకవర్ధనుఁడు - బౌద్ధమతము- కళింగము; కళింగనౌకాచరిత్ర; రక్తబాహు; చాళుక్యులు - కళింగము; కుబ్జవిష్ణువర్ధనుఁడు; దిమిల; సర్వసిద్ధి; దండిమహాకవి; ఆంధ్రనగరి, రెండవవిష్ణువర్ధనుఁడు; మంగియువరాజు, కొక్కిలి విక్రమాదిత్యభట్టారకుఁడు; కోకిలవర్మ; మొదటిచాళుక్య భీమవిష్ణువర్ధనుఁడు; భవభూతి మహాకవికాలము; వెలనాటిచోడులు, ఎలమంచిలి. కొప్పర్మనమంత్రి; పంచధారలు; కృష్ణదేవరాయలు రాయవరము; పూసపాటివారు: ఎలమంచిలి మొదలగు వివరములు గలవు కళింగ. 283 లు 293 పుటలు.

ఎలమంచికళింగము. శా. (శ్రీయుత రాళ్ళబండి సుబ్బారావుగారు. ఎం. ఎ, ఎల్. టి.) కళింగదేశచరిత్ర. 464 - 514 - 518 - 589 - 643 పుటలయందు విశేషాంశములు కలవు.

ఎలమంచి. కళింగచాళుక్య వంశీయులు. శా. (శ్రీయుత రాళ్ళబండి సుబ్బారావుగారు. ఎం. ఎ. ఎల్. టి.) కళింగదేశచరిత్రలోని ఉత్కళదేశచరిత్ర 642- 643- 645 పుటలయందు చక్కని చరిత్రాంశము కలదు. 600 పుటయందు (1) సర్వలోకాశ్రయ శ్రీవిష్ణువర్ధన మహారాజులైన ఎలమంచి చోడగంగ (తూర్పుచాళుక్యశాఖ) రాజులనుగురించి కలదు.

ఎలమావి. ద్వ. . సహకారము, తేనెమామిడి *: చూ, మామిడి.

ఎలమి. దే. వి. 1. ఆనందము: చూ, సంతోషము; 2. ప్రేమము, ఎలసము: చూ, స్నేహము. 1; 3. ఉద్బోధము, లలి. "సీ. ముదమున నెలమి సొంపాదవి నెమ్మోము పైఁదోఁపంగవచ్చినఁ బ్రోచితోఁచి." భార. విరా. 3, ఆ. 58; "మ. పేరెలమిఁ బొల్పొంచెం దె నంభోజముల్." భార. ఉద్యో. 2, ఆ. 110: చూ, విశ్వాసము.

ఎలిమికాఁడు. దే. విణ. ఉద్బోధకుఁడు: చూ, విశ్వాసవంతుఁడు.

ఎలయు. దే. స. క్రి. 1. పొందు. "క. కడుమే, లెలసి పరమసుఖముపొందు మిచ్ఛావృత్తిన్." భార. శాంతి. 4, ఆ. 451: చూ, ప్రాప్తించు; అ. క్రి. 2. చేరు. "సీ. ఏనుఁగుకుదమున నెలయుతేఁటుల మొత్తముల నీలిగొడుగులు చెలువమిగుల." భార. భీష్మ. 1, ఆ. 101: చూ, సమీపించు; 3. చొచ్చు. "సీ. వినుతొల్లి ధర్మవర్తనముల సహ్యాంబులైన దానవులు మహాగ్రహమున, నరులయందెలసిన." భార. శాంతి. 5, ఆ. 496: చూ, సోఁకు. 4; 4. జనించు. "చ. అద్భుతం బెలయఁగఁ బుష్పవృష్టి గురియించిరి." భార. అర. 7, ఆ. 374: చూ, పుట్టు. 2; 5. అక్కఱపడు. "సీ. ఇంద్రియార్థంబుల నెలసిన పురుషుండు గాఢరాగంబునఁ గరఁగుచుండు." భార. అర. 5, ఆ. 81: చూ, వాంఛించు.

ఎలరారు. దే. అ. క్రి. (ఎలరు + ఆరు.) 1. అతిశయించు, అంపిల్లు: చూ, ముమ్మరించు; 2. ఒప్పు. "ఎల్లఋతువులందు నెలరారి." భాగ. 8, స్కం: చూ, సమ్మతించు.

ఎలరు. దే. వి. 1. అతిశయము: చూ, హెచ్చు. 2; 2. ఉద్బోధము: చూ, విశ్వాసము.

ఎలరుచు. దే. అ. క్రి. 1. రూ- ఎలర్చు. అతిశయించు. "గీ. బలునకొప్పటికంటెను బలమెలర్చి." హరి. ఉ. 8, ఆ. 115: చూ, ముమ్మరించు; 2. రూ- ఎలర్చు. విరియు. "వేగుఁజామిప్ప లెలర్చుగాడ్పులకు." అను. 5, ఆ. 104: చూ, వికసించు; 3. రూ- ఎలర్చు. ఆనందించు. "క. గురుఁడును గృష్ణుఁడును లోనగు,గురు లను మోదింప బాహ్లికుండు మొందలుగాఁ, గురుజాతి యెలర్చఁగ నన్న రపతి

భీష్మాభిషేచనం బొనరించెన్." భార. ఉద్యో. 4, ఆ. 158: చూ, సంతోషించు.

ఎలరుపు. దే. వి. రూ- ఎలర్పు. ఆనందము: చూ, సంతోషము.

ఎలర్చు. దే. అ. క్రి: చూ, రూ- ఎలరుచు.

ఎలర్పు. దే. వి. చూ, రూ ఎలరుపు. "ఉ. వచ్చి ససంభ్రమంబు గరుకంపు టెలర్పునునుల్లసిల్ల." భార. శాంతి. 6, ఆ. 574.

ఎలసము. దే. వి. 1. ఉత్సాహము, పూనిక: చూ, యత్నము; 2. ప్రేమము, చెలిమి : చూ, స్నేహము. 1.

ఎలిక. దే. వి. చూ, రూ- ఎలుక. "ఎలికెవల."

ఎలికబోను. ద్వ. వి. ఎలుకలఁబట్టుబోను: ఎలికెవల, ఎలుకబోను.

ఎలికెవల. ద్వ. వి.—పై.—

ఎలిమెంటరీవిద్య. పా. ప్రాథమిక విద్య. ప్రారంభ విద్య, (ఎలిమెంటరీ యెడ్యుకేషన్.)

ఎలివేటరు. ఆం. పైకెత్తు యంత్రము.

ఎలిసె. దే. వి. వాచూరు: చూ, రూ- వెలిసె.

ఎలుఁగించు. దే. అ. క్రి. కూయు. "సీ. ఇనుఁడున్న దెసనుండి యెలుఁగింపఁదొడఁగెఁ బక్షులమృగంబులు నతిఘోరగతుల, మగిడెమునిప్పుడు మనకు నాపలిదెస నతిభీషణాకృతి నఱచె నఱుడు." భార. ఆర 6, ఆ. 194. (లక్షణ ప్రకారము ఎలిఁగించుఅని యుండవలయును.). చూ, శబ్దించు.

ఎలుఁగు. దే. వి. 1. రూ-ఎల్గు. అఱపు: చూ, స్వరము; 2. రూ- ఎల్గు, భల్లూకము: చూ, వెలుఁగుబంటి.

ఎలుఁగుగొడ్డు. ద్వ. వి. భల్లూకము. చూ, వెలుఁగు బంటి.

ఎలుఁగుబంటి. ద్వ. వి.—పై.—

ఎలుక. దే. వి. 1. రూ- ఎలక - ఎలిక: చూ, మూషికము; 2. ఈతిబాధ లాటిఁటిలో నొక టి: చూ, పందికొక్కులు. (చూ, ఈతిబాధలు.

ఎలుకకుఁజెల్లిసాక్షి. లో. ఎలుకను బట్టునది పిల్లి గావున నిరుపయోగమనిభావము.

ఎలుకచెవి. ద్వ. వి. మూషకపర్ణి (కన్న–ఇలికెలి.) *: చూ, భల్లాతకి.

ఎలుకచెవిపల్లిక. ద్వ. వి.—పై—

ఎలుకజీడి. ద్వ. వి.—పై.—

ఎలుకజీడిపల్లిక. ద్వ. వి.—పై.—

ఎలుకజీడియాకు. ద్వ. వి. ఎలుకచెవియాకు. (పాండువు, రసదోషము, ఎలుకవిషము హరించును.)

ఎలుకబోను. ద్వ. వి: చూ, ఎలికబోను

ఎలుకమొక్క. ద్వ. వి: చూ, ఎలుకచెవి *.

ఎలువు. దే. వి: చూ, రూ- ఎలుఁగు. (రూ-ఎల్గు.)

ఎల్గు. దే. వి.—రూ—పై.—

ఎలెక్ట్రిక్. ఆం. విద్యుత్సంబంధ (ఇందుకు సంబంధించినవి.— శాస్త్రపరిభాషా పదములు:— (విద్యుద్ఘటమాల, విద్యుదర్థ్రిజ్జు; విద్యుత్ గడియారము; విద్యుత్ప్రవాహము; విద్యుత్ ద్రవము; విద్యుత్ ప్రతిమ; విద్యుద్దీపము; విద్యుత్ యంత్రము; విద్యుచ్చాలక; విద్యుల్లేఖిని; విద్యుత్ రైలు; విద్యుత్తిక్కగము; విద్యుత్ తారం ప్రేమణయంత్రము; విద్యుచ్ఛలన శక్తిమాత్రి; విద్యుద్వేత్త.: చూ, విద్యుత్తు.

ఎలెక్ట్రిసిటీ. ఆం. విద్యుచ్ఛక్తి; విద్యుత్తు. (ఇందుకుసంబంధించినవి — శాస్త్రపరిభాషా పదములు.— వాతావరణ జన్యవిద్యుత్తు- ఆకాశస్థ విద్యుత్తు; చలవిద్యుత్ - గతివిశిష్ట విద్యుత్; ఘర్షణ జన్యవిద్యుత్తు- ఘర్షణవిద్యుత్తు; చుంబకీయవిద్యుత్తు- చుంబకజన్యవిద్యుత్తు; ఋణవిద్యుత్తు; ధనవిద్యుత్తు; లాక్షవిద్యుత్తు; స్థిరవిద్యుత్తు; వాస్తేయికవిద్యుత్తు; శాబవిద్యుత్తు.)' చూ, విద్యుత్తు.

ఎలెక్ట్రో-బై- ఆ. జీ. ఆం. విద్యుజ్జీవశాస్త్రము. (ఇంగ్లీషునకు సంబంధించి శాస్త్రపరిభాషాపదములు.- విద్యుత్స్ఫురణము- విద్యుద్ఘటము; విద్యుద్గతిశాస్త్రము; విద్యుచ్చుంబకము; విద్యుత్ప్రకాశకత- విద్యుత్ప్రకాశకత; విద్యుత్సూక్ష్మకాలదర్శకము; విద్యున్మార్గము; విద్యుత్ప్రవాహమాపక యంత్రము; విద్యుత్ఫలాము- విద్యుద్ధాత్వాగోహణము; విద్యుద్గతిస్థితిశాస్త్రము; విద్యుద్విచ్ఛేదము; విద్యుత్ వికారము; విద్యుచ్చుంబకీయ, విద్యుత్ప్రాత్యాకర్షణవిద్య; విద్యుత్స్థాపకము; విద్యుచ్ఛక్తి; విద్యుచ్చాలనము; విద్యుచ్చాలకి; విద్యుచ్చాలకశక్తి; విద్యుత్పరిమాణువు - (ఋణ) విద్యుత్కణము- అణీయము; ఋణాత్మకవిద్యుత్తు; విద్యుత్స్వరయంత్రము; విద్యుత్స్ఫురకి; విద్యుదింద్రియవిజ్ఞానశాస్త్రము; విద్యుత్ధనధ్రువము; ధనాత్మక విద్యుత్తు; విద్యుద్దర్శకము- విద్యుద్ధ్వని, విద్యుత్ స్థితిశాస్త్రము; విద్యుత్ వైద్యము — చికిత్స; విద్యుత్ తోరంగు వేయుపద్ధతి; విద్యుత్ ముద్రణము.): చూ, విద్యుత్తు.

ఎల్ల. దే. వి. 1. పొలిమేర. చూ, సీమ. 1; ద్రి. 2. ఎల్లవెంట, సమస్తము. (ఇది ఈయర్థమునందు ద్రుతాంతమైన అవ్యయముగానుండియు ఎప్పుడును శబ్దమువలె ఎల్లయందుక్ అని విభక్త్యంతముగాను ఎల్లబోటిబాలుడు ఇత్యాదివిధమున సమస్తపదముగాను బ్రయోగింపబడుచున్నది. మఱియు ఎల్లవిధంగన్, ఎల్లశిష్యులను ఇత్యాది ప్రయోగంబులును గానంబడియెడి.) "తే. ఎల్లకుక్కల యంగిలి." వేమ. 699; "ఆ. ఎల్లలోకమందు నేకస్తువున్నదో." వేమ. 700 చూ, సర్వము

ఎల్లప్రుడు. దే. వి. రూ- ఎల్లప్పుడు: చూ, సతతము. 2.

ఎల్లప్రుడు దిరిమ్మరుతేసదార. ద్వి. వి మనుడు: చూ, సన్మఘుడు.

ఎల్లప్పుడు దే. వి. చూ, రూ- ఎల్లప్రుడు.

ఎల్లమ్మ. ద్వి. వి. (ఎల్ల + అమ్మ.) ఎల్లయందుండు ఒకానొక గ్రామదేవత పొలిమేరమ్మ: చూ, మహాలక్ష్మి. 8.

ఎల్లరు. దే. స. బ. (ఎల్ల + వారు.) (దీనికి ఏ-వ. ఎల్లవాడు.)· చూ, అందఱు. 1- 2. (రూ-ఎల్లవారు.)

ఎల్లవాడు. దే. స. ఎవ్వడును. "సీ. వెరవిట్టి తెఱంగని వెంగలితనమని యెల్లవాడును దన యుత్తిగిట్టి. తెఱంగున నిజకార్యదృష్టింగనుంగొనును" సా. 1, ఆ. 45: చూ, వేడు (చూ, ఎఱుడు.)

ఎల్లవారు. దే. స. బ. 1. సమస్తపురుషులు, సమస్తస్త్రీలు: చూ, అందఱు- రూ- అందోఱు, ఎల్లరు; 2. అంత సంఖ్యగలవారు: అందఱు- రూ- అందోఱు, ఎల్లరు.

ఎల్లవెంట. దే. ద్రి. ఎల్లవెంటకు: చూ, సర్వము.

ఎల్లవెంటకు. దే. ద్ర — పై — "సీ. ఎల్లవెంట, కనినంతటి కనిసనే కార్యములుగ, బోలిచి యుండును." ఆం, భా. 8, కాం. 74.

ఎల్లాడి. దే. వి. (ఎల్ల + ఆడి.) 1. దొంగ: చూ ముచ్చు. 1; 2. అడవియందు జోటుచేసికొని ఎల్లయందుండి కొట్టి దోచెడుదొంగ: చూ, ముచ్చు. 1.

ఎల్లాడికత్తియ ద్వి. వి. దొంగతనముగల స్త్రీ: చూ, స్త్రీ (రూ- ఎల్లాడికత్తె.) (చూ, ముచ్చు. 1.)

ఎల్లాదులు. షా ద్రుతప్రకృతికములలోనివి రెుకటి. ఎల్ల- ఇంక- ఇంగ- ఎట్టకేలకు - చాల- కూడ- మీద- ఎడ- ఎడల- పయి- పై- వఱకు- కనుక- తిప్ప - తక్క - కావున - కాన- మిగుల - కడు - దనుక - దాక - పోలె-

తావళ ముద్భవించె ధరణీనాథా! క. తడతె నిసడఁబు వడిగల, యొడలును బెనువిడుదకర మునురుకుంభములంగా, బెడఁగై యువతులమ రిపఁబు, నడకలకున్ మూలగురు వనగజము ప్పగా." భాగ. 8, స్కం. 8; "సీ. లలితకుంభస్థలంబుల బాగుజవరాండ్రు పాలిండ్లజిగి కోజేపంక్తిగాఁగఁ, బ్రకటకుండాదండ పటిమంబులలనాజ నూరుకాండంబుల కొలఁకుఁ గాఁగ, మేనిపాండురరుచుల్ మానినీదరహాస తతులకు తూలకందములుగాఁగ, గంభీరయానంబు కొంతాళినడుపుల కొయ్యారములు నేర్పు నొజ్జగాఁగ. గీ. నాల్గుకొమ్ములదనరు నందంపురూపు, కలితశృంగ చతుష్కంబుఁ గలుగునట్టి, మేటికైలాసనగముతో సాటిగాఁగ, వెలయునైరావత గజంబుజలధి వొడమె." లక్ష్మీనారాయణపరిణయము. 4, ఆ; "సీ. ఇంద్రనీలప్రభ లీనభూమణిరుచుల్ చూడ్కికిమిఱుమిట్లు సేనుపునదియు, పద్మరాగంబుల భాసిల్లుపదకంబు తప్పకనుదుటిపై నొప్పునదియు, హాటకమణిమయంబగు నూపురధ్వనుల్ చెవులకానందంబు సేయునదియు హిమగిరిశిఖరదిందు హీనకాంద్యుతుల్ నిరసించు కాంతుల నెగడునదియు, గీ. నాల్గుకొమ్ముల విలసిల్లు నాగమపుడు, దేవవిభునాజ్ఞ దివిజులు తెచ్చివిలుప, నిందు్రఁడభిమన్యు నెక్కించి హితులు సుతులు, వెంటనడువంగ ముదముతో వెడలిరపుడు." శశిరేఖాపరిణయము. 5, ఆ.

ఐరావతాంశ. పా. తొమ్మిదివర్గంబులు స్వవర్గంబులు వచ్చెనేని నైరావతాంశయగును.

ఐరావతి. సం. వి. ఈ. స్త్రీ. 1. మెఱుపు: చూ, విద్యుత్తు. 1. (చూ, ఎలెక్ట్రిసిటీ.); 2. కోల మెఱుపు: చూ, —పై—; 8. యముని భార్య: చూ, యమపత్ని. (చూ, స్త్రీ.)

ఐరిణము. సం. వి. అ. న. పాంశవలవణము: చూ, లవణము. 1.

ఐరువు. దే. వి. రూ- అయిరువు. అగ్ని: చూ, నిప్పు.

ఐరేని. దే. వి. రూ- అయిరేని, పంచరంగులతో చిత్తరులు వేసిన పెండ్లికడవలు. "సీ. ఐరేని గొనివచ్చి రైదువల్ పాటలు పాడుచు శుభ వేళ వేడుకలర." విజ. 8, ఆ. 95: చూ, భాండము. 8.

ఐరేనికడవలు. ద్వ. వి. —పై—

ఐరేయము. సం. వి. అ. న. కల్లు: చూ, సుర. 1.

ఐరోపా. అం. ఖండములయిదింటిలో నొకటి: చూ, ఖండములు. (భూగోళార్ధగోళములో పడమటిదెస నున్నది. అయిదుఖండములలో నిదిచిన్నది. ఇది యింగ్లీషువారి జన్మస్థానము.)

## ఐరోపాఖండమునకు సంబంధించిన దేశములు లోనగు విశేషములు.—

| దేశము. | విస్తీర్ణము.<br>చ. మై. | జనసంఖ్య. | ముఖ్యపట్టణము. |
|---|---|---|---|
| ఆస్ట్రియా. | 32175 | 6678527 | వియన్నా |
| బెల్జియం. | 11752 | 8129824 | బ్రిసెల్సు |
| బల్గేరియా. | 39824 | 5944000 | సోఫియా |
| జెకోస్లావకియ. | 54877 | 14726158 | ప్రేగ్ |
| డెన్మార్కు. | 15042 | 3500000 | కోపెనహాగన్ |
| ఫ్రాన్సు. | 207076 | 40745874 | ప్యారిసు |
| జర్మనీ. | 182200 | 62592575 | బెర్లిను |
| గ్రీసు. | 50271 | 6204684 | ఏతెన్సు |
| హంగేరి. | 36000 | 8500000 | బుడాపెస్టు |
| హాలెండు. | 12761 | 7938114 | హేగ్ |
| ఇటలీ. | 120000 | 41000000 | రోము |
| నార్వే. | 124964 | 2809564 | ఓస్లో |
| పోలెండు. | 150000 | 30987448 | వార్సా |
| పోర్చుగల్లు. | 35490 | 6032991 | లిస్బన్ |
| రుమేనియా. | 122282 | 17400000 | బుకారెస్టు |
| రష్యా. | 8241673 | 147000000 | మాస్కో |
| స్పెయిను. | 196700 | 21763000 | మాడ్రిడు |
| స్వీడను. | 173157 | 6141571 | స్టాక్‌హోమ్ |
| స్విట్జర్లాండు. | 15976 | 4066400 | బెర్న్ |
| యుగోస్లావియ. | 94230 | 13930918 | బెల్గ్రేడ్ |

బ్రిటీషుద్వీపులు.—

| దేశము. | విస్తీర్ణము.<br>చ. మై. | జనసంఖ్య. | ముఖ్యపట్టణము. |
|---|---|---|---|
| ఇంగ్లాండు. | 50327 | 37354917 | లండన్ |
| స్కాట్లాండు. | 30405 | 4842554 | ఎడింబరో |
| వేల్సు. | 8016 | 2593014 | |
| ఉత్తర ఐర్లాండు | 5237 | 1250000 | బెల్ఫాస్టు |

ఐలబిలుఁడు. సం. వి. అ పుం. 1. కుబేరుఁడు: చూ, శ్రీదుఁడు; 2. దిలీపమహారాజు: చూ, రాజు. 1.

ఐలారము దే. వి: చూ, రూ- అయిలారము *.

ఐలుఁడు. సం. వి. అ. పుం. 1. పురూరవ చక్రవర్తి: చూ, రాజు. 1; శా. 2. (శ్రీయుత నీలకంఠపండితులు. ఎం ఎ ఎమ్. ఎల్.ఎ.) అశోక చక్రవర్తి కళింగ రాజ్యము సంపూర్ణముగ నాక్రమించుకొని నప్పుడప్పటి కళింగరాజులు కోసలదేశమునకు కుటుంబసహితముగా) జేరి యాదేశమును సామంతరాజులుగ పరిపాలించిరి. మూఁడు వేర్వేరు వంశముల రాజులు ఐలులనియు, ఐరులనియు పేరుగలవారు కళింగమును పాలించినట్లు తెలియుచున్నది కళింగ. 261. పొరటు. రూ ఐలుఁడు:

ఐలేయక. అం. ఘృతములలో నొకటి: చూ, ఘృతములు.

ఐలేయము. సం. వి. అ. న. హరివాలుకము, నూఁగుదోస *: చూ, దోస.

ఐలేయుఁడు. సం. వి. అ. పుం. పురూరవ చక్రవర్తి: చూ, ఐలుఁడు.

ఐవచ్చు. దే. అ. క్రి: చూ, రూ- అయివచ్చు.

ఐశుఁడు. సం. వి. అ. పుం. ఈశ్వరుని కొమారుఁడు: చూ, వినాయకుఁడు. 1.

ఐశాని. సం. వి. ఈ. స్త్రీ. 1. ఈశానదిక్కు, ఈశాన్యము, ఐశి: చూ, దిక్కులు; 2. ఈశానుని పట్టణము: చూ, దేశము.

ఐశి. సం. వి. ఈ. స్త్రీ.—వై.—

ఐశ్వర్యము. సం. వి. అ. న. 1. అణిమాద్యష్టసిద్ధులలో నొకటి: చూ, సిద్ధులు (విభూతులు.); 2. భాగ్యము: చూ, సంపత్తి. 1; 3: చూ, అదృష్టము. 1; 4. గుణము లారింటిలో నొకటి: చూ, గుణములు.

ఐశ్వర్యములు. అం. 1. మాహాత్మ్యము, ధైర్యము, కీర్తి, సంపద, జ్ఞానము, వైరాగ్యము. (6); 2. దాసీజనము, భృత్యులు, పుత్రులు, మిత్రులు. బంధువులు, వాహనములు, ధనము, ధాన్యము. (8).

ఐశ్వర్యలక్ష్మి. అం తంత్రము లఱువదినాలుగింటిలో నొకటి: చూ, తంత్రములు.

ఐషమస్. సం. అవ్య నడుచు వత్సరము.

ఐషమస్త్యము. సం. వి. అ. పుం. ఈయేటిది.

ఐష్టికుఁడు. సం. వి. అ. పుం. దుడ్డుకఱ్ఱ పట్టేవాఁడు: చూ, యష్టిధరుఁడు.

ఐషీకము. అం. అస్త్రము లేఁబదిమూఁడింటిలో నొకటి: చూ, అస్త్రములు.

ఐహికము. సం. విశే. (అ. ఆ. అ.) 1. ఇహలోక సంబంధమైనది; 2. లోకములు రెండింటిలో నొకటి: చూ, లోకములు. (చూ, ఇహలోకము.)

ఐహోలుశాసనము. శా. (డాక్టరు ఎస్. కృష్ణస్వామి అయ్యంగారు, ఎం. ఎ. పి. హెచ్. డి.) 1. ఈశాసనము కోసలమును, కళింగమును పులకేసినునకు లోఁబడియున్నట్లు చెప్పును. కళింగ. 255. పుట; 2. అయ్యవళె శైక ఐహోలు శాసనము క్రీ. శ. 684 ను బట్టి (Vide Ind Ant Vol 8 P 245.) కదంబ, అళుప, మౌర్య, లాటు, మాళవ, ఘూర్జర, కళింగ, కోసల, పల్లవ, చోళ, పాండ్యదేశములను జయించినట్లును పరమేశ్వర బిరుదము నొందినట్లును తెలియుచున్నది. ఈశాసనమును బట్టియే పిష్టపుర దుర్గము జయింపఁబడినట్లును, విష్ణుకుండినులును, పల్లవులు వోడింపఁబడినట్లును తెలియుచున్నది. కళింగ. 518. పొరటు.

ఐళుఁడు, సం. వి. అ. పుం: చూ, రూ-ఐలుఁడు.

## ఒ.

ఒ. ఒకారయక్షరము. ఆంధ్రభాషకు వర్ణంబు లేఁబదియాఱు. అందు అచ్చులు పందొమ్మిది. ఆ అచ్చులలోనిది పదునాలుగవది; తెనుఁగునకు వర్ణములు ముప్పదియేడు. అందు అచ్చులు పదునాలుగు. అందునిది పదియవది; దే.అవ్య. 1. సంశయమును దెలిపెడి, అక్ష. "క. విహరింప మానవాకృతి, సహితంబుగ మహీశ్వరిఁ జనుదెంచిన పద్మహితుఁడో హిమకరుఁడో శచీ, గృహమేధియో శాకయితఁడు కేవల నరుఁడే." భార. విరా. 1, అ. 215: చూ, సంశయము; అవ్య. 2. ప్రార్థనార్థకము మీఁద వచ్చు వానిలో నొకటి. ప్రార్థనార్థకము మీఁదవచ్చునవి — ఇ - ఈ - ఏ - ఏ - ఒ - ఓ అనునవి; వా. 3. వక్రములలో నొకటి. వక్రములు.— "ఎ - ఏ, ఒ-ఓ." లు.

ఒంకియ. వై. వి.= వంక్యమ్. పొగమొదలైనవి తగిలించెడు చిలుకకొయ్య: చూ, వంక్యము. (రూ- ఒంకె.)

ఒంకె. వై. వి.= వంక్యమ్.—వై.—

ఒంచువాఁడు. దే. వి. ఘాతకుఁడు, చంపువాఁడు: చూ, మారకుఁడు.

ఒంచిలి. దే. వి. 1. రూ- ఒండిలి. కీడు: చూ, హాని. 2; 2. రూ- ఒందిలి. ఏడుపు: చూ, దుఃఖము; విశే. 3. రూ- ఒందిలి. దుఃఖము కలవాఁడు: చూ, విమనుఁడు; 4. రూ- ఒందిలి. దుఃఖముకలది: చూ, దుఃఖితము.

ఒంటడుగు. దే. వి. మల్లయుద్ధగతిభేదము: చూ, పరువళ్లు. (చూ, మల్లశాస్త్రము.)

ఒంటనివాఁడు. ద్వ. వి. పగతుఁడు: చూ, శత్రువు. 1.

ఒంటమి. దే. వి. పగ: చూ, విరోధము. 1.

ఒంటరవిము. దే. —వై.— "క. ఒంటమిని లేని యొంటర, మింటరములు వల్కుటుచితమే యర్థరథుం డంటేను నేమితక్కువ, గంటిచెప్పుమ దీనదీవు గన్నదిగలదే." భార. ఉద్యో. 4, అ. 287.

ఒంటరమింటరము. దే. వి. ఎక్కువతక్కువలు. "క. ఒంటమినిలేని యొంటర, మింటరములు వల్కుటుచితమే." భార. ఉద్యో. 4, అ. 287. (ఎక్కువతక్కువలు=కష్టనిష్ఠురములు.)

ఒంటరి. ద్వ. వి. (ఒంటి + అరి.) 1. పంది: చూ, సూకరము; అసహాయుఁడైన బంటు. "సు. ఘూవుఁదీఁ, గెగుడెం దావలరాచ యొంటరి కడుంగెరించు దుం జిమ్ముఁకా." య. 5, అ 74: చూ, ఒంటరీఁడు. 1; 3 ఎక్కటి: చూ, ఒంటరీఁడు. 2.

ఒంటరికాఁడు. ద్వ. వి. 1. పంది "సీ. క్రిమ్మ యొంటరికాని దొమ్మినొంచు యశంబుబయటి పల్లెలుగూల్చు బల్మికల్మి." చంద్రా 1, అ. 20: చూ, సూకరము; 2. అసహాయుఁడైన బంటు. "ఒంటరికాండ్రనేక సూకరముల గుప్పదెప్ప మనఁగాఁ బడఁగ్రిమ్మరి." ఉ, రా. 7, అ. 414: చూ, ఒంటరీఁడు. 1; విశే. 3. ఎక్కటి: చూ, ఒంటరీఁడు. 2. (స్వార్థమునకాఁడు.)

ఒంటరిచేరిక. వా. (అల్టర్ నేటీవు.) ౯ వి, జ్యోతిర్లోనగువాని ఆకులు. కణుపున కొక్కొక్కటిచొప్పున సూర్యరశ్మి తగులుట కనువుగ నుండునటు లెమ్మనుపుట్టు ఆకులచేరిక. చూ, ఆకులఅమరికలు.

ఒంటరిపాటు. ద్వ. వి. 1. అనురహసము: చూ, రహస్యము. 1; 2. అసహాయత: చూ, దిక్కుమాలినతనము.

ఒంటరివాఁడు. ద్వ. వి. 1. అసహాయుఁడైన బంటు: చూ, ఒంటరీఁడు. 2; 2. ఎక్కటి: చూ, ఒంటరీఁడు. 2.

ఒంటరీఁడు. ద్వ. వి. (ఒంటరి + ఈఁడు.) 1. అసహాయుఁడైనబంటు "సీ. ఒంటరి యెక్కటీఁడొంటరీఁ డొంటిరింపు నానేకభటునికి నా [illegible]లగు." ఆం, భా. ద్వి. స్క. 185. (ప్వార్థ [illegible]ఁడు) ఒంటరి, ఒంటరికాఁడు, ఒం ట[illegible]ఁడు, ఒంటరీఁడు, ఒంటికాఁడు, ఒం టిరింపు; (సం. ప) :— అసహాయశూరుఁడు; 2. అసహాయుఁడు, ఎక్కటి: చూ, విడి. 12.

ఒంటరులు. ద్వ. వి. బ 1. కాలిబంటు: చూ, భటుఁడు. 1; 2. నాలుగవ జాతివారిలో నుత్తములుగ పరిగణింపఁబడు నొకానొక జాతివారు.

ఒంటి. దే. వి. 1. ఒంటిపాటు: చూ, రహస్య ము. 1; 2. అసహాయత: చూ, దిక్కుమాలిన తనము.

ఒంటింపు. దే. వి. 1. మైత్రి, పొత్తు: చూ, స్నేహము. 1; 2. తోడు, సహాయము: చూ, వెంబడి; 3. వీఁడు వీఁడీయాపనిని జేయవల యునని యేర్పఱచు నేర్పాటు. (ఇప్పటికి ప్రాచీనకవి సమ్మతము కాదు. ఆరగింపువం టిది.)

ఒంటికంటిగాము. ద్వ. వి. అనేహస్సు, శుక్రుఁడు: చూ, రాహువు. 2.

ఒంటికంటి రామలింగము. లో. ఎదుటివారికలిమి చూచి యోర్వలేనివాఁడు. (అసహనుఁడు.)

ఒంటికాఁడు. ద్వ. వి. 1. పంది: చూ, సూకర ము; విశే. 2. సన్యాసి, విరాగి, ప్రియు రాలి నెడబాసినవాఁడు. "సీ. అనురక్తిరే చునూతన సారసాటోప మొంటికాండ్రకుఁ బెంపులొసఁగు నెచట." (హరిశ్చంద్రకథ యందు పందులకనియు, నలకథయందు వియో గులకనియు అర్థము.) హ, న. 2, ఆ. 80: చూ, ముని. 1; 2. ఏకాకి, ఎక్కటి: చూ, విడి. 12.

ఒంటికొమ్ముడేలుపు. ద్వ. వి. ఏకదంతుఁడు: చూ, వినాయకుఁడు. 1.

ఒంటిగాము. ద్వ వి: చూ, ఒంటికంటిగాము.

ఒంటిగూనమోట. పా. ఒంటిగూనమోట అనియు రెండుగూనల మోటఅనియు మోటలు రెండు విధములు.— అందు ఒంటిగూనమోటయే పూ ర్వమునుండియు వాడుక. అది మిగుల లఘు వయిన యంత్రము. (ఇందలి భాగములు.— నూయి, నీరుపడు కుండి, ఎద్దు మెసఁగుట కును ముం దుకును నడచుపేట వాలుస్థలము, మోటగూ న, మోటమోకు, తొండపుత్రాడు, గిలక.)

ఒంటిజందెపువాఁడు. ద్వ. వి. ఉపనీతుఁడు, బ్రహ్మచారి: చూ, వటువు.

ఒంటిపాటు. వై. వి. ఏకాంతము: చూ, రహస్య ము. 1.

ఒంటిపేటదండ. ద్వ. వి. ఏకావళి, ఒంటిపేట హారము: చూ, భూషణము 2.

ఒంటిపోఁగు. ద్వ వి. బలదేవుఁడు, రోహిణీతా ల్పు. "ఉ. సీరికినొంటిపోఁగునకు విశేషముతో శివుఁడాది భిక్షువం,చేరులు నెద్దుగ్గినుసమృ ద్ధిగఁ గాదజాలుంది రప్పురిన్." శకాం. 2, ఆ. 20: చూ, బలరాముఁడు.

ఒంటిపోట్లాట. ద్వ. వి. అసహాయయుద్ధము: చూ, యుద్ధము.

ఒంటిరన్ను. ద్వ. వి. శరీరమలము: చూ, మల ము. 1. (వాడుక.)

ఒంటిమ్రాఁకులపెనుముప్పు. ద్వ. వి. గాలి: చూ, వాయువు.

ఒంటియ. వై. వి.= ఉప్పరి. రూ– ఒంటె: చూ, లొట్టిపిట్ట.

ఒంటియడుగుగత్తెర. ద్వ. వి. మల్లయుద్ధగతిభేద ము; పరువట్టు పండ్రెండింటిలో నొకటి: చూ, పరువట్టు. (చూ, మల్లశాస్త్రము.)

ఒంటివేలు. పా. అల్పావమానము విడుచుటకు బడిపిల్లలు పంతులుగారిని అడుగుటకు చూపెడి గుఱుతు. (చిటికెనవ్రేలు చాపుట.)

ఒంటు. దే. వి. 1. మైత్రి, పొత్తు: చూ, స్నేహము 1; 2. గ్రామసమూహము; అ. క్రి. 3. అనుకూలించు: చూ, పొందుపడు; స. క్రి 4. సక్తమగు, పొందు. "రగడ. కమలములం టుచుఁ గలువల నొంటుచు, స్థిమితతగోలుచుచుఁ దేనెలుఁజిలుకుచు." కళాం 2, ఆ. 118: చూ, ప్రాపించు.

ఒంటుకొను. దే. స. క్రి. సక్తమగు, పొందు. "గీ. ఒంటిపాటున నవ్వాలుఁగంటినంటి, యొంటుకొనఁజూచి రోహిణీ యయుక్తమనుచు, దలఁచుఁ దలఁచియుమరునికిఁ దల్లడిల్లు, నుల్లమునమండు యామినీవల్లభుండు." కళాం 2, ఆ. 89: చూ, ప్రాపించు.

ఒంటె. వై. వి.=ఉష్ట్రః చూ, రూ-ఒంటియ

ఒంటెపిల్ల. ద్వ. వి. కరభము. —వై.—

ఒంటెపులి. ద్వ.వి. ఒకరకము మృగము. (అప్ర.)

ఒంటెలగుంపు. ద్వ. వి. ఉష్ట్రసమూహము: చూ, ఔష్ట్రకము.

ఒంటిరింపు. ద్వ. వి అసహాయశూరుఁడు: చూ, ఒంటరీఁడు. 1.

ఒంట్లు. దే. వి. బ. (ఒంటు + లు.) 1 పురుషుల కర్ణభూషణము: చూ, భూషణము. 3; వై. వి. 2. అంకెలు: చూ, సంఖ్య. 1.

ఒండిలి. దే. వి. రూ-ఒంజిలి, అశుభము: చూ, హాని. 2.

ఒండు. వై. స. ఏ. 1.=ఏకః. ఒకటి: చూ, వంచి; వై. స. 2.=ఏకః. అన్యము: చూ, పరాయి; 3. అడుసు: చూ, బురద.

ఒండువలను. ద్వ. వి. అన్యము: చూ, పరాయి.

ఒండె. దే. క్రి. 1. అటుకానిపక్షమున. "చ. వనమునకేఁగి...తపోమహిమన్ మిమునిగ్రహింతురొం, డెనతులితాస్త్రశక్తిని వడింమనుమాడుచు రాజనందనుల్." భార. అర. 5, ఆ. 368 (మీఁద ఏని శబ్దము కదిసియుఁ బ్రయోగింపఁబడును; "సీ. అష్టమీవాసరంబున యందు నొండె, నొండె నేని." భీ. 6, ఆ. 78: చూ, ఏని. (1); 2. కాని, వికల్పార్థకము. "సీ. సమకట్టి సైన్యంబు సైన్యంబుతోనొండెఁ దొడరిమీముప్పురతోడ నొండె, నిద్దఱతో నొండె నెక్కటియొక్కనితోనొండె, బొడిచెద దోర్బలమున, నేయాయుధంబున నెమ్మెయిఁబోరంగ నిష్టమయ్యెది." భార. సభా. 1, ఆ. 198 చూ, వికల్పము. 2.

ఒండేని. దే. అవ్య (ఒండెన్ + ఏని) 1. అటు కానిపక్షమున: చూ, ఏని (1); 2 కాని, వికల్పార్థకము "మ. అనువంగంబున నొండె నొండెను విహారాపేక్ష నొండేని ఘూర్జనిరాసంబున నొండెఁ దీవ్రభయసంత్రాసార్థ మొండేని యు, న్యవిరోగంబున నెవ్వఁడే మునుఁగు గంగాంభః ప్రవాహంబునన్, జనుఁడాతండును బుండరీకనయనా శాసించు పాపౌఘముల్." కాశీ. 5, ఆ. 45: చూ, వికల్పము. 2.

ఒండొండ. దే. అవ్య. (ఒండు + ఒండు + అ.) క్రమక్రమముగా. "తే. తడవుతేదింక నిఖిలభూతములుఁ బ్రళయ, మొందనున్నవి యిప్పు డొండొండపాంగి." భార. ఆది. 4, ఆ. 224; భార. శాంతి. 1, ఆ. 22.

ఒండొండు. దే. అవ్య. మిథఃపదార్థము, పరస్పరము. "గీ. ఒండొండునాఁగ మిథఃపదార్థ మొప్పు." ఆం. భా. తృ. అవ్య. 68: చూ, మిథము.

ఒండొకటి. దే. స. అన్యోన్యము, పరస్పరము: చూ, మిథము.

ఒండొకఁడు. ద్వ. అవ్య. ఇతరుఁడు: చూ, పరాయివాఁడు.

ఒండొరు. దే. క్రి. పరస్పరము: చూ, మిథము

ఒండొరుమికి. ద్వ. వి. మైత్రి: చూ, స్నేహము. 1.

ఒండొరుల. దే. క్రి. ఒండొరు: చూ, మిథము.

ఒండొరులమైత్రిచెఱుచుట. అం. భేదోపాయములు మూఁడింటిలో నొకటి: చూ, భేదోపాయములు.

ఒండొరులకు రాయిడిపుట్టించుట. అం.—పై.—

ఒందిక. దే. వి. మైత్రి. రూ- ఒద్దిక. "సీ. కలకపాథోరాశి కన్యకారత్నంబు నొందికతోఁ గూడియున్నవాని" వి. పు. 5, ఆ. 79: చూ, స్నేహము. 1.

ఒందిలి. దే. వి, విణ: చూ, రూ- ఒందిలి. (దుఃఖముకలది — "వాఁడు ధనహీనుఁడగుచు సంతాపమొందవినుతుఁడు బంధులవ్యథమున నొందిలియై చేయుమదిలేక." భాగ. 10, స్కం, ఉ.)

ఒందు. దే. స. క్రి. 1 సక్తమగు, పొందు: చూ, ప్రాపించు; అ. క్రి. 2 జనించు, కలుగు. "వ. జననము నొందినారరు." భార. ఆర 4, ఆ. 181; పౌరచిత్తముల కత్యానందమొందంగ." భార. ఆది 8, ఆ: చూ, పుట్టు 2.

ఒక. పై. స. 1.=ఏక. వృత్తియందు ప్రత్యయము లోపించిన రూపము. "ఒకపరి, ఒకతేప, ఒకముష్టి.": రూ- ఒక్క; 2.= ఏక. ఉద్దేశింపఁబడని. "ఒకించుక, ఒకింత ఇత్యాదులయందు ఇది అల్పార్థకమని యెఱుంగునది: ఒకానొక, రూ-ఒక్క.

ఒకంటు. పై. క్రి.= ఏకత్రి. ఏకత్రార్థకము: రూ- ఒకటు- ఒక్కటు- ఒకొటు- ఒక్కొటు.

ఒకఁడు. పై. స. 1.= ఏకః. ఒకటి: చూ, వంచి, 2.= ఏకః. రూ- ఒక్కఁడు. అన్యుఁడు: చూ, పరాయివాఁడు; 3.= ఏకః. ఏకకుఁడు (లేక) ఏకము. అన్యము: రూ- ఒకరుఁడు - ఒకరువుఁడు - ఒకొఁడు - ఒకొరుఁడు - ఒకొరువుఁడు - ఒక్కఁడు - ఒక్కరుఁడు - ఒక్కరువుఁడు — ఒక్కొఁడు - ఒక్కొరుఁడు - ఒక్కొరువుఁడు, ఒడ్డు, ఒరుఁడు - ఒరువుఁడు; (సం. వ):— ఏకకుఁడు.

ఒకటు. పై. క్రి. 1.= ఏకత్రి. ఏకత్రార్థకము: చూ, రూ- ఒకంటు; 2. కూడ, సహితమను నర్థమును దెలిపెడి: చూ, సైతము; 3. ఏకకాలమున: చూ, యుగపత్.

ఒకటి. పై. స. ఏ. 1 = ఏకః. ఏకసంఖ్య, రూ- ఒక్కటి: చూ, వంచి; 2.= ఏకః. రూ- ఒక్కటి అన్యము: చూ, పరాయి.

ఒకటేకి. పా. ఒంటివేలునకు: చూ, ఒంటివేలు.

ఒకత. పై. స. ఏ. 1.= ఏకస్త్రీ. రూ- ఒకతి: చూ, స్త్రీ; 2. పరస్త్రీ. రూ- ఒకతి: చూ, స్త్రీ.

ఒకతడవ. దే. అవ్య. సకృదర్థకము: చూ, సకృత్. 1.

ఒకతి. పై. స. ఏ: చూ, రూ- ఒకత.

ఒకతుక. పై. స. ఏ. (ఒకత + క.) రూ- ఒకత్తుక.—పై.—

ఒకతూరి. దే. అవ్య. ఒకతడవ: చూ, సకృత్. 1.

ఒకతె. పై. స. ఏ. రూ- ఒకరితె: చూ, రూ- ఒకత.

ఒకతేప. దే. అవ్య. ఒకతడవ: చూ, సకృత్. 1.

ఒకపరి. దే. అవ్య.—పై.— "ఒకపరియొకతేప యొక్కసారి యొక్కమాటున సకృదర్థమొనరు." ఆం, భా. కృ, అవ్య. 68.

ఒకపారి. దే. అవ్య.—పై.—

ఒకపెట్టు. దే. క్రి. ఏకకాలమున: చూ, యుగపత్.

ఒకపెట్టున. దే. క్రి.—పై.—

ఒకప్పుడు. దే. క్రి. విశేష్యము. "సీ. కదాచిదర్థ మెుక్కెడ యొకప్పుడనఁగను." ఆం, భా. తృ, అవ్య. 70: చూ, కదాచిత్.

ఒకమఱి, దే. అవ్య. ఒకతడవ: చూ, సకృత్.1.

ఒకమాటు దే. అవ్య.—పై —

ఒకమాఱు. దే. అవ్య.—పై.—

ఒకమొగి. దే. క్రి. ఏకకాలమున: చూ, యుగపత్.

ఒకయూరక. దే. క్రి.—పై.—

ఒకరిత. వై. స. ఏ. (ఒకరి + త.) రూ-ఒకర్త: చూ, రూ-ఒకత.

ఒకరితి. వై. స. ఏ. (ఒకరి + తి.) —పై.— (రూ-ఒకర్తి.)

ఒకరితె, వై. స. ఏ. (ఒకరి + తె.) —పై.— (రూ-ఒకర్తె.)

ఒకరిసొమ్మును దానమ్మిట. ఆం వివాదములు పదునెనిమిదింటిలో నొకటి: చూ, వివాదములు.

ఒకరుఁడు. వై. స. 1.=ఏకః. అన్యుఁడు: చూ, పరాయివాఁడు; 2.=ఏకః. ఏకరుఁడు (లేక) అన్యము, ఏకము: చూ, ఒకఁడు. 3.

ఒకరువుఁడు. వై. స.= —పై —

ఒకరోజు. ద్వ. వి: ఒకానొకదినము: ఒక్కనాఁడు; (సం ప):—ఏకాహము.

ఒకర్త. వై. స. ఏ. 1. రూ-ఒకరిత. ఏకస్త్రీ: చూ, స్త్రీ; 2. రూ-ఒకరిత. పరస్త్రీ: చూ. స్త్రీ.

ఒకర్తి. వై. స. ఏ. —పై.— (రూ-ఒకరితి.)

ఒకర్తు. వై. స. ఏ. (ఒకర్త + ఉ.) —పై.— (రూ-ఒకర్తుక.)

ఒకర్తుక. వై. స. ఏ. (ఒకర్త + క) —పై.— (రూ-ఒకతుక.)

ఒకర్తె. వై. స. ఏ. రూ-ఒకతె —పై.—

ఒకవిడుత. ద్వ.అవ్య ఒకతడవ: చూ, సకృత్ 1.

ఒకసారి. ద్వ. అవ్య. —పై —

ఒకానొక. వై. విశే. వృత్తియందు ప్రత్యయము లోపించినరూపము. ఉద్దేశింపఁబడని. "ఒకానొక పురుషుఁడు, ఒకానొకస్త్రీ, ఒకానొక నొక మృగము" మొ. (దీనిని ప్రత్యయముతో చేర్చి చెప్పునపుడు మహదర్థమున ఒకానొకఁడనియు, మహత్యర్థమున ఒకానొకతయనియు అమహదర్థమున ఒకానొకటియనియు రూపములు.): చూ. ఒక. 2.

ఒకానొకప్పుడు. ద్వ. క్రి. కదాచిదర్థకము: చూ, కదాచిత్.

ఒకింత. దే. వి. 1. అల్పము, రూ-ఒక్కింత: చూ, స్వల్పము; అవ్య. 2. రూ-ఒక్కింత. ఈషదర్థకము. "సీ. ఇంచుకంతయొకింత యించుక యిసుమంత యన నీషదర్థకవాా." ఆం, భా. తృ. అవ్య. 74 చూ, స్వల్పము.

ఒకింతవేఁడిమి. ద్వ. వి. ఇసుమంతకాఁక' చూ, మందోష్ణము.

ఒకొ. దే. అవ్య. రూ-ఒకో సంశయార్థకము. "క. భీముఁడొకొ తమ్ముకుఱ్ఱలొ, కో మఱి యెవ్వరొకొ తలఁపు కొలఁదికి మీ రెఱుఁగ్గా" భార. ద్రోణ. 2, ఆ. 229; "క. సుఖముండఁ బడయుదు, మొకొ యిప్పాటెందుఁగలదె యొరులెవ్వరికిఁగా." భార. విరా 1, ఆ. 49; నిర్వ. 8, ఆ. 121: చూ, సంశయము.

ఒకొఁడు. వై. స. 1 =ఏకః, అన్యుఁడు: చూ, పరాయివాఁడు; 2. = ఏకః. ఏకరుఁడు (లేక) అన్యము, ఏకము: చూ, ఒకఁడు. 3.

ఒకొటు. వై. క్రి. 1. ఏకతార్థకము. రూ-ఒకొట్టు: చూ, ఒకంటు; 2. కూడ. రూ-ఒకటు: చూ, సైతము

ఒకొటి. వై. స. ఏ. రూ-ఒకటి. ఏకసంఖ్య: చూ, వంది.

ఒకొత. వై. స. ఏ. 1. రూ-ఒకొరిత. ఏకస్త్రీ: చూ, స్త్రీ; 2. రూ-ఒకొరిత. పరస్త్రీ: చూ, స్త్రీ.

ఒకోతి. వై. స. ఏ. —పై— (రూ-ఒకోరితి.)

ఒకోతుక. వై. స. ఏ. (ఒకోత + క.)—పై.—

ఒకోతె వై. స. ఏ. —పై.— (రూ-ఒకోరితె.)

ఒకోరిత. వై. స. ఏ. (ఒకోరి + త.) —పై.— (రూ-ఒకోర్త.)

ఒకోరితి. వై. స. ఏ. (ఒకోరి + తి.) —పై — (రూ-ఒకోర్తి.)

ఒకోరితె. వై. స. ఏ. (ఒకోరి + తె) —పై.— (రూ-ఒకోర్తె)

ఒకోరుఁడు. వై. స.=ఏకః చూ, రూ-ఒకోఁడు

ఒకోరువుఁడు. వై. స.=ఏకః. —పై.—

ఒకోర్త. వై. స. ఏ. 1. రూ-ఒకోరిత. ఏకస్త్రీ: చూ, స్త్రీ, 2. రూ-ఒకోరిత. పరస్త్రీ: చూ, స్త్రీ.

ఒకోర్తు వై. స. ఏ (ఒకోర్త + ఉ.) —పై.—

ఒకోర్తుక వై. స. ఏ. (ఒకోర్తు + క.)—పై.— (రూ-ఒకోతుక)

ఒకోర్తె. వై. స. ఏ —పై.— (రూ-ఒకోరితె)

ఒకో. దే. అవ్య. చూ, రూ-ఒకో.

ఒక్క. వై. స: చూ, రూ-ఒక.

ఒక్కంతగా. దే క్రి. ఒక్కపెట్టు: చూ, యుగపత్.

ఒక్కటు. వై. క్రి. 1. ఏకత్రార్థకము. రూ-ఒకటు: చూ, ఒకటు; 2. కూడ, సహితము. "సీ. అతనితోడ, నొక్కటుఁబుట్టిన యక్క న్యకను." భార. ఆది. 7, ఆ. 160; "క. ఎలుం డుదమయంతి నాశ్వాసించుచు నొక్కటుఁజని" భార. అర. 2, ఆ. 76: చూ, సైతము.

ఒక్కటి. వై. స. ఏ.=ఏకః: చూ, రూ ఒకటి.

ఒక్కటీఁడు. ద్వ. వి ఏకాకి. ఒంటరికాఁడు: చూ, విడి. 12.

ఒక్కఁడు. వై. స. 1.=ఏకః రూ-ఒకఁడు. అన్యుఁడు: చూ, పరాయివాఁడు; 2.=ఏకః. ఏకకుఁడు (లేక) ఏకము, అన్యము: చూ, రూ-ఒకఁడు. 8.

ఒక్కణ. వై. వి.=వ్యాఖ్యానమ్. రూ-ఒక్కణః చూ, వివరము.

ఒక్కత. వై. స. ఏ. రూ-ఒక్కరిత: చూ, రూ-ఒకత.

ఒక్కతి. వై. స. ఏ. రూ-ఒక్కరితి. —పై.—

ఒక్కతుక. వై. స ఏ. రూ-ఒకతుక. —పై.—

ఒక్కతూరు. దే అవ్య. ఒకతడవ; చూ, సకృత్.1.

ఒక్కతె. వై. స. ఏ. రూ-ఒక్కరితె: చూ, రూ-ఒకతె.

ఒక్కనాఁడు ద్వ. వి. ఏకాహము, అన్యదినము. "తే. అన్యదినసంజ్ఞ యొక్కనాఁడనఁగ వెల యు." ఆం, భా. ప్రి. ది౯్వ. 97: చూ, ఒక రోజు.

ఒక్కపెట్టు. దే. క్రి. ఒక్కంతగా: చూ, యుగపత్.

ఒక్కప్రొద్దు. వై.వి.వ్రతాదులచే నియమముతోఁ జేయునట్టి యొక్కపూఁట భోజనము: చూ, సాపాటు.

ఒక్కమాటు. దే.అవ్య. ఒకపరి: చూ, సకృత్.1.

ఒక్కము. దే. స. ఏకసంఖ్య, ఒకటి: చూ, ఒంది.

ఒక్కమొగి. దే. క్రి. ఒక్కపెట్టు: చూ, యుగపత్.

ఒక్కయూక. దే. క్రి.—పై.—"క. ఒకొక్క లన నొక పెట్టన, నొక్కుమ్మడియనఁగ నొ క్కయూక యనంగా, నొక్కంతగా ననం బెం, పెక్కన యుగపత్పదార్థమిందువతంసా." ఆం, భా. తృ, అవ్య. 80.

ఒక్కరిత. వై. స. ఏ. రూ- ఒక్కర్త: చూ, రూ-ఒకత.

ఒక్కరితి. వై. స. ఏ. రూ- ఒక్కర్తి. -పై.-

ఒక్కరితె. వై. స. ఏ. రూ- ఒక్కర్తె. -పై.-

ఒక్కరుఁడు. వై. స.= ఏకః: చూ, రూ- ఒకరుఁడు,

ఒక్కరువుఁడు. వై. స.= ఏక.—వై.—

ఒక్కర్త. వై. స. ఏ. రూ- ఒక్కరిత: చూ, రూ-ఒకత.

ఒక్కర్తి. వై.స.ఏ. రూ-ఒక్కరితి. —వై.—

ఒక్కర్తు. వై. స. ఏ. రూ-ఒకర్తు. —వై.—

ఒక్కర్తుక. వై. స. ఏ. రూ-ఒకర్తుక.—వై.—

ఒక్కర్తె. వై. స. ఏ. రూ-ఒకర్తె.—వై.—

ఒక్కసారి. దే. అవ్య. సకృదర్థకము. "ఒకపరి యొకతేప యొక్కసారి యొక్కమాటన సకృదర్థమొనరు." ఆం. భా. తృ, అవ్య 68: చూ, సకృత్. 1.

ఒక్కసికొక్క. ద్వ. వి. ఒకానొక బాలక్రీడ. "ఒక్కసికొక్క, రెండులోగిళ్ళు, మూఁడు ముచ్చిలక, నాలుగు నందన్న, అయిదుంబీటిలు, ఆఱుందారాలు" మొ: చూ, బాలక్రీడ

ఒక్కాణించు. వై. వి.= వ్యాఖ్యాన. వ్యాఖ్యానముచేయు, చెప్పు. (పురుషోత్తమకవీయము.)

ఒక్కింత. దే. వి: చూ, రూ- ఒకింత.

ఒక్కుమ్మడి. దే. క్రి. ఒక్కయూఁక: చూ, యుగపత్.

ఒక్కూక. దే. క్రి.—వై.—

ఒక్కెడ. దే. క్రి. ఏకదేశము: చూ, కదాచిత్.

ఒక్కెత్తు. దే. అవ్య. ఒక్కయూఁక: చూ, యుగపత్.

ఒక్కెత్తుగండఁడు. శా. ఒక్కయెత్తునకే కొట్టగల వీరుఁడు. సౌ. ఇం. ఇ, 4, సం. 1158 శాసనము.

ఒక్కెఱ. వై. వి. 1.= ఉగ్రమ్. అంకపాంకములు, ఉగ్రభావము. "చ. అఱచుచున్న తల్లిని కృతాంతవశస్థితుఁడైన తండ్రి నొక్కెఱగని." భార. అర. 8, ఆ. 158: చూ, భయంకరము; విశే. 2. ఉగ్రము. —వై.— "క. పెనుచెఱకువిరిలో నొక్కెఱగానొక మొసలి చూడ్కికినగోచరమై, పఱతెంచి కుంభసంభవు, చిఱుదొడపడిఁ బట్టుకొనిరి శిష్యులు బెదరఁగా." భార. ఆది. 5, ఆ. 256.

ఒక్కొ. దే. అవ్య. రూ- ఒకొ్క: చూ, సంశయము.

ఒక్కొఁడు. వై. స. 1. రూ- ఒక్కఁడు. అన్యుఁడు: చూ, పరాయివాఁడు; 2. ఏకుఁడు (లేక) అన్యము, ఏకము. "ప్రిథ్వర. కూర్మిలేప్పాసంబులే దొక్కొఁడు." రాఘ. 2, ఆ. 106: చూ, రూ- ఒకఁడు. 3.

ఒక్కొట. వై. క్రి. 1. ఏకత్రార్థకము: చూ, ఒకంట 2 కూడ, సహితము: చూ, సైతము; 3. ఏకకాలమున. "క. ఇటుపాండవ కౌరవు లొక్కొటనందఱు గురు ననుజ్ఞగొని." భార. ఆది. 5, ఆ. 288: చూ, యుగపత్.

ఒక్కొటి. వై. స. ఏ. ఏకసంఖ్య. రూ-ఒకొటి: చూ, ఒంటి.

ఒక్కొత. వై. స. ఏ. రూ-ఒక్కొరిత: (చూ, రూ-ఒకత.)

ఒక్కొతి. వై. స. ఏ. రూ-ఒక్కొరితి. -వై.-

ఒక్కొతుక. వై స. ఏ. రూ- ఒకొతుక -వై.-

ఒక్కొతె. వై. స. ఏ. రూ- ఒక్కొరితె —వై.—

ఒక్కొరిత. వై. స.ఏ. రూ-ఒకొరిత.—వై —

ఒక్కొరితి. వై. స. ఏ. రూ- ఒకొరితి -వై.-

ఒక్కొరితె. వై. స. ఏ. రూ- ఒకొరితె. —వై.—

ఒక్కొరుఁడు వై. స. 1.= ఏక. అన్యుఁడు. రూ- ఒకొరుఁడు: చూ, పరాయివాఁడు, 2 = ఏక. ఏకుఁడు రూ- ఒకొరుఁడు: చూ, ఒకఁడు. 3.

ఒక్కొరువుఁడు. వై. స =ఏక.—వై.—(రూ- ఒకొరువుఁడు.)

ఒక్కొర్త. వై. స. ఏ. రూ- ఒకొర్త: చూ రూ- ఒకత.

ఒక్కుర్తి. వై. స. ఏ. రూ-ఒకొర్తి. —వై.—

ఒక్కుర్తు. వై. స. ఏ. రూ-ఒకొర్తు.—వై.—

ఒక్కుర్తుక. వై. స. ఏ. రూ- ఒకొర్తుక. —వై.—

ఒక్కుర్తె. వై. స. ఏ. రూ- ఒకొర్తె. —వై.—

ఒకో. దే. అవ్య. రూ- ఒక్కొ: చూ, సంశయము.

ఒకోట. దే. ద్రి. రూ- ఒక్కట. ఏకకాలమున: చూ, యుగపత్

ఒకోలనము. దే. అవ్య. —వై.—

ఒగచేడము. దే. వి. కారుణ్యము, కనికరము: చూ, దయ.

ఒగరు. వై. వి. 1.= తువర. వగరు, చక్కఁగాఁ బండని దానిమ్మలోనగువాని రుచి. "సీ. బిరి కంద కుండలేఁజిగురాకుఁగొనివచ్చి యొగరెల్ల బుచ్చితీ పాసఁగకున్న." విక్రి. 5, ఆ. 172: చూ, రసము. 5; అం. 2. రసములారింటిలో నొకటి: చూ, రసములు.

ఒగరుచు. వై. అ.క్రి. ఒగరగు. "సీ. నులివాఁడు వాఁడుపల్ల్వుల గొంతొఁగర్చి లేఁబొలపల్ల్వుగా లివేఁ బోకకాతిఁగి. కడకువెళ్ళఁగ నొక్క కడనుండి తొర్కుచు నులుఁపలఁ జిలుతగుల్లల నమలుచు." ఆము. 2, ఆ. 58.

ఒగరుపు. వై. వి. ఊపిరికుట్టు· చూ, శ్వాసబంధము (రూ-ఒగర్పు)

ఒగర్పు. వై. వి.—వై.— "ఎందుకురా ఒగర్పు అనిన ఎల్లుండి సంతకుఁబోవలె నన్నట్లు."

ఒగి. దే. ద్రి, క్రి. విశ. క్రమముగా. "సీ. కదేఁబున్ను లుభయపక్షములవారి. ఆ. నుద్ధరింతురంద రొగిఁబిండ మిడినవారసఖు పితృదయమున్కృతార్థులగునారు." భార. అర. 2, ఆ. 275. (ఇక్కడ ఒగిని అనఁగా విధిక్రమముగా ననియర్థము.) ఇట్లక్కడక్కడ సంధర్భానుసారముగా అర్థము తెలుంగునది,)

ఒగిడిగ. జిడబిల్ల. "సీ. కన్నెగడఁగి తేలు కున్న గిలగఁజితి యొగిడిగగాఁ బెట్టిపొక్కచెలికి." చమ. 1, అ: చూ, భూషణము. 2.

ఒగుడు. దే. వి. టొన్నలోనగువాని యొండిన యాకు: చూ, సారుగాకు.

ఒగుడుకలుచు. దే. అ. క్రి. కృశించు, చిక్కు: చూ కడియు. 3.

ఒగ్గము. దే. వి. అవపాతము. "క. ఒగ్గములు త్రివ్వపడుమని, యొగ్గడు పెనుఁదెరల వలల నుగ్రిమృగములన్, దగ్గతినఁబంపు వేడుక, నెగ్గలమై చిత్తమంద వేఁటాడింపన్." భాగ. 1, స్కం. 454: చూ, వారి. 6.

ఒగ్గు. గా. అ. క్రి. 1. ఉత్సహించు, కడఁగు· "ఉ. ఏయుక్కునలేక యిట్టిపనికొగ్గునె యంచొక కొండకాడఁగన్." పాంచా. 2, ఆ. 49: చూ, యత్నించు; స. క్రి. 2. (వల) పఱచు, ఒడ్డు: చూ, పఱచు; 3. తోఁగఁ జేయు, ఒడ్డు: చూ, చోఁపు.

ఒగ్గుబల్ల. దే. వి. తరిమినపట్టెడు కొయ్య కాధారమైన బల్ల.

ఒచ్చుబడి. దే. వి. రాబడి. చూ, రూ-వచ్చుబడి·

ఒచ్చెము. దే. వి. 1. అచ్చిక, న్యూనత. "గీ. అధ్వరారంభ మింతొప్పనయ్య దక్ష, శివునిఁదోడ్తేని యొక్క యొచ్చెంబకాని." కాశి. 7, ఆ. 57: చూ, కలిమి. 2; 2. అవమానము. "చ. మానినికిందనుఁదాన కాచికో, లాదవిన దానఁజేసి సభనొచ్చెముదక్కనఁ బొందునందనున్, బ్రిదికిలిగాక." భార. ఉద్యో. 1, ఆ. 348: చూ, .న్నము. 2.

ఒచ్చెల. దే. అవ్య. రూ- ఓచెల్ల. సంతాపార్థకము. "ఉ. ఒచ్చెలనిన్నుఁబాంచి వగనొందఁ దుఁజిత్తము." భో, 5, ఆ. 58: చూ, సంతాపము.

ఒచ్చెల్ల. దే. అవ్య.—పై.— "క. అచ్చొఁబ్రి యాగలోపుల, విచ్చలవిడిఁదనదుమేను విడిచి నమనుజుఁడొచ్చెల్ల యేమిచెప్పుదుఁ, దెచ్చె రఁగమనిష్ట కామ్యసిద్ధి ధరిత్రిన్." భో. 1, ఆ. 182.

ఒజ్జ. వై. వి. 1.=ఉపాధ్యాయః. చదువులయ్య. "క. వటువుల, నురుధృతిఁ జదివించుచున్న యొజ్జయుఁగడఁకన్." పర. 2, ఆ: చూ, పంతులు. 1; 2.=ఉపాధ్యాయః. యాజకుఁడు. "గీ. భక్ష్యభోజ్యలేహ్య పానీయముల మీఁద,... వెగడుపడఁగఁ బాటివెఱపింతె యొజ్జ లు, తక్రతుసాంగ విధులు దప్పిపఱవ." భార. ఆది. 1, ఆ. 181: చూ, ఋత్విజుఁడు. 1.

ఒజ్జదనము. వై. వి: చూ, ఒజ్జనము.

ఒజ్జనము. వై. వి. ఉపాధ్యాయత్వము: ఒజ్జదనము; (సం. ప) —ఆచార్యకము, ఆచార్యత్వము, ఉపాధ్యాయత్వము.

ఒజ్జబంతి వై. వి.=ఉపాధ్యాయపద్ధతి. (ఉపాధ్యాయుఁడు చూపిన) ఒరవడి. "సీ. తనకులాచారవర్తన వైష్ణవాచారపర్యాయముల కొజ్జబంతియనఁగ." పాండు. 1, ఆ. 20; రూ-ఓజబంతి: చూ, మేలుబంతి

ఒజ్జలపంగనామము. లో. గురువునకు పంగనామము. (అయ్యవారికి తప్పులు దిద్దఁబోవుట లోనగుచర్య.)

ఒజ్జలపుచ్చకాయ. జా. నేర్చినవిద్య మఱచిపోవుట. "ధర్మవిధులన్నియు నొజ్జలపుచ్చకాయఁగావలయు" (కళాపూర్ణోదయము.) "శా. ఆహా! యొజ్జలపుచ్చకాయవితమా రావేయునింకేటికిన్." కళాం 4, ఆ. 192.

ఒజ్జలపుచ్చెపాము. లో. గురునకు పుచ్చెపాము. (నేర్చినవిద్య మఱచి యెదురుతిరుగుట)

ఒజ్జసాని. వై. వి.=ఉపాధ్యాయిని. "ద్వి. కపటమేర్పడఁగ నాఁగాకనిపోయి. చపలాత్ముఁడా యొజ్జసానికిట్లనిరెయె." హరిశ్చ. 2, భా: చూ, సోమిదమ్మ. (చూ, భార్య.)

ఒట్టు. దే. వి. 1. బాస: చూ, శపథము; అ క్రి 2: జనించు. "ఉ. అట్టి నృపాలకీటముల నాజిసమర్థుఁగలేనివాని య, ట్లొట్టిన ధీతిపై నిటుపరయోధి శరణ్యుఁడవైతివి." భాగ. 10, స్కం.ఉ: చూ, పుట్టు. 2; స.క్రి. 3. కీలించు, ఉంచు. "ఉ. ఇట్టిది కూర్రకృత్యమని యించుక కొంకక లక్కయింటఁ జి, చ్చొట్టితి మాయజూదమున నుత్తమధర్మజుఁ దూలఁ బుచ్చి తా, చుట్టలుఁబెద్దయింజెలులుఁజూడగ ద్రౌపది భంగపెట్టితి" భార. శల్య. 2, ఆ. 133: చూ, పెట్టు. 5; 4. రగులఁజేయు. "ఒట్టిన మంటవోలెఁ గడునుగ్రతఁ జేర్చిన" నిర్వ. 4, ఆ. 54. "క. పెనుమంటలయం, దొట్టుదురు." (ఇక్కడ ఒట్టుట యనఁగా కాల్చుట) భాగ. 8, స్కం. 998: చూ, రవులుచు

ఒడంబడిక. పా. రాజి (ట్రీటీ.)

ఒడఁగూడు. దే అ. క్రి. 1. ఒనఁగూడు: చూ, సిద్ధించు; 2. అంటుకొను, చేరు. "క. అమవస గావునఁ నేఁడ, క్కముల జాఁగొలువఁగ మహర్షి గణములుఁ బిత్రుసం, ఘములును బోదురు బ్రహ్మం, డమునం గలవారలం దొడంగూడంగాన్." భార. ఆది. 5, ఆ. 66: చూ, సమీపించు. (పే్రి. ఒడఁగూర్చు.)

ఒడఁబడిక ద్వ. వి. 1, ఒడఁబాటు. "ఎ, గీ. ఒడఁబడిక గానఁబడనీక యొడలునులియు, నెపముమైఁగాఁగిటికెదుర్చు నీరజాక్షి, యుపమయును భూమివల్లభునల్లమునకుఁ, గొత్తచవిగొల్పె మతివేఱకొన్నివాల్లు" కవిక. 3, ఆ. 224: చూ, సమ్మతము; 2. సమ్మతించి వ్రాసియిచ్చినవ్రాత: చూ, రాజి.

ఒడఁబడు. ద్వ. అ. క్రి. 1. అంగీకరించు: చూ, సమ్మతించు; 2. అనుకూలించు. "చ. కడుఁ జనువాఁడునై పురుషకారియు దక్షుఁడునైన మంత్రి పెం, పడరఁగ రాజపుత్రుల మహాధనవంతులఁజేసి వారితో, నొడఁబడి పక్షమేర్పడఁగ నుండఁడుగా" భార. సభా. 1, ఆ. 32: చూ, పొందుపడు; 3 సంతోషించు. "సమున్నత కీర్తమ్మననుంచి యథావిధి పూజలొడంబడఁజేసి." భార. ఆది 8, ఆ: చూ, సంతోషించు. (ప్రే. ఒడఁబఱచు)

ఒడఁబాటు. ద్వ. వి. 1. ఒడఁబడిక: చూ, సమ్మతము; విణ. 2 అంగీకారము "క. అప్పరమునఁ డిప్పలుకుల, కొప్పితి మాప్రీతిమలోన నొకచిటికెనవ్రేల్, తప్పక యుండఁగనిప్పుడ, యొప్పించెద నొప్పఁజెప్ప మొడఁబాటుని యొక్క" (ఒడఁబాటు=ఒడఁబడ్డ ద్రవ్యము.) పర. 5, ఆ: చూ, సమ్మతము.

ఒడఁబాటువడ్డి. పా. అడిగినప్పుడిచ్చుచుండెడి వడ్డి. కారిత: చూ, వడ్డి.

ఒడగొలుకొను. దే. స. క్రి. రూ-అడగొలుగొను అపహరించు. "వ. మనుష్యుఁడు పుట్టినకొలె నిమములంబడి గడించిన యొడమిపుడమి. చేఁడలిగి గడియతడవులోన నొడగొలుకొన శక్తుండగునట్లు గ్రహాగతుండగు నతిథి తిరస్కృతుండై యతనిపూర్వార్జిత సుకృతంబులన్నియు నపహరింపంజాలు" భో. 3, ఆ. 124: చూ, దొంగిలించు.

ఒడపప్పు. దే. వి. 1. దేవతానివేదనాదులకై నానఁబెట్టిన పెసరపప్పు లోనగునది. చూ, రూ-వడపప్పు; 2. శ్రమపరిహారార్థమిచ్చెడు నానఁబెట్టి సంబారపుఁజేర్చిన పెసరపప్పు లోనగునది. చూ, వడపప్పు. (వడపప్పును సాతాలించిన సాతాలింపు పప్పు అగును.)

ఒడమి. దే. వి. గండి, సందు, చిల్లి. "క. కాఱు కని పెగ్గురువెలి, కుఱుకుచు గొదసేయ నతితి యొడపినెయార్వల్, పఱమిడి గ్రిద్ద పడఁకుచుఁ, గొఱప్రాణముతోడఁ దన్నుఁ గొను నమ్మొదపుర" అము. 4, ఆ. 28: చూ, రంధ్రము. 1.

ఒడమి. దే. వి. 1 రూ-ఒడమె. తొడవు: చూ, భూషణము. 2. 2 రూ-ఒడమె. ధనము. "వ మాతరుండు కఠోరవచనంబులాడినఁ బింగళుండంగలార్చిన దండుండు దండించినం జక్కంబడమిఁ దనయొడమిఁ దానడిమి కడిమినిజంబుగారవి గారవించి." శు. పారి. 6, ఆ 28: చూ, విత్తము.

ఒడమె. దే. వి. —పై.—

ఒడయఁడు. దే. వి. 1 రూ-ఒడయుఁడు. మగఁడు: "అడిగి యాతండొడయండగు మా, నృపాత్మజకని." భో. 3, ఆ చూ, భర్త; విణ. 2 రూ-ఒడయుఁడు. ప్రభువు: చూ, ప్రభువు. 2.

ఒడయుఁడు. —పై.—(భర్త — "గీ. యువతి మండలముల కొడయుఁడవుగమ్ము" శై. 5, ఆ 117.)

ఒడయనంబివిలాసము. పా. ఈగ్రంథకర్త,అజ్జరపు పేరయకవి. (18 శతాబ్ది.)

ఒడయురాలు దే. విణ. (ఒడయుఁడు + ఆలు) ప్రభ్వీణి: చూ, స్వామిని.

ఒడలిమాపాడయుఁడు. ద్వ. వి. ఇంద్రుఁడు: చూ, వేలుపుఱేఁడు. (రూ-ఒడలు చూపాడయుఁడు.)

ఒడలు. దే. వి. 1. రూ-ఒళ్లు. మే-మేను. లక్ష్మి. 2, ఆ. 5: చూ, శరీరము; వా. 2 ఒకానొక ధర్మ్యము; (ఒడ, వడుపు పెళ్ల ములేని గారెవంటి తినుబండము.)

ఒడలుగాలి. వా వ్యానము, శరీరమందుండు గాలి: చూ, వాయువు.

ఒడలుదూపాడయుఁడు. ద్వ. వి: చూ, దూ-ఒడలిదూపాడయుఁడు.

ఒడలుదాఁచుకొనుట. జా. పనిచేయకుండుట "నేఁ జేతఁ బనిపట్టితేఁ జూచియు నేగాఁ దానందు కొను నొడల్దాచుకొనను." (వైజయంతీ విలాసము.)

ఒడలెల్లఁగన్నులు. జా. ఎక్కువవిమర్శ. "సహస్రదృక్తనూ, జుని నొడలెల్లఁ గన్నులుగఁ జూచిరి మానసముల్లరంగఁగని." (విజయ విలాసము.)

ఒడి. దే. వి. 1. గుడ్డదొప్ప, వస్త్రపుటి. "ఒడియందు బియ్యముపోయించుకొని వచ్చినది; బియ్యము ఒడినిండుగ పోయుము, నీతిట్లకు ఒడిపట్టినాను, పువ్వులు పండ్లు ఒడినిండుగ పోసిపంపినది" వ్య. (ఒడి=నడికట్టుచెంగు). చూ, వస్త్రము; 2. ఉత్సంగము, తొడపైభాగము: చూ, క్రోడము; 3. పశుయోని, కటి: చూ, భగము. 12; 4. లక్ష్యముపెట్టి దాఁటినదాఁటు ఉంకింపు "ఒడిదప్పిన పాముఁబోలెనుండఁగ." ఉ, హరి. 3, ఆ: చూ, విజృంభణము

ఒడిఁబ్రాలు. దే. వి. ఒడికట్టుబియ్యము, ఒడికట్టు.

ఒడికట్టు. దే. వి. 1. పాపలగనుతావు: చూ, భగము. 12; 2. కాంచీభూష, ఒంటిపేటగల అందుదాని మొలనూలు, ఒడ్డాణము: చూ, భూషణము. 2; 3. వస్త్రపుటి, గుడ్డదొప్ప: చూ, వస్త్రము; 4. ఒడికట్టుబియ్యము: చూ, ఒడిఁబ్రాలు; అ. క్రి. 5 కడఁగు. "లోకనిందకొడిగట్టితివి." రామా. 5, ఆ; "చ. మాయలకొడిగట్టి." సారం. 3, ఆ. 49: చూ, యత్నించు.

ఒడికట్టుట. జా. సిద్ధపడుట. "లోకనింద కొడిగట్టితిగా." (సారంగధరచరిత్రము.)

ఒడికము. దే. వి. 1. ఉపాయము, అమవు. "చ. ఒడికములోఁ బ్రియత్నమున నొక్క- మహాశిలఁ గొండమీఁదికిన్, గడపఁగ." పంచ. నా. 1, ఆ. 109: చూ, ఠావు; విణ. 2. మనోజ్ఞము, ఒప్పిదమైనది. "చ. కుడిచిన పిమ్మటం గుసుమకోమలి విస్తృతసంస్తరంబుగా, నొడికపు సెజ్జ నేసి ప్రియుఁడొయ్యన యందు శయింపఁదమ్ములం, బిడి చరణంబులొత్తి మదికెక్కిన యంతటిలోఁ దలంచె." భార. ఆర. 5, ఆ. 11: చూ, రమ్యము; 3. యుక్తము, ఇమ్ము. "తంత్రులొక్కరుస దీటి మెట్టులొడికంబుగనొత్తి." ఉ, రా. 5, ఆ. 184: చూ, యోగ్యము. 2

ఒడికారము. దే. వి. ఉద్రేకము. "రగడ. కారణకేయొడికారపుఁగింకను" య. 4, ఆ. 26. చూ, విజృంభణము.

ఒడితాడు. దే. వి. వేఁటాడుటకు తగిన యొకానొక సాధనము, ఉచ్చు: చూ, వాగుర. (చూ, తీపుఁదాఁడు. కాశ. 3, ఆ.)

ఒడిదామర. ద్వ. వి. (ఒడి + తామర.) 1. ఒకరకము చెట్టు: చూ, వృక్షము.

ఒడిదారము. దే. వి. స్త్రీలమొలనూలు. "ద్వి. మొనసి సౌవర్ణటంకములయొడిదారముమనకు గాఁదగదె యమ్ముద్దియఁజేర." భాగ. 10, స్కం: చూ, భూషణము. 2.

ఒడిపిలి. దే. వి. ఆహారవిశేషము. (అప్ర.): చూ, సాదము. 1.

ఒడియు. దే. స. క్రి. 1. అకర్షించు, తిగియు. "సీ. అపవర్గఫలసిద్ధి పాదమైనఁ జేపట్టుకొవడి బహుఫలోత్కరములొడిసి." పాండు. 2, ఆ. 17: చూ, రెమ్ము. 2; అ. క్రి. 2. కొంచెము పైకొగురు. "ఎ. గీ. ఒడిసితలపట్టి తిగిచిమహోగ్రవృత్తిఁ, గొంతుకొసరించుకయు లేక కూలదాఁచె." భార. విరా. 2, ఆ. 128. "ఎ, గీ. పడకతఁడువాని ముందల రొండికి

తిగిచి, పుడమిఁబడఁద్రోచి బలిమినుక్కడఁ గఁబట్టె." శై. 3, ఆ. 113: చూ, లంఘించు.

ఒడివీసనగరము. శా. ఇచ్చట దిఙ్నాగాచార్యుఁడు నివసించెను. ఇది ఓఢ్రదేశమునందున్నది. దీనినే పూరీజగన్నాథమందురు. ప్రాచీనాంధ్రదేశము. 69. పొరటు.

ఒడిశా శా. రూ-ఒరిస్సా. (గో. రామదాసుగారు, బి.యే. మహాశయులు) తమ "ఒడియా, దాని ఉత్పత్తి." అను శీర్షముగల ప్రబంధమందు ఉడ్రులకు క్రీ॥ శ॥ 7 వ శతాబ్ద పూర్వమున స్థానమిచ్చుట కెందుకొప్పుకొనరో మాకెంత మాత్ర మవగాహనముగాదు......ఈ ఉడ్రదేశమునకు కాలక్రమమున ఒడిశాయని పేరునొందినదని చెప్పినచో నది కేవలము బాహుళ్యము. కళింగ. 299, 300. పొరటులు.

ఒడిస. దే. వి. ఆవిధము: చూ, వైధనిక.

ఒడిసియ. దే. వి. 1. —పై— (రూ-ఒడిసె.) 2. ఒడిసెగడ్డ. (రూ- ఒడిసె.)

ఒడిసె. దే. వి. —పై.—

ఒడిసెల. ద్వ. వి. రాలు విసరివేయుటకై యేర్పఱుపఁబడిన యొకవిధమగు త్రాడు. "ఒనరు గొంచనముల నొడిసెలలను జాలంగసెందును సవరించుట." హరి. ఉ. 2, ఆ; "చ. ఒడిసెలరాతి చందమున నుగ్వడిపింగిణి కోలవాఱుకై, వడిలగుడాఁకటం బఱచువైఖరి" సారం. 1, ఆ. 93: చూ, క్షేపణి.

ఒడిసెలకాఁడు. ద్వ. వి. ఒడిసెలవేయువాఁడు. "ఒడిసెలకాండ్రను నొడ్డుడెందు." హరి. ఉ. 1, ఆ.

ఒడుగు. వా. వడుగు, ఉపనయనము.

ఒడుగుపెండ్లికొడుకు. వా వడుగుపెండ్లికొడుకు.

ఒడుచు. దే. క్రి. ఓడించు. "పారిజాతంబుఁ గొనుపెడఁ దొడరిన్వృత్ర. భేదినోడించితి" హరి. ఉ. 8, ఆ; "ఆ. పాండుపుత్రనీవు బ్రహ్మచర్యస్థుండ,వగుటఁ జేసి మన్మథార్తినన్నొ, డిచితెందు." భార. ఆది. 7, ఆ. 68; భార. ఆది. 8, ఆ. 16; భార. ఆది. 8, ఆ. 206: చూ, జయించు.

ఒడుదొడుకు. దే. వి. 1. వైషమ్యము, సమము కామి. "క. తరుణీమణి జఘనమునకు, దొర గాక తృణంబుఁబూని తుదిలేకవనుం ధర యొడుదొడుకులఁ బడుమహీ,ధరములు చట్టువడి తావుతగలకయుండుట." రసి. 2, ఆ. 98: చూ, వైషమ్యము; విణ. 2. ఇక్కట్టు, సంకటము. "వ. అడవికడ కొత్తికొనిపడచి యొడుదొడుకగుడు." స్వా. 4, ఆ: చూ, అంగద; విణ. 3. సమముకానిది: చూ, విషమము.

ఒడుపరితనము. దే. వి: చూ, తుంటరితనము.

ఒడుపు. దే. వి. 1. లక్ష్యముపెట్టి దాఁటినదాఁటు. "ద్వి. ఒడుపుఁదప్పినయట్టి యురగంబుఁ బోలె." హరిశ్చ 1, ఆ. 465: చూ, విజృంభణము; 2. పూనిక. "వ. అయ్యొడుపుదప్పింప నొందుతెరవుదొరకమిఁ దానట్లోడంబడి." భో. 4, ఆ. 268: చూ, యత్నము; 3. అధికము, లాభము: చూ, హెరాళము; 4. సమయనిరీక్షణము. "ఎలుకకై పిల్లి ఒడుపుకాచుచున్నది."

ఒడ్డగ. దే. వి. రెండిత్తికొమ్ములుజతచేసి యేర్పఱిచిన ఆయుధము: చూ, బాణము. 1.

ఒడ్డగిలు దే. అ. క్రి. 1. రూ- ఒడ్డగిల్లు. అవనతమగు: చూ, వ్రాలు. 6; 2. రూ- ఒడ్డగిల్లు అతిశయించు: చూ, మిమ్మరించు; 3. రూ-ఒడ్డగిల్లు. నీటిబొట్టులోనగునవి లోపలనుండి పైకుబుకు, ఉప్పొంగు: చూ, బుగులుకొను.

ఒడ్డగిల్లు. దే. అ. క్రి: చూ, రూ- ఒడ్డగిలు. (అవనతమగు.— "క. వాపుడువిభీషణుం

డో, హాసవిరాలాపములను రొూడించితిరే, పైవచ్చిన బలవంతుల, నావసధియునొడ్డగిల్లి నట్లునెయుండెన్." రామా. 7, ఆ. 56; అతిశయించు.— "క. అపుడ,ప్పల భుక్కుల కన్యకన్య ఫలభుక్కులకున్, గలనయ్యెవందుఁ బైకొని, గెలుపునఁగపిభటులొడ్డ గిలదొరకొని నన్." రామా. 8, ఆ. 54: చూ, ముమ్మరించు; ఉప్పొంగు.— "క. బిడ్డఁడు మ్రొక్కఁదల్లులు, జెడ్డననంశములనునిచిచన్నులతుది బ్రాలొడ్డగిలఁ బ్రేమభరమున, జిడ్డువడందడి సిరతిజలములననఘా." భాగ. 1, స్కం. 260.)

ఒడ్డగెడవు. దే. వి. ఒకప్రక్క క్రిందికొఱగి మతియొకప్రక్క పైకి లేచుట. "గీ. కడనె హాయములొడ్డ గెడనయ్యెరథములు, చాఁపకట్టువడియె." భార. భీష్మ. 2, ఆ. 165; "క భూమియొడ్డగెడపై యుండఁగ." పర. 1, ఆ 53: వాటుపడుట.

ఒడ్డణము. దే. వి. 1. రూ- ఒడ్డాణము. కాంచీ భూష: చూ, భూషణము. 2; 2. రూ-ఒడ్డనము, పోవారము: చూ, వ్యూహము.

ఒడ్డన. దే. వి. 1.—పై.—; 2. వడ్డించుట. విస్తరియందు అన్నాదులుంచుట. (వా): చూ, రూ- వడ్డన.

ఒడ్డనము. వై. వి. 1.= అడ్డనమ్. అడ్డాణము, డాలు, అండనము. "చ. నొ,డ్డనమున నాఁగియాఁగి." హరి. ఉ. 7, ఆ. 228: చూ, హరిగ; 2.= అడ్డనమ్. అడ్డాణము, బెత్తములోనగు వానిచే చేయఁబడిన కేడెము. "చ. పలుకలు నొడ్డనంబులును." ఉ, హరి. 6, ఆ. 59: చూ, హరిగ; 3. మొగ్గరము. "క. అప్రరూపములగు మాఱొ,డ్డనములు." భాగ. భీష్మ. 2, ఆ. 26: చూ, వ్యూహము; 4. పందెము.

"గీ. వాహనంబులు...... లసువులు నొడ్డనములు, గాఁగఁబోరెడు నీమ్యాతకర్మమందు" భాగ. 6, స్కం 416: చూ, వ్యవహారము. 4.

ఒడ్డము. దే. వి. మొగ్గరము: చూ, వ్యూహము.

ఒడ్డాణము. వై. వి 1 = ఓఢ్యాణ. రూ- ఒడ్డణము. స్త్రీలు నడుమున బిగికై ధరించు కొనెడు బంగారులోనగువాని పట్టెడ. "సీ. మొలనూలు నొడ్డాణమును." కళా. 7, ఆ. 66: చూ, భూషణము. 3; 2. రోగులు జందెముపలె వేసికొనెడి పట్టులోనగువానితో నేసినపట్టె. "సీ. ఐణేయమైన యొడ్డాణంబుల నణిచేపక్కలించిన పొట్టమక్కలించి" స్వా. 1, ఆ. 59: చూ, యోగపట్టె; పా. 3. పేరు యొక్క అడ్డుచీలికలోని యొకభాగము. (పెరికిల్)

ఒడ్డాది. వై. వి. 1.= ఓఢ్ర. ఓఢ్రదేశము: చూ, దేశము; 2. విశాఖపట్టణమండలములోని వీరవిల్లి తాలూకాయందలి నొక గ్రామము; (వడ్డాది.) శా. 3. శక 1334 నాటి సం: 829 శాసనములో ఒడ్డాదివీరార్జున దేవులకొడుకు ప్రతాపార్జున దేవులు మహామండలేశ్వరులని పేర్కొనఁబడెను. కళింగ. 641. పుట.

ఒడ్డాది అర్జునదేవరాజు. శా. కళింగపరీక్షపాత్రి శ్రీధర్మదాసజీయన అధికారమున ఒడ్డాది అర్జునదేవరాజు ధర్మములుజేసెను. కళింగ 634. పుట.

ఒడ్డాది చోడవరము. శా. శ్రీనరసింహభారతిముని ఒడ్డాదిచోడవరమున రెండుపుట్లు నేల ధర్మము జేసెను. కళింగ. 634. పుట.

ఒడ్డాది జయంతరాజు. శా. మత్స్యకులవంశీయుఁడగు ఒడ్డాది జయంతరాజు శ్రీనరహరితీర్థ శ్రీపాదములు అనుసంధానమున ధర్మము జేసెను. కళింగ. 628. పుట.

ఒడ్డాదిమత్స్యవంశీయులు. శా. ఒడ్డాదిఁ నేలుచుండిన మత్స్యవంశపురాజులుగూడ కళింగగాంగులకు సామంతులుఁగ నుండిరి. వీరును క్రీ. 13-14-15 శతాబ్దములలో స్వరాజ్య మేలుకొనుచు దానశాసనముల నొసంగుచుండిరి. వీరి దిబ్బిడి తామ్రశాసనమును బట్టియు సింహాచలాలయమున నున్న శిలాశాసనములను బట్టియు శ్రీకూర్మాలయశాసనములను బట్టియు ద్రాక్షారామాలయ శాసనములను బట్టియు వీరి వంశావళి కాలక్రమములు క్రిందివిధమునఁ దెలియును. జయంత.—అర్జున, అన్నమరాజ, మార్కాదిత్య; అర్జున — జయంత; జయంత.— అర్జున; అర్జున:— జయంత; జయంత.— వీరార్జున; వీరార్జున.—ప్రతాపార్జున; ప్రతాపార్జున— ప్రతాపశ్రీవల్లభరాయఁడు. ఇత్యాది. కళింగ. 644 పారటు; ద్రాక్షారామ శాసనములు, సం॥లు 1269-1374, ఒడ్డాది జంతఋనాడు, సరుడవాడు దేశాధికారులు పరాంతకదేవుని గొల్చుటకై నిశ్చయించుకొని, ఒట్లు పెట్టుకొనినట్లు తెలుపుచున్నది. ఇత్యాది. కళింగ. 644 పారటు.

ఒడ్డారము, దే. వి 1. ఒఱగోడ్డెము: చూ, వంకరమాటు; 2. పగ. "వ. మనకునక్క చెలియలి బిడ్డలకు నొడ్డారంబులేమిటికి." భాగ. 8, స్కం: చూ, విరోధము. 1; 3. ప్రతిఘటనము. "వ. చుఱుకుమినుకులని కొడుకుకడకుంజని భయరసంబులొలుకం బలుకులు పలికినంగసరి వినకరాక యొడ్డారంబులొడ్డనేని." రామా. 6, ఆ. 42: చూ, మాఱొడ్డు. 1.

ఒడ్డారించు. దే. అ. క్రి. 1. పగఁగొను. "ద్వి. ఎదిరి యొడ్డారింప నెవ్వరివశము." హరిశ్చ. 1, ఆ: చూ, విరోధించు; 2. ప్రతిఘటించు. "క. ఒడ్డారించి విమంబున, కడ్డము చనుదెంచి కావనధిపులులేమిస్." భాగ. 8, స్కం: చూ, మాఱొడ్డు. 2.

ఒడ్డి. దే. వి. ఉడ్డీనగతిగల పావురాయి: చూ, పావురము.

ఒడ్డిక. దే. వి. పారావతము: చూ, పావురము,

ఒడ్డిమి. దే. వి. పందెము. "వ. ఆశకునియాడి యుధిష్ఠిరుండొడ్డిన యొడ్డిమియు గెలుచుచు వచ్చి." భార. ఉద్యో. 1, ఆ 22: చూ, వ్యవహారము. 4.

ఒడ్డియ. వై. వి.=ఓఢ్రః: రూ—ఒడ్డె, ఒడ్డెవాఁడు. (సం. ప):—ఓఢుఁడు.

ఒడ్డీఁడు. వై. వి. 1.=ఓఢ్రః. ఓఢ్రదేశపురాజు: చూ, రాజు. 1; 2. ఉడ్డీనగతిగల పావురాయి. "సీ. ఘనమైనకండ క్రొవ్వునఁ బాఱుతెంచిన యొడ్డీని మెనలావు లూడఁదన్ని." (ఇక్కడ శ్లేష.) శై. 1, ఆ. 45; "క, మేలైన లకోరీలొడ్డీలుం." సారం. 1, ఆ. 117: చూ, పావురము.

ఒడ్డు. దే. వి. 1. ఓర, దరి: చూ, తీరము; 2. విగ్రహము. "ఉ. ఎక్కలుసించి కంతమున నీకులువాపి శిరంబువ్రచ్చి పే, రుక్కునఁ గ్రొంచెచందమగు నొడ్డు గలంగఁగఁజేసి." భార. భీష్మ. 2, ఆ. 80: చూ, వ్యూహము; 3. పందెము. "వ. తనకొడుకు విరోచనుండు నంగిరసుండను విప్రకొడుకు సుధన్వుండును దమతమ ప్రాణంబులొడ్డుగానొడ్డి." భార. ఉద్యో. 2, ఆ. 68: చూ, వ్యవహారము. 4; 4. ఫ్రానిక. "మ. ఒక్కరొయ్యొడ్డున బాష్పంబు ఝరంబులుప్పతిల బోటుంబాటుగా నెంతయుం." స్వా. 3, ఆ. 186: చూ, యత్నము; 5. అడ్డపాటు. "క. బిడ్డనిఁగరముల నొమ్మన, నడ్డంబుగఁబట్టి పదముల్లన నిడుచుం, జడ్డనఁగావలివారల, యొడ్డుగడచి పురిటిసాలయొయ్యన వెడలెం." భాగ. 10

స్కం. పూ. 140: చూ, నిరోధము. 1; వై.స. 6.=ఏకః. అన్యుఁడు "సీ. ఏమర్థినాసఁగి నట్టి, వృత్తులు సెల్లునే ఒత్తొరవొడ్డులవలనఁ బుట్టుమగఁడా." భార. ఉద్యో. 1, ఆ 278: చూ, పరాయివాఁడు; 7. ఏ.=ఏకః. ఏక కుఁడు. చూ, ఒకఁడు. 8; దే. విశ. 8. లావు. "వాఁడొడ్డుపొడుగుగాఁ బెరిగినాఁడు.": చూ, స్థూలము. 2; 9. విశాలము, ఇమ్ము "వ. పయోధికన్య బిడ్డలుంబోని యొడ్డుచెఱువులచేతను." భీ. 1, ఆ. 110: చూ, విస్తారము; 10 ఎక్కువ. "సీ. ఒడ్డుగానిట్టూర్పు లోలయఁబొగులు, నిచ్చెయొత్తిఁగిన రతికేళి మెచ్చి." స్వా. 3, ఆ. 122; 11. విచ్చలవిడియైనది పెద్దదైనది. "ఒడ్డోలగము.": చూ, విపులము; స. క్రి. 12: పందెము వేయు. "క. కలధనములెల్ల నొడ్డుచు." భార. అర. 2, ఆ. 61; "వ. వివిధ వస్తువాహన నివహంబులొడ్డి." భార. ఆ. 2, ఆ. 62: చూ, పందెమిడు; 13. (వల)పఱచు. "గీ. ఇందఱకు నిన్నిభంగుల...దాయలొడ్డిన మాయాజూదంపు టురులఁ, బడి." భార. విరా. 2, ఆ. 225: చూ, పఱచు; 14. దాఁగఁ జేయు. "గీ అననాతఁడు భయమంది యాత్మ లోన, నొరులయీగికి నకటచే యొడ్డకుండు, నట్టివానికి." భార. శాంతి. 4, ఆ. 158: చూ, చేఁపు; 15. (చక్కఁగా వినుటకు) మొన యించు. "గీ. ఇత్తెఱంగు, పాడిగాఁగఁబూని పలుకంగఁ జెవియొడ్డి యాదరించువారిసందుఁ గాక." భార. ఉద్యో. 1, ఆ. 23: చూ, మొనయించు; 16. అడ్డగించు. "దుర్మద, క్రీడఁ జరించు రాజు హరకేళవు లొడ్డినఁగావ." భాగ. 1, స్కం. 478: చూ, నిరోధించు; 17. దాఁటు. "వేగవత్యొడ్డి యల్లనవెడలి." భార. శాంతి. 8, ఆ. 307: చూ, తరించు.

ఒడ్డుగుండ్లు. దే. వి. బ. 1. ఒకానొక బాలికా క్రీడ: చూ, బాలికాక్రీడ. 2. అచ్చనగండ్లాడెడు చిన్నచిన్న గుండుఱాళ్లు: చూ, గిరియ కను.

ఒడ్డువిడుపు. ద్వ. వి. ఒకానొక బాలక్రీడ.

ఒడ్డె. వై. వి =ఓఢ్రః: చూ, రూ =ఒడ్డియ.

ఒడ్డెరాజులు. శా. అనంతవర్మ తామ్రశాసనము (బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు.) శ్రీకృష్ణదేవరాయలవారిచేఁ బరాజితుఁడై తన కొమార్తె నారాజేంద్రునకర్పించి శరణాగతుఁడైనవాఁడు తెనుఁగుదేశమును బాలించిన యొడ్డెరాజులలోఁ గడపటివాఁడనగు ప్రతాపరుద్రగజపతిది యీశాసనము. ఇత్యాది. కలింగచరిత్రానుబంధము. 97.

ఒడ్డెవాఁడు ద్వ. వి: చూ ఒడ్డె. (వై వి.= ఓఢ్రః. పురుషోత్తమకవీయము )

ఒడ్డోఱకము. దే విశ. (ఒడ్డు + ఒఱకము.) (ఎగుడుదిగుడైన) భూమి: చూ, భూమి. 1.

ఒడ్డోలగము. ద్వ.వి. పేరోలగము' చూ, సభ.2.

ఒత్తగిల్లు. దే. అ. క్రి. 1. ప్రక్కకొఱగు. "గీ. ఒత్తగిలి యీద." కవిక 4, ఆ: చూ, జరగు; 2. అవనతమగు, ఒఱగు. "చ చెలి భుజపీఠినొత్తగిలి." స్వా. 5, ఆ. 67: చూ, వ్రాలు. 6; ౩. అతుకు. "సీ ఘ్రాణంబు నీచమై కన్నులు వెల్లనై యుదరంబుపీఁపుతో నొత్తగిల్ల." కాశీ. 6, ఆ. 41: చూ, సంధించు. 8; (ఒత్తగిల్లు అను శబ్దమునుబట్టి పిన్న పెద్దతనములీ క్రిందిసందర్భముగా మాఱును. తండ్రియెడలను సోదరులయెడలను అంటి మసలవచ్చుననియు, తల్లియెడలను సోదరీలయెడలను కొద్దిదూరముగనుండిమసలవచ్చుననియు, బావగారు మామగారు మున్నగు పెద్దల యెడల దూరముగనుండి మసలవచ్చుననియు బోధిం

మనః. సందర్భానుసారముగా పెక్కు భావము లుదయించును.)

**ఒత్తడము.** దే. వి 1. ఒత్తుడు: చూ, పీడనము; విణ. 2. ఒత్తు, బహుళము: చూ, మొత్తము.

**ఒత్తడి.** దే. వి. 1. రాపు. "ఒండొరుల యొత్తడిం బొడిపొడియై." స్వా. 5, ఆ. 71: చూ, పీడనము; 2 తఱుచుఁదనము. "సీ ఒడికంపు సరిగ యొత్తడి సరంబునమించు" చంద్రా 2, ఆ. 69: చూ, మునుము; 3 బాధ, కక్కసము, వగ: చూ, దుఃఖము.

**ఒత్తగము.** దే. వి. ఉద్రేకము, మున్మురము. "వ. అప్పుడమిత్రుఁడు రెండు వెడంద వాతి తూపుల నతనికాళ్లు గత్తిరించి యయ్యత్తగము నొత్తరము కుఱుచేపఱిచిన" రామా. 8, ఆ: చూ, విజృంభణము

**ఒత్తరించు.** వై. స. క్రి. 1.=ఉత్తరణమ్. అతిక్రమించు, మించు. "సీ. వితతవీరాగ్రహావేశాతి దర్పితచిత్తులై యొండొరు నొత్తరించు, నుగ్రమహోద్ధతి." భార. శల్య. 2, ఆ. 262: చూ, దాఁటు 6; 2. ఆక్రమించు, ఒత్తుకొను "గీ యువమనోజాంగలక్షేత్ర మొత్తరించి గరుసువడదున్న మదనలాంగలి కుహలము, కామినీమణిముక్కు" పాండు. 3, ఆ. 195: చూ, మొంగరించు.

**ఒత్తడి.** పా పీడనము. (వ్రిమర్.)

**ఒత్తియాడు.** దే. స క్రి. (ఒత్తి+ఆడు.) అడఁగఁజేయు, ఒత్తు "చ. గురుకుచకుంభచన్నుఁగవ...జిగితాళపుఁజిప్పల నొత్తియాడుఁదా, మరవిరిమొగ్గ గుత్తిఁబలుమాఱును తేకుమడంచు నెంతయున్." చంద్రా. 2, ఆ: చూ, పిసుకు. 3.

**ఒత్తిలి.** దే. అవ్య. 1. గట్టిగా. "ఉ. చిత్తజరాజ్యసంపద యశేషము గైకొని ... లీలమై, నొత్తిలి మోయ" విక్ర. 1, ఆ. 94: చూ, బిగ్గర; 2. పట్టుగా. "క. ఏనిదియంతయు నెఱుఁగుదుఁ, గాన...కలిమికిఁ గా నొత్తిలి దేవగుహ్యాంతియుఁ దెలిపితిన్." భార. స్త్రీ. 1, ఆ. 87: చూ, పట్టుగా.

**ఒత్తిలు.** దే. అ. క్రి. ప్రక్కకొఱగు. "ఒత్తిలిరి త్తవైకొనుచు.": చూ, జరగు (రూ-ఒత్తిల్లు.)

**ఒత్తు.** దే. వి. 1. ఒత్తుడు. "సీ. చేదోయి యొత్తునఁ జేసి నెత్తురులైన యవయవంబులు నొరసిక చేయు" సై. 2, ఆ. 5 చూ, పీడనము; 2. తఱుచుఁదనము. "వ మట్టలెత్తుకొని యొత్తుగల పొదరుటడవులు చొఱంబాఱు పిడికిడితి కదుపునకవడికి వితెగిపడిన." స్వా. 4, ఆ. 87: చూ, మునుము; 3. మెత్త. "సీ. పసిఁడికుందియనలోపలఁ బట్టుపొత్తుల యొత్తున నొఱగి కూర్చుండ నేర్చె." వి, పు. 7, ఆ. 125: చూ, శయ్య. 1; 4. ఆక్రమణము, ఆఱుము. "వ. పరులయొత్తులేని రాజ్యంబు భూజ్యమహిమంబరఁగు వనవాసంబునంగుందిన కౌంతేయులం దడయక తెచ్చి." భార. ఉద్యో. 2, ఆ. 89: చూ, పురి. 4; విణ. 5 బహుళము, తఱుచు. "ఉ. ఒత్తుగ మాంసమున్ మడుఁగుటోగిరమున్ ఘృతశర్కరాదులున్, గుత్తుక బంటిమేసి." హరిశ్చ. 1, ఆ. 140: చూ, మొత్తము; 6. పాలసంయోగము, కూడుకొన్నది, జడ్డ, జొడ్డ: చూ, సంయుక్తము; అ. క్రి. 7. పొడుచుకొను, గ్రుచ్చు. "ఆ. కేలఁగండ్లులొత్త నిద్రవోయినయది, తల్లికంటెనిద్రఁ దగిలిసుతులు." భార. ఆది. 6, ఆ. 179: చూ, మొలవేయు; 8. ప్రక్కకొఱగు, ఒఱగు. "చ. గరువపు కొత్తఁ కెంగలువ చ్చు ఘటించిన పాళిఁజుట్టెఁ జెంది రిక తెఱంగునంబసిఁడితీఁగలునించిన శిల్లపొగ బంభరసభ వాసవాపవన పొరణఁ దేల నలందెఁగ

త్తురికా." స్వా. 5, ఆ. 58: చూ, జరగు; 9. ఘనమగు, దట్టమగు. "ఉ. ఉల్లము ప్రక్కలై కలఁగనొత్తిన మూర్ఛవహించి ధారుణిం, ద్రెళ్లినఁ జేరియుత్తరుణిఁ జేర్చి." జై. 7, ఆ. 50: చూ, వ్యాపించు; స. క్రి. 10. అడఁగఁజేయు, అణఁచు. "రథముద్దండాగ్రతుండంబునంబట్టుగ్రిందికి నొత్తు నెత్తు." రా. అర. 2, ఆ. 180: చూ, పిసుకు. 3; 11. (కాళ్లు.) పిసుకు. "గీ. కుడుపునిద్రయు వర్జించి యడుగులొత్తుచుండిరి." భార. అను. 2, ఆ. 302: చూ, పిసుకు. 1; 12. (శంఖము) ఊఁదు. "చ. పిడుగుల పిండుబిట్టులియు పెల్లునఁ బార్థుఁడు శంఖమొత్తినన్." భార. విరా. 4, ఆ, 171: చూ, పట్టు 27; 13. బలాత్కరించు. "క అనుఁడు విదురుఁడాతనికిట్లనియె యినన్ను నొత్తియడిగినఁ జెప్పంజనుమన్న రూపు సెప్పెద, వినుమవధానంబుతోడ విమల విచారా." భార. ఉద్యో. 2, ఆ 51: చూ, బలాత్కారించు; 14. (పంట) నొక్కు. "మోవిదంతశిఖనొత్తె" కళా. 1, ఆ. 98: చూ, మూకొను; 15. తడిపోవనొత్తు, తుడుచు. "క. అశ్రులం మతి, యునుగ్రమ్మంగరతలమునవొత్తుచుఁజూచున్." భార. మూ. 1, ఆ. 164: చూ, ప్రాము 4; 16. నిరాకరించు, త్రోయు. "చ. ఒదవెడిజీవ్వనంబు వెలికొత్తఁగఁ బయ్యెదపిగ్గుఁ గూడిబిట్టుదుమఁగ." ఆము. 5, ఆ. 21: చూ, నిషేధించు, 17. చేర్చు "క. అత్తతిగంధర్వ విభుండత్తామరసాక్షి వదన మక్కునఁగ్రుపతో, నొత్తి మొగమెత్తి." స్వా. 8, ఆ. 136: చూ, సంధించు. 3; 18. దిద్దు, తీర్చు. "వ. అష్టాంగలిపిత్తులబమ పీఠికడి యులుపులకు వంకలొత్తి మాటుసెప్పటయు నొప్పకయుండు పెడంగులగుటం గార్యవచనంబు లెఱుంగరు." భార. ఉద్యో. 3, ఆ. 235: చూ, సవరించు; 19. ఆక్రమించు, అలము. "క. అనదతనంబును బెడిద పుఁదనమును లేకుండఁ బరఁగిదరి యొత్తెడు నే, ణుమటోలె నొత్తవలయును, మనుజేంద్రుఁడు మార్తురంగ్రమంబున సధిపా." భార. శాంతి. 3, ఆ 24: చూ, మొగరించు; 20. (అంట్లు) త్రొక్కు. "సీ. అంట్లొత్తువేళల నంట్లొత్తునెలమి గాన్పించుఁ గొమ్మల వంచివంచి." కళా. 4, ఆ. 78: చూ, త్రొక్కు 3.

ఒత్తుకమ్మి. ద్వ వి బొద్దులకు ప్రక్కలకమ్మి వలె చేర్పఁబడు తదవయవవిశేషము.

ఒత్తుకాఁడు దే. వి. సుతిపోయువాఁడు, తిత్తి పోయువాఁడు. "వ. అతండు సుగుణధ్వని తంత్రీనాదంబుగా నావిండ్లవారొత్తుకాఁడుగా గాండీవంబు వీణగా వినోదంబు సలిపె." భార. విరా. 5, ఆ: చూ, సుతికాఁడు.

ఒత్తుకొను. దే. అ. క్రి 1. పొడుచుకొను, నాటు: చూ, మొలవేయు; 2. (మార్గమునుండి) తొలఁగు: చూ, విరియు. 5; స. క్రి. 3. ఆక్రమించు, అలము. "క. వారు దెసలొత్తికొనియుధ, రారాజ్యంబిచ్చి పోయిరో పోకో, తారణ్య పీడఁబడియునొ." భార. ఉద్యో. 2, ఆ. 204: చూ, మొగరించు.

ఒత్తుడు. దే. వి. 1. ఒత్తడము "ఉ. ఎవ్వ రెం, బెట్టిన వాఁడవో హృదయపీఠిక దానికి నొత్తుడౌఁ బుమీ" కవిక. 4, ఆ. 51: చూ, పీడనము; 2. కాకితములోనగునది వ్రాయునప్పుడు మెత్తనకై దానిక్రింద నుంచుకొనఁబడు అట్టలోనగునది. "ఒత్తుడు పెట్టుకొని వ్రాయుము." (ఒత్తుపెట్టుకొని అనియు వాడుక.); పా. 3. (ప్రెషర్) ఒత్తిడి.

ఒత్తు-పలుచన. పా. "ఒత్తువాములకు గోరును, పలుచన పాఁతలకుఁ గోరును." అను సామెత ననుసరించి పారవంతమైన చేలలో పలుచనగను,

పారహీరమైన నేలలలో ఒత్తుగను వరిలోనగు నవి చల్లవలెను. (ఊడ్పింపవలెను.)

ఒత్తువానులనుగోరును, పలుచేనపాతఱలు గోరును. లో. ఒత్తుగాడూడ్చిన కసవుఁగుప్ప పెచ్చుగుననియు, పలుచేనగా ఊడ్చిన పంటపెచ్చి పాతఱలు నిండుననియు భావము.

ఒత్తులు. దే వి. బ. బిడ్డలచేతుల నగ. "ఒత్తులు పాటీలను మించియున్నవి.": చూ, భూష ణము. 2.

ఒత్తువడు. ద్వ. అ. క్రి. (ఒత్తు + పడు.) అణు ముడుపడు. "ఎ, గీ. ఒత్తువడికొంచవాది ధాతూచ్చయముల, రసముజొచ్చిల" హరి పూ. 7, ఆ. 179: చూ, పీడితమగు.

ఒత్తెడుపిల్లి. ద్వ. వి గంధమార్జాలము, పునుఁగు పిల్లి: చూ, మార్జాలము.

ఒత్తొరవు. దే. వి. (ఒత్తు + ఒగవు.) మిక్కిలియదుముడు, సంపీడనము. "సీ. ప్రజఁదల్లిదండ్రుల పగిదిబాలింపుదే పములొత్తొరవులేక బ్రతుకునట్లు." విక్ర. 4, ఆ. 7: చూ, పీడనము.

ఒదరు. దే. అ. క్రి. 1. పొంగారు. "సీ. వలతురై నిగిడెడు వలుదతొండములచే నొదరిచే పాఁచుమృత్యువులుఁబోరె." లక్ష్మి. 4, ఆ. 46: చూ, విజృంభించు; 2 తొట్రుపడు. "ద్వి. అనవుడు రోషతామ్రితుఁడై చూచి, కనలుచుఁ గటములుత్కటములై యదర, నొదరెల్లఁగంపింప నొదరుచుఁబలికె." రా. బాల, కాం: చూ, సంభ్రమించు; స. క్రి. 3. దూఱు. "దుర్యోధనుండు విదురుందూలనొదరి." భార. సభా. 2 ఆ: చూ, నిందించు.

ఒదరుచు. దే. స. క్రి. ఊడదీయు. "ఉ. కంటకముల్ పదాబ్జములఁగాఁడ నొదర్చిన నొప్పిఁగూయిడక్." అను 3, ఆ. 38: చూ, ఊలుచు. (రూ- ఒదర్చు.)

ఒదలు. దే. అ. క్రి. రూ- పొదలు. "గీ. అనిన వాచంద్రిపాళి వాక్యములభంగి, భూరినియమముతో నభిచారహోమ, మొందలగావింప నగ్నియథోచితముగఁ, జెలఁగిదక్షిణపలమాన శిఖల వెలిగె." భాగ. 10, స్కం ఉ. 58 2 చూ, వర్ధిల్లు.

ఒదవు. దే అ. క్రి. 1 = ఉదయించు, కలుగు, జనించు. "క. పారుష్యపమార్గక చేబర మెదురఁగని రొదవు శోకమునక్." జై. 7, ఆ 120: చూ, పుట్టు. 2; 2. ఉపయోగించు, అమరు. "సీ. సఫలమీతురగంబు జన్మంబు ధర్మజుం డొసరించు క్రతువున కొదవెఁగాన" జై. 3, ఆ. 17: చూ, పొందుపడు; 3. యుక్తమగు, అనువుపడు. "క. ఇదియింతయుఁ దగఁగని కొని, మదినిప్పారంపు విద్య మరగక బంధచ్ఛిదఁజేయునాత్మ విద్యకు, నొదవఁదొడఁగి వాఁడ నడుగనుద్యగ మెట్లుక్." లక్ష్మి. 4, ఆ. 162: చూ, సరిపడు. 2. (రూ- ఒదగుఅని పురుషోత్తమకవీయము.)

ఒదవుబడి. ద్వ. వి. 1. రూ-ఒనవుబడి. నింపు: చూ, సమృద్ధి; విశే. 2. ఒదవుబడియైనది, ఉపయోగమైనది, పెరిగినది: చూ, పుష్కలము. 4.

ఒదిఁగిలు. దే. అ. క్రి ఒత్తిగిలు, ప్రక్కకొఱగు. "చ ఒదిఁగిలి పాన్పుపైఁబటిక నొయ్యనఁగేలు తలాఁపుచేసి" "ఉ. హరి. 5, ఆ. 204: చూ, జేరగు.

ఒదిగిల్లు. దే. వి. బ. ఒదిగిలుటలు.

ఒదివిరిపాలు. దే. వి. బ. ఒకరకము వడ్లు. "సీ. కొత్తగోదియల దియ్యమువడ్లు పెనువడ్లు, నొదివిరిపాలును గొనరఁగఁబోసి చాఁపపంచెములమీఁద బలియఁగట్టు." హరి. పూ. 6, ఆ. 22: చూ, ధాన్యము.

ఒదుఁగఁబాఱు. దే. అ. క్రి. (ఒదుఁగన్ + పాఱు.) ఒదుఁగు, తొలఁగు. "బ్రాహ్మణుం డొదుఁగఁబాఱకనిల్చి." భార. అను. 3, ఆ. 261: చూ, విరియు. 5.

ఒదుఁగు. దే. అ. క్రి. —పై.— "గొరిజేల త్రొక్కనం బ్రిదిలికుండలిభర్త యొదుఁగ." లక్ష్మి. 3 ఆ. 36.

ఒదుఁగువడు దే అ. క్రి. —పై— "క. ఒదుఁగువడ యోజనత్రయ, ము దలంబగు విమతసైన్యముల నీరీతిన్ మదమడఁచి కృష్ణపార్థుల, నెమరంబోడఁగాంచి." జై. 5, ఆ. 58

ఒదుఁగువాటు. ద్వ. వి. అపసరణము, తొలఁగుట: చూ, విమోచనము.

ఒదుగు. దే. వి. 1. రూ-ఒదువు, నింపు: చూ, సమృద్ధి; విశే. 2. రూ-ఒదువు, ఒదవుబడియైనది. "క. ముల్లుదలకొనని నవకపుఁ, బల్లవములతోడ ముక్తిభామ చెవులకుం, బల్లేరుపూవులగుపువ్వు, లుల్లసిలు నలర్కనాక మొదుగుగఁగొనుచున్." ఆము. 4, ఆ. 195: చూ, సమృద్ధము; అ. క్రి. 3 రూ-ఒదువు, ఉపయోగించు: చూ, సమృద్ధమగు.

ఒదుగుబడి. దే. వి. రూ-ఒదువుబడి, తామరతంపము, నింపు: చూ, సమృద్ధి

ఒదువు దే. వి. 1. —పై.—; విశే. 2. రూ-ఒదుగు, ఒదవుబడియైనది: చూ, సమృద్ధము; అ. క్రి. 3. రూ-ఒదుగు, ఉపయోగించు: చూ, సమృద్ధమగు; 4. రూ-పొదువు, క్రమ్ము. "గీ. అతని ముందఱఁ బార్శ్వంబులందుఁ బిఱుఁద, నొక్కయుమ్మడిఁ బెక్కండ్రుదురుక్షు మిగిలి, యురవడించినదేవిపై నుగ్రదివిజు, లొదువఁ జేరల్కఁ బెదవు లాండ్రొండయదర." మార్క. 6, ఆ. 90: చూ, వ్యాపించు.

ఒదువుబడి. దే. వి: చూ, రూ-ఒదుగుబడి.

ఒద్ద. దే. వి. దాపు. "క. వచ్చెను భృగుసం, దనుఁడు నిజనందనుఁ బ్రియ, మొనరింపఁగఁ దలఁచి దానియొద్దకుఁ బ్రీతిన్." భార. ఆది.3 ఆ. 165; తే అతని దీవించి నీవుపొమ్మచటికేము, నరుగుదెంచెదమని ప్రీతినమపనరిగి, యొక్క పుణ్యాశ్రమంబున యొద్దియేటు, విడిసిదివస పరివర్తన విధులునడపి." భార. ఉద్యో. 3, ఆ. 146: చూ, సమీపము.

ఒద్ది. దే. వి. అజశృంగి*: చూ, రూ-వద్ది. (దీని గింజలను అరబ్బీలో హుబ్బుల్ బాన్ అని అందురు. ఈగింజలకు కాంతి సోపును, లేదా తాళిసపత్రియును ఉపయోగింపవలెను. దీని పట్టుపాడుము వేపనూనెలోకలిపి వ్రాసిన పుండ్లుమానును దీనిజిగురు కీళ్లనొప్పులకు మేలు. ఇది ఉబ్బసములకును వాడెదరు.)

ఒద్దిక. దే. వి 1. రూ-ఒందిక, చెలిమి: చూ, స్నేహము. 1; 2. ఒకవస్తువును సరియెత్తుగా నుంచి తూఁచెడు త్రాయి లోనగునది. "సీ. తొలునాడు శోధ్యునిఁ దులఁదూఁచి యాతని యత్తగునొద్దిక లెల్లదాఁచి" విజ్ఞా. వ్య. కాం 117: చూ, ప్రతిమానము.

ఒద్దియ దే. వి. ఒసగు, నింపు, తామరతంపము: చూ, సమృద్ధి (రూ-ఒద్దె)

ఒద్దె. దే వి. 1 —పై.—; వా. 2. రూ-ఒద్దే. చాల, ఎక్కువ.

ఒద్దే. వా. అవ్య. 1. చాల, ఎక్కువ. "ఒద్దేకూడు వడ్డించిరి." "ఒద్దేసేపుమాటలాడిరి"; 2. అక్కరలేదనుటను దెలిపెడి. (ఒద్దు=వద్దునకు ప్రతిరూపము.) (అన్నము మితిమీఱి వడ్డించినచో ఒద్దు ఒద్దు (చాలు) అనియు, స్త్రీసంబోధనమున ఒద్దే ఒద్దే (పెట్టకుము) అనియు గోదావరి కృష్ణామండలములయందును కొన్ని యితర చోట్లను వాడెదరు.)

ఒనగూడు. దే. అ. క్రి. రూ-ఒడగూడు: చూ, సిద్ధించు. (ప్రే-ఒనగూర్చు)

ఒనబెట్టు. ద్వ. వి రూ-ఒనవెట్టు, గూఢనివసతి: చూ, పొంచు ము.

ఒనరించు దే. ప్రే ఒనర్చు చేయు, నిర్వహించు: చూ, సలుపు.

ఒనరిక. దే వి. పొందిక, మైత్రి: చూ, స్నేహము. 1

ఒనరు. దే వి. 1 మైత్రి: చూ, స్నేహము. 1; 2. ఇంపు "సీ. రాఘవ రఘుప్రియంబు నగరంబు దూరంబు గాఁజేరి యంతటను దాపురలు దృష్టి కొనరు గైకొని." రాఘ. 3, ఆ. 95: చూ, యథేష్టము; విణ. 3. మంజులము, సింగారము: చూ, రమ్యము; 4 ఒయ్యారము: చూ, సౌందర్యము; అ. క్రి. 5 అంగీకరించు. "ఉ. నీకరుణం గరంబు రమణీయతరంబయి సర్వవిఘ్నదూరీకృతమై సమాప్తికొనరెన్ ధరణీధర యుష్మఖంబు ధరా, లోకములోన నేను నృపలోకనమస్కృతిఁ గీర్తిఁ బొల్చితిన్." భార. సభా. 2, ఆ. 81: చూ, సమ్మతించు; 6. జనించు, కలుగు. "సీ. భూతగణంబులచేత సత్త్వముఁ గొనరఁ జెన్గొనర నీవని శివుండు." నిర్వ. 7, ఆ. 128: చూ, పుట్టు. 2, 7. యుక్తమగు, పొసఁగు. "ఇదియు నదియు నొనగుఁ జెట్లొకొ." కళా. 4, ఆ: చూ, సరిపడు

ఒనరుచు. దే. ప్రే: చూ, ఒనరించు.

ఒనరుపడు. ద్వ. అ. క్రి. అనుకూలించు: చూ, పొందుపడు.

ఒనరుపెట్టుకొను ద్వ అ. క్రి. (ఒనరు + పెట్టుకొను.) —పై.—

ఒనవెట్టు. ద్వ. వి. చూ, రూ-ఒనబెట్టు.

ఒనవెట్టుకొను. దే అ. క్రి. (ఒనరు + పెట్టుకొను.) ఇఱుముకొను, తిరోహితమగు. "సీ. ఓగిరంబు హరింప నొనవెట్టుకొనియున్న వేగునంతకుఁ జేసె జాగరంబు." కాశీ. 4, ఆ. 188: చూ, మఱుఁగుపడు.

ఒప్పందము. వై. వి =అర్పణ. అమ్ముడువాఁడును కొనెడువాఁడును ఈ వెలకు ఈ సరకు నింతమాత్రము ఇచ్చెదనని కాని తీసికొనెదనని కాని చేసికొనెడు యేర్పాటు.

ఒప్పఁజెప్పు. వై. స. క్రి: చూ, ఒప్పగించు.

ఒప్పగించు. వై. స. క్రి. పదిలముగా కాపాడుమని యొప్పగించు: అప్పగించు, ఒప్పఁజెప్పు, ఒప్పించు; (సం. ప్ర):—అర్పించు.

ఒప్పగింత. వై వి.=అర్పణ. పదిలముగా కాపాడుమని యొప్పగించుట: అప్పగింత, అప్పనము, ఇల్లడ-రూ-ఇల్లడము, ఒప్పన-రూ-ఒప్పనము; (సం. ప్ర)—అర్పణము.

ఒప్పన వై. వి. 1.=అర్పణమ్. —పై.—; 2. అప్పన, కప్పము, పన్ను: చూ, సిస్తు 1.

ఒప్పనము. వై. వి.= —పై.— (ఒప్పగింత — "సీ. ఒఱఁగ త్రిపెట్టి నీకొప్పన మిడియెంచు సత్తికిఁ గత్తి చెయ్యెత్తి మ్రొక్కె." కళా. 8, ఆ. 119.)

ఒప్పనసేయు వై. స. క్రి రూ- అప్పనసేయు. "ఉ. తప్పక సర్వబాంధవవితానముఁ బుత్రులు నిష్టభృత్యులున్, ...... ధర్మమార్గులఁ దన్నొప్పన సేయనున్నగడు మగ్రిపుదాయలు గారెయారయన్." శివ. ఉ. 2, ఆ: చూ, వశపఱచు.

ఒప్పమి. దే. వి. 1. అశుభము, కీడు. "క. మన సమానికివైనీ, పున్నంగడు మేలకాక యొప్పమిగలదే." భార. విరా. 1, ఆ. 288: చూ, హాని. 2; 2 అపరాధము, తప్పు. "నాయొప్పమి యేమిసంఘటిలె నొక్కొ యటంచు." కళా. 4, ఆ. 106: చూ, నేరము; 3. అనంగీకారము. (ఒప్పుకొనమి.): చూ, అసమ్మతి.

**ఒప్పరము.** దే. వి. జలదారి. ‘‘సీ. కూపరాణపుటుమ్మ కూపెంపొప్పరము జలదారియుంచవఁగను దనరును జలనిర్గమము.” ఆం, భా. ప్రి. వారి. 154: చూ, తూము 2.

**ఒప్పరికము.** వై. వి.= ఉపేక్ష. అసద్ధ: చూ, మందెవేలము. 2.

**ఒప్పరికించు.** వై. స. క్రి. ఉపేక్షించు. ‘‘చ. కొడుకులఁగానకే నృపుల కుంతితేజాలవెందు నిమ్మయిం, జెడుతెరువైనచోఁ దగవు సెప్పక యొప్పరికించి చూతురే.” భార. ఉద్యో. 2, ఆ. 10; ‘‘శా. క్రోధస్విష్టుఁడైన నందనుని నొప్పరికించితి.” నిర్వ. 6, ఆ. 127; ‘‘నన్ను నిటులొప్పరికించుట నీకుఁ బాడియే.” రా. బాల. కాం; ‘‘ఉ. తనుక భరించినబుద్ధోత్తము నొప్పరికించు నమ్మహాపాపికి.” విక్రి 5, ఆ. 152; ‘‘తే. పట్టిపాలార్చెదరుమీరు పాండుకులుల, నీవు భీష్ముండునలిగిన దేవతలకు, నైన మార్కొనవచ్చునే సేనసరుఁడు, నొండెఁగా నిట్టు లొప్పరికింపఁదగునె.” భార. భీష్మ. 2, ఆ. 280: చూ, కన్నడించు

**ఒప్పరికించువాఁడు.** ద్వి. వి. ఉపేక్షకుఁడు: చూ, కన్నడీఁడు.

**ఒప్పరికింపఁబడినవాఁడు.** ద్వి. వి. ఉపేక్షింపఁబడినవాఁడు: చూ, ఉపేక్షితుఁడు.

**ఒప్పాచారము.** దే. వి. ముచ్చిలక, సమ్మతించి వ్రాసియిచ్చినవ్రాఁత: చూ, రాజీ.

**ఒప్పారు.** దే. అ. క్రి. (ఒప్పు + ఆరు.) అంగీకరించు, ఒప్పు. ‘‘శా. ఆరూఢస్థితి నెల్లదేశముల నొప్పారున్ బ్రకాశంబుగన్.” భార. అర. 4, ఆ. 313: చూ, సమ్మతించు.

**ఒప్పించు.** వై. స. క్రి. అర్పించు: చూ, ఒప్పగించు.

**ఒప్పికోలు.** దే. వి. రూ- ఒప్పుకోలు: చూ, సమ్మతము. 1.

**ఒప్పిదము.** దే. వి. 1. (ఒప్పు + ఇదము.) ఒప్పు, అందము. ‘‘చ. ఒప్పిదము లొనర్పఁబంచిరి గభీరవిభూతి యెలర్పవీటికిన్.” హరి. ఉ. 8, ఆ: చూ, సౌందర్యము; 2. చేందము. ‘‘క. మంత్రింబుసఁబెట్టిదముగఁ బడవైచిన యొప్పిదమున నస్త్రమునఁగూల్చె భీష్మనిరూతున్.” భార. భీష్మ. 2, ఆ: చూ, విధము. 1; 3. తొడవు: చూ, భూషణము 2; విణ 4. మనోజ్ఞము, సింగారము. ‘‘సీ. కాళ్ళయొప్పిదమాఁడు కట్టనుజ్వలము నేయంగ ..... హేమపట్టిక మెఱయకుండ.” భార. విరా. 1, ఆ. 228: చూ, రమ్యము. 3.

**ఒప్పిమఁడు.** దే. విణ. అలంకృతుఁడు: చూ, భూషితుఁడు.

**ఒప్పు.** దే. వి. 1. కాంతి. ‘‘సీ. సిరిచెల్వ చెలువము చెన్నుసొంపొప్పుసోయగము చాయ యనంగ నలరుఁగాంతి.” ఆం, భా. ప్రి కాం. 80: చూ, వెలుతురు. 1; 2. విన్నాణము: చూ, సామర్థ్యము. 1; 3. ఒడఁబడిక. ‘‘గీ. గంధమాల్యాదివాసనల్ గ్రమ్మదేరఁ, దోడుకొని వచ్చిరప్పుడాతోయజాక్షి, నరసుఁ డున్నట్టి కేళికాసదనమునకు, బలిమిచేనొప్పు చేతను బద్మముఖులు.” అని. 1, ఆ. 10: చూ, సమ్మతి; 4 సొగసు. అందము. ‘‘ఆ కామిని యొప్పునఁజూడ్కి తగులమీఱిన.” భార. అర. 6, ఆ: చూ, సౌందర్యము; 5. తప్పుకామి, నిజము. ‘‘క. ఒప్పగునో తప్పగునో.” ఉ. హరి. 4, ఆ. 180: చూ, సత్యము. 1; విణ. 6. మంజులము: చూ, రమ్యము. 3; అ. క్రి. 7. ఒప్పిదమగు: చూ, రవణించు; 8. యుక్తమగు: చూ, సరిపడు. 2; 9, అంగీకరించు: చూ, సమ్మతించు.

**ఒప్పుకొనిమరలఁబడుట.** అం. వివాదములు పదునెనిమిదింటిలో నొకటి: చూ, వివాదములు.

ఒప్పుకొను. దే. స. క్రి. 1. అంగీకరించు: చూ, సమ్మతించు; పా. 2. (రేటిపై) ఆమోదించు. స్థిరపఱచు.

ఒప్పుకోలు. దే. వి: చూ, రూ-ఒప్పికోలు.

ఒప్పుదలపత్రము. పా. (భాండు) ఋణలేఖ్యము; సమ్మతిపత్రము.

ఒప్పులకుప్ప. పా 1 నేర్పులరాశియగు స్త్రీ పురుషులు; 2. బాలికాక్రీడావిశేషము: చూ, బాలికాక్రీడ "ఒప్పులకుప్ప ఒయ్యారిభామ."

ఒప్పులాఁడి. దే. వి. (ఒప్పులు + ఆఁడి.) 1. ఆఁడుది: చూ, స్త్రీ; 2. చక్కఁదనము గల ఆఁడుది: చూ, స్త్రీ.

ఒప్పులు. దే. వి. బ. 1. క్రముక*. చూ, పోఁక; 2. మంచివిషయములు. "ఒప్పులుకుప్ప." (వ్యతి.—తప్పులు.)

ఒబ్బట్లు దే. వి. బ. (ఒమ్మ + అట్లు.) పోళీ, రూ-బొబ్బట్లు. భక్ష్యవిశేషము. "నన్ను నేతిలోముంచికున్న నిన్ను గంగలో ముంచెదనని ఒబ్బట్టు (బొబ్బట్టు) అనెనట,"; కళా 7, అ. 81: చూ, భక్ష్యము.

ఒబ్బిడి దే. వి 1. పంటనుతీపిడి, కైలు: చూ, నూర్పు; 2. చేటు వాళనము. "ఇంటనున్న; వడ్లగింజలన్నియు ఒబ్బిడియైనవి": చూ, రత్త 3. (పని) శుభ్రము; 4. (కార్యము) చక్కఁదనము; 5. (సొమ్ము) కూడఁబెట్టుట; 6. (వ్యాపారము) లాభకరముగఁజేయుట; 7. (పంట) వడ్లు లోనగునవి ప్రోగుచేయుట; ఇత్యాదులూహ్యంబులు.

ఒమ్మచ్చు. ద్వ వి. (ఒమ్మ + అచ్చు.) మణులను పొదుగుటకు బంగారుతోఁజేసిన పీఠస్థానము.

ఒమ్మమి. దే. వి. వైరము, పగ: చూ, విరోధము. 1.

ఒమ్మిక. దే. వి. పొందిక, ఇమిడిక. "ద్వి. సమ్మదంబునఁ బర్వకాలగాచించి, యొమ్మిక గురుల వందునిచినవాఁడే." రా. అ. కాం: చూ, స్నేహము. 1.

ఒమ్మివచ్చు. దే. అ. క్రి. అచ్చివచ్చు, శుభాగతమగు: చూ, మేలైవచ్చు.

ఒమ్ము. దే. వి. 1. బలుపు, స్థౌల్యము: చూ, శక్తి 1; విశే. 2. పెద్ద, క్రొవ్వినది: చూ, స్థూలము. 2; అ. క్రి. 3. ఒప్పు, అనుకూలపడు. "ఈనీళ్లు నాకు ఒమ్ములేదు.": చూ, పొందుపడు; స. క్రి. 4. క్రమ్ము, చుట్టుకొను: చూ, వేష్టించు.

ఒయారము. దే. వి. 1. రూ-ఒయ్యారము. గర్వము: చూ, హంకారము; 2. రూ-ఒయ్యారము. యౌవనాదులవలన గలుగు గర్వచేష్ట. "న. పుటంగుప్రింకు గ, ట్లను దనరెండుచేతుల నొయారము మీఱఁగ నేల కొమ్మదా, ల్చిన." య. 5, ఆ. 80: చూ, విలాసము; 3. రూ-ఒయ్యారము, అందము: "ఎ, గీ. రతివిధంబునఁ గడునొయారమునఁ బొదలి." చంద్ర: చూ, సౌందర్యము.

ఒయారి. దే. వి, 1. రూ-ఒయ్యారి విలాసము గల స్త్రీ: చూ, స్త్రీ; 2. ఒయ్యారి. సౌందర్యముగల స్త్రీ: చూ, స్త్రీ; విశే. 3. సౌందర్యము గలది. "ఉ. వేల్పులనొయారికొమ్మలుదులుం బెన్ను కెలంకులచో ముహుర్ముహు, క్రీలనటింప." రామా 1, ఆ. 205: రూ-ఒయ్యారి-ఓయారి.

ఒయారికత్తె. దే. వి. 1. రూ-ఒయ్యారికత్తె. విలాసముగల స్త్రీ: చూ, స్త్రీ; 2. రూ-ఒయ్యారికత్తె. సౌందర్యముగల స్త్రీ: చూ, స్త్రీ.

ఒయారికాఁడు. వ్య. విశే. రూ-ఒయ్యారికాఁడు. అందగాఁడు: చూ, సౌందర్యవంతుఁడు.

ఒయ్య. దే. క్రి. విశే. 1. తిన్నగా. "సీ. అంతఁబులోముఁడట వింతరక్కసుఁ డగ్నిహోత్రి

గృహంబున కొయ్యనచ్చి, యత్తన్విఁ జూచి యుస్మత్తుఁడై యొవ్వరిసతియిది సెప్పుమా జాతవేద." భార. ఆది. 1. ఆ. 180. చూ, మెల్ల 8; 2. మెల్లఁగా. "తే. పాంచాలి యిట్లని యొయ్యఁబలికె." భార. ఉద్యో. 8, ఆ. 100; "మ. నిజం, బడుగంజూచెద నంత యుండెలియ నొయ్యంజెప్పరానావుడున్." రామా. 6, ఆ. 281. (ఆమ్రేడితమందు ఒయ్యొయ్య.)

ఒయ్యన. దే. వి. 1. రూ-ఓయన. తిన్నన. "ఒక వాఁడు నారదుఁడొయ్యనఁ గంసుని యింటికిఁ జనుదెంచి." భాగ. 10, స్కం. పూ: చూ, మెల్లన; 2. రూ-ఓయన. నెమ్మదిగ: చూ, మెల్లన.

ఒయ్యారము. దే. వి: చూ, రూ-ఒయారము. (అందమునకు—హారముల్ మెఱయ నొయ్యా రంబుగా గ్రుచ్చి." భార. విరా. 1, ఆ 107.)

ఒయ్యారి. చూ, రూ-ఒయారి.

ఒయ్యారికత్తె. దే. వి: చూ, రూ-ఒయారికత్తె

ఒయ్యారికాఁడు. ద్వ. విశే: చూ, రూ-ఒయారికాఁడు.

ఒర. దే. వి. 1. సామ్యము, పోలిక. "క. అప్పుడు మధ్యందినమున, నొప్పినయినుతోడఁ జాల నొరవచ్చి గురుం, డప్పాండవబలములపైఁ, దెప్పదెరలఁగురిసె శరతతిం దీవ్రముగాన్." భార. భీష్మ. 2, ఆ. 381; "క. శృంగారము ముఖ్యంబగు ... బంగారముతోడి యొర ప్రబంధమువొందున్." పి. శకుం. 1, ఆ, 25: చూ, సమానము; 2. ఘర్షణము, రాపు. "మ. చరమాశానికషోపలాంచలములన్ సంధ్యాప్రకాశోదయం, బొరగావించివిరించి చేకొనినకాఱ్యండ స్వదార్వాస్నబం, గరపుం బూదియనై." నై. 8, ఆ. 159: చూ, పీడనము.

ఒరకట్టు. దే. వి (ఒర + కట్టు.) చుట్టుగాఁజుట్టి కట్టిన వస్త్రపుకట్టు. "సీ. ఒరకట్టుసంబెలు బెరసుపచ్చడములు కార్కొన్నలో వంకకతి యొడల్లు." నీలా. 8, ఆ. 49: చూ, వస్త్రము.

ఒరగడుగు. ద్వ. వి. (ఒర + కడుగు.) రెండవ సారి బియ్యముకడిగిన నీరు: చూ, శుక్తము.1.

ఒరగఁబడు. దే. అ. క్రి. రూ-ఒఱగఁబడు. అవనతమగు: చూ, వ్రాలు. 8.

ఒరగఁబెట్టుకొని తినకుండఁగఁజేసినవాఁడు రా కంచెరగాయలు. లో. ఉన్నబెల్లమును మాటలేక కరగఁబెట్టి తినకుండఁగఁజేసిన కంచేరగవాఁడు. (వాడుక.)

ఒరగల్లు. దే. వి. (ఒర + కల్లు.) బంగారు లోనగువాని నొరసిచూచెడుఱాయి: చూ, నికషము.

ఒరగాలు దే వి. (ఒరగు + కాలు ) 1. ఒరగిన కాలు. "కప్పలు నొరగాలైనను." సుమతీశతకము: ఒఱిగాలు; 2. నతియొకకాలిమీఁద నొరగఁబెట్టిన కాలు. "గ. కమలవనంబులోన నొరగాలనెనిల్చుచు నిద్రవోవఁగా." భాను 2, ఆ; "ద్వి. కుక్కలఁబిల్చుచు తిక్కవెట్టుచును, నెక్కొననొరగాలనిల్చుచుఁ జనుము." భాగ. 8, స్కం.

ఒరగు. దే. వి. 1. తలగడ; ఒఱుగుదిండు: చూ, లోడు; 2. వంపు: చూ, వంకర. విశే. 8 వంపయినది: చూ, వంకర; అ. క్రి. 4. రూ-ఒఱగు వంగు, అవనతమగు: చూ, వ్రాలు. 8, 5. రూ-ఒఱగు. వ్రాలు. "చ. దుఃఖపరంపర నిద్రలేక తా, నొగగుచులేచుచున్." రా. కిష్కిం, కాం. చూ, వ్రాలు. 8. (4-5 అర్థములు స్వల్పభేదము.); 6. ప్రక్కకొఱగు: చూ, జీరగు.

ఒరగుడు. దే. వి. ఒరగుట. ఓరపాటు.

ఒరగుబిల్ల. దే. వి. రూ- ఒఱగుబిల్ల. తలగడ: చూ, లోడు.

ఒరగువోవు. దే అ. క్రి. రూ-ఒఱగుపోవు. అవ నతమగు: చూ, వ్రాలు. 3.

ఒరగొడ్డియము. ద్వ. వి వక్రోక్తి: చూ, వంకర మాట. (రూ- ఒరగొడ్డెము- ఒఱగొడ్డియము- ఒఱగొడ్డెము )

ఒరగొడ్డెము. ద్వ. వి. —పై.—.

ఒరగొను. దే. స క్రి. (ఒర + కొను) బంగారు లోనగువానిని ఒరయు, తోము, రాచు అఱుగఁదీయు: చూ, రుద్దు. 1.

ఒరచాలుదుక్కి. ద్వ. వి. రూ-ఒఱచాలుదుక్కి, చాల తేలికగాఁ బాఱిన దుక్కి: చూ, వ్యవ సాయము.

ఒరచీబద్ద. ద్వ. వి. పలకలు లోనగునవి నునుపు పఱచెడు వడ్లవానికోఱముట్టు. (అ. ప్రొ.)

ఒరపదను. దే.వి. కొంచెముతడి: చూ, పదను.2

ఒరపిడి. దే వి. ఘర్షణము, రూ-ఒఱపిడి, రాయిడి "క. అన్నలుఁదమ్ములుఁ గలుగుచు, యున్నతుఁ జేయునృపునెంత యొరపిళ్లయినన్, మన్ననయునీగియును సం. పన్నంబులుగాఁగ వారిఁ బాటించుటగున్." భా. శాం. 2, ఆ. 356: చూ, పీడనము.

ఒరపెట్టు. దే. స. క్రి. బంగారులోనగువానిని ఒరయు: చూ, ఒరగొను.

ఒరయిక. దే. వి. అదుముడు: చూ, పీడనము

ఒరయు. దే.అ.క్రి. 1 ఒరపెట్టు: చూ, రుద్దు.1; 2. పరీక్షించు, సోదించు. "సీ. అనుడు మహాత్మ మిమ్మంతనే నొరయంగనగ్వామే మీపల్కులందుఁ గలదె, యనుమానమనుట యు." కళా 2, ఆ 157: చూ, శోధించు; 3 అరయు, వివరించు. "క. నరపతిభృత్యులఁ దొడవుల, నొరసితగిన సెలవులందు నునుపక యున్నన్, జరణంబునఁజూడామణి, శిరమునవందియయుఁ బెట్టు చెలువముగాదే." పంచ. నా. 1, ఆ. 82: చూ, విచారించు. 1; 4. అన్వేషించు. "సీ. గవులలోపాని పుంగవులలోఁ బరికించి ప్రోదనదజన పద పదవులొరసి." రామా. 5, ఆ. 177: చూ, వెతకు; 5. (కాళ్ళు వ్రేళ్లు.) ఒరయు. "వానసీటిచే కాళ్లవ్రేళ్ళు ఒరసినవి." (ఒరపులు అనియు వాడెదరు.)

ఒరలుట. దే. వి. విసుపు: చూ, విమోచనము.

ఒరవడి దే. వి ఒజ్జబంతి: చూ, మేలుబంతి.

ఒరసికొనిపోవు. దే. అ క్రి. "క్రిందఁబడి మోకాలు ఒరసికొనిపోయినది": చూ, దోఁగి పోవు.

ఒరాంగుకోఁతి. పా ఒరాంగుకోఁతి రక్తమును గిబ్బనుకోఁతి లోనికెక్కించినను మనుష్యుని రక్తమును చింపంజీకోఁతిలోని కెక్కించినను రెండింటిరక్తములు బాగుగా కలిసిపోవుచున్నవి. (చిం. దీ. పరిణామవాదము 80.పుట.)

ఒరిగ. దే. వి. మొక్కు. "ఒరిగ బ్రిహ్మాండ భాండోదరునకు." రుక్మాం. 1, ఆ. 123: చూ, నమస్కారము.

ఒరిజనలు. ఆం. అసలు. ప్రాతిపదిక.

ఒరిజనలుసూటు. ఆం. అసలుదావా.

ఒరిజనలుపిటీషను. ఆం. అసలు దరఖాస్తు.

ఒరిజే. దే. వి. రూ- ఒరిజె, ఏనుఁగు మెడగొలుసు "సీ. గళలిప్తకస్తూరికారేఖలొరిజెలుగనుఁ జెక్కులజవాది మొనపుచుదము." చంద్రా. 1. ఆ. 32: చూ. శృంఖలము. 2.

ఒరిజె. దే, వి —పై.—

ఒరిమ. వై. వి. 1. రూ- ఒరిమి, మైత్రి. "క. మనుకువఁ బుటుచేసి యొరిమంగడు మెచ్చులు గొన్న నేటి నేఁ, మనిపాగడంగవచ్చు." య. 1, ఆ. 51: చూ, స్నేహము 1: 2. ఐకమత్యము, ఐకకంఠ్యము. పొత్తు. కాశీ. 3. ఆ 188: చూ, స్నేహము. 1.

ఒరిమి. దే. వి.—పై.—(రూ-ఒరిమిక.)

ఒరిమిక. దే. వి. —చై—

ఒరిస్సా. దే. వి. 1. ఓఢ్రదేశము: చూ, దేశము; శా. 2. (శ్రీమాన్ కిళాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఎ. బి. ఎల్.) ప్రాచీనకళింగదేశ చరిత్రము,— ప్రస్తుతము ఒరిస్సాయందు భువనేశ్వరమునకు దక్షిణమున ధౌళిగ్రామమునను, గంజాంజిల్లాలోని జౌగడాగ్రామమునందును యశోకుని శిలాశాసనములు కలవు. కళింగ. 243. పుట; (డాక్టర్ ఎస్. క్రిష్ణస్వామి అయ్యంగారు, ఎం. ఎ. పి. హెచ్. డి.) ప్రస్తుతము ఒరిస్సా యనఁబడు దేశమునకా పేరు. 'ఓఢ్రదేశము' నుండి వచ్చినది. కళింగము. ఉత్కళము, ఓఢ్రము లేక ఓడ్ర, దశార్ణములోని యొకభాగము, ఇందలి రాజ్యములు. కళింగ. 251. పుట; (శ్రీయుత శ్రీపాద గోపాలకృష్ణమూర్తి గారు) ,,ఒరిస్సా.'' అను గ్రంథమును హంటరుదొరగారు వ్రాసిరి. కళింగ. 324. పుట; (శ్రీయుత రాళ్ళబండి సుబ్బారావుగారు. ఎం, ఎ. ఎల్. టి.) బి పి. ముజుందారుగారు ఒరిస్సాగ్రంథమును వ్రాసిరి. కళింగ. 630. పుట; ఒరిస్సా=జాజినగరము. కళింగ. 635 పుట; ఒరిస్సాదేశము అయిదు పర్యాయములు. జలేశ్వరం (మిథునపురము). భద్రక్, కటకము కళింగ దండపాటు, రాజమహేంద్రవరము. కళింగ. 666 పుట. (చూ, ఒడిశా.)

ఒరుఁడు. వై. వ 1.= ఏకః. రూ- ఒకరుఁడు, అన్యుఁడు: చూ పరాయివాఁడు; 2.=ఏకః. ఏకకుఁడు, ఒక్కఁడు: చూ, ఒకఁడు. 3.

ఒరుదల. దే. వి. (దరు + తల.) కొండకానితనము: చూ, పైశున్యము.

ఒరుదలకాఁడు. దే. విశే. కొండెకాఁడు, పిశునుఁడు. ,,క. పొందలపె యొరుదలకానిన్, కెదరంగావాడకాత్మ గెంతించి.'' అను. 4 ఆ: చూ, సూచకుఁడు. 1.

ఒరుము, దే. అ. క్రి కలయు. ,,క. శరనిధి మునుగ్రోలిన నిగ్రహజలములుగురిసి మేఘభావంబతియు క్రూరములుకరమొకాళి గి,నోరిమెనసన్ గవియుమెఱసె నుడిగెనుమెయిలఁజ.'' అను. 4. ఆ. 171. చూ, వేళగించు, 1.

ఒరువుఁడు. వై. వ. ఏకః: చూ, రూ- ఒరుఁడు.

ఒఱ. దే. వి. 1. గవుసెన: చూ, నిచోళము; 2. కత్తియొఱ. ,,క. ఒఱలందునాయుధంబులు, విఱిగిపడందొడఁగె.'' కై. 6, ఆ 188: చూ, ప్రత్యాకారము; 3. నూతియొఱ: చూ, బావియొఱ.

ఒఱకటము ద్వి. వి. 1. రూ- ఒరగడ్డము, సంకటము ,,ద్వి. మెఱయనీతఁడు వోవమీఁదటఁజాల,నొఱకటంబున నొత్తురాగిఁబ్రజలెల్ల.'' భాగ. 1, స్కం: చూ, దుఃఖము; విశే. 2. రూ- ఒఱగడ్డము. ఎగుడుదిగుడు: చూ, విషమము. (రూ-ఒఱగడము.)

ఒఱకము. దే.వి 1. గర్తము, పల్లము. ,,క. తివిరం,బొఱకంబిది మెఱకిదియని, యొఱుఁగక రాకుండఁజేసె నెల్లధరిత్రిన్'' సురా: చూ, రంధ్రము. 1; 2. సంకటము ,,గీ. అతిథిబంతికి రాకున్న నారగింపఁ, డొంటినొకనాఁడుఁ బతియొట్టియొఱకమైన.'' కాశీ. 7, ఆ. 166; కాశీ. 2. ఆ. 45: చూ, దుఃఖము.

ఒఱకాటము: చూ, రూ- ఒఱకటము.

ఒఱగఁబడు. ద్వి. అ. క్రి. (ఒఱగన్ + పడు.) అవనతమగు: చూ, రూ- ఒరగఁబడు. (స్వార్థమునపడు.)

ఒఱగడము: చూ, ఒఱకటము.

ఒఱగడ్డము. —చై—

**ఒఱగల్లు.** దే. వి. (ఒఱ + కల్లు.): చూ, రూ- ఒరగల్లు.

**ఒఱగు.** దే వి: చూ, రూ- ఒరగు (ఉపధానము.— "ఒఱగుమీఁదటఁ జేరి." కళా 8. ఆ; వ్రాలు — "నిలువఁజాలక యొఱగిన." భార. ఉద్యో. 3, ఆ 310 )

**ఒఱగుబిల్ల.** దే వి: చూ, రూ- ఒగరుబిల్ల (ఒఱగుబిళ్ల )

**ఒఱగుపోవు.** దే. అ క్రి (ఒఱగు + పోవు.): చూ, రూ-ఒరగుపోవు .సీ. కొంగ మెడయు నిడుగూనివీఁపు నొఱగుపోయిన గొండియు బొక్కిపోయి ముక్కు." పారిజా 4. ఆ.168.

**ఒఱగొడ్డియము.** ద్వ వి: చూ, రూ- ఒరగొడ్డియము

**ఒఱగొడ్డెము.** ద్వ. వి. రూ—పై.— "క. భీ ముండొఱ, గొడ్డెములాడంగ." భాగ. 1, స్కం. 313

**ఒఱచాలుదుక్కి.** ద్వ. వి: చూ, రూ- ఒరచాలుదుక్కి.

**ఒఱటు.** దే. విశే. మూర్ఖుఁడు, జాత్యాచారాదులచేత నిందితుఁడు, పాపాలముద్ద. "గీ ఉరుల సిరియును నొల్లకిట్లొఱటుచాకి, యాది దేవుని దెసవిన యంబుదక్కి, యిహపరంబులు లేక యిట్లేగతిఁగన్న, కంటఁడై నేలపైఁగూలి కాలుఁగూడ." పారి. పూ. 9, ఆ. 19: చూ, వ్యాధుఁడు. 2.

**ఒఱపరి.** దే. విశే. (ఒఱపు + అరి.) సొగసుకాఁడు. "ఒఱపరిఁగన్నఁ గూడఁజను." హై. 3, ఆ. 29: చూ, సౌందర్యవంతుఁడు.

**ఒఱపిఁడి.** దే విశే (ఒఱపు + ఇఁడి) 1. యోగ్యుఁడు కానివాఁడు. "క. వెఱవక నెమ్మది నుండుము, వెఱవారల బుద్ధి నాత్మఁ బెట్టుమె యనఘుం, డొఱపిఁడిచేఁదప్పిన నామది, నఱమరలేదొండు నమ్ముమనిరొ సరేంద్రా." విక్రి. 3, ఆ. 101: చూ, అయోగ్యుఁడు; 2 కుటిలుఁడు, కుత్సితుఁడు: చూ, వ్యాధుఁడు 2

**ఒఱపిడి.** దే వి. ఘర్షణము, రూ-ఒరపిడి: చూ, పీడనము

**ఒఱపు** దే వి. 1 ఆరాటము, తాపము. "ఎ, గీ బాలతను కాంతితో పాటిఁబోలఁ గోరి, పృథివిసకల ప్రవేశంబుఁ జెక్కుమాన్ప, చేసి యొఱపులఁబడెఁగాని." రసి 2, ఆ 105; చూ, సంతాపము; 2. మంజులము, శింగారము: చూ, రమ్యము 3; 3 సొగసు: చూ, సౌందర్యము; 4. ఉపాయము, అనువు, ఎత్తుగడ. "గీ. కఱ్ఱతేరైన నడపంగఁజాలువాఁడ, నొఱపు చెప్పుమరథికు నేమఱఁగనీను." భార. కర్ణ. 1, ఆ. 314: చూ, వెరవు; 5. కోకబలమువలనఁ గలిగిన తేజము, ప్రతాపము, తేజు. "ఎ, గీ మనుజగోడల మెఱపువాల్ మగల యొఱపు." రసి. 1, ఆ. 36: చూ, ప్రభావము. 1; 6. చేవ, ధైర్యము. "సీ. ఒఱపుచేదొలుకారు మెఱపు చెరసదల్పఁ గలకంఠకలిక చూపుల బెదంగు" పర 3. ఆ: చూ, స్థైర్యము. 1; 7. గౌరవము. "చ. ఎఱుఁగ సుగాత్ర లోకమున నెవ్వరికైనను మేలుసేయఁగా, నొఱపగు వాక్ప్రమంబున సమున్నతమైన గృహస్థధర్మముల్." ఉ, హరి. 4, ఆ. 48; చూ, మర్యాద; 8. అర్హత: చూ, యోగ్యత; విశే. 9 చేవ, గట్టి, దృఢము. "చ. ఒఱపుగ దక్కెశేబరుకునొందిన యుగ్రపుఘాతము." షో. 4, ఆ: చూ, స్థైర్యము. 1; 10. తగినది. "చ. మేలుసేయఁగా, నొఱపగు వాక్ప్రమంబున." ఉ, హరి. 4, ఆ. 48; నిర్వ. 2. ఆ. 80: చూ, యోగ్యము. 3; 11. వానలేమి. "కాలము ఒఱపుగానున్నది."

ఒఱపులాఁడి. దే. వి. (ఒఱపులు + ఆఁడి) సౌంద ర్యవతి, సొగసుకత్తె: చూ, స్త్రీ.

ఒఱపెంకు. దే. వి. నూతియొఱ: చూ, బావి రొఱ.

ఒఱయూరు. శా (శ్రీయుత గౌరవనీయులగు న్యాయమూర్తి వేపా రామేశంపంతులుగారు, బి. యె. బి. యల్.) రాజరాజు.—రాజేం ద్రచోడుని శాసనములు బహుళసంఖ్యాకము లయియున్నవి అతఁడు తిరుచనాపల్లికి సమీ పమునున్న ఒఱయూరునందు క్రీ శ. 1070 వ సంవత్సరమున చోళరాజ్యమున కభి షిక్తుఁడయ్యెనని శాసనములవలనఁ దెలియుచు న్నది. రాజ. స. ప సంచిక. 162 పుట

ఒఱయిక. దే. వి. ఘర్షణము, రూ_ఒరయిక: చూ, పీడనము.

ఒఱలనూయి. ద్వ వి. మట్టికాల్చి చేసిన గుం డ్రని ఒఱలుదింపి కట్టిన నూయి: చూ.నుయ్యి. ఇప్పుడు (సిమెంటుతో ఒఱలు తయారగు చున్నవి.)

ఒఱలు. దే. అ. క్రి. 1. వాపోవు, ఏడ్చు. "ఎ, గీ. అతిప్రబలపవన, ఘూర్ణరయమునఁ గూలు మహీరుహంబు, తెఱఁగుదోఁప సుదక్షిణుఁ డొఱలి కెడసె." భార. ద్రోణ. 3 ఆ 95: చూ, విలపించు; 2. మ్రోఁగు. "ఉ. తటి గొనియంతలోన......భల్లమొక్కటన్, నఱ కినఁగూలెఁ దద్ఘన ఘనాఘనకల్పితమైన కె క్కెయం, బొఱలుచు." పా. 5, ఆ. 31: చూ, శబ్దించు.

ఒఱవ. దే. విశ. 1. వంపైనది. .క. అరపా ఱదు కుఱుచచేతులు, నొ రవశరీరంబు." భార. అర. 2, ఆ. 135: చూ, వంకర, 2. తాఱుమాఱు. ..క. తెప్పించి తొడుగు మీవని, యొప్పించిన నిట్టునట్టునొరవలుగా పైఁగప్పికొనియాబృహన్నల, యప్పుడు నగి

పించెనచటియ బలాజనముల." భార. విరా. 4, ఆ. 39: చూ, వ్యత్యయము; 3. వికారము నొందినది. చూ, వికృతము.

ఒఱవఁబడు. ద్వ. అ. క్రి. (ఒఱవన్ + పడు.) చూ, రూ- ఒఱగఁబడు. ..చ. ప్రాణమగ్న ముల్, వదలి కతాంగయష్టి నొఱవంబడఁ గన్గొని మైథిలేయుకేఁ కొదయును లేక కన్గొని." జై. 6 ఆ. 230.

ఒఱవు. దే. అ. క్రి. —పై.— (రూ-ఒఱగు, ఒరగు.)

ఒఱిగాలు. దే వి. ఒరగినకాలు: చూ, ఒర గాలు. 1

ఒఱిబీజము. మి.వి.(ఒఱ్ఱు + బీజము) ఒకప్రక్క వట్టవాఁచిన రోగము: చూ, వట్టవాఁపు (రూ-ఒఱుబీజము)

ఒఱియిక. దే. వి. రూ-ఒఱయిక: చూ, పీడనము.

ఒఱుగు. దే. వి. రూ-ఒఱగు, తలగడ: చూ, లోడు.

ఒఱుగొమ్ము. ద్వ. వి. ఒకవైపున భారము హెచ్చినందుచేఁ గలిగిన తూకము. "కావడి ఒఱు గొమ్మువచ్చినది"

ఒఱుబీజము. మి. వి: చూ, రూ-ఒఱిబీజము.

ఒఱ్ఱ దే. విశ. కటువు, కారమైనది "సీ. ఒక కొన్ని ద్రబ్బెడ లొక గొన్నితాలింపు లొక కొన్నివిధముల యొఱ్ఱచేరు, లొక కొన్ని కల కల్పు లొకకొన్ని బజ్జులు." పాండు 4 ఆ. 184: చూ, కారము. 1.

ఒఱ్ఱకసింద. ద్వ. వి. కచ్చుర, కచోరము: చూ, షడ్గ్రంథ.

ఒఱ్ఱఁదనము. దే వి. కటువు, కారము: చూ, కారము 1.

ఒఱ్ఱన. దే. వి. —పై.—

ఒట్టియ. దే వి. 1. సుకత, సాధువుకానియావు, రూ-ఒట్టె: చూ, ధేనువు; విశే. 2. రూ-ఒట్టె, వంకైనది: చూ, వంకర.

ఒట్టు. దే. వి. 1. లోపము, తక్కువ, న్యూనము. "నీవు నామాటవినకున్న నాకు ఒట్టులేదు." (వా): చూ, కొరత. 2; విశే. 2. కటువు, కారము. "ఎ, గీ. గాటు, కారమొట్టొట్టిన యనంగఁ గటువు వెలయు" ఆం, భా. ప్ర. దీ. 104: చూ, కారము 1, 3. గొప్పది, విరి విరియైనది. చూ, విపులము

ఒట్టె. చూ, రూ-ఒట్టియ.

ఒలయు. దే. అ. క్రి. 1. క్రమ్ము "శుభానిలము లొలసె" జై. 6, ఆ: చూ, వ్యాపించు; 2. చొచ్చు. "సలిలకేలికి నొలసియు నొలయక." నిగ్ర 3, ఆ. 57: చూ, సోఁకు. 4; 3 జనించు, కలుగు "గీ. పౌర్ణమాసిఁ బూర్వపక్షాష్టమిని జతు, ర్దశినిను భయపక్షవళితవచ్చు, నష్టిఁబంచమిని సునిష్ఠమై నుపవాస, మున్న వివిధ శుభము లొలయునంతుర్రి." భార. అను. 4, ఆ. 147: చూ, పుట్టు 2; 4. చేరు. "గీ. ఒలసి నీపుత్రులెల్ల నొండొరులతోడ, నెట్టొడంబడియుండుమగట్లచేయు, వలయుఁ దవులోన జూదంబువామనగుటఁ, గలహమూలంబ యొట్టికాంతులకునైన." భార. సభా. 2, ఆ 131: చూ, సమీపించు; స.క్రి. 5. చుట్టుకొను. "ఆ విమలగుణసమృద్ధి వెలుఁగుచు సురసిద్ధ, సాధ్యకన్యలట్టిసఖులు నూఱ్వు, రొలసి తన్నుఁ గొలుచుచుండంగ." భార. ఆర. 2, ఆ. 8: చూ, వేష్టించు; 6. కదియు, పొందు, సక్తమగు. "చ. చలమున పింగిణీతతుల సంబులుగట్టుక మానరంపు వెన్నెలగతి మాగతిన్వైనుకఁ జిక్కక మానపు తప్పిదారై వె, న్నొలసినఁదాయు వెన్నెలుఁగ కుండుటనొచ్చెము." ఆము. 2, ఆ. 27: చూ, ప్రాపించు.

ఒలి. దే. వి. ఒలుపు, దోఁపుడు, అపహరణము. "క. భూ, తలమునఁగల ప్రజలందఱు, నొలిచిన నొలివాడెదయ నుగ్యోధనుబాధక." జై. 1, ఆ. 63: చూ, ముచ్చిలి.

ఒలికి. దే. వి. పాదపేర్చుచోటు. "ఎ.గీ. ఊర నుండనొల్లఁ డొలుకులలోగాని" వీర 2, ఆ: చూ, శ్మశానము.

ఒలికికాడు. ద్వ. వి. —పై.—

ఒలిదామర. ద్వ. వి. (ఒలి + తామర.) ఒకానొకచెట్టు: చూ, వృక్షము.

ఒలిమె. దే. వి. చెలిమి, మైత్రి: చూ, స్నేహము. 1.

ఒలియు. దే. అ, క్రి. చర్మము ఊడఁదీయు. "క. పవనజుఁ, డ దయుండయి వీఁపులొలియ నందఱనీడ్చుక." భార. ఆది 5, ఆ. 165: చూ, తోలూడ్చు.

ఒలివడు. ద్వ.అ. క్రి. (ఒలి + పడు) అపహరింపఁబడు. "సీ. ఒలివడ్డ సొమ్మునఁగలలేని సిరిచెప్పి చుట్టలపై దాడిపెట్టువారు." ఆము. 3, ఆ. 85: చూ, దొంగిలించు.

ఒలుకు. దే. అ. క్రి. 1. గళితమగు. "చ. కలశతనూజ యచ్చెరువు కాశికయందొక శంభులింగముక...పూజచేసి పో, నొలికినవాని మేయుటకునోలిఁ బ్రదక్షిణ మాచరించి" కాశీ. 6, ఆ.257: చూ, రాలు; 2. కాఱు: చూ, స్రవించు: స.క్రి. 3. చల్లు. "తే. మందిరాభ్యంతరమున కానందలీలఁ, బాండుపుత్త్రులుఁ దక్కటి బంధుజనులుఁ, దాసుఁ జని విప్రులును వనితాజనంబు, సేసలొలుక సింహాసనాసీనుఁ డయ్యె." భార. విరా. 5, ఆ. 232: చూ, ప్రోక్షించు; 4. కులుకు. "సీ. సెయ్యారఁ బన్నిటునింప లాతలు నొక్క సెలఁతలీవల

కొల్ల నీరమొలుకు." కవిక. 6, ఆ. 95; చూ, పోయు; అం. క్రి. 8. కార్చు. "చ. కన్ను నీ, రొలుకఁగ." ఉ. హరి. 5, ఆ: చూ, వడుచు.

ఒలుకులమిట్ట. దే. వి. (ఒలుకులు + మిట్ట) ఒలికి కాడు: చూ, శ్మశానము.

ఒలుచు. దే. క్రి. 1. ఒలియు: చూ, తోలూడ్చు; 2. అపహరించు: చూ, దొంగిలించు.

ఒలుపు. దే. వి. అపహరణము: చూ, ముచ్చిలి.

ఒలుపుఁబప్పు. ద్వ. వి. ఒలిచినపప్పు. మెం.

ఒలె. దే. వి. 1. రూ-ఒల్లె. వలువ: చూ, వస్త్రము; 2. రూ-ఒల్లె. కండువా. "సీ. పైఁడి కాసముచెట్లఁ బడవైచి దుప్పిడ్లుపెట్లకుఁ బాయుచు నెరయొలెల్ వైచువారు." అము. 6, ఆ: చూ, వస్త్రము; 3. రూ-ఒల్లె. పుత్రోత్పత్తి చీర: చూ, వస్త్రము.

ఒలెవాటు. దే. వి. శృంగారోత్తరీయము, అంగవస్త్రమునకు కుచ్చుపెట్టి మెడచుట్టిరా భుజములమీఁద వైచికొనుట. రూ- ఒల్లెవాటు- వలెవాటు- వల్లెవాటు: చూ, వస్త్రము.

ఒల్ల. వై. క్రి. విశ.= అలసమ్. ఆలస్యము. రూ- అల్ల: చూ, విలంబము. 1.

ఒల్లఁబాటు. ద్వ. వి. (ఒల్లమి + పాటు) 1. అపేక్షలేమి, ఒల్లమి: చూ, వలవమి; విశ. 2. అపేక్షింపఁబడనిది. "గీ. ప్రాణములు నర్థములు నొల్లఁబాటు సేసి." భార. భీష్మ. 1, ఆ. 182.

ఒల్లఁబోక. దే. వి. (ఒల్లమి + పోక.) 1. అనాదరము. "ద్వి. మెల్లనఁ దావచ్చి మెచ్చి నాకీక, యొల్లఁబోకలు సేసె నొల్లఁబోవిన్ను." రా, అర, కాం: చూ, వహేళనము; 2. మనసుయొక్క కాని, రూపముయొక్క కాని మాఱుపాటు: చూ, విస్మృతి; 3. తాపము, ఆరాటము: చూ, సంతాపము.

ఒల్లఁబోవు. దే. అ. క్రి. (ఒల్లమి + పోవు.) 1. ఆదరింపఁబడనిదగు: ఒల్లగిల్లు; 2. ఖిన్నుఁడగు "గీ. ఒల్లఁబోయెసాఁగను దనర్పుఁ జిన్న పోయెనటంచనఁ జిన్నయూష." ఆం, భా. తృ. 95; "గీ. పెండుమీటిన పగటీటెండదాఁకి, యొల్లఁబోయిన లేఁబొండుమల్లెపొదల, తుదలఁజిప్పటలైకడు దొడ్డలగుచు." అము 2, ఆ. 56: చూ, విన్నవోవు; 3. మూర్ఛిల్లు "గీ. అడ్డపడిగురుండు దొడ్డనారసము వక్షంబుదూఱనేయు సవ్యసాచి యొల్లఁబోయితెలిసి పెల్లేసెనక్కుంభ, జన్ముమీఁద నిశితసాయకములు." భార. ద్రోణ. 3, ఆ. 63: చూ, సొమ్మసిల్లు.

ఒల్లకాడు. వా. వి: చూ, రూ-వల్లకాడు.

ఒల్లగిల్లు. దే. అ. క్రి. ఆదరింపఁబడనిదగు. "ధృతివాయంబుయిలోట యొల్లగిల." హరి. ఉ. 5, ఆ. 80: చూ, ఒల్లఁబోవు. 1

ఒల్లన. వై. వి. రూ- అల్లన. తిన్నఁదనము. "క. వల్లవకాంతలు తనకథ,లెల్లను బాడంగ నీరజేక్షణుఁడఁటఁ, వల్లవబలసంయుతుఁడై, యొల్లనగోష్ఠంబుచేర నుర్వీనాథా." భాగ. 10, స్కం. పూ. 927: చూ, మెల్లన.

ఒల్లమి దే. వి. 1. అపేక్షలేమి: చూ, వలవమి. (వలచుధాతువుయొక్క వ్యతిరేక భావార్థకరూపము.), 2. వైరము, పగ: చూ, విరోధము. 1.

ఒల్లము. దే. వి మూర్ఛ, సొమ్మ: చూ, రోగము.1.

ఒల్లియ. దే.వి. 1. రూ-ఒలె- ఒల్లె. బట్ట. "కొల్ల తలయొల్లియమాలి దృఢంబుగా నమర్చెను." భార. కర్ణ. 3, ఆ: చూ, వస్త్రము; 2. రూ-ఒలె-ఒల్లె. కండువా. "సీ. కంపాలతికతోడ జలదంబుకైవడి మెఱుఁగుటొల్లియతోడ మేని వాని." భాగ. 10, స్కం. పూ. 548: చూ,

వస్త్రము; 3. రూ-ఒలె-ఒల్లె. ఒల్లెచీర, పుత్రోత్పత్తిచీర: చూ, వస్త్రము.

ఒల్లె. దే. వి. —పై— (బట్ట.—"ఒక్క పరిశుద్ధపు పైకపుటొల్లెఁగట్టి భా, సురతఁగడు నొప్పెలార్చె." ప్రభా. 4, ఆ. 141.)

ఒల్లెంక. దే. వి. ఒకరకపుచేఁప: చూ, మత్స్యము. 1.

ఒల్లెచీర. దే. వి. గర్భిణీస్త్రీ ధరించు ఎఱుపు తెలుపునూల్లు కలిపి నేసిన చీర, పుత్రోత్పత్తిచీర: చూ, వస్త్రము.

ఒల్లెవాటు. దే. వి. రూ-ఒలెవాటు: చూ, వస్త్రము.

ఒవుమ్. ఆం. గుడ్డు; అండము; స్థూలబీజము.

ఒవేట్. ఆం. అండాకృతులు. ఉదా.—మర్రి, బుడ్డబూసర మొదలయిన చెట్లయాకులు గుడ్డువలె నుండుటనుబట్టి అండాకృతు లనఁబడును.

ఒవ్వనివాఁడు. ద్వ. వి. ప్రకాశింపనివాఁడు.

ఒవ్వమి. దే. వి. అనంగీకారము. చూ, అసమ్మతి.

ఒవ్వు. దే. అ. క్రి. రూ-ఓవు. అనుకూలమగు, గిట్టు. "క. ఒవ్వనివారల యొసగున, నివ్విధముగ భంగపడితి నేను" భార. ఆర. 6, ఆ: చూ, పొందుపడు

ఒసఁగు. దే. వి. 1. త్యాగము, ఈవి. "మే యొసఁగుఁ దప్పింపక." ఆము. 6, ఆ: చూ, వితరణము; 2. బహుమానము, మన్నన. "ఎ, గీ. చూచి సామాజికులు తమ సొమ్ములెల్ల, నొసఁగులుగ వైవ" ప్రభా. 4. ఆ.101: చూ, సమ్మానము; స. క్రి. 3. రూ-ఒసవు. ఇచ్చు, దానమిచ్చు' చూ, దయచేయు. 2.

ఒసపరి. దే. వి. 1. సుందరుఁడు, సొగసుకాఁడు. "ఒసపరిగన్న.": చూ, సౌందర్యవంతుఁడు; 2. ఉత్కృష్టము, తలకట్టు. "చ. ఒసపరి బాగులాఁడి యపుడొక్కతె వచ్చి నృపాలుతోఁ గుతలన్." పా. 1, ఆ. 88: చూ, శ్రైష్ఠ్యము.

ఒసవు. దే. స. క్రి. రూ-ఒసఁగు. "పిన్నబిడ్డలకున్, వెన్నఁడు మెచ్చి యొన్నఁడొసఁగఁ గరముల్." వి, పు. 2, ఆ, 50: చూ, దయచేయు. 2.

ఒసి. దే. అవ్య. చేటికాది సంబోధనార్థకము. రూ-ఓసి. "సీ. ఒసి యోసి యనఁగఁ జేటి, కాది సంబోధనార్థమై యలరుచుండు." ఆం, భా. కృ. అవ్య. 72: చూ, ఓసీ.

ఒహో. వై. అవ్య=అహో. రూ-ఓహో. సంబోధనమునందు వచ్చును "మ. సముఁడై యెవ్వఁడు ముక్తకర్మచయుఁడై సన్యాసియై యొంటివో, వమహాభీతి నొహోకుమార యనుచున్ వ్యాసుండుచీరంగ."భాగ.1, స్కం. 55: చూ, సంబోధనము.

ఒళగు. దే. వి. రూ-ఒళవు. ప్రివాణము, కరిపె: చూ, వీణాదండము.

ఒళవరి. దే. విశే. (ఒళవు + అరి) మర్మముఁదెలిసినవాఁడు, ఆణికాఁడు: చూ, మర్మజ్ఞుఁడు.

ఒళవు. దే. వి, 1: చూ, రూ- ఒళగు. "ఎ. గీ. చారుమూర్ఛలేని చాపదండమునోజ, లలితతంత్రిలేని యొళవుఁబోలె." రా. అర, కాం. 2, ఆ. 256; 2. ఆణి, కీలకము. "వ. చలించుచునయ్యొళవు సడియలకుం జెప్పకుమని రాచిల్కకుఁ బ్రియంబు సెప్పుచు."విజ 2, ఆ.197: చూ, కీలకము; 3. అధీనము,లోఁబడు: చూ, వశము. 1.

ఒళ్లము. దే. వి. ఎళ్లము, ఏడుపలములు: చూ, మెల్లము.

ఒళ్లు. దే. వి. రూ-ఒడలు. దేహము. "ఉ. ఒ, ళ్లోరకమున్న వచ్చి యొక యంగన చూచె నరేంద్రచంద్రునిన్." కవిక. 3, ఆ. 156. (ఇది వెళ్లు నళ్లులవంటిది.): చూ, శరీరము.

ఒళ్లువెట్టు. దే. అ. క్రి. రక్తముపెట్టు, కండపట్టు, బలియు: చూ, స్థూలించు.

## ఓ.

ఓ. ఒకయక్షరము. ఆంధ్రభాషకు వర్ణంబులేఁబదియాఱు. అందు అచ్చులు పందొమ్మిది. ఆ అచ్చులలోనిది పదునేనవది; తెనుఁగునకు వర్ణములు ముప్పదియేడు. అందు అచ్చులు పదునాలుగు. ఆ అచ్చులలోనిది పదునొకండవది; సంస్కృతమునకు వర్ణంబులేఁబది. అందు అచ్చులు పదునాఱు. ఆ అచ్చులలోనిది పదమూఁడవది; సం.వి.ఓ. పుం. 1. బ్రహ్మ, నలువ: చూ, బ్రహ్మ 1; 2. కుబేరుఁడు, పైఁడిఱేఁడు: చూ, శ్రీదుఁడు; 3. చందమామ: చూ, చంద్రుఁడు; 4. కమలము, తామర*: చూ, పద్మము. 1; 5. కుడ్యము, గోడ: చూ, మఱుఁగుగోడ; 6. ఉదకము: చూ, నీరు.1; 7. మొగులు: చూ, మేఘము. 1; 8. ఆఁడుగుఱి: చూ, భగము. 12, 9. ఇంద్రుఁడు: చూ, వేలుపుఱేఁడు; 10. బృహస్పతి: చూ, వేలుపుటొజ్జ; 11. మొల, బండినిలాగు చట్రము: చూ, చక్రము. 10; అవ్య. 12 ఓహో: చూ, సంబోధనము; 13. అభిమంత్రణము, పిలుచుటనుదెలిపెడి: చూ, సంబోధనము; 14. తలంపునుదెలిపెడి: చూ, స్మృతి.1; 15. కృపార్థకము, దయనుదెలిపెడి: చూ, దయ; దే. అవ్య. (1) ప్రశ్నమునుదెలిపెడి. "క. వారు దెసలొత్తికొనియుం ధ, రారాజ్యం బిచ్చి పోయిరో పోరో (పోయిరా పోరా) తా, రారణ్యకీడఁబడియును." భార. ఉద్యో. 2, అ. 204: చూ, ప్రశ్నము; (2) సంబోధనమును దెలిపెడి. "సంబోధనార్థమై చేసునో యనంగ." ఆం, భా. తృ. కాం. అవ్య. 72: చూ, సంబోధనము; (3) సందేహమును దెలిపెడి. "ఈశ్వరుండను కాలింపఁదలంచునో తలఁపఁడో." భాగ. 10, స్కం. 1725: చూ, సంశయము. (4) పిలుచునపుడు ఎచ్చరించుకొనుటను తెలుపును. "శా. ఓనా వేఖరబంధముల్ చెఱపవే యోదేవకీనందనా." ఉ, హరి. 2, అ. 129: చూ, సంబోధనము; (5) ఊహను దెలిపెడి. "మేలుఁదొరకొను విధమెట్లో." భార. శాంతి. 3, అ: చూ, యోచన; (6) ప్రార్థనాదులను దెలిపెడి. "ఉ. రం, డో వనవాసులార వినరో మునులార యనాథవాక్యముల్." వీర. 2, అ; "కుటుంబసహితంబై చేరుఁడో నాకముకా." (ఇక్కడ విధిని తెలిపెడి) కాశీ. 5, అ. 278: చూ, ప్రార్థన; (7) ఆర్త్యర్థకము, ఆర్తిఁ దెలిపెడి. "తే. ఒక్కడనుబాధముండు కొట్టోయనంగ,నన్నుఁ జెఱఁగొని పోయెదునన్నలార, యెవ్వరికువిడిపింతురే యింతవట్టు, పుణ్యమునఁబోవగయ్య కారుణ్యబుద్ధి" భాగ. అర. 5, అ. 177: చూ, దుఃఖము; (8) విక్రియార్థకము. అమ్ముటను దెలిపెడి. "పల్లోపల్ల, పెరుఁగో పెరుఁగు, కూరోయన్న తోఁటకూర.": చూ, విక్రయము; (9) ప్రార్థనార్థకమువిూఁద వచ్చువాని లోనొకటి ప్రార్థనార్థకమువిూఁద వచ్చునవి. "ఇ - ఈ - ఎ - ఏ - ఒ - ఓ" అనునవి; పా. (10) వక్రములలో నొకటి. వక్రములు.— "ఎ - ఏ - ఒ - ఓ." లు; (11) దంత్యములలో నొకటి. దంత్యములు.—"అ- ఆ- ఉ- ఊ-ఒ-ఓ-ఔ-"; (12) ఊష్ములలోనొకటి. ఉష్ములు.— "ఉ - ఋ - ౠ - ఏ - ఓ" (13) గుణములలో నొకటి. గుణములు.— "ఏ - ఓ - అర్ - అల్."; (14) దీర్ఘాక్షరములలో నొకటి. దీర్ఘములు — "ఆ, ఈ, ఊ, ౠ, ౡ, ఏ, ఐ, ఓ, ఔ."

ఓమ్. సం. అవ్య. 1. అంగీకారార్థకము: చూ, సమ్మతి. 1; 2. పరబ్రహ్మార్థకము: చూ, పరమాత్మ; 3. ప్రారంభార్థకము: చూ, యత్నము;

పా. 4. అకార, ఉకార, మకారములను త్ర్యక్షరసంయోగముచే ఓంకారము సిద్ధమగుచున్నది. ఓంకారము వేదములయొక్క సారభూతము. ఉపనిషత్తులు దీని మహిమను గానముచేయుచున్నవి. యోగాదిశాస్త్రములు దీని నుపాసించుచున్నవి. బ్రాహ్మణగ్రంథములును, స్మృతులును, భగవద్గీతలును దీనిని ప్రశంసించుచున్నవి. దీని కనేకార్థములు గలవు. ఇది ప్రణవము. ప్రణవము మంత్రరాజములలోని కెల్ల శిరోమణి. (చూ, ఉద్గీథము.) పరమేశ్వరునియొక్క అన్యనామములవలెగాక ఇది పరమేశ్వరునివలెనే అవ్యయము, నాశరహితము, ఏకాక్షరము, లింగ - విభక్తి - వచనరహితము, సర్వగర్భము, అతి గంభీరము. సమస్త బ్రహ్మాండమును దీనియందిమిడియున్నది. ఈ ఓంకారమునందలి మూఁడక్షరములు జగత్తునందలి సర్వత్రిపుటల(చూ, త్రయము.) యొక్క సూచకములై యున్నవి. ఓంకారమువలె దానియందలి యక్షరసంఖ్య మూఁడు అంకెగూడ ఒక విచిత్రసంఖ్య (Mystic Number) అయియున్నది. అనఁగా మూఁడుచే ఏసంఖ్యను గుణించినను సరే ఆగుణింపగావచ్చిన అంకె, లేక, అంకెలమొత్తము మూఁడుగాని మూఁడుచే సరిగా భాగింపఁబడు సంఖ్యగాని అయియుండును ఉదా.— $3 \times 7 = 21$; $2 + 1 = 3$ $3 \times 44 = 132$; $1 + 3 + 2 = 6 = 3 \times 2$. $3 \times 171 = 513$; $5 + 1 + 3 = 9 = 3 \times 3$. $3 \times 976 = 2928$; $2 + 9 + 2 + 8 = 21$; $2 + 1 = 3$. తొమ్మిదికూడనిట్టిదే. ఇత్యాది. ఈప్రకారమునసమస్తసంఖ్యలును, సంఖ్యాశాస్త్రమునుగూడ ఓంకారాంతర్గతమైయున్నవి. అనఁగా పరబ్రహ్మస్వరూపమై యున్నది. ఓంకారమునందు సమస్తజగత్తు నిమిడియున్నది. ఎటులనన్న "ఓ" అని మొట్టమొదట నోటిని కొంచెము తెఱచుచున్నాము. అనఁగా సృష్టికర్త ప్రారంభము. "ఓ" అని మఱికొంచెము దీర్ఘముగ నుచ్చరించుచు నోటినట్లే కొంచెము సేపుంచుచున్నాము. అనఁగా స్థితికర్మ యగుచున్నది. "మ్" నుచ్చరించి నోటిని మూసివేయుచున్నాము. అనఁగా లయకర్మ యగుచున్నది. సృష్టిస్థితిలయములిట్లు పిండమునందు క్షణకాలమున జరుగుచున్నవి. కాన జగత్తంతయు ఓంకారమునం దిమిడియున్నది. త్ర్యక్షరయుతమైన ప్రణవము త్రిగుణాత్మకమైన సమస్తజగత్తును దానికర్తనుగూడ సూచించుచున్నది. ఓంకారముయొక్క సంక్షిప్తార్థము "అ" కారము విరాడగ్ని విశ్వాదులను, "ఉ" కారమునకు హిరణ్యగర్భవాయుతైజసాదికములను, "మ" కారమునకు ఈశ్వరాదిత్య ప్రాజ్ఞాదికములును సూచకములు: (చూ. ఉద్గీథము.3.); కేశవాదినామంబు లిరువది నాలుగును "ఓం"అను ప్రణవముతో ప్రారంభింపఁబడును.—ఆనామములీక్రింద వివరింపఁబడును.—(ఆచమనము.) ౧. ఓమ్ కేశవాయ స్వాహా=ప్రవృత్తియందు బ్రహ్మ విష్ణు రుద్రస్వరూపులుగాను లయమందొక పరమాత్మగా నుండుటయే స్వభావముగాఁగల వస్తువే కేశవుఁడు. అట్టివస్తువు నాపాపములను లెస్సఁగా భస్మీకరించుఁగాత! ౨. ఓమ్ నారాయణాయస్వాహా = ముక్తిస్థానమైనదియు శుద్ధచైతన్యస్వరూపమయిన వస్తువే నారాయణుఁడు అట్టివస్తువు నాపాపములను లెస్సఁగా భస్మముఁజేయుఁగాత! 3. ఓమ్ మాధవాయ స్వాహా=మాయ అవిద్యలను వణఁకించువాఁడు; జ్ఞాన, ధ్యాన, యోగములచే పొందఁదగినవస్తువే మాధవుఁడు. అట్టివస్తువు నా పాపములను లెస్సఁగా భస్మముఁజేయుఁగాత!

౪. ఓమ్ గోవిన్దాయనమః=మనస్సు మొదలగు సమస్తేంద్రియములను నడుపు అంతర్యామి యగు వానికొఱకు నమస్కారము; ౫. ఓమ్ విష్ణవేనమః = సమస్తములోను బ్రవేశించి వ్యాపించియుండు వస్తువుకొఱకు నమస్కారము; ౬. ఓమ్ మధుసూదనాయనమః=అసురస్వభావమును నశింపఁజేయు వస్తువుకొఱకు నమస్కారము; ౭. ఓమ్ త్రివిక్రమాయనమః=సకలజగత్తును వ్యాపించియుండు వస్తువుకొఱకు నమస్కారము; ౮. ఓమ్వామనాయనమః = మంగళకరములగు వేదములచేఁ బొగడఁబడు వస్తువుకొఱకు నమస్కారము; ౯. ఓమ్ శ్రీధరాయనమః=కీర్తివహించిన వస్తువుకొఱకు నమస్కారము; ౧౦. ఓమ్ హృషీకేశాయ నమః=ఇంద్రియములను నియమించు వస్తువుకొఱకు నమస్కారము; ౧౧. ఓమ్ పద్మనాభాయనమః= హృదయకమలమునందు ప్రకాశించు వస్తువుకొఱకు నమస్కారము; ౧౨. ఓమ్ దామోదరాయనమః=శమదమాది షట్కసంపత్తివలన సంస్కరింపఁబడిన శుద్ధమనస్సుచే బొందఁదగిన వస్తువుకొఱకు నమస్కారము; ౧౩. ఓమ్ సఙ్కర్షణాయనమః= లెస్సఁగా పాపనిర్మూలముఁ జేయు వస్తువుకొఱకు నమస్కారము; ౧౪. ఓమ్ వాసుదేవాయ నమః= అంతటను ఆత్మస్వరూపముగా నివసించు వస్తువుకొఱకు నమస్కారము; ౧౫. ఓమ్ ప్రద్యుమ్నాయనమః = స్వయం జ్యోతిస్స్వరూపము కొఱకు నమస్కారము; ౧౬. ఓమ్ అనిరుద్ధాయనమః = బంధరహితమైన వస్తువుకొఱకు నమస్కారము; ౧౭. ఓమ్ పురుషోత్తమాయనమః = సమస్త జీవులయందును వ్యాపించియుండు శ్రేష్ఠమైన వస్తువుకొఱకు నమస్కారము; ౧౮. ఓమ్ అధోక్షజాయనమః = సమస్తేంద్రియములచే తెలిసికొనఁబడని వస్తువుకొఱకు నమస్కారము; ౧౯. ఓమ్ నారసింహాయనమః=ఎట్టివిధమైన నాశనముకులేని వస్తువుకొఱకు నమస్కారము; ౨౦. ఓమ్ అచ్యుతాయనమః = అన్నియును నశించినను తానునశింపని వస్తువుకొఱకు నమస్కారము; ౨౧. ఓమ్ జనార్దనాయనమః = జననమరణములను పోఁగొట్టు వస్తువుకొఱకు నమస్కారము; ౨౨. ఓమ్ ఉపేంద్రాయనమః = పరమైశ్వర్య వస్తువుకొఱకు నమస్కారము; ౨౩. ఓమ్ హరయే నమః=భక్తులయొక్క పాపములను హరించు వస్తువుకొఱకు నమస్కారము; ౨౪. ఓమ్ శ్రీకృష్ణాయనమః=భక్తులయొక్క మనస్సును ఆనందమయముగాఁజేయు వస్తువుకొఱకు నమస్కారము. (ఆచమనము = కర్మానుష్ఠానముసకు పూర్వము మూఁడుసారులు జలపానముఁ జేసి క్రమముగా (ఓమ్కారముతోఁగూడిన) అష్టాంగస్పర్శ రూపక్రియలను జేసినవాఁడు సాక్షాత్ శ్రీమన్నారాయణ ప్రసాదపాత్రుఁడై శుద్ధుఁడై వేదచోదితకర్మల కర్హుఁడగుచున్నాఁడు. దీనికే 'Self Mesmerism'' అనిపేరు. ఇవి ఓమ్కారముతో కలిపి ఉచ్చరించు నామములుగాన ఇచ్చట వివరించుట అవసరమనియెంచి వ్రాయఁబడియెను.) "శ్లో. ఓంకారవాచ్యస్త్వం రామ వాచామవిషయః పుమాన్, వాచ్యవాచక భేదేన భవానేవ జగన్మయః" ఇత్యాదిః చూ, ప్రణవము, ఉద్గీథము.

ఓంకార. సం. వి. ఆ. స్త్రీ. బుద్ధునిభార్య, అనంత: చూ, స్వాహ. 2.

ఓంకారము. సం. వి. అ. పుం. ప్రణవము, కలాపము. (సర్వభూతములను రక్షించునది.) చూ, ఓమ్.

ఓంకారేశ్వర మాహాత్మ్యము. వా. వర్ణన.—“సీ. ఆనందవిపినంబు నందాదిబ్రహ్మ దపమాచరించె నత్యంతనిష్ఠఁ, బర్యాయమున నేఁగెఁ బదినాలుగు యుగంబులంతఁ బాతాళలోకాంతరమున నుండి యుత్థితమయ్యె నొకదివ్యలింగంబు బహుకోటిరవి విభాభాసితంబు, విధియు నొకింత భావించునే తేజమా తేజంబు లింగమూర్తి, త్వమెందె. గీ. భూరిభవనాగ్ర భాగవిస్ఫుటనవేళ, సంభవించిన ఛటఛటచ్ఛబ్దధారఁ, గ్రమముతోడ సమాధియోగంబు విడిచి,కన్ను లెనిమిదియును విచ్చెఁగమల భవుఁడు. సీ. ఆదిమతేజంబు నంధకారముదోఁచెఁ గైటభారాతి యకారరేఖ, పటుఁడాడఁ జాడఁ బ్రత్యక్షమయ్యెను కారమంబుజాసను నిరూపంబుఁదాల్చి, తదనంతరంబ చంద్రశిఖావతంసు చందంబుఁ గైకొని మకారంబు మెఱసె, సంతతశబ్దబ్రహ్మమైన నాదంబున భువన హేతువును బిందువును దోఁచె ॥ గీ. నఖిలమును గూడి యోంకారమయ్యెఁ బిదపఁ, గ్రమముతోఁ గుంభభవ! యకారమును కారమును మకారంబునగు వర్ణములను నాద,బిందువులు ధాతయుగ్రంబునందునిలిచి.” కాశీ. 6, ఆ 248—249.

ఓంకారేశ్వరుఁడు. సం. వి. అ. పుం. ముక్కంటి: చూ, శివుఁడు.

ఓండ్ర. దే. వి. గాడిదయొక్క కూఁత: చూ, స్వరము. 2.

ఓండ్రపెట్టు. దే. అ. క్రి. గాడిదకూయు: ఓండ్రించు.

ఓండ్రించు. దే. అ. క్రి.—వై.—

ఓంబాయి. వా. 1. ఇద్దఱుపిల్లలు తమచేతుల మీఁద ఇంకొకపిల్లను మోచుచు నాడెడు ఆటలోనగు ధ్వన్యనుకరణము: చూ, హూహా; 2. పాలకీ మున్నగువానిని మోయువారల ధ్వన్యనుకరణము: చూ, హూహూ.

ఓక్. ఆం. సింధూరవృక్షము.

ఓఁక. సం. వి. ఆ. స్త్రీ. కరమర్దము, పుల్లకలివె *: చూ, పొట్టుపువ్వుఫల.

ఓక. సం. వి. ఆ. స్త్రీ. అరవాలిక, కంకికోటు: చూ, ప్రాచీనము. 1.

ఓకణము. సం. వి. అ. పుం. పేను: చూ, యూకము

ఓకణి. సం. వి. ఈ. స్త్రీ —వై.—

ఓకము. సం. వి. అ. న. 1. ఇల్లు: చూ, గృహము. 1; 2. చోటు: చూ, స్థానము. 1; 3. శీఘ్రము: చూ, వేగము. 3.

ఓకర. వై. వి 1.= ఉద్గారః. ప్రచ్ఛర్ది (పిత్తవ్యాధి లోఁగువానిచే ధ్వని పూర్వకముగా కడుపునుండి నోటిలోనికివచ్చిన డోఁకు.): చూ, వాంతి; 2. దూఱు: చూ, నింద. 1; 3. అసహ్యము: చూ, రోఁత. 2.

ఓకరించు. వై. అ. క్రి. 1 ఓకరవచ్చి ఉమియు: చూ, వెళ్ళగొట్టు; 2. అసహ్యించు: చూ, రోఁతపడు.

ఓకరింత. వై. వి.=వికార-ఉద్గారః చూ, ఓకర. (రూ-ఓకలింత.)

ఓకలివె. దే. వి. కృష్ణపాకఫలము, కలివె *: చూ, పొట్టుపువ్వుఫల.

ఓకస్సు. సం. వి. స్. న: చూ, ఓకము.

ఓకిలి. వై. వి.=ఉద్గారః : చూ, ఓకర.

ఓకిలించు. వై. అ. క్రి. 1. డోఁకు: చూ, వెళ్ల గొట్టు; 2. అసహ్యించు. “చ. మనమున నోకిలించి.” ఉ, హరి. 3, ఆ. 14; కాశీ. 5. ఆ. 55: చూ, రోఁతపడు.

ఓకిలింత. వై. వి. = వికార, ఉద్గారః చూ, ఓకర. (రూ-ఓకరింత.)

ఓకు. వా. వి. 1. దూరవస్తుదర్శన యంత్రము: చూ, దుర్బిణి; 2 ఒడుపు.

ఓక్యము. సం. వి. అ. న. మంచితావు, ఇంటి కనుకూలమైన స్థానము: చూ, స్థానము. 1. (నెల్లూరుజిల్లా ప్రాంతముల వాడుక.)

ఓక్రి. అం. బెండ; (బహువిదారణ పుటక ఫలము=బెండకాయవంటి వనేకగదులను గలిగి యనేక విధములుగా పగులును.)

ఓగాత్యము. వై. విశే. = అవజ్ఞాత - అవాచ్య. అమంగళము, అశుభమైనది: చూ, ఓగు. 2.

ఓగితము. వై. వి.=యుక్తమ్-యోగ్యమ్. ఇమ్ము “సీ. ఆటలు పసిబిడ్డయాటలై పెంపజెయొరుల యాటలఁబడి నోగితముగ.” లక్ష్మీ. 2, ఆ, 90; “ఉ. అల్పునిగతిం గొఱమాలిన కుక్కి మీఁదనీ, రాజనసాధు పాటువడ నోగితమైతె మదీయవల్లభా.” భో. 5,ఆ 288 చూ, యోగ్యము. 2.

ఓగిరము. వై. వి.=ఆహారః. రూ-ఓయిగము-ఓరె ము, అన్నము; కాశీ. 4, ఆ. 133: చూ, సాదము (1).

ఓగిరాల జగన్నాధకవి. పా. 19 శతాబ్దము. ఇతఁడు రచించినవి సుమనోమనోభిరంజనము, ఆంధ్రపద పారిజాతము.

ఓగు. దే. వి. 1. అశుభము, కీడు. ‹‹ఓగుదాన వచ్చు.” ‹‹ఓగుబాగెఱుఁగని.” వేమన. 818; చూ, హాని. 2; విశే. 2. అశుభము, కీడైనది. ‹‹అది ఓగోబాగో.”: ఓగాత్యము; (సం. ప):— అమంగళము, అప్రశస్తము, అవజ్ఞాతము, అశుభము; 3. అజ్ఞాని. ‹‹ఆ ఓగునోగుమెచ్చు” వేమన. 817: చూ, మూర్ఖుడు.

ఓగులాడుచు. దే. అ. క్రి. దేవురించు: చూ, దైన్యపడు.

ఓఘము. సం. వి. అ. పుం. 1. మూఁక: చూ, సమూహము; 2. అంపాచారము: చూ, ప్రవాహము. 1; 3. క్రమపద్ధతి: చూ, పరంపర; 4. కరచరణాదిగతి విశేషములయొక్క సమవాయము, నృత్తగీతాదుల కాలము: చూ, తాళము. 2; 5. ఉపదేశము, మంచిమాట: చూ, హితవచనము.

ఓఘవతీపరిణయము. పా. ఈగ్రంధకర్త అక్కెనేపల్లి నృసింహకవి. (18 శతాబ్ది.)

ఓచెల. దే. అవ్య. రూ-ఓచెల్ల. సంతాపార్థకము. ‹‹మ. కలుచంగోకబిలంబు వెల్వడి... యాతని రిపుప్రష్మసాలసంఘాత పో, చెల హస్తాంబురుహాంగుళీ మయమహాసిద్ధావృద్ధ పల్లవాంచలముల్ మేసి భజించు జాంగలిః తఱి సంగ్రామ రంగంబులన్.” నై. 5, ఆ. 157 (కొన్ని ప్రతులయందు ఒచ్చెల అనియు కలదు.): చూ, సంతాపము.

ఓచెల్ల. దే. అవ్య. —వై.— “క. ఓచెల్ల విగహీణీవధ, పె చతురతనీకు.” స్వా. 8, ఆ.36

ఓజపదాంతము. పా. (క్వాడేౢటీవక.)

ఓజము. సం. వి. అ. పుం. 1. (జ్యోతిశ్శాస్త్రమునందు) బేసి: చూ, విషమము, అం 2. కావ్యగుణములు పదింటిలో నొకటి: చూ, కావ్యగుణములు.

ఓజస్సు సం. వి. స్. న. 1. తేజము, జ్యోతి: చూ, వెలుతురు. 1; 2. బలము: చూ, శక్తి. 1; 3. ఉత్సాహము, పూనిక: చూ, యత్నము; 4. కిరణము: చూ, మయూఖము. 1; 2. ఆతపము, ఎండ: చూ, వెలుఁగు. 3; అం. 6. గుణములు ఇరువదిమూఁడింటిలో నొకటి: చూ, గుణములు.

ఓజస్వీత. సం. వి. ఆ. స్త్రీ. ఓజస్సు కలవాఁడుగానుండుట.

ఓజస్వీత్వము. సం. వి, అ. న. —వై.—

ఓజస్వుఁడు. సం. వి అ. పుం. బలము మున్నగునవి గలవాఁడు: చూ, లావరి.

ఓజోభివృద్ధి. సం. వి. ఇ. స్త్రీ. బలము పెరుగుట.

ఓజోశనము. సం. వి. అ. పుం. ఒకానొక జ్వరము: చూ, రోగము. 1.

ఓజోహైన్యము. సం. వి. అ. న. బలముతగ్గుట.

ఓజె. వై. వి. 1.= ఓజః. భయము. "చ. ఇర్వది భుజశాఖలుతో బదిశిరంబులు నోజెయొనర్పఁ జూడ్కికిన్." రా. అర, కాం. 2, అ. 105: చూ, వెఱపు; 2.=ఓజః. రూ-ఒజ్జ. ఉపాధ్యాయుఁడు. "సీ. మురసంహారయితఁడుమాయాజాలములకు నాడోజెసకల, మాయలు నీచేతమడిసె." భార. స్త్రీ 2, ఆ. 136: చూ, పంతులు. 1; 3.= ఊర్జ. ఉత్సాహము, పూనిక. "మ. హాలికుండెంతయు నోజెతోడునఁగ సీరాగ్రంబునంజోఁకి ప్రాఁగ్బలనేకంబులు సచ్చు." భార. అర. 5, ఆ. 57: చూ, యత్నము

ఒజెపడు. ద్వ. అ క్రి. యుక్తమగు, క్రమపడు: చూ, సరిపడు.

ఓజెబంతి వై. వి. ఒజ్జబంతి. "ఎ, గీ అనుపమ క్షాత్త్ర ధర్మ, పరతన్త్రప పంక్తికిఁడోజెబంతియనఁగ." కా. 1, ఆ: చూ, మేలుబంతి.

ఓజు. దే. వి. కమసాలి: చూ, స్వర్ణకారుఁడు.

ఓట. దే. వి 1. భయము, దిగులు. "ఉ. ఎర్వ తెవ్వఁడు భీతవారిణేక్షణ యొంటిఁజరించె దోటలేక్కివ్వన భూమి." స్వా. 2, ఆ. 39: చూ, వెఱపు; 2. జంకు. "ఉ. ఓటయొకింత యేనియు సుయోధనుచిత్తమునందు లేమనీ, మాటలఁబోవునే దురభిమానము యెక్కుడు పూనుఁగాక." భార ఉద్యో. 3, ఆ, 104: చూ, సంకోచము. 3.

ఓటమి. దే. వి. 1. భయము, దిగులు. "క. ఓటమితో నెల్లప్పుడు, పాటవమునఁ బనులు చేసి." భాగ. 1, స్కం. 104: చూ, వెఱపు; 2 భంగము, చెఱుపు. "క. కావున నీయోటమినీ, కేవిధమునఁ బాయు." కళా. 7, ఆ. 207: చూ, హాని. 2; 3. అపజయము: చూ, పరాజయము.

ఓటము. దే. వి. అపజయము. "వ. దుర్యోధనపరాయణుండైన యశ్వత్థామరాయణుండు గాలుపునోటంబును సరిగాసద్దోద్వయంబుతో వినోదించుచు." ఉ, హరి. 3, ఆ. 156; "నాయికలంగందర్పుఁ డోటంబొఱఁగఁ దలిమి." ఆము. 5, ఆ: చూ, పరాజయము.

ఓటరు. ఆం. (రూ- వోటరు.) వోటు నిచ్చువాఁడు.

ఓటర్లపట్టిక. పా. (ఎలెక్టోరల్ రోల్.)

ఓటర్లు. పా. బ. అభ్యర్థులకు ఓట్లువేయువారు. (రూ-వోటర్లు.): చూ, ఓటరు

ఓటఱు. దే. అ. క్రి. రూ- ఓటాఱు. అశక్తియగు. "గీ. వల్లియలువైచి రోదముల్ పెల్లుదన్ని, తార్చివేసతి యూరుల్లాగ్గి తనిసిడయ్యాఁ, దోలిపోటటిపోనీక దొడ్డినాఁగి, పాడువడఁ వను నలుదెసఁబొంచియోడి." హరి. పూ 6, ఆ. 131: చూ, నిస్సత్త్వమగు.

ఓటాఱు. దే. అ. క్రి.—పై.— "క. వేటకు విలుగొని యమ్ముల, గిటిమెఱుఁగు నారసములు గిటికొలిపినఁ, బోటిమెయింగ్రొన్నెత్తురు, పాఱునతఁడు తేరిమీఁదఁబడి మూర్ఛిల్లెన్." భార. ద్రోణ. 5, ఆ. 138. (ప్రే. ఓటాఱుము.)

ఓటి. దే. వి విముఖత్వము.

ఓటికుండ. దే. వి. పగిలినకుండ: చూ, భాండము. 3.

ఓటిపలుకు. దే. వి. 1.బొజ్జముగాని పగులుగానిఁగల కుండలోనగువానిపలుకు; 2. పసలేనిమాట, ఉత్తమాట: చూ, మాట, 1.

ఓటిమాట. దే. వి. ఉత్తమాట, ఓటిపలుకు: చూ, మాట. 1.

ఓటిల్లు. దే. అ. క్రి. ఓడు. "ద్వి. తన్నియంత టెంబోక తనవీటిలోన నున్నఁ జెంపుమఁ నియోటిలకాడె." రా. యు, కాం: చూ, సంకోచించు.

ఓటిల్లుచిందఱ. దే. వి. ఒకానొక బాలక్రీడ. "ఎ, గీ. చిక్కు-వాబిల్లలోటిల్లు చిందఱాది,యైన శైశవక్రీడా విహారసరణి." కాశీ. 3, అ. 33: చూ, బాలక్రీడ.

ఓటీశదేశరాజు. శా. (శ్రీయుత నీలకంఠదాస పండితులు. ఎమ్. ఎ. ఎమ్. ఎల్ ఎ.) తిపేటులో దొరికినచరిత్రలో నాగార్జునుఁడు ఓటీశదేశరాజును బౌద్ధునిగాఁ జేసినట్లు కనఁబడుచున్నది కళింగ. 272. పుట.

ఓటు. దే. వి. 1. అపజయము: చూ, పరాజయము; 2. భంగము, చెఱుపు: చూ, హాని. 2; అవ్య. 3. ప్రశ్నార్థకము. "తే. నీటఁబుట్టినవాఁడు కాఁడోటువచ్చె, గెల్చుచున్నాఁడు జగమెల్లఁ గరుణలేక." స్వా. 3, ఆ. 41; పా. 4. అభ్యర్థికి వేయు జయసూచకపు గుఱుతు(+) "వానికి ఓటు నిచ్చినాఁడు. గెలిచితిని" (రూ-వోటు.)

ఓటుపడు. దే. వి. 1. ఓడు. "వ. ఏనోటుపడితినేని నఖిలమహీరాజ్యంబు నీయది. నీవోటుపడితేని దమయంతి నాయది." భాగ. ఆర. 2, అ. 224: చూ, కెనుదీయు 1; 2. ప్రమాదపడు. "వ. మతియును ప్రియాలాపంబులు పలుకుచోమాయు మృదుమధుర భాషణంబులకు నోటుపడి గార్దభం బిట్టనియె." పంచ. వా. 4, అ. 98: చూ, మోసపోవు; స. క్రి 3. అవమానపెట్టు. "గీ. మున్ను దనోటువడి మతివన్ను నోటుపడియునో నన్ను మున్నోటువడి విభుండు, గ్రిన్నఁదన్నోటు వడియునో యన్న నాకు, దెలుఁగఁజెప్పుము దీనినీవెఱుఁగుదేని." భార. సభా. 2, ఆ. 209; "తరువోజ. ధర్మతనూజుండు దానోటువడియె" భార. సభా. 2, ఆ. 207: చూ, భంగించు.

ఓటుపాటు. ద్వ. వి. అపజయము. "గీ. మొనసి నిశితాస్త్రములు వాని ముఖమునిండ, దీటుకొలిపిన వాఁడోటుపాటులేక" అధ్యా. యు, కాం 1, అ 325: చూ, పరాజయము.

ఓటువచ్చు. దే. క్రి. ఓటువోవు.

ఓటువోవు. దే. స. క్రి. (ఓటు + పోవు) అవమానపెట్టు. "సీ. ధర్మతనయునిచేనిష్టదన చెద్దు ఫలియించె ననియను జూదంబునందు ప్రాణ॥ ఆ. మోటువోయె." భార. స్త్రీ. 2, అ. 186: చూ, భంగించు

ఓటుసేయు. ద్వ. అ. క్రి. (ఓటు + చేయు) —పై.— "క. పొన్నపువ్వుతోడఁ బోల్చు లోకులమాట, నోటుచేసి..... వేశ్యకాంద్రమాట నేటుచేసి." రవి 6, అ. 100.

ఓడ. వై. వి.= పోతః. నావ, తరణి. "ఆ. ఓడసత్యమెల్ల నొగిసముద్రములోన." వేమన. 322: చూ, పోతము.

ఓడంగి. వై. వి. 1. ఓడవాఁడు, నావికుఁడు: చూ, సరంగు; 2. చిన్నదోనెనడపువాఁడు, పడవవాఁడు: చూ, సరంగు; 3. దోనెకులో తట్టువేసెడు చూలము.

ఓడకంబము. ద్వ. వి. ఓడనడుమ వేయు నిడుపాటి స్తంభము. ఓడకొడికంబము: చూ, కూపము. 3.

ఓడకేవు. ద్వ. వి. అతగము: చూ, తరపణ్యము.

ఓడకొడికంబము. ద్వ. వి: చూ, ఓడకంబము.

ఓడకొయ్య. ద్వ. వి. గుణవృక్షకము: చూ, స్తంభము. 1.

ఓడపల్లి. శా. రూ-వాడపల్లి. (శ్రీయుత భావరాజు వేంకటకృష్ణారావుగారు, బి, యె, బి, యెల్.) ముఖలింగము — (వంశధార) నదికిపుడు పడమటిరెయొడ్డున వాడవలస యని యు, ఓడవలస, వాడపల్లి, (ఓడపల్లి) యని యు రెండుగ్రామములు ఒకదానికొకటి అరమైలు దూరమున నుండినట్లు గ్రామవాస్తవ్యులు దెలుపుదురు. కళింగ. 196 పుట.

ఓడప్రియాణీకుఁడు. పా. కలమరి.

ఓడమాలి. ద్వ వి: చూ, సరంగు

ఓడము. సం వి. అ. పుం. రాగాలాపము, ఆలప్తి చూ, స్వరము. 2.

ఓడరేవు. పా. (పోర్టు) రేవుపట్టణము. "బందరు ఓడరేవులలో గొప్పది."

ఓడించు. దే. స. క్రి. గెలుచుకొను: చూ, జయించు. (రెఫ్యూలస్.)

ఓడిక. సం. వి. అ. స్త్రీ. 1. ఒకరకము వడ్లు: చూ, ధాన్యము; దే వి. (1) జలదారి: చూ, తూము. 2; (2) తనయిచ్చ వాకిలినీరు, అంపాచారము. "క. ఏడాకు పొన్నకొమ్మలు... బై, నోడికలయి పువ్వుఁదేనెలు గలఁగ నొప్పెక్." హరి. పూ. 7, అ. 117; "చ. అనవిని నే ఘనవర్షుఁడని లాత్మజుతో నను...సురసింధులోయములఁ గూడిన యోడిక వాఁగుకై వడిక్." జై. 1, అ. 99: చూ, ప్రవాహము. 1; 3 మనుష్యులచేతఁ దవ్వఁబడిన చిన్న నీటికాలువ, కుల్య: చూ, నది.

ఓడిగిల్లు. దే. అ. క్రి. 1. ప్రవహించు. "గీ. ఉదకమున్నత భూమిపైనుండలేక, పల్లమున కోడిగిల్లినపగిది." కాశీ. 8, అ. 101: చూ, వెల్లిగొను; 2. పరుగిడు. "క. వెన్నెల పడమటి దిక్కునకుఁ, బలపలనై యోడిగిలఁగఁ బలపల వేగెక్." జై. 1, అ. 186: చూ, పరుగెత్తు; 3. కొలు. "సీ. బ్రహ్మరంధ్రము పోవఁ బాతి యయ్యెందిద్రియద్రవ మోడిగిల్లె నేత్రముల లోన." కాశీ. 4, అ. 174: చూ, స్రవించు.

ఓడినక్కు. ద్వ. వి పొట్టినక్కు: చూ, నక్కు. (అప్ర)

ఓడు. దే. వి. 1. అపజయము, ఓటమి: చూ, పరాజయము; 2. ధార, కుండలోనగువాని తూఁటు. "ఓటికుండ.": చూ, రంధ్రము.1; అ. క్రి. 3. అపజయపడు. "క. వినుకర్ణునకే నోడితి, ననసేటికినీవు నోడితనిలజమాడీ, తనయులు మున్నే యోడిరి, మనతోఁగూడంగఁ గంసమర్దియునోడెక్." భార. కర్ణ. 3, అ. 58: చూ, వెనుదీయు. 1; 4. పరుగిడు. "చ. వెఱచినిమిలితాత్ములయి వెన్కకు దిరిగడి పువ్వుఁబోఁడులక్, వెఱవకుఁ డోడకుం డనుచు." హరి. పూ. 8, అ. 46: చూ, పరుగెత్తు. 5. బెదరు. "వ. అనిన నమ్మునివరుండు గరంబు సంతోషించి నాకు నిష్టంబుసేసిన దాన నీకన్యాత్వంబు దూషితంబుగా దోడకు మని దానికి వరంబిచ్చి నీవు వసువనురాజర్షి వీర్యంబునం బుట్టినదానవు గాని మాతకుల ప్రసూతవుకావని చెప్పి" భార. ఆది. 3, అ.41: చూ, వెఱచు; 6. కొఱుకు. "మ. అని ప్రార్థించినఁ జంప నోడి కృపతో నావేళకుం బోయె." మై. 2, అ: చూ, సంకోచించు.

ఓడుబిళ్ల. దే. వి. ఇంటిపైఁ గప్పెడు పెంకు. "కంపకూటోడు బి, ళ్లగరిడీలు శిలల కిలాతల ముల్." వసు. 4, అ. 72: చూ, పెంకు.

ఓడోమెటర్. ఆం. శకటవేగదర్శక యంత్రము.

ఓఢ్యాణము. సం. వి. అ. స. 1. ఒడ్డాణము: కాంచీభూష. "విచిత్రోఢ్యాణబంధేన కటిశోభాం విధాయ న." హాలాస్యమాహాత్మ్యము. 26, అధ్యాయము: చూ, భూషణము. 2; 2. కూర్చుండు పీఁట: చూ ,పీఁట.

**ఓఢ్రదేశము.** సం. వి. అ. పుం. 1. ఒరిస్సా అను ఓఢ్రదేశము, ఉత్కలము: చూ, దేశము; శా. 2. (శ్రీయుత నీలకంఠదాస పండితులు. ఎమ్. ఎ., ఎమ్. ఎల్. ఎ.) బుద్ధదంతము పూజ హిందువులవలంబించిన వెంటనే ఓఢ్రదేశముయొక్క ఆగ్యత్వమేర్పడి గౌఢ్రదేశము పవిత్రక్షేత్రమైనది కళింగ. 278. పుట; (శ్రీయుత భావరాజు వేంకటకృష్ణరావుగారు, బి. యె, బి. యల్.) ముఖ్యలింగము.—భువనేశ్వరదేవాలయము ఓఢ్రదేశమునందు వ్యాపించిన ఔత్తరాహ ఆర్యవాస్తు సంప్రదాయము ననుసరించి కట్టఁబడినదని నిర్ణయింతురు కళింగ. 202 పుట; (శ్రీయుత రాళ్లబండి సుబ్బారావుగారు, ఎం. ఎ, ఎల్. టి.) ఓఢ్రదేశము బౌద్ధయాత్రికులకు పుణ్యస్థలమని తెలియుచున్నది. ప్రసిద్ధిచెందిన నాగార్జునుఁడు కళింగ, ఓఢ్రదేశములను మహాయాన బౌద్ధమతశాఖలోనికిఁ బ్రవేశపెట్టెను. కళింగ. 508. పుట; ఇత్యాది.

**ఓఢ్రపుష్పము.** సం. వి. అ. పుం. జప దాస సము *: చూ, హయజీవనమారకము.

**ఓఢ్రము.** సం. వి. అ. పుం. 1. —పై—; 2. ఉత్కలమను ఓఢ్రదేశము. (చూ, ఓఢ్రదేశము.): చూ, దేశము; అ౦. 3. ఆర్యావర్తాదిదేశములలో నొకటి: చూ, దేశములు; 4. ఒకానొక భాష: చూ, భాష. 1. శా. 5 (శ్రీయుత అవసరాల జగన్నాథరావుగారు, బి. ఎ, బి. ఎల్.) "చౌక్కపాదు." (గుమ్మూరు—ఉదయగిరితాలూకా) ఈ ప్రాంతములలో కొందువారు ఓఢ్రము మాట్లాడగలరు. కళింగ. 37. పుట.

**ఓఢ్రుఁడు.** గు౦ వి అ. పుం.=ఒడ్డె, ఒడ్డెవాఁడు: చూ, ఒడ్డియ.

**ఓఢ్రులు.** శా. (శ్రీయుత రా॥ సుబ్బారావుగారు. ఎమ్. ఎ., ఎల్. టి.) ఇచ్ఛాపురము. పర్లాకిమిడి ప్రదేశములకు ఉత్తరభాగమునను పశ్చిమభాగమునను యెక్కువగా ఓఢ్రులు నివసించుచున్నారు. కళింగ. 10. పుట; తైత్తిరీయ ఆరణ్యకమందును మహాభారతము నందును ఓఢ్రులను జాతివారుగ పేర్కొనఁబడిరి; (శ్రీ శ్రీ శ్రీ విక్రమదేవవర్మగారు.) కళింగ రాజయిన చిత్రాంగదుని కూఁతును దుర్యోధనుఁడు పెండ్లాడినట్లు మహాభారత శాంతిపర్వమున నున్నను మీఁదనుదాహృతమైన "అంగవంగ కళింగేషు" అను శ్లోకమునుబట్టి కళింగదేశ మపవిత్రమయినదనియు, నందలి యాదిమవాసులు పతితులనియు, మ్లేచ్ఛులుగ నెన్నంబడు చుండిరనియుఁ దోపకమానదు. అట్టి యాదిమవాసులలో నోఢ్రులను తెగవారిప్పటికిని గలరు...మనుస్మృతి దశమాధ్యాయమందలి "శనైకస్తు" "పౌండ్రకౌడ్ర ద్రావిడాః" అను శ్లోకద్వయమునుబట్టి యోఢ్రులు పతితక్షత్రియులయి యనార్యులలోఁ జేరినట్లు కనంబడును. "తథా ధ్రాస్ధ్రావిడా న్పాండ్రాశ్చోళాంశ్చైవ సకేరళాన్." అని రామాయణమందును, "పాండ్యాంశ్చ ద్రవిడాంశ్చైవ సహితాంశ్చోఢ్రకేరళైః" అని మహాభారతమందును వారుగ్గడింపఁబడియున్నారు. వారుత్కళకళింగములోని "ఖొర్దా" ప్రదేశమున వసించుటవలనఁ దత్ప్రదేశము "ఓఢ్రదేశ" మయి; సామాన్యజన వ్యవహారమున "ఒడిశా" యయి ఆంగ్లోచ్చారణ ప్రభావమున నిపుడు "ఒరిస్సా" యయినది. ఇత్యాది. కళింగ. 545 పుట; (శ్రీయుత రా॥ సుబ్బారావుగారు. ఎం. ఎ, ఎల్. టి.) కొన్యోధ, ఓఢ్ర, ఉత్కళదేశములు కలసి ప్రస్తుతము "ఒరిస్సా" దేశమైనవి;...కళింగులప్రభ తగ్గిన తర్వాత ఉత్తర కళింగదేశములోనికి పశ్చిమ

ప్రాంతములనుండి ఓఢ్రులు వలసపోయిరి. ఈ సముద్రప్రాంతపు ఓఢ్రదేశము 10 000 చతురపుమైళ్లు విస్తీర్ణముగలది. పర్వతప్రాంత దేశము మూఁడింతలుండును. ఇత్యాది కళింగ. 557. పొగటు.

ఓణి. దే. వి. 1. ఉత్తరీయము, కంచుకా: చూ, వస్త్రము; 2. పరికిణీ (లంగా) పైన యుక్త వయస్సు వచ్చిన ఆఁడువారు భుజముపైకి వేసి కొను పైఁట: చూ, వస్త్రము. (రూ-ఓణీ)

ఓణీ. దే. వి. —పై.—

ఓతప్రోతము. సం. విశే. (అ. ఆ. అ.) నిలువు గాను, అడ్డముగాను అంతట వ్యాపించి యున్నది; విరివిగానున్నది చూ, వ్యాధము. 4.

ఓతము. సం. వి. అ. న. నిడుపుపోఁగులు.

ఓతువు. సం. వి. ఉ పుం. పిల్లి: చూ, మార్జాలము.

ఓతూపద్రవము. సం. వి. అ పుం. పిల్లివాఁపడి.

ఓతూపాగమము. సం. వి అ. పుం పిల్లిదగ్గఱకు వచ్చుట.

ఓదనభక్షిక. సం. వి. అ స్త్రీ. అన్నముతినుట.

ఓదనము. సం. వి అ. పుం. న అన్నము: చూ, సాదము. (1.)

ఓదనాహ్వయా. సం. వి. ఆ. స్త్రీ. ముత్తవపులగము *: చూ, సహదేవ.

ఓదము. వై. వి. క్వథ్రము, ఒగ్గము, ఏనుఁగును బట్టెడి పల్లము. "క. వల యురితాళ్లు ముగాలము, కలిగిక దామ్యగముఁ బట్టిగజము పుము ముద, త్తులు పట్టుమరట్లుయి లేద్, జ్ఞాలు విజ్ఞానంబు కలిమిఁజూతురు పురుషుల్." భార. శాంతి. 4, ఆ. 181; "గీ. వల్లియలు పైచి రోదముల్ పెల్లుద్రవ్వి" (ఇక్కడ వృషభములను పట్టుటకై ఘట్టము.) హరి. పూ. 6, ఆ; "ఇవ్వలవ్వలనుండి రొదత్రవ్వ కుండఁద్రవ్విన రోదంబులంబడి క్రవ్యాలుగల మవ్వంబునివ్వటిల్లం బట్టువడిన దివ్యంగు లును." ఉ, హరి. 4, ఆ. 29; "ద్వి అసురేశుఁడను లులాయముఁ బట్టితేర, నొఱపుగాఁ ద్రవ్విన రోదంబులనఁగ, నొఱపిన పరిఖలనెలకొన్నదాని" రా. యు. కాం: చూ, వారి. 6

ఓదారుచు. దే. స. క్రి: ఆశ్వాసించు: రూ- ఓదార్చు: చూ, సమాశ్వాసించు.

ఓదార్చు దే. స. క్రి. —పై.—

ఓదారుపు దే. వి. ప్రశ్రయము. రూ-ఓదార్పు: చూ, సమాశ్వాసించు.

ఓదార్పు. దే. వి. —పై.—

ఓదియ. దే. వి. కోఁతకోసి చేనియందక్కడక్కడ నుంచెడు పెన్నుపోఁచలప్రోగు. రూ- ఓద: చూ, పన.

ఓద. దే. వి. —పై —

ఓదెకొంగ. ద్వా. వి. ఓదెకాలువు పంటకాలములోవచ్చు ఒకరకము కొంగ: చూ, బకము.

ఓదెకొలుకు. ద్వ వి. —పై.—

ఓద్యోలి. సం వి. ఈ. స్త్రీ. అవహోలిక. కంచెకోటు: చూ, ప్రాచీనము 1.

ఓన్ డిమాండ్ బిల్ ఆం. చూపించఁగానే చెల్లించవలసిన హుండీ.

ఓనరు ఆం. స్వంతదారు.

ఓనరుషిప్పు. ఆం. స్వత్వము; స్వామిత్వము; హక్కు, యజమానత్వము.

ఓనస్. ఆం. ఋణభారము, బాధ్యత.

ఓనికట్టు. దే. వి. కొండలనడుమ గొందిదారి: చూ, కనుమ.

ఓపమి. దే. వి. బద్ధకము, జడ్డుదనము, స్త్యానము: చూ, విలంబము. 1.

ఓపిక. దే. వి. 1. ఓర్పు, బలము. "ఓపికవాని నీకుఁగల యోపిక వానికిలేదు.": చూ, శక్తి. 1; 2. క్షమ, ఓరిమి. "ఉ. ఓపికలేక

చచ్చిన మహోరగముం గొనివచ్చి కోపియై, తాపసుమూఁపుపై నిడిన దారుణచిత్తుఁడ." భాగ. 1. స్కం: చూ, వినయము. 1.

ఓపికకలవాఁడు. ద్వ వి. శ్రద్ధగలవాఁడు: చూ, శ్రద్ధధానుఁడు.

ఓపు. దే. వి. 1. బలిమి. "ఉ. అన్నవైఁ దప్పు ఘటించి నీవునాకతాలిమిగల్గిన వాఁడవైన పం,బొప్పినఁ జెల్లెనీదువిలుపోపున జాతము గాకయిప్పటన్." భార. విరా. 5, ఆ. 98: చూ, శక్తి. 1; 2. క్షమ, ఓరిమి. "వ. నీవు నాకు శాపంబిచ్చిననే నలిగి నీకుఁ బ్రతిశాపం బీనోపనవాఁడనుగాను వినుము." భార. ఆది. 1, ఆ. 188: చూ, శాంతము. 1; అ. క్రి. 3. శావలసినంతయగు: చూ, పర్యాప్తమగు; 4. చాలు "వాఁడీపని చేయనోపును": చూ, నేరుచు.

ఓపువాఁడు. ద్వ. వి. నేర్పరి: చూ, సమర్థుఁడు.

ఓపె. దే. అవ్య. స్త్రీనిపిలుచుటను దెలిపెడి: చూ, ఓమె.

ఓపెన్ క్రెడిట్. ఆం. ఎట్టిహామియు లేకుండఁగనే ఖాతాదారులకు బ్యాంకివారిచ్చు పరపతి.

ఓమటి. దే. వి. అన్నము, ఓగిరము. "సీ. అన్నంబు వెలయుచుండు, బువ్వరోమటికూడు బో నము వంటకం బోరెమోగిరమన." ఆం, భా. ద్వి. వై. 257: చూ, సాదము. (1)

ఓమనగాయలు. ద్వ. వి. బ. (ఓమన + కాయలు) ఓమనగుంటలాడు గింజలు.

ఓమనగుంటలు. ద్వ. వి. బ. ఒకానొక బాలిక క్రీడ. "మ. బొమ్మపెండ్లిండ్లు గుజ్జెనగూళ్ళు చ్చనగండ్లు పింపిళులుకుచ్చెల్ గీరసంగింజలో, మనగుంటల్" కళా. 6, అ: చూ, బాలికాక్రీడ.

ఓమనపీఁట. ద్వ. వి. ఓమనగుంటలాడుపీఁట.

(ప్రక్కకు ఏడేసిగళ్ళచొప్పున రెండుప్రక్కలకు పదునాల్గు గళ్ళుండును.)

ఓమము. దే. వి. దీప్యము. (సం- అజమోదా; హిం- అజవాయన్; అర- ఓమం.) *: చూ, యవాని.

ఓము. దే. స. క్రి. కాచు. "గీ. ధర్మసాధనంబు తనువుధర్మముపరి, జ్ఞానదాయియట్లు కానఁదనువు, నోమవలయు." భార. అశ్వ.1, ఆ.164: చూ, రక్షించు.

ఓమె. దే. అవ్య: చూ, రూ- ఓపె. "సీ. ఓమెయోయెయనంగ నొప్పు స్త్రీసంబోధనార్థమై." ఆం, భా. తృ. అవ్య. 72.

ఓయన. దే. వి: చూ, రూ- ఒయ్యన.

ఓయారము. దే. వి. చూ, రూ- ఒయ్యారము.

ఓయారి. దే. వి: చూ, రూ- ఒయారి

ఓయి. వై. అవ్య.= హైహో, హో, పురుషసంబోధనార్థకము. రూ- ఓయీ: చూ, సంబోధనము.

ఓయియమ్మ. ద్వ. అవ్య. చేటికాది సంబోధనార్థకము: చూ, ఓసీ.

ఓయిరము. వై. వి.= ఆహారః. అన్నము, రూ- ఓగిరము. "గీ. అగ్నిమనలోన నొక్కరుండో నొకాఁడో, చేయఁడేమారుతము మనచెప్పినట్లు, వరుణుఁడెవ్వరివాఁడు మువ్వురును లేక యాయితంబగు నెట్లొంగినోయిరంబు." కాశి. 5, ఆ. 297: చూ, సాదము (1)

ఓయీ. వై. అవ్య.= హైహో, హో: చూ, రూ- ఓయి.

ఓర. దే. వి. 1. ఒడ్డు: చూ, తీరము; 2. అంచు: చూ, చెంగు; 3. ప్రక్క, వైపు: చూ, పార్శ్వము. 2; అవ్య. 4. సాచివ్యర్థకము. "సీ. ఓరనాసాచ్యర్థమొప్పును" ఆం, భా. తృ. అవ్య. 72; వై. వి. 5.= హోరా.

అహోరాత్రము, ముప్పది ముహూర్తముల కాలము, రేఁబవలు: చూ, హోర. 1; విశే. 6. ఒరగినది. "ఓరచూపు, ఓరగచ్చ" మొ: చూ, భుగ్నము 1; 7. వంగినది, వంకరైనది. "ఉ. విశ్వధరాతలేశ్వరుఁడోర యొనర్చె." నై. 8, ఆ. 89: చూ, వంకర.

ఓరంతప్రొద్దు. వై. వి.= హోరా. (ఓర + అంతప్రొద్దు) 1. దినమంతయు. "సీ. అతనుబ్బకయున్న నైననుశివరాత్రి యోరంతప్రొద్దునుపవసించె." కాశీ. 4, ఆ. 133; 2 =హోరా. సర్వకాలము ఎల్లకాలము. "ఎ,గీ. నెఱకఁడొక యొకయండు వేళ్లఁజూప, నెంతవాఁడక్కుమారు నోరంత ప్రొద్దుఁ గలసి." ఉ, హరి 5, ఆ. 282; "మ. ఆయుర్వేదమోరంతప్రొద్దులుఁ జెప్పఁగ." స్వా. 5 ఆ. 7: చూ, సతతము. 2. (పురుషోత్తమకవీయము.)

ఓరగచ్చె. దే. వి. (ఓర + కచ్చె.) ప్రక్కకొదిఁగించిన కాసీసము. "సీ. చేనిచేని యోరగచ్చె గఁజేసి నిలుచుండి కాల్మడి విడుచుఁదక్క కెలంగి." భల్లా. 3, ఆ. 35: చూ, బొట్టము.

ఓరగిల్లు. దే. అ. క్రి. 1. అపసరిల్లు: చూ, విరియు. 5; 2. అవనతమగు. "సీ. మందాకినీతనయుఁడేచి,......దిరుగుడు వడ నోరగిలఁగఁ బెల్లఁ,గిలఁగఁ దల్లడ వడరణక్రీడసల్పె." భార. భీష్మ. 1, ఆ. 268: చూ, వ్రాలు.6.

ఓరచూపు. ద్వ. వి. వక్రదృష్టి, వంకరచూపు: చూ, వాలుచూపు.

ఓరచ్చులు. ద్వ. వి. బ. (ఓర + అచ్చులు.) గుదికాలుంచెడు చోట ఎత్తుగా అట్టలువేసి కుట్టిన ఓరట్టచెప్పులు. "క. నెలనీలి కాసెయును బద్యములనోరచ్చులు ధరించి." హరి శ్రీ. 5, ఆ. 111: చూ, పాదుక.

ఓరట్టచెప్పులు. ద్వ. వి. బ. (ఓర + అట్టచెప్పులు. —పై.—

ఓరణము. దే. వి. ఒకరకము డేగ. "సీ. కాఁజాఁబోఁజాలఁబోవఁగా నీకివాని నోరణములఁబఱపి శిక్షింపఁబతుని..." రసి. 1, ఆ. 115: చూ, శ్యేనము.

ఓరపాక. దే. వి. పంచెను దూలములులేక కెలిప్రక్క వంచికట్టినశాల, పాదలి, మీరపాక: చూ, గృహము. 1.

ఓరపాటు. ద్వ. వి. ఒరగుట "ఉ. అంమునవ్రొచ్చి పక్షిముఖుఁడల్గి గదాహతి మాణిభద్రుమహాళిఁజాలకించి కొట్టిఁజలించి యతండల మాలి యోరపాటొందె." ఉ, రా. 8, ఆ. 40. చూ, ఒరగుడు.

ఓరపారము. దే. విశే. ఎగుడు దిగుడు: చూ, విషమము.

ఓరవలి దే. వి పలురంగులచీర: చూ, వస్త్రము.

ఓరవోవు. దే. అ. క్రి. (ఓర + పోవు.) అవనతమగు, వంగు. "తే. అతనిఁగాంచితినతఁడశ్రులదరఁబడలు, చూడ్కి నామోముచక్కఁగాఁ జూడకోర, వోవఁజూచుచు." భార. కల్యా. 2, ఆ. 9. "పాలఁతికవ్వెమ లోరవోనివిండ్లు." చంద్రా. 6, ఆ. 128: చూ, వ్రాలు. 6.

ఓరసింపు. వై. వి.= హోరా. ఓరసిల్లుట. "సీ. విడిచియు విడఁజాల కడకాఁకుసిగ్గు మోరోరసింపుల యింపుతారసింప." అని. 3, ఆ.95: చూ, ఓసరింత. (పురుషోత్తమకవీయము.)

ఓరసిలు. వై. అ. క్రి.=అపసరః. అపసరిల్లు.రూ- ఓరసిల్లు. "చేయిసాఁచిన నోరసిలు పరోజానన." కవి. 3, ఆ: చూ, విరియు, 5.

ఓరసిల్లు. వై. అ. క్రి = అపసరః.—పై.—

ఓరి. దే. అవ్య. నీచసంబోధనార్థకము: చూ, రూ-ఓరీ.

ఓరిమి. దే. వి. క్షమ. ఓరుః: చూ శాంతము.1.

ఓరీ. దే. అవ్య. రూ-ఓరి: చూ, సంబోధనము.

ఓరు. దే. వి. 1. ఇంటి తిన్నెగోడల యడుగునను మూలలను తీర్చెడు ఎత్తుపట్టిపట్టె: చూ, పట్టెయ. 6; వై. ఉప.=ఉరు. పృథువు, పెద్ద. "ఓరుగాలి వీచుచున్నది.": చూ, విపులము.

ఓరుగల్లు. శా. (మ. రా. శ్రీ. మల్లంపల్లి సోమశేఖరశర్మగారు) కాకతీయులు: కళింగము.— ఓరుగల్లు రాజధానిగా ఆంధ్రదేశమును బరిపాలించినవారు కాకతీయులు. కళింగ 377; రుద్రమదేవుఁడు ఓరుగల్లు మొదలు సింహాద్రి వఱకు గల భూమిని పాలించెను. కళింగ.386. పుట.

ఓరుగాలి. ద్వ. వి. ప్రకంపనము, మిక్కిలి బలముగల వాయువు. "ఓరుగాలిలో బొమ్మలాట." "వ. తద్ఘనఘనాఘన కల్పితమైన పెక్కియం, బొఱలుచు నోరుగాలి మొదలూడఁగఁ గూలెడు మ్రానుకైవడిన్." పా 5, ఆ. 31: చూ, వాయువు.

ఓరుచు. దే. అ. క్రి. 1. రూ- :చూ, ఓర్చు క్షమించు. 2. రూ-ఓర్చు సైచు. "క. భారత వంశాచార్యుఁడు, భారద్వాజుండు నాకపాయము సేసెన్, ఘోరాజినతని నోర్చున్, పాగ పరాక్రము సుపుత్త్రిఁబడయఁగవలయున్." భార. ఆది. 7, ఆ. 15: చూ, సహించు; 3. రూ-ఓర్చు. ఉపశమిల్లు: చూ, క్రుశ్శు. 4, 4. రూ- ఓర్చు. క్షయించు, తగ్గు: చూ, క్రుక్కు. 9

ఓరుతీయు. దే. అ. క్రి. ఇంటి తిన్నెగోడల యడుగునను మూలలను ఎత్తుపట్టితోఁ బట్టెలు తీర్చు, చూ, పూయు.

ఓరుపరి దే. వి. (ఓరుపు + అరి.) రూ-ఓర్పరి. తాలిమికాఁడు: చూ, సహనుఁడు.

ఓరుపు దే. వి. 1. రూ-ఓర్పు. క్షమ: చూ, శాంతము. 1; 2. రూ-ఓర్పు. గెలుపు: చూ, జయము. 2; 3. రూ-ఓర్పు. సైరణ: చూ, సహనము.

ఓరెము. వై. వి.=ఆహారః : చూ, రూ-ఓయిరము. "సీ. నీతల్లి లచ్చిమనే సంతసిల నోరెములుపెట్టుఁ బుడమి వేల్పులకునెల్ల." అచ్చ. బాల, కాం. షీఠక. 15.

ఓర్చు. దే అ. క్రి: చూ, రూ-ఓరుచు.

ఓర్పరి. దే. వి చూ, రూ-ఓరుపరి.

ఓర్పు. దే. వి. చూ, ఓరుపు. (క్షమాజయము లకు.—"గీ ఓర్పుగలవారలా మీఁదదర్పితారి, గోర్పుగలవారు" పాంచా. 4, ఆ 52.)

ఓర్త. వై. స. ఏ. రూ-ఒకర్త: చూ, ఒకత.

ఓర్తి. వై. స. ఏ. రూ-ఒకర్తి· —పై.—

ఓర్తు వై. స. ఏ. రూ-ఒకర్తు: —పై —. కాశీ 6, ఆ. 262.

ఓర్తుక వై. స ఏ. రూ-ఒకర్తుక. —పై.—.

ఓర్తె. వై స ఏ. రూ-ఒకర్తె. —పై.—

ఓర్వనివాఁడు. ద్వ. వి. అసహనుఁడు: చూ, నూడుకాఁడు.

ఓర్వమి. దే. వి. 1. ఓర్వలేనితనము: చూ, నూడు. 1; 2. తాలిమిలేమి: చూ, కాంతాశము.

ఓలి. దే వి. 1. ధ్వని, అలికిడి: చూ. స్వరము. 2; 2. వర్షవాతాదిధ్వని: చూ, స్వరము. 2.

ఓల. దే, వి. 1. నెపము: చూ, వ్యాజము. 1; 2. అపజయము, ఓటు: చూ, పరాజయము; 3. జలక్రీడా సమయమునందు ప్రేరేపించుటకై యుపయోగించునట్టి శబ్దము. "లయగ్రాహి. ఓలయనుచున్ వలను గేలియనుచున్." శశా. 6, ఆ. 231; "గీ. ఓలలిడి పట్టనరిగిన నొయ్యనీటు, మునిఁగి దవ్వులలే

తురు ముదితలు.” య. 3. ఆ 66: చూ, స్వరము. 2.

ఓలగందము. ద్వ. వి. పూసినపసుపు. “సీ. అను దినంబును బ్రాతరారంభ వేళల నోలగందంబు తో నుదకమాడి.” కాశీ. 3, ఆ. 212: చూ, పూఁతపసుపు.

ఓలగము. దే. వి. 1. కొలువు. “ఉత్సాహ. కౌసలో ప్యగంబు లోలగంబు సేయుచుండు న, మాన్మని మండలేశ్వరుండు మనలఁ గూడు జాడలేదు” రామా. 2, ఆ 78: చూ, సభ 2; 2. కొలువుకూటము. “క. భ్రాజిత మణి భూషాంబర, రాజివలన సమనిభా విరా జితులగుటన్, భోజుని నోలగముసఁగవి, రాజులరాజులను దెలియరా దెవ్వరికిన్.” భో. 2, ఆ 55: చూ, సభ. 2

ఓలగించు. దే స. క్రి. కొలుచు. “సీ. యోగీం ద్రవంద్యుఁడయ్యును సుగ్రీవుని నోలగించిన నాటి యొచ్చె మొకటి.” జై. 1. ఆ. 44: చూ, సేవించు

ఓలచెంగినాలు. దే. వి. బ. అపజయము,ఓటము. “సీ. అపజయ సంజ్ఞయైయులరు బన్నము విఱు గోటమి యోడుట యోలచెంగి, నాలు విఱు గుడునోటునా.” ఆం, భా. ద్వి. కు. 224: చూ, పరాజయము.

ఓలమాసగొను, ద్వ. అ. క్రి. (ఓలము + ఆస + కొను) తిరోహితమగు. “క. అతిథినినుఁ గోర నేనియు. మతిఁగింకిరిపడక యోలమాసగొనక నీ, వతనికిఁ బ్రియంబుసల్పుము” భార. అను. 1, ఆ. 68; “గీ. పృథ్వీశతనయ, యగ నిశాంతరమున నోలమాసగొనియె.” సై. 4, ఆ. 97: చూ, మఱుఁగుపడు.

ఓలము. సం. వి.అ. పుం. 1.=అల్లము* చూ, శృంగబేరము. (రూ-ఓల్లము); 2. రూ-ఓల్లము. కంద *. చూ, సూరణము; దే. వి. (1)అడ్డ పాటు: చూ, వ్యవధానము; (2) దేహము, ఒడలు. “ఓలము తోడిసరి బ్రియోద్యత్త విశాలవృక్షమున జేరెడునట్లుగ వ్రాసి చూపి.” కవిక. 3, ఆ; “ఉ. ఓలమువంచి యొయ్యన రఘూద్వహుఁ డమ్మరిఁబోసి కబ్ద విన్యాకలముద్రాఁక విల్ దివిచి.” మొల్ల.కిష్కిం, కాం: చూ, శరీరము; (3) వృక్షము లోనగు వానిచే మఱుఁగగుచోటు. “క. మెనుమిత్తిది పల్లంబిది, యనకుండఁగ నోలమును బయలు నొక్కటిగాఁ, గనువిచ్చుటయును మోడ్చుట యును సరిగాఁదమముపర్వె నుర్వింధోడ్తోన్.” భార. విరా. 2, ఆ. 321: చూ, మఱుఁగు చోటు; (4) మూలధనము, అసలు: చూ, పంచిమొదలు.

ఓలలాడు. దే. అ. క్రి. (ఓలలు + ఆడు) 1. రూ-ఓలాడు. స్నానముచేయు: చూ, నీళ్లాడు; 2. నీళ్లలోమునుఁగక మీఁద సంచ రించు. రూ-ఓలాడు. తెప్పలదేలు: చూ, తేలు. 4. (ప్రే. ఓలలాడ్చు.)

ఓలాకు. దే. వి. అలసట: చూ, శ్రమము. 1.

ఓలాకుపడు. ద్వ. అ. క్రి. అలయు, శ్రమపడు. “వ. ప్రజల నోలాకుపడనీక ...దాడిమెయిం జని.” భార. విరా. 3, ఆ. 182: చూ, వేసరు. 2

ఓలాడు. దే. అ. క్రి. (ఓల + ఆడు) చూ, రూ-ఓలలాడు. (నీళ్లాడు.—“వ. కాంతేయం బున నోలలాడుదము.” భీ. 6, ఆ. 107; తేలు.—“గీ. అతులితానందజలధి నోలాడుఁ గాత.” లక్ష్మి. 1, ఆ. 25 పీఠిక.)

ఓలి. దే. వి. 1. ఉంకువ: చూ, శుల్కము; వై.వి. 2.= ఆలి: (ఆళి.) వరుస, బారు. “ఉ, నాలు గుదిక్కులందును...ధాన్యుఁడజాత వైరికిం, దోలిన చెప్పుచున్నతతి నొప్పగరోమకుఁడేఁగు

డించె." భార. అర. 2, ఆ. 202; చూ, పంక్తి. 1; 3. క్రమము: చూ, విధము. 1.

ఓలిమి. దే వి. అడ్డపాటు. అం, భా. ప్ర. ది. 76: చూ, వ్యవధానము. 3.

ఓల్లము. సం. వి. అ. పుం: చూ, రూ-ఓలము *.

ఓవర్ కాపిటలైజేషన్. ఆం. ఒక వ్యాపారము నకు సంపాదించు చందాధనముకన్న వడ్డీ చెల్లిం చవలసిన పెట్టుబడి అధికమైపోయినచో అట్టి స్థితికీ పదముపయోగింతురు.

ఓవర్ పాప్యులేషన్. ఆం. జనభారము.

ఓవర్ సీస్ డొమినియన్సు. ఆం. సముద్రాంతర దేశాంతరరాజ్యములు.

ఓవర్ సీస్ ట్రేడ్. ఆం. సముద్రాంతర దేశ దేశాంతరవ్యాపారము.

ఓవర్ సెంట్రలైజేషన్. ఆం. అత్యధిక కేంద్రీక రణము.

ఓవర. వై. వి.=అపవరకః. రూ-ఓవరి లోపలి గది: చూ, గృహము. 1.

ఓవరి. వై. వి. 1.=అపవరకః. —వై.— "ఉ. ఓవరిలోనఁ గొందిదెసనున్నవి యొన్ని యొయొన్నఁ బెద్దభాండావలి." హరి. పూ. 8, ఆ. 219; 2.=అపవరకః. చంద్రశాల, పై మేడ. "ఉ. అపురిమించు టోవరులనాడు మెలంతలగాన మాధురిన్ ...సుధారసధారఁ దోఁగుటన్." హ్యన. 1, ఆ. 8: చూ, గృ హము. 1.

ఓవరి. ఆం. అండకోశము, స్థూలబీజాశయము.

ఓవరుడ్రాఫ్టు ఆం. పరపతికి మీరి వాడుకొనిన సొమ్ము.

ఓవరులార్డు. ఆం. అధిరాజు.

ఓవర్డ్యూ. ఆం. వాయిదామీరిన బాకీ.

ఓవర్డ్యూ యిన్ స్టాల్మెంటు. ఆం. బకాయికిస్తు.

ఓవల్. ఆం. అండాకారము.

ఓవు. దే. అ. క్రి. రూ-ఒవ్వు. అనుకూలమగు. "ఉ. ఓవఁ వైశ్యవంశ కలశోదధిబారు హిమాం శురేఖనీ, వోవనివారి ముందట నయోమగనిం గడ కాలఁద్రొచి." శుక. 1, ఆ. 71: చూ, పొందుపడు.

ఓవ్యూల్. ఆం. పుష్పములోని స్థూలబీజా శయము, అండము

ఓషకరగ్రంథి. పా. (లింఫటిక్సు—గ్లాండ్) లసి కావాహకగ్రంథి, శోషరసగ్రంథి.

ఓషధి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఋషభము, మందుచెట్టు, తాలిసార, ఫలపాకాంతమైన వీహ్యాదివృక్షము: చూ, వృక్షము; 2. ఫలించి నతోడనే నశించెడి యరఁటిలోనగునది.

ఓషధీశము. సం. వి. అ. పుం 1. ద్రోణపర్వత ము: చూ, పర్వతము; 2. కర్పూరము: చూ, సిరము.

ఓషధీశుఁడు. సం. వి. అ. పుం చందమామ: చూ, చంద్రుఁడు.

ఓషధులు పా. (డ్రగ్సు.)

ఓషము. సం వి. అ. పుం 1. కాలుట: చూ, దాహము. 1; 2. కాల్చుట: చూ, దహన ము. 1; 3. దప్పి: చూ, పిపాస.

ఓష్ఠపుచ్ఛము. సం. వి. అ. పుం. జప, దాసన ము *: చూ, పాయుజీవనమారకము.

ఓష్ఠమచ్ఛము. సం. వి. అ. పుం. చెడుగుఱుతు: చూ, లక్షణము. 1.

ఓష్ఠము. సం వి. అ. పుం. అదరము: చూ, పెదవి.

ఓష్ఠరోమాణి సం వి. ఇ. న. పెనిమిటిని చంపు దానికుండునట్టి గుఱుతు, విధవయయ్యెడు లక్షణముగలది: చూ, లక్షణము. 1.

ఓష్ఠసముత్కర్షకస్నాయువు. పా. (Muscle Levotor labii Superioris.)

ఓష్ఠి. సం. వి. ఈ. స్త్రీ. బింబఫలము, దొండ పండు: చూ, బింబము. 2.

ఓష్ఠికవిసర్పిణి. పా. (హెర్పస్ లాబ్లియాలిస్.)

ఓష్ఠోపమఫల. సం. వి. అ. స్త్రీ. దొండ *: చూ, రక్తఫల

ఓష్ఠ్యము. సం. విణ. (అ. ఆ. అ.) పెదవులకుఁ దగిలి పలుకునది: చూ, ఔష్ఠ్యము.

ఓష్ఠ్యములు. పా. "ఉ, ఊ, ప, ఫ, బ, భ, మ."

ఓష్ణము. సం. విణ. (అ. ఆ. అ.) నులివెచ్చనిది: చూ, మిడి. 4.

ఓష్ణ్యము. సం. విణ. (అ. ఆ. అ.) —పై.—

ఓష్ఠ్యానియా. పా. ఖండములయిదింటిలోనొకటి: చూ, ఖండములు

ఓసరించు. దే. స. క్రి. త్యజించు: చూ, విసర్జించు.

ఓసరింత. పై. వి.= అపసరః. ఓరసిల్లుట ,,ఓసరింతలే, కలరెడు కౌఁగిలింతలు." ఉ, రా. 6, ఆ, 165: చూ, ఓరసింపు.

ఓసరిలు. పై అ. క్రి. 1.= అపసరః. రూ-ఓసరిల్లు. తక్కువగు: చూ, తగ్గించు; 2 = అపసరః. రూ- ఓసరిల్లు. తొలఁగు: చూ, విరియు. 5.

ఓసరిల్లు పై. అ. క్రి. = అపసరః. —పై.— (తొలఁగు — "క. ఓసరిలి పటుచమూగములు, జేసియు." భార. ఆది. 4. ఆ.) (ప్రే. ఓసరించు.)

ఓసరు. పై. అ. క్రి.= అపసరః. —పై.— (తొలఁగు.— ,,వ. కుక్షింభరిత్వంబునకుఁ దాములై తిరిగితిరిగి వేసరియోసరిలిన దాసరగుంపు." ఆము. 4, ఆ. 35.)

ఓసి. దే. అవ్య: చూ, రూ- ఓసీ.

ఓసీ. దే. అవ్య. చేటికాది సంబోధనార్థకము. ఒసి - రూ- ఓసి - ఓ యి యమ్మ: (పు, ప) :— అయీ- రూ- అయో.

ఓహటము. దే. వి. వెనుదీయుట: చూ, వెనుఁబాటు.

ఓహటించు. దే. అ. క్రి. అపక్రమించు: చూ, వెనుదీయు. 1.

ఓహటిల్లు. దే. అ. క్రి. —పై.— ,,గీ. మది తలయొక్కింక హరుని నెన్నుదుటికంటు, నొకఁదుకంసారి కుడికంట నోహటిల్లె." పై. 8, ఆ. 179

ఓహరి. దే. క్రి. విణ. ద్రి. అహంపూర్వికః: చూ, తండోపతండము.

ఓహరిసాహరి. దే. క్రి. విణ. ద్రి. —పై.— ,,ఉ. ఓహరిసాహరిం బ్రిధమమొక్కెడు ధారలగాడ్పు లేటవాల్గాహతిసిడ్చి వీఁగుప్రజలంగల." ఆము. 4, ఆ. 98.

ఓహో. పై. అవ్య. 1.=అహో. రూ-ఒహో. సంబోధనమునందు వచ్చును. "క. అతని సత్యాగ్రసల పాతోన్ముఖుండైనవానిఁ బడకుండఁగ నోహో తత్కక క్రిష్ణంబుమని, యాతతభయుఁ గ్రిమ్మరించె నాస్త్రీకుఁడెడఁ." భార. ఆది. 2, ఆ. 285: చూ, సంబోధనము; పై. వి. 2.=అహో. రూ-ఓహోహో. ప్రశంసనార్థకము, బళి. "సుధీవర్గంబులోహో యనన్." కళా. 1. ఆ. 18: చూ, సెబాసు; 3. రూ-ఓహోహో. ప్రశ్నార్థకము, ఏమీ. ,,సీ. పిలువకుండఁగనైనఁ బలుకు నోహోయని బయలూఁతగొనఁ జాచు వారసాఁచి." కాశీ. 4, ఆ. 166: చూ, ప్రశ్నము; 4. రూ- ఓహోహో. అహా, ఆశ్చర్యార్థకము, అహో: చూ, వింత. 1.

ఓహోరె. పై. అవ్య. (ఓహో + రె) రూ- ఓహోరే. బళి, ప్రశంసనార్థకము. ,,మత్తకోకిల. ధారతప్పక చెప్పనేర్తువుదారవాక్యతురత్వమో, హోరె నాఁగఁ బ్రిబంధమొక్క

టిరియొక్కనాటనె." సభా. 1, ఆ. 15: చూ, సెబాసు.

ఓహరోశే వై. అవ్య. (ఓహరో + శే) — పై.—

ఓహరోహరో. దే. అవ్య. చూ, రూ-ఓహరో. (ఆమ్రేడితమందిట్లు వచ్చెడిని.)

ఓళిగ. వా. రూ-హోళిగ. కపోళి, ఒకరకము భక్ష్యము: చూ, భక్ష్యము.

## ఔ.

ఔ. ఒకయక్షరము. ఆంధ్రభాషకు వర్ణంబు లేఁబదియాఱు. అందు అచ్చులు పదునెనిమిది. ఆయచ్చులలోనిది పదునెనిమిదవది; తెనుఁగునకు వర్ణములు ముప్పదియేను. అందు అచ్చులు పదునాలుగు. ఆయచ్చులలోనిది పండ్రెండవది; సంస్కృతమునకు వర్ణంబు లేఁబది. అందు అచ్చులు పదునాఱు. ఆయచ్చులలోనిది పదునాలుగవది; సం. వి. ఔ. పుం. (ఔః అహా అవః.) గ్లౌశబ్దవత్. 1. కుమారస్వామి: చూ, స్కందుఁడు: 2. అనంతుఁడు, శేషుఁడు, సహస్రఫణములు గల సర్పరాజు: చూ, సర్పము; 3. పరిశుద్ధ శరీరము గలవాఁడు: చూ, విశుద్ధాంగుఁడు; 4. అంతరిక్షమందు దేవతలు ఎక్కి సంచరించెడు రథము, విమానము: చూ, శకటము. 1; 5. చంద్రునిలో పదునాఱవ భాగము, చంద్రకళ: చూ, కళ. 2; అవ్య. 6. సంబోధనార్థకము: చూ, సంబోధనము; 7. ఆమంత్రణార్థకము, పిలుపు: చూ, సంబోధనము; 8. విరోధార్థకము, పగ: చూ, విరోధము. 1; 9 నిశ్చయార్థకము: చూ, సత్యము. 1; దే. ద్రి. (1) అంగీకారమును దెలిపెడి: చూ, సమ్మతి 1; (2) ప్రశంసను దెలిపెడి. "ఉ. ఔ, యయ్యారె బలంబు ధాటి బళియాలివయంచు వజీరులెంచఁగన్." చంద్రా. 2, ఆ: చూ, సెబాసు (ఆమ్రేడితమందు ఔనౌ) (3) దంత్యములలో నొకటి. దంత్యములు—"అ-ఆ, ఉ-ఊ, ఒ ఓ ఔ."; (4) దీర్ఘాక్షరములలో నొకటి. దీర్ఘాక్షరములు.—"ఆ, ఈ, ఊ, ౠ, ౡ, ఏ, ఐ, ఓ, ఔ."

ఔఁగద. దే. అవ్య. (ఔను + కద) ఆశ్చర్యార్థకము. రూ-ఔఁగదే- అవుఁగద: చూ, వింత. 1.

ఔఁగదే. దే. అవ్య. (ఔను + కదే) —పై.— "సీ. ఔఁగదేలావణ్య మౌఁగదే మాధుర్యమౌఁగదే సతి నవయౌవనంబు." భా. 8, స్కం. (ఆమ్రేడితమందు ఔనౌఁగదే-- "మ. అమరేంద్రాదులు మాళికంపములతో నౌనౌఁగదే బాపురే, కమలాక్షీ శరణంచు భూదిశల వాకాశంబునన్ మ్రోయఁగన్." భాగ. 8, స్కం.) (రూ-అవుఁగదే)

ఔఁగాక. దే. అవ్య. (ఔను + కాక) అంగీకారార్థకము. రూ- అవుఁగాక. అట్లే కాని. "క. అని వేడికొని యతీంద్రులఁ, దన కృపము నారగింప దామోదరుఁ డిం, పునఁ బ్రార్థించిన నేమియు, ననుమానములేక వారు నౌఁగాకనినన్." ఉ, హరి. 4, ఆ. 114: చూ. సమ్మతి. 1.

ఔఁగు. దే. వి. ఒకానొక భక్ష్యము. రూ- అవుఁగు. "వ. ఇడిరమ్మని కుపాయనమ్ములు మనోభీష్టంబుగాఁ బూరియల్ ... బెల్లమండెఁ గలునౌఁగుల్ ... కుడియలున్ పేరాళమై కన్పడన్." రామా. 2, ఆ 115: చూ, భక్ష్యము.

ఔకాఁపు. దే. వి: చూ, రూ-అవుకాఁపు.

ఔకారము. సం. వి. అ. పుం. ఔ అను వర్ణము.

ఔక్షకము. సం. వి. అ. న. ఉక్షముల సమూహము, కదుపు, ఎడ్లగుంపు: చూ, వృషభము. 1.

ఔఖ్యము. సం. విణ. (అ. ఆ. అ.) కుండలో వండినది.

ఔగాములు. దే. వి. బ. (ఔటు + కామి) రూ- అవుగాములు. 1. కలిమిలేములు. "క. అన నయ్యంగన నాకే, మన నోయన్నయది మీరలని నంతయుఁ జెల్లని మీకౌగాములు దె, ల్ప నుపాయం బొకటి కానఁబడుఁ దాఁకన్." కళా. 3, ఆ. 180; య 3, ఆ. 83; పర. 5, ఆ. 341: చూ. కష్టసుఖములు; 2. తగినది, తగనిది. "గీ. దీని యోగాగ లన్నియుఁ దెలిసి శిక్ష, సేయ దేశవేలెడు మహీనాయకునకుఁ, గాని యితరుల కుచితంబు కాదు." హరి 3. ఆ; "వ. తక్కిన యోగాములు లెక్కసేయక" ప్రబో. 4, ఆ. 2; కళా. 3, ఆ.180; చూ, యుక్తాయుక్తములు; 3. మంచిచెడ్డలు. "క. చనునే వగవఁగ నొకరొ, యనయము నగునలువకైన నౌగాములోగిన్." య. 3, ఆ. 85: చూ, మేలుగీడ్పు (ఇది ఏకవచనాంతముగాను గానఁబడియె.)

ఔఘళించు. వా. అ. క్రి. చీలించు చూ, సలించు.

ఔఘ్యము. సం. విణ. (అ. ఆ. అ.) ప్రవాహ సంబంధమైనది.

ఔతథ్యుఁడు. సం. వి. అ. పుం. ఉతథ్యమహర్షి గోత్రమున బుట్టినవాఁడు.

ఔచితి. సం. వి. ఈ. స్త్రీ. మంచి, తెన్ను. "తే. ఔచితియె యున్నవాఁడెప్ప నగ్రహ యున, గౌరవమ్మును బడయనేగనుచునుండు." వేమన 827: చూ, యోగ్యము. 2.

ఔచిత్యము. సం. వి. అ. న. 1. —పై.—; 2. నిక్కము: చూ, సత్యము 1; పా- 3. సార్వజనిక ఔచిత (ప్రొప్రైటీ, పబ్లిక్ డీసెన్సీ.)

ఔజసము సం. వి అ. న. బంగారు: చూ, లోహము. 1.

ఔజసికుఁడు. సం. వి అ. పుం. బలిమికాఁడు: చూ, లావరి.

ఔజస్యము. సం. విణ. (అ ఆ. అ.) ఓజస్సు చేత కలిగినది.

ఔజ్జ్వల్యము. సం వి. అ. న: చూ, ఉజ్జ్వలత్వము; ఆం. 2. నాయక గుణములలో నొకటి: చూ, నాయకగుణములు.

ఔట. దే. వి. 1. కుల్య, కాలువ. రూ-అవుట: చూ, నది; 2. కర్మకారుఁడు. రూ- అవుట: చూ, పనివాఁడు.

ఔట్ అండు ఔట్ సేల్ ఆం. పరిపూర్ణమైన విక్రయము.

ఔట్ డోర్ రిలీఫ్. ఆం. గృహముల వెలుపలనొసఁగు సహాయము.

ఔట్ పుట్. ఆం. ఫలోత్పత్తి, ఒకపనివల్ల జరిగిన మొత్తముపని.

ఔట్ పోస్టు. ఆం. కావలిస్థలము

ఔట్ లైన్. ఆం. ఆకారరేఖ; చుట్టుగీఁత; రూపురేఖ; గిరిగీఁత.

ఔట్ స్టాండింగ్. ఆం నిలిచియున్న, నిలువ యున్న.

ఔటుగుండు. ద్వ వి. చేట్టిపిరంగిగుండు: చూ, పిరంగిగుండు.

ఔట్రేజ్. ఆం. బలాత్కారము; రాక్షసకృత్యము; దౌర్జన్యముచేయు; ఉపద్రవముచేయు.

ఔడవము. సం. వి అ. పుం. ఐదుస్వరములతోఁ గూడినరాగము: చూ, స్వరము. 2.

ఔడు. దే. వి: చూ, రూ- అవుడు. 1, 2. (ఇది వైకృతమని పురుషోత్తమ కవీయము. ఔడు= ఓష్ఠ. పెదవిక్రిందితావు.)

ఔడుంబరము. సం. వి. అ. న. 1. పులుము: చూ, మండలము. 3; 2. రూ- ఔదుంబర

ము. తామ్రము, రాగి: : చూ, లోహము.1.

ఔడుకఱచు. దే. స. క్రి: చూ, రూ- అవుడు కఱచు.

ఔణాదికము. సం. వి. అ. న. ఉణాది ప్రత్యయసంబంధము.

ఔత్కంఠ్యము. సం. వి. అ. న. తహతహ. ఇష్టవస్తు సంప్రాప్తియందు వేగిరపాటు: చూ, వ్యసనము.

ఔత్కృష్ట్యము. సం. వి. అ. న. మేలుతరము: చూ, శ్రైష్ఠ్యము.

ఔత్తరాహుఁడు. సం. వి. అ. పుం. ఉత్తరదేశపువాఁడు: ఔత్తర్యుఁడు.

ఔత్తరేయుఁడు. సం. వి. అ. పుం. పరీక్షన్మహారాజు, పరీక్షిత్తు: చూ, రాజు. 1.

ఔత్తర్యుఁడు. సం. వి. అ. పుం: చూ, ఔత్తరాహుఁడు.

ఔత్తానపాది. సం. వి. ఇ. పుం. ధ్రువుఁడు, ఉత్తాన పాదజుఁడు, ధ్రువనక్షత్రముఅనఁగా స్థిరముగా ఉత్తరదిక్కునందుండి ఉత్తరదిక్కును సూచించుచుండు నక్షత్రము: చూ, నక్షత్రము. 1.

ఔత్థానికము. సం. విశే. (అ. ఆ. అ.) పురుషతంత్ర సంబంధమైనది

ఔత్పత్తికము సం. విశే. (అ. ఆ. అ) 1. పుట్టినప్పుడే కలిగినది; 2. స్వభావసిద్ధమైనది.

ఔత్సర్గికము. సం వి. అ. న. సామాన్యమైన విధి.

ఔత్సుక్యము. సం. వి. అ. న. 1. ప్రియస్మరణాదులచే కాలవిలంబము నోర్వలేమి. తన యిష్టవస్తుప్రాప్తియందలి కాలవిళంబము నోర్వఁజాలక తహతహపడుట: ఉత్సుకత్వము. (తె. ప) :— అ; 2. వ్యభిచారీభావభేదములు ముప్పదిమూఁడింటిలో నొకటి; (చూ, రసములు): చూ, సంచారీభావములు. (చూ, ఉత్సుకత్వము.)

ఔదకము. సం. వి. అ. న. ఇంద్రనీలమణి, నల్లరాయి. (ఉదక సంబంధమైనది) : చూ, రాయి.

ఔదనికుఁడు. సం. విశే. (అ. ఈ. అ.) సూపకారుఁడు; కాశీ. 3, ఆ. 201: చూ, వంటవాఁడు.

ఔదరి. దే. వి. చిన్న నీటి కాలువ: చూ, నది.

ఔదరికుఁడు. సం. విశే. (అ. ఈ. అ.) 1. ఏమియు పనిలేకుండఁగనున్నవాఁడు, కర్మరహితుఁడు: చూ, పనిలేనివాఁడు; 2. తిండిపోతు: చూ, భక్షకుఁడు

ఔదల. దే వి. (ఔ + తల) 1. రూ-అవుదల. తల; "అడుగుపగతుని యవుదల నిడితి." సం. "మూర్ధ్ని తేపాంకృతః పాదః." భార. కల్యా. 2, ఆ: చూ, శిరము. 1; 2. రూ-అవుదల. శిరోగ్రము, తలచివర: చూ, ముందల; 3. రూ- అవుదల. నడితల, బ్రహ్మరంధ్రము. "సీ. ఔదలఁ జదలేటిలేఁదరఁగలు తాలుఁడగు చేందమామ నుయ్యాలలూఁప." హరి. ఉ. 6, ఆ. 33· చూ, మాడపట్టు.

ఔదలావణికము. సం. వి. అ. పుం. నీళ్లుఉప్పును కలిపిరాచినది.

ఔదవము. సం. వి. అ పుం: చూ, రూ- ఔడవము.

ఔదశ్వితము. సం. విశే. (అ. ఆ. అ.) చల్లతో తడిపినది, ఉదశ్విత్సంస్కృతము: చూ, మజ్జిగ.

ఔదశ్విత్కము. సం. విశే. (అ. ఆ. అ.) -పై.-

ఔదార్యము. సం. వి అ. పుం. 1. గొప్పసంగతి, ఉదారత్వము: చూ, మహాత్వము; అం. 2. కావ్యగుణములు పదింటిలోనొకటి: చూ, కావ్యగుణములు; 3. గుణములు ఇరువదిమూఁడింటిలో నొకటి: చూ, గుణములు; 4.(దాతృత్వము.) నాయకగుణములలో నొకటి: చూ, నాయకగుణములు.

ఔదాసీన్యము. సం. వి. అ. న. ఉపేక్షగానుండుట, మిత్త్రశత్త్రుభావములు లేకయుండుట: ఔదాస్యము.

ఔదాస్యము. సం. వి. అ. న —పై—

ఔదు. దే. వి: చూ, రూ- అవును. (కుల్యా.— "వ. వలిమించు క్రొమ్మింకుపొదులీఁది యీఁదిగువడి పడలిసుడివడుచు."స్వా. 3, ఆ. 28.)

ఔదుంబరము. సం. వి. అ. న. 1. రూ- ఔదుంబరము. తామ్రము, రాగి: చూ, లోహము. 1; పుం. 2. ఒకరకము వీణె: చూ, వీణె; 3 ఒకరకము తెవులు: చూ, రోగము 1; 4. అత్తి *: చూ, మేడి; విశే. 5. మేడి చెట్టు సంబంధమైనది.

ఔదుంబరుఁడు. సం. వి. అ. పుం.తద్దినపు దేవత, శ్రాద్ధదేవుఁడు, జముఁడు: చూ, యముఁడు.

ఔద్దాలము. సం. వి. అ. న. అశాలాకము, ఉద్దాలపురుగు చేర్చిన బంగారుఛాయగల పచ్చనితేనె, పుట్టలోపెట్టిన పచ్చనితేనె, కోల జున్ను: చూ, మధువు. 5. (అప్యమనియునందురు)

ఔద్దాలకము. సం. వి అ. న.—పై —

ఔద్దాలకుఁడు. సం. వి. అ. పుం. ఉద్దాలక మహర్షి కొడుకు.

ఔద్దాలికము. సం. వి. అ. న: చూ, ఔద్దాలము.

ఔద్దేశికము. సం. విశే. (అ. ఆ. అ) ఉద్దేశము ను గనఁబఱచునది.

ఔధస్యము. సం. వి. అ. న. క్షీరము: చూ, పాలు. 1.

ఔద్ధత్యము. సం. వి. అ. న. ఉద్ధతత్వము,పొగ. "క. సత్యపరాక్రముఁడగు నీ.సాత్యకి బాహాబలంబు సమరవిహారా, ద్ధత్యముఁ జూచెను గాకే, యత్యాశ్చర్యంబులితని యస్త్రవిధంబుల్." భార. భీష్మ. 2, ఆ. 12: చూ, హెచ్చు. 2.

ఔద్ధర్షిణి. పా. ఒకానొకవృత్తము దీనినే వసంతతిలక, సింహోన్నత, శోభావతి, మధుమాధవియని కూడనందురు (చూ, వసంతతిలక.): చూ. వృత్తము. 1.

ఔద్భిదము. సం. విశే. (అ. ఆ. అ.) 1. ఉద్భిదము, విత్తువలన పుట్టినది: చూ, మొక్క. 1; వి. అ పుం. 2. అట్టుప్పు: చూ, లవణము. 1.

ఔద్భిజ్యము సం. వి. అ. న. పాంశవలవణము: చూ, లవణము. 1.

ఔద్వాహికము. సం. విశే. (అ, ఆ. అ.) 1.వివాహకాలమునందీయబడిన వస్తువు; 2. వివాహసంబంధమైనది: చూ, వైవాహికము.

ఔననఁగ. జా బాగుగానున్నదనఁగా. "అందఱౌనన బ్రతికి." (నీతిచంద్రిక —విగ్రహము.)

ఔను. దే అవ్య. 1. రూ-అవును. అంగీకారార్థకము: చూ, సమ్మతము; 2. యథార్థకము "అ. ఔను, హైసరే సరేయటంచనంగ యథార్థము." ఆం, భా. తృ. అవ్య. 75: చూ, సత్యము. 1.

ఔనేమో. దే. అవ్య. అవునకాఁబోలు: చూ, కాఁబోలు.

ఔన్నత్యము. సం. వి. అ. న. ఉన్నతత్వము: చూ, పొడవు. 2. (ఆల్టిట్యూట్.)

ఔన్స్. ఆం. 8 డ్రాములు = వైద్యులతూనిక; 16 డ్రాములు=వ్యాపారము తూనిక; 20 పెన్నీ ఎత్తులు=(ట్రాయి తూనిక.)

ఔపకార్యము. సం. వి. అ. న. దూష్యము, గుడారము, వస్త్రముచేత నేర్పఱచిన యిల్లు: చూ, గృహము. 1.

ఔపగవకము. సం. వి. అ. న. ఔపగవముల సమూహము. (ఔపగవములు=ఉపగువు నపత్యములు): ఔపదవము.

ఔపగవి. సం. వి. ఈ. స్త్రీ. ఉపగు అనువాని కూఁతురు.

ఔపగ్రస్తికుఁడు. సం వి. అ. పుం. 1. రాహు గ్రస్తుఁడైన సూర్యుఁడు; 2. చెందమామ: చూ. చంద్రుఁడు.

ఔపచారము. సం. విణ. (అ. ఈ. అ.) ఉప చారమువలనఁ గలిగినది. ఇక్కడ ఉపచార మనఁగా ఒకదానియందుండు ధర్మమును మఱియొకదానియం దారోపించుట.

ఔపచారికము. సం విణ. (అ. ఆ. అ.) అము ఖ్యమైనది, ఉత్ప్రేక్షింపఁబడినది.

ఔపచ్ఛాందసము. పా. వైతాలీయజాతివృత్తము లలో నొకటి. ఇందు మొదటిపాదమునందు స, స, ర, యగణములును, రెండవపాదమున స, భ, ర, యగణములును, మూఁడవపాదం బునందు స, స, స, యగణములున్ను, నాలవ పాదమునందు స, మ జ, గగమును గలిగి మొదటి మూఁడుపాదంబులందేడింటను, నాల వపాదంబునం దాఱింటను యతిగల వృత్తము: (చూ. వైతాలీయము) చూ. వృత్తము. 1.

ఔపదవము. సం. వి. అ. న: చూ. ఔపగవ కము. (ఉపగవుని సంతానము.)

ఔపధర్మ్యము సం. వి. అ పుం. పాషండ ధర్మము.

ఔపనిధికము. సం. వి. అ. న. ప్రీతిచే భోగము నకై అర్పించిన ద్రవ్యము.

ఔపనిషదికము. అం. సప్తాధికరణములలో నొ కటి చూ. సప్తాధికరణములు. (బాభ్రవ్యుని చేత నేర్పఱచి చెప్పఁబడినదానినుండి ఔపని షదికమును కూచిమారముని రచించెను ): చూ. కామశాస్త్రము

ఔపనిషదుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) ఉప నిషత్తు తెలిసినవాఁడు.

ఔపపత్తికము. సం. విణ. (అ. ఆ. అ.) సిద్ధముగ నందుఁబాటులో నున్నది, తగినది: చూ. యోగ్యము. 2

ఔపపత్తికశాస్త్రము. పా. తార్కికశాస్త్రము. (సైన్సుప్యూర్.)

ఔపమ్యము. సం. విణ. (అ. ఆ. అ.) సమాన మైనది: చూ. సమానము.

ఔపయికము సం విణ. (అ. ఆ అ.) న్యాయ ముతోఁగూడినది: చూ. యోగ్యము 2.

ఔపరము. సం. వి అ. న క్షారద్రావణము, చౌటుప్పు: చూ. లవణము. 1.

ఔపరాజికము సం విణ. (అ. ఆ. అ.) ఉప రాజసంబంధమైనది.

ఔపరిష్టము. అం. కళలు అఱువదినాలుగింటిలో నొకటి: చూ. కళలు.

ఔపలము సం. విణ. (అ. ఆ. అ ) 1 ఱాతి తోఁ జేయఁబడినది; 2. ఱాతిసంబంధమైనది; 3. ఱాళ్లమీఁదిపన్ను: చూ. ఱాళ్ళపన్ను.

ఔపవస్త్రము సం. వి. అ. న ఉపవాసము చూ. పస్తు

ఔపవాస్యము. సం. వి. అ. న. —వై.—

ఔపవాహ్యము. సం. వి. అ పుం: చూ. ఉప వాహ్యము.

ఔపవిభక్తికము. పా: చూ. ఉపవిభక్తులు.

ఔపవిభక్తికాంతములు. పా (1) త్రాఁడు; త్రాడులు-త్రాళ్లు-త్రాళులు, త-త్రాటి- త్రాడుల మొ॥ ఇట్లు కాదు మొ॥వి; (2) కోఁడు; కోఁడులు-కోళ్లు; (3) ఏఁడు ఏఁడులు-ఏండ్లు, (4) చేను; చేలు-త-చేని- చేల; (5) మేను; మేనులు-త-మేని-మేనులు; (6) కొలను-కొలఁకు-కొలఁకులు- త-కొలని- కొలఁకు-కొలఁకుల ఇట్లు వలను గవను-కొఱను- కలను-తెలను-వలను-నెఱను-మాను మొ॥వి; (7) కన్ను-కను; కన్నులు-కనులు- త-కంటి; కన్నుల-కనుల. ఇట్లు మిన్ను- మన్ను- చన్ను

మొ॥వి; (8) చేయి-చేతులు-త-చేతి. ఇట్లు-గోయి-నేయి-నూయి మొ॥ (9) వేయి-వేలు-త-వేయింటి: (10) తాయి-తాలు-త-తాతి; (11)ఊరు; ఊరులు-ఊళ్లులు ఊళ్లు-ఊళులు-త-ఊరి; (12) నోరు; నోరులు-నోళులు-నోళ్లు-త-నోరి-నోటి: (13) పేరు; పేరులు-పేళ్లు-త-పేరు-పేరిటి; (14) ఏఱు-ఏఱులు; ఏళ్లు-త-ఏటి;(15)అఱ్ఱు- అఱ్ఱులు- త-అతిటి-మిఱ్ఱు-గొఱ్ఱు మొ॥వి; (16) పగలు-త-పగటి-పగలిటి-పగం అలు; అండ్రు-అండ్రుు-త-అలి ఇట్లు చెలియలు- చెల్లెలు-కోడలు మొ॥వి; (17) విల్లు; విల్లులు- విండులు-విండ్లు-త- వింటి ఇట్లు ముల్లు-పల్లు మొ॥వి; (18) కల్లు; కల్లులు- కండ్లు- త-కంటి. ఇట్లు సన్నికల్లు- తిరుగల్లు-ఇల్లు; (19) కాలు. కాలులు- కాళ్లు-త-కాలి.

ఔపసర్గికము. సం. వి. అ. పుం. 1. ఉపసర్గముచేత వచ్చిన యర్థభేదము; 2. ఉపసృష్టివలనకలిగినది; 3.వాతపిత్తశ్లేష్మాగులవలన కలిగిన తెవులు: చూ, రోగము 1.

ఔపస్థానికుఁడు సం. విణ (అ. ఆ అ.) కాచియుండిగాని పూజచేసిగాని జీవించువాఁడు.

ఔపస్థికుఁడు. సం. విణ.(అ. ఆ. అ.) స్త్రీసంగమముచేసి డబ్బుసంపాదించి జీవించువాఁడు.

ఔపస్థ్యము. సం. విణ. (అ. ఆ అ.) ఉపస్థేంద్రియ సంబంధము.

ఔపహారికము. సం. వి. అ. న. నివేదింపఁదగిన వస్తువు, బలి: చూ, నైవేద్యము.

ఔపాధికము. సం. విణ. (అ. ఆ. అ.) స్థిరము కానిది, ఉపాధివలన కలిగినది.

ఔపానహ్యము. సం. వి. అ. న. ఉపానహము, పావుకోళ్లు: చూ, పాదుక.

ఔపాసనము. సం. వి. అ. న. 1. గృహస్థుఁడగు బ్రాహ్మణుఁడు ప్రాతఃకాలమునందు చేయు అగ్నిఉపాసన: చూ, హోమము; 2. రజస్వలానంతరమున స్త్రీని భర్తతో కలుపుట: చూ, గర్భాధానము; విణ. 3. ఉపాసనా విషయమైనది.

ఔపోదక్యము. సం. వి. అ. న. దుంపబచ్చలిచేఁ జేయఁబడినది.

ఔమీనము సం. విణ (అ. ఆ. అ.) (ఉమలు పండునది) నేల: చూ, భూమి 1.

ఔర. దే అవ్య. (ఔను+ర) రూ-అవుర-ఔరా- ఆశ్చర్యార్థకము. (ఆమ్రేడితమందు ఔరౌర.): చూ, వింత. 1.

ఔరంగజేబు. శా. గంగవంశానుచరితము. (మహారాజశ్రీ ఆంధ్రభారత తీర్థప్రథాని బుఱ్ఱా శేషగిరిరావుగారు. ఎం. ఎ.) ఢిల్లీ పాదుషావల్ల నైజాముతో సమానముగుశీలు మొహరులు పొంది వాటితో పారసీభాషను దానపట్టాలు జారీచేసిన శ్రీవిజయరామగజపతిమహారాజుల కాలమువఱకును, అనఁగా ఇప్పటి కళింగమందలి విజయనగరం పట్టణము క్రీ. శ. 1713సం॥రములో కట్టడము జరిగేవఱకు, పూసపాటివారికి కుంభిళాపురమే రాజధానిగానుండెను. ......ఈరాజ్యములోని కాళింగులను సాంధ్రులు విశేషముగా సిరిసంపదలతోఁ దుల తూగుచుండియు, దానభోగములకు లోభించి తమసంపద నడివి వెన్నెలవలె నిష్ప్రయోజనము చేసిరని కవి వర్ణించియున్నాఁడు. ఔరంగజేబు పాదుషావల్ల జుల్ఫకీరు మొదలగుబిరుదులు పొందిన పూసపాటి మహారాజులవాటికి వర్ణనము సరిపోదు. కళింగ. 889. పుట; (మ.రా. శ్రీ. రాళ్లబండి సుబ్బారావుగారు. ఎం. ఎ, ఎల్. టి.) 1687 లో గోల్కొండరాజ్యము ఔరంగజేబుచే జయింపఁబడెను.) కళింగ.668 పుట; ఇంగ్లీషువారు...1685 లో బెంగాల్ నవాబగు షైస్తఖానునితో పోరాడుటచేత

1687 లో బలసోరుగిడ్డంగి పడఁగొట్టఁబడెను. 1691 లో ఔరంగజేబువల్ల తిరిగి యనుజ్ఞ నొంది కలకత్తా బలసోరు మొదలగు గిడ్డంగులను కట్టుకొని వర్తకము విరివిగా సాగించుకొనిరి. కళింగ. 675. పుట.

ఔరగము. సం. వి. అ. న. ఆశ్లేష, అసిలేరు: చూ, నక్షత్రము. 1.

ఔరడి. దే. వి తిరస్కారము: చూ వహేళనము.

ఔరణము. సం. వి. అ. న ఉరభ్రముల సమూహము. (ఉరభ్రము=గొఱ్ఱె) గొఱ్ఱెలమంద చూ, మేషము. 1.

ఔరభ్రకము. సం. వి. అ న. —పై.—

ఔరభ్రము. సం. వి. అ. న. —పై.—

ఔరభ్రికుఁడు. సం. వి. అ. పుం. గొల్లవాఁడు: చూ, మహాశూద్రుఁడు.

ఔరసాదిపుత్రభేదాదులు. పా. వర్ణన.-"గీ. పరమసంస్కృతయగునాత్మ భార్యయందు, ధర్మవిధిఁగలిగించిన తనయుఁడనఁగఁ, దానయౌరసుఁడను నభిధానమొప్పఁ, బరఁగు నుత్తముఁడాతఁడు ప్రథముఁడధిప." ఇత్యాది. భారతము అను. 2, ఆ. 242 మొ. 256; మఱియు. భారతము. అను. 2, ఆ. 230 మొ. 233; మఱియు విజ్ఞానేశ్వరము. ఆచా. 120 మొ. 141; మఱియు భారతము. అను. 4, ఆ.132 మొ. 138 వఱకు గల పద్యములు.

ఔరసుఁడు. సం వి. అ. పుం. 1. వైవాహిత పత్నీపుత్రుఁడు, అగ్నిహోత్రసాక్షిగా పెండ్లియాడిన తన ధర్మపత్నియందుఁ దనవలనఁ బుట్టినకొడుకు. "ఆ. ఔరసుండె నీకు వారసుఁడౌఁగాక, వేశ్యయందుఁ బుట్టి విధవకొడుకు, నీవుపోయినపుడు నీకైనవదలునే" వేమన. 888: చూ, పుత్రుఁడు. 1; అం. 2 పుత్రులు పండ్రెండుగురిలో నొకఁడు: చూ, పుత్రులు

ఔరస్యుఁడు. సం. వి. అ. పుం. —పై.—

ఔరా. దే. అవ్య. (ఔను + ఆ): చూ, రూ-ఔర-అవురా

ఔరు. దే వి. రూ-అవురు, వీరణము. *: చూ, తృణము, 1.

ఔర్జిత్యము. సం. వి. అ. న. 1. గొప్పతనము: చూ, గౌరవము; అం. 2 గుణములు ఇరువది మూఁడింటిలో నొకటి: చూ, గుణములు.

ఔర్ణము. సం. విశే. (అ ఆ. అ.) ఉన్నితోఁ జేయఁబడినది.

ఔర్ధ్వదేహము. సం వి. అ. పుం. చచ్చినవానికిఁ జేయఁబడు కర్మము.

ఔర్ధ్వదేహికము. సం విశే. (అ. ఆ. అ.) చచ్చినవారికిఁ జేయఁబడు కర్మకు సంబంధించినది.

ఔర్ధ్వదైహికము. సం. విశే. (అ. ఆ. అ.) మృతదిన కృత్యదానము, మృతదినమందు మృతులకొఱకుఁ జేయఁబడు పిండజలాదిదానము, ఉత్తరక్రియ, అంత్యకర్మము: చూ, కర్మములు.

ఔర్ధ్వుఁడు. సం వి. అ. పుం. ఔర్ధ్వమత ప్రవర్తకుఁడు.

ఔర్వము. సం. వి. అ. పుం. 1. బడబాగ్ని. వార్వపుటగ్గి: చూ, నిప్పు; 2. పాంశవలవణము: చూ, లవణము. 1.

ఔర్వరము. సం. విశే. (అ. ఆ. అ.) సర్వసస్యసంపన్నమైన భూసంబంధము.

ఔర్వవ్రతి. సం. వి. న. పుం. జలాహారనియమము గలవాఁడు.

ఔర్వశేయుఁడు. సం. వి. అ. పుం. 1. అగస్త్యముని: చూ, ముని 1; 2. వశిష్ఠుఁడు: చూ, ముని 1.

ఔర్వుఁడు. సం. వి. అ. పుం. 1. ఔర్వుఁడను భృగువంశమునఁ బుట్టిన ఋషి: చూ,

ముని. 1: అం. 2 వ్రతముగలవాఁడు వ్రతి. వ్రతిభేదము గలవారు తొమ్మండుగురిలో నొకఁడు: చూ, వ్రతి. 2; (ఇవే గతిభేదములు.)

ఔల. దే. వి: చూ, రూ- అవల - అవుల. "ద్వి. సారథిరథ హౌలఁజనఁద్రోలనదియు." రా. యు, కాం.

ఔలపము సం. వి. అ. న. ఉలపమనెడు తృణములగుంపు.

ఔలానము. సం వి. అ. పుం. ఆధారము, నీరుబెంకి, తిరుకొలను: చూ, సరస్సు. 1.

ఔలు. దే అ. క్రి గళితమగు, రూ-అవులు: చూ, రాలు.

ఔలూకము. సం.వి. అ. న గుడ్లగూబలగుంపు.

ఔలూకుఁడు. సం. వి అ. పుం. 1. దుడ్డుకఱ్ఱ పట్టువాఁడు; 2. పదునాఱు పదార్థములు గల తర్కశాస్త్రము చదివినవాఁడు.

ఔలూక్యుఁడు సం. వి. అ. పుం. వైశేషిక శాస్త్రము చదివినవాఁడు.

ఔలెమ్మ. దే. అవ్య. (ఔను + లెమ్మ.) రూ- అవులెమ్మ. అంగీకారార్థకము. "మ. 'ఇది భోజాత్మజకిచ్చెఁ గినుకతో నేమంచు నూహించునో, మది సాత్రాజితి? దానికేనిపుడు ప్రేమంబంపినఁ దీనిసెల్లిదముంజేసి జాడ దోఁచునో? యౌలెమ్మందునే నున్కిఁబె, ల్లమువో యేరికిఁబంపఁగా,' ననుచులీలన్ రుక్మిణీకాంతుఁడు." పా. 1, అ. 54: చూ, సమ్మతము.

ఔలే. దే. అవ్య.—వై.— (రూ-అవులే-అవులెమ్మ.)

ఔశనము. సం. వి అ. న. 1. ప్రియునిసన్నిధి; 2. ఓడకంబముయొక్క చివరనుండు గ్రామదేవతకుఁ జేయునట్టి యుత్సవముఅనఁగా సురమానుసంభ్రమము; 3. అమ్మవారి జాతర: చూ, పండుగ. 3; అం. 4. ఉపపురాణములు పదునెనిమిదింటిలో నొకటి: చూ, ఉపపురాణములు.

ఔశనసము. సం. వి. అ. న. శుక్రాచార్యుని చేతఁ జెప్పఁబడిన నీతిశాస్త్రము.

ఔశీనరుఁడు. సం వి. అ. పుం. శిబిచక్రవర్తి: చూ, రాజు. 1. (రూ- ఔసీనరుఁడు.)

ఔశీరము సం. వి. అ. న. 1. చామరము: చూ, సురటి; 2. లాతము, చేతికఱ్ఱ: చూ, వేత్రము 1; 3. పడక: చూ, శయ్య. 1; 4. ఆసనము, గద్దియ. చూ, పీఁట; 5. ఉశీరము*: చూ, వట్టివేరు; విశే. 6. వట్టివేరువలనఁ బుట్టినది.

ఔషణము. సం. వి. అ. న. మిరియములరసము.

ఔషధగ్రంథము. పా. భేషజకల్ప సూత్రసంహిత. (ఫార్మకోపియా.)

ఔషధప్రియ. సం. వి. అ. పుం. జ్యోతిష్మతి*: చూ, వ్రాతదుర్మల.

ఔషధము. సం. వి. అ. పుం. 1. అనేకద్రవ్యములచేఁ జేయఁబడినమందు, భేషజము: చూ, మందు, 1; అం 2. క్రియలు మూఁడింటిలో నొకటి: చూ, క్రియలు; 3. ప్రకాశింపఁ జేయఁగూడనికర్మలు పదునొకటింటిలో నొకటి: చూ, ప్రకాశింపఁజేయఁగూడనివి.

ఔషధమేళనము పా. (కంపౌండింగ్.)

ఔషధయోగము. పా. చికిత్సాపత్రము. (ప్రిస్క్రిప్షన్.)

ఔషధస్కంధము. పా. ఆయుర్వేదమునకు హేతుస్కంధము, లింగస్కంధము, ఔషధస్కంధముఅని మూఁడుస్కంధములు. అనఁగ కాండములు. మొదటిది.— వాతపిత్తశ్లేష్మముల చెడి శరీరస్థదోషత్రయముయొక్క ప్రకోపన హేతువులనఁగ రోగహేతువులైన భక్ష్యవస్తువులను దెలిపెడిది; రెండవది.— లింగము

లనఁగ రోగచిహ్నములను దెలిపెడిది; మూఁడవది.— రోగనివృత్తికరములగు నోషధుల ను వాటితోఁ జేసిన యౌషధములను దెలిపెడిది. వైమూఁడు స్కంధములలోనిది యొకటి: చూ, స్కంధములు.

ఔషధీశుఁడు. సం. వి. అ. పుం. బుధుఁడు, బుమఁడు, నెలపట్టి, ఇలాపతి: చూ, రాహువు. 2.

ఔషరము. సం. వి. అ. న. 1. పాంశవలవణము, తాతిఉప్పు, తనుఁదానకలిగెడు సముద్రపు ఉప్పు: చూ, లవణము. 1; 2. అయస్కాంతము, సూదంటుడాయి: చూ, రాయి; 3. చౌటినేల: చూ, భూమి. 1.

ఔషసి. సం. వి. ఇ. పుం: చూ, రూ-ఉషస్సు.

ఔష్ట్రికము. సం. వి. అ. న. లొట్టిపిట్టలగుంపు.

ఔష్ట్రిము. అం. భావదూషితములు పదునొకటింటిలో నొకటి. (చూ, భావదూషితములు): చూ, వ్యాకరణబంధములు.

ఔష్ఠ్యము. సం. విణ. (అ. ఆ. అ.) 1. పెదవులతోఁదగిలి పలుకునది: చూ, ఓష్ఠ్యము; 2. పెదవికి సంబంధించినది.

ఔష్ఠ్యములు. పా. ఉ, ఊ, ప, ఫ, బ, భ, మ లు: చూ, ఓష్ఠ్యములు.

ఔష్ణము. సం. వి. అ. న. ఉక్క: చూ, ఔష్ణ్యము.

ఔష్ణ్యము. సం. వి. అ. న.—పై.—

ఔష్మ్యము. సం. వి. అ. న.—పై.—: ఉష్ణము, ఊష్మకము, ఊష్మము, ఔషము, ఔష్ణ్యము; (తె. ప):—ఆవి, ఆవిరి, ఉక్క, ఉబ్బ, ఉమ్మ, ఉమ్మదము, ఉమ్మలక - రూ-ఉమ్మలిక - ఉమ్మలికము, ఉమ్మలింపు.

ఔసీనరుఁడు. సం. వి. అ. పుం: చూ, రూ-ఔశీనరుఁడు.

ఔసు. దే. వి: చూ, రూ-అవును.

ఔసుకాఁడు. ద్వి. విణ: చూ, రూ- అవుసుకాఁడు.

ఔస్రము. సం వి. అ. పుం. 1. ఉస్రము, కిరణము: చూ, మయూఖము. 1; 2. కిరణసంబంధము, 3. కిరణములగుంపు.

ఔహము. సం.విణ. 1 ఊహకు సంబంధించినది; 2 ఊహలపొంగు, ఊహాసమూహము. (ఊహాసముద్రము—అంతులేనిది.)



శ్రీ

# ఆంధ్రవాచస్పత్యము.

యొక్క

ప్రథమసంపుటమునకు

(అ మొదలు ఔ వఱకు)

## అనుబంధము.



అ. పా. 1. సంస్కృతమునకు వర్ణంబులు ఏఁబది. అందు అచ్చులు పదునాఱు ఆ అచ్చులలోనిది మొదటియక్షరము, 2. తెనుఁగునకు వర్ణములు ముప్పదియేఁడు అందు అచ్చులు పదునాలుగు. ఆ అచ్చులలోనిది మొదటియక్షరము; 3. ఆంధ్రభాషకువర్ణంబు లేబదియాఱు. అందు అచ్చులు పందొమ్మిది. ఆ అచ్చులలోనిది మొదటియక్షరము; 4. కంఠ్యములలో నొకటి: చూ, కంఠ్యములు; 5. అర్ణులలో నొకటి: చూ, అర్ణులు; 6 అక్షులలో నొకటి: చూ, అక్షులు.

అంకణము. పా. (క్వాడ్రేంగిల్.) చతుష్కోణము.

అంకపాశవ్యవహారము. పా. (పెర్మ్యుటేషన్.)

అంకము. పా. రాశి; సంఖ్య (నంబర్.) ఇందుకుసంబంధించిన శాస్త్రపరిభాషాపదములు.— వియుక్తసంఖ్య - శుద్ధసంఖ్య - సాధారణసంఖ్య - నిరుపాధికసంఖ్య - యుగళాత్మకసంఖ్య - ముఖ్యసంఖ్య - ప్రత్యయరహితసంఖ్య - మూలాంకము - సంఖ్యార్థము - మితసంఖ్య- మిశ్రసంఖ్య - గుణజ - చేరియున్నయుక్తసంఖ్య-మిశ్రసంఖ్య- సమహితసంఖ్య- సంయుక్తసంఖ్య - వ్యావహారికసంఖ్య - ఉపలక్షితసంఖ్య - సమసంఖ్య - సమసమసంఖ్య- సమవిషమసంఖ్య - సంకలితసంఖ్య - భిన్నసంఖ్య - కరణిసంఖ్య - సంకీర్ణసంఖ్య - మిశ్రసంఖ్య-ప్రాకృతికస్వతస్సిద్ధసంఖ్య-ఏకాదిక్రమసంఖ్య - ఋణసంఖ్య - విషమసంఖ్య - గచ్ఛము - పూర్ణసంఖ్య - సంఖ్యానిధి - ఉత్తమసంఖ్య - దృఢాంకము - బహుభుజాకారసంఖ్య - ధనసంఖ్య - ప్రధానసంఖ్య - సజాతీయసంఖ్య - శుద్ధసంఖ్య - మూలకసంఖ్య - ప్రత్యక్షసంఖ్య - వాస్తవ్యసంఖ్య - సంబంధిసంఖ్య - త్రిభుజాకారసంఖ్య -పూర్ణసంఖ్య- అభిన్నసంఖ్య - సంఖ్యామానము - సంఖ్యావాచకము - సంఖ్యను చదువుట - శబ్దములతో వ్రాయుట ఇత్యాది.

అంకసంకేతము. పా. సంజ్ఞామానము, సంఖ్యాలేఖనము, సంకేతచిహ్నగణితము.

అంతుడు. దే. వి. కృష్ణకుటజము *: చూ, హై

మారకము. (చర్మవ్యాధులమీఁద పనిచేయును.)

**అంకురచ్ఛదము** పా. 1. బీజాంకురమును చుట్టియుండుపదార్థము.(పొర.); 2. పిండపుకండ, బీజపోషక వస్తువు.

**అంకురదళము.** పా. బీజదళము.

**అంకురబహిచ్ఛదనము.** పా. గర్భపుకండ.

**అంకురము.** పా. (ప్లుమ్యూల్.) మొలక, ప్రథమశాఖ.

**అంకురార్పణకాలము.** పా. అంకురారోపణమును గుహ్యసూత్రములో చెప్పినప్రకారము అన్నప్రాశన, చౌల, ఉపనయన, వివాహ, సీమంత,పుంసవనకర్మములకుఁ బూర్వమందనఁగా వానిముహూర్తదినమునకుఁ బూర్వరాత్రియందైనను - సద్యస్కాలమందైనను - పరరాత్రియందైనను ఇట్లు చేయనిపక్షమందున ముహూర్తదినమునకు 3—5—7 ఈరాత్రులయందైనను - చవితి - నవమి - చతుర్దశి ఈరిక్తతిథులును - పూర్ణిమ - అమావాస్య- కృష్ణాష్టమి - కృష్ణచతుర్దశి - సంక్రమణము లీపర్వములును - చవితి - సప్తమి - త్రయోదశి - ప్రదోషదినములును - త్యాజ్యఘడియలును - నిషేధించి సోమ- బుధ- బృహస్పతి- శుక్రవారములయందును- వృషభ - మిథున- కర్కాటక - కన్య - ధనుర్మీనమాసములైన శుభగ్రహములయొక్క లగ్నములయందును- అశ్విని - పుష్యమి - హస్త - స్వాతి- చిత్త- రేవతి - మృగశిర - అనూరాధ - రోహిణి- ఉత్తర - ఉత్తరాషాఢ - ఉత్తరాభాద్ర - మూల - మఖ - శ్రవణ - ధనిష్ఠ - శతభిష నక్షత్రములయందును అంకురారోపణము చేయవలయునని తాత్పర్యము.

**అంకురార్పణము.** జా. ప్రారంభము, అంకురార్పణమను వైదికకర్మ, అన్నిశుభకర్మలకు ప్రారంభమునఁజేయు కర్మ. "రంభకుఁ దా నవతిపోరుగణించుట, కంకురార్పణమది ఇటుకొంత సేసితి." (కళాపూర్ణోదయము.)

**అంకురోద్భవనము.** పా. 1. (గ్రాన్యులేషన్.) మాంసాంకురములు పుట్టుట; 2. సిద్ధభవనము.

**అంకుశనాళి.** పా. వక్రనాళిక; పైనుండి నీటిని క్రిందికిదెచ్చుయంత్రము (సైఫన్.)

**అంకెవన్నెవముక.** పా. (స్టాపుస్.)

**అంగన్యాసము.** పా మంత్రబీజములనుచ్చరించుచు అవయవములను తాఁకుట.

**అంగపాతము.** పా. గుదభ్రంశము.

**అఁగలి.** పా అంగుడు.

**అంగవిచ్ఛేదనము.** పా. (ఏంప్యుటేషన్.)

**అంగశృంగారము.** పా. ఈగ్రంథకర్త ముడుంబ నరసింహాచార్యస్వామి. (19 శతాబ్ది.)

**అంగారక్షారవాయువు.** పా. బొగ్గుపులుసుగాలి.

**అంగారము.** పా. (చార్కోల్)

**అంగారిణి.** సం. వి. ఇ. స్త్రీ కుంపటి: చూ, ప్రోయ్యి.

**అంగీకారాజ్ఞ.** పా. (శాంక్షన్.) ఉత్తరువు.

**అంగీకృతకాలము.** పా. ప్రమాణభూతకాలము.

**అంగీకృతమానము.** పా. ఆదర్శప్రమాణము. (స్టాండర్డుయూనిట్.)

**అంగుడు.** పా. తాలుమండలము.

**అంగుష్ఠదీర్ఘమజ్జాతంతువు.** పా. (నర్వ్-ఫ్లెక్సర్-లాంగ్.)

**అంగుష్ఠోపకర్షకస్నాయువు.** పా. (మసెల్ అబ్డక్టర్ పాలిసిస్.)

**అంగుళీపర్వము.** పా. వ్రేలికణుపు.

**అంజన.** అం. అష్టదిగ్గజముల భార్యలలోనొకతె: చూ. దిగ్గజభార్యలు.

**అంజనగంధకిదము,** పా. సుర్మా, సౌవీరము.

**అంజనామిక.** పా. కంటికురుపు.

అంజనము. పా. (ఆంటిమొని); అష్టదిగ్గజములలో నొకటి. చూ, దిగ్గజములు.

అంటరానితనము. పా. తాకరామి. (అంటుజబిలిటి)

అంటుమొగ్గలు. పా (అడ్వెంటిషస్ బడ్సు.)

అంటువేళ్లలత. (క్లైంబర్ రూట్ లెట్)

అండకోశము. పా. స్థూలబీజాశయము

అండత్వక్కు. పా. ఆవరణపొర.

అండదము పా. గ్రుడ్లనిడు జంతువు.

అండము. పా. పుష్పములోని స్థూలబీజాశయము.

అండర్ సెక్రెటరీ. ఆం. ఉపగతకార్యదర్శి, అనుగతకార్యదర్శి

అండలంబనస్థానము. పా. బీజబంధము.

అండవ్యాధిగల జాతకుఁడు. పా. 1. లగ్నమందు రాహువు శనికుజులతోఁ గూడుకొని యుండునపుడును; 2. లగ్నాధిపతి యష్టమమందు రాహువుతోఁగాని, మఱియొక పాపగ్రహముతోఁగాని కూడి యుండునపుడును; 3. లగ్నమందు రాహువును, గుళికుఁడు పంచమ నవమములయందును, కుజమాందిగ్రహములు కేంద్రమందు నుండునప్పుడును; 4. లగ్నాధిపతియుండు నవాంశరాశ్యధిపతి రాశిచక్రమందుండు రాహుకుజమాంద్యాదులతోఁ గూడునపుడును; 5. అష్టమాధిపస్థిత నవాంశరాశ్యధిపతి రాశిచక్రమందు రాహుయుక్తుండగునప్పుడును; 6. లగ్నాధిపతియగు కుజుఁడు లగ్నమందుండి పాపగ్రహసంబంధము కలిగి యుండునప్పుడును; 7. షష్ఠమునందు కుజశనిరాహువులు చేరియుండునప్పుడును; 8. లగ్నమందు గురురాహువులుండునప్పుడును; 9. కారకాంశరాశి గుళికాకాల లగ్నమై బుధుఁడు మాత్రము చూచి, తక్కిన గ్రహములచేఁ జూడఁబడనపుడును అండవ్యాధి కలిగియుండును.

అంతఃకేంద్రము, పా. అంతర్వృత్తకేంద్రము.

అంతఃకోటి ప్రవర్తకము. పా. (ప్రిసెస్ ఇంటర్నల్ ఏంగ్యుల్.)

అంతఃకోణాస్థి పా. (బోడ్ కూనీఫారం ఇన్టర్నల్.)

అంతఃపటలదాహము. పా. (రేటినిటిస్.)

అంతఃపటలము. పా. అక్షికము.

అంతఃపలలము. పా. (ఎండోసార్కు.) అంతర్జీవకము.

అంతఃస్పార్శ్వకస్నాయువు. పా. (మసెల్ ఇంటర్ కాస్టల్ ఇంటర్నల్.)

అంతఃప్రకోష్ఠాస్థి. పా. కూర్పరాస్థి. (యుల్నా.)

అంతఃప్రకోష్ఠీయభుజాతంతువు. పా (నర్వ్ యూల్ నర్.)

అంతఃఖండనము. పా. (సెగ్ మెన్ టేషన్ ఆఫ్ ఏపికల్ సెల్)

అంతజ్వరము. పా. తంద్రికసన్నిపాత జ్వరము ప్రలాపక సన్నిపాతజ్వరము.

అంతప్రచాలనము. పా. ఉపన్యాసము.

అంతమ (గణి) పా. (టెర్మినల్.)

అంతరగోళకము. పా. పేశిగోళకము.

అంతగనిక్షేపము పా. ప్రక్షిప్తము.

అంతరపాంగస్నాయువు. పా. అంతర్దర్శిని స్నాయువు.

అంతగలంబము. పా. లంబపరిమాణము.

అంతరాయము. పా. (ఇంటర్వల్.)

అంతరావర్తకస్నాయువు. పా. ఉత్తానక స్నాయువు.

అంతరిక్షమార్గ విద్యుత్ ప్రసారతంతువులు. పా. ఎత్తుశిఖరములపై వేయఁబడు సమాంతర తంతువులు.

అంతరిక్షశాస్త్రము పా. పవనస్థితి శాస్త్రము, వాతావరణశాస్త్రము. (మెటియొరోలజీ.)

అంతరిమజ్వరము. పా. సవిరామజ్వరము.

అంతరోత్సర్గకావయవములు. పా. స్రావకావయవములు.

అంతరోత్సర్జన పా. (సెక్రిషన్.) గ్రంథిజనిత స్రావము.

అంతర్గతస్థితి. పా. పొదిగెడుకాలము; రోగోద్భూత కాలము.

అంతర్గతోష్ణము. పా. గూఢోష్ణము.

అంతర్జంఘ స్నాయువు. పా. జంఘాపురోగ స్నాయువు.

అంతర్జంఘాస్థి. పా. పిక్కలోవైపు పెద్దఎముక. (టిబియా.)

అంతర్జాతి. పా. ఉపజాతి. తెగ.

అంతర్దాతీయ సంబంధములు. పా. (ఇంటర్ నేషనల్ రిలేషన్సు)

అంతర్జానుకమజ్జాతంతువు. పా. (నర్వ్యుపాప్లిటియల్ ఇన్ టెర్నల్.)

అంతర్జీవకము. పా. అంతఃపలలము.

అంతర్జీవస్థానము. పా. జీవస్థానగర్భము,

అంతర్జ్ఞానము. పా. సహజజ్ఞానము; ప్రమాణనిరపేక్షాజ్ఞానము.

అంతర్దర్శినిస్నాయువు పా. అంతరపాంగస్నాయువు.

అంతర్ప్రతిబింబకరణము. పా. (ఇంటర్నల్ రిఫ్లెక్షన్.)

అంతర్బంధని. పా. అంత్రిక.

అంతర్ముఖి. పా. అంతర్వాహిని.

అంతర్వక్రకాష్ఠికస్నాయువు. పా. (మసెల్ అబ్లిక్సు ఇంటర్నస్ )

అంతర్వాహిని. పా. అంతర్ముఖి,

అంతర్వృత్తకేంద్రము. పా. అంతఃకేంద్రము.

అంతర్వృత్తము. పా (సర్కిల్-ఇన్‌స్క్రైబ్డు.)

అంతస్స్పర్శము. పా. (ఇన్సుక్రైబ్.)

అంతస్త్రిజ్య. పా. (రేడియస్ ఇన్.)

అంతస్త్వక్కు. పా. (టెగ్‌మెంట్.) ఆవరణ, వేష్టనము.

అంత్యకణము. పా. (టెర్మినల్ సెల్.)

అంత్యమధ్యసంబంధము, పా. నిష్పత్తి.

అంత్రగతజ్వరము. పా. దూషితసంతతజ్వరము.

అంత్రపరిదాహరోగము. పా. క్రిముకశోఫ.

అంత్రవేష్టనదాహము. పా. (పెరిటోనిటిస్.)

అంత్రసన్నిపాతజ్వరము. పా ప్రలాపక సన్నిపాతజ్వరము, క్షతాంత్రవిషజ్వరము (ఫీవర్ టైఫాయిడ్ )

అంత్రిక. పా. (మెసెంటరీ )

అందనిమ్రానిపండ్లకు ఱ్ఱులుచాచుట. లో. ఫలింపని పదార్థముకై ప్రయత్నించుట. ఉదా.- "ఉ. ఎందఱేఁజూడ మిద్ధరణి నింపునిభాస్యల వారికల్ల నీ, యందము చందముంగలదె యక్కట మిక్కుటమైనకోర్కెచే, నందఁగ రానిమ్రానిఫలమాసయొ నర్చినఁ దమాయ నే, మందు వనోజుఁ డేగతిని నాగడిబెట్టెదలంచినాడొకో" (తారాశశాంకవిజయము.)

అందాజుకొలత. పా. ఉజ్జాయింపు.

అందాజువిలువ. పా. ఉజ్జాయింపు

అందినశాఖ, అందకున్న కాళ్లు. లో. ఎత్తులమారి గుణము; కార్యవాదిలక్షణము. ఉదా.— "ఉ శివుఁడేటురమ్మటంచు దయచేసినచోఁ దలకెక్కు మగ్రవై, భవమునఁ జూడుచో నడుగుఁబట్టెదవేమనవచ్చు నీగుణం, బవునవు నందినన్శాఖయు నందకయున్నను గాళ్లఁబట్టు కోం, దువు హరిణాంకవేళ కొలదుల్లద నీనడకల్ దలంపఁగన్." విజ. 3, ఆ 51.

అందుకోలు. దే. వి. అందుకొనుట: చూ, ఉపాదానము. 3.

అంపైరు. ఆం. మధ్యస్థుఁడు, పైతీర్పరి.

అంబెలిఫరములు. పా ఇందలి ముఖ్యజాతులు:- ధనియము, జీలకఱ్ఱ, గాజరగడ్డ, సెలరి, వీని

పుష్పములు అందమగు గుత్తులుగా నుండును. గుత్తియందు పూవులు అన్నియు ఒకచోట నుండియె పుట్టి ఒకేచుట్టముగా గాని, గొడుగువలె గాని అమర్పబడియుండును. అండాశయములు రెండును కలిసి ఏకముగ నుండును.

అంబ్లము. పా. (ఆసిడ్.)

అంశచక్రములో గ్రహముల నేర్పఱచు రీతి. పా. ఉదా.—జాతకుడు జన్మించినరోజున పంచాంగము ప్రకారము మేనక్షత్రము యొక్క యేపాదమందే గ్రహముండునో ముందు కని పెట్టవలెను. 1. అశ్వని మొదలు గ్రహాస్థిత నక్షత్రమునకు బూర్వనక్షత్ర మాఖరువఱకు లెక్కించవలెను; 2 ఆలెక్కించిన సంఖ్యను నాలుగుచే గుణింపవలెను; 3. ఆ గుణించగా వచ్చిన సంఖ్యలో గ్రహాస్థిత నక్షత్రమందే పాదమందు గ్రహముండెనో ఆపాదసంఖ్యను గలుపవలెను; 4. అట్లు కలుపగావచ్చిన మొత్తమును 12 చేతను భాగించవలెను. అట్లు భాగించగా శేషముగానుండిన మేషాది 12వ రాశియందు గ్రహము వేయవలెను. శేషము వచ్చు యెడల ఆ శేషసంఖ్య మేషాది యెన్నవ రాశికి సరిపోవునో అట్టి సరిపోవు రాశియందు గ్రహమును వేయవలెను.

అంశచక్రములో లగ్నము నేర్పఱచు విధము పా. ఉదా.—ముందు జన్మలగ్నభుక్తి కనుగొనవలెను. 1. జన్మలగ్నప్రమాణమును 9 చే భాగించవలెను. అట్లు భాగించగావచ్చిన విభక్తముచేతను జన్మలగ్నభుక్తి ప్రమాణమును భాగించవలెను. అట్లు భాగించగా వచ్చిన విభక్తము నొకచోట నుంచుకొనుము ఈ భాగింపుటలో శేషమెంతమిగిలిన నది యొకటిగా భావించుకొని పయివిభక్తములో కలుపుకొనుము. శేషము మిగులనియెడల విభక్తమునే చూచుకొనవలెను; 2. మేష-సింహ-ధనుస్సులలో నేదియైన జన్మలగ్నమైనయెడల మేషమునుండియు; వృషభ-కన్యా-మకరములలో నేదియైన జన్మలగ్నమైనయెడల మకరమునుండియు, మిధున-తులా-కుంభములలో నేదియైన జన్మలగ్నమైన యెడల తులనుండియు; కర్కాటక-వృశ్చిక-మీనములలో నేదియైన జన్మలగ్నమైన యెడల కర్కాటకమునుండియు అంశచక్రములో లగ్నము నేర్పఱుపవలెను.

అంశభాగము పా. (డిగ్రీ.)

అంశఘాతము. పా. అవయవఘాతము.

అంశబోధకభిన్నము. పా. చిహ్నభిన్నము.

అంశసవర్ణము. పా భాగజాతి.

అంశానుబద్ధము. పా. భాగానులబ్ధము.

అంశీకరణము. పా విభాగసంజ్ఞ.

అంసకూటము. పా. (ప్రోసెస్ అక్రోమియన్.)

అంసకపాలికాపృష్ఠతలఖాతము. పా. ఉత్తరంసపృష్ఠఖాతము.

అంసప్రచ్ఛద స్నాయువు. పా. అధిస్కంధ స్నాయువు.

అంసఫలకము. పా. ఔక్కఎముక.

అంసశిరఃకోటరఖాతము. పా. (నోచ్ సుప్రా-కేప్యులర్.)

అంససంధి. పా. (జాయంటుషోల్డర్.)

అంసాక్షకసంయోజకస్నాయువు. పా (మసెల్ అక్రోమియో క్లావిక్యులర్ లిజమెంట్.)

అంసాపకర్షకస్నాయువు. పా. (మసెల్ రాంబాయిడస్.)

అకరణీగత. పా. (రేషనల్.)

అకరణీగతకరణము. పా. (రేషనాలిస్.)

అకామిడేషన్. అం. సర్దుపాటు

అకామేనాప్యంగీకారణీయము. పా. స్వీకృతపక్షము.

అకుంచకస్నాయువులు. పా. (ఫ్లెక్సర్సు.)

అక్కవుంటెంటు. ఆం. లెక్కగాఁడు, కరణము, గణకుఁడు.

అక్కనప్రెగడహరిదాసు. పా. ఇతఁడు రచించినది.— రుక్మాకృష్ణవిలాసము. (18 శతాబ్ది.)

అక్కినేపల్లినృసింహకవి. పా. ఇతఁడురచించినది ఓఘవతీ పరిణయము. (18 శతాబ్ది.)

అక్కులు. పా. "అ- ఇ- ఉ- ఋ- ఌ"

అక్నాలెడ్జిమెంటు. ఆం. ఒప్పుదల, రశీదు.

అక్రమకృత్యము. పా. నష్టకార్యము

అక్రమసంతానము. పా. జారోత్పన్నులు.

అక్షకాంసఫలకసంధి. పా. (జాయింటు, అక్రోమిక్లవిక్యులర్.)

అక్షకాధరస్నాయువు. పా. అధోజత్రుస్నాయువు.

అక్షకోరకసంధి. పా.(జాయింటుస్టర్నోక్లావిక్యులర్.)

అక్షయమంగళులను బ్రాహ్మణులు. పా. ఘూర్జరబ్రాహ్మణులలో నొకతెగవారు. వీరు కృష్ణయజుర్వేదులు కౌండిన్యగోత్రజ్ఞులు. పాలన్పూరు, పవి, మార్వాడిదేశములలోని భిన్మాలు వీటియందు ముఖ్యముగవసించెదరు: చూ, బ్రాహ్మణులు.

అక్షరమూర్పు. పా. (టైప్ మొనో.)

అక్షరగుణకము. పా. బీజగుణకము.

అక్షరవిలేఖన. పా. కుంచికోఫలకము.

అక్షరవిలేఖనము. పా. (టైప్ రైటింగ్.)

అక్షరవిలేఖనయంత్రము. పా. (టైప్ రైటర్.)

అక్షరవిలోపము. పా. 1. చిత్రకవిత్వములో నొకటి: చూ, హేతువు. 2; 2. శబ్దాలంకారములలో నొకటి: చూ, శబ్దాలంకారములు.

అక్షరసమీకరణము. పా. (ఈక్వేషన్ - లిటెరల్.)

అక్షరాభ్యాసకాలము. పా. శుభవాసరములయందును పగటియందును - అక్షరస్వీకారలగ్నములకు నెనిమిదవయింటు నేగ్రహములేక యుండఁగాను - జననాది ౫ వ- సంవత్సరమందును శుక్ల-కృష్ణపాడ్యములును - రిక్తతిథులును శుక్లకృష్ణాష్టములును - అమావాస్యను. ఈతిథులనువిడచి సూర్యుఁడు చరరాశులయందనఁగా మేషకర్కటకతులామకర రాశులయందుండఁగాను - స్థిరరాశులనఁగా వృషభసింహవృశ్చిక కుంభరాశులయందుండఁగాను - చరలగ్నములయందును, గురుశుక్రులస్తమయములను పొందక యుండఁగాను - అనూరాధ- రేవతి - అశ్విని - హస్త - చిత్త - స్వాతి - పునర్వసు - పుష్యమి - శ్రవణము ఈ తొమ్మిది నక్షత్రములయందును - ఉత్తరాయణమందును బాలుగకు అక్షరాభ్యాసము చేయవలయును.

అక్షవి. సం. వి. ఈ. స్త్రీ: చూ, లొద్దుగు *.

అక్షికము. పా. అంతఃపటలము.

అక్షిగోళము పా. కనుగుంట.

అక్షిబాహ్యపటలము పా కనుగ్రుడ్డుపైనుండు తెల్లనిపొర.

అఖండత. పా. అవిరామము.

అగమ్యలగుస్త్రీలతోసంగమము. పా. ఇందుకు ప్రాయశ్చిత్తము:— చాంద్రాయణము చేయవలయును. పిదప బ్రాహ్మణభోజనము పెట్టి గోద్వయమును వస్త్రద్వయమును దానమొసగవలయును. (చూ, చాంద్రాయణము.) (1) చండాలస్త్రీ, శ్వపాకి = బ్రాహ్మణుఁడు సంగమించిన బ్రాహ్మణులయాజ్ఞానుసారము మూఁడుదినములుపవసించి శిఖాసహితముగ క్షౌరముచేసికొని ప్రాజాపత్య వ్రతద్వయము నాచరించి గోద్వయమును దక్షిణగానిచ్చిన పరిశుద్ధుఁడగును. క్షత్రియుఁడుగాని, వైశ్యుఁడుగాని సంగమించిన ప్రాజాపత్యవ్రతద్వయము నాచరించి గోమిథునద్వయమును దక్షి

ణగా నిచ్చిన పరిశుద్ధుఁడగును. శూద్రుఁడు సంగమించిన ప్రాజాపత్యవ్రతము నాచరించి గోమిథునచతుష్టయము నొసంగిన శుద్ధుఁడగును (2) కన్నతల్లి, తోఁబుట్టువు, సవర్ణయగు తనభార్యయందుపుట్టిన కూఁతురు=వీరిని ఇట్టివారినిగా నెఱుంగక సంగమించిన ప్రాజాపత్యకృచ్ఛ్రత్రయము, మూఁడు చాంద్రాయణవ్రతములుచేసి పిదప శిశ్నచ్ఛేదము చేసికొనిన పరిశుద్ధుఁడగును. (3) తల్లితోఁబుట్టువు ఈమె ఇట్టివారని నెఱుంగక సంగమించిన చాంద్రాయణద్వయము ౧౦ ఆవులను దక్షిణగా నొసంగిన పరిశుద్ధుఁడగును (4) కన్నతల్లిగాక ఇతరలగు అసవర్ణలగు సవతితల్లులు, తల్లి చెలికత్తె, తోఁబుట్టినవాని పుత్త్రిక, గురుపత్ని, కోడలు, సోదరునిభార్య, మేనమామ భార్య, సగోత్రి = పొందినవాఁడు ప్రాజాపత్యత్రయము నాచరించి గోద్వయము దక్షిణగా నొసంగిన పవిత్రుఁడగును. (5) పశువు, వేశ్య, గేదె, ఒంటె, కోఁతి, గాడిద, పంది= పొందినవాఁడు ప్రాజాపత్యవ్రతము నాచరింపవలెను. (6) గోగామియగు బ్రాహ్మణుఁడు మూఁడుదినములుపవసించి ఒక ఆవును దానము చేసిన పరిశుద్ధుఁడగును. (7) గేదె, ఒంటె, గాడిద= వీనితో ఒక్కసారి కూడినవాఁడు ఒకరాత్రియు పగలు ఉపవసించిన పవిత్రుఁడగును. మఱియు ప్రాజాపత్యవ్రతము నాచరింపవలయును.

అగమ్యలు. పా. వివాహితయగు భార్యకంటె ఇతర స్త్రీలందఱు సంభోగమునకు తగరు. కావున అగమ్యలు అనఁబడుదురు.

అగస్త్యబ్రాహ్మణులు. పా. మూర్ధ్నబ్రాహ్మణులలో నొకతెగవారు. వీరికీపేరు అగస్త్యఋషి వలన కలిగినది. వీరు యజుర్వేదులు. కాషీతకే జైమినీయ సూత్రములకుఁ జేరినవారు. వీరు క్షత్త్రియవాడలోఁ జేరిన విమడివదవానదేశములందును అహమ్మదాబాదునను కానంబడెదరు: చూ, బ్రాహ్మణులు.

అగ్నాశయము. పా. అనామకపిండము.

అగ్నిపర్వతద్రవము. పా. శిలాద్రవము.

అగ్నిలో మిడతపడ్డట్లు. లో. ముందువెనుకలాలోచింపకఁ జేసినపని.

అగ్నివైశ్యము. అం. కల్పసూత్రములలో నొకటి: చూ, కల్పసూత్రములు. (చూ, ఆపస్తంబము.)

అగ్నిసంహారక యంత్రము. పా. (ఫైర్ ఇంజన్.)

అగ్రకపాలాస్థి పా. (ఫ్రోణ్ట ఫ్రింటల్.)

అగ్రకోణము. పా. శీర్షకోణము.

అగ్రదానీ బ్రాహ్మణులు. పా. పంచగౌడులలో నొకతెగయగు గౌడులలో నొకతెగవారు, వీరు బంగాళాదేశమున విశేషముగానున్నారు. యజుర్వేదులు, వారణ్యశాఖ ఆపస్తంబాది సూత్రములకుఁ జెందినవారు. ప్రేతశ్రాద్ధములందు దానములను పరిగ్రహించెదరు. అందుచే వీరి నితరబ్రాహ్మణులు తక్కువవారినిగా భావించెదరు. బంగాళా వంగదేశములందు గల మానవులకు మరణించినవారియాత్మలకు సద్గతినొందించుటకు చేయు శ్రాద్ధములయందు వేలకొలఁది వ్యయముచేయువాడుక మఱి యేదేశమందును లేదు. ఆశ్రాద్ధదానములచేతనే విశేష ధనికులగుచున్నారు: చూ, బ్రాహ్మణులు.

అగ్రభక్షుబ్రాహ్మణులు. పా. పంచగౌడులలో నొకతెగయగు ఉత్కళ బ్రాహ్మణులలో నొకతెగవారు. శుక్లయజుశ్శాఖ [illegible] బ్రాహ్మణులలో నొకతెగవారు. వీరు ప్రేతశ్రాద్ధములయందు దానముల పరిగ్రహించెదరు: చూ, బ్రాహ్మణులు.

అగ్రాభిముఖకోణము. పా. [illegible]
కోణము [illegible]

అగ్రిమెంటు. ఆం. కరారునామా.

అచలతారలు. పా. (ఫిక్సడ్ స్టార్సు.)

అచలాత్మజాపరిణయము. పా. ఈ గ్రంథకర్త బుక్కపట్టణ వేంకటాచార్యులు. (18.శతాబ్ది.)

అచార్య బ్రాహ్మణులు. పా. పంచగౌడులలో నొకతెగయగు గౌడులలో నొకతెగవారు వీరు రాజపుత్రస్థానమున విశేషము న్నున్నారు. ఋగ్వేదులును శుక్ల యజుర్వేదులును గూడ నున్నారు. ఆశ్వలాయన కాత్యాయనాది సూత్రప్రవర్తకులు. ఉత్తర క్రియల యందు భుజించువారు. (భరతుఁడు దశరథుని ఉత్తరక్రియ లొనర్చుతఱి ఏకాదశాహమ్మున దశరథుని వస్తువాహనాది సకలమును వీరె పరిగ్రహించిరనియు శ్రీరాముఁడయోధ్యాపుర ప్రవేశమైన తరువాత ఈవార్త విని ఏకాదశాహంబున ఆచార్య బ్రాహ్మణులను భుజింపక ఆచరించు ఉత్తరక్రియలు నిష్ఫలమగుగాక యని వరమిచ్చెనని (కిం) వదంతి.) చూ, బ్రాహ్మణులు.

అచ్సంధి. సవర్ణదీర్ఘసంధి. పా. సూ॥ 4. అక్కులకు సవర్ణములైన అక్కులు పరంబులగునప్పుడు పూర్వాపరస్థానంబుల దీర్ఘంబేకాదేశంబగు అక్కులనఁగా అ, ఇ, ఉ, ఋ, ౠ అను 5 అక్షరములని యీవఱకే చెప్పఁబడెను. ఈ అచ్చులకు సవర్ణములైన యీ అచ్చులే పరములైనపుడు ఆరెండచ్చులకు మాఱుగ దాని దీర్ఘమైన యచ్చు వచ్చును.

అ + అ=ఆ; అ + ఆ=ఆ; ఆ + అ=ఆ; ఆ + ఆ=ఆ. ఇట్టులే తక్కిన యక్షరములకు గ్రహించునది. ఉ. కుసుమ + అంజలి=కుసుమాంజలి. ఇందు మొదటిశబ్దమైన 'కుసుమ' కుదఅకారమున్నది. దానికి 'అంజలి' లో మొదటనుండు 'అ' పరమైనది. కాఁగా హ్రస్వములగు నీరెండు అకారములకు మాఱుగ దీర్ఘమైన యొక ఆకారమువచ్చి "కుసుమాంజలి" యని యయ్యె. కుసుమ + అం + జలి=కుసుమ్ + అ + అం + జలి=కుసుమ్ + ఆం + జలి=కుసుమాంజలి.

ఇట్లు శత + అబ్దము = శతాబ్దము.
సత + ఆర్యుఁడు = సతార్యుఁడు.
ధరా + అధిపుఁడు = ధరాధిపుఁడు.
శంకా + ఆతంకము = శంకాతంకము.
ముని + ఇంద్రుఁడు = మునీంద్రుఁడు.
ఋషి + ఈశ్వరుఁడు= ఋషీశ్వరుఁడు.
సతీ + ఇష్టము = సతీష్టము.
విష్ణు + ఉదయము = విష్ణూదయము.
పితృ + ఋణము = పితౄణము.

ఇత్యాదులు.

అచ్చతెనుఁగు రామాయణము. పా. ఈ గ్రంథకర్త కూచిమంచి తిమ్మకవి. (17 శతాబ్ది.)

అచ్ఛము. వై. విశే.=అచ్ఛమ్. తెల్లనిది. చూ, వర్ణము. 6

అచ్చు. పా. (మోల్డు.)

అచ్చుచిత్తులు. పా. (ప్రూఫ్సు.)

అచ్చులు. పా. "అ, ఇ, ఉ, ఋ, ౠ, ఏ, ఓ, ఐ ఔ."

అజితశీతితనయుత అయస్కాంతాయితము ప. (టిటనఫాము)

అజీర్ణరోగము. పా. (ఇన్ డైజెషన్)

అజెండా. ఆం (ఎజెండా) సమావేశ కార్యానుక్రమణిక, సమావేశ విషయానుక్రమణిక.

అజ్జరపు పేరయకవి. పా. ఇతఁడు రచించినది ఉడయనంబి విలాసము. (18. శతాబ్దము.)

అజ్ఞానమరణజాతకుఁడు పా. జన్మలగ్న కారక లగ్నములకు తృతీయమునఁ బాపసంబంధము కలిగి శుభసంబంధమేమియు లేనపు డజ్ఞానమరణము కలుగును.

అటాచ్మెంటు. ఆం. జప్తు.

అట్టకట్టుట. పా. (బైండింగ్.)
అటెండెన్సు. ఆం. హాజరుపట్టిక.
అటెస్టేషన్. ఆం. సాక్షి చేవ్రాలుచేయు.
అట్లాసు. ఆం దేశపటముల పొత్తము.
అడవికాచినవెన్నెల. లో. బూడిదలోఁబోసిన పన్నీరుపగిది- (వ్యర్థమని భావము)
అడవిగాడిదె పా. చారలగాడిద.
అడితి. దే. వి. వంటకట్టెలమ్ముచోటు (రూ- అడుతు.)
ఆడిదము సూరకవి. పా. ఇతనిగ్రంథము కవిజనరంజనము. (18. శతాబ్ది.)
అడిషనల్ సెషన్సుజడ్జి. ఆం. క్రిమినలు విచారణకొఱకు జిల్లాజడ్జికి అదనముగా నియోగింపఁబడు న్యాయాధిపతి.
అడుగుపట్టము పా (బేస్ లెవెల్.)
అడుసుఁద్రొక్కనేల ? కాలుఁగడుగ నేల? లో. ఉదా — "ధర్మార్థము ధనము గోరుటకంటె నిస్పృహత్వముమంచిది ? అడుసుఁ ద్రొక్కనేల ? కాలుఁగడుగ నేల ? (నీతిచంద్రిక-మిత్రలాభము.)
అడ్డ. పా. (క్రాస్.)
అడ్డగుణకారము. పా. అభిగుణకారము
అడ్మినిస్ట్రేషన్. ఆం. ప్రభుత్వవ్యవహారము; పరిపాలనము; ప్రభుత్వనిర్వహణము.
అడ్మిరాలిటీ. ఆం. ఆంగ్లనౌకా కార్యాలయము.
అడ్మిషన్‌రిజిష్టరు. ఆం. ప్రవేశపుస్తకము, దరఖాస్తులపొత్తము.
అడ్మిషనులు. పా. ఒప్పుదలలు, అంగీకారములు.
అడ్రెసు. ఆం 1. విలాసము, చిరునామా; 2. అభినందనపత్రము; సన్మానపత్రము.
అడ్వరుటైజుమెంటు. ఆం ప్రకటన.
అడ్వాన్సుకంట్రాక్టు. ఆం. జట్టీ.
అడ్వొలోరమ్. ఆం. కిమ్మతువారీ.
అడ్వైసు. ఆం. 1. సలహా; 2. సమాచారము.
అడ్వొకసీ. ఆం. అనుకూలవాదము; పరార్థవాదము; పక్షవాదము.
అడ్వొకేట్ ఆం. పరార్థవాది, వకీలు (ప్లీడరు.)
అడ్వొకేట్ జనరల్. ఆం. ప్రధానప్రభుత్వన్యాయవాది.
అణుజన్య. పా. అనుసంబంధము
అణునిర్మాణము. పా. అణురచన.
అణుమయ. పా. అణుజన్య.
అణురచన. పా పరమాణునిర్మాణము.
అణుసంబంధము. పా అణుమయ.
అణ్ణులు పా "అ - ఇ - ఉ."
అతత్వాభినివేశనము పా. (పెరాలిసిస్ గంబల్.)
అతిదశ పా. (హైపాకోటిల్.)
అతిదైర్ఘ్యఫలము. పా (ఫంక్షన్ హైపర్ ఎలిప్టిక్.)
అతినీలలోహితకిరణచికిత్స. పా. ఊదాకిరణప్రసారక చికిత్స.
అతినీలలోహితకిరణము. పా. ఊదాకిరణము.
అతిమాత్రిజాతకుఁడు. పా. 1. చంద్రుఁడు కుజునితోఁగలిసినను; 2. శుక్రకుజాలు షష్టమమున నున్నను; 3. షష్టమాధిపతి అష్టమముననున్నను; 4. అష్టమాధిపతి షష్టమముననున్నను; 5. వ్యయాధిపతి అష్టమమునను. అష్టమాధిపతి వ్యయమునందున్నపుడును; 6. లగ్నాధిపతిషష్టమమున కేతుయుక్తుఁడగునపుడు పైగ్రహములు శుక్రబుధులచేఁ జూడఁబడిగాని, కూడఁబడిగాని యుండునపుడును అతిమాత్రముగ లిగియుందురు.
అతిరక్తసంచయము. పా. వికృతరక్తాధిక్యము.
అతిసర్వత్రవర్జయేత్ లో అన్నిటియందు విస్తారముచేయుటను విడువవలయును.
అతిసారము పా అతివిరేచనములు.
అతిసారమువలన మృతినొందుజాతకుఁడు. పా. 1. షష్టమమున శుక్రుఁడుండి, రాహుకేతువు

లచే దృష్టుఁడై, పాపగ్రహసహాంశస్థితుఁడై వీని మహాదశవచ్చినపుడును. 3. లగ్నాధిపతి షష్ఠమమునుండి అష్టమాధిపతి కేతువుతోఁ గూడి వీనిదశవచ్చినపుడును గలుగును.

అతిస్థూలత. పా. మేదోవృద్ధి.

అతిస్వరము. పా. (ఓవర్ టోన్.)

అతుల్యలంబకము. పా. విషమచతుర్భుజము.(ట్రాపీజియమ్.)

అత్తనూరిపాపయకవి. పా. ఇతఁడు రచించినది.–చెన్నబసవపురాణము. (18 శతాబ్ది )

అత్యధికఋతుస్రావము. పా. అత్యార్తవము.

అత్యార్తవము. పా. అత్యధికఋతుస్రావము.

అత్యుచ్ఛ్రయఃపతనహేతుః లో. మిక్కిలి యెదుగుట పడుటకుఁ గారణము. ఉదా.— "అత్యుచ్ఛ్రయః పతనహేతు." వనియార్యులువచింతురు గావునఁ బెతిఁ గెడివాఁడే విఱిగెడి వాఁడు. (నీతిచంద్రిక-విగ్రహము.)

అత్యుష్ణమండలము. పా. (టారిడ్ జోన్.)

అత్యసంధి. అం. సంధిదోషములలో నొకటి: చూ, సంధిదోషములు.

అదనపున్యాయమూర్తి. పా. (ప్యూనీజడ్జి.)

అదనపుసొమ్ము. పా. (ప్రిమియం) ధీమాకిస్తీ.

అదృశ్యకిరణములు. పా. (ఇన్ విజిబుల్ రేస్.)

అద్దంకి గంగాధరకవి. పా. ఇతఁడు రచించినది.–తపతీసంవరణోపాఖ్యానము. (16 శతాబ్ది.)

అద్వితీయము. పా. సాటిలేనిది.

అద్వితీయేశ్వరమతము. పా. (హెనోథిజమ్.)

అద్వైతవాదము. పా. (యూనిటీ; డాక్ట్రిన్ ఆఫ్.) అభేదము.

అధఃపార్శ్వకస్నాయువు. పా. (మసెల్ సబ్ కాస్టలిస్.)

అధరాంసపృష్టికస్నాయువు. పా. (మసెల్ ఇన్ ఫ్రా-స్పైనేటస్.)

అధరావనమకస్నాయువు. పా. అధరోష్ఠనికర్షకస్నాయువు.

అధరోష్ఠనికర్షకస్నాయువు. పా. అధరావనమకస్నాయువు.

అధర్వణాచార్యులు. పా. ఇతనిగ్రంథము భారతము. (13 శతాబ్ది.)

అధస్తంతువులు. పా. (సబ్ మార్గుడు హైఫై.)

అధస్తిర్యక్ స్నాయువు. పా. (మసెల్-ఇన్ ఫీరియర్ ఆబ్లిక్యు.) (మసెల్ ఆఫ్ ది ఐ.)

అధికకోణము పా. అలఘుకోణము, విశాలకోణము.

అధికటీగస్నాయువు. పా. శ్రోణిపక్షీయ స్నాయువు.

అధికమూల్యము. పా. అదనపుసొమ్ము.

అధికతమ పా. (మేగ్జిమమ్ )

అధికస్యఅధికంఫలమ్. లో. గొప్పవానికి గొప్పఫలము గలుగును.

అధికారదుర్వినియోగము. పా. అధికారమును దుర్వినియోగపఱచుట.

అధికారబద్ధప్రదేశము. పా. అధికారమండలము.

అధికారమండలము పా. (జూరిస్ డిక్షన్.) అధికారబద్ధప్రదేశము.

అధికారవర్గము. పా. ఉద్యోగవర్గము.)

అధికారపత్రము. పా. రహదారీ చీటి.

అధికారిబ్రాహ్మణులు. పా. నేపాళదేశపు బ్రాహ్మణులలో నొకరు: చూ, బ్రాహ్మణులు.

అధిక్షేపించు. సం. స. క్రి: చూ, నిందించు.

అధిగంధకాయితములు. పా.(హైపోసల్ఫేట్స్.)

అధిజిహ్వక. పా. గోజిహ్వక.

అధినితంబపిండకస్నాయువు. పా. (మసెల్ గ్లూటియస్-మాగ్జిమస్.)

అధినివేశరాజ్యము. పా. (డొమినియన్ స్టేటస్.) స్వరాజ్యముయొక్క స్వరూపస్వభావములను చర్చించు రాజ్యాంగశాస్త్రగ్రంథము,

అధిపత్ని. పా. రాణి.

అధిమాంసము. పా. (గ్లాండ్.) మాంసగ్రంథి.

అధిష్ఠితాధికారములు. పా. అనుషంగికాధికారములు, స్వాభావికాధికారములు.

అధిస్కంధస్నాయువు. పా. అంసప్రపృష్ఠదస్నాయువు.

అధిస్ఫురామ్లము. పా (హైపోఫాస్ఫరస్ ఆసిడ్)

అధిస్ఫురాయితము. పా (హైపోఫాస్ఫేట్సు.)

అధీనవ్యతిక్రమము. పా. (సబ్ కంట్రారిటీ.)

అధోక్షికోశీయ మజ్జాతంతువు. పా. (నర్వ్-ఇన్ ఫ్రా-ఆర్బిటల్ )

అధోజత్రు స్నాయువు. పా. అక్షకాధగస్నాయువు.

అధోదంతాస్థికమజ్జాతంతువు. పా. (నర్వ్యు స్నెటెరిక్.)

అధోపీడనము. పా. (డౌన్ వర్డుప్రెషర్.) అవపీడనము.

అధోబిందువు. పా. (నాదిర్.)

అధోబృహత్సిర. పా. (వేనాకేవా ఇన్ ఫీరియర్.)

అధోబృహన్నాళము. పా అధోబృహత్సిర.

అధోభూమి. పా. లోపలినేల.

అధోభృకుటిస్నాయువు. పా నేత్రనిమీలినిపేశి.

అధోవృత్తము. పా. ఊర్ధ్వవృత్తము.

అధ్యాత్మరామాయణము. పా. ఈ గ్రంథములు రచించినవారు కాణాద పెద్దనసోమయాజి (17. శతాబ్ది.); కోటమరాజు నాగయ (18. శతాబ్ది.) (ఇంకను గలరు.)

అధ్యార్ధాధారశస్త్రము. పా. శస్త్రయుధము, నస్తర.

అధ్యాహారపద్ధతి. పా. (ఇంటర్ పొలేషన్ మెథడ్.)

అధ్వర్యుఁడు. అం. ఋత్విజులు పదునాఱుగురిలో నొకఁడు: చూ, ఋత్విజుఁడు. 1.

అధ్వర్యవిభాగము. అం. షట్ప్రత్యయములలో నొకటి: చూ షట్ప్రత్యయములు.

అనంతనార్యుఁడు. పా. ఇతఁడు రచించినది గాధేయోపాఖ్యానము. (18. శతాబ్ది )

అనంతరాశి. పా. అనంతము.

అనంతశ్రేణి. పా. (సీరిస్ ఇన్ఫినిట్ )

అనంతామాత్యుఁడు. పా. ఇతఁడు రచించిన గ్రంథములు భోజరాజీయము. అనంతుని ఛందస్సు మొదలైనవి.

అనధీనవాక్యము. పా. అనన్యవాక్యము.

అనధ్యయన విషయము. పా. మేష, కర్కాటక, తులా, మకరసంక్రాంతులయందును నీరాసులయనములయందు ఒకటిన్నర దివసమనియు, పాడ్యమి- అష్టమి- చతుర్దశి- పూర్ణిమ- అమావాస్య- ఈ తిథులును-క్షయకాలమందుదయమున పాడ్యమి-అష్టమీలు ౫ ఘడియలు డినను వృద్ధియందు 3 ఘడియలును- వృద్ధిక్షయములు లేకయుండఁగా ౪ ఘడియలును సాయంకాలమందు సప్తమీత్రయోదశులలో క్షయవృద్ధి సామ్యములయందుఁ గ్రమముగా ౨-3-౪ ఘడియలు అష్టమీ చతుర్దశులు కలిసియున్న తిథులును. ఈచెప్పఁబడినవన్నియు నిత్యానధ్యయనములు.

అనన్యవాక్యము. పా. అనధీనవాక్యము.

అనర్ఘ్యరాఘవనాటకము. పా. ఈ గ్రంథకర్త మురారి: చూ, కావ్యనాటకములు.

అనాకార్డియములు. పా. ఇందలి ముఖ్యజాతులు:— మామిడి, జీడిమామిడి. ఇందలి జాతులు సామాన్యముగా పెద్దచెట్లుగా నుండును. రక్షకపత్రములు, ఆకర్షణపత్రములు, కింజల్కములు 4, ౮ ఉండును. పుష్పములు కీటకములచే గర్భకరతులు చేయఁబడును.

**అనాయాసమరణజాతకుఁడు.** పా. 1 లగ్నాధిపతి గురునితోగాని శుక్రునితోగాని కలిసి వారిదశలలో మారకము సంభవించినప్పుడును (వీరికి పాపగ్రహసంబంధము లేకుండవలెను.); 2. వ్యయాధిపతి-చంద్రునితో కలిసినను ద్వాదశాధిపతితో కలిసినను పాపగ్రహసంబంధము లేక వీరిదశలలో మారకము కలిగినప్పుడును; 3. లగ్నాధిపతి యుచ్చగ్రహములతో కలిసి శుభులతో సంబంధించినను; 4. వ్యయాధిపతికి శుభగ్రహసంబంధమున్నను (పాపగ్రహ సంబంధము లేకుండవలెను.); 5. వ్యయస్థానమును, వ్యయాధిపతియును, శుభగ్రహమధ్యస్థమై యుండునప్పుడును; 6. అష్టమాధిపతి శుభగ్రహ సంబంధుఁడైనను, శుభుఁడైనను, లేక అష్టమమున శుభులుండి పాపగ్రహ సంబంధము లేకుండునప్పుడును అనాయాస మరణము కలుగును

**అనామకపిండము.** పా. అగ్నాశయము, స్వాదుపిండము, వృక్వకములు.

**అనావలులను బ్రాహ్మణులు.** పా. ఘూర్జర బ్రాహ్మణులలో నొకతెగవారు. వీరు శుక్లయజుర్వేదులు. వీరిని భాతేలాలనియు మహాస్థానులనియుం జెప్పెదరు వ్యవసాయము వీరికి ముఖ్యవృత్తి. భరోచికి దక్షిణమునందు దేశమందు వాసముచేయుచున్నారు: చూ, బ్రాహ్మణులు.

**అనిచ్ఛాకండరములు.** పా. (ఇన్‌వాలంటరి మసెల్స్.)

**అనిత్యానికరీరాణి.** లో. దేహములు నిత్యములు కావు. ఉదా.— "స్మృతులనిత్యానికరీరాణి." యను మాటలాదరించుమేనుల దృఢములుగ గణుతించి." (కుచేలోపాఖ్యానము.)

**అనియంత్రిత.** పా. (ఆర్బిట్రరీ.)

**అనియతజ్వరము.** పా. (ఫీవర్ ఆట్ ఫిక్.)

**అనియాది గణపతిదేవుఁడు.** పా. ఇతని గ్రంథము శివయోగసారము. (17. శతాబ్ది.)

**అనిరుద్ధచరిత్రము.** పా. ఈగ్రంథకర్త కనుపర్తి అబ్బయామాత్యుఁడు. (18 శతాబ్ది.)

**అనుకంపితమజ్జాతంతువులు.** పా. (సింపతెటిక్ నర్వ్స్.)

**అనుకల్పనము.** పా. బదిలీవర్క.

**అనుకోననిష్టములు.** పా. దైవికనష్టములు.

**అనుక్రమిక.** పా. పరంపరాగత,

**అనుజ్ఞాపత్రము.** పా. (లైసెన్సు.) సెలవుచీటి.

**అనుత్రికము.** పా. గుదాస్థి, త్రోటిక

**అనుత్రికాస్థి.** పా. (బోన్ కాకిక్స్.)

**అనుదాత్తము.** అం: చూ, త్రయము: చూ, వేద స్వరములు.

**అనుపరిణవ్య.** పా. వ్యుత్క్రమచలస్పర్థి

**అనుపాతచతుర్థము** పా. (ప్రపోర్షనల్ ఫోర్త్.)

**అనుపాతిమధ్యము** ( పోర్షనల్ మీన్.)

**అనుపాతము.** పా యుగ్మనివృత్తి

**అనుపార్జితాదాయము.** పా. గడించక నేవచ్చిన ఆదాయము.

**అనుపూర్ణకోణము.** పా. సమకోణద్వయపూర్తి.

**అనుభవజన్య.** పా (ప్రాక్టికల్) ప్రయోగవేద్య, ప్రయోగాత్మక.

**అనుభవదారుఁడు.** పా. భుక్తదారు

**అనుభవము.** పా. (నోషన్.)

**అనుమతిపత్రము.** పా. అనుజ్ఞాపత్రము.

**అనుమస్తిష్కము** పా. గోధ్రము, చిన్నమెదడు.

**అనుమానపద్ధతి.** పా. (జామెట్రికల్ రీజెన్సు.) భూమితితర్కము.

**అనుమానము.** పా. (తర్కం) (రీజనింగ్.)

**అనుమిత క్షేత్ర గణితము.** పా. (జామెట్రి, డెడక్టివ్.)

అనుమోదకభోగము పా. భుక్తము.

అనురాగము పా. (ఎఫినిటి.)

అనురూపకోణము. పా సంగతకోణము; పోటీ కోణము.

అనులోమనివృత్తి. పా సమసంబంధము.

అనులోమసంబంధ సామ్యము. పా సమసంబంధ సామ్యము

అనులోమానుపాతము. పా. (ప్రొపోర్షన్ డైరక్టు.) అనులోమసంబంధ సామ్యము.

అనులోమానుబంధము పా. (డైరక్టు రేష్యో.)

అనువాదిత్వము. పా. (రెసోనన్సు)

అనుశాసనాధికారము. పా. విధాయకాధికారము:

అనుష్ణవాహకము. పా. (నాన్ కండక్టర్ ఆఫ్ హీట్.)

అనుసంధాన వ్యవహారము పా. మధ్యవర్తి మాటలు

అనేకప్రశ్నాత్మక హేత్వాభాసము. పా. (పొలసీ మెనీక్వెశ్చన్సు.)

అనేకవర్గసమీకరణము. పా. (ఈక్వేషన్ - సైమల్టేనియస్.)

అనైచ్ఛిక పేశ్యములు పా. పరతంత్ర కండరములు.

అన్నకోశము పా. ఆమాశయము. (స్టమక్.)

అన్నదానము. అం. షోడశమహాదానములలో నొకటి: చూ, షోడశమహాదానములు.

అన్ననాళిక. పా. అన్నపథము.

అన్నస్యక్షుధితపాత్రమ్. లో. ఆఁకలిఁగొన్నవాఁడే అన్నము పెట్టుటకుఁ బాత్రుఁడు.

అన్నపథము. పా. అన్ననాళిక. (ఇసాఫిగస్.)

అన్నప్రాశనకాలము. పా. ఉదా.— పురుష శిశువువిషయమై ౬-౮-౧౦ ఈ నెలల యందును, స్త్రీశిశువువిషయమై పంచమాది విషమమాసములనఁగా ౫-౭-౯ ఈ నెలల యందును, సోమ-బుధ-గురు-శుక్రవారముల యందును అన్నప్రాశనలగ్నమునకు- ౧౦ వ గ్రహము లేకయుండఁగాను, వృషభ-కర్కాటక-మిథున-కన్యా-ధను-ర్మీనముల నెడి శుభ లగ్నములయందును, పాడ్యమి-చవితి-షష్ఠి-అష్టమి- నవమి- ఏకాదశి- ద్వాదశి- అమావాస్య- పున్నమ- ఈ దినముల నిషేధించి ఇతర దినములయందును, అశ్విని- రోహిణి- మృగశీర్ష-పునర్వసు-పుష్యమి-ఉత్తర-హస్త-చిత్త-స్వాతి- అనూరాధ- ఉత్తరాషాఢ-శ్రవణము - ధనిష్ఠ- శతభిషక్ - ఉత్తరాభాద్ర - రేవతి- యీ నక్షత్రములయందు నన్నప్రాశనము చేయవలయును.

అన్నవాహిక. పా. ఆహారాదులు లోపలకు పోవుమార్గము (ఇసాఫిగస్.)

అన్యథాచింతితం కార్యం దైవమన్యత్రచింతయేత్. లో. మతియొకలాగుఁ దలంచినకార్యము దైవము మఱియొకలాగుఁ దలంచును.

అన్యసామ్యమూలము. పా. (రూట్ ఎక్స్ట్రానియస్ )

అన్యాయపురాణి. పా. విషమసంధి.

అన్యేద్యుష్కము. పా. దైనందినము. (క్వాడిటియన్.)

అన్యోన్యకారణములు. పా. పరస్పరకారణములు.

అన్యోన్యాశ్రయము. పా.(మ్యూచుయల్ డిపెండెన్సు.)

అన్వయనిరూపణము. పా. విభాజకనిరూపణము.

అన్వయవిధి. పా. విభజనమార్గము.

అన్వయవ్యతిరేకపద్ధతి. పా. (మెథడ్ ఆఫ్ ఎక్లూషన్సు.)

అన్వేషణజ్యోతి. పా. (సెర్చిలైట్.)

అపకర్తవ్యసూచన. పా. (మిస్ డైరక్షన్.)

అపకారము. పా. (మిస్ ఛీఫ్ ) చెఱుపు.

అపకృతుఁడు. పా. అన్యాయముపొందినవాఁడు.
అపకృత్యము. పా. అక్రమకృత్యము.
అపక్రమభిన్నము. పా. విషమభిన్నము. $(\frac{2}{1})$
అపగతచేతనము. పా. స్మృతివిహీనత.
అపచయక్రియ. పా ప్రతిలోమపృథక్కరణము ప్రతిలోమరూపభేదము.
అపచిగండమాల పా. గండమాలజనక రక్తవికారము.
అపచుఁడు. పా. ఏబ్రాహ్మణుఁడు గృహస్థాశ్రమియయి ఇతరులకన్నమును పెట్టక తనపొట్టకు మాత్రమే తినునోవాఁడు.
అపతంత్రకము. పా. గర్భాశయోన్మాదము.
అపనయనము. పా. సంఘటిలయనము, ఋణవిమోచనము. (లిక్విడేషన్.)
అపనిరూపణము. పా. పొరపాటు వర్ణనము; తప్పుడువర్ణనము.
అపభావనదృశ్యములు. పా (డిఫరేషన్ పేట్రన్సు.)
అపమార్గదర్శనము. పా. అపకర్తవ్యసూచన.
అపమృత్యుకారణ విచారణ పా. (ఇన్‌క్వెస్టు.) పంచాయతి.
అపరధాన్యము. పా కాయధాన్యము.
అపరాధప్రోత్సాహము. పా. మద్దతు, తమ్మకు చేయుట, నేరములఁజేయ నింకొకనినిఁ బ్రోత్సహించుట.
అపరిమితము. పా (అన్‌లిమిటెడ్.) పరిమితిలేని.
అపరిమితాయుర్దాయజాతకుఁడు. పా. 1. వృషభము జన్మలగ్నమై అందు శుక్రచంద్రులును, కుంభమందు గురుఁడును, తృతీయ షష్ఠలాభములయందు, పాపులును నుండునపుడును; 2.జన్మలగ్నమునకుఁ గేంద్రత్రికోణములలో నెచ్చటనైన నొకరాశియందేదు గ్రహములుండునపుడును; 3. లగ్నము కర్కటకమై మకరమందు గురుఁడును, తులయందు శనియును, వృషభమందు చంద్రుఁడును నుండి నుదయలగ్నము మేషమయి యుండునప్పుడును; 4.జన్మలగ్నము మకరమై,తులయందుశనియు, కర్కటకమందు గురుఁడును, వృషభమందుఁ జంద్రుఁడును, రవిమేషమందును నుండునపుడును; 5. లగ్నము మిథునమై కన్యయందు బుధుఁడును, తులయందు శనియు, ధనస్సునందు చంద్రుఁడును, తులయందు శుక్రుఁడును నుండునపుడును; 6. ఆరు గ్రహములు నీచను బొందునపుడును. 7. ఐదు గ్రహములుచ్చయందుండి లగ్నాష్టమాధిపతులు బలవంతులై యుండునపుడును; 8. చతుర్థకేంద్రమందు నాలుగు గ్రహములును, దశమమందు నాలుగు గ్రహములును నుండునపుడును అపరిమితాయుర్దాయము గలవారగుదురు.
అపవర్గ్యభాగములు. పా.(సబ్లిఫిన్ ప్రపోర్షన్సు.)
అపవాదము పా. (ఎక్సెప్షన్.)
అపశోషిత విచ్ఛిన్నకిరణము పా. (స్పెక్ట్రల్ అబ్‌సార్ప్షన్.)
అపసృతశ్రేణి. పా. (సీరీస్ డైవర్జెంట్.
అపస్మారమువలన మృతినొందుజాతకుఁడు పా. క్షీణచంద్రుఁడు కుజ రాహువులలో నొకనితోఁగూడుకొని, షష్ఠాష్టమవ్యయములలో నుండి, వీరిదశలు వచ్చినపుడు సంభవించును.
అపహరణము. పా వస్తువును అక్రమముగా సొంతమునకు వినియోగించుట.
అపాంగప్రవర్తనకము. పా. నేత్రకోటకభూమి శృంగము.
అపాయనష్టపరిహారపుభీమా. పా. (ఏక్సిడెంటు ఇన్‌స్యూరెన్సు.)
అపారదర్శక. పా. అద్దమువలె అవతలవస్తువు కనఁబడనిగుణము.
అపూర్వకల్పన. పా. (ఇన్‌వెన్షన్.)
అపేయము. పా. త్రాగుచుండఁగా నోటినుండి జారి భోజనపాత్రమునఁ బడిననీరు కావున

దానిని తాగఁగూడదు. తాగినయెడల చాంద్రాయణము ఆచరింపవలయును.

అపోజిషన్. ఆం. వ్యతిరేకపక్షము.

అప్పకవీయము. పా. ఈగ్రంథకర్త కాకనూరి అప్పకవి. (17 శతాబ్ది.)

అప్పప్పకవి. పా. ఇతనిగ్రంథములు — శశిరేఖాపరిణయము, సౌగంధికప్రసూన సంగ్రహము. (19 శతాబ్ది.)

అప్పీలుదారు. పా. అప్పీలువాది

అప్పీలువాది పా. (అప్పీలెంటు) వివాది.

అప్పీలెంటు. ఆం అప్పీలువాది.

అప్రసంగిక ఉపసంహారము. పా. అప్రస్తుతఉపసంహారము.

అప్రస్తుత ఉపసంహారము పా. అప్రసంగికఉపసంహారము.

అప్రూవరు ఆం. సాపరాధసాక్షి

అప్రూవలు. ఆం. అంగీకారము.

అప్రెంటిస్. ఆం. పారిశ్రామిక విద్యార్థి.

అప్రోక్సిమేటు ఆం. ఉజ్జాయింపు.

అప్లికెంటు ఆం దరఖాస్తుదారు, అర్జీదారు.

అప్లికేషన్. ఆం దరఖాస్తు.

అఫిడవిట్. ఆం ప్రమాణపత్రిక.

అఫిలియేషన్. పా. సంఘమును ఒకసమితిలో చేర్చుకొనుట.

అబక. పా మెకాన్ను. పెలి; తెడ్డు.(వాడుక.)

అబ్జహుఁడు సం. వి. అ పుం. నలువ: చూ, బ్రహ్మ 1.

అబ్జదళము. సం. వి. అ. న తామరరేకు: చూ. పద్మము. 1

అబ్జభవుఁడు. సం. వి. అ. పుం నలువ: చూ. బ్రహ్మ. 1.

అబ్జబాంధవుఁడు. సం. వి అ. పుం. తమ్మిచుట్టము: చూ, సూర్యుఁడు.

అబ్డామెన్. ఆం. పొత్తికడుపు.

అబ్డామినల్ కేవిటీ. ఆం. ఉదరగుహ; గర్భకుహరము.

అబ్బురపువేళ్ళు. పా. అంటువేళ్ళు, ఊడలు.

అబ్సల్యూట్ యక్స్‌పేన్షన్. ఆం. నిజవ్యాకోచము.

అభాగ్యోపాఖ్యానము. పా. ఈ గ్రంథకర్త కందుకూరి వీరేశలింగకవి. (20 శతాబ్ది.)

అభిగామజ్ఞాపత్రము. పా. (సర్వ్హైబ్రెంటు.)

అభిగుణకారము. పా. వజ్రాభ్యాసము, అడ్డగుణకారము.

అభిజిద్ధనిష్ఠాపంచకమందు గమననిషేధనిర్ణయము. పా. అభిజిల్లగ్నమందును, అభిజిన్నక్షత్రమందును, అభిజిన్ముహూర్తమందును పయనముపోవువారలకు శుభకరంబనియును, ధనిష్ఠానక్షత్రోత్తరదళము మొదలు రేవతివఱకు ధనిష్ఠాపంచకముగాన దక్షిణదిక్కునకు పయనముపోవువారలకు రోగకరంబనియు నితరదిక్కులకుఁ బోవువారలకు శుభకరంబనియు మఱియును మీనరాశియందుఁ జంద్రుఁడుండఁగా నేదిక్కునకుఁ బయనముపోయినను ప్రయాణకర్తకు నిష్టసిద్ధికలుగదనియుఁ దెలిసికొనవలయును.

అభిధామూలధ్వనులు. ఆం. వివక్షితాన్యపదవాచ్యము, అసంలక్ష్యక్రమవ్యంగ్యము, రసాధిరూపము. (8)

అభిధేయములు. పా. (ప్రెడికబుల్సు.)

అభినందనపత్రము. పా. సన్మానపత్రము.

అభినవకిరణవిసర్జనము. పా. నవప్రసరణము.

అభినవవైద్యశాస్త్రము. పా. దూనేగారి వైద్యశాస్త్రములలో నొకశాస్త్రము.

అభిన్నత. పా. ఐక్యత, తాదాత్మ్యము, సరూపత.

అభిన్నసంఖ్య. పా. పూర్ణసంఖ్య.

**అభిన్నసమీకరణము.** పా. (ఈక్వేషన్-ఐడెంటికల్.)

**అభిప్రాయభేదము.** పా. (డిస్సెంటు)

**అభిభర్త్సన.** పా. బెదరింపు.

**అభియోగము.** పా. (సూటు) దావా.

**అభిరుచి.** పా. (ఇంటరెస్టు.)

**అభివ్యాప్తి.** పా సమవ్యాప్తి.

**అభిష్యందజ్వరము.** పా. (ఫీవర్ కటర్ హాల్.)

**అభిష్యందము.** పా. శైత్యము.

**అభిసరణమూలకభిన్నీకరణము** పా. హంస క్రియ.

**అభిసర్పణము.** పా. 1. (కేపిలారిటీ.) ద్రవపదార్థములను ఎగఁబీల్చుకొనుశక్తి; వా. 2. బ్రతిమాలుట.

**అభేద్యత.** పా (ఇంపెనెట్రిబిలిటీ.)

**అభేద్యశిలలు.** పా.(ఇంపర్మేయబుల్ రాక్సు.)

**అభోజ్యులగువారి జలాదికమును త్రాగుట.** పా. ఇందుకు ప్రాయశ్చిత్తము. బ్రహ్మక్షత్రియ వైశ్యులకొకదినము ఉపవాసము. శూద్రులు దానమునిచ్చుటచేత పవిత్రులగుదురు.

**అభ్యంగనవిధి.** పా. వివాహాది శుభకాలముల యొక్క ఆద్యంతదినములును ఆశ్వయుజబహుళంబున స్వాతీనక్షత్రముతోఁ గూడినదిన మనఁగా దీపావళియు. మకరసంక్రమణము నకుఁ దొలిదినమనఁగా భోగిపండుగయు, జాతాశౌచపూర్ణదినంబును, సంవత్సరాదియు, మంగళకరంబగు. అభ్యంగనమావశ్యకముగఁ జేయవలయుననియు, ధనకాముఁడగు నరుఁడు శుక్రవారమందు మధ్యాహ్నానంతరంబున నభ్యంగనముఁ జేయవలయును. కాలా. 7, బిం. 816.

**అభ్యంజనము.** పా. అనువిలేపనము.

**అభ్యుచ్చయము.** అం. ఆవరోహి వర్ణగతాలంకారములు పండ్రెండింటిలో నొకటి; చూ, అవరోహివర్ణగతాలంకారములు. (చూ, అలంకారము. 8.)

**అభ్యుపగమపద్ధతి.** పా. కేవలాన్వయపద్ధతి.

**అభ్యునాపత్తి** పా సహాయవాగ్దానము.

**అభ్రకము.** పా. (మైకా)

**అభ్రకనవనీతము** పా. కృష్ణాభ్రకము కలిలో మూఁడుదినములు నానఁబెట్టి ఆపైన ఎండించి రాతిరోటిలో వేసి చూర్ణముగా దంచించి ఆ చూర్ణమును తిరిగి కలిలో నానఁబెట్టి యొక పెద్ద గూనకు క్రొత్తముదుగుకోకను వాసెనఁ గట్టి అందుపైని నానఁబెట్టిన అభ్రకమునకు సగముగా ధాన్యము కలియఁబోసి బలము కలవానిచే కలిపల్లుచు రాయించిన అభ్రకము అడుగునకు దిగును. అదిగినదానిని నవనీతాభ్రకమందురు.

**అభ్రకభస్మక్రమము.** పా. నవనీతాభ్రకమును, ఆవునేయి, ఉలవకట్టు, జిల్లేడుపాలు, మఱ్ఱిపాలు, వీటితో వేఱుగా వేఱుగా నూటి మూఁడేసిపుటములు పెట్టేగి పిమ్మట అడవితులసి, దుష్టుపు, గానుగు, జిల్లేడు, ములుగోరింట, ఉత్తరేణి, మఱ్ఱిపాలు, చిన్నసర్పాక్షి, పెద్దసర్పాక్షి, ములుమోదుగచెక్క, పొన్నగంటి, సుగంధి, గలిజేరు, పిల్లిపెసర, నేలతాడిదుంపలు, బోడసరము, వావిలిఆకు, అడ్డసరపుఆకు, పెన్నేరుగడ్డ, కలుబంద, కసివిందాకు, తిప్పతీఁగ, నేలగుమ్మడి, తెల్లఉప్పి, వాఁకుడు, మోదుగచెక్క, నల్లకలువదుంప, మారేడు విత్తులతైలము, మునగచెక్క, కలువదుంప, వీటిరసములతో వేఱువేఱుగానూటి యొక్కొక్కొక పుటము పెట్టుకునేది. పిదప మఱ్ఱిపాలు, అల్లపురసము, ఉత్తరేణిఆకు రసము, నిమ్మపండ్లరసము, ఉచ్చింతాకురసము, పసుపు రసము వీటితో ప్రత్యేకప్రత్యేకముగా నూరి 60 పుటములు పెట్టిన నిశ్చంద్రికమై అభ్రకము

సింధూరింపును. మాతుడుతోగాని ప్రిమిద లతోగాని పుటములు పెట్టవలెను.

అభ్రకభస్మము. పా. శుద్ధిచేసిన అభ్రకము జిల్లేడుపాలనరసాన మర్దించి వజ్రమూసలోఁబోసి మూఁడుమార్లు కొలిమిలోఁబెట్టి ఊదిన భస్మమగును. ఈభస్మమును రసయోగములలో పెట్టుకొనేది.

అభ్రకశుద్ధి పా. కృష్ణాభ్రకమును ఎఱ్ఱగాకాల్చి ఏడుమాఱులు గోమూత్రములో చల్లార్చినశుద్ధియగును.

అభ్రకసాధనము పా. అభ్రకము పార్వతీశిఖ్యమువల్లబుట్టె; పుండరీకాభ్రకము, పినాకాభ్రకము, నాగాభ్రకము, వజ్రాభ్రకము అనినాలుగు విధములుచెప్పఁబడును అవిక్రమముగా అగ్నిమీఁదవేసిన మొదటిది ఎగిసిపడును, రెండవది ఎఱ్ఱనై కాలును, మూఁడవది పాముపలెమ్రోగును, నాల్గవది పొగయెగసిపోవును. వీనిగుణములు:-రక్తాభ్రకము వాతకారి, శ్వేతాభ్రకము శ్లేష్మకారి, పీతాభ్రకము ఉష్ణకారి, కృష్ణాభ్రకము సర్వరోగహరము

అమలవాసీబ్రాహ్మణులు. పా. వీరు నళయాళము దేవాలయార్చకులు: చూ బ్రాహ్మణులు

అమెరికాసంయుక్తరాష్ట్రములు పా. విస్తీర్ణము 30,27,000; జన—11 93,00,000, ముఖ్యపట్టణము-వాషింగ్టన్.

అమ్మోనియాకర్బనితము పా. (స్మెల్లింగ్ సాల్ట్సు.) ఆఘ్రాణించుటకు ఘాటువాసనగల లవణములు.

అమ్లజనీకరణము. పా. (ఆక్సిడేషన్.)

అమ్లత్వము పా. (ఆసిడిటి.)

అమ్లము. పా. (ఆసిడ్.) కాడి, పులుసు. అమ్లములు — ఇందుకు సంబంధించిన శాస్త్రపరిభాషాపదములు:—టంకామ్లము, కర్తిద్రావకము, హైడ్రోక్లోరిక్ ఆసిడ్ - ఉదజహరికామ్లము, హైడ్రియాడిక్ ఆసిడ్, నిమ్మ, నత్రికామ్లము- పెట్లుప్పుద్రావకము, ఆగ్జాలిక్ ఆసిడ్, నిర్దుష్టామ్లము, గంధికామ్లము - గంధకధృతి, గంధకామ్లము - గంధకద్రావకము, తింత్రిణికామ్లము - చింతపండు ద్రావకములు, లవకణద్రావకము- ఉదజహరికామ్లము, ఉదజహరితము, ఉదజనిపర్యామ్లజనిదము, ఉదజగంధకితము, నత్రజని- పారజనకము- దహ్యక్షారధాతువు - లవణవాయువు, నైట్రికాక్సైడు- నత్రికామ్లజనిదము, నత్రజనీకామ్లజనిదము, నత్రిజద్వ్యమ్లజనిదము. నత్రిజపంచామ్లజనిదము, నత్రజత్ర్యమ్లజనిదము, చతురమ్లజనిదము, నత్రిజత్రయ- ఉదజనిదము, గంధకము, గంధకితము, ఖటికమగ్నగంధకితములు, మైలుతుత్థము- తామ్రగంధకితము, తుత్తినాగము, గంధకిదము, తామ్రగంధకిదము, గంధకాయితము. గంధకద్వ్యమ్లజనిదము, గంధకత్ర్యమ్లజనిదము. కార్బాలిక్ద్రావకము, కర్బనితములు- కర్బనమిశ్రములు ఖటికమగ్నకర్బనితములు, మానుప్పు, కర్బనద్వ్యమ్లజనిదము, కర్బనద్విగంధకిదము, స్ఫటికామ్ల జనిదము, స్ఫటికగంధకితము, అమ్మోనియానవాసారము, అమ్మోనియాకర్బనితము- స్మెల్లింగ్ సాల్టు, అమ్మోనియా హరిదము, అమ్మోనియా ఉదయామ్లజనిదము, అమ్మోనియానత్రితము, అమ్మోనియా గంధకితము, అమ్మోనియాతింత్రిణితము, అంజనగంధకిదము శంఖద్రావకము, ఖటికము, సున్నపుభస్మము, రసభస్మము, ఖటికకర్బనిదము, ఖటికకర్బనితము, ఖటికహరిదము, ఖటికాస్ఫురితము, తామ్రక హరిదము, తామ్రకమిశ్రద్రవ్యము, తామ్రికామ్లజనిదము, తామ్రహరిదము, తామ్రమిశ్రద్రవ్యము, తామ్రామ్లజనిదము. ఇత్యాది.

అయథార్థము. పా. (ఫాల్సిటీ.)

అయనవృత్తములు. పా. (ఖగోళ) (ట్రాపిక్సు.) ఉష్ణమండలములు.

అయస్కాంతము. పా. (మాగ్నట్.) సూదంటు రాయి, చుంబకము; స్కాంతము లోహచుంబకము; లోహాకర్షకము.—ఇందుకు సంబంధించిన పారిభాషిక పదములు — కృత్రిమలోహచుంబకము, చుంబకత్వములోని దక్షిణోత్తరాభిముఖత, చుంబనాకర్షణ, చుంబకమాల, చుంబకవక్రము, అయస్కాంతక్షీణత, చుంబకీయ సూచీపతనము, చుంబకీయమూలతత్వములు. చుంబనవిషువవృత్తము, చుంబకబలక్షేత్రము, కాంతప్రదేశము, చుంబనద్రవము, చుంబకప్రవర్తన, చుంబనభగామధ్య వృత్తము, చుంబకపునాది చుంబకధ్రువములు. చుంబకీయసంపృక్తత, చుంబకవియోగము, స్కాంతీకరణము, స్కాంతాయితము, లోహచుంబకత్వము, విద్యుత్ జనకచుంబకత్వము, (బింబ) విస్తరణశక్తి. ఇత్యాది.

అయస్కాంతాయితము. పా. (మేగ్నిటైట్.)

అయోకరణము. పా. (లోనిజేషన్.)

అయోర్టా. అం. మహాధమని, బృహద్ధమని. (ఎయోర్టా)

అయ్యగారివీరభద్రకవి. పా. ఇతనిగ్రంథము రాఘవపాండవ యాదవీయము. (19 శతాబ్ది.)

అయ్యలరాజు అయ్యలభాస్కరులు. పా. వీరిగ్రంథము రెట్టమతశాస్త్రము (18 శతాబ్ది)

అయ్యలరాజు నారాయణామాత్యుడు. పా. ఇతనిగ్రంథము హంసవింశతి. (18 శతాబ్ది.)

అయ్యలరాజు రామభద్రకవి. పా. ఇతనిగ్రంథములు సకల కథాసారసంగ్రహము. రామాభ్యుదయము. (16 శతాబ్ది.)

అరబ్బూస. పా. గుగ్గిలము, సజ్జకారము.

అరవతెనుగు. పా. ఉదా.— మా దండిమా. అయిదారుమాసంకుయ్యాకుండా గమ్మునఉండండి. అప్పుడు మహీపతి యిట్లావాడని మీకేచెప్పబోతారు. (వరకుల్కనాటకము.)

అరవతొక్కులు అనుబ్రాహ్మణులు. పా. శైవబ్రాహ్మణులలోని కర్ణాటకులలో నొక తెగవారు: చూ, బ్రాహ్మణులు.

అరాంతము. పా. త్రైత్రిజ్యము. (సెక్టరీ.)

అరాచకుడు. పా. (అనార్కిస్టు.)

అరాశికసామ్యమూలము. పా. (రూట్ ఇర్రేషనల్.)

అరెస్టు. ఆం. శాస్త్రీయావరోధము. ఆసేధము.

అర్ఘ్యప్రదానము పా. వర్ణన.—"సీ. మోకాళ్లు భూమిపై మోపి హస్తాంబుజద్వయమున దామ్రపాత్రము ధరించి, యర్ఘ్యోదకంబుల నందు మర్యాంకురాక్షతములు నవరక్తచందనంబు, కరవీరముఖ్యారక్త ప్రసూనంబులువైచి యొక్కొక పేరు వరుసతోన, మోంతంబుగా జతుర్థ్యంతంబుగా బ్రణవాదిగా బఠియించు నర్ఘ్యపాత్ర గీ. మాళిపర్యంత మెత్తుచు మాటిమాటి, కర్ఘ్యమిచ్చు బ్రీతుడై యర్కుడొసగు, సేవకునకాయురారోగ్య ధీవివేక, భాగ్యసౌభాగ్య వైభవప్రాభవములు." కాశీ 3, ఆ. 185.

అర్జలబ్రాహ్మణులు పా. నేపాళదేశపు బ్రాహ్మణులలో నొకరు: చూ, బ్రాహ్మణులు.

అర్గ్రామ్యము. అం. శబ్దదోషములు నాలుగింటిలో నొకటి. చూ, శబ్దదోషములు.

అర్ధచంద్రపిధానము. పా. అర్ధేందుకపాటము.

అర్థప్రయోగము. పా. వడ్డీవ్యాపారము

అర్థవేదము. అం. ఉపవేదచతుష్టయములో నొకటి: చూ, ఉపవేదచతుష్టయము.

అర్థశాస్త్రము. పా. (ఎకనమిక్సు.) గృహకృత్యశాస్త్రము.

అర్దితవాతము. పా. ముఖవాతము.

అర్ధేందుకపాటము. పా. (సెమిలూనర్ వాల్వ్.)

అర్ధపారదర్శక. పా. అవలివస్తువు కొంతవఱకు కనఁబడఁజేయు గుణము.

అర్ధపారదర్శకము. పా (ట్రాన్స్లూసెంట్.)

అర్ధభాగము. పా. సగము.

అర్ధవలయనాళములు. పా. (సెమి - సర్క్యులర్ కెనాల్స్.)

అర్ధవృత్తము పా. (సర్క్యుల్ సెమి.)

అర్ధసీరి. పా అర్ధికుఁడు అనఁగా బ్రాహ్మణునకు వివాహితయగు వైశ్యస్త్రీయందు జన్మించి సంస్కృతుఁడైనవాఁడు.

అర్ధస్యపురుషో దాసః. లో. ధనమునకుఁ బురుషుఁడు దాసుఁడు

అర్ధాంగవాతము. పా. పక్షవాతము.

అర్ధాపత్తి. పా. ఉపసిద్ధాంతము

అర్ధావభేదకము. పా. ఒంటికణతనొప్పి.

అర్శస్సు. పా. మూలశంక.

అలఘుకోణ (విశాలకోణ) త్రికోణము. పా (ట్రి యాంగిల్ అబ్ ట్యూస్ ఏంగిల్డు)

అలఘుకోణము. పా. అధికకోణము.

అలవెన్సులు. పా. అదనపు జీతములు.

అలాట్మెంటు. ఆం. వాటాలు పంపిణీచేసి యిచ్చుట.

అలారమ్. ఆం. ఆసన్నభయసూచకము.

అలిగేషన్. ఆం మిశ్రగుణితము. సువర్ణగణితము.

అల్టిమేటుం. ఆం. అంత్యసందేశము

అల్పగ్రంథి. పా. (గ్లాండుల్.)

అల్పగ్రహావళి. పా. నక్షత్రాకారముఁగల చిన్న గ్రహములు.

అల్పతమ. పా. (మినిమమ్) కనిష్ఠ, కనీస.

అల్పతరస్థిరస్థానము. పా. (లోయర్ ఫిక్స్డ్ పాయింట్.)

అల్పవిద్యో మహాగర్వః. లో. కొలఁది విద్యగలవాఁడు మిక్కిలి గర్వముగలవాఁడగును.

అల్పసంఖ్యాకపక్షము. పా. కొద్దిసంఖ్యవారు.

అల్పాయుర్దాయజాతకుఁడు పా 1. కేంద్రములయందు పాపగ్రహములుండి లగ్నాధిపతి బలహీనుఁడైనపుడును; 2. లగ్నమునకు గాని లగ్నాధిపతికిగాని ద్విర్ద్వాదశములయందు పాపులుండి శుభగ్రహసంబంధము లేనియపుడును; 3 సూర్యుఁడును లగ్నాధిపతియును బలహీనులైనపుడును; 4 అష్టమాధిపతి పాపులతోఁగూడి ద్వాదశమందుండునపుడును; 5 షష్ఠస్థానమందష్టమాధిపతియుండి లగ్నాధిపతితోఁ గూడినపుడును; 6. సూర్యచంద్రులు లగ్నమందుండి పాపగ్రహములు ద్వాదశాష్టమముల యందున్నపుడును; 7. లగ్నాష్టమాధిపతు లొకరియింటనొకరుండి శుభగ్రహసంబంధ వర్జితులగునపుడును; 8 లగ్నాష్టమాధిపతులు షష్ఠద్వాదశములలోనుండి గురుసంబంధము లేనపుడును; 9. పాపులు కేంద్రములయందుండి లగ్నాధిపతి నీచయందుండి శుభసంబంధము లేనపుడును; 10. బృహస్పతి రవితోఁగూడి మకరరాశియందుండి, అష్టమాధిపతి కేంద్రమందు లేనపుడును; 11 ఆపోక్లిమములయందు శుభగ్రహములుండి శని శత్రుక్షేత్రమందుండునపుడును; 12. లగ్నాధిపతి పాపుడై యష్టమమందుండి అష్టమాధిపతి పాపులచేఁ జూడఁబడినపుడును; 13. రవి, చంద్రశనులతో సంబంధముఁ గలవాఁడైయుండి సప్తమమందుండునపుడును; 14. చంద్రుఁడు లగ్నాష్టమాధిపతుల మధ్యనుండి గురుఁడు ద్వాదశమందుండునపుడును; 15. లగ్నాధిపతి బలహీనుఁడై యష్టమాధిపతి కేంద్రమందు లేనపుడును; 16. జన్మలగ్నము పాపగ్రహసంబంధమైనను, క్షీణచంద్రుఁడు పాపయుక్తుఁడైనపుడును; 17. రవి అష్టమమందుండి చంద్రుఁడు శని

తోఁగూడి యుండునప్పుడును; 18 గురుబుధ శుక్రులు 6-8-12 స్థానములయం దుండునప్పుడును, పాపులు 3-6-11 స్థానములయందు లేనప్పుడును; 19. లగ్నము, లగ్నాధిపతి, లగ్నాధిపతియున్న యింటి యధిపతి శుభగ్రహసంబంధము లేక పాపగ్రహసంబంధము న్నప్పుడును; 20. లగ్నము, చంద్రలగ్నము, చంద్రుఁడున్న లగ్నాధిపతి, చంద్రలగ్నాదష్టమాధిపతి, వీరు జన్మలగ్నాదష్టమాధిపతి, శని, కుజుఁడు వీరిచేతగాని వీరిలోఁ గొందఱిచేతనుగానిఁ జూడఁబడి శుభగ్రహముచేఁ జూడఁబడనప్పుడును; 21. లగ్నాధిపసూర్యులు నైసర్గిక శత్రువులయినప్పుడును; 22. లగ్నాష్టమాధిపతులు దుర్బలులైనను నీచస్థానగతులయినను; 23. అష్టమాధిపతిగాని శనిగాని పాపగ్రహాంశలయందున్నను పాపులతో సంబంధించినను; 24 అష్టమాధిపతి నీచయం దుండి శనిబలము లేనివాఁడై లగ్నమునఁ బాపగ్రహములున్నప్పుడును; 25. లగ్నాష్టమాధిపతులిద్దఱును స్థిరరాసులయందున్నను లేక యొకఁడు చరరాశియందును, మఱియొకఁడు ద్విస్వభావ రాశియందును నుండునప్పుడును; 26. లగ్నము ద్విస్వభావమై చంద్రుఁడు ద్విస్వభావరాశి యందుండునప్పుడును అల్పాయుర్దాయము గలవారగుదురు.

అల్లమరాజు రంగధామకవి. పా. ఇతఁడు రచించినది నారాయణాచల మహాత్మ్యము. (18 శతాబ్ది.)

అల్లమరాజు రామకృష్ణకవి. పా. ఇతని గ్రంథములు కవిజనచకోరచంద్రోదయము; శాంతసువిలాసము. (19 శతాబ్ది.)

అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి. పా. ఇతఁడు రచించినవి శివధర్మములు, కృష్ణకళ్యాణము, భద్రాపరిణయము. (19 శతాబ్ది)

అల్లసాని పెద్దన. పా. ఇతఁడు వ్రాసినది మనుచరిత్రము. (స్వారోచిష మనుసంభవము.) (15 శతాబ్దము.)

అవ. సం ఉప. (1. అవచ్ఛిన్నము=ఇచట 'అవ' అనునది నిరర్థకమైనది; 2 అవజ్ఞ = ఇచట ధాత్వర్థమును అవమానమను నర్థమునకు మార్చినది; 3. అవతంసము=ఇచట ధాత్వర్థమును కర్ణభూషణమను నర్థమునకు మార్చినది; 4. అవతమసము=ఇచట తమశ్శబ్దముతో సమసించి గాఢమను నర్థముకలదియైనది; 5. అవతరణము=ఇచట ధాతువును దిగుట అను నర్థమునకు మార్చినది.)

అవకాశము. పా మండలము.

అవక్షేపము. పా. (ప్రిసిప్టేట్.)

అవతరణిక. పా: చూ, అవతారిక

అవధారణపూర్వపదకర్మధారయసమాసము. పా: చూ, కర్మధారయము.

అవధారణము. పా. ప్రత్యాయనము.

అవధిమూల్యము. పా (వేల్యు క్రిటికల్.)

అవపీడనము. పా. అధోపీడనము.

అవభాసిని. పా. బాహ్యత్వక్కు.

అవమత్రిద్యుస్పృక్తిథినవమీస్వరూపనిర్ణయము. ఒక వారమున మూఁడుతిథులువ్యాపించియున్నది అవమ యనియు, మూఁడు వారములయం దొక తిథి వ్యాపించియున్న నది త్రిద్యుస్పృక్కనియు ననంబడుంగాన నీరెండు తిథులును శుభకార్యముల కత్యంతాయోగ్యంబులనియు-ప్రత్యక్షనవమియు - ప్రయాణనవమియు - ప్రవేశనవమియు - నీమూఁడును సకలకార్యములకు నతినింద్యంబులనియు తెలిసికొనలవయును.

అవయవములు. పా. (ఆర్గన్స్.)

అవయవానురూపత్వఅక్షరేఖ. పా. సమవిభక్తాక్షము, సౌష్టవాక్షము.

అవయవానురూపత్వము. పా. సౌష్ఠవము.

అవరోహణశ్రేణి. పా. (సీరీస్ డిసెండింగ్)

అవరోహివర్ణగతాలంకారములు అం. వేణువు, త్రివర్ణము, ఉద్వాహితము, ఉద్ఘటితము. సంధిప్రచ్ఛాదితము, ఆక్షిప్తము, ప్రేంఖితము, హసితము, అభ్యుచ్చయము, బిందువు, నిష్కర్షము, విస్తీర్ణము. (12): చూ, అలంకారము.3.

అవరోహివర్ణము. అం. వర్ణచతుష్కములోనొకటి: చూ. వర్ణచతుష్కము.

అవలోకనము. పా. నిరీక్షణము, వేధ. (అబ్జర్వేషన్.)

అవలోకనశాల. పా. వేధశాల, నక్షత్రావలోకనశాల.

అవశిష్టపత్రము. పా. శేషపత్రము.

అవశిష్టవాయువు. పా. ఊపిరి బయటికి విడిచిన తరువాత లోపల మిగిలినగాలి: చూ, వాయువు.

అవశ్యమనుభోక్తవ్యం కృతంకర్మ శుభాశుభమ్. లో. తానుఁజేసిన మేలయినట్టియుఁ గీడైనట్టియు కర్మ ముఖ్యముగా ననుభవింపఁదగినది. ఉదా — "కావున "నవశ్యమనుభోక్తవ్యం కృతంకర్మ శుభాశుభ" మ్మను కతంబునఁ బూర్వజన్మంబునం జేసిన పుణ్యపాపఫలంబులు వెంబడిని జీవులనంటియుండి సుఖదుఃఖంబులనుభవింపఁజేయు." (కుచేలోపాఖ్యానము.)

అవస్థలు. అం: చూ, ద్వాదశావస్థలు.

అవహిత్థ. అం. సంచారీభావభేదము. ఉదా.-"ఆరాజగుణంబులనుడివి యారామామణి మేనం బులకలలుముకొన "నబ్బా! యీ ముత్తియపుసరులెంత చల్లగానున్నవి." అని వాని మఱుఁగుపెట్టును: చూ, సంచారీభావభేదములు.

అవహిత్థము. అం. సంయుతహస్తములు ఇరువది నాలుగింటిలో నొకటి: చూ, సంయుతహస్తములు

అవాంతఅవలంబ. పా. ఉపసంపర్కలంబ. (సబ్ నార్మల్.)

అవాంతరపాతాళవాహినులు. పా. (సబ్ ఆర్టీజియన్ స్ప్రింగ్సు)

అవాంతరపుటుత్తరువు. పా. దావామధ్య చేయఁబడు నుత్తరువు

అవాంతరభేదములు. అం. శుద్ధమూర్ఛన, కాకలీమూర్ఛన, అంతరమూర్ఛన, కాకల్యాంతరమూర్ఛన. (4.)

అవార్డు. ఆం. పంచాయతీతీర్పు, మధ్యవర్తితీర్పు.

అవిచ్ఛిన్నత్వము. పా. అవిరామము.

అవిచ్ఛిన్నసంబంధసామ్యము. పా. (ప్రపోర్షన్ కంటిన్యూడ్.)

అవిదారణపుటకఫలములు పా.(ఇన్ డిహిసెంట్ ఫ్రూట్సు.) కొబ్బరిపండు లోనగునవి.

అవిద్యాకల్పిత నిరాకరణము. పా. విపర్యయపర్యవసానము.

అవిద్యుత్ వాహకము. పా.(నాన్ కండక్టర్ ఆఫ్ ఎలెక్ట్రిసిటీ.)

అవిభక్తకుటుంబాస్తి. పా. సంసృష్టధనము.

అవిభజనీయపు జమీను. పా. (ఇంపార్టిబిల్ ఎస్టేటు.)

అవిభజనీయ లాభము. పా. విభజింప వీలులేని లాభము.

అవిభాజ్యపు జమీందారీ. పా. అవిభజనీయపు జమీను.

అవిరామభిన్నము. పా. వితతభిన్నము.

అవిరామము. పా. అఖండత.

అవిరామలబ్ధము. పా. నిలువులేని లబ్ధము, ఎడతెగనిలబ్ధము, వితతలబ్ధము.

అవివేకసారధ్యము. పా. (కేర్లెస్ డ్రైవింగు) నిదానముగాని దూరదృష్టిగాని లేకుండ నడపుట (తోలుట.)

అవిహిత. పా. అనియంత్రిత.

అవుఁదల: దే. వి. రూ-ఔఁదల. 1. తల: చూ, శిరము. 1: 2. శిరోగ్రము: చూ, ముందల; 3. నడితల: చూ, మాడపట్టు. (చూ, శిరము.)

అవ్యక్తరాశి. పా. 1. (అన్‌నోన్ క్వాన్టిటీ.); 2. (వేరియేబుల్ క్వాంటిటీ.)

అవ్యక్తసమీకరణము. పా. వర్గసమీకరణము.

అవ్యయములు. పా. 1. ఇంచుక = కించిత్; 2. బళి=ప్రశంస; 3. ఓహో = ఆశ్చర్యా; 4. అయ్యో=సంతాపా; 5. ఎప్పుడు, అప్పుడు, ఇప్పుడు=యదాతదా; 6. అటు = ప్రకార; 7. ఏమి, ఏల=కిమర్థక; 8. అ, ఆ, ఎ, ఏ = ఏవార్థక, 9. ఊరక, మిన్నక=తూష్ణీమర్థక; 10. అఁట, అంట, కదా = కిలార్థక; 11. చుమీ=నిశ్చయార్థక; 12. ఆ, ఓ, ఏ = సందేహార్థక; 13. ఒండె = వికల్పార్థక; 14. మఱి=సముచ్చయార్థక; 15. ప్రార్థనార్థకములైన—"ఇ, ఈ, ఎ, ఏ, ఒ, ఓ"; 16. ఇపుడు=కాలార్థక; 17. క్రియలనుండి పుట్టినవి.—అంత, ఇంత, ఇదిగో, ఇగో, అదిగో, అనయము, ఛీ, తరమిడి, ఉద్దవిడి, పదఁపడి, మున్నుకొని, తలా, అద్దిర, ఇసీ, ఉవ్వెత్తు, ఎట్టు, ఎట్టూ, ఎత్తిలి, ఒత్తిలి, ఎప్పటి, ఒకో, ఓచెల్ల, ఒండె, ఓటు, చేసి, ఓయి, ఓరి, ఓసి, కరము, సవి, హా, హుటాహుటి, హోరాహోరి, కాని, కాఁబట్టి, చెతి, చెల్లబో, మిక్కిలి, వెండియు. ప్రతిపదోక్తావ్యయములు. ఇత్యాది. (ఇవియన్నియు గళలు.)

అవ్యాప్తహేతువు. పా. (అన్‌డిస్ట్రిబ్యూటెడ్ మిడిల్.)

అశాస్త్రీయకర్తృవ్యాకరణము. పా. (ఇల్లీగల్ ఒమిషన్.)

అశుద్ధవర్గ సమీకరణము. పా. (క్వాడ్రాటిక్ ఈక్వేషన్ అఫెక్టెడ్.)

అశుద్ధీకరణము. పా. హీనద్రవ్య మిశ్రణము, కల్తీ.

అశుభవిద్ధము. అం. ఏకవింశతి మహాదోషములలో నొకటి: చూ, ఏకవింశతి మహాదోషములు.

అశృగ్రంథిదరఖాతము. పా. (ఫస్సా-లాక్రిమల్.)

అశ్రుపీఠాస్థి. పా. (బోన్ లాక్రిమల్.)

అశ్రువాహినీ కూటకము. పా. (ఫాస్సిస్ లేక్రిమల్.)

అశ్రువు. అం. సాత్త్వికభావములు ఎనిమిదింటిలో నొకటి= కన్నులనీరు వెడలుట. తొలుకారువానచే ముత్తెపుఁజిప్పల ముత్తెంబులు గలుగునట్లు తొలిచూపున నయ్యింతికన్నుఁగవ నశ్రుపూరంబుతోరంబయ్యె: చూ, సాత్త్వికభావములు.

అశ్రువిసర్జనీపేశీ. పా. పక్ష్మస్నాయువు

అశ్వదానము అం. షోడశ మహాదానములలో నొకటి: చూ, మహాదానములు.

అశ్వమువలన మృతినొందుజాతకుఁడు. పా. శని షష్ఠమాధిపతియై చంద్రునితోగాని, రాహుతోగాని కూడి శుభసంబంధములేక వారిమహాదశలు వచ్చినప్పుడు సంభవించును.

అశ్వశక్తి. పా. ఒకమినిటునకు 33,000 పౌనుల బరువును ఒక అడుగు పైకెత్తగల శక్తి.

అష్టకవర్గ పా. గవ్యాది సప్తగ్రహములకును, లగ్నమునకును బిందునిర్ణయము.

అష్టకవర్గువులు. పా. కాకోలి, క్షీరకాకోలి, వృద్ధి, మహావృద్ధి, మేధ, మహామేధ, జీవకము, ఋషభకము. (8)

అష్టగురువులు. అం: చూ, ఉపదేశకులు.

అష్టదళపద్మబంధము. అం. శబ్దాలంకారములలో నొకటి: చూ, శబ్దాలంకారములు. (చూ, అలంకారము. 3.)

అష్టదిక్కులు. అం: చూ, దిక్కులు.

అష్టదిక్పాలకులు. అం: చూ, దిగధిపతులు.

అష్టభుజము. పా. అష్టాస్రిము.

అష్టమ కుజుఁడు. అం. ఏకవింశతి మహాదోషములలోనొకటి: చూ, ఏకవింశతి మహాదోషములు.

అష్టమచంద్రుఁడు. పా. ఏకవింశతి మహాదోషములలో నొకటి: చూ, ఏకవింశతి మహాదోషములు.

అష్టమము. అం. స్థాననిఘంటువులు పండ్రెండింటిలో నొకటి: చూ, స్థాననిఘంటువులు.

అష్టమహిషీకల్యాణము. పా. ఈగ్రంథకర్త తాళ్లపాక తిరువేంగళనాథుఁడు. (16 శతాబ్ది.)

అష్టమూలము. పా. అడ్డసరము, గర్గర, తిప్పతీఁగె, తులసి, పర్పాటకము, చేదుపొట్లు, విష్ణుక్రాంత, చిట్టాముట్టి (8)

అష్టవసువులు. అం: చూ, వసువులు.

అష్టసిద్ధులు. అం: చూ, సిద్ధులు.

అష్టాంగనమస్కారములు. అం: చూ, నమస్కారములు.

అష్టాంగయోగములు. అం: చూ, యోగాంగములు.

అష్టాక్షరి పా "ఓం, న, మో, నా, రా, య, ణా, య." ఉ.దా.— "శ్రీమహితాష్టాక్షరియను, నామంత్రము నభ్యసింపనగువిప్రనకు, శ్రీమంత్రమష్టవర్ణని, యామకమై ప్రణవ పూర్వమై విలసిల్లున్." సీ. ప్రణవసైసర్గిక పరమార్థమీమంత్రమని చెప్పుదురు. బుధులన్యమంత్రములకుఁ దత్ఫలపూర్తిఁబొందిచెప్పఁగ శుభదంబును సుస్వభావంబులేమి, ప్రణవంబు సర్వమంత్రములకు నాయకంబగు నాదియగు బ్రహ్మమదియమాపె, యొకటి రెండును నేను నొసరింపవర్ణము లష్టాక్షరాఖ్యమై యతిశయిల్లు. గీ. నదియు నారాయణాహ్వయ మాద్దిప్రణవమిడి నమస్కృతిలోఁ గూడనె సకమెసఁగు, సర్వశుభదంబు సర్వార్థసాదనంబు, సర్వదుఃఖాపహరణంబు సౌఖ్యకారము." పద్మ.ఉ, ఆ. 105: చూ, మంత్రము.1.

అష్టాదశపురాణములు. అం:చూ, పురాణములు.

అష్టాదశమూలము. పా. అష్టమూలమున్ను దశమూలమున్ను చేరిన అష్టాదశమూల మనిపించుకొనును.

అష్టాదశవర్ణనములు. అం: చూ, వర్ణనములు.

అష్టాదశవిద్యలు. అం. ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వణవేదము; శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము; మీమాంస, న్యాయశాస్త్రము, పురాణములు, ధర్మశాస్త్రము; ఆయుర్వేదము, ధనుర్వేదము, నీతిశాస్త్రము, అర్థశాస్త్రము. (18): చూ. విద్యలు.

అష్టాస్రిము. పా. అష్టభుజము.

అష్ఠీలా. పా. (ప్రోస్ట్రేటిటిస్ ఎన్లార్జ్‌మెంటు.)

అసంకోచ్యత. (ఇన్‌కమ్‌ప్రెసిబిలిటీ.)

అసందిగ్ధము. పా. నిస్సంశయముగా.

అసంయోగస్థితి. 1. (అన్‌కంబైన్డుస్టేట్.); 2. (ఫ్రీస్టేట్.)

అసంపూర్ణదళవంతములు. పా. (ఇన్‌కంప్లీట్.) చిన్నవిగను, కుఱుచవిగనుండు పుష్పదళములును, రక్షకపత్రములును గలపువ్వులు.

అసత్యకథనము. పా. అసత్యవర్ణనము.

అసత్యవర్ణనము. పా. మధ్యపఱచుట.

అసమ (విషమ) భుజత్రికోణము. పా. (స్కేలెన్ ట్రయాంగిల్.)

అసమభుజత్రిభుజము. పా. (స్కేలెట్ ట్రయాంగిల్.)

అసమవిభక్తాంగత్వము. పా. అసమావయవత్వము.

అసమవేగము. పా. (వారియేబుల్ వెలాసిటీ.)

అసమావయవత్వము. పా. ఈడుజోడులేమి,

అసమ్మతి. సం. విణ. (తె. ప.) :—ఒవ్వమి
అసలీవాయిదా. పా. అసలు + వడ్డీ
అసలు. పా. (ప్రిన్సిపల్.)
అసలువిలువ. పా. స్వీయమానము. (వేల్యూఇన్‌ట్రిన్‌సిక్.)
అసాంతరితస్నాయువు. పా. (మసెల్ సబ్సుక్ ప్యులరిస్.)
అసూయ. అం. సంచారిభావభేదము. ఉదా.—
అక్కటకటా! గోపాలుఁడు అత్తపసియిచ్చిన కొవ్విరి రుక్మిణికి నొసంగెనఁట. నన్నింత యనాదరించునే—": చూ, సంచారిభావభేదములు.
అసెంబ్లీ (శాసనసభ). పా. ప్రజాప్రతినిధి సభ.
అస్కంధీయత. పా. (ఒస్కు లేమస్.)
అస్థిగతజ్వరము. పా. ప్రలేపకజ్వరము, క్షయజ్వరము.
అస్తిత్వనియమము. పా. (తీరంఏగ్జిస్టెన్సు)
అస్తిత్వప్రతిపాదకవాక్యము. పా. (ఎగ్జిస్టెన్‌టిల్ జడ్జిమెంటు.)
అస్త్రసన్న్యాసము. పా. ఆయుధవిసర్జనము.
అస్థానికుఁడు. పా. పరస్థానికుఁడు.
అస్థావ్యవస్థితి. పా. యదృచ్ఛాస్థితి.
అస్థికవచము. పా. ప్రతిఎముకను నావరించుకొనియుండు తెల్లనిపొర, సేయంకళ.
అస్థికోథము. పా. పేశీసంఘాతము. (టెన్యూర్) చేచ్చుబడుట.
అస్థిభంగము. పా. ఎముకవిఱుగుట.
అస్థియుతము. పా. ఎముకలుగలవి.
అస్థిరరాశి. పా. చరరాశి.
అస్థిశాస్త్రము. పా. (ఓస్టియాలజీ.)
అస్థిహీనములు. పా. ఎముకలులేనివి.
అస్పృశ్యత. పా. అంటరానితనము.
అస్వామివిక్రయము. పా. శాస్త్రవిరుద్ధ విక్రయము.
అశ్సెట్సు. ఆం. ధనసర్వస్వము.
అస్సెసర్. ఆం. న్యాయసభాసభ్యుఁడు.
అస్సైజు. ఆం. ఇంగ్లాండులోని జిల్లాన్యాయసభ.
అస్సైన్‌మెంటు. ఆం. సమర్పణము.
అహంవాది. పా. గర్వి.
అహల్యాసంక్రందనీయము. పా. ఈ గ్రంథకర్త సముఖం వేంకట కృష్ణప్పనాయఁడు. (18. శతాబ్ది.)
అహింసాపరమోధర్మః. లో. హింసచేయకుండుట గొప్పధర్మము. ఉదా.—"పరస్పర విరుద్ధములైన ధర్మశాస్త్రములు సహితము "అహింసాపరమోధర్మ." యనుచో నైకమత్యము గలిగియున్నవి." (నీతిచంద్రిక.)

## ఆ.

ఆ. సం. ఉప. (1. అక్రమము =ఇచట 'ఆ' అనునది ధాత్వర్థమును ఆవరించు అను నర్థమునకు మార్చినది; 2 ఆక్రోశము = ఇచ్చట ధాత్వర్థమును తిట్టు అను నర్థమునకు మార్చినది; 3. ఆగతము=ఇచట ధాత్వర్థమును దలక్రిందులుచేసి వచ్చు అను నర్థమునకు మార్చినది; 4. ఆఘాతము=ఇచట నిరర్థకమయినది; 5. ఆఘోషణము=ఇచట నిరర్థకమయినది.)
ఆంక్షాపత్రిక. పా. బహిష్కారపత్రిక. (ఇంటర్‌డిక్టు.)
ఆంగ్లజమీందారీ. పా. జాగీర్దారీ; మిరాసి.
ఆంగ్లన్యాయవాది. పా. (బారిష్టరు.)
ఆంగ్లమిరాశీ. పా జాగీరు (భూమి) మొఖాసా జమీను.
ఆంత్రదాహము. పా. ప్రేగులవాఁపు.
ఆంత్రనిరోధపటకా. పా. (ట్రస్.)
ఆంత్రపుచ్ఛము. పా. (వెర్మిఫారం ఎపెండిక్సు

ఉణ్డుకపుచ్ఛము, పురీషోణ్డుక అనుబంధము, క్రిమిక.

ఆంత్రిముఖము. పా: (పైలోరస్.)

ఆంత్రిరసము. పా. (ఇంటెస్టైనల్ జ్యూస్.)

ఆంత్రివృద్ధి. పా. బుడ్డ.

ఆంధ్రికవిస్తుతి. పా. వర్ణన.—"ఉ. నన్నయ భట్టు నాంధ్రికవినాథుని దిక్కనసోమయాజినిం, బన్నుగ సోమసత్కవిని భాస్కరబమ్మెరపోతరాజులన్, మున్నుప్రసిద్ధిగాంచు కవిముఖ్యులనందఱ సెమ్మనంబులో, నెన్ని నమస్కరించెద నభీష్టఫలాప్తిఁ దనర్చునట్లుగాన్." సీతారామాంజనేయసంవాదము. పీఠిక. 12

ఆంధ్రిలు. పా. తెలుఁగుభాషా ప్రచారముఁగల దేశ మాంధ్రిదేశము. దీనినే త్రిలింగదేశమని కూడ అందురు. ఈ యాంధ్రిలు పంచ ద్రావిడులలో నొకరై వారు. 1. వెలినాటి బ్రాహ్మణులు, 2. ములకనాటి బ్రాహ్మణులు, 3. కాసలనాటి బ్రాహ్మణులు, 4. తెలగాణ్యబ్రాహ్మణులు, 5. వెంగినాడు బ్రాహ్మణులు, 6. పగణపాల బ్రాహ్మణులు. 7. తైలింగ సామవేదబ్రాహ్మణులు, 8. కరణ కమ్మబ్రాహ్మణులు, 9 నియోగబ్రాహ్మణులు, 10. వాజసనేయ బ్రాహ్మణులు, 11. ఆరాధ్యబ్రాహ్మణులు, 12. వైష్ణవబ్రాహ్మణులు. (వివరములు ఆయాపదములకడ చూచుకొనవలెను.): చూ, బ్రాహ్మణులు.

ఆకరణీమగత. పా. మూలసంజ్ఞరహిత.

ఆకర్షణ పత్రిములు. పా. రక్షకపత్రిములచే కాపాడఁబడి కీటకాదుల నాకర్షించునవి.

ఆకర్షణపత్రావళి. పా. దళవలయము.

ఆకర్షణము పా. (ఆట్రాక్షన్.)

ఆకస్మిక అపాయము. పా. తలవనితలంపుగా సంభవించునది.

ఆకస్మికనష్టములు. పా. అనుకోనని నష్టములు.

ఆకస్మికప్రవాహము. పా. మంచుగడ్డపగిలి వరద లగుట.

ఆకృతిపటము. పా. పరిరేఖ;

ఆకాంక్షా సిద్ధాంతము. పా. (ప్రిపోజిషన్.) ఉపపాత్యము.

ఆకారము. పా. ప్రమాణము.

ఆకారరేఖ. పా. చుట్టుగీత. (ఔట్ లైన్.)

ఆకారరేఖనము. పా. రేఖాచిత్రము, రూపురేఖ.

ఆకాశగంగ. పా. నక్షత్రవీథి.

ఆకాశతరంగములు. పా. (ఈథర్ వేవ్స్)

ఆకాశమండలము. పా. ఖగోళమండలము.

ఆకాశమధ్యము. పా. ఉచ్ఛాయదశ (జెనిత్.)

ఆకాశము. పా. (స్పేస్.)

ఆకాశయానశాస్త్రము. పా. వైమానికశాస్త్రము.

ఆకాశయుద్ధము. పా. మావినయుద్ధము.

ఆకాశవిమానము. పా. (ఏరోప్లేన్.)

ఆకాశస్థవిద్యుత్తు. పా వాతావరణజన్యవిద్యుత్తు.

ఆకుఅడ్డచీలిక. పా. ఆకుయొక్క పైతట్టున నుండునది బహిశ్చర్మము. హరితకములు ఆకుయొక్క గుంజులోని ప్రతి కణమునందును వెక్కులుండును. ఇందు పొడుగుగనుండు మృదుకణము లొండొంటినడుమ సంమేళనం డునట్లు అమరియుండును. ఇందలి కణముల మధ్య శూన్యస్థలము లనేకములుగలవు. ఆకుయొక్క క్రిందితట్టున నుండునది బహిశ్చర్మము: (చూ, ఆకు.)

ఆకుంచనము. పా. సంకోచము.

ఆకుపెంట. పా. క్రుగ్గినఆకులు.

ఆకుమూల. పా. కణుపుసందు, చేంక.

ఆగంతుకములు. అం. ౧ రోచమానము, ౨ శ్రీవత్సకము, ౧ దేవమణి, ౨ మేఖల, ౨ వృషభములు, ౨ అంగదములు, ౨ యుపశేములు, 3 త్రేతాగ్నులు, ౪ చాతురంతికములు,

౩ నిశ్రేణికము, ౨ కేశాంతజములు, ౧ వస్త్రజము, ౨ స్వక్స్వజములు, ౪ కంఠాభరణములు, ౧ కటిపది, ౨ లింగమణులు.

ఆగమములు. అం: చూ, ఉపవిద్యలు.

ఆగస్త్యము. అం. కల్పసూత్రములలో నొకటి చూ, కల్పసూత్రములు (చూ, ఆపస్తంబము.)

ఆగ్నేయస్నానము. పా. విభూతిదేహమునందంతయును పూసికొనుట. (ఈ స్నానము గంగాస్నాన సమానఫలము.)

ఆచరణపద్ధతి. పా. (ప్రాక్టీస్ మెథడ్స్.) వ్యవహారగణితము.

ఆచార్య బ్రాహ్మణులు. పా. పంచగౌడులలో నొకతెగయగు ఉత్కళబ్రాహ్మణులలో నొకతెగవారు. శుక్లయజుర్వేదులు. మాధ్యందినశాఖవారు: చూ, బ్రాహ్మణులు.

ఆచార్యే అను బ్రాహ్మణులు. పా. పంచగౌడులలో నొకతెగయగు సారస్వతులలోని రెండవతెగవారు. వీరు శుక్లయజుర్వేదులు. వీరు చేపలనుతప్ప యితర మాంసముల భుజింపనొల్లరు. ఈ శాఖలవారు శాంగడాయందును తత్సమీప వస్యములయందును నివసించెదరు. వీరిలో నొకరికొకరికి సంబంధబాంధవ్యములు కలవు. (రెండవ తెగవారు—ఆచార్యే అను బ్రాహ్మణులు-కురుడుబ్రాహ్మణులు; ఖజూరీయ బ్రాహ్మణులు - దీక్షితబ్రాహ్మణులు, నాగబ్రాహ్మణులు, శిష్టకరణబ్రాహ్మణులు; రాయితీబ్రాహ్మణులు- వేదికబ్రాహ్మణులు.): చూ, బ్రాహ్మణులు.

ఆచ్ఛాదనము. పా. ఉపరిస్థాపనము.

ఆజ్ఞాపత్రము. పా. ఉత్తరువు.

ఆడంబరాణిపూజ్యాని. లో. డంబములు పూజింపఁబడుచున్నవి. ఉదా.— "తే. అరయ నాడంబరాణి పూజ్యానియనుచుఁ, జాటుచుండెడి నీతిశాస్త్రమునిజంబు, బడుగు లెచ్చోటకేగిన బ్రదుకుకలదె, బూటకులఁగాని మెచ్చరు భూమిపతులు." (కుచేలోపాఖ్యానము.)

ఆడఁబోయిన తీర్థమెదురైనట్లు. లో. ఉదా.— "నీవు భీమునితోఁబోరు కోరుకొనుటంజేసి మాకాడఁబోయిన తీర్థమెదురయ్యె." (ధర్మజ రాజసూయము.)

ఆడిట్. అం. లెక్కలతనిఖీ

ఆడిటరు. అం. లెక్కవిమర్శకుఁడు.

ఆడ్వర్స్ పొజిషన్. అం వ్యతిరేకభుక్తము.

ఆఢకములు. సం. వి. అ. న. బ. తువరి, కందులు: చూ, ధాన్యము.

ఆత్మనివేదకుఁడు. పా. వాఙ్మనఃకాయములందు నీవాఁడననిపలికి అటుల చరించువాఁడు

ఆత్మపరాగ సంపర్కము. పా. (ఫోలినేషన్ సెల్ఫ్.)

ఆత్మబుద్ధిసుఖము. లో. ఉదా.—"ఆత్మబుద్ధియె కడుసుఖం బన్నిటికిని, జెలఁగి గురుబుద్ధి కొంత విశేషమరయఁ, బరులబుద్ధి వినాశంబు బరగఁజేయు, స్త్రీలబుద్ధులు ప్రళయముల్ చిత్తగింప." (కుచేలోపాఖ్యానము.)

ఆత్మవత్సర్వభూతాని. లో. సమస్తభూతములను దనవలెఁజూడవలెను. ఉదా.— "ఆత్మవత్సర్వభూతాని."యనెడు పలుకు, సత్యముగ నామహామునిచక్రవర్తి, సకలజనము నిజప్రాణసమముగాఁగఁ, దలఁచు శాంతియు దమమును దయయుఁగలిగి." (కుచేలోపాఖ్యానము.)

ఆత్మసమాయోజ్య పా. (సెల్ఫ్ఎడ్జస్టిబుల్.)

ఆత్మహత్య. పా. (సూసైడ్.)

ఆత్మాశ్రియము. పా. (సెల్ఫ్ డిఫెన్స్.)

ఆత్రేయసగోత్రము. పా. ప్రవర.—ఆత్రేయ, అర్చనాన, శ్యావాస్య (శ్వ) (వ్య): చూ, గోత్రము; ప్రవర.

ఆదర్శప్రమాణము. పా. అంగీకృతమానము.

ఆదర్శము. పా. మూలమూర్తి.

ఆదర్శస్వరూపము. పా. ఉండవలసినరూపు.

ఆదానప్రతిదానములు. పా. ఇచ్చి పుచ్చుకోలు, కొతావ్యాపారము. (డీలింగ్సు.)

ఆదాయవ్యయశేషపత్రము పా. అవశిష్టపత్రము.

ఆదిగౌడబ్రాహ్మణులు పా. పంచగౌడులలో నొకతెగయగు గౌడులలో నొకతెగవారు. శుక్లయజుర్వేదులు. కాణ్వ, మాధ్యందినశాఖలకుఁ జేరినవారు. కొందఱు కృష్ణయజుర్వేదులును, ఆపస్తంబీయులును కలరు. వీరిలో కొందఱు ఆమిషాహారమును వర్జించిరి. కొందఱు ఆమిషసురాదుల గ్రహించి శక్త్యుపాసకులై యున్నారు: చూ, బ్రాహ్మణులు.

ఆదిపర్వము. పా. వర్ణన.— "క. వదిఁబొప్పపర్వమాదిగఁ, బదునెనిమిది పర్వములను బర్వినమనః ప్రీతిదమగుచు నాదిపర్వం బడి వినఁగా నొప్పు భారతాద్యంబగుచున్" భార. ఆది. 1, ఆ 49.

ఆదివారవ్రతము. పా వర్ణన.—"క. నరుఁడురవివాసరంబున నియమాఱు భుజంచె నేనివ్రాతపుణ్యుండై, నిరయస్థితుఁడగుచు వ్యథా. పరిగతుఁడగు బ్రహ్మకల్పపర్యంతంబున్." క. దినకరుఁ డుదయింపక మును, జనుఁడినవాసరమునందు స్నానముఁ గావించిన నడేఁ గుఁదొంటి యొనిమిది, దినములఁ జేసిన యఘంబు ధీగతరేణ్యా." "గీ. భానువారవ్రతీ పాతపర్వసంక్రమణములం దేకభుక్త సమాచరణము, వెలయు గంగానదీస్నాన ఫలదమగుచు, నిరయమిరుమాఱుఁ గుడిచిన నరుఁడువొందు." ఇత్యాది. అ. సుబ్రహ్మణ్యకవి శివధర్మములు 6, అ. 141. పొరటు.

ఆదేశక్రియ. పా. ప్రతిక్షేపము.

ఆద్యజీవకణస్థానము. పా. 1. జీవపరమాణువు. ప్రొటోప్లాసం (వెన్నవంటిది.)లో నిలుకడపదార్థము, ఒకకణములోని మధ్యబిందువుకేకమూలబిందువు; 2. బీజము. (న్యూక్లస్.)

ఆద్యోపయుక్తి. పా. తొలిప్రయోజనము.

ఆధరైజ్డుకాపిటల్. ఆం. నియుక్తమూలధనము.

ఆధారధాతువు. పా. (టెన్యూస్ ఫండమెంటల్ ఆల్‌గ్రౌండు.) సాలఉత్పన్న కరణధాతువు.

ఆధారనియమములు. పా. స్వీకృతసిద్ధాంతములు.

ఆధారము. పా. (ఫల్క్రమ్.) త్రాసు నడిమిముల్లు.

ఆధారరేఖ. పా. మట్టపుగీత.

ఆధారవాక్యము. పా. పూర్వసిద్ధాంతము.

ఆధారశృంగము. పా. (కోన్ ఫ్రూబిస్ డెసెండింగ్ రామస్ ఆఫ్.)

ఆధిపత్యము. పా. సర్వాధికారము.

ఆధూమ్రికవిసర్పిణి. పా. (హెర్ప్సుఐరిస్.)

ఆధ్యాత్మికశాస్త్రము. పా. (మెటాఫిజికల్ సైన్సు.)

ఆన్తెర్. ఆం. పుష్పముయొక్క కింజల్కము, పురుషాంగము, పరాగకోశము, (జిలకఱ్ఱపాయవంటి) పుష్పాడితిత్తి.

ఆనందితము: సం. విణ. చూ, ముదితము. 2.

ఆనుకంపికమజ్జాతంతువు. పా. (సర్వ్యాసింపెథటిక్.)

ఆనుదైర్ఘ్యవిచ్ఛేదనము. పా. (లాంగిట్యూడినల్ సెక్షన్.)

ఆనురూప్యము. పా సాదృశ్యము.

ఆనుషంగికము. పా. (కాకసిక్వెంటు.)

ఆనుషంగికాధికారములు. పా. సంసిద్ధకాధికారములు.

ఆపన్నయగుస్త్రీ చండాలురచేత బలాత్కరింపఁబడుట. పా. ఇందుకు ప్రాయశ్చిత్తము:— తనపాపమును ౧౦ మంది బ్రాహ్మణుల సభలో విన్నవించుట. పిదప (1) గొంతుకలంటు లోతుగలగొయ్యయందు గోమయము ఉదకము

ఉంచి దానియందు ఆహారములేనిదై ఉపవాసము ఒక రాత్రియు పగలును ఉండవలయును. (2) మఱునాఁడుదయమున ఆగ్నేయ్యమండి లేచి శిఖతోఁగూడ వపనముచేసికొని యవాన్నమును దినవలయును. (3) తరువాత 3 దినములుపవసింపవలయును. (4) తరువాత ఒక దినమంతయు కంఠపరిమాణముగల నీటియందుండవలెను. (5) తరువాత శంఖపుష్పియనెడి ఓషధియొక్క తీఁగె, మూలము, ఆకు, పువ్వు, ఫలము, బంగారు, పంచగవ్యము వీనితోఁగాచిన యుదకమును త్రాగవలయును. (6) తరువాత 6 దినములు మొదలుకొని పుష్పవతియగునంతవఱకు ఒంటిపూఁటభుజింపవలయును. (7) ఈ విధముగా వ్రతము నాచరించునంత కాలము ఇంటియందుండఁగూడదు. ఇంటికి వెలుపలనే యుండవలయును. (8) ఈవిధముగా ఆచరించినపిదప బ్రాహ్మణభోజనము పెట్టి గోద్వయము దక్షిణగానిచ్చిన పరిశుద్ధయగును (ఇది రేతస్సేకాంతమగు సంభోగ విషయకమగు ప్రాయశ్చిత్తము.) నాలుగువర్ణములు స్త్రీలకు నిదేవిధముగా చాంద్రాయణకృచ్ఛ్రము నాచరించిన పరిశుద్ధులగుదురు. భ్రష్టస్త్రీలు సములు. ప్రాయశ్చిత్తానంతరము వారినిచేర్చుకొనవలయును. గాని పరిత్యజింపఁదగదు. రేతస్సేకము కానియెడల ఒక ప్రాజాపత్యకృచ్ఛ్రము చాంద్రాయణము నాచరించినయెడల పరిశుద్ధురాలగును. ఇత్యాది.

ఆపవర్త్యము పా. భాజ్యము, గుణిజము. (మల్టిపిల్.)

ఆపస్తంబము. పా. కల్పసూత్రములలో నొకటి: మా, కల్పసూత్రములు. (అగ్నివైశ్యసూత్రే.):- అథాతస్సూత్ర గణానాం వ్యాఖ్యాస్యామః; బోధాయన మాపస్తంబం సత్యాషాఢం ద్రాహ్యాయణ మాగస్త్యం శాణ్డిల్య మాశ్వలాయనం శాంభవీయం కాత్యాయనమితి నవైతాని పూర్వసూత్రాణి; వైఖానసం శౌనకీయం భారద్వాజ మాగ్నివైశ్యం జైమినీయం (మా) వాధూలమాధ్యందిన కౌణ్డిన్యం కౌషీతకమితి నవాపరసూత్రాణి. అష్టాదశసంఖ్యా కాశ్శాఖీరా స్సంస్కారా ఇతి" అని అగ్నివైశ్యసూత్రమున పరిగణింపఁబడినవి. ఈ పదునెనిమిది సూత్రములు వేదబోధితములై బ్రాహ్మణ్యాపాదకములై కర్మజ్ఞానసాధనములై బ్రహ్మవిద్యాసంబంధ సూచకములుగా బ్రాహ్మణులకు పరంపరాప్రాప్తమై వేదశాఖాప్రవర్తకులగు మహాఋషుల ననుసరించి దాయభేదముగ శైవవైష్ణవాది మతప్రవర్తనము గలవగుచున్నవి.

ఆఫ్గనిస్థానము. పా. ఖం.—ఆశియా; విస్తీ.— 24,50,00; జన. 65,00,000; ముఖ్యపట్టణము. కాబూలు.

ఆప్తవాక్యము. పా (టెస్టిమొని) సాక్ష్యము.

ఆఫ్రికాదేశీయుడు. పా. నీగ్రో

ఆబిచ్యుయరి. ఆం. చనిపోయినవానిఁ గూర్చి వ్రాఁత.

ఆభాసము. పా. మిథ్యాహేతువు.

ఆమగోత్రబ్రాహ్మణులు. పా. పంచగౌడులలో నొక తెగయగు సారస్వతులలోని మూఁడవ తెగవారు. వీరు వాజసనేయ శాఖవారు. శుక్లయజుర్వేదులు. ఈశాఖవారు జమ్ము, జసోత్రటా ప్రదేశములందును తత్సమీపవన్యప్రదేశములందును గానుపించెదరు. వీరిలో సంబంధబాంధవ్యములు కలవారు మద్యమాంసాశనులు దేవ్యుపాసకులునై యున్నారు. (వీరుమూఁడవతెగవారు.—ఆమగోత్రబ్రాహ్మణులు.—కేసరబ్రాహ్మణులు, శిబరిబ్రాహ్మణులు, వైద్యబ్రాహ్మణులు.): చూ బ్రాహ్మణులు.

ఆమత్వచము. పా. శ్లేష్మత్వక్కు.

ఆమరసవాహిని. పా. (తొరాసిక్ డక్ట్.) క్షీరశోష వాహిని; ధాతూపవాహిని; ఉరోనాళిక.

ఆమవాతము. పా. కీళ్ల వాతము.

ఆమశూల. పా. ఆమాశయశూల.

ఆమాశయము. పా. జీర్ణాశయము.

ఆమాశయ వికారజ్వరము. పా. పిత్తజ్వరము.

ఆమాశయశూల. పా. ఆమశూల.

ఆముక్తమాల్యద. పా. ఈ గ్రంథకర్త కృష్ణదేవ రాయలు. (15. శతాబ్ది)

అమ్లక్షీరరసము. పా. క్షీరామ్లము.

అమ్లజని. పా. ప్రాణవాయువు.

అమ్లజనిదము. పా. (ఆసిడ్.)

అమ్లజనిలవణములు. పా. (ఆక్సిసాల్ట్స్.)

అమ్లజనిహారిణి. పా. (రెడ్యూసింగ్ ఏజెంటు.)

అమ్లజానామ్లములు. పా. (ఆక్సిఆసిడ్స్.)

అమ్లపిత్తము. పా. పులితేన్పులు.

ఆమ్లోషితము. పా. నిర్గజామ్లు.

ఆయతనము. పా. ఘనఫలము. (వాల్యూమ్.)

ఆయతనసంఘట్టనము. పా. పరిమాణసంఘట్టనము.

ఆయతము. పా. దీర్ఘచతురశ్రము. (రెక్టాంగిల్.)

ఆయత్తవిధి. పా. సంక్రామిక శాసనము.

ఆయాసమరణజాతకుఁడు. పా. 1. శనిరాహువు లష్టమమందుండి, లగ్నాధిపతియు, కుజుఁడును జతుర్థమందుండునపుడును; 2. లగ్నాధిపతియు, శనియు, ద్వాదశమందుండి, షష్ఠమమున రాహువుండి, వీరిలో నెవరిదైన దశవచ్చియున్నను; 3. శనిరాహువులు దశమమునుండి, లగ్నాధిపతియు, గురువును, ద్వాదశమందుండునపుడును; 4. జన్మలగ్నమునకైనను, కారకునికైనను, తృతీయము పాపులచేఁ గూడఁబడినను, చూడఁబడినను ఆయాసమరణము కలుగును.

ఆయుధనామ విశేషములు. పా. వర్ణన.—"సీ. భిండివాలాసి కోదండ భల్లాతక, నారాచశరోపాణనఖరవజ్ర। ముష్టిముద్గర శూలముసలభుశుండిక, ప్రాసపత్రి కూర్మకర్పటకటారి। శాగరాయోదండ కణయకుంతాతళ, పరశుతోమరచక్రపరిఘ పట్టి। సములు వంకిణీ కాది సబళంబు చివ్వఁటె, సెలకట్టెయాదిగా నిలను తెంపఁ॥ గీ. దనరు ముప్పదిరెండాయుధయులు మఱియుఁ, జెఱుతచెయ్యమ్ము గండకత్తెర తుపాకి, గొరకను సుగాలమును గ్రద్దగోళ్లుబుట్టె చూరిబాణాధరించు నర్వీరుఁడెపుడు." హంసవింశతి. 1, అ. 205: చూ, బాణము. 1.

ఆయుధవిసర్జనము. పా. అస్త్రసన్యాసము

ఆయుర్వేదము. పా. 1. వైద్యశాస్త్రము. (మెడిసిన్.); 2 అం. ఉపవేదచతుష్టయములో నొకటి: చూ, ఉపవేదచతుష్టయము.

ఆయురారోగ్యపు లెక్కలు. పా. (వైటల్ స్టేటిస్టిక్సు.)

అరణ్యపర్వము. పా. వర్ణన.—"క. అరణ్యపర్వమనఁగా, నారణ్యప్రముఖ షోడశాంతఃపర్వాధారమయి సకలనూరిస, ఘోరమ్యంబగు తృతీయపర్వము వెలయుఁజ." భార. ఆది. 1, అ. 51.

అరక్షేపణము. పా. అస్కంధేయత.

ఆరాధ్యబ్రాహ్మణులు. పా. ఆంధ్రులలోని పంచద్రావిడులలో నొకతెగవారు. శుక్లయజుర్వేదులు కొందఱును కృష్ణయజుర్వేదులు కొందఱును కలరు. కాత్యాయన ఆపస్తంబ సూత్రప్రవర్తకులైయుండియు బ్రాహ్మణ్యాపాదకమను శారీరసంస్కారములలో 15 సంస్కారములను మాత్రమాచరించి 16 వ సంస్కారము మాత్రమెంపుకొనక మృతశరీరులను ఖననమాచరింపుచు ఆరాధన రూపముగ

పరేతకృత్యము లాచరింపుచు దేవతాంతరముల నొప్పుకొనక శివుని దైవముగ భావించి అత్యార్థరూపమగు శివార్చనచేయుచు శైవచిహ్నాధరులై వర్తింపుచున్నారు: చూ, బ్రాహ్మణులు. (చూ, ఆంధ్రులు.)

ఆరోగ్యరక్షణము. పా. పారిశుద్ధ్యము, శౌచము.

ఆరోగ్యరక్షణోపాయములు. పా. శౌచవిధులు.

ఆరోగ్యశాస్త్రము. పా. ప్రజారోగ్యశాస్త్రము. (హైజీన్.)

ఆరోగ్య (రక్షణ) స్థానము. పా. (శానటోరియమ్.)

ఆరోపము. పా. భ్రాంతి.

ఆరోహణశ్రేణి. పా. ఉచ్చశ్రేణి. (సిరీస్ ఎసెండింగ్.)

ఆర్కిటెక్చర్. ఆం. శిల్పశాస్త్రము. వాస్తుశాస్త్రము.

ఆర్కియాలజీ, ఆం. పురాతన వస్తుశాస్త్రము.

ఆర్థజీవి. పా. పరాన్నభుక్కు.

ఆర్జెంటైన్. పా ఖం.—దక్షిణ అమెరికా; విస్తీ—11,82,000; జన—10,62,20,85; ముఖ్యపట్టణము—బ్యూనస్సైరిస్.

ఆర్డినెన్సు. ఆం. శాసనవిధి.

ఆర్తి. ఆం. సంచారీభావభేదము. ఉదా.—"అబ్జాలకు నొడలంతల ముత్తెపుసరులు మన్మథ జ్వరముచే గాగ్రి పేలిపోవుచున్నవి.": చూ, సంచారీభావభేదములు.

ఆర్ద్రిభ్రమణము. పా. (హైడ్రోట్రోపిజమ్)

ఆర్థికనీతి. పా. (ఎకనమిక్ పాలసీ.)

ఆర్థికసామ్యము. పా, (ఎకనమిక్ ఈక్వాలిటీ.)

ఆల్కహాలు. ఆం. మద్యసారము.

ఆల్జిబ్రా. ఆ. బీజగణితము, అక్షరగణితము.

ఆల్టర్నేటివు. ఆం. వికల్పము.

ఆల్టిట్యూడ్. ఆం. లంబము; ఔన్నత్యము; ఉన్నతాంశము; ఉచ్చము; పొడవు; ఎత్తు.

ఆలంబనవిభావము. ఆం. ఉదా.—"రతిమన్మథులంబోలె నాసీతారాములు కలసి పరస్పర శోభాహేతువులైరి.": చూ. విభావములు

ఆలకించోతు. పా. వాలిడి, తోకలేని కోతి: చూ, వానరము.

ఆలూరుకుప్పనకవి. పా. ఇతనిగ్రంథము శంకరవిజయము. (19 శతాబ్ది)

ఆలోచనక్రమము. పా. (ప్రోసెస్ ఆఫ్ థాట్.)

ఆలోచనసూత్రములు. పా (లాస్ ఆఫ్ థాట్.)

ఆల్టర్నేటివుప్లీ. పా. పక్షాంతరవాదము.

ఆల్డర్మన్. ఆం మ్యునిసిపలు సంఘములోనొక గౌరవసభ్యుడు.

ఆల్బుకొరా. పా. (బ్రూన్సు.)

ఆవరణత్వచము. పా ఆవరణత్వక్కు.

ఆవరణభూతము. పా.(సరౌండింగ్ మీడియమ్.)

ఆవర్త. పా (పీరియాడిక్.)

ఆవర్తకంఠనాడీస్థమజ్జాతంతువు. పా (నర్వులారింగల్ రికరెంటు.)

ఆవర్తకసన్నిపాతజ్వరము పా. పరివర్తిజ్వరము.

ఆవర్తదశమాంశము. పా. (రికరింగ్ డెసిమల్.)

ఆవర్తదశాంశము. పా. (డెసిమల్ రికరింగ్.)

ఆవర్తము. పా. నియమితకాలము, ప్రవృత్తికాలము.

ఆవిరి. పా. సజలబాష్పము. (వేపర్)

ఆవిరియంత్రము. పా. (స్టీమ్ యింజన్.)

ఆవిరియగుట. పా. బాష్పీకరణము.

ఆవిష్కారకరణము. పా. ఆవిష్కృతి.

ఆవిష్కృతి పా. (డిస్ కవరీ.)

ఆవిరిస్నానము. పా. బాష్పనిమజ్జనము.

ఆవులఅంటురోగము. పా. గోస్తనవ్యాధి.

ఆవృతఫలజాతి. పా. (యూట్రికల్.)

ఆవేక్షణము. పా. పోలీసునిఘా.

ఆశ్రమవాసపర్వము. పా. వర్ణన—"క. అమితార్థయుక్తితో నా, శ్రమవాసాది త్రిపర్వ

సహితంబయి యా, శ్రీమవాస పర్వమత్యు త్తమకథలను వెలయుఁ బంచదశపర్వంబై." భార. ఆది. 1, ఆ 62.

ఆశ్రియగుణము. పా. ప్రభుభక్తి.

ఆశ్రయాసిద్ధి (తర్క). పా. (అన్ నోన్ సబ్జెక్టు.)

ఆశ్రితులు. పా. పక్షీయులు

ఆశ్వయుజశుద్ధనవమి పా వర్ణన.— "సీ. అర యంగ ధరణి మహానవమియనంగ, సొబగొందు నాశ్వయుజ శుద్ధనవమి,యందుఁ బ్రొద్దున లేచి యత్యంతభక్తితో భారతీదేవిని బ్రస్తుతించి, ధ్యానంబుఁజేసి పుస్తకనికరంబుఁ బూజించి నైవేద్య మర్పించి వేల్చి, ధనధాన్య వస్తువాహనభూషణాంబర, తాంబూలముఖ్యదానంబు లొసంగి. "గీ. భోజనంబులు వెట్టి విప్రులను దనుప,నీప్సితార్థంబులెల్ల నీడేఱుచుండుఁ,గాన నవమీవ్రత మహత్త్వ మరియ నెన్నఁ, బద్మజునకైన సాధ్యమే పాండుతనయ." శివధర్మము. 5, ఆ

ఆశ్వలాయనము పా. కల్పసూత్రములలో నొకటి: చూ, కల్పసూత్రములు. (చూ, ఆపస్తంభము )

ఆసన్నభయసూచకము. పా. గడబిడ.

ఆసిడ్డు. ఆం. పులుపు. చూ, ఆమ్లము.

ఆసిడ్డుకమ్మర్షియల్. ఆం. కల్తీద్రావకము.

ఆసిడ్డుబోరిక్. ఆం. టంకామ్లము.

ఆసేధము. పా. (అరెస్టు) మరాయి.

ఆస్ట్రేలియా. పా. ద్వీపము. విస్తీ.–30,00,000; జన-64,88,707; ముఖ్యపట్టణము. కాన్ బెరా.

ఆస్తరు. హిం. దుస్తులలోపలవేసి కుట్టెడుగుడ్డ.

ఆస్తికర్త. పా. వారసు.

ఆస్తిజాబితా. పా. (ఇన్వెంటరీ.) ఆస్తిపట్టీ

ఆస్తిపట్టీ పా. ఆస్తిజాబితా.

ఆస్తిపరివర్తనము. పా. (ట్రాన్సుఫర్ ఆఫ్ ప్రాపర్టీ.)

ఆస్యపాకము పా. నోటిపూఁత.

ఆస్యవలయస్నాయువు పా. కపోలశాఖేశీ. ముఖముద్రిణిపేశీ.

ఆహితతరంగములు. పా. (బ్రేక్—వాటర్సు.)

ఆహారవిఘులు. పా. పథ్యపానములు.

## ఇ.

ఇంజెక్షన్. ఆం. రక్తనాళములలోనికి మందు పిచికారీచేయుట.

ఇండియారబ్బర్. ఆం. సందర్శిణి.

ఇందుమతీపరిణయము. పా. 1. గ్రంథకర్త.— కుమార ధూర్జటి. (16 శతాబ్ది ); 2 గ్రంథకర్త.— మతుకపల్లి నృసింహకవి. (19 శతాబ్ది.)

ఇంద్రియగోచరత. పా. (సెన్ సిబిలిటీ.) సూక్ష్మగ్రాహ్యత.

ఇంద్రియవికారము. పా. (సెన్సేషన్.) నిర్వికల్పజ్ఞానము, భావన.

ఇన్టరెస్టు. ఆం. వడ్డీ, వృద్ధి.

ఇన్టరెస్టుకాంపౌండు. ఆం. వడ్డీకివడ్డీ, చక్రవృద్ధి.

ఇన్టరెస్టుసింపిల్. ఆం. బారువడ్డి. అసలుకు వడ్డి.

ఇన్ఫ్లుయెంజా. ఆం. దుష్టప్రతిశ్యాయ జ్వరము, విషశైత్యజ్వరము.

ఇనాక్యులేషన్. ఆం. రక్తనాళము లోనికి రోగప్రతిబంధకరసము నెక్కించుట.

ఇష్టకర్మము. పా. (సప్లైషన్ )

## ఈ.

ఈదుపల్లి భవానీశంకరుఁడు. పా. ఇతనిగ్రంథము ధర్మఖండము. (18 శతాబ్ది.)

ఈనాము. దే. వి:చూ, మాన్యము(రూ–ఇనాము)

## ఉ

ఉత్క్లియాలబ్రాహ్మణులు. పా. నేపాళదేశపు బ్రాహ్మణులలో నొకరు: చూ, బ్రాహ్మణులు.

ఉఖలాముసలకసంధి. పా. ఉదూఖల సంధి. (బంతిగిన్నెలు.)

ఉత్కళబ్రాహ్మణులు. పా. పంచగౌడులలో నొకతెగయగు ఉత్కళులను నొకతెగవారు. ఉత్కళదేశమునే ఓఢ్రదేశమని యందురు. అందువసించు బ్రాహ్మణులుత్కళులు మత్స్యములను మాంసమును భుజించెదరు. కాంస్య పాత్రభోజనమే ప్రధానము. గోపాలక, నాపితలచేతి యుదకము నుపయోగించెదరు. వీరిభాష ఓఢ్రము. వీరిలో అగ్రభక్తబ్రాహ్మణులు, ఆచార్యబ్రాహ్మణులు, కారాబ్రాహ్మణులు, కోటికిబ్రాహ్మణులు, ఘాటియాబ్రాహ్మణులు, శేలీబ్రాహ్మణులు, దాజపండాబ్రాహ్మణులు, పండా బ్రాహ్మణులు, దేవతా పండాబ్రాహ్మణులు, నంద బ్రాహ్మణులు, నిశంకబ్రాహ్మణులు, పణోలబ్రాహ్మణులు, పర్సగాపా బ్రాహ్మణులు, పాడియా బ్రాహ్మణులు; మిశ్రబ్రాహ్మణులు:— మారీబ్రాహ్మణులు, వహాతబ్రాహ్మణులు, వాఘ్రబ్రాహ్మణులు; కానీనబ్రాహ్మణులు:— శతపత్రి బ్రాహ్మణులు, శిష్టకారోణోబ్రాహ్మణులు, సాంతో బ్రాహ్మణులు అనియు కలరు: చూ, బ్రాహ్మణులు.

ఉత్తమలోకప్రాప్తిరహితుఁడు. పా. ఎల్లప్పుడు శూద్రాన్నమును తిని బలిసియున్నవాఁడు. ఇతఁడెల్లప్పుడు వేదమును పఠించుచున్నను, జపమును హోమమును సలుపుచున్నను ఉత్తమలోక ప్రాప్తి లేనివాఁడు అగును.

ఉత్తరధృవము. పా. (నార్తుపోల్.)

ఉత్తరరామాయణము పా. ఈగ్రంథకర్త — కంకంటిపాపరాజు (18 శతాబ్ది.)

ఉత్తరహరివంశము పా. ఈ గ్రంథకర్త నాచన సోమనాథుఁడు (14 శతాబ్ది)

ఉత్తరహరిశ్చంద్రోపాఖ్యానము. పా. ఈగ్రంథకర్త.—తక్కెళ్ళపాటి లింగన. (18శతాబ్ది.)

ఉత్తరాధికారము. పా. వారసత్వము, దాయాధికారము, వంశపారంపర్యము.

ఉత్తేజకము. పా. తాపజనకము.

ఉత్తేజకౌషధము. పా. (స్టిమ్యులెంట్ )

ఉదాహరణానుమతిసిద్ధాంతము. పా ప్రతిష్ఠాపనము, విశేషపరీక్షాపూర్వక సాధారణానుమానము.

ఉదూఖలసంధి. పా. ఉఖలాముసలసంధి.

ఉద్భటారాధ్యచరిత్రము. పా. ఈగ్రంథకర్త.- తెనాలి రామలింగకవి (16 శతాబ్ది.)

ఉన్నవయోగానందసూరి. పా. ఇతనిగ్రంథము.- పద్మినీపరిణయము.

ఉపజాతి. పా. అంతర్జాతి, తెగ.

ఉపజిహ్విక. పా. గొంతులోని గదవలు.

ఉపధాతువులు. పా. మనమేయుద్భిజము నయిననుసమూలముగదీసిరసాయన పృథక్కరణముఁ జేసినయెడల నందు సామాన్యముగా నీక్రింది మూలద్రవ్యములుఁ గానవగును. ఉపధాతువులు:— కర్బనము, అమ్లజని. ఉదజని, నత్రజని, గంధకము, భాస్వరము, హరినము; ధాతువులు:—ఖటికము, లోహము, పొటాసియము, సోడియము, మగ్నము. ఇవిగాక కొన్నిటిలో సైలము, అదము, మాంగనము గూడ అప్పుడప్పుడు స్వల్పముగా నుండును.

ఉపపత్రము. పా. కణుపుపుచ్ఛము. (స్టిప్యూల్.

ఉపశమనస్నానము. పా. అతపస్నానము వల్ల

కలిగిన యన్యపదార్థము. అన్యపదార్థము ఉపపదార్థ మాశ్రయించినచో దిగిపోవును.

**ఉపరిస్థాపనము.** పా. ఆచ్ఛాదనము.

**ఉపాధ్యాయ బ్రాహ్మణులు.** పా. పంచగౌడులలో నొక తెగయగు కన్యాకుబ్జములలోని ఒక తెగవారు, యజుర్వేదులు, కృషిజీవనపరులు: చూ, బ్రాహ్మణులు.

**ఉపాస్థి.** పా. (కార్టిలేజ్.) తరుణాస్థి, కోమలాస్థి, కూర్చ.

**ఉభయత్రిపవిత్రుఁడు.** నీటిని మెరకను రెంటిని తాఁకుచు ఆచమనమొనర్చినవాఁడు.

**ఉరఃకుహరము.** పా హృదయకుహరము.

**ఉరిచిబ్రాహ్మణులు.** పా. శైవబ్రాహ్మణులలోని కర్ణాటకులలో నొక తెగవారు: చూ, బ్రాహ్మణులు.

**ఉరిజాతకుఁడు** పా. 1 కుజుఁడు షష్ఠసప్తమాధిపతులతోఁ గలిసి, పాపులచేఁ జూడఁబడి, శుభసంబంధములేక వీనికి దశవచ్చినను; 2. సింహము లగ్నమై శని, కుజ, బుధ, రవి, రాహువులు ద్వితీయమందుండి, శుభగ్రహసంబంధములేక రాహు మహాదశ వచ్చినప్పుడును; 3. ద్వితీయ షష్ఠమాధిపతులు రాహువుతోఁగాని, కేతువుతోఁగాని కూడి షష్ఠాష్టమ ద్వాదశములలో నుండి శుభసంబంధములేక వీరిదశ వచ్చినప్పుడును; 4 షష్ఠమాధిపతి శుక్రునితోఁ గూడి రవి, రాహు, శనులలో నొకనిచేఁ జూడఁబడి, శుభసంబంధములేక, క్రూరాంశలయందుండి వీరిదశలు వచ్చినప్పుడును; 5. అష్టమాధిపతి యందు ద్రేక్కాణము పాశ. భుజంగ, నిగళ సంజ్ఞలుఁ గలిగియుండినదైనను; 6. అష్టమాధిపతియందు ద్రేక్కాణాధిపతి శని రాహువులతోఁగూడి శుభసంబంధములేక వారిదశలు వచ్చినప్పుడును; 7. దశమాధిపతి శనికుజులతోఁ గలిసి, సప్తమమునను్నను, శనిచేఁజూడఁబడినను ఉరిదీయుట సంభవించును.

**ఉరోనాళిక.** పా. ఆమరసవాహిని.

**ఉల్కలు.** పా. (షూటింగ్ స్టార్స్.)

**ఉషఃకాలము.** పా. (ట్విలైట్.)

**ఉషాకల్యాణము.** పా. ఈ గ్రంథకర్త — శేషమాయనకవి. (18 శతాబ్ది.)

## ఊ.

**ఊరుద్వయము.** అం. హస్తక్షేత్రములు పదుమూఁడింటిలో నొకటి. చూ, హస్తక్షేత్రములు.

**ఊరులు.** అం. మధ్యమక్షేత్రములు అయిదింటిలో నొకటి: చూ, మధ్యమక్షేత్రములు.

**ఊరువృత్తము.** అం. కరణములు నూటరెనిమిదింటిలో నొకటి: చూ, కరణములు.

**ఊరూక్రియలు.** అం. వలితము, కంపితము, స్తంభితము, ఉద్వర్తితము, నివర్తితము. (5.)

**ఊర్ణనాభము.** అం అసంయుతహస్తములు అయిదింటిలో నొకటి: చూ, అసంయుతహస్తములు.

**ఊర్ధ్వగము.** అం. హస్తప్రచారములు పదునైదింటిలో నొకటి: చూ, హస్తప్రచారములు.

**ఊర్ధ్వజానువు.** అం. 1. ఆకాశచారులు పదునాఱింటిలో నొకటి: చూ, ఆకాశచారులు; 2. కరణములు నూటరెనిమిదింటిలో నొకటి: చూ, కరణములు.

**ఊర్ధ్వపుండ్రధారణము.** పా. వర్ణన —"క. విను మూర్ధ్వపుండ్రధారణ, మొనరించినయట్టి భూసురోత్తముఁడు జగం, బున నెల్లఁ బూజ్యుఁడై శుద్ధి, ననుపమ సురయానమెక్కి హరిపురి కరుగున్। క. తిరుమణి పెట్టిన సద్విజు, వదనఁ జూచిన నణఁగుఁ బాపవర్గంబెల్లం, గరమర్థి నేరిమ్రొక్కినఁ, బరిశీలనఁగ సకల పాపఘనములుఁ బొందుఁగా." పద్మ. 5, ఆ. [illegible], ఏజాతి

వారలైనను, భూజనములు నుమట భూతిం
బూనినమాత్రం. దేజమున సర్వమానవ. పూజి
తులై శివపదంబుఁ బొందుదురనఘా" బ్రహ్మో
త్తరఖండము. 6, అ.

ఊర్ధ్వమండలము. అం. నృత్తహస్తములు ఇరువది
తొమ్మిదింటిలో నొకటి: చూ, నృత్తహస్త
ములు.

ఊర్ధ్వము. అం. 1 బాహుపరిచారములు పదిం
టిలో నొకటి: చూ, బాహుపరిచారములు;
2 హస్తక్షేత్రములు పదుమూఁడింటిలో నొ
కటి: చూ, హస్తక్షేత్రములు.

ఊర్ధ్వముఖము అం హస్తపరిచారములు పదునై
దింటిలో నొకటి: చూ, హస్తపరిచారములు.

ఊర్ధ్వానేకప్రోధి. అం అశ్వముయొక్క చిత్ర
వర్ణములు ముప్పదింటిలో నొకటి: చూ, చిత్ర
వర్ణములు.

ఊర్మిప్రేంఖము. అం. సంచారివర్ణగతాలంకార
ములు ఇరువదియైదింటిలో నొకటి: చూ, సం
చారివర్ణగతాలంకారములు. (చూ, అలంకా
రము. 3.)

ఊర్వికాష్ఠి. పా. జంఘికాష్ఠి. (పైబోజ.)

## ఋ.

ఋగ్వేదకవి వెంకటాచలకవి. పా ఇతని గ్రం
థము చంపూరామాయణము (17. శతాబ్ది.)

ఋతువులేర్పడు విధము. ప. (ది సీజన్సు.) భూ
మితన కక్ష్యమీఁద సూర్యునిచుట్టును తిరుగు
నప్పుడు దానియక్షము కక్ష్యకు 66½ అంశ
ములు వంగి సదాసమానాంతరముగా నుండు
టచేత ఋతువులేర్పడుచున్నవో చూ-
తము. భూమి తన అక్షముమీఁద తిరుగున
ప్పుడు సూర్యునివైపుగల అర్ధభాగమునకే
సూర్యుని వేఁడిమియు, వెలుతురును గలుగు
చున్నవి. దూరమునను్న అర్ధభాగము అంధ
కారములోనుండి వేఁడిమిని పొందుటలేదు
ఇట్లు సూర్యునినుండి భూమిమీఁదఁ బడు
వేఁడిమి, సూర్యుఁడు ఆకాశమునందు ఎత్తు
గానున్నప్పుడు ఎక్కువగానుండును. సూర్య
కిరణములు ఎక్కువఓరలనుండి భూమిమీఁ
ద పడినప్పుడు భూమికి తగులువేఁడిమి చాల
తక్కువగుచున్నది. మఱియు సూర్యుఁడు
చాలకాలము భూమిమీఁద ప్రకాశించునప్పు
డు చాలవేఁడిమి భూమిమీఁదపడుటచే భూ
మిఅధికముగా వేఁడియెక్కును. ఈసంగతు
లను జ్ఞాపకముంచుకొని భూమియొక్క --
ల్గుముఖ్యస్థానములఁగూర్చి చర్చింతము. ఊ-
ర్ధ్వగోళమునందలి మాసములను చూతము.
మార్చి 21 వ, తేదీని సంభవించు మహావిషు
వత్తునందు భూమియొక్క రెండు ధ్రువము
లును సూర్యునికి సమానదూరమునను్న 1 వ
స్థానమునందు పగలును, రాత్రియును సమాన
పరిమాణము గలిగియున్నవి. ఈస్థానమును
వదలి రెండవస్థానమగు కర్కాటక సంక్రాంతి
స్థానమువద్దకు పోవుకొలఁది, క్రమక్రమము
గా ఉత్తరధ్రువము సూర్యునివైపు వంగుటచే
పగటి పరిమాణము క్రమక్రమముగా రాత్రి
కంటెనెక్కువగుచువచ్చును. మఱియు క్రమ
క్రమముగా మధ్యాహ్నసూర్యుఁడు ఆకాశ
మునందెక్కుచుండును. ఈరెండు కారణము
చేతను మార్చి 21 మొదలు జూను 21 వఱ
కును, దినదినమును వేఁడిమి ఎక్కువగుచుం
డును. ఈ మూఁడునెలలకును వసంతఋతువు
(స్ప్రింగు) అనిపేరు; పగలు రాత్రికంటె
నెక్కువగుటచే పగలు వేఁడిఎక్కువది రాత్రి
చల్లఁబడుదానికంటె నెక్కువయి. ఇట్లుక్రమ
క్రమముగాఁ జెందినవేఁడిమి అభివృద్ధిఁజెందు
చున్నది కర్కాటకసంక్రాంతియగు 2
స్థానమునుండి హారిషదమగు 3 వ స్థానమును

చేరులోపల, భూమియొక్క ఉత్తరధ్రువము, క్రమక్రమముగా సూర్యునినుండి దూరమగు చుండియు, దక్షిణ ధ్రువముకంటె సమీప మునసుండుటచే, పగలు రాత్రికంటెను ఎక్కువగనేయుండి. భూమిమీఁదబడు వేఁడిమి యొక్కువై పగల ఎక్కువయినది క్రమక్రమముగా తగ్గుచు, 3 వ స్థానమును చేరునప్పటికి రెండు ధ్రువములును సూర్యునికి సమదూరములోనుండి పగలును రాత్రియు సమపరిమాణములు గలవగుచున్నవి. ఈ మూఁడు నెలలును గ్రీష్మఋతువు; 3 వ స్థానమునుండి నాలవ స్థానమునకు పోవునప్పుడు దక్షిణధ్రువము క్రమక్రమముగా సూర్యునిసమీపమునకును ఉత్తరధ్రువము సూర్యునికి దూరముగను, వంగుటచే రాత్రులు పగటికంటె నెక్కువగుటయు. మధ్యాహ్నసూర్యుఁడు ఆకాశముననింకను దిగుటయు, ఈరెండు కారణములచేతను వేఁడిమి చాలవఱకుతగ్గి దినములు చల్లఁబడుటయు తటస్థించుచున్నగి. హరిపదమగు మూఁడవస్థానమునుండి మకర సంక్రాంతి యగు నాలవస్థానమునకు భూమిపోవుటకు పట్టు మూఁడు నెలలకును శరదృతువు (ఆటము) అనిపేరు; 4 వ స్థానమునుండి మొదటిస్థానమునకు వచ్చునప్పుడు దక్షిణధ్రువము సూర్యుని సమీపమునకు క్రమక్రమముగా వచ్చినను ఉత్తరధ్రువముకంటె సూర్యునికి సమీపమున నుండుటచే చలి నానాట వృద్ధియైనది క్రమక్రమముగా క్షీణించును. ఈ మూఁడు నెలలును శీతకాలము. హేమంతఋతువనిపేరు; ఉత్తరధ్రువము సూర్యునికి సమీపముగానున్నప్పుడు, దక్షిణధ్రువము దూరముగానుండుటచేతను. ఉత్తరార్ధగోళమునందు పగలు రాత్రికంటె దీర్ఘముగానున్నప్పుడు దక్షిణార్ధగోళములో రాత్రిపరిమాణము పగటికంటె నెక్కువగుటచేతను, ఉత్తరార్ధగోళమున గ్రీష్మఋతువుగానున్న కాలమందు, దక్షిణార్ధగోళమున హేమంతఋతువుగానున్నది. ఇటులనే యితరఋతువులను గ్రహించునది. ఈ ఋతుభేదములు సమశీతోష్ణమండలములయందు చక్కఁగా కనఁబడును. ఈ ఋతుభేదములును, సూర్యుఁడాయారాసులలో ప్రవేశించు కాలములును పాశ్చాత్యపద్ధతి ననుసరించి వ్రాయఁబడిరి. మనవారు రెండు నెలలొక్కొక ఋతువుగా సంవత్సరమును ఆఱు ఋతువులుగా భాగించి యున్నారు

## ఎ.

ఎజెక్టుమెంటు. ఆం. స్వాధీన భ్రంశనము, ఉద్వాసనము.

ఎడపాటి ఎఱ్ఱనకవి పా. ఇతనిగ్రంథము మల్హాణ చరిత్ర.

ఎద్దీనెననఁగొట్టంబునఁగట్టుచున్నట్లు. లో.ఉదా.— "సార్థివుండెద్దీనెననం గొట్టంబునం గట్టింపుము నువాఁడయ్యేనేని రెంకలుకొంకుమాని యిచ్చకువచ్చినట్లు లేనికార్యంబులకు లోఁచి యశోహానింబుట్టించి పరలోకఁ దూలించేయుదురు." (నీతిచంద్రిక.—మిత్రభేదము.) (దున్నపోతు ఈనిన దూడను గట్టుమనినరీతి.)

ఎఱ్ఱనకవి. పా. ఇతని గ్రంథము కౌక్కుకము. (16 శతాబ్ది.)

ఎఱ్ఱమిల్లి లక్ష్మీనారాయణ పా. ఇతనిగ్రంథము వాసవదత్తాపరిణయము. (19 శతాబ్ది)

ఎఱ్ఱాప్రగడ, పా. ఇతని గ్రంథములు.—లక్ష్మీనృసింహావతారము నృసింహపురాణము, హరివంశము, భారతారణ్య పర్వశేషము. (13. శతాబ్ది.)